ప్రథమ ముద్రణము 2000 ప్రతులు — 1948

ప్రతులు లభించుచోట్లు :

పూతలపట్టు శ్రీరాములురెడ్డి, పండితులు, చిత్తూరు.

తా॥ ఆర్ముగం పిళ్ల, ముత్యాలపేట హైస్కూలు, మద్రాసు.

ముద్రణమున నున్నది :

అభిధాన గాథా కోశము

**( A Dictionary of Allusions )**

విద్యార్థికోశమునకు అనుబంధమువంటిది.

# మనవి

ఇదివఱకు వెలువడిన కోశములలో నొక్కచోట పదమునకు నానార్థములు, వ్యుత్పత్త్యర్థములు, రూపాంతరములు, 'ప్రకృతి వికృతులు' మొదలగు వివరణములు లేమిచే విద్యార్థుల కందుబాటులోనుండవలయునని ఈ శ్రీ 'రామచంద్ర' విద్యార్థి కోశమును నిర్మించితిమి. వివరణాదులను పలు నిఘంటువులనుండి సంగ్రహించుచు, నచ్చటచ్చట శబ్ద తత్త్వశాస్త్రప్రయోగము తావిచ్చినప్పుడు, కొంతకొంత యెక్కుడొనర్చియున్నాము. క్రొత్తదనము వివరణాదులందేగాక కోశ సంవిధానమునందు నుండునట్లు ప్రయత్నించియున్నాము. వివిత్సుల కిందేవేని మార్పులపదములకు వివరణములు లభింపనిచో నిది విద్యార్థికోశము మాత్రమే యనియు, నట్టివి మాచే మనఃపూర్వకముగ జాఱవిడువబడినవనియు మా మనవి. శ్రేయోభిలాషులు తమ తమ యనుభవపూర్వకముగ నిం దేయేమార్పుల గావించిన విద్యార్థులకు మఱింత లాభకారిగనుండగలదో తెలిపినచో వందన పూర్వకముగ నందికొందుము.

ఈ కోశమును సరసులును, సదా పండితాదరపరాయణులు నగు శ్రీ. బెజవాడ రామచంద్రరెడ్డి, బి.ఎ., సి.బి.ఇ. వారు తమపేర చిహ్నితమొనర్చుకొనుటకు మా వేడికోలు నంగీకరించి, పసదనమిచ్చి మమ్ము గౌరవించినందులకు వారి కెల్లప్పుడు మేము కృతజ్ఞులము.

పూతలపట్టు శ్రీరాములురెడ్డి
తాళ్లూరి ఆర్ముగం పిళ్లె.

# నియమములు

కుండలీకరణములోనివి పద ప్రత్యయవిభాగాదులను, భాషాజన్యాదులను, 'ప్రకృతి వికృతు' లను జూపును. ఒకపదము ముందుండి సమసించు పదములకు నా తొలిపదములు వ్రాయక ఒక అడ్డగీటు వేయబడియుండును. ఋవర్ణకాంత సాంస్కృతిక పదములు పుంలింగములగునప్పు డట్టిపదములు వేఱుగా వ్రాయబడక 'డు' మాత్రము సూచనచేయబడి దాని యర్థము వివరింపబడియుండును. అప్పు డాపదము ఉదంతముగా నగునని యూహించికొనవలయును. వివరణ సౌలభ్యమునకై సంధులు, సరళాదేశాదులు మొదలగు నియమములు పాటింపబడ లేదు. ర, ఱలు ప్రత్యేకింపబడలేదు.

## సంజ్ఞలు

అర. అరవము. తె. తెనుఁగు. మొ. మొదలగునవి.
ఆం. ఆంగ్లము. నాట్య. నాట్యపరిభాష. రూ. రూపాంతరము.
ఆమ్రే. ఆమ్రేడితము. పుం. పుంలింగము. వి. వికృతి.
ఏ. ఏకవచనము. °పై. పై రీతిగా. వ్య. వ్యతిరేకార్థము.
కన్న. కన్నడము. ప్ర. ప్రకృతి. వ్యు. వ్యుత్పత్త్యర్థము.
కృ. కృదంతము. ఫ్రెం. ఫ్రెంచి. సం. సంస్కృతము.
క్రి. క్రియ. బ. బహువచనము. సమా. సమాసము.
చూ. చూడుము. మహా. మహారాష్ట్రము. స్త్రీ. స్త్రీలింగము.
ఋ. ఋవర్ణకాంతము. మిశ్ర. మిశ్రము. హిం. హిందూస్థాని.

# విద్యార్థి కోశము

అంక-తె. 1. ప్రక్క. 2. అణక.

అంకకాఁడు-తె. (అంకము+కాఁడు) 1. చల పట్టువాఁడు. 2. కలహప్రియుఁడు.

**అంకణము**-తె. నలుచదరపుచోటు, రెండుదూలముల నడిమిచోటు.

అంకనము-స. 1. గుఱుతు. 2. గుఱుతువేయుట, ముద్ర.

అంకపాళి-స. 1. కౌఁగిలి. 2. తొడ. 3. తిన్నె.

అంకపొంకములు-తె. 1. కోపము. 2. విరోధము. రూ. అంకాపొంకములు.

అంకము-తె. ఆక్షేపము. స. 1. చిహ్నము. 2. నాటకములోనొకభాగము. 3. ఒడి. 4. అంకె, సంఖ్య. 5. యుద్ధము. 6. సమీపము. దు. దేవుఁడు. సమా. —విద్య-గణితశాస్త్రము.

అంకవన్నియ-తె. 1. గుఱ్ఱముమీఁదికి కాలుపెట్టి ఎక్కెడి అంకెము. రూ. అంకవన్నె. అంకెవన్నియ, అంకెవన్నె.

అంకాపొంకములు. చూ. అంకపొంకములు.

అంకించు-తె. 1. సంతోషించు. 2. పైకెత్తు. 3. ఆడించు. 4. (కత్తిని) జళిపించు. 5. పట్టుకొను. 6. పొగడు.

అంకిణీ-తె. గుఱ్ఱపు జీనునకువేయు అలంకారము.

అంకితము-స. 1. గుఱుతువేయఁబడినది. 2. ఎంచఁబడినది. 3. గ్రంథము నొకరికి కృతియిచ్చుట.

అంకియ-వి. (అంకము) 1. సంఖ్య. 2. వశము. రూ. అంకె.

అంకియము-తె. రంటలములో నొకప్రక్కడి. రూ. అంకెము.

అంకిలి-తె. 1. విఘ్నము. 2. ఆపద, 3. కలఁత. 4. సాధక బాధకములు. 5. దౌడక్రిందికీలు.

అంకు-తె. 1. దౌడక్రిందికీలు. 2. ఒకగ్రామదేవత.

అంకుటము-స. కుంచెకోల.

అంకురము-స. 1. మొలక. 2. నీళ్లు. 3. వెంట్రుక. రూ. అంకూరము. క్రి. అంకురించు-1. మొలచు. 2. కలుగు.

అంకుశము-స. ఏనుఁగును నడపుటకై కుంభస్థలమునఁ బొడుచు ఆయుధము. (వి. అంకుసము. వ్యు. ఏనుఁగునకు గుఱుతులు గలిగించునది)

అంకుసము-వి. చూ. అంకుశము.

అంకూరము. చూ. అంకురము.

అంకె-తె. 1. అణక. 2. రూ. అంకియ. 3. సమయము. సమా. —కాఁడు-ముఖ్యుఁడు. క్రి.—గొను-కప్పుకొను.

అంకెము-తె. 1. అంకవన్నియ. 2. అంకియము.

అంకెవన్నియ-చూ. అంకవన్నియ.

అంకోలము-స. ఊడుగుచెట్టు. రూ. అంకోడము.

**అంగ**-తె. కాలుచాఁచి పెట్టిన అడుగు.

అంగజాల-తె. అంతఃపురపు కావలివాఁడు. రూ. అంగజాలుఁడు.

అంగడి-తె. 1. దుకాణము. 2. సభ. 3. రచ్చ. 4. అగసాలె లోనగువారు పనిచేయుచోటు. సమా. —వాడ-బజారు.

అంగణము-స. ముంగిలి. రూ. అంగనము.

అంగద-తె. 1. ఆఁకలి. 2. ఆపద. 3. ఉపద్రవము. 4. దుఃఖము.

అంగద-స. దక్షిణదిక్కునందలి వామన మను దిగ్గజముయొక్క భార్య.

అంగదము-స. భుజమున ధరించునగ, కేయూరము. (వ్యు. అంగమును రక్షించునది).

అంగన-స. *1.* స్త్రీ. *2.* ఉత్తరదిక్కునందలి సార్వభౌమమనుదిగ్గజముయొక్కభార్య. రూ. అంజన.

అంగము-తె. *1.* అందము. *2.* విధము. రూ. అంగు. సమా. —అంగదట్టము-పావడ, —బిల్ల-ఆఁడుబిడ్డల మొలకుఁ గట్టెడి వెండి బంగారములబిల్ల. —మచ్చము-*1.* గుఱుతు. *2.* జాడ.—-మొల-దిసమొల, —-మొలవేల్పు-శివుఁడు. —రేకు-చౌక్కాయ.

అంగము-స. *1.* అవయవము. *2.* దేహము. *3.* ఉపాయము. *4.* ఒకానొకదేశము. సమా.—అంగకము-*1.* శరీరము. *2.* చౌక్కాయ. *3.* ఱవిక. —జ - కూఁతురు. —జము - *1.* వెంట్రుక. *2.* మదము. *3.* నెత్తురు. (ఇట్లేఅంగరుహము, మొ.)—జుఁడు-*1.* మన్మథుఁడు. *2.* కొడుకు (ఇట్లేఅంగభవుఁడు, మొ.)—రాగము-గంధాదులపూఁత. —హారము - అవయవముల కదలిక.

అంగి-స. (అంగ+ఇ) *1.* అంగములుగలది. *2.* ముఖ్యము.

అంగిక-స. *1.* చౌక్కాయ. *2.* ఱవిక.

అంగరకా-హిం. చౌక్కాయ.

అంగలారుచు-తె. (అంగలు+ఆరుచు) *1.* దుఃఖించు. *2.* భయముచే అఱచు. కృ. అంగలారుపు- *1.* దుఃఖము. *2.* దైన్యము.

అంగవించు-తె. *1.* ఉత్సహించు. *2.* యత్నించు, *3.* అతిక్రమించు.

అంగారకము-స. *1.* నిప్పు. *2.* బొగ్గు. (రూ. అంగారము), *3.* గుంటగలగర మొక్క. డు. నవగ్రహములలో మూఁడవగ్రహము. సమా.—అంగారకవారము-మంగళవారము.

అంగారధానిక
అంగారశకటి } కుంపటి.
అంగారిణి

అంగిలి-తె. లోకుత్తుక. సమా.—అంగిటిముల్లు-కుత్తుకలోఁగలుగు రోగము.

అంగీ-హిం. పొడవైన చొక్కాయ.

అంగీకారము - స. సమ్మతి. క్రి. అంగీకరించు - సమ్మతించు. అంగీకృతము - సమ్మతింపఁబడినది.

అంగు-తె. చూ. అంగము.

అంగుటము-వి. (అంగుష్ఠము) బొటనవ్రేలు.

అంగుడుదుడిపి-తె. తంటాలమారి. రూ. అంగుడుదుడుపు.

అంగుళము-స. *1.* వ్రేలు. *2.* బొటనవ్రేలు. *3.* ఒక అడుగులో పంద్రెండవభాగము.

అంగుళి-స. (అంగుళ+ఇ) *1.* వ్రేలు. *2.* తొండము చివర. సమా. —త్రము - అత్తెము, విలుకాఁడు వ్రేలికి దెబ్బతగులకుండఁగట్టుకొను చర్మము. రూ. అంగుళి (ళీ) త్రాణము.—ముద్ర-*1.* ముద్దుటుంగరము. *2.* బొటనవ్రేలిగుఱుతు. —మానము-*1.* అంగుళము. *2.* మూర మొదలగుకొలత. అంగుళీయకము-వ్రేలియుంగరము.

అంగుష్ఠము-స. బొటనవ్రేలు.. (వి. అంగుటము.)

అంగూరు-హిం. ద్రాక్ష.

అంఘ్రి - స. *1.* కాలు. *2.* వేరు. (వ్యు. దీనిచేఁ బోవుదురు.) సమా. అంఘ్రిపము - చెట్టు. (వ్యు. పాదముల (వేళ్ల) తో నీరు త్రాగునది)

అంచ-వి. (హంస) సమా.—పదము-గుఱుతు.—రౌతు-బ్రహ్మ.—యాన-హంసవలెనడచు స్త్రీ.

అంచన-తె. పంటనుగాని వెలనుగాని ఇంతయని ఊహించుట, మతింపు. రూ. అంచనా. సమా. —దారుఁడు-అంచనవేయువాఁడు.

అంచల-తె. ప్రక్క.

అంచలము-స. 1. కొంగు. 2. అంచు. తె. కోపము.

అంచించు-తె. అంచనవేయు.

అంచితము-స. పూజింపఁబడినది.

అంచియ-తె. 1. జాబులుకొనిపోవువారును బండ్లలో నగునవియు చేయుమకాము. 2. వాహనాదులపై టపా మొ. వెళ్లినపుడు దారిలో వానికి విశ్రాంతి నిచ్చుటకు యితరవాహనాదులుండుచోటు.

అంచు-వి. (అంచలము) 1. కొన. 2. బండి కంటి యాకు. 3. తె. విధము. 4. పంపించు. 5. అనుచు, ఆజ్ఞాపించు.

అంచులవాఁడు-తె. చిత్తరువువ్రాయువాఁడు, మచ్చి.

అంచె-చూ. అంచియ.

అంజ-తె. 1. అడుగు. 2. సమీపము.

అంజనము-స. 1. కాటుక. 2. మంత్రగానికాటుక. 3. తలంటు. 4. సిరా. 5. నిప్పు. 6. పడమటి దిక్కునందలి ఏనుఁగు. సమా. —కాఁడు-అంజనము వేసి మఱుగునసున్న వస్తువులను కనుఁగొను మాంత్రికుఁడు.

అంజనావతి-స. ఈశాన్య దిక్కునందలి సుప్రతీకమను దిగ్గజముయొక్క భార్య.

అంజలి-స. చేమోడ్పు, నమస్కారము.

అంజలి గుంజలి-తె. శ్రమనొందినది.

అంజాయించు-తె. సందేహించు.

అంజు-తె. భయపడు. కృ. అంజిక-భయము.

అంజూరు-హిం. 1. అత్తిచెట్టు, 2. అత్తిపండు.

అంట-తె. 1. కుట్టుడాకు. 2. అప, 3. అనుట, 4. అఁటయొక్క రూపాంతరము.

అంటలు-తె. గుంపు.

అంటసిల్లు-తె. చేరు.

అంటి-తె. అరఁటి, రూ. అనఁటి.

అంటిగది-తె. కులట.

అంటు-తె. 1. తాఁకు. 2. రాచు. 3. కూడిక. 4. స్నేహము. 5. స్నేహితుఁడు. 6. బంధుత్వము. 7. స్పర్శము. 8. ముట్టు. 9. మైల. 10. అశుచి. 11. కొమ్మవంచి పాతినచెట్టు. 12. ఒక మొలకను వేఱొకచెట్టుకొమ్మకుచేర్చి కట్టుట, 3. అతుకు. (క్రి). అంటించు-అతికించు. చేర్చు. సమా. అంటరానివేలుపు-అగ్ని. —కత్తియ - స్నేహితురాలు, ప్రియురాలు. —కాఁడు-స్నేహితుఁడు, ప్రియుఁడు. —జోడు-కర్ణభూషణము. —పేను-లేవయనుపేను. —మెడ-పొట్టిమెడ. —రాయి - సూదంటురాయి, కాంతము. —కొను-అగ్గిముట్టుకొను. అంట్లు-1. వంది తోమని పాత్రలు. 2. అంటుపేలు,

అంత్రింత-తె. గుట్టల కంటుకొను ఒక తెగ గడ్డి, అంటిస.

అండ-తె. 1. సమీపము, 2. ఆశ్రయము, 3. గనిమచెక్కుట. సమా. అండగొట్టు-1. ఆలస్యముచేయు, 2. గనిమచెక్కు.—గొను-1. ఆలసించు, 2. ఆశ్రయించు.—గోడ-అడ్డుగానుంచిన చిన్నగోడ, అడ్డగోడ.

అండనము-స. బత్తములోనగువానిచేఁ జేయఁబడిన కేడెము. (వి. అడ్డనము.)

అండము-స. 1. గ్రుడ్డు 2. వృషణము. సమా. —కోశము - వృషణము. —జ - కస్తూరి. —జము-1. పక్షి, 2. చేఁప, 3. పాము (వ్యు. గ్రుడ్డునుండి పుట్టినది) అండాశయము-పుష్పములో నొకభాగము.

అండా-హిం. నీళ్లుకాఁచు పెద్దపాత్ర. రూ. అండీ,

అండియ-తె. 1. చిమ్మనగ్రోవి, 2. కంట్లములో సగము. రూ. అండె, అండియము, అండెము,

అంత-తె. 1. సర్వము. 2. ఆకొలఁది, 3. పరిమాణార్థక ప్రత్యయము. 4. పిమ్మట. 5. అప్పుడు.

అంతఃకరణము-స. మనస్సు.

అంతఃపురము-స. రాణివాసపుస్త్రీలుండుచోటు. రూ. అంతఃపురి, (వి. అంతిపురము, అంతిపురి)

అంతకము-తె. మొత్తము. స. అంతము నొందించునది.

అంతట-తె. అనంతరము, అంత.

అంతము-స. 1. తుద. 2. చావు. సమా.—అంతకుఁడు-యముఁడు. (వ్యు. అంతము కలిగించువాఁడు.)

అంతరంగము-స. (అంతః+అంగము), మనస్సు. డు. నమ్మఁదగిన మిత్రుఁడు.

అంతరదామర-తె. బావులలో నీటిపై తేలియుండు ఒక తెగ చిన్నమొక్క.

అంతరము-స. 1. ఎడము. 2. భేదము. 3. సమయము. 4. సందు, 5. ఎడఁబాటు.

అంతరాత్మ-స. 1. జీవాత్మతోఁగూడియుండు పరమాత్మ. 2. మనస్సు.

అంతరాళము-స. నడిమిచోటు.

అంతరించు-స. 1. చచ్చు, 2. పొడగు, 3. దాఁటు.

అంతరిక్షము-స. ఆకాశము. రూ. అంతరీక్షము.

అంతరీపము-స. ద్వీపము.

అంతరీయము-స. కట్టుబట్ట.

అంతరువు-తె. 1. తారతమ్యము, 2. మఱుఁగుచోటు.

అంతర్గతము-స. 1. నడుమ పొందఁబడినది. 2. మనస్సు.

అంతర్ధ-స. మఱుఁగు. రూ. అంతర్ధి.

అంతర్ధానము-స. మఱుఁగుపడుట.

అంతర్భూతము-స. లోపల అడఁగినది.

అంతర్మధ్యము-స. భూమ్యాకాశ మధ్యభాగము, రోదోంతరాళము.

అంతర్యామి-స. లోపలనుండువాఁడు, పరమాత్మ.

అంతర్వత్ని-స. గర్భిణి.

అంతర్వాహిని-స. భూమిలోపలఁబాఱెడు నది.

అంతర్హితము-స. అంతర్ధానము.

అంతశయ్య-స. 1. చావు, 2. శ్మశానము. 3. భూశయ్య.

అంతశ్ఛిద్రము-స. లోపలిలోపము.

అంతస్థు-తె. 1. మఱుఁగుచోటు. 2. తారతమ్యము. 3. మిద్దెకట్టు. 4. పరువు.

అంతిక-స. 1. ప్రొయ్యి, 2. (నాట్య) అక్క.

అంతికము-స. 1. సమీపము. 2. ఎదురు.

అంతికలు-తె. కసవు తడికలు.

అంతిపురము-వి. చూ. అంతఃపురము.

అంతిమము-స. సమీపించినది.

అంతు-తె. 1. మొత్తము. 2. (వి) తుద.

అంతేవాసి-స. శిష్యుఁడు. రూ. అంతేవసాయి.

అంత్యము-స. 1. కడపటిది. 2. చివర. 3. అధమము.

అంత్రము-స. ప్రేగు. రూ. ఆంత్రము.

అందదుకు-తె. (అదుకు+అదుకు) 1. మిక్కిలి అతుకు. 2. సంపూర్తికానిది.

అందనుక-తె. (అంత+దనుక) అంతదాఁక.

అందము-తె. 1. సొగసు. 2. విధము, సమా.—అందకత్తియ, సుందరి.—గాఁడు-సుందరుఁడు క్రి. అందగించు, అందపడు. కృ. అందగింపు.

అందఱు-తె. (అంత+వారు) ఎల్లరు. రూ. అందొఱు.

అందలము-వి. (ఆందోళిక) పల్లకి.

అందాఁక-తె. (అంత+దాఁక) అంతవఱకు.

అందిక-తె. సమీపము.

అందియ-వి. (అందుకము) కాలియందు ధరించు నగ, పాదకటకము. రూ. అందె, అందువు.

అందు-తె. 1. గ్రహించు. 2. పొందు. 3. అచ్చోట. 4. సప్తమీ విభక్తి ప్రత్యయము. సమా.—అందుకొను. 1. కైకొను, 2. చాఁచి పుచ్చుకొను.—కోలు-1.అందికొనుట, 2. అతి సమీపము.—బడి-1.ప్రాప్తము, 2. సమీపము.

అందుకము-స. 1. అందె, 2. ఏనుఁగు సంకెల.

అందుగు-తె. చిల్లచెట్టు. (రూ. అందువు)

అందువు-తె. 1. అందుగు
వి. (అందుకము) 1. అందె. 2. ఏనుఁగు సంకెల.రూ. అందియ.

అందె-తె. కడియము. రూ. అందియ.

అందెబందెలు-తె. 1. చిక్కులు. 2. కట్టు దిట్టములు.

అందోలు-తె. చూ. అందలు.

అంధకము-స. గ్రుడ్డి. డు. గ్రుడ్డివాఁడు, (రూ. అంధుఁడు) 2. ఒక రక్కసుఁడు. సమా. —రిపుఁడు - శివుఁడు, (వ్యు. అంధకుఁడను రక్కసుని చంపినవాఁడు)

అంధకారము-స. చీఁకటి.

అంధకూపము-స. పాడునూయి.

అంధతమసము-స. కటికచీఁకటి. రూ. అంధాతమసము.

అంధము-స. 1. చీఁకటి. 2. గ్రుడ్డిది. 3. నీరు.

అంధస్సు-స. అన్నము.

అంధిక-స. చీఁకటి.

అంధుఁడు-చూ. అంధకము.

అంధువు-స. నూయి.

అంధ్రము-స. 1.తెనుఁగుదేశము. 2. తెనుఁగుభాష. రూ.ఆంధ్రము,(వ్యు.అంధ్రుఁడసురాజు పాలించినదేశము, అంధత్వమును(అజ్ఞానమును)పోఁగొట్టునది) డు 1.కిరాతుఁడు, 2. తెనుఁగువాఁడు.

అంపకము-తె. అంపుట.

అంపాచారము వి. (అంభశ్చారము)జలప్రవాహము.

అంపియ-తె. చింపిగుడ్డ, పేలిక. రూ. అంపె.

అంపు-తె. 1. పంపు, 2. ఆజ్ఞాపించు, (రూ. అనుపు.) 3. జాతర. సమా. —దోఁడు-1. తోడుగా పంపఁబడువాఁడు. 2. అప్రయోజకుఁడు.

అంబ-స. 1. తల్లి. (వి. అమ్మ) 2. పార్వతి.

అంబకము-స. 1. కన్ను. 2. బాణము.

అంబకళము-తె. అంబలి.

అంబరము-స. 1. ఆకాశము. 2. వస్త్రము. 3. పరిమళద్రవ్యము.

అంబరీషము-స. 1. యుద్ధము. 2. మంగలము. డు. 1. శివుఁడు. 2. సూర్యుఁడు. 3. విష్ణుభక్తుఁడగు ఒకరాజు.

అంబరు-వి. (అంబరము) పరిమళద్రవ్యము.

అంబలము-తె. కలకలధ్వని.

అంబలి-తె. జావ.

అంబష్ఠుఁడు-స. 1. మంగలి. 2. వైద్యుఁడు.

అంబస్తు-తె. కపటములేనివాఁడు, అమాయికుఁడు.

అంబారము-తె. కళ్లములోని ధాన్యరాశి. రూ. అంబారు.

అంబారి-హిం. ఏనుఁగుమీఁద ఏర్పఱచుపీఠము.

అంబారుపిడుదు-తె. ఒకతెగ పెద్దపిడుదు. (అమ్మవారి పిడుదని కొందఱు.)

అంబాళము-వి. (ఆమ్రాతకము) నల్లమామిడి.

అంబిక-స. 1. తల్లి. 2. పార్వతి. 3. ధృతరాష్ట్రుని తల్లి.

అంబు-వి. (అంబకము) బాణము. రూ. అమ్ము.

అంబువు-స. నీరు. సమా. —జము - తామర. —జగర్భుఁడు-బ్రహ్మ.తామరచాలి.—దము-మేఘము.—ధి-సముద్రము,(ఇట్లే అంబురాశి

మొ.)—వాహిని-దోనె. —స్ఫోటము - నీటి బుగ్గ.

అంబేద-తె. దిట్టతనములేనివాఁడు, మెత్తనివాఁడు.

అంభస్సు-స. నీరు. సమా.—అంభోజము-తామర, (ఇట్లే అంభోరుహము-మొ.) అంభోదము-మేఘము. అంభోధి - సముద్రము. (ఇట్లే అంభోనిధి,అంభోరాశి-మొ.)

అంశము-స. 1. భాగము. 2. విషయము. సమా. అంశకుఁడు-పాలికాఁపు.

అంశుకము-స. 1. ఉత్తరీయము. 2. వస్త్రము, సన్నవస్త్రము. 3. పైఁట.

అంశువు-స. 1. కాంతి. 2. కిరణము. సమా.—
—మంతుఁడు-1.సూర్యుఁడు.2.ధనవంతుఁడు.
—మాలి-సూర్యుఁడు.

అంసకూటము-స. ఎద్దుమూఁపురము.

అంస-స. 1. మూఁపు, 2. అంశము.

అంసలుఁడు-స. బలిసినవాఁడు.

అంహతి-స. 1. ఈవి. 2. విడుపు, 3. రోగము.

అంహస్సు-స. 1. పాపము. 2. దోషము.

అఁట-తె. (అనుట) వృత్తాంతమును మహత్త్వమును దెలుపు ప్రత్యయము. రూ. అంట.

అక-వి. (అర్క) 1. అక్క. 2. పూజ్యస్త్రీ. 3. వంటకత్తె.

అకట-తె. అయ్యో. రూ. అకటా, అక్కట, అక్కటా, కట, కటా, కట్టా.

అకటవికటము-తె. తాఱుమాఱు. రూ. అకటావికటము,

అకము-స. 1. దుఃఖము. 2. పాపము.

అకరువు-స. కింజల్కము.

అకస్మాత్తు(గా)-స. ఉన్నట్టుండి.

అకించనుఁడు-స. దరిద్రుఁడు.

అకూపారము-స. సముద్రము, (వ్యు. కుత్సితము కాని దరికలది, మర్యాదచే భూమిని నింపనిది)

అకో-తె. సంశయార్థక ప్రత్యయము. రూ. ఒకో, ఒక్కొ, ఒకోక.

అక్క-తె.తోఁబుట్టినపెద్దది,అప్ప.2. బ. పూజ్యురాలు, (ప్ర. అర్క) 3. వంటలక్క, 4. ఔర (ఆశ్చర్యార్థకము)

అక్కజము-తె. 1. ఆశ్చర్యము, 2. అధికము. 3. అశక్యము. క్రి. పడు - ఆశ్చర్యపడు. డు-అధికుఁడు. (స్త్రీ) అక్కజురాలు,

అక్కట-చూ. అకట.

అక్కటి-తె. 1. దయగలవాఁడు. 2. దయగలది.

అక్కటిక-తె. దయ. రూ. అక్కటికము.

అక్కరము-వి. (అక్షరము) రూ. అక్ఖరము.

అక్కఱ-తె. 1. అపేక్ష. 2. ప్రయోజనము. 3. శ్రద్ధ. 4. ఆవశ్యకకార్యము.సమా. —కాఁడు, —గండఁడు-అక్కఱకలవాఁడు.

అక్కలకఱ-వి. (ఆక్రార) నోటనీరూరించు ఒక మూలిక.

అక్కలి-తె. ఆఁక.

అక్కలించు-తె. 1. ఆకటిచే పెద్దబొజ్జను కడుపుకు చెక్కుకొనునట్లు అణఁచు. 2. కడుపు పట్టుకొని చెడాచ్చు. రూ. అక్కిలించు.

అక్కసము-తె. 1. దయ, 2. సంతాపము.

అక్కసు-తె. కోపము, సమా.—అక్కసి - (అక్కసు+ఇ) కోపి.

అక్కిలి-తె. 1. అంకిలి. 2. వలఁప.

అక్కు-తె. రొమ్ము.

అక్కుపక్షి-మి. ఉల్లూఁడు.

అక్రమము-స. 1. క్రమముకానిది. 2. దోషము.

అక్షతము-స. నొప్పింపఁబడనిది.

అక్షతలు-స. పసుపుగానిరంకుమగానిరాచిన బియ్యపుగింజలు. రూ. అక్షతములు, (వి. అక్షింతలు.)

అక్షము-స. 1. పాచిక. 2. జూదము. 3. బండి కన్ను. 4. రుద్రాక్షము. 5. ఇంద్రియము. 6. కన్ను. సమా :— —ధూర్తుఁడు-జూదరి. —మాల-జపమాల. (ఇట్లే అక్షసరము, అక్ష సూత్రము-మొ,) —వతి-జూదము. —వాటము-జెట్లుసాధకముచేయుచోటు, గోదా.

అక్షయ-స. అఱువదింట కడపటి సంవత్సరము.

అక్షయము-స. నాశముకానిది.

అక్షయపాత్ర-స. జోలె.

అక్షరము-స. 1. నాశములేనిది. 2. పరబ్రహ్మము, 3. ముక్తి. 4. అక్కరము, 5. డు. చెడనివాఁడు, శివుఁడు, విష్ణువు. సమా.—చణుఁడు-వ్రాఁతకాఁడు. —జ్ఞుఁడు - విద్వాంసుఁడు.

అక్షాంతి-స. అసూయ.

అక్షి-స. కన్ను.

అక్షింతలు-వి. చూ. అక్షతలు.

అక్షోహిణి-స. 21870 రథములు, అన్ని ఏనుఁగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాల్బలముగలసేన. రూ. అక్షౌహిణి. (వ్యు. రథముల సమూహము గలది.)

అఖండము-స. 1. సమస్తము. 2. ఖండము కానిది. 3. నిరంతరము వెలుఁగుచుండు దీపము.

అఖాతము-స. (వ్యు. మనుజులచే త్రవ్వఁబడనిది) నీటి చెంకి, సముద్రశాఖ.

అఖిలము-స. సమస్తము. రూ. నిఖిలము.

అగచాట్లు-తె. ఆపద, కడగండ్లు. సమా. —చాట్లపోతు,—మారి - పెక్కుకడగండ్లు పడినవాఁడు.

అగచు-తె. 1. కలఁచు. 2. పాడుచేయు.

అగడారు-తె. నింద. రూ. అగడు.

అగడిత-తె. కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము, రూ. అగడ్త.

అగడు-తె. 1. నింద. 2. అల్లరి. 3. అపకీర్తి. రూ. అగడారు, అవడు.

అగణితము-స. 1.గణింపరానిది. 2.విస్తారమైనది.

అగణ్యము-స. ఎంచవీలుకానిది.

అగత్యము-తె. అవశ్యము.

అగదము-స. 1. మందు. 2. ఆరోగ్యము. (వ్యు. దీనిచే రోగములేదు.) సమా.—అగదంకారుఁడు-వైద్యుఁడు.

అగప-తె. టెంకాయచిప్పగరిటె.రూ. అపక,అబక.

అగపడు- తె. (అగ్గము+పడు) 1. కనఁబడు. 2. దొరకు, 3. అధీనమగు. కృ.అగపాటు.

అగమము-స. 1. కొండ 2. చెట్టు. రూ. అగము. (వ్యు. కదలనిది.)

అగము-స. 1. కొండ. 2. చెట్టు. 3. పాము.రూ. నగము. సమా. —చరము-కోతి. —జాత-పార్వతి.

అగమ్యము-స. చొరశక్యముకానిది.

అగరువు-స. సుగంధద్రవ్యము, అగలు.

అగలిక-తె. 1. చీలిక. 2. పగులు.

అగలు-తె. 1. పెల్లగిలు. 2. పగులు, 3. అగరువు. రూ. అగులు.

అగవు-తె. కార్యము.

అగసాలె-తె. కమసాలి.

అగస్తి-స. అవిసెచెట్టు. రూ. అగస్త్యము.

అగాధము-స. మిక్కిలిలోఁతుగలది.

అగారము-స. ఇల్లు, రూ. ఆగారము (వ్యు. స్తంభములైన వృక్షాదులను పొందియుండునది)

అగిని-చూ. అగ్గి.

అగిసి-వి.(అగస్త్యము),అవిసెచెట్టు, రూ.అగిసియ, అగిసె, అవిసె.

అగు-తె. 1. కలుగు. 2. సాయపడు. రూ. అవు.

అగురు-తె. అవురుగడ్డి, వీరణము.

అగురువు-స. 1. బరువు లేనిది. 2. చిన్నది. 3. అగలుసొంటి.

అగులు-తె. 1. ఊడు. 2. పగులు. రూ. అవులు. ఔలు.

అగోచరము-స. కనఁబడనిది.

అగ్గము-తె. అధీనము. 2. గోచరము.

అగ్గలము-తె. 1. అధికము. దుస్సహము. క్రి. అగ్గలించు. కృ. అగ్గలిక-1. ఆధిక్యము. 2. పూనిక. 3. పరాక్రమము. 4. విలాసము. రూ. అగ్గలికము.

అగ్గి-వి. (అగ్ని.) నిప్పు. రూ. అగిని. సమా :- —కంటి-శివుఁడు. —చూలి-కుమారస్వామి. —తత్తడి-పొటేలు. —పొడి-ఇలాయి.

అగ్గించు-తె. స్తుతించు. కృ. అగ్గింపు.

అగ్గువ-వి. (అర్ఘము) చౌక.

అగ్ని-స. 1. నిప్పు. (వి. అగ్గి) 2. చిత్రమూలము. (అగ్నులుమూఁడు. ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము.) సమా :— —చిత్తు-సోమయాజి. —భువు-కుమారస్వామి. —మంథము-నెల్లిచెట్టు, (ఉసిరిక) —ముఖుఁడు 1. బ్రాహ్మణుఁడు. 2. వేలుపు. —శిఖము-కుంకుమపూవు. —హోత్రము- 1. అగ్ని. 2. హోమము.

అగ్రము-స. 1. కొన. 2. ముఖ్యము. 3. ఎదురు. 4. సమీపము. 5. మొదటిది. సమా :— —గణ్యుఁడు-శ్రేష్ఠుఁడు, మొదటనెన్నఁదగినవాఁడు. —జుఁడు-1. బ్రహ్మ. 2. బ్రాహ్మణుఁడు. 3. అన్న. (ఇట్లే అగ్రజన్ముఁడు, అగ్రజాతుఁడు-మొ.)—ణి- 1. శ్రేష్ఠుఁడు. 2. మొదటివాఁడు, ముఖ్యుఁడు. —సరుఁడు-1. మొదటివాఁడు 2. ముందు నడచువాఁడు. రూ. అగ్రతస్సరుఁడు, అగ్రేసరుఁడు.—హారము - బ్రాహ్మణులుండెడి ఊరు. అగ్రిమము-ప్రధానము. అగ్రిముఁడు-1. మొదటివాఁడు. 2. అన్న. అగ్రియము-ముఖ్యము, రూ. అగ్రీయము. అగ్రేదిధిషువు-మారుమనువు దాని మొదటి మగఁడు. అగ్ర్యము-ముఖ్యము.

అఘటనము-స. దుర్ఘటము.

అఘము-స. పాపము. సమా. —మర్షణము-స్నానముచేయునపుడుజపించుమంత్రము. (వ్యు. పాపమును పోఁగొట్టునది.)

అఘోరము-స. మిగులభయంకరము.

అఘోరించు-స. 1. దుఃఖించు. 2. దేవులాడు.

అచటు-తె. ఆచోటు. రూ. అచోటు, అచ్చటు, అచ్చొటు, అచ్చోటు.

అచరము-స. కదలనిది. స్థావరము.

అచల-స. భూమి (వ్యు. కదలనిది)

అచలము-స. 1. కదలనిది, 2. కొండ, 3. మేకు,

అచిరద్యుతి-స. మెఱుపు.

అచేతనము స. ప్రాణములేనిది.

అచోటు-చూ. అచటు.

అచ్చ-చూ. అచ్చము.

అచ్చటు-చూ. అచటు.

అచ్చనగండ్లు-తె. బాలికలాడెడురాళ్లు. రూ. అచ్చనలు, అచ్చనగాయలు, అచ్చనగుండ్లు.

అచ్చము-వి. (అచ్ఛము) 1. స్వచ్ఛము. 2. తెల్లనిది. 3. కేవలము. రూ. అచ్చ.

అచ్చర-వి. (అప్సరస) దేవవేశ్య.

అచ్చరము.—చూ. అక్కరము.

అచ్చలము-తె. 1. కోపము, 2. పూనిక, క్రి. అచ్చలించు.

అచ్చాపు-తె. జంజాటములేనివాఁడు.

అచ్చిక-తె. కొఱఁత. రూ. అచ్చికము.

అచ్చికబుచ్చిక-తె. పలుపుగోలుతనము, భేదము లేకుండుట.

అచ్చివచ్చు-తె. అయివచ్చు, మేలైవచ్చు.

అచ్చు-తె. 1. అప్పుపడు. 2. ఇచ్చు. 3. దండుగిచ్చు. 4. ముద్ర. 5. ప్రతిబింబము. 6. పఘను. 7. శబ్దము. సమా. —కూటము-ముద్రాక్షరశాల. —కుప్ప - ధనవంతుఁడు. —ఎద్దు-ముద్రవేసివిడిచిన ఎద్దు, బసివెద్దు. క్రి. అచ్చుపడు-1. స్పష్టమగు 2. ముద్రింపఁబడు. అచ్చొత్తు-ముద్రించు.

అచ్చెరియము-వి. (ఆశ్చర్యము) రూ. అచ్చెరువు.

అచ్చెరువు-చూ. పై.

అచ్చొటు-చూ. అచటు.

అచ్యుతుఁడు-స. విష్ణువు.(వ్యు.నాశములేనివాఁడు)

అచ్ఛము-స. 1. ఎలుఁగుబంటి. 2. స్వచ్ఛము. (వి.అచ్ఛము) సమా.—భల్లము-ఎలుఁగుబంటి.

అజ-స. 1. ప్రకృతి. 2. ఆఁడుమేఁక. 3. గౌరి. డు. 1. బ్రహ్మ. 2. విష్ణువు. 3. శివుఁడు. 4. మన్మథుఁడు. 5. దశరథునితండ్రి. సమా. అజాండము-(అజ + అండము) బ్రహ్మాండము.

అజము-స. మగమేఁక.

అజగరము-స. పెనుఁబాము. (వ్యు. మేఁకలను మ్రింగునది.)

అజగర్దము-స. నీరుపాము.

అజగవము-స. శివునివిల్లు. రూ. అజీగవము, అజీగావము.

అజన్యము-స. 1. ఉత్పాతము. 2. జన్యముకానిది.

అజప-స. సగము మగపోలికయు సగము ఆఁడుపోలికయుఁగల రూపము.

అజపుఁడు-స. అవైదిక గ్రంథములు చదువువాఁడు.

అజరుఁడు-స. 1. ముసలితనము లేనివాఁడు. 2. వేలుపు.

అజస్రము-స. ఎల్లప్పుడు.

అజాగ్రత్త-స. జాగ్రత్తలేమి.

అజాతశత్రువు-స. ధర్మరాజు, (వ్యు. శత్రువులు పుట్టనివాఁడు.)

అజారము-హిం. మొగసాల. రూ. హజారము.

అజితుఁడు-స. 1. బ్రహ్మ. 2. విష్ణువు. 3. శివుఁడు. 4. జయింపఁబడనివాఁడు.

అజినము-స. తోలు.

అజిరము-స. 1. కప్ప. 2. గాలి. 3. ముంగిలి.

అజిహ్మగము-స. బాణము.

అజీర్ణము-స. ఆహారముజీర్ణింపమి. రూ. అజీర్తి.

అజేయము-స. గెలువశక్యముకానిది. రూ. అజయ్యము.

అజ్జ-తె. 1. పాదము, (రూ. అంజ) 2. సమయము, 3. బశి. సమా. —వాలు-కోడి, చరణాయుధము.

అజ్జము-తె. కొన్నిపనసలుగల వేదభాగము.

అజ్ఞత-స. తెలివిలేనితనము. రూ. అజ్ఞత్వము.

అజ్ఞానము-స.—పై—

అజ్ఞుఁడు-స. మూర్ఖుఁడు, తెలివిలేనివాఁడు.

అట-తె. 1. అక్కడ. 2. అవల.

అటక-తె. ఇంటిలో దూలములపై ఏర్పఱచిన మంచె. రూ. అటుక, అట్టుక, అట్టువ.

అటకలి-తె. నలుఁగు పిండి.

అటనము-స. సంచారము.

అటని-స. వింటికొన.

అటను-తె. భయము.

అటమట-తె. 1. వంచన. 2. దుఃఖము. 3. వ్యర్థము. 4. అసత్యము. సమా.—

—కాఁడు } వంచకుఁడు.
అటమటీఁడు }

క్రి. అటమటించు, అటమరించు.

అటమర-తె. 1. వ్యర్థము. 2. పాఱిపోవుట.

అటవి-స. అరణ్యము. (వి. అడవి.)

అటి-తె. అటువంటి. రూ. అట్టి.

అటిక-తె. చిన్నకుండ. రూ. అట్టిక.

అటు-తె. 1. ఆప్రకారము. 2. అక్కడకు. రూ, అట్టు, అట్టులు.

అటుక-చూ. అటక.

అటుకులు-తె. వడ్లనానఁబోసి వేఁచిదంచినవి. రూ. అడుకులు.

అటె-తె. ఆశ్చర్యదుఃఖములను దెలుపు ప్రత్యయము. రూ. అట్టె.

అట్ట-తె. 1. మొండెము. 2. చెప్పులకు అడుగున వేయుచర్మము. 3. దళసరికాగితము. 4. పుస్తకములకు పైనవేయు కాగితము.

అట్టడి-తె. కోటబురుజుమీఁది యిల్లు.

అట్టము-తె. 1. అటక. 2. బురుజు 3. వి. వేదభాగము.

అట్టము-స. 1. వంటకము, 2. వంటచెఱకు, 3. మేడ వెసుకటి యిల్లు.

అట్టహాసము-స. పెద్దనవ్వు.

అట్నము-తె. బురుజు.

అట్టాలకము-తె. 1. బురుజు. 2. నగరు.

అట్టి-చూ. అటి. సమా :—అట్టిఁడు - అట్టివాఁడు. (బ. అట్టిరు.)

అట్టు-తె. 1. అటు. 2. దోసె.

అట్టుపుట్టానవాలు-తె. సంపూర్ణవివరణము.

అట్టెడ-తె. 1. పూడికమన్నెత్తుట కుపయోగింపఁబడు తట్ట. 2. జల్లెడతడక. 3. కోటలోని యొకభాగము.

అట్టము-వి.(అష్టకము), వేదభాగము. రూ.అట్టము.

అడ-తె. 1. ముద్ద. 2. పిసక. క్రి. అడగొను.

అడకత్తు-తె. వక్కలను నఱుకుకత్తెర, పూగదళని. రూ. అడకత్తెర, అడకొత్తు.

అడకము-తె. లోపలనణఁగినది.

అడకర-తె. ఓర్పు.

అడకించు-తె. 1. మోసపుచ్చు. 2. గేలిసేయు.

అడఁకువ-తె. వినయము. రూ. అణఁకువ.

అడఁగు-తె. 1. తగ్గు. 2. ఉపశమిల్లు. 3. లోఁబడు. 4. వంగు. 5. నశించు. (ప్రే. అడఁచు) రూ. అణఁగు. కృ. అడఁకువ.

అడగోలుకొను-తె. అపహరించు.

అడజడి-తె. 1. దుఃఖము. 2. శ్రమ. రూ. అలజడి.

అడఁది-వి. (హరిద్ర)పచ్చఁదనము. రూ. అళఁది.

అడపము-తె. 1. వక్కలాకులతిత్తి. 2. మంగలిపొది. సమా.—అడప-1. అడపముంచికొనియుండు ఆఁడుది. (రూ. అడపకత్తె.) 2. అట్టగా ఏర్పడినది. 3. పశుపాదరోగము. —కాఁడు-1. అడపముంచుకొనియుండువాఁడు. 2. మంగలి.

అడపదడప-తె. అప్పుడప్పుడు. రూ. ఎడపదడప.

అడపఱ-తె. అడ, ముద్ద.

అడపు-తె. పట్టుకొను.

అడపొద-తె. జాడ.

అడబాల-తె. 1. వంటవాఁడు. 2. వంటలక్క.

అడమానము-అ. తాకట్టు.

అడరు-తె. 1. అతిశయించు. 2. వృద్ధిపొందు. 3. వ్యాపించు. 4. కలుగు. 5. పూను. 6. త్వరపడు. (ప్రే. అడరించు-ప్రయోగించు) 7. ఆధిక్యము. 8. కష్టము, ఆపద. 9. ఒప్పు.

అడలు-తె. 1. ఏడ్పు. 2. ఏడుపు. 3. భీతి. (ప్రే. అడలించు-గద్దించు.)

అడవి-వి. (అటవి.) కాన. సమా :— —కాఁపు-వానప్రస్థుఁడు. —కుక్క-1. తోఁడేలు. 2.

వేఁచుకుక్క. —తిరుగుడు-కోఁతి.

అడసాల-తె. వంటయిల్లు.

అడి-తె. వ్యర్థము.

అడిగట్టు-తె. (అడుగు+కట్టు) పాదుక. రూ. అడియొత్తు.

అడిగొట్టు-తె. కుత్సితుఁడు. రూ. అడిగొంటు.

అడిచిపడు-తె. 1. త్వరపడు. 2. మిడిసిపడు. 3. మండిపడు. కృ. అడిచిపాటు.

అడితి-తె. తఱుగు, వ్యాపారమున నూటికింతయని పుచ్చుకొనునది.

అడిత్రాగుడు-తె. కఱవు.

అడిదంచ-తె. కాలిసంకెల, (చేతిసంకెల, అరదండ)

అడిదము-తె. కత్తి. సమా.—అడిదపుమెకము-ఖడ్గమృగము.

అడిబంచ-తె. దుష్టుఁడు.

అడిబీరము-తె. 1. కావరము 2. మత్తు.

అడియఁడు-అ. పాదసేవకుఁడు. రూ. అడియరి.

అడియాలము-అ. గుఱుతు.

అడియాస-తె. 1. వ్యర్థాశ. 2. దురాశ.

అడినాటా-తె. తఱుగుబేరము.

అడుప-అ. 1. దొంతిగానుంచు. 2.(కృ.) దొంతి.

అడుకులు-చూ. అటుకులు.

అడుగు-తె. 1. ప్రశ్నించు. 2. యాచించు. 3. క్రిందు. 4. పాదము. 5. పాదప్రమాణము. 6. అధమము. క్రి. అడుగంటు-వట్టిపోవు. —పడు-అధమమగు. సమా. —పుట్టువు. 1. శూద్రుఁడు, పాదజుఁడు. 2. గంగ.

అడుచు-తె. 1. కొట్టు. 2. పంపు. కృ. అడుపు.

అడుజు-తె. ఒకరెగ చేగ. రూ. అణుఁజు.

అడువ-తె. 1. ప్రాఁత. 2. లోకువయైనవాఁడు.

అడువు-తె. పాదము. రూ. అడుగు.

అడుసు-తె. బురద.

అడ్డ-తె. 1. కట్ట, అడ్డకట్ట. రూ. అడ్డము. 2. కుంచములోసగము. సమా.—అడ్డంకి - ఆటంకము. రూ. అడ్డి, అడ్డు. —కత్తి - పొడవైన కత్తి. —కమ్మి - ద్వారబంధపు లక్ష్మికమ్మి.
—కట్టు, —గాలు } విఘ్నము.
—పట్టె-మడిచదును చేయుపలక. రూ. అడ్డ మ్రాను. —పాప-శిశువు. —బాస-బులాకి. క్రి. అడ్డకట్టు-1. అడ్డగించు. 2. కట్టవేయు.

అడ్డనము-వి. (అండనము.) కేడెము. రూ. అడ్డణము.

అడ్డము-తె. 1. చూ. అడ్డు. 2. చాటు. 3. తాకట్టు, 4. పూఁట. 5. తిర్యక్కు.

అడ్డవేడెము-తె. పాము నడకవంటి గుబ్బపునడక.

అడ్డసారె-తె. పాచిక.

అడ్డాదిడ్డి-తె. అక్రమము.

అడ్డి-తె. అడ్డంకి. రూ. అడ్డు.

అడ్డిగ-తె. 1. స్త్రీలు మెడలోవేసికొనునగ. 2. రూకలోసగము. రూ. అడ్డుగ.

అడ్డు. తె-1. అడ్డగించు. 2. చాటు. కృ. అడ్డు, అడ్డగింత 3. చాటు. సమా. —గట్టు-1. ఆటంకము, 2. గడెమ్రాను. 3. విఘాతము.

అణఁకువ-చూ. అడఁకువ.

అణఁగు-చూ. అడఁగు.

అణకి-అంక, ఎద్దు మెడమీఁదికాఁడిని మెడక్రిందికి తెచ్చుకొనుట.

అణి-స. 1. ఇరుసుతుదిచీల. 2. అంచు.

అణిమ-స. 1. అణుత్వము, 2. అష్టసిద్ధులలో నొకటి. (అణువుకంటె తేలికయగుట) రూ. అణిమము.

అణీయము-స. మిక్కిలి చిన్న అణువు.

అణువు-స. *1.* స్వల్పమైనది. *2.* చిఱువడ్లు.

అతఁడు-తె. ఆయన. రూ. ఆతఁడు.

అతకరించు-తె. క్రిందుపఱచు, అతిక్రమించు.

అతగుఁడు-తె. *1.* దుర్బలుఁడు. *2.* భీరు. *3.* దీనుఁడు.

అతనుఁడు-స. మన్మథుఁడు. (వ్యు. తనువులేనివాఁడు.)

అతర్కణము-స. *1.* నేరము. *2.* మట్టుమీఱినపని.

అతలకుతలము-తె. *1.* సలుగుట. *2.* చెదరిపోవుట, కలగుండు.

అతలము-స. భూలోకమునకుక్రింది లోకము.

అతి-స. అమితము, అవల అనునర్థములిచ్చు ఉపసర్గము. సమా. —క్రమము-*1.* మీఱుట. *2.* దుర్మార్గగుణము.

—క్రాంతము<br>—క్రాంతి } అతిక్రమము.

—గంధము-*1.* గంధకము. *2.* ఎక్కువ వాసనగలది. —దేశము-*1.* బదులు. *2.* రూపనిష్పత్తి. —ముక్తము-పువ్వులగురివెంద. —రథుఁడు-పెక్కువిలుకాండ్రతోపోరెడియోధుఁడు. —రసము-అరిసె. —రూపము-*1.* మిగులసౌందర్యము. *2.* రూపములేనిది. —రేకము-ఆధిక్యము. —రోగము-క్షయ. —లోకుఁడు-*1.* లోకాతీతుఁడు. *2.* మిగుల దొడ్డవాఁడు. —వాదము-కఠినసంభాషణము. —వృష్టి-హానికరమైన ఎక్కువవాన.

—వేలము<br>—శయము } పెల్లు.

—సంచయము - పెల్లుగకూడఁబెట్టుట. —సారము - నెత్తురుబంకపడు వ్యాధి. అత్యంతము-మిక్కిలి. అత్యాశ-అధికాశ.

అతిథి-స. *1.* ఇంటికివచ్చినయాచకుఁడు. *2.* విందు.

అతివ-తె. ఆఁడుది.

అతివాసము-వి. (అధివాసరము) శ్రాద్ధదినమునకు ముందుదినముచేయు ఉపవాసము.

అతీతము-స. కడచినది.

అతుకు-తె. *1* అంటించు. *2.* అతికినతావు, రూ. అదుకు.

అతులము-స. సరిలేనిది. రూ. అతులితము.

అత్త-తె. *1.* మగనితల్లి. *2.* భార్యతల్లి. *3.* పితృసోదరి. *4.* మేనమామభార్య.

అత్తడి-తె. ఆఁడుగుఱ్ఱపు ఋతుకాలము.

అత్తిపత్తి-ముడుఁగుదామర. (తాఁకినముడుచుకొను ఆకులు గలది)

అత్తమిల్లు-తె. *1.* శయనించు. *2.* వ్యాపించు. *3.* ఒఱగు. *4.* (ప్ర.) అస్తమించు.

అత్తము-తె. *1.* అరఁటిగెల. *2.* సమూహము.

అత్తరము-తె. త్వర. రూ. ఆత్రము.

అత్తరు-హిం. సుగంధతైలము. రూ. అత్తరువు.

అత్తలము-తె. ఈఁటె. రూ. అత్తళము.

అత్తి-తె. *1.* మేడిచెట్టు. *2.* (ప్ర) హస్తి.

అత్తు-తె. *1.* కలియు. *2.* తగు. *3.* మైనపుగుడ్డ.

అత్త్రము-వి. (హస్తత్రాణము). వేగ వాలిగోళ్ళు తగులకుండునట్లు చేతికిఁ గట్టుకొను చర్మము.

అత్తెసరు-తె. (అత్తు+ఎసరు) గంజివారకుండ అన్నములో ఇమిడిపోవునట్లు పెట్టెడి ఎసరు.

అత్యయము-స. *1.* అతిక్రమము. *2.* కష్టము. *3.* దుఃఖము. *4.* చేటు.

అదంత్రము-వి. (అతంత్రము) స్వాతంత్ర్యము తప్పినది.

అదటు-తె. గర్వము.

అదనము-తె. అధికము.

అదను-తె. సమయము.

అదభ్రము-స. విస్తారమైనది.

అదరము-వి. (అధరము) క్రింది పెదవి.

అదరు-తె. 1. చలించు. 2. భయపడు. కృ. 3. చలనము. 4. భయము. రూ. అదురు. సమా. గుండె-పిటికి.

అదరులు-తె. నిప్పురలు, మిణుఁగురులు.

అదలు-తె. 1. చలించు. 2. భయపడు. ప్రే. అదలుచు. కృ. అదలుపు.

అదవ-తె. 1. అద్దె. 2. కోన.

అదవద-తె. 1. కలఁత. 2. చింత. 3. వ్యత్యస్తము.

అదాటు-తె. అకస్మాత్తు.

అదారుఁడు-స. భార్యలేనివాఁడు.

అది-తె. 1. అవస్తువు. 2. ఆమె. రూ. అద్ది.

అదిగో-తె. (అది+కొనుము) కనఁబడుదానిని చూపుట.

అదితి-స. దేవతలతల్లి, కశ్యపుని భార్య.

అదుకు-చూ. అతుకు.

అదుము-తె. అణఁచు. కృ. అదుముడు.

అదురు-చూ. అదరు.

అదువ-తె. 1. అస్థిరము. 2. లోఁకువయగు వాఁడు. రూ. అద్దువ.

అదృశ్యము-స. కనఁబడనిది.

అదృష్టము-స. 1. భాగ్యము. 2. చూడఁబడనిది.

అద్ద-వి. (అర్ధము) సగము. రూ. అద్దము. సమా. —గోడ - వంటయింట మఱుఁగుగానుంచు చిన్నగోడ. అద్దమరేయి-సగమురాతిరి.

అద్దకము-తె. గుడ్డలకు రంగువేయుట.

అద్దము-తె. 1. ముఖము చూచుకొను గాజుబిళ్ల, ముకురము. 2. వి. (అర్ధము) సగము.

అద్ది-చూ. అది.

అద్దికము-తె. కావలి.

అద్దియ-తె. బాడుగ. రూ. అద్దె.

అద్దు-తె. 1. రంగువేయు. 2. ఒదుపు. కృ. అద్దకము, అద్దుడు.

అద్దువ-చూ. అదువ.

అద్దె-చూ. అద్దియ.

అద్భుతము-స. ఆశ్చర్యము.

అద్రి-స. 1. కొండ. 2. చెట్టు. 3. సూర్యుఁడు.

అద్వయుఁడు-స. సాటిలేని వాఁడు.

అద్వితీయము-స. సాటిలేనిది.

అద్వైతము-స. 1. అభేదము. 2. జీవేశ్వరుల కైక్యము చెప్పెడి మతము.

అధఃకరణము-స. క్రిందు పఱచుట.

అధమము-స. తక్కువైనది. డు. నీచుఁడు. సమా. అధమర్ణుఁడు - అప్పుతీసికొన్నవాఁడు. (అప్పిచ్చినవాఁడు ఉత్తమర్ణుఁడు)

అధరము-స. 1. క్రింది పెదవి. (వి. అదరము) 2. తక్కువైనది.

అధికము-స. అతిశయము, ఎక్కువ. డు. గొప్పవాఁడు. సమా. —మాసము - చాంద్రమానమున మూఁడేండ్లకొకతూరివచ్చు పదుమూఁడవ నెల.

అధి-స. మీఁద, అధికము అను నర్థములిచ్చు ఉపసర్గము. సమా. — కరణము-అధారము. — కరించు - 1. చదువు. 2. అతిశయించు. — కారము - 1. ప్రక్రియ. 2. చెల్లుబడి. 3. దొరతనము. (పుం. అధికారి. స్త్రీ. అధికారిణి.)—కృతుఁడు-అధికారి. — క్రియ-అధికారము. — క్షేపము-1. ఆక్షేపించుట. 2. తిరస్కారము. — గతము-1. పొందఁబడినది. 2. చదువఁబడినది. — గమము - 1. పొందుట. 2. చదువుట. — జ్యము - ఎక్కుపెట్టినది (విల్లు)

క్రి. అధిగమించు.
—త్యక-కొండమీఁదినేల. —దేవత-రక్షించు దేవత. — పతి-అధికారి. రూ. అధిపుఁడు, అధిభువు. — రాజు-గొప్పరాజు. — రోహణము-ఎక్కుట, ఆరోహణము. (క్రి. అధిరోహించు.) — రోహిణి - నిచ్చెన. — వసించు-నివసించు. — వాసము- 1. గృహము. 2. గృహమును ధూపాదులచేత సంస్కరించుట. — వాసరము - చూ. అతివాసము. — విన్న - మొదటి భార్య. — వేదనము-భార్యయుండఁగా మరల పెండ్లాడుట. — శ్రయణి-ప్రొయ్యి. — ష్ఠానము- 1. ఆక్రమించుట. 2. నివసించుట. 3. అధికారము.
అధిష్ఠాత. 1. అధిష్ఠించువాఁడు. 2. ముఖ్యుఁడు. అధిష్ఠానదేవత — అధిదేవత. క్రి. అధిష్ఠించు.
అధీతము-చదువఁబడినది. (పుం. అధీతి.)
అధీనము-ఆయత్తము, స్వాధీనము.
అధీశుఁడు-(అధి+ఈశుఁడు) రాజు.

అధునాతనము-స.ఇప్పటికాలమునకుసంబంధించినది
అధోక్షజుఁడు-స. విష్ణువు. (వ్యు. ఇంద్రియముల నణఁచుకొని పుట్టినవాఁడు.)
అధోగతి-స. 1. తక్కువగతి. 2. నాశము.
అధోభువనము-స. పాతాళము.
అధోముఖము-స. దిగుముఖము గలది.
అధ్యక్షుఁడు-స. 1. అధికారి. 2. ప్రత్యక్షమైన వాఁడు. క్రి. అధ్యక్షించు.
అధ్యయనము-స. గురుముఖమున వేదము చదువుట. రూ. అధ్యాయనము. క్రి. అధ్యయనించు.
అధ్యవసాయము-స. 1. ఉత్సాహము. 2. పూనిక. 3. శ్రద్ధ.
అధ్యాత్మము-స. 1. జ్ఞానము. 2. ఆత్మసంబంధమైనది.
అధ్యాపకుఁడు-స. వేదమును చదివించువాఁడు.
అధ్యాపనము-స. వేదము చదివించుట. క్రి. అధ్యాపించు.
అధ్యాయము-స. గ్రంథమందొక భాగము.
అధ్యాసనము-స. ఆక్రమించుట.
అధ్యాహవనికము-స. అరణము.
అధ్యాహారము-స. అర్థముకొఱకు లేనిపదములను తెచ్చుకొనుట, లోపించినది.
అధ్యూఢ-స. మొదటి భార్య.
అధ్యేత-స. చదువువాఁడు, విద్యార్థి.
అధ్వము-స. 1. దారి. 2. కాలము. సమా. —గుఁడు.-దారి నడచువాఁడు. రూ. అధ్వనీనుఁడు, అధ్వన్యుఁడు.
అధ్వరము-స. యాగము.
అధ్వర్యుఁడు-స. యాగమందు యజుర్వేద తంత్రము నడపువాఁడు. రూ. అధ్వర్యువు.
అధ్వానము-స. 1. అమార్గము. 2. పాడు.
అన-తె. 1. అన్న. 2. ఆనకట్ట. 3. లేఁగొమ్మ.
అనంగము-స. 1. ఆకాశము. 2. హృదయము. డు. మన్మథుఁడు.
అనంత-స. 1. భూమి. 2. పార్వతి. 3. గఱిక.
అనంతము-స. 1. మేరలేనిది. 2. ఆకాశము. డు. 1. శేషుఁడు. 2. విష్ణువు. 3. తుదలేనివాఁడు. సమా.—శయనుఁడు-విష్ణువు. —విజయము-1. ధర్మరాజు శంఖము. 2. లెక్కకు మీఱిన జయములుకలది.
అనంతరము-స. పిమ్మట.
అనఁగు-తె. కలయు.
అనఁటి-తె. అరఁటి. చూ. అంటి.
అనకట్ట-తె. నీరుమరలించుటకు ఏటికికట్టు అడ్డకట్ట. రూ. ఆనకట్ట.

అనఘము-స. అఘములేనిది. డు. నిర్దోషి.

అనడ్వాహము-స. ఎద్దు. (వ్యు. బండిని వహించునది)

అనతి-స. కొంచెమైన.

అనద-వి. (అనాథ) *1.* విధవ. *2.* అల్పుఁడు. *3.* దిక్కులేనివాఁడు.

అనన్యజుఁడు-స. మన్మథుఁడు. (వ్యు. మనసు కంటె అన్యస్థలమందు పుట్టనివాఁడు)

అనన్యము-స. ఇతరముకానిది. సమా. అనన్యాదృశము-అసమానము. రూ. అనన్యాదృశ్యము.

అనన్వయము-స. అన్వయము లేనిది.

అనపత్యము-స. సంతానములేమి. డు. బిడ్డలులేనివాఁడు.

అనయము-తె. *1.* అత్యంతము. *2.* అవశ్యము. *3.* ఎల్లప్పుడు. *4.* మఱిమఱి.

అనయము-స. *1.* అశుభము. *2.* నీతికానిది. *3.* ఆపద.

అనరు-తె. సంకటము.

అనరులు-తె. జీవస్థానము, మర్మము,

అనర్గళము-స. అడ్డులేనిది.

అనర్ఘము-స. వెలలేనిది, అమూల్యము.

అనర్థము-స. *1.* కీడు. *2.* అర్థములేనిది.

అనర్హము-స. అర్హము కానిది.

అనలము-స. *1.* అగ్ని. *2.* ఉత్పాతము. డు. *1.* అగ్నిదేవుఁడు. *2.* ఒక వసువు.

అనవటిల్లు-తె. *1.* అన్నము పక్వమైచల్లారు. *2.* *2.* ఉమ్మగిల్లు.

అనవద్యము-స. *1.* అనాద్యము. *2.* లోపము లేనిది.

అనవరతము-స. *1.* ఎల్లప్పుడు. *2.* ఎడతెగనిది. రూ. అనారతము.

అనవసరము-స. అవసరములేమి.

అనసూయ-స. *1.* అసూయలేమి. *2.* అత్రిమునిభార్య.

అనాగతము-స. భవిష్యత్కార్యము.

అనాచారము-స. ఆచారములేమి.

అనాది-స. *1.* ఆదిలేనిది. *2.* నిత్యమైనది.

అనాథ-స. నాథుఁడులేనిది, దిక్కులేనిది.

అనామయము-స. ఆమయములేమి, ఆరోగ్యము.

అనామిక-స. చిటికెనవ్రేలికి ప్రక్కవేలు.

అనాయాసము-స. ఆయాసములేమి.

అనారతము-రూ. అనవరతము.

అనావృష్టి-స. వఱపు, వానలేమి.

అనాస-తె. మొగిలిపనస.

అనాహతము-స. చలువచేయనిది, కోరికము.

అని-తె. *1.* యుద్ధము. *2.* అల్లిక మొదలు.

అనికి-తె. *1.* మూతివెడల్పుగలకుండ. *2.* అల్లిక.

అనిక్షువు-స. నల్లచెఱకు.

అనిత్యము-స. నిత్యముకానిది.

అనిమిషము-స. (వ్యు. తెప్పపాటులేనిది) చేఁప. డు. వేలుపు.

అనిరుద్ధుఁడు-స. *1.* అడ్డగింపఁబడనివాఁడు. *2.* ప్రద్యుమ్నునికొడుకు.

అనిలము-స. గాలి. డు. *1.* వాయుదేవుఁడు *2.* ఒక వసువు. (వ్యు. ఇతనిచే బ్రదుకుదురు)

అనివార్యము-స. నివార్యముకానిది.

అనిశము-స. అనవరతము.

అనిష్టము-స. (న+ఇష్టము) ఇష్టముకానిది.

అనీకము-స. *1.* యుద్ధము. *2.* సేన. (వ్యు. ఏర్పఱింపరానిది)

అనీకిని-స. *2187* రథములు, అన్నియేనుఁగులు, *6561*గుఱ్ఱములు, *10935*కాల్బలముగలసేన.

అను-తె. చెప్పు, వచించు.

అను-స. పిమ్మట, వెనుక, ఒకటి తరువాత అను నర్థములనిచ్చు ఉపసర్గ. సమా. —కంప-దయ. రూ. అనుకంపనము. —కరణము-ఒకరు చేయునట్లు చేయుట. క్రి. అనుకరించు. —కారము-పోలిక. రూ. అనుకృతి. —కారి-పోలునది. —కూలము-1. ఇష్టము. 2. అనువు. క్రి. అనుకూలించు. (వ్య. ప్రతికూలము) —క్రమణిక-విషయసూచిక. —క్రమము-ఒకటి వెంబడి నొకటి. —క్రోశము-కనికరము. —క్షణము-ప్రతిక్షణము. —గమనము-వెంబడించుట. రూ. అనుగతి. క్రి. అనుగమించు. —గుణము-తగినది. —గ్రహము-1. కరుణ. 2. ఏలుకొనుట, క్రి. అనుగ్రహించు. —చరుఁడు-1. సహాయుఁడు. 2. దాసుఁడు. —జన్ముఁడు-తమ్ముఁడు. రూ. అనుజుఁడు. —జాత-చెల్లెలు. —జీవి-సేవకుఁడు. అనుజ్ఞ-ముదల, ఉత్తరువు, రూ. ఆజ్ఞ. అనుజ్ఞానము. —జ్ఞాతుఁడు-ఆజ్ఞాపింపఁబడినవాఁడు. —తాపము-పశ్చాత్తాపము. —దినము-ప్రతిదినము. —నయము-1. ఊఱట. 2. వేఁడికొనుట. 3. మర్యాదచేయుట. క్రి. అనునయించు. —నీతుఁడు-ఊఱడింపఁబడినవాఁడు. —పదము-అడపదడప, అప్పుడప్పుడు. —పల్లవి-పాటయందు రెండవగీత. —పానము 1. మందుతోఁ జేర్చిపుచ్చుకొనునది. 2. అన్నముతోఁగూడ తినుకూర మొదలగునది. —అనుబంధము-1. అనువర్తనము. 2. తప్పు బయలుపఱచుట. 3. చుట్టఱికము. —భవము-కుడుపు. క్రి. అనుభవించు. —భావము-1. నిశ్చయము. 2. అనురూపము. 3. ప్రభావము. —భావ్యము-అనుభవింపఁ దగినది. —భుక్తము-అనుభవింపఁ బడినది. రూ. అనుభూతము.—భుక్తి-అనుభవము. రూ. అనుభూతి, అనుభోగము. —మతము. సమ్మతింపఁబడినది. —మతి 1. సమ్మతి. 2. ఒకకళతక్కువైన చంద్రుఁడుగలపున్నమ. క్రి. అనుమతించు. —మరణము - సహగమనము. —మానము-1. సందేహము. 2. ఊహ. క్రి. అనుమానించు. —మేయము - ఊహింపఁదగినది. —మోదము-1. సంతోషము. 2. అంగీకారము. క్రి. అనుమోదించు. —యాయి-వెంబడించువాఁడు. —రక్తము-ప్రేమకలది. దు. ప్రియుఁడు. స్త్రీ. అనురక్త.

—రక్తి } ప్రేమ.
—రాగము }

—రూపము-తగినది, అనుగుణము. —రోధము-అనువర్తించుట. రూ. అనురోధనము. —లాపము-మాటిమాటికి చెప్పెడుమాట. —లేపనము-పూఁత. —లోమము-ఆరోహణక్రమము గలది. (వ్య. విలోమము) —అనువదించు-ఒకరు చెప్పినది మరలచెప్పు. —వర్తనము-అనుసరించినడచుట. క్రి. అనువర్తించు. —వాదము-అనువదించుట. —శాసనము-ఆజ్ఞ. క్రి. అనుశాసించు. —షంగము-1. చేరిక. 2. దయ. —ష్ఠానము-1. ఆచారము. 2. నడవడి. 3. వాడుక. క్రి. అనుష్ఠించు. —సంధానము-1. కూర్పు. 2. మోక్షసంబంధ గ్రంథములఁ జదువుట. క్రి. అనుసంధించు. —సరణము-1. చేరుట. 2. వెంబడించుట. రూ. అనుసారము. క్రి. అనుసరించు.—సారి-అనుసరించువాఁడు. —స్యూతము-ఎడతెగనిది.

అనుఁగు-తె. 1. ముఖ్యుఁడు. 2. చెలికాఁడు. 3. మొదటిది. 4. రమ్యము. సమా. —కత్తె-చెలికత్తె. —కాఁడు-చెలికాఁడు.

అనుకు-తె. ముద్దగాక పలుచనైనది.

అనుగలము-వి. (అనుకూలము) 1. సహాయము 2. సమానము,

అనుచితము-స. ఉచితముకానిది, అనర్హము.

అనుచు-తె. 1. పంపు. 2. ఆజ్ఞాపించు. రూ. అంచు, అన్చు, అనుపు, అంపు, పంచు, పనుచు.

పంపు. కృ. అనుపు.

అనుత్తమము-స. *1.* మిక్కిలి ఉత్తమము. *2.* ఉత్తమము కానిది.

అనుత్తరము-స. *1.* ఉత్తరములేనిది. *2.* ఉత్తరము కానిది.

అనుపమ-స. *1.* ఉపమలేనిది. రూ. అనుపమము. *2.* నైరృతిదిక్కునందలి కుముదమనుదిగ్గజము యొక్క భార్య.

అనుపరి-తె. (అనుపు+అరి) సుంకరి.

అనుపు-తె. *1.* ఉపాయము. *2.* యుక్తము. *3.* అనుకూలము. *4.* అవకాశము. *5.* విధము. క్రి. —చేయు-సిద్ధముచేయు.— పడు - అనుకూలపడు.

అనుసు-తె. అంచునవేయు ఇనుపకడియము.

అనుస్వారము-స. సున్న, బిందువు.

అనూచానము-స. వినయము. డు-*1.* సాంగముగా వేదాధ్యయనముచేసిన విప్రుఁడు. *2.* వినయము గలవాఁడు. *3.* విచక్షణుఁడు.

అనూఢ-స. పెండ్లికానిపడుచు.

అనూనము-స. *1.* అంతయు. *2.* వెలితిలేనిది.

అనూరుఁడు-స. గరుత్మంతుని అన్న.(వ్యు. తొడలు లేనివాఁడు.)

అనృతము-స. (న+ఋతము) *1.* అసత్యము. *2.* కృషి.

అనేకపము-స. ఏనుఁగు. (వ్యు. ఒకటికంటెనెక్కువ యవయవములతో నీరుత్రాగునది)

అనేకము-స.(న+ఏకము) పెక్కు. రూ. నైకము.

అనోకహము-స. చెట్టు. (వ్యు. బండిగమనమును ఆఁపునది)

అన్న-తె. అగ్రజుఁడు. చూ. అన.

అన్నము-స. వంటకము.

అన్ని-తె. సమస్తము.

అన్ను-తె. *1.* మత్తు. *2.* స్త్రీ. క్రి. అన్నుకొను-మత్తుగొను.

అన్నువ-తె. *1.* అల్పము. *2.* స్త్రీ.

అన్నువు-తె. ఒడలెఱుఁగమి.

అన్నెము-వి. *1.* (అన్యము) ఇతరము. *2.* (అన్యాయము) అధర్మము. సమా. —కాఁడు-అన్యాయకారి. (స్త్రీ) అన్నెకారి.

అన్యథా-స. వేఱువిధముగా.

అన్యము-స. *1.* వేఱు. *2.* సరిలేనిది. *3.* డు-ఇతరుఁడు.

అన్యోన్యము-స. (అన్యః+అన్యము) పరస్పరము.

అన్వయము-స. *1.* కులము. రూ. అన్వవాయము. *2.* పొందిక.

అన్వర్థము-స. సార్థకము, పొసఁగిన అర్థము కలది.

అన్వితము-స. కూడుకొన్నది. రూ. అన్వీతము.

అన్వేషణ-స. వెదకుట. రూ. అన్వేషణము. క్రి. అన్వేషించు.

అన్వేష్ట-స. వెదకువాఁడు

అప-తె. *1* తండ్రి. *2.* తల్లి *3.* అక్క. రూ. అప్ప.

అప-స. విరుద్ధార్థమునిచ్చు ఉపసర్గ.—కరించు-హాని చేయు. —కర్షము-ఆకర్షణము. రూ. అపకృష్టి. —కారము-కీడు. రూ. అపకృతి. —కీర్తి-చెడు పేరు. (ఇట్లే అపఖ్యాతి, అపప్రథ, అపయశము. మొ.) —కృష్టము - అధమము. —క్రమము-క్రమభంగము. —క్రోశము-తిట్టు. —గతము-పోయినది. —ఘనము-*1.* శరీరము. *2.* అవయవము. —చయము-*1.* తక్కువ. *2.* హాని. *3.* నష్టము. *4.* పువ్వులను గోయుట. క్రి. అపచయించు. —చారము-*1.* పెద్దలయెడఁ జేసిన తప్పు. *2.* లోపము. క్రి. అపచరించు —జయము-పరాజయము, ఓడిపోవుట. —దిః

ము-విదిక్కు. —దేవత-పిశాచము.—దేశము-1. నెపము. 2. నిమిత్తము. 3. కపటము.—నయము-1. కీడు. 2. తొలఁగించుట. క్రి. అపనయించు. —నింద-వృథాదూషణము. —నోదము-తొలఁగించుట. —ప్రదానము-లంచము. —భ్రంశము-అపశబ్దము.—మార్గము-1.తప్పుత్రోవ. 2. ప్రక్కత్రోవ. —మృత్యువు - అకస్మాత్తుగాఁ గలిగిన చావు, గండము. —రూపము - వికారరూపము. —లాపము - మఱుఁగుమాట. —వర్గము-మోక్షము. —వాదము-దూఱు. —వారణము-మఱుఁగు. క్రి. అపవారించు. —వేళ-అసమయము. —శబ్దము-వ్యాకరణ విరుద్ధపదము. —సరము-తొలఁగుట. రూ. అపసారము. క్రి. అపసరిల్లు. —సర్జనము-1. విడుపు. 2. ఈవి. —సవ్యము-1. ప్రతికూలము. 2. కుడిభాగము. (వ్యు. సవ్యము)—స్మారము-1. దుఃఖాదులచే ఒడలుమఱచుట. 2. మతిభ్రమించు రోగము. రూ. అపస్మృతి.—స్వరము-క్రమముతప్పిన శబ్దము.—హము-చెఱచునది. —హరణము-1. మోసగించికొనిపోవుట. రూ. అపహృతి. క్రి. అపహరించు. —హర్త-అపహరించువాఁడు. క్రి. —హసించు.1. గేలిసేయు. 2. నవ్వు.—హాసము-గేలి. రూ. అపహాస్యము.—హృతము - అపహరింపఁబడినది. అపాంగము-1. కడకన్ను. 2. అంగహీనము. అపానము -(అప+అనము) 1. ముడ్డి. 2. ముడ్డిగాలి. అపార్థము - తప్పర్థము. అపేక్ష-(అప+ఈక్ష) కోరిక. క్రి. అపేక్షించు. అపేతము-తొలఁగినది. (వ్యు. ఉపేతము.) అపోహము-(అప+ఊహ) లేనిది ఊహించుట.

అపక-తె. చూ. అగప.

అపటి- స. తెర.

అపటువు- స. 1. బాలుఁడు. 2. తెవులుగొంటు.

అపత్యము- స. 1. బిడ్డ. 2. సంతానము.

అపథము- స. తప్పుత్రోవ.

అపథ్యము-స. తినరానిది, తగనిది.

అపదూఱు-తె. వట్టినింద.

అపనమ్మిక-తె. నమ్మికలేమి.

అపనెపము-తె. వట్టినెపము.

అపపాడి-తె. అన్యాయము.

అపరంజి-తె. మేలిబంగారము, కుందనము.

అపరము-స. 1. ఇతరము. 2. క్రిందిది. 3. మీఁదిది. సమా. —గిరి-అస్తాద్రి.—క్రియ-చచ్చినవారికై చేయు కర్మము. —దిక్కు-పడమటిదిక్కు. —నామము-రెండవపేరు. —పక్షము-బహుళపక్షము.—భాగము-వెనుకటిది. అపరాంగము-వీఁపుతట్టు దేహము. అపరాహ్ణము-పగలు మూఁడు భాగములు చేయఁగా కడపటిభాగము.

అపరాతిరి-తె. అర్ధరాత్రము.

అపరాలు-తె. 1.అపరకర్మము. 2.కాయధాన్యము.

అపర్ణ-స. పార్వతి. (వ్యు. తపస్సుచేయునపుడు ఆకులు సైతము తినకుండినది)

అపవిత్రము-స. పరిశుద్ధముకానిది.

అపశదుఁడు-స. నీచుఁడు.

అపాంపతి-స. సముద్రుఁడు. (వ్యు. జలములకు నాథుఁడు)

అపాత్రము-స. అయోగ్యము.

అపాయము-స. (అప+అయము) హాని.

అపారము-స. 1. ఈవలిదారి. 2. దరిలేనిది.

అపిధానము-స. మఱుఁగు. రూ. పిధానము.

అపినద్ధము-స. కట్టఁబడినది (వస్త్రము).

అపుడు-తె. (ఆ+ప్రొద్దు) ఆ సమయము.రూ. అప్పుడు, అప్డు.

అపురూపము-వి. (అపూర్వము) అరుదు.

అపూపము-స. పిండివంట. రూ. పూపము.

అపూర్వము-చూ. అపురూపము.

అపోసానము-వి. (ఆపోశనము) భోజనమప్పుడు అఱచేత నీళ్లుంచుకొని మంత్రపూర్వకముగా పుచ్చుకొనుట. రూ. ఆపొసనము.

అప్డు-చూ. అపుడు.

అప్ప-చూ. అప.

అప్పగించు-తె. ఒప్పగించు. కృ. అప్పగింత. చూ. అప్పన.

అప్పచి-తె. అపూపము. రూ. అప్పచ్చి.

అప్పటము-తె. కలపడములేనిది, అచ్చము.

అప్పటి-తె. మరల.

అప్పడము-వి. (అర్పటము) ఉద్దిపిండితోఁ జేసిన భక్ష్యము. రూ. అప్పళము.

అప్పతి-స. (అప్+పతి) వరుణుఁడు.

అప్పన-వి. (అర్పణము) 1. అప్పగించుట. 2. ఆజ్ఞ. 3. కప్పము. 4. కానుక. రూ. అప్పనము. క్రి. అప్పగించు.

అప్పము-తె. అవిపట్టిన దోసె. అట్టు.

అప్పళము-వి. 1. చూ. అప్పడము. 2. (ఆస్ఫాలనము) భుజములుతట్టుట. క్రి. అప్పళించు. 1. యత్నించు. 2. చఱచు, 3. కప్పు, 4. తుడుచు. 5. గ్రహించు. 6. ఆక్రమించు. 7. తాఁకు. కృ. అప్పళింత.

అప్పసము-తె. సతతము.

అప్పు-తె. ఋణము.

అప్పు-స. జలము.

అప్పుడు-చూ. అపుడు.

అప్రతిష్ఠ-స. అగౌరవము.

అప్రదక్షిణము-స. ఎడమప్రక్కగా చుట్టివచ్చుట. (వ్య. ప్రదక్షిణము)

అప్రమేయము-స. మితిచెప్పఁదగనిది.

అప్సరస-స. దేవవేశ్య. (వి. అచ్చర)

అబందర-తె. పాడైనది.

అబక-చూ. అగప.

అబద్ధము-స. 1. పొసఁగనిమాట. 2. అసత్యము.

అబల-స. స్త్రీ. (వ్య. బలములేనిది)

అబ్జము-స. 1. తామర. 2. ఉప్పు. 3. శంఖము. (వ్య. నీటఁబుట్టినది) 4. డు-చంద్రుఁడు. సమా. —జుఁడు-బ్రహ్మ. (ఇట్లే అబ్జయోని. మొ.) —బాంధవుఁడు - సూర్యుఁడు. (ఇట్లే అబ్జమిత్రుఁడు. మొ.) అబ్జారి - చంద్రుఁడు. (ఇట్లే అబ్జవైరి. మొ.)

అబ్దము-స. 1. సంవత్సరము. 2. అద్దము. 3. మేఘము. (వ్య. నీటినిచ్చునది)

అబ్ధి-స. సముద్రము. (వ్య. జలమును ధరించునది) సమా. —కఫము-నురుగు. —జ-లక్ష్మి. —పల్లవము-పగడము. — మేఖల-భూమి.

అబ్బ-తె. 1. తండ్రి. 2. దుఃఖాదులఁ దెలుపునది.

అబ్బరము-తె. అపారము.

అబ్బాటు-తె. 1. జనసమ్మర్దముచేఁ గలుగు కాఁక. 2. ఆకస్మికము. రూ. డబ్బాటు.

అబ్బాలాడు-తె. తడఁబడు.

అబ్బు-తె. దొరకు.

అబ్బుకొను-తె. కౌఁగిలించు.

అబ్బురము-వి. (అపూర్వము) ఆశ్చర్యము. రూ. అబ్రము. క్రి. అబ్బురపడు.

అబ్బెసము-వి. (అభ్యాసము) అలవాటు.

అబ్రహ్మణ్యము-స. చంపఁదగను అనెడిమాట.

అబ్రాశి-స. (అప్+రాశి) సముద్రము.

అభము శుభము-స. శుభాశుభములు.

అభయము-స. 1. భయములేమి. 2. శరణము.

అభవుఁడు-స. శివుఁడు. (వ్యు. పుట్టుకలేనివాఁడు)

అభావము-స. 1. లేమి. 2. చావు.

అభి-స. ఒక ఉపసర్గము. సమా. —ఖ్య-1. పేరు. 2. కీర్తి.—గతము-పొందఁబడినది. —గమనము-ఎదురుగాఁ బోవుట. —ఘాతము-దెబ్బ. —ఘారము-నెయ్యిపోయుట. క్రి. అభిఘరించు. —చారము-మారణకర్మము, పంపు. —జనము-1. పుట్టినచోటు. 2. కులము. 3. పొగడ్త. —జాతుఁడు-1. మంచి కులమునఁ బుట్టినవాఁడు. 2. చదువరి.—జిత్తు-1. పగలు పదునాల్గు గడియలపై రెండుగడియలకాలము. 2. ఒక నక్షత్రము. —జ్ఞానము-గుఱుతు. —జ్ఞుఁడు-తెలివిగలవాఁడు. —ధానము-పేరు. రూ. అభిధేయము. —నందనము-1. సంతోషించుట. 2. పొగడుట. క్రి. అభినందించు. —నయము-అంగన్యాసాదులచే అర్థము తెలియఁజేయుట. క్రి. అభినయించు.—నవము-క్రొత్తది. —నివేశము-చొరవ. —ప్రాయము-తలఁపు. —మంత్రణము-పిలుపు. క్రి. అభిమంత్రించు. —మతము-సమ్మతము. —మానము-1. గర్వము. 2. అజ్ఞానము. క్రి. అభిమానించు. —యోగము-1. పూనిక. 2. వ్యాజ్యము. —రతి-అపేక్ష. —రామము-మనోహరము. —రుచి-మిక్కిలియిష్టము. —లాష-కోరిక. రూ. అభిలాషము. క్రి. అభిలషించు. —వాదనము-గోత్రనామములుచెప్పి పాదములు సోక మ్రొక్కుట. —వృద్ధి-పెంపు. —షేకము-స్నానము. క్రి.అభిసరించు-ప్రియురాలొకరి నొకరుద్దేశించు. అభీప్సితము-కోరిక. (ఇష్టే అభీష్టము-మొ.)

అభ్యంగము } 1. తలంటు. 2. తైలము.
అభ్యంజనము }

అభ్యంతరము-1. అన్నిటికి నడిమిచోటు. 2. ఆలస్యము. 3. విఘ్నము. అభ్యాగతుఁడు-భోజనవేళకువచ్చిన అతిథి. అభ్యుత్థానము-ఎదురుగాపోవ లేచుట. అభ్యుదయము-1. శుభోదయము. 2. కాన్పు.

అభిని-హిం. నల్లమందు, అహిఫేనము.

అభీకుఁడు-స. నిర్భయుఁడు. రూ. అభీరుఁడు.

అభూతము-స. లేనిది.

అభేదము-స. భేదములేమి.

అభ్యాసము-స. చూ. అబ్బెసము. 1.అలవాటు. 2. సమీపము.

అభ్రకము-స. 1. గనులలోఁ బుట్టు తెల్లనిరేకు. 2. మేఘము.

అభ్రము-1. ఆకాశము. (వ్యు. చలింపనిది) సమా. అభ్రంకషము-ఆకాశమునొరయునది.—గము-పక్షి. —మణి-సూర్యుఁడు.

అభ్రమువు-స. తూర్పునసుండు ఐరావతమను దిగ్గజము యొక్క భార్య.

అమ-వి. (అంబ) 1. తల్లి. 2. [illegible]. రూ. అమ్మ.

అమంగళము-స. అశుభము.

అమడ-వి. (యమళ) జంట.

అమయు-తె. ఉపయుక్తమగు.

అమరము-తె. ఇనామునేల. రూ. అమరకము.

అమరావతి-స. ఇంద్రుని పట్టణము.

అమరిక-తె. 1. పొందిక. 2. అందము.

అమరు-తె. 1. ఒప్పు. 2. కుదురు. 3. సిద్ధమగు. (ప్రే. అమరుచు.)

అమరుఁడు-స. వేలుపు. (వ్యు. చావులేనివాఁడు)

అమర్త్యుఁడు-స. వేలుపు. (వ్యు. చూ. పై.)

అమర్షము-స. 1. కోపము. 2. ఓర్వలేమి. రూ. ఆమర్షము.

అమలము-స. 1. నిర్మలము. 2. అభ్రకము.

అమవస-వి. (అమావాస్య) చంద్రుఁడు ప్రకాశింపని దినము. రూ. అమాస.

అమాంతము-తె 1. చిల్లరబేరము. 2. అకస్మాత్తు.

అమాత్యుఁడు-స. మంత్రి.

అమానుషము-స. మనుష్యశక్తికి మిఱినది.

అమావాస్య-చూ. అమవస.

అమిణీ-హిం. వెట్టి, కూలిలేమి.

అమితము-స. విస్తారము.

అమూల్యము-స. వెలలేనిది.

అమృతము-స. 1. నీరు. 2. సుధ, పాలకడలి వెన్న. 3. పాలు. 4. మోక్షము. సమా. —కరుఁడు - చంద్రుఁడు. (ఇట్లే అమృతాంశువు. మొ.) అమృతాంధసుఁడు - వేలుపు.

అమేధ్యము-స. 1. మలము. 2. పవిత్రముకానిది.

అమేయము-స. అపరిమితము.

అమోఘము-స. వ్యర్థముకానిది.

అమ్మ-తె. 1. చూ. అవ్వ. 2. ఆశ్చర్యవాచకము.

అమ్మకచెల్ల-తె. ఔరా. రూ. అమ్మచెల్ల, అమ్మక్క.

అమ్మకము-తె. విక్రయము. రూ. అమ్ముడు.

అమ్మవారు-తె. 1. పూజ్యస్త్రీ. 2. స్త్రీదేవత. 3. స్ఫోటకము.

అమ్మాయి-తె. (అమ్మ+ఆయి) బాలిక. రూ. అమ్మి.

అమ్మిక-వి. (అంబిక) పార్వతి.

అమ్ము-తె. విక్రయించు. కృ. అమ్మకము, అమ్ముడు. వి. (అంబకము) బాణము. రూ. అంబు. సమా. అంపకాఁడు-1. విలుకాఁడు, 2. గుఱితప్పనివాఁడు. అంపకోల-బాణము. అంపగఱి-బాణము మొదటకట్టిన యీఁక. అంపఱ-(అమ్ము+పఱ) బాణసమూహము.

అమ్లము-స. 1. పులుపు. 2. పుల్లనిది.

అయ-తె. 1. తండ్రి. 2. పూజ్యుఁడు. రూ. అయ్య. సమా.—గారు-ఆచార్యుఁడు.

అయనము-స. 1. మార్గము. 2. సూర్యుని దక్షిణోత్తరదిశలపోక.

అయము-స. 1. శుభకర్మము, మేలుకలిగించుపని. 2. ఇనుము.

అయస్సు-స. ఇనుము. రూ. అయము. సమా. అయస్కాంతము-సూదంటురాయి. అయోమయము-1. ఇనుమది. 2. కఠినము. 3. ముందువెనుకలు తోఁపమి. అయోమార్గము-ఇనుపదారి. అయోముఖము-రోఁకలి.

అయారె-తె. ఔరా. రూ. అయ్యరె, అయ్యారె.

అయుతము-స. 1. పదివేలు. 2. కూడుకొననిది.

అయో-తె. దుఃఖపరితాపసూచకము. రూ. అయ్యో.

అయోగము-స. ఎడఁబాటు.

అయోనిజుఁడు-స. కడుపునఁబుట్టనివాఁడు. (స్త్రీ) అయోనిజ.

అయ్య-చూ. అయ.

అయ్యో-చూ. అయో.

అర-వి. (అర్ధము) సగము. రూ. అఱ.

అఱ-తె. 1. సగము. 2. కొఱఁత. 3. కీడు. 4. చింపి. సమా. —కాలు-పాదము క్రిందిభాగము. —గొఱ-న్యూనత, తక్కువ. —చట్ట-1. సగముచేతులుగల చొక్కాయి. 2. పొడవు తక్కువైన షరాయి. —జాతి-1. తక్కువజాతి. 2. దుష్టుఁడు. —పది-అయిదు. —పొఱఁడు-1. పొట్టివాఁడు. 2. అఱిగినమాను. క్రి. అఱపడు-

1. సగముచెల్లు. 2. సగమునిండు. 3. సగమగు. అరవిరి-సగమువిరిసినమొగ్గ. అరసంజ-ప్రదోషకాలము. అరసావు-మూర్ఛ.

అరక-తె. 1. మూఁపు. 2. సిద్ధపఱచినమడక. రూ. అఱక.

అఱక-చూ. పై.

అఱకము-తె. అజీర్ణము.

అరకాఁడు-తె. (అరక + కాఁడు) పైరుపెట్టువాఁడు.

అరగడము-తె. వృద్ధు.

అరగలి-తె. సందేహము. క్రి. అరగలిగొను.

అరగూఁడు-తె. గోడలో నేర్పఱచినగూఁడు.

అఱగొడ్డియము-తె. దుంపగము. రూ. అఱగొడ్డెము, అరగొట్టెము.

అఱచు-తె. 1. విలపించు. 2. శబ్దముచేయు. 3. రోదనము చేయు. కృ. అఱపు.

అరడ-తె. చిన్నతెప్ప.

అఱడా-తె. 1. జడకుచ్చుమీఁది పూస. 2. స్త్రీలు మెడను గట్టుకొను పెద్దపూస. 3. పల్లకివెదురు కొనను తగిలించు సింహతలాటపు తేకు. 4. స్తంభపుబోదిక్రిందిచక్రము. రూ. అఱడు.

అరణము-వి. (హరణము) సారె.

అరణి-స. రాఁచి నిప్పు పుట్టించు జమ్మికొయ్య.

అరణ్యము-స. అడవి. (వ్యు. మృగాదులుతిరుగునది)

అరత్ని-స. చిటికెనవ్రేలుచాఁచిన మూర.

అరదండ-తె. సంకెల, చేతిసంకెల. (కాలిసంకెల అడిదండ)

అరదము-వి. (రథము) తేరు.

అరదేసి-తె. సమీపదేశస్థుఁడు. (దూరదేశస్థుఁడు, పరదేశి.)

అరప-తె. మంచె.

అరపమీసలు-తె. నరసినమీసములు.

అఱపు-తె. 1. కూఁత. 2. రోదనము.

అరమర-తె. సందేహము. రూ. అఱమర, అరమరిక, అఱమరిక.

అరయిక-తె. అరయుట.

అరయు-తె. 1. విచారించు. 2. పరిశీలించు. 3. వెదకు. కృ. అరయిక.

అరవ-తె. పర్వతమార్గము, కనుమ.

అఱవ-తె. 1. సాధువుకానియావు. (రూ. నఱవ) 2. దుష్టుఁడు. 3. దుష్టము. 4. ద్రవిడదేశస్థుఁడు. (స్త్రీ. అఱవత.) 5. ద్రవిడభాష.

అరవడి-తె. ఋణము.

అఱవము-తె. ద్రవిడభాష. రూ. అఱవ.

అరవరలు-తె. 1. ఎండినవి. 2. చిన్న తునుకలు. రూ. అఱవఱలు.

అరవరి-తె. అప్పులకాఁపు.

అరవాయి-తె. 1. అధైర్యము. 2. సంకోచము. 3. కొఱఁత.

అరవిందము-స. తామర.

అరవుడు-తె. తునుక.

అరసము-వి. (హర్షము) సంతోషము. రూ. అరుసము.

అరాతి-స. శత్రువు. (వ్యు. సంహరించువాఁడు) రూ. ఆరాతి.

అరాళము-స. వంకరైనది.

అరి-తె. 1. కప్పము. క్రి. అరివెట్టు. 2. వింటినారి. క్రి. అరివోయు. సమా.—కాఁపు-కప్పము కట్టువాఁడు. స. శత్రువు. (అరిషడ్వర్గము. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు.)

అరిందముఁడు-స. శత్రువుల నణఁచువాఁడు.

అరికట్టు-తె. 1. అడ్డగించు. 2. చుట్టు.

అరిగ-తె. కేడెము. రూ. అరిగె.

అరిగాఁపు-తె. 1. కట్టుకావలి. 2. కనిపెట్టుకొనిపడి యుండుట.

అరిగొను-తె. అడ్డపడు.

అరిఁగోలు-తె. తెప్ప.

అరిణ-తె. తాటిదోనె.

అరితి-తె. ప్రేమ.

అరిత్రము-స. 1. చుక్కాని. 2. పడవనడపు తెడ్డు. (వ్యు. పడవను నడపునది)

అరిదళము-వి. (హరితాళము) పసుపురంగుగల ఖనిజము. రూ. హరిదళము.

అరిది-తె. 1. అశక్యము. 2. దుర్లభము.

అఱిముఱి-తె. 1. కలఁత. 2. తొందరపాటు.

అఱిమెన-తె. పెండ్లిలోనుంచు బచ్చెనకుండలు.

అరిష్టము-స. 1. కాకి. 2. శుభము. 3. కీడు. 4. దేశోపద్రవము. 5. మృతిసూచకము.

అఱిసె-తె. అతిరసము.

అఱు-తె. 1. నశించు. 2. క్షీణించు. 3. అఱ్ఱు. 4. కంఠము. 5. సమీపము. సమా. అఱుఁదెవులు-క్షయరోగము. క్రి. అఱుక్రమ్ము-చుట్టుకొను.

అరుంధతి-స. వసిష్ఠునిభార్య. (వి. ఆరంజోతి)

అఱుకువ-తె. అజీర్ణము.

అరుఁగు-తె. తిన్నె.

అరుగు-తె. పోవు.

అఱుగు-తె. 1. జీర్ణించు. 2. క్షయించు. రూ. అఱువు.

అఱుగుళ్లు-తె. శిథిలము. రూ. అఱువుళ్లు.

అరుచి-తె. మాంసము. రూ. ఎఱచి. స. రుచిలేమి.

అరుణము-స. 1. ఎఱుపు. (రూ. అరుణిమ) 2. సంజయెఱుపు. డు-1. అనూరుఁడు. 2. సూర్యుఁడు. సమా. అరుణోదయము-వేకువజాము.

అరుదు-తె. 1. ఆశ్చర్యము. 2. క్రొత్త.

అరుదెంచు-తె. 1. వచ్చు. 2. పోవు. రూ. అరుగుదెంచు.

అఱుపు-తె. దక్కించు.

అఱుము-తె. 1. ఆక్రమించు. 2. ప్రతీక్షించు. 3. ఆక్రమణము.

అరులు-తె. ప్రేమ, వాత్సల్యము.

అరులుమరులు-తె. ముదిమిచే తెలివి చెదరియుండుట.

అఱువండ్రు-తె. అఱువదిమంది. (ఆఱు+పదుండ్రు)

అఱువది-తె. (ఆఱు+పది) ఆఱుపదులు.

అరువు-తె. 1. ధాన్యాదులయప్పు. 2. తెలివి. సమా. అరువుఁబాట - రొక్కపు జామీను.

అఱువుళ్లు-చూ. అఱుగుళ్లు.

అరుసము-చూ. అరసము.

అరుసు-వి. (రాజు) ప్రభువు.

అరుహుఁడు-వి. (అర్హుఁడు) తగినవాఁడు.

అరె-తె. ప్రశంసార్థకము. రూ. అరే.

అరోచకము-స. 1. రుచింపమి. 2. ప్రకాశింపమి 3. అసహ్యము.

అర్కము-స. జిల్లేడు. డు - సూర్యుఁడు. (వ్యు పూజింపఁబడువాఁడు) సమా. —జుఁడు. 1 శని. 2. యముఁడు. —బంధువు-బుద్ధుఁడు.

అర్కలి-తె. రొండి.

అర్గళము-స. 1. తలుపుగడియ. 2. ప్రతిబంధము

అర్ఘము-స. 1. వెల. 2. పూజించుట. రూ. అర్ఘ

అర్ఘ్యము-స. 1. పూజకుఁదగినది. 2. వెలగల

అర్చ-స. *1*. పూజ. (రూ. అర్చన, అర్చనము) *2*. ప్రతిమ. క్రి. అర్చించు.

అర్చకుఁడు-స. పూజారి.

అర్చి-స. *1*. మంట. *2*. వెలుఁగు. రూ. అర్చిస్సు.

అర్జునకుఁడు-స. *1*. బోయ. *2*. తెల్లనివాఁడు.

అర్జునము-స. *1*. బంగారు. *2*. నెమలి. *3*. తెలుపు. *4*. నలుపు.

అర్జుని-స. *1*. ఆవు. *2*. బాణాసురుని కూఁతురు.

అర్జునుఁడు- *1*. కార్తవీర్యుఁడు. *2*. పాండవ మధ్యముఁడు.

అర్ణము-స. *1*. నీరు. *2*. ప్రవాహము. సమా.

అర్ణవము, అర్ణోరాశి } సముద్రము.

అర్తి-స. *1*. దుఃఖము. *2*. పీడ. రూ. ఆర్తి.

అర్థన-స. యాచన.

అర్థము-స. *1*. శబ్దవివరణము. *2*. కారణము. *3*. బంగారు. *4*. ధనము. *5*. ప్రయోజనము. *6*. వస్తువు. సమా.—శాస్త్రము - *1*. నీతిశాస్త్రము. *2*. ధనమునుగూర్చిన శాస్త్రము.

అర్థి-స. *1*. ధనవంతుఁడు. *2*. యాచకుఁడు. క్రి. అర్థించు.

అర్దన-స. *1*. వేఁడుకొనుట. *2*. బాధపెట్టుట. రూ. అర్దనము.

అర్ధము-స. *1*. తునుక. *2*. సగము. సమా. — చంద్రము - *1*. సగముచంద్రుని రూపుగల బాణము. *2*. మెడవట్టిత్రోయుట కేర్పఱచిన చేయి. *3*. మెడవట్టిత్రోయుట.—రథుఁడు-ఒక్క విలుకానితో పోరలేనివాఁడు. —హారము-అఱువదినాలుగుపేటలు గల హారము. అర్ధోరుకము-చల్లడము.

అర్పటము-స. అప్పడము.

అర్పణము-స. ఒప్పగించుట. (వి. అప్పనము) క్రి. అర్పించు.

అర్బుదము-స. వేయికోట్లు.

అర్భకుఁడు-స. బాలుఁడు. *2*. మూర్ఖుఁడు.

అర్యముఁడు-స. సూర్యుఁడు.

అఱ్ఱు-తె. *1*. అఱ. *2*. గది. *3*. ప్రయాసమున పాలు పిదుకఁదగిన యావు, నఱ్ఱు.

అఱ్ఱుము-తె. ముండ్లమోపు.

అఱ్ఱాఁక-తె. (అఁక+అఁక) *1*. మిక్కిలి అడ్డంకి. *2*. మఱుఁగు.

అఱ్ఱాఁకలి-తె. (అఁకలి+అఁకలి) మిక్కిలి ఆఁకలి.

అఱ్ఱాడు-తె. (ఆడు+ఆడు) అటు నిటు తిరుగు, విహరించు.

అఱ్ఱావు-తె. అడవియావు.

అఱ్ఱియము-తె. అజీర్ణము. రూ. అఱ్ఱెము.

అఱ్ఱు-చూ. అఱు. *1*. కంఠము. *2*. సమీపము.

అర్హము-స. తగినది.

అల-తె. *1*. తరంగము. *2*. ప్రసిద్ధిని దెలుపునది.

అలంకారము-స. *1*. సింగారము. *2*. ఆభరణము. *3*. ఉపమాద్యలంకారము. రూ. అలంకృతి, అలంక్రియ. క్రి. అలంకరించు. అలంకరిష్ణువు-అలంకార ప్రియుఁడు. అలంకర్త-అలంకరించువాఁడు.

అలంగము-తె. కోటగోడకు ఆనికగా వేసిన కొఱడు, వప్రము.

అలంఘనీయము-స. దాఁటసాధ్యము కానిది. రూ. అలంఘ్యము.

అలఁగు-తె. *1*. వెనుదీయు. *2*. శ్రమపడు. *3*. దుఃఖించు. ప్రే. అలఁచు.

అలఁత-తె. *1*. అలయుట, శ్రమము. *2*. బాధ,

అలఁతి-తె. *1*. అల్పము. *2*. తేలిక.

అలఁదు-తె. పూయు.

అలఁదురు-తె. *1*. దుఃఖించు. *2*. కృ. దుఃఖము.

అలక-తె. సూక్ష్మము. రూ. అలకన, నలక.

అలక-స. *1*. నెఱికురులు. *2*. ముంగురులు. (రూ. అలకము) *3*. కుబేరుని పట్టణము.

అలకి-వి. (అలుకము) కుండ.

అలకువ-తె. *1*. ఆయాసము. *2*. విముఖత్వము. *3*. సిగ్గు.

అలక్తము-స. *1*. లక్క. *2*. లత్తుక.

అలక్ష్యము-స. *1*. గుఱిపెట్టఁగానిది. *2*. చులకన.

అలఘుఁడు-స. గొప్పవాఁడు.

అలచందలు-వి. (అలసాంద్రములు) రాజమాషములు. రూ. అలసందలు.

అలజడి-తె. *1*. ఆపద. *2*. చింత.

అలపు-తె. *1*. అలయించు. *2*. శ్రమము.

అలబలము-తె. కలకలము.

అలమరు-తె. చింతించు. కృ. అలమట.

అలమార్చు-తె. కాడికి ఎడ్లనుమార్చు.

అలము-తె. *1*. ఆక్రమించు. *2*. వ్యాపించు. *3*. తోము. *4*. కౌఁగిలించు. కృ. *5*. ఆక్రమణము. *6*. కలుపుగడ్డి.

అలముకొను-తె. *1*. కవియు. *2*. పైకొను.

అలయు-తె. *1*. శ్రమపడు. *2*. విసుగు. *3*. ఆలసించు. కృ. అలయిక, అలపు, అలసట, అలఁత,

అలరు-తె. *1*. వికసించు. *2*. సంతోషించు. కృ. *3*. పుష్పము. *4*. సంతసము. *5*. మనోహరము.; సమా.—పాయము-బాల్యము. —బోఁడి-పూవువలె ఇంపైన ఆఁడుది. —విలుకాఁడు- మన్మథుఁడు. రూ. అలరువిలుతుఁడు, —విల్తుఁడు.

అలవ-తె. కంచె.

అలవడు-తె. *1*. అభ్యాసమగు. *2*. సిద్ధించు. *3*. స్వాధీనమగు. *4*. పరిచయమగు. ప్రే. అలవరించు, అల్వరించు, అలవఱచు. కృ. అలవాటు.

అలవాటు-తె. *1*. అభ్యాసము. *2*. వాడుక.

అలవి-తె. *1*. శక్యము. *2*. కొలఁది.

అలవు-తె. *1*. పరిశ్రమము. *2*. బలము. రూ. లావు.

అలవోక-తె. *1*. లీల. *2*. స్వేచ్ఛ. *3*. అశ్రద్ధ.

అలస-తె. అల్లుడు తీఁగ.

అలసట-తె. అలఁత.

అలసము-స. మందమైనది. డు-సోమరి.

అలసాంద్రము-స. అలసంద.

అలసు-తె. తిరస్కారము.

అలాతము-స. *1*. కొఱవి. *2*. బొగ్గు. రూ. ఆలాతము.

అలాబువు-స. సొరకాయ.

అలి-స. తుమ్మెద. రూ. అళి. సమా.—వేణి-తుమ్మెదవంటి వెండ్రుకలు గల స్త్రీ.

అలికము-స. నొసలు.

అలికిడి-తె. చప్పుడు.

అలిపిరి-తె. టక్కుచిక్కునవాఁడు.

అలుఁగు-తె. *1*. చెఱువుతూము. *2*. కత్తి. *3*. బాణము. రూ. అల్గు.

అలుక-తె. *1*. కోపము. *2*. ద్రోహచింత. రూ. అలుకువ.

అలుకు-తె. *1*. భయపడు. *2*. ఇల్లు నీటితోశుభ్రముచేయు. కృ. భయము. సమా. —ఁజుట్టి-అలికెడుగుడ్డ.

అలుకుడు-తె. ధ్వని.

అలుగు-తె. *1*. కోపించు. *2*. ద్రోహముతలఁచు. రూ. అల్గు. కృ. అలుక, అలుకువ.

అలుగులము-తె. *1*. నలఁగుడు. *2*. బాధ.

అలుచు-వి. (అలసుఁడు) సోమరి.

అల్పము-స. సూక్ష్మము, చిన్నది. డు-నీచుఁడు. సమా. అల్పాచమానము-మూత్రము విడుచుట.

అల్ల-తె. *1.* ఆ. *2.* ప్రసిద్ధిని దెలుపునది. *3.* మందము. రూ. అల, ఒల్ల.

అల్లకము-తె. *1.* అల్లుట. *2.* గోచి.

అల్లకల్లోలము-తె. తాఱుమాఱు.

అల్లన-తె. మెల్లన.

అల్లము-వి. (ఆర్ద్రికము) పచ్చిసొంటి.

అల్లలాడు-తె. *1.* కదలు. *2.* శ్రమపడు. రూ. అల్లలనాడు,' అల్లాడు. కృ. అల్లాటము.

అల్లారుముద్దు-తె. మిక్కిలి ప్రియము.

అల్లి-తె. తామరజాతిలోచేరిన ఒక తీఁగ.

అల్లిక-తె. అల్లుట.

అల్లిబిల్లి-తె. *1.* ఒద్దిక. *2.* పెనఁకువ. రూ. అల్లిబిల్లిక.

అల్లియ-తె. వింటినారి. రూ. అల్లె.

అల్లియము-తె. క్రొత్తపెండ్లికొడుకునకుఁ బెట్టెడి అత్తగారింటివిందు. రూ. అల్లెము.

అల్లు-తె. *1.* అల్లికవేయు. *2.* తీఁగప్రాఁకు. కృ. అల్లుడు, అల్లిక.

అల్లుఁడు-తె. *1.* కూఁతుమగఁడు. *2.* తోఁబుట్టుకొడుకు. రూ. అల్లువాఁడు. సమా.—కొమాళ్లు. ప్రభువుతో సమముగభుజించి అంగరక్షకులుగ నుండువారు.

అవ-తె. *1.* తల్లితల్లి. *2.* తండ్రితల్లి. *3.* అమ్మ. *4.* పూజ్యురాలు. రూ. అవ్వ.

అవ-స. విరుద్ధము, క్రింది అనునర్థమునిచ్చు ఉపసర్గము. సమా.—కటము - విరుద్ధము. —కరము - పెంటకుప్ప.—కర్షణము - వెడలించుట.—కుంఠము-ముసుఁగు. రూ. అవగుంఠనము.—క్రయము-*1.* బాడుగ. *2.* వెల.—క్షేపము-తప్పుపెట్టి త్రోయుట. — గండము-*1.* కుఱుపు. *2.* బొటిమ.—గణన-తిరస్కారము.—గతము - *1.* తెలియఁబడినది. *2.* పొందఁబడినది.—గాహనము - *1.* ఆకళింత. *2.* మునుక. క్రి. అవగాహించు.—గుణము-దుర్గుణము.—జ్ఞ - తిరస్కారము. — తరణము- దిగుట. క్రి. అవతరించు-*1.* దిగు, *2.* పుట్టు.—తారము - *1.* దిగుట. *2.* జన్మము. *3.* నీళ్లరేవు.—తారిక-పీఠిక. — దంశము-ఊరుఁగాయ.—దారణము- చీల్చుట.—దాహము-*1.* కాలుట. *2.* నీటివట్టివేరు.—దీర్ణము-చీల్పఁబడినది.—ధారణము - నిశ్చయము.—ధూతము-త్రోసివేయఁబడినది. డు - *1.* దిగంబర సన్న్యాసి. *2.*కదలింపఁబడినవాఁడు. రూ. అవధూత.—నతము - వంగినది.—పథ్యము-అపథ్యము.—పాతము - ఏనుఁగును పట్టుటకై త్రవ్విన పల్లము, ఒగ్గము.—బోధము - *1.* మేలుకొలుపుట, *2.*బోధించుట.—బోధకుఁడు. *1.* మేలుకొలుపువాఁడు. *2.* బోధకుఁడు. *3.* సూర్యుఁడు.—మతి - అవమానము.—మర్దము-పరులచేఁగలుగు రాయిడి,—మానము - *1.* అగౌరవము. *2.* తిరస్కారము.—రోధము-*1.* అంతఃపురము. *2.* అడ్డగింత.—రోహణము-*1.* దిగుట. *2.* ఊడ. రూ. అవరోహము.—లంబనము-*1.*పట్టు.*2.*శరణము.*3.*ఆశ్రయము.—లక్షణము-దుర్లక్షణము. —లగ్నము-*1.* నడుము. *2.*తగులుపడినది.—లుంఠనము-పొరలుట.—లేపము-*1.*పూఁత. *2.* గర్వము. —లోకనము - చూపు.—శకునము - దుశ్శకునము.—శిష్టము-మిగిలినది.—ష్టంభము-*1.*ఆధారము.*2.*గర్వము.*3.*ప్రయత్నము.—సరము-*1.*సమయము.*2.*అవకాశము. *3.*అగత్యము.*4.* తొందర.అవాంతరము-*1.* లోపలిది. *2.* మధ్యవచ్చినది,*3.*ఆటంకము,అపద. అవాప్తి-ప్రాప్తి.

అవంతి-స. *1*. అక్క. *2*. ఉజ్జయిని.

అవగడము-వి. (అవకటము) *1*. ఆగడము. *2*. అకార్యము.

అవఘళము-తె. *1*. వ్యాపనము. *2*. హెచ్చు. *3*. సామర్థ్యము.-డు-వ్యాపకుఁడు. క్రి. అవఘళించు.

అవటము-స. *1*. పల్లము. *2*. బొఱియ. *3*. బావి.

అవటీటము-స. ముక్కుచప్పట.

అవటువు-స. *1*. ముచ్చిలిగుంట. *2*. పల్లము. *3*. బావి.

అవడు-చూ. అగడు.

అవతంసము-స. *1*. పూఁగమ్మ. *2*. సిగబంతి. రూ. వతంసము.

అవతల-తె. *1*. వెనుక. *2*. ఆవలి ప్రదేశము.

అవదగాకి-తె. దుష్టుఁడు.

అవదాతము-స. *1*. తెల్లన. *2*. పచ్చన. *3*. శ్రేష్ఠము. *4*. స్వచ్ఛము.

అవద్యము-స. *1*. అధమము. *2*. చెఱుపు.

అవధరించు-స. *1*. విను. *1*. ధరించు. *3*. ఎచ్చరికపడు.

అవధానము-స. *1*. హెచ్చరిక. *2*. కవితావినోదము. రూ. వధానము.

అవధారు-తె. వినుము.

అవధి-స. *1*. మేర. *2*. వేళ. *3*. ఎడము.

అవనము-స. కాపాడుట.

అవనాయము-వి. (అపన్యాయము) న్యాయము లేనిది.

అవని-స. భూమి.

అవభృథము-స. యజ్ఞాంతస్నానము.

అవయవము-స. అంగము.

అవరము-స. వెనుకటిది. సమా. అవరజుఁడు-తమ్ముఁడు.

అవల-తె. (ఆ+వలను) పిమ్మట. రూ. అవ్వల, ఆవల, ఔల.

అవలీల-స. సులభము.

అవశ్యము-స. *1*. నిశ్చయము. *2*. అగత్యము. *3*. అక్కఱ. *4*. వశముకానిది.

అవసడి-తె. అపవాదము.

అవసథము-స. ఇల్లు.

అవసానము-స. ముగియుక, చావు.

అవస్థ-స. *1*. కాలానుసారస్థితి. *2*. సంకటము.

అవాంత్రము-తె. *1*. ఆపద. *2*. అడ్డు.

అవాచి-స. దక్షిణదిక్కు.

అవాచ్యము-స. *1*. చెప్పరానిది. *2*. బూతు.

అవాయి-తె. ఆకాశబాణము.

అవారి-తె. అపారము. రూ. అవ్వారి.

అవిటి-తె. *1*. అంగహీనుఁడు. *2*. గ్రుడ్డి.

అవితథము-స. యథార్థము.

అవిది-వి. (అవిధి) *1*. సంకటము. *2*. దుఃఖము.

అవిద్య-స. *1*. అజ్ఞానము. *2*. మాయ.

అవిధి-స. *1*. సంకటము. *2*. దుఃఖము. *3* అక్రమము.

అవిధేయుఁడు } స. అణఁకువలేనివాఁడు.
అవినీతుఁడు }

అవియు-తె. *1*. పగులు. *2*. చెడు.

అవిరళము-స. దట్టమైనది.

అవిరి-తె. *1*. నేత్రరోగము. *2*. నీలిచెట్టు.

అవిలంబము-స. త్వర.

అవివేకము-స. అజ్ఞానము.

అవిసి, అవిసియ, అవిసె.-చూ. అగిసి.

అవు-చూ. అగు.

అవ్యక్తము-స. స్పష్టముకానిది. డు- *1.* శివుఁడు. *2.* విష్ణువు. *3.* మూర్ఖుఁడు. సమా. అవ్యక్త గణితము- బీజగణితము.

అవ్యయము-స. *1.* శుభము. *2.* వ్యయములేనిది. *3.* లింగ వచన విభక్తులు లేని పదము. డు- విష్ణువు.

అవ్యాజము-స. కపటములేనిది.

అవ్వ-చూ. అవ.

అవ్వల-చూ. అవల.

అవ్వారి-చూ. అవారి.

అశనము-స. భోజనము.

అశని-స. *1.* వజ్రాయుధము. *2.* మెఱపు. *3.* పిడుగు. (వ్యు. లోకమును భుజించునది)

అశరీరవాణి-స. శరీరములేక వినవచ్చు వాక్కు, ఆకాశవాణి.

అశీతి-స. ఎనుబది.

అశుభము-స. కీడు.

అశేషము-స. అంతయు.

అశోకము-స. *1.* కంకేళివృక్షము. *2.* పాదరసము. డు- భీముని సారథి.

అశౌచము-స. *1.* ముటికి. *2.* మైల. *3.* పురుడు.

అశ్మంతము-స. *1.* ప్రొయ్యి. *2.* చావు.

అశ్మము-స. ఱాయి. సమా.—కుట్టకుఁడు- ఱాతి పనివాఁడు.—గర్భము - మరకతము.—జము- సిలాజిత్తు.—పుష్పము-ఱాతిపువ్వు.—సారము- ఇనుము.

అశ్రద్ధ-స. శ్రద్ధలేమి.

అశ్రము-స. కన్నీరు. రూ. అశ్రువు, అస్రము.

అశ్రాంతము-స. *1.* ఎల్లప్పుడు. *2.* ఎడతెగనిది. *3.* అలయనిది.

అశ్లీలము-స. *1.* బూతు. *2.* శబ్దదోషము.

అశ్వము-స. గుఱ్ఱము. సమా.—తరము-కంచర గాడిద.—మేధము - గుఱ్ఱమును చంపిచేయు యాగము.—యుక్కు-అశ్విని.

అశ్విని-స. ఇరువదియేడింట మొదటి నక్షత్రము. సమా. అశ్వినీసుతులు-దేవతల వైద్యులు. రూ. అశ్వులు.

అష్టకము-స. ఎనిమిది, అట్టము. రూ. అష్టము.

అష్టమము-స. ఎనిమిదవది.

అష్టమి-స. ఎనిమిదవ తిథి.

అష్టమూర్తి-స. శివుఁడు. (అష్టాత్ముఁడు అనియు) (వ్యు.పంచభూతములు, సూర్యచంద్రులు, యష్ట అను ఎనిమిది రూపములు కలవాఁడు.)

అష్టాదశము-స. పదునెనిమిదవది.

అష్టాపదము-స. బంగారు. (వ్యు. ఎనిమిది యుత్పత్తిస్థానములుకలది)

అష్టావధానము-స. చదరంగము, కవిత్వము, వ్రాయుట, చదువుట, గణితము, సంగీతము, వ్యస్తాక్షరి, సంభాషణము అను ఎనిమిదంశముల నేకకాలమున గమనించుట. అట్లు చేయు వాఁడు అష్టావధాని.

అసద్ధ-వి. (అశ్రద్ధ) శ్రద్ధలేమి.

అసతి-స. ఱంకుటాలు.

అసత్యము-స. బొంకు.

అసత్తు-స. *1.* సత్తువలేనిది. *2.* చెడ్డది.

అసదు-వి. (అసత్) *1.* అల్పము. *2.* సన్ననిది. *3.* అల్పుఁడు.

అసభ్యము-స. సభకు యోగ్యముకానిది.

అసమశరుఁడు-స. మన్మథుఁడు.

అసమీక్ష్యకారి-స. చక్కఁగా యోచింపక పనిచేయు వాఁడు.

అసము-తె. *1.* దర్పము. *2.* చనవు. *3.* ఎ. (యశము) కీర్తి.

అసరసంజ-వి. (అసురసంధ్య) సాయంకాలము.

అసరు-తె. పసరు.

అసలారు-తె. 1. అతిశయించు. 2. ఒప్పు. రూ. ఎసలారు.

అసలు-తె. 1. బురద. 2. మూలధనము. సమా. —(బుట్టువు- తామర, పంకజము.

అసహాయశూరుఁడు-స.ఒంటరియైనిలిచిపోరువాఁడు.

అసహ్యము-స.సహింపఁగూడనిది.క్రి.అసహ్యించు.

అసాదు-హిం. బళీ. రూ. హసాదు.

అసాధ్యము-స. సాధ్యముకానిది.

అసి-తె. అల్పము.

అసి-స. కత్తి. సమా.—ధార- కత్తివాదర.—ధారావ్రతము - కత్తివాదరమీఁదనడచుటవంటి కఠిన నియమవ్రతము.—ధావకుఁడు - కత్తులు సానపెట్టువాఁడు.—పత్రము- 1. కత్తియొఱ. 2. చెఱకు.—పుత్రి-చూఱకత్తి.

అసితము-స. 1. నలుపు. 2. నల్లనిది. డు-1. నల్లనివాఁడు. 2. శనైశ్చరుఁడు.

అసిమి-తె.సంచి. సమా.—గొల్లెన-చిన్నగుడారము.

అసియాడు-తె. చలించు.

అసివాఱు-తె. వయ్యాళి.

అసివోవు-తె. 1. తప్పిపోవు. 2. కొంచెముతగిలి తప్పిపోవు.

అసుర-స. 1. రాత్రి. 2. రాక్షసుఁడు. (రూ. అసురుఁడు) సమా.—సంధ్య - రాక్షసవేళ, సాయంకాలము.

అసురము-స. 1. ఏనుఁగు. 2. కాకోలము. డు-రాక్షసుఁడు.

అసురుసురు-తె. శ్రమమందగు ధ్వని.

అసువులు-స. ప్రాణములు.

అసూయ-స. ఓర్వలేమి.

అసూర్యంపశ్య-స. ఎండకన్నెఱుఁగనిది.

అసోగము-వి. అశోకము.

అస్ఖలితము-స. 1. చలింపనిది. 2. చెడనిది.

అస్తమయము-స. 1. సూర్యుఁడు క్రుంకుట. 2. నాశము. క్రి. అస్తమించు.

అస్తము-స. ప్రొద్దుక్రుంకుగట్టు. (అస్తగిరి, అస్తాద్రిఅనియు)

అస్తరు-హిం. గుడ్డతోచేర్చికుట్టిన తుండుగుడ్డ.

అస్తోకము-స. అల్పముకానిది, గొప్పది.

అస్త్రము-స. 1. మంత్రపూర్వకముగా విడుచు బాణము. 2. విల్లు. 3. కత్తి.

అస్థి-స. ఎముక. సమా.—పంజరము-కంకాళము.

అస్థిరము-స. అశాశ్వతము.

అస్మదీయము-స. నా సంబంధమైనది.

అస్రము-స. 1. కన్నీరు. (రూ.అశ్రము,అశ్రువు) 2. నెత్తురు. సమా. అస్రప-1. జలగ. 2. పిశాచము. అస్రపుఁడు-రాక్షసుఁడు.

అహంకారము-స. గర్వము. రూ. అహంకృతి, అహంక్రియ, అహంభావము.క్రి.అహంకరించు.

అహతము-స, చలువచేయని క్రొత్త వస్త్రము, కోరికము.

అహమహమిక-స. యుద్ధాదులందుకలుగు పరస్పరాహంకారము.

అహము-స.1.దినము.2.పగలు.(రూ-అహస్సు.) 3.గర్వము. సమా. అహమ్మతి-అజ్ఞానము.అహరహము-ప్రతిదినము. అహర్పతి-సూర్యుఁడు. రూ. అహఃపతి, అహస్కరుఁడు. అహర్ముఖము-ప్రాతఃకాలము.అహోరాత్రము-రేపగలు.

అహహ-తె. ఔరా. రూ. ఆహాహా, అహో, అహో.

అహార్యము-స. పర్వతము. (వ్యు. హరింప నశక్యమైనది.)

అహి-స. *1.* పాము. *2.* వృత్రాసురుఁడు. సమా.—చ్ఛత్రము- పుట్టగొడుగు.—తుండికుఁడు- పాములవాఁడు.—ద్విషము- *1.* నెమలి. *2.* ముంగిస. డు- గరుడుఁడు.—పతి- శేషుఁడు.—ఫేనము- *1.* అభిని. *2.* విషము.—భయము- రాజునకు దాయాదులవలని భయము.—భుక్కు- గరుడుఁడు.

అహింస-స. హింసచేయమి.

అహితము-స. *1.* విరోధము. *2.* హితముకానిది. డు- విరోధి.

అహిర్బుధ్న్యుఁడు-స. శివుఁడు. (వ్యు. పాముల నగలచే ఎఱుఁగఁదగినవాఁడు.)

అహోపురుషిక-స. వీరాలాపము. రూ. ఆహోపురుషిక.

అళి-స. *1.* తుమ్మెద. *2.* తేలు. రూ. అలి.

అళిని-స. ఆఁడుతుమ్మెద.

అళీకము-స. *1.* అప్రియము. *2.* బొంకు. *3.* నొసలు. రూ. అళికము.

అళుకు-తె. *1.* భయపడు. *2.* కృ. భయము. రూ. అలుకు.

## ఆ

ఆ-తె. *1.* మొదట చెప్పినదానిని, *2.* ఉద్దేశించిన దానిని తెలుపునది.
స. వఱకు అనునర్థమునిచ్చు ఉపసర్గ. ఆకంఠము- కంఠమువఱకు. ఆచంద్రతారకము- చంద్రుఁడు నక్షత్రము లుండువఱకు. ఆపాదమస్తకము- నిలువెల్ల. ఆమూలము- మూలముట్టుగ. ఆమూలాగ్రము- పూర్తిగా. ఆసేతుశీతాచలము- సేతువునుండి హిమాద్రివఱకు. (ఇట్లే ఆబాలవృద్ధము, ఆమరణము. మొ.)

ఆఁ-తె. *1.* అదలించుటను, *2.* అంగీకారమును, *3.* వ్యతిరేకమును తెలుపును.

ఆంగికము-స. అంగములతోఁజేయు అభినయము.

ఆంగిరసుఁడు-స. దేవగురువు. రూ. అంగీరసుఁడు.

ఆంగీరస-స. అఱువదింట ఆఱవ సంవత్సరము.

ఆంజనేయుఁడు-స. హనుమంతుఁడు.

ఆంతర్యము-స. *1.* అభిప్రాయము. *2.* హృదయము. *3.* మర్మము, గుట్టు.

ఆంత్రము-స. చూ. అంత్రము.

ఆందోళనము-స. ఊఁగుట. క్రి. ఆందోళించు.

ఆందోళము-స. పల్లకి. రూ. ఆందోళిక.

ఆంధ్యము-స. *1.* గ్రుడ్డితనము. *2.* ఆటంకము.

ఆంధ్రము-స. చూ. అంధ్రము.

ఆఁక-తె. అడ్డగింత. సమా.—త్రాడు- రవ్వపుఁద్రాడు.

ఆఁకట్టు-తె. (ఆఁక+కట్టు) అడ్డగించు.

ఆఁకరము-వి. (ఆగ్రహము) కోపము.

ఆఁకలి-తె. క్షుత్తు. క్రి. ఆఁకొను, ఆఁకలిగొను.

ఆఁగు-తె. *1.* అడ్డపడు. *2.* అణఁగు. *3.* కాపాడు. *4.* నిలువు. (ప్రే. ఆఁచు, ఆఁపు.) కృ. ఆఁప.

ఆఁచికొను-తె. అపహరించు. రూ. నాఁచికొను.

ఆఁడ-తె. *1.* చాలు. *2.* తావు. *3.* ఆఁడుతనము.

ఆఁటది-తె. ఇంతి. రూ. ఆఁడది, ఆఁడుది.

ఆఁడంగి-తె. స్త్రీస్వభావముగలవాఁడు.

ఆఁడది- చూ. ఆఁటది,

ఆఁడి-తె. కల అను అర్థమందు వచ్చు స్త్రీప్రత్యయము. (వగలాఁడి. మొ.)

ఆఁడు-తె. *1.* కల అను అర్థమందువచ్చు పుంప్రత్యయము. (వగలాఁడు. మొ.) *2.* ఆఁడుతనము. సమా.—కూఁతురు- ఆఁడుది.—తోడు- తోఁబుట్టువు. ఆఁడుది-చూ. ఆఁటది.—పడుచు- కూఁతురు.—పాప- కన్యక. *2.* రాజదాసి.—బిడ్డ- *1.* స్త్రీశిశువు. *2.* మగనితోడఁబుట్టినది.

ఆఁదోఁక-తె. (అవు+తోఁక) *1.* పశుపుచ్ఛము. *2.* మొదట లావుగను రానురాను సన్నముగ నుండు రూపము.

ఆఁపు-చూ. ఆఁగు.

ఆఁబడ్డ-తె. (అవు+పడ్డ) పాలువిడిచిన దూడ. (ఇక్లై ఆఁబెయ్య)

ఆఁబసి-తె. (అవు+పసి) ఆవు.

ఆఁబోతు-తె. (అవు+పోతు) *1.* కోడె. *2.* అచ్చు పెద్దు, బసవఁడు. సమా.—రౌతు- శివుఁడు. —స్వరము - సప్తస్వరములలో రెండవది, రిషభము.

ఆకంపించు-స. *1.* మిక్కిలి కదలు. *2.* వణఁకు.

ఆకట-రూ. అక్కట.

ఆకతాయ-తె. తుంటరి.

ఆకరము-స. *1.* గని. *2.* సమూహము. *3.* ఆధారము.

ఆకర్ణనము-స. వినికి. క్రి. ఆకర్ణించు.

ఆకర్షము-స. *1.* లాగుట. (రూ. ఆకర్షణము) *2.* ఇంద్రియము. *3.* జూదము. *4.* పాచిక. క్రి. ఆకర్షించు.

ఆకలనము-స. *1.* అవగాహనము. *2.* కోరిక. *3.* ఎన్నిక.

ఆకల్పము-స. *1.* వస్త్రాద్యలంకారము. *2.* కల్పాంతమువఱకు.

ఆకసము-వి. (ఆకాశము) మిన్ను.

ఆకస్మికము-స. ఉన్నట్టుండి కలుగునది.

ఆకళించు-వి. (ఆకలన) అవగాహనముచేసికొను. జ్ఞప్తికిఁదెచ్చుకొను. కృ. ఆకళింత.

ఆకాంక్ష-స. కోరిక. క్రి. ఆకాంక్షించు.

ఆకారము-స.రూపము. సమా.— పూజ్యుఁడు-*1.* మూఢుఁడు. *2.*నీటుకాఁడు.ఆకారి-అందగాఁడు.

ఆకాశము-స.మిన్ను.(వి.ఆకసము)సమా.—పురాణము-అవధానములోనొకయంగము.—పంచాంగము-పరస్పర సంబంధములేనిది.—వాణి-అశరీరవాక్కు.

ఆకీర్ణము-స. ఎడములేక నిండినది, దట్టము.

ఆకు-తె. *1.* పత్రము. *2.* తమలపాకు. *3.* జాబు. *4.* తాటాకు. *5.* నాఱు. సమా.—చిలుక-సీతాకోకచిలుక.—చెప్పులు- పలుచని చెప్పులు. —జెముడు- ఆకులుగల ఒక తెగ జెముడు. —టిల్లు- పర్ణశాల, గుడిసె.—తేలు- లావైన పచ్చని పురుగు.—తోఁట- తమలపాకు తోఁట. —పచ్చ-హరితవర్ణము.—మడి - నాఱునాటిన —పొలము. —మడుపు - తమలపుఁ జుట్ట. —మిడుత-పచ్చని పెద్దమిడుత.—ఱాయి - ఇనుమును ఱాచు సాధనము.

ఆకుంచనము-స. ముడుఁగుట.

ఆకులము-స. *1.* కలఁత. క్రి. ఆకులపడు.

ఆకృతి-స. *1.* రూపము. *2.* దేహము.

ఆకె-తె. (అ+అక+ఎ) ఆయమ.

ఆకొత్తు-తె. పోకత్తి, అడకొత్తు.

ఆక్రందనము స. *1.* పిలుపు. *2.* ఏడుపు. *3.* అఱపు. రూ. ఆక్రందము. క్రి. ఆక్రందించు.

ఆక్రమణము-స. లోఁబఱచుకొనుట. క్రి. ఆక్రమించు.

ఆక్రాంతి-స. ఆక్రమణము.

ఆక్రీడము-స.ఉద్యానవనము.

ఆక్రోశము-స. తిట్టు. రూ. ఆక్రోశనము. క్రి. ఆక్రోశించు.

ఆక్షేపణము-స. *1.* త్రోయుట. *2.* ఆక్షేపించుట.

ఆక్షేపము-స. *1.* తిరస్కారము. *2.* అడ్డంకి. క్రి. ఆక్షేపించు.

ఆఖండలుఁడు-స. ఇంద్రుఁడు. (వ్యు. శత్రువులను లెస్సగా ఖండించువాఁడు)

ఆఖనికము-స. 1. పంది. 2. ఎలుక. దు- కన్నపు దొంగ.

ఆఖువు-స. 1. ఎలుక. 2. పందికొక్కు.

ఆఖేటము-స. వేఁట. సమా. ఆఖేటకుఁడు- వేఁటకాఁడు.

ఆఖ్య-స. పేరు.

ఆఖ్యాత-స. చెప్పెడివాఁడు.

ఆఖ్యాతము-స. చెప్పఁబడినది.

ఆఖ్యానము-స. చెప్పుట.

ఆఖ్యాయిక-స. వాస్తవమైన చరిత్రగ్రంథము.

ఆగంతుకుఁడు-స. అతిథి. రూ. ఆగంతువు.

ఆగడపలు-తె. దొంతిగానేర్పడిన మేఘపంక్తి.

ఆగడము- చూ. అవగడము. సమా. ఆగడీఁడు- అకార్యముచేయువాఁడు.

ఆగతము-స. 1. వచ్చినది. 2. పొందఁబడినది.

ఆగమనము-స. రాక.

ఆగమము-స. 1. రాక. 2. వేదము. 3. శాస్త్రము. (వ్యా) 4. సంధియందధికముగావచ్చుఅక్షరము.

ఆగము-స. 1. తప్పు. 2. పాపము. రూ. ఆగస్సు.

ఆగాత్యము-తె. కొంచెమును గొప్పగాచేసి కావించు అఱపు. రూ. ఆగాయత్యము.

ఆగామి-స. రాఁగలది.

ఆగుబ్బు-తె. అతిశయము. క్రి. ఆగుబ్బతిలు.

ఆగ్నేయము-స. తూర్పునకు దక్షిణమునకు నడుమనున్న మూల.

ఆగ్రహము-స. కోపము. క్రి. ఆగ్రహించు.

ఆఘాటము-స. మేర.

ఆఘాతము-స.వధ్యస్థానము.క్రి.ఆఘాతించు-చంపు.

ఆఘూర్ణనము-స. తిరుగుడు.

ఆఘ్రాణము-స. వాసనచూచుట. క్రి. ఆఘ్రాణించు.

ఆచమనము-స. ఉపస్పర్శము, వార్పు. క్రి. ఆచమించు.

ఆచరణము-స. 1. ఆచారము. 2. నడత. క్రి. ఆచరించు.

ఆచరణీయము-స. నడపఁదగినది.

ఆచారము-స. 1. ఆచరణము. 2. నడవడి. 3. పద్ధతి. 4. వాడుక.

ఆచార్య-స. వేదవ్యాఖ్యానముచేయు స్త్రీ.

ఆచార్యకము-స. ఉపాధ్యాయత్వము.

ఆచార్యాణి-స. ఆచార్యుని భార్య.

ఆచార్యుఁడు-స. వేదవ్యాఖ్యానము చేయువాఁడు.

ఆచూకి-తె. 1. జాడ. 2. కారణము.

ఆచ్ఛాదనము-స. 1. వస్త్రము. 2. కప్పు.

ఆజవంజవము-స. సంసారము.

ఆజానేయము-స. మేలైన గుఱ్ఱము. (వ్యు. ఆజాని. దేశమునఁబుట్టినది,, వేగముచే తేఁదగినది.)

ఆజ్ఞ-స. ఉత్తరువు. రూ. ఆజ్ఞప్తి, ఆజ్ఞాపనము. (వి. ఆన, ఆనతి.) క్రి. ఆజ్ఞాపించు.

ఆజ్యము-స. నేయి.

ఆట-తె. 1. ఆడుట. 2. వేడుక. 3. క్రీడ. 4. నాట్యము. 5. నాటకము. 6. గాసుగాడుట. 7. పరిహాసము. సమా.—కత్తె - నర్తకి. —కాఁడు-నర్తకుఁడు.—గొఱ్ఱె - మూఁడుకొమ్ములుగల గొఱ్ఱె.—బిగ్గియ - స్త్రీ లీఁదులాడు నడబావి. —తిప్ప - క్రీడాపర్వతము.—తోఁట - ఉద్యానవనము.—పట్టు - 1. ఆడుకొను చోటు. 2. నివాసస్థానము. 3. నాట్యస్థానము.—పాయము - ఆడుకొను ఈడు.—విడుపు - బడిసెలవు.

—వెలఁది-వేశ్య. క్రి. ఆటాడు - 1. క్రీడించు. 2. నాట్యమాడు.

ఆటంకము-తె. అడ్డంకి.

ఆటి-స. ఆడేలు.

ఆటు-తె. దెబ్బ.

ఆటుపోటు-తె. 1. బాధ. 2. సంద్రమునందలి చిన్న పెద్ద యలలు.

ఆటువారము-తె. 1. బిచ్చము. 2. యాచన.

ఆటోపము-స. వేగిరపాటు. క్రి. ఆటోపించు.

ఆడ-తె.(ఆ+కడ)అచోట. రూ.ఆకడ, అక్కడ.

ఆడంబరము-స.1.డంబము.2.యుద్ధసన్నాహము.

ఆడి-వి.(ఆటి)ఒకతెగబాతు. రూ.ఆడెలు, ఆడేలు.

ఆడిక, ఆడికోలు } తె. నింద, అగడు.

ఆడితప్పు-తె. మాటతప్పు.

ఆడిపోసికొను-తె. 1. నిందించు. 2.అగడుచేయు.

ఆడు-తె. 1. క్రీడించు. 2. నాట్యమాడు. 3. మునుఁగు. 4. కదలు. 5. నాటు. 6. విహరించు. 7. నిందించు. 8. గాసుగాడు. 9. చెప్పు, పలుకు. కృ. ఆట.

ఆడుకొను-తె. నిందించు.

ఆడువరి-తె. వప్రము.

ఆడెలు, ఆడేలు } చూ. ఆడి.

ఆఢకము-స. తూము.

ఆఢ్యుఁడు-స. 1. సంపన్నుఁడు. 2. నాథుఁడు.

ఆణి-తె. 1. గుండ్రఁదనము. 2. మర్మము. 3. అఱకాలిలో పెరుగు దుర్మాంసము. సమా. —కాఁడు-1. నమ్మకము గలవాఁడు. 2. మర్మజ్ఞుఁడు.—పూస-ముత్తెము. —పోటు - మర్మమందు పొడిచిన పోటు.—ముత్తెము- గుండ్రని ముత్తెము.

ఆణియ-తె. దద్దుర. రూ. అణె.

ఆణెము-తె. దేశము.

ఆతంకము-స. 1. భయము. 2. బాధ. 3. రోగము. 4. ఆరాటము. 5. చేమిరి.

ఆతంచనము-స. 1. చేమిరిపెట్టుట. 2. తసుపుట.

ఆతఁడు-చూ. అతఁడు.

ఆతతము-స. విరివియైనది.

ఆతతాయి-స. 1. హింసాస్వభావుఁడు. 2. దుర్మార్గుఁడు.

ఆతపము-స. ఎండ. సమా. ఆతపత్రము, ఆతపవారణము-గొడుగు.

ఆతల-తె. అవతల.

ఆతిథేయము, ఆతిథ్యము } స. అతిథి సత్కారము.

ఆతుమ-వి. చూ. ఆత్మ.

ఆతురము-తె. 1. ఆత్రము. 2. ఆసక్తి. రూ. ఆత్తరము,ఆత్రము. 3.వి. (అతుర) రోగపీడ.

ఆతురుఁడు-స. 1. వ్యాధిగ్రస్తుఁడు. 2.అశక్తుఁడు.

ఆత్తము-స. పొందఁబడినది.

ఆత్మ-స. 1.పరమాత్మ. 2.జీవుఁడు. 3.దేహము. 4. మనస్సు. 5.బుద్ధి. (వి.ఆతుమ) సమా. ఆత్మంభరి - పొట్టపోసికొనువాఁడు. — ఘోషము-కాకి.—జ-కూఁతురు. — జుఁడు - కొడుకు. —జ్ఞుఁడు-ఆత్మజ్ఞానము కలవాఁడు. — దర్శము-అద్దము.—భువు - 1. బ్రహ్మ. 2. మన్మథుఁడు.—హత్య - తన్నుతాను చంపుకొనుట ఆత్మీయము-తనది.

ఆత్రము-చూ. ఆతురము.

ఆద-తె. 1. మనోదుఃఖము. 2. హృదయము.ఆదమఱచు - నిశ్చింతగానుండు.

ఆదట-తె. 1. ప్రేమ. 2. తృప్తి. క్రి. ఆదటవోవు.
ఆదరణము-స. సన్మానము. రూ. ఆదరము.
ఆదరణీయము-స. సన్మానింపఁదగినది.
ఆదరము-స. 1. సన్మానము. 2. దయ. క్రి. ఆదరించు.
ఆదర్శము-స. 1. అద్దము. 2. టీక. 3. అనుకరింపఁదగిన ఉత్కృష్టస్థితి. 4. మాదిరి.
ఆదానము-స. 1. తీసికొనుట. 2. రోగకారణము.
ఆదాయము-స. 1. లాభము. 2. ధనము. 3. రాబడి.
ఆది-తె. 1. గుఱుతు. 2. జ్ఞాపకసూచకము. క్రి. ఆదికొను-కన్ను వేయు.
స-1. మొదలు. 2. మొదటిది. రూ. ఆదిమము. సమా.—వారము-ఏడుదినములలో మొదటిది. —భిక్షువు-శివుఁడు. —శేషుఁడు - సర్పరాజు, శేషుఁడు. ఆద్యంతము(ఆది+అంతము)-మొదటినుండి తుదవఱకు.
ఆదిత్యుఁడు-స. 1. వేలుపు. 2. సూర్యుఁడు. సమా. ఆదిత్యవారము-ఆదివారము.
ఆదుకొను-తె. 1. ఆధారమగు. 2. ఆదరించు.
ఆదృతము-స. ఆదరింపఁబడినది.
ఆదేయము-స. గ్రహింపఁదగినది.
ఆదేశము-స. 1. ఆజ్ఞ. 2. ఉపదేశము. (వ్యా.) 3. సంధియందు ఒక యక్షరమును బోఁగొట్టి యచ్చోఁ జేరు అక్షరము. క్రి. ఆదేశించు.
ఆదేష్ట-స. ఆజ్ఞాపించువాఁడు.
ఆద్యము-స. మొదటిది. డు-మొదటివాఁడు.
ఆధానము-స. 1. అగ్నికార్యము. 2. యత్నము. 3. ఉంచుట.
ఆధారము-స. 1. ఆనిక. 2. పాదు. (వి. ఆదరువు)
ఆధి-స. 1. కుదువ. 2. వ్యథ. సమా.—దైవికము-దైవమువలనఁ గలుగునది.—భౌతికము-పంచభూతములవలనఁ గలుగునది. —ఆధ్యాత్మికము-తన (ఆత్మ) వలనఁ గలుగునది.
ఆధిక్యము-స. గొప్పతనము.
ఆధునికము-1. ఇప్పటిది. 2. క్రొత్తది.
ఆఘూతము-స. చక్కఁగా కదలింపఁబడినది.
ఆధేయము-స. 1. ఉంచఁదగినది. 2. ఆధారము మీఁద నుండునది.
ఆధోరణుఁడు-స. మావటివాఁడు.
ఆన-వి. (ఆజ్ఞ) 1. ఉత్తరువు. 2. ఒట్టు.
ఆనంద-స. అఱువదింట నలువదియెనిమిదవ సంవత్సరము.
ఆనందనము-స. బంధుమిత్రులను ఆలింగనాదులచే సంతోషపఱచుట.
ఆనందము-స. సంతోషము. సమా.—కాననము-కాశి. —బాష్పములు - సంతోషముచే వచ్చు కన్నీరు.
ఆనకట్టు-తె. (ఆను+కట్టు) అనకట్ట.
ఆనకదుందుభి-స. వసుదేవుఁడు.
ఆనకము-స. 1. తప్పెట. 2. భేరి. 3. మద్దెల.
ఆనతము-స. వంగినది.
ఆనతి-వి. (ఆజ్ఞప్తి) ఉత్తరువు.
స. నమస్కారము.
ఆనద్ధము-స. 1. కట్టఁబడినది. 2. చర్మవాద్యము.
ఆననము-స. 1. మొగము. 2. నోరు.
ఆనము-స. ఉచ్ఛ్వాసము. క్రి. ఆనయించు.
ఆనయము-స. 1. తెచ్చుట. 2. పొందించుట.
ఆనర్తము-స. 1. పోరు. 2. నాటకశాల. 3. ఒకదేశము.
ఆనవాలు-తె. 1. గుఱుతు. 2. బాగుగ కాఁచిన పాలు. రూ. ఆనాలు.
ఆనిక-తె. 1. త్రాగుట. 2. ఆధారము. 3. దార్ఢ్యము. రూ. ఆను వు.

ఆనియ-తె. ఆణియ. రూ. ఆనె.

ఆనీతము-స. 1.తేఁబడినది. 2.పొందింపఁబడినది.

ఆను-తె. 1.ఆనికయగు. 2. ఒఱగు. 3. అదుము. 4. తిను. 5. త్రాగు, కృ. ఆనిక.

ఆనుకఱ్ఱ-తె. ఊఁతకోల.

ఆనుకూల్యము-స. ఒద్దిక.

ఆనుగ-తె. 1. సొరకాయ. 2. సొరతీఁగ. రూ. ఆనుగు.

ఆనుగుణ్యము-స. అనుగుణభావము.

ఆనుడుబిళ్ల-తె. ఒఱగుదిండు.

ఆనుపూర్వి-స. అనుక్రమము, వరుస.

ఆనువాయి-తె. అలవాటు.

ఆనువు-చూ. ఆనిక.

ఆనె-చూ. ఆనియ.

ఆన్వీక్షకి-స. తర్కశాస్త్రము.

ఆపగ-స. నది. (వ్యు. జలములోఁ బోవునది.)

ఆపగేయుఁడు-స. గంగాపుత్రుఁడు, భీష్ముఁడు.

ఆపణము-స. అంగడి.

ఆపణికుఁడు-స. వర్తకుఁడు.

ఆపత్తి-స. ఇడుమ. రూ. ఆపద.

ఆపన్నము-స. 1. పొందఁబడినది. 2. ఆపద గలది. డు- ఆపద నొందినవాఁడు. సమా. ఆపన్నసత్వ-గర్భిణి.

ఆపసోపాలు-తె. ఉసురుసురు.

ఆపాతము-స. 1. పడుట, 2. తేలిక. 3. అప్పుడు.

ఆపాదనము-స. కలిగించుట. క్రి. ఆపాదిల్లు, ఆపాదించు.

ఆపానము-స. 1. కల్లంగడి. 2. అనేకులుచేరి కల్లు త్రాగు చోటు.

ఆపీతము-స. త్రాగఁబడినది.

ఆపూర్తి-స. సంపూర్తి.

ఆపె-తె. (ఆ+అప+ఎ) ఆమె.

ఆపోసనము-చూ. అపోసానము.

ఆపోవు-తె. తృప్తిపడు. కృ. ఆపోర.

ఆపోశనము-స. భోజనమప్పుడు పుడిసిట జలము పోసికొని మంత్రపూర్వకముగ పుచ్చుకొనుట. రూ. అపోసానము. క్రి. ఆపోశనించు.

ఆపోసానము-చూ. పై.

ఆప్తము-స. 1. పొందఁబడినది. 2. హితమైనది. 3. డు-స్నేహితుఁడు.

ఆప్తి-స. 1. పొందు. 2. కలిమి. రూ. అవాప్తి.

ఆప్యాయనము-స. తృప్తి. రూ. ఆప్యాయము.

ఆప్లవము-స. స్నానము.

ఆప్లుతుఁడు-స. స్నాతుఁడు.

ఆబ-తె. కంటిపాప.

ఆబంధము-స. 1. గట్టికట్టు. 2. పలుపు. 3. ప్రేమ.

ఆబూతి-వి. (అభుక్తి) పెనుతిండి.

ఆబ్దికము-స. తద్దినము. (వ్యు. అబ్దమునకొకసారి చేయఁబడునది)

ఆభరణము-స. భూషణము.

ఆభాసము-స. 1. ప్రకాశము. 2. పోలిక. 3. లేనిది ఉన్నట్లు తోఁచుట. 4. ప్రతిఫలనము.

ఆభిజాత్యము-స. 1. మంచికులమున పుట్టుక. 2. గర్వము.

ఆభీరి-స. గొల్లది.

ఆభీరుఁడు-స. గొల్లవాఁడు.

ఆభీలము-స. 1. భయంకరము. 2. బాధ.

ఆభుక్తి-స. చూ. ఆబూతి.

ఆభోగము-స. 1. పరిపూర్ణత. 2. ప్రయత్నము.

ఆమంత్రణము-స. 1. పిలుపు. 2. సెలవుగొని వెళ్లుట. క్రి. ఆమంత్రించు.

ఆమడ-తె. యోజనము. పదిమైళ్లు.

ఆమతి-వి. (ఆమంత్రణము) పిలుపు. క్రి. ఆమతించు. కృ. ఆమతింపు.

ఆమతిల్లు-తె. పుట్టు.

ఆమనస్యము-స. 1. ప్రసూతివేదన. 2. బిడ్డకుట్టు.

ఆమని-తె. 1. వసంతఋతువు. 2. ఫలసమృద్ధి. 3. ఉత్సవము. సమా.—దొర-వసంతుఁడు.

ఆము-తె. కుమ్మరి కుండలు కాల్చు గుంట. రూ. ఆవము. స. 1. రోగము. 2. అపక్వము, పచ్చి.

ఆమయము-స. రోగము,

ఆమలకము-స. నెల్లి (ఉసిరిక) చెట్టు. రూ. ఆమలకి.

ఆమవడ-తె. పెరుగులో వేసిన వడ రేక గారె.

ఆమిక-వి. (అహమహమిక) మదము.

ఆమిషము-స. 1. మాంసము. 2. లంచము, 3. భోగము. 4. లాభము.

ఆము-వి. (అహము) గర్వము, ఆమిక. క్రి. ఆముకొను-పైకొను.

ఆముక్తము-స. 1. కట్టఁబడినది. 2. తొడుగఁబడినది. 3. విడువఁబడినది.

ఆముత్రికము-స. పరలోక సంబంధమైనది.

ఆముదము-వి. (ఆమండము) 1. ఏరండతైలము. 2. బ. ఆముదపు గింజలు.

ఆముష్మికము-స. ఆముత్రికము.

ఆమె-తె. (ఆ+అమ+ఎ) ఆ స్త్రీ, ఆపె, ఆకె.

ఆమెత-తె. 1. విందు. 2. ఉత్సవము. వి. (ఆమంత్రణము) పిలుపు. రూ. ఆమతి.

ఆమోదము-స. 1. సంతోషము. 2. పరిమళము. క్రి. ఆమోదించు.

ఆమ్నాయము-స. 1. వేదము. 2. సంప్రదాయము.

ఆమ్రము-స. మామిడి.

ఆమ్రేడితము-స. (వ్యా.) రెండుమాఱులు చెప్పఁబడిన మాట. 2. రెండుమాఱులు చెప్పినదానిలో రెండవ పదము.

ఆమ్లము-స. 1. చింతపండు. 2. చింతచెట్టు. రూ. ఆమ్లిక. సమా. ఆమ్లవేతసము-పుల్లప్రబ్బలి.

ఆయక-తె. చూ. ఆకె.

ఆయకట్టు-తె. (ఆయము+కట్టు) 1. పొలము పరిమాణము. 2. రాబడి పరిమాణము.

ఆయకము-తె. తాకట్టు, ఆధి. రూ. ఆహకము.

ఆయకాఁడు-తె. గ్రామోద్యోగి.

ఆయతనము-స. 1. గుడి. 2. ఇల్లు.

ఆయతము-వి. (ఆయత్నము) ప్రయత్నము. స. నిడుపైనది.

ఆయతి-తె. 1. జ్యేష్ఠాషాఢశ్రావణ భాద్రపద మాస చతుష్టయము. 2. కందాయము. స. 1. నిడుపు. 2. భావికాలము. 3, రాబడి.

ఆయత్తము-స. 1. అధీనము. 2. సంసిద్ధము, (వి. ఆయితము) డు-అధీనుఁడు.

ఆయన-తె. (ఆ+అన) అతఁడు.

ఆయమ-తె. (ఆ+అమ) ఆమె.

ఆయము-వి. (ఆయువు) 1. జీవస్థానము. 2. అశ్వకాం. స. 1. వచ్చుబడి. 2. లాభము. [మెత్తుట.

ఆయవారము-వి. (యాయావరము) ధాన్యమువిచ్చు

ఆయసము-స. 1. ఇనుము. 2. ఇనుపవస్తువు.

ఆయాసము-స. 1. శ్రమము. 2. తొందర.

ఆయితము-వి. (ఆయత్తము) సిద్ధము. రూ. ఆయిత్తము. క్రి. ఆయిత్తపడు.

ఆయిదము-వి. (ఆయుధము) 1. కత్తి మున్నగు సాధనము, 2. పనిముట్టు.

ఆయుధము-స.—పై—

ఆయువు-స. జీవితకాలము. రూ. ఆయుస్సు, ఆయుష్యము. సమా. ఆయుష్కర్మము - క్షౌరము. ఆయుష్మంతుఁడు - చాలకాలము బ్రతుకువాఁడు.

ఆయోగము-స. *1*. వ్యాపారము. *2*. తెలివి.

ఆయోధనము-స. యుద్ధము.

ఆర-తె.(వ్యా.)సంబోధన బహువచనమున వచ్చు ఆగమము. రూ. ఆరా.
స. చెప్పులుకుట్టు సూది. (వి. ఆరె)

ఆరంజోతి-వి. (అరుంధతి) వసిష్ఠుని భార్య,

ఆరంబము-వి. (ఆరంభము) *1*. మొదలుపెట్టుట. *2*. యత్నము.

ఆరంభము-స. *1*. ప్రయత్నము. *2*. మొదలు. *3*. త్వర. (వి. ఆరంబము) క్రి. ఆరంభించు.

ఆరకూటము-స. ఇత్తడి.

ఆరకూడు-తె. పూటకొకచోట తిను కూడు.

ఆరక్షము-స. *1*. రక్షణము. *2*. సేన. డు-తలారి.

ఆరగించు-తె. *1*. తిను. *2*. త్రాగు. *3*. నైవేద్యముచేయు. కృ. ఆరగింత, ఆరగింపు.

ఆరఘట్టము-*1*. ఏఁతము. *2*. నూతిరాట్నము.

ఆరజము-తె. *1*. ఇంపు. *2*. మధురధ్వని.

ఆరట-తె. *1*. విహారము. *2*. విశ్రాంతి.

ఆరటము-తె. *1*. దుఃఖము. *2*. పరితాపము. రూ. ఆరాటము. క్రి. ఆరటపడు, ఆరటించు.

ఆరడము-తె. *1*. ఉత్సాహము. *2*. పూనిక.

ఆఱడి-తె. *1*. నింద. *2*. వ్యర్థము. క్రి. ఆఱడిపడు, ఆఱడిపోవు.

ఆరతి-వి. (హారతి) దేవునెదుట దీపమునుగాని, వెలిఁగించిన కప్పురమునుగాని త్రిప్పుట.

ఆరనాళము-స. పులియఁబెట్టిన కడుగునీళ్లు. రూ. ఆరనాళకము.

ఆరబము-తె. పైరు.

ఆరబ్ధము-స. ఆరంభింపఁబడినది.

ఆరభటి-స. *1*. మోఁత. ( రూ. ఆరభటము, ఆర్భటము, ఆర్భటి) *2*. ఒక కావ్యవృత్తి. క్రి. ఆరభటించు, ఆర్భటించు.

ఆరయు-చూ. అరయు.

ఆరవము-స. ధ్వని. రూ. ఆరావము.

ఆరాటము-చూ. ఆరటము.

ఆరాధనము-స. పూజ. క్రి. ఆరాధించు.

ఆరాధ్యుఁడు-స. *1*. పూజ్యుఁడు. *2*. లింగధారి.

ఆరామము-స. *1*. ఉపవనము. *2*. సంతోషము.

ఆరితేరు-తె. నిపుణతనొందు.

ఆరివేరము-వి. (అరివైరము) విరోధము. రూ. ఆర్వేరము. సమా. ఆరివేరపుఁదపసి- నారదుఁడు, కలహభోజనుఁడు.

ఆరు-తె. *1*. కలుగు. *2*. నిండు. *3*. రొమ్ము నుండి నాభివఱకుఁ గల వెండ్రుకలవరుస.

ఆఱు-తె. *1*. ఎండు. *2*. నశించు. *3*. ఉపశమించు. (ప్రే. ఆఱుచు) *4*. ఐదునొకటి. సమా. ఆఱుగురు- ఆఱుమంది. రూ. ఆఱువురు, అర్వురు. ఆఱుమోములవేలుపు- కుమారస్వామి. క్రి. ఆఱుమూఁడగు- చెడు.

ఆరుక-తె. ఒకతెగ పైరు. రూ. ఆరుగ. బ. ఆరుకధాన్యము. రూ. ఆర్లు.

ఆరుచు-తె. *1*. ఆడించు. *2*. విసరు. *3*. ఎండించు. [రూ. అర్చు.

ఆరుదూరు-తె. అల్లరి.

ఆరుద్రపురుగు-తె. ఇంద్రగోపము. (వానకాలమున కాన్పించు ఎఱ్ఱని పట్టువలె తళతళలాడు పురుగు)

ఆఱుపు-తె. కూఁత.

ఆరుపోరు-తె. ఎడతెగని జగడము.

ఆఱుస-తె. ఆఱుసుంచములు.

ఆరూఢము-స. 1. ఎక్కినది. 2. జ్యోతిశ్శాస్త్రమున నొక భాగము.

ఆరె-వి. (ఆర) 1. చెప్పులుకుట్టు సూది. 2. కోడి మున్నగు పక్షుల కాళ్లకు వెనుకనుండు గోరు. (ఆరెబొబ్బె అనియు)

ఆరెకుఁడు-వి. (ఆరక్షుఁడు) తలవరి.

ఆరెము-తె. మహారాష్ట్రభాష.
వి. (ఆరామము) ఉపవనము.

ఆరోగణము-తె. భోజనము.

ఆరోగ్యము-స. రోగములేమి.

ఆరోపము-స. మోపుట. రూ. ఆరోపణము. క్రి. [ఆరోపించు.

ఆరోహకుఁడు-స. ఎక్కువాఁడు.

ఆరోహణము-స. 1. ఎక్కుట. 2. నిచ్చెన. 3. సోపానము. క్రి. ఆరోహించు.

ఆరోహుఁడు-స. 1. మావటివాఁడు. 2. గుఱ్ఱపురౌతు.

ఆర్జనము-స. సంపాదనము. క్రి. ఆర్జించు.

ఆర్జవము-స. 1. ఋజుభావము, చక్కన. 2. చక్కనినడత.

ఆర్తము-స. 1. దుఃఖమునొందినది. 2. నొచ్చినది.

ఆర్తవము-స. 1. ఋతుసంబంధమైనది. 2. స్త్రీల ఋతువు. 3. పూవు.

ఆర్తి-స. 1. దుఃఖము. 2. వింటికొన.

ఆర్ధము-తె. ఆఱుతూములు.

ఆర్ద్ర-స. ఇరువదేడింట ఆఱవనక్షత్రము.

ఆర్ద్రకము-స. అల్లము.

ఆర్ద్రము-స. తడిసినది.

ఆర్భటము-చూ. ఆరభటము.

ఆర్య-స. 1. పదునాఱేండ్ల కన్య. 2. పార్వతి.

ఆర్యాణి-స. 1. పూజ్యురాలు. 2. పార్వతి.

ఆర్యుఁడు-స. 1. పూజ్యుఁడు. 2. మంచివాఁడు. 3. (నాట్య) పెనిమిటి. (ఆర్యపుత్రుఁడు అనియు)

ఆర్వేరము-చూ. ఆరివేరము.

ఆర్షము-స. 1. ఋషిసంబంధమైనది. 2. ధర్మార్థము వరునివలన గోమిథునము పుచ్చుకొని కన్యనిచ్చి చేయు వివాహము. (చూ. వివాహము.)

ఆలంకి-తె. కుర్చీవంటి పల్లకి.

ఆలంబము-స. ఊఁత.

ఆలంభము-స. చంపుట, వధము.

ఆలకి-తె. అనాథ.

ఆలకించు-తె. 1. విను. 2. ఆదరించు. రూ. ఆలించు.

ఆలక్షించు-స. చూచు.

ఆలతి-వి. (ఆలప్తి) రాగముతీయుట.

ఆలపించు-వి. (ఆలాపించు) రాగముతీయు.

ఆలప్తి-చూ. ఆలతి.

ఆలము-తె. 1. ఆగడము. 2. ఉపేక్ష. వి. 1. (హారము) యుద్ధము. 2. (హాలాహలము) విషము. సమా. ఆలవాయి-శివుఁడు.

ఆలయము-స. 1. ఇల్లు. 2. గుడి.

ఆలరి-తె. 1. దుశ్శీలుఁడు. 2. అనాథ.

ఆలవట్టము-వి. (ఆలావర్తము) వస్త్రముతోచేసిన విసనకఱ్ఱ.

ఆలవాలము-స. పాదు. రూ. ఆవాలము.

ఆలస్యము-స. 1. జాగు. 2. సోమరితనము. క్రి. వి. ఆలసించు.

ఆలాతము-స. కొఱవి. రూ. అలాతము.

ఆలానము-స. ఏనుఁగునుకట్టు గూటము.

ఆలాపనము-స. *1*. నిండుమాట. *2*. రాగాలాపనము. *3*. మాటాడుట. రూ. ఆలాపము. క్రి. ఆలాపించు.

ఆలావర్తము-స. ఆలవట్టము.

ఆలి-తె. హీనము. క్రి. ఆలిగొను- గేలిచేయు. స. *1*. చెలికత్తె. *2*. వరుస. రూ. ఆళి.

ఆలింగనము-స. కౌఁగిలింత.

ఆలించు-తె. విను. రూ. ఆలకించు.

ఆలిచిప్ప-తె. నత్తచిప్ప.

ఆలీఢము-స. *1* . నాకఁబడినది. *2*. విలుకాఁడు కుడికాలుచాఁచి నిలుచుట.

ఆలు-తె. *1*. భార్య. *2*. స్త్రీ. (బ. ఆండ్రు) *3*. ఆవుశబ్ద బహువచనరూపము. సమా. ఆలకాపరి- *1*. గొల్లవాఁడు. *2*. కృష్ణుఁడు. ఆలపోతు, ఆలఱేఁడు-ఆఁబోతు. ఆలుమగలు-దంపతులు.

ఆలోకనము-స. *1*. చూపు. *2*. కాంతి. రూ. ఆలోకము. క్రి. ఆలోకించు.

ఆలోచన-స. యోచన, తలంపు. రూ. ఆలోచనము. క్రి. ఆలోచించు.

ఆలోలము-స. *1*. చంచలమైనది. *2*. ఆసక్తిగలది.

ఆవ-తె. *1*. ఆవగింజ. *2*. పల్లపునేల. *3*. చీడ. *4*. జ్ఞప్తి. సమా. ఆవకాయ- మామిడి ఊరుఁగాయ. క్రి. ఆవపొఱు- జ్ఞప్తికివచ్చు.

ఆవజము-వి.(ఆరజము)రుంజ. [ఆవటిల్లు.

ఆవటము-తె.*1*.పొందిక. *2*.పద్ధతి. క్రి.ఆవటించు,

ఆవడ-తె. *1*. అమవస. *2*. చేఁదుబీఱ.

ఆవడి-తె. ఉపద్రవము. రూ. హావడి, ఆవలి, ఆవళి.

ఆవము-వి. (ఆవాపము) *1*. కుమ్మరిఆవము. *2*. ఇటికలు కాల్చు చోటు, సూళ. రూ. ఆమము.

ఆవరణము-స. ఇంటి చుట్టు ప్రదేశము. *2*. కప్పు. *3*. మూఁత. క్రి. ఆవరించు- క్రమ్ము.

ఆవర్తనము-స. *1*. మరలుట. *2*. పాఠ పునశ్చరణము. రూ. ఆవర్తము. క్రి. ఆవర్తించు.

ఆవర్తము-స. *1*. ఆవర్తనము. *2*, సుడి.

ఆవల-చూ. అవల.

ఆవలి-తె. చూ. ఆవడి. స. *1*. పంక్తి. *2*. సమూహము. రూ. ఆవళి.

ఆవలు-తె. ఆవగింజలు. రూ. ఆవాలు.

ఆవశ్యకము-స. అక్కఱ.

ఆవళి-చూ. ఆవడి.

ఆవాపము-స. *1*. పాదు. *2*. పత్తుట. *3*. ఆవము.

ఆవాలము-చూ. ఆలవాలము.

ఆవాసము-స. ఇల్లు.

ఆవాహనము-స. పిలుపు. (వ్య. విసర్జనము)

ఆవి-తె. *1*. శ్వాసము. *2*. ఆవిరి. *3*. తాపము. క్రి. ఆవించు.

ఆవిరి-తె. ఉడికిన నీటినుండి లేచు పొగ.రూ.ఆవి.

ఆవిర్భవము-స. పుట్టుక. రూ. ఆవిర్భావము. క్రి. ఆవిర్భవించు.

ఆవిలము-స. కలుషము.

ఆవిష్కరణము-స. ప్రకటన. రూ. ఆవిష్కృతి, ఆవిష్క్రియ. క్రి. ఆవిష్కరించు.

ఆవు-తె. గోవు.

ఆవురు-తె. రోదనధ్వని. రూ. బావురు.

ఆవులించు-తె. జృంభించు. కృ. ఆవులింత.

ఆవృతము-స. చుట్టుకొనఁబడినది.

ఆవృత్తము-స. తిరుగుడుపడినది.

ఆవృత్తి-స. *1*. తిరుగుడు. *2*. తడవ. *3*. వల్లె.

ఆవేగము-స. *1*. తొట్రుపాటు. *2*. చింత.

ఆవేదనము-స. తెలుపుట. క్రి. ఆవేదించు.

ఆవేశనము-స. 1. శిల్పిశాల, పట్టెడ. 2. ప్రవేశము. 3. కోపము. 4. ఇల్లు.

ఆవేశము-స. 1. ఒడలెఱుఁగమి. 2. పిశాచము పట్టుట. 3. తొందర. 4. కోపము. క్రి. ఆవేశించు.

ఆశ-స. 1. కోరిక. 2. దిక్కు. క్రి. ఆశించు.

ఆశంసనము-స. కోరుట. క్రి. ఆశంసించు.

ఆశయము-స. 1. అభిప్రాయము. 2. మనస్సు. 3. ఆధారము.

ఆశాసనము-స. దీవన. క్రి. ఆశాసించు.

ఆశి-స. పాముకోఱ. సమా. ఆశీవిషము-పాము.

ఆశీస్సు-స. 1. దీవన. 2. హితముకోరుట. 3. పాముకోఱ. సమా. ఆశీర్వాదము - దీవన. క్రి. ఆశీర్వదించు.

ఆశుగము-స. 1. బాణము. 2. గాలి. (వ్యు. వేగముగా పోవునది)

ఆశువు-స. వేగము. సమా.—కవిత్వము-యోచింపక వేగముగఁ జెప్పుకవిత్వము. చూ. కవిత్వము.

ఆశౌచము-స. అంటు, అశుచిత్వము. రూ. అశౌచము.

ఆశ్చర్యము-స. వింత. (వి. అచ్చెరువు)

ఆశ్రమము-స. 1. పర్ణశాల. 2. మఠము. 3. పాఠశాల. 4. బ్రహ్మచర్యాది. ఇవినాలుగు: బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యసము. సమా. ఆశ్రమస్వీకారము - సన్న్యసించుట.

ఆశ్రయము-స. 1. ప్రాపు. 2. బలవంతుని జేరుట. 3. ఇల్లు. 4. ఆధారము. 5. సాహాయ్యము. 6. విశ్రాంతిస్థలము. 7. శరణాలయము. క్రి. ఆశ్రయించు. సమా. ఆశ్రయాశుఁడు- 1. అగ్ని. 2. ప్రాపును చెఱచువాఁడు. ఆశ్రితుఁడు-ఆశ్రయించుకొని యుండువాఁడు.

ఆశ్లేషము-స. ఆలింగనము. ఆశ్లేష-స. ఇరువదేడింట తొమ్మిదవ నక్షత్రము. క్రి. ఆశ్లేషించు.

ఆశ్వయుజము-స. ఏడవమాసము. రూ. ఆశ్వినము.

ఆశ్వాసము-స. 1. గ్రంథభాగము. 2. ఊఱడించుట. క్రి. ఆశ్వసించు, ఆశ్వాసించు.

ఆశ్వికుఁడు-స. గుఱ్ఱపురౌతు.

ఆషాఢము-స. 1. బ్రహ్మచారి ధరించు మోదుగకోల. 2. నాలవమాసము.

ఆస-వి. (ఆశ) 1. అపేక్ష. 2. దిశ. క్రి. ఆసించు.

ఆసంగము-స. 1. ఆసక్తి. 2. ఆశ్రయము.

ఆసక్తి-స. ఆశ.

ఆసక్తుఁడు-స. ఆసగొన్నవాఁడు.

ఆసత్తి-వి. (ఆసక్తి) ఆస.
స. 1. లాభము. 2. సంగమము. 3. అన్వయము చెడని పదముల కూర్పు.

ఆసనము-స. 1. పీఠము. 2. దండెత్తిపోక నిలుచుట. 3. పద్మాదియోగాసనము.

ఆసన్నము-స. దాపు.

ఆసరా-హిం. ప్రాపు, ఆశ్రయము.

ఆసవము-స. 1. కల్లు. 2. పూఁదేనె.

ఆసాది-తె. మాదిగవాఁడు.

ఆసామి-హిం. మనుష్యుఁడు.

ఆసీనుఁడు-స. కూర్చున్నవాఁడు.

ఆసు-తె. సాలెవాని యుపకరణము. [వలకుతిరుగు.

ఆసుపోయు-తె. 1. పోఁగువాఱించు. 2. ఈవలా

ఆసురము-స. ధనమిచ్చి కన్యనుగొని చేసికొనెడు పెండ్లి. (చూ. వివాహము)

ఆసురుఁడు-స. నిరృతి. [చనము.

ఆసేకము-స. 1. చల్లుట. 2. తడుపుట. రూ. ఆసే

ఆస్కందనము-స. 1. యుద్ధము. 2. తిరస్కారము. 3. ముట్టడి.

ఆస్కందితము-స. అశ్వగతిభేదము. (చూ. గతి)

ఆస్తరణము-స. *1.* ఆసనము. *2.* పఱపు. రూ. ఆస్తరము.

ఆస్తి-స. *1.* సంపాదించిన భూమి, ధనము మొ. [*2.* ధనము.

ఆస్తికుఁడు-స. దేవుఁడున్నాఁడని నమ్మువాఁడు. (వ్య. నాస్తికుఁడు)

ఆస్తిక్యము-స. దేవుఁడున్నాఁడను నమ్మిక.

ఆస్థ-స. *1.*ఉనికి. *2.*యత్నము.*3.*కోరిక.*4.*గుటి.

ఆస్థానము-స. *1.* సభ. *2.* రాజసభ.

ఆస్పదము-స. *1.*నెలవు. *2.* పని. [ఆస్ఫాలించు.

ఆస్ఫాలనము-స. చఱపు. రూ. అస్ఫాలము. క్రి.

ఆస్ఫోటనము-స. *1.* చఱపు. *2.* పోటు. *3.* చీలిక. క్రి. ఆస్ఫోటించు.

ఆస్యము-స. *1.* ముఖము. *2.* నోరు.

ఆస్రము-చూ. అస్రము.

ఆస్వాదనము-స.*1.* అనుభవము. *2.* చవిచూచుట. రూ. ఆస్వదనము. క్రి.ఆస్వాదించు,ఆస్వదించు.

ఆహకము-తె. కుదువ. రూ. ఆయకము.

ఆహతము-స. *1.* కొట్టఁబడినది. *2.* తప్పెట. *3.* క్రొత్తగుడ్డ. [*3.* ఆకర్షించు.

ఆహరించు-స. *1.* భుజించు. *2.* అపహరించు.

ఆహర్త-స. ఆహరించువాఁడు.

ఆహవనము-స. యజ్ఞము. [అగ్ని.

ఆహవనీయము-స. త్రేతాగ్నులలో నొకటి. చూ.

ఆహవము-స. యుద్ధము. రూ. ఆహోవము. (వ్యు. దీనియందు పరస్పరము పిలువఁబడుదురు)

ఆహా-తె. ఔరా. రూ. అహా, అహో.

ఆహారము-స. *1.* భోజనము. *2.* అపహరణము. క్రి. ఆహరించు.

ఆహార్యము-స. *1.* తెచ్చుకొనఁదగినది. *2.* ఒక తెగ అభినయము.

ఆహికము-స. ప్రతిదినమువచ్చు జ్వరము.

ఆహితము-స. *1.* ఉంచఁబడినది.*2.*చేయఁబడినది.

ఆహుతి-స. అగ్నిలో వేల్చుట. [అహోపురుషిక.

ఆహోపురుషిక-స. వీరాలాపము, బడాయి. రూ.

ఆహ్నికము-స. పగలుచేయఁదగిన కర్మము.

ఆహ్లాదము-స. సంతోషము.

ఆహ్వ-స. *1.* పేరు. *2.* పిలుపు.రూ.ఆహ్వయము.

ఆహ్వానము-స. పిలుపు. [హము.

ఆళి-స. *1.* పంక్తి. *2.*చెలికత్తె. *3.*తేలు. *4.*సమూ

ఆళుగ-తె. ఈతచెక్కులవంటి చెక్కులుగల ఒక తెగ పంది. రూ. అళువ.

ఆళువరి-తె. అలంగము. రూ. ఆడువరి.

ఆళువారు-అ. *1.* హరిభక్తుఁడు. *2.* గరుడుఁడు. రూ. ఆళ్వారు.

ఆళ్లు-తె. ఆరుకలు.

## ఇ

ఇంకు-తె. *1.* వట్టిపోవు. *2.* ఎండు. రూ.ఇనుకు, ఈఁగు. కృ. ఇంకుడు.

ఇంకువ-తె. *1.* గుఱుతు. *2.* మెట్టు.

ఇంగలము-స. *1.* అగ్ని. *2.* అగ్నికణము. (వి. ఇంగిలము)

ఇంగితము-స. ఎదుటివారి యభిప్రాయము.

ఇంగిలము-వి.( ఇంగలము)*1.*అగ్గి.*2.*మిణుఁగురు.

ఇంగిలికము-వి. (హింగుళము) ఎఱ్ఱని మందు వస్తువు. రూ. ఇంగిలీకము.

ఇంగుదము-స. గారచెట్టు. రూ. ఇంగుది.

ఇంగువ-వి. (హింగువు) కూరలలో నుపయోగించు వస్తువు.

ఇంచు-తె. *1.* ఇంపగు. *2.* కోరు.కృ.ఇంపితము, ఇంపు. వి. (ఇక్షువు) చెఱకు. సమా. ఇంచు

బోఁడి - ఆఁడుది.— విలుకాఁడు - మన్మథుఁడు. రూ. ఇంచువిలుతుఁడు,—విల్తుఁడు.

ఇంచుక - తె. కొంచెము.

ఇంచుమించు - తె. రమారమి.

ఇంటరము - తె. 1. ఇఱుకు. 2. సంకటము. రూ. ఇంట్రము.

ఇండె - తె. 1. ఎముకకీలు. 2. చీలిక.

ఇంత - తె. (ఈ + అంత) 1. ఈకొలఁది. 2. ఇది యంతయు.

ఇంతి - తె. ఆఁడుది.

ఇందము - తె. తీసికొనుము. (వాడుకలో 'ఇందా')

ఇంది, ఇందిర - స. లక్ష్మి. (వ్యు. సంపదనిచ్చునది, సంపదగలది)

ఇందిందిరము - స. పెద్దజాతి తుమ్మెద. (వ్యు. పద్మసంపదతోఁ గూడినది)

ఇందీవరము - స. 1. నీలపుఁదామర. 2. నల్లకలువ. (వ్యు. లక్ష్మికి నిలయమైనది)

ఇందు - తె. 1. అడఁగు. 2. ఇముడు. 3. ఇచ్చోట.

ఇందుఁడు - స. చంద్రుఁడు. (వ్యు. చల్లనివాఁడు, తేమకలిగించువాఁడు) సమా. ఇందువారము - సోమవారము.

ఇందుగు - తె. చిల్లగింజ. రూ. ఇందువు.

ఇందుప్పు - తె. సైంధవలవణము.

ఇంద్రియము - స. 1. రేతస్సు. 2. చర్మాది. (జ్ఞానేంద్రియములు : త్వక్చక్షు జిహ్వా ఘ్రాణ శ్రవణములు. కర్మేంద్రియములు: వాక్పాణి పాద పాయూపస్థలు)

ఇంద్రుఁడు - స. 1. దేవతలరాజు. 2. (రెండవ పదమగుచో) శ్రేష్ఠుఁడు. (వ్యు. అధికారము కలవాఁడు) సమా. ఇంద్రగోపము - ఆరుద్రపురుగు. —జాలము - కనుకట్టువిద్య. —జిత్తు - మేఘనాదుఁడు. —నీలము - నీలమణి. —లుప్తకము - 1. బట్టతల. 2. పేనుకొఱికిన తల. ఇంద్రాణి - ఇంద్రునిభార్య, శచీదేవి. ఇంద్రావరజుఁడు - విష్ణువు.

ఇంధనము - స. వంటచెఱకు.

ఇంపితము - తె. ఇంపు.

ఇంపు - తె. 1. ఇష్టము. 2. ఇచ్ఛ. 3. ఆనందము. రూ. ఇంబు.

ఇఁక - తె. ఈమీఁద. రూ. ఇఁగ.

ఇక్క - తె. 1. చోటు. 2. ఇల్లు.

ఇక్కట్టు - తె. (ఇక్కు + కట్టు) సంకటము.

ఇక్కడ - తె. (ఈ + కడ) ఇచ్చోటు.

ఇక్కము - తె. 1. ఇఱుకటము. 2. సంకటము.

ఇక్కు - తె.—పై—రూ. ఇఱుకు.

ఇక్కుపాటు - తె. —పై—

ఇక్కువ - తె. 1. ఉనికి. 2. జాడ. 3. చోటు. 4. కళాస్థానము.

ఇక్షువు - స. చెఱకు. (వ్యు. కోరఁదగినది) (వి. ఇంచు) సమా.—ధన్వుఁడు - మన్మథుఁడు. (ఇట్లే ఇక్షుసాయకుఁడు మొ.) — వనము - చెఱకుతోఁట. ఇక్షూదము - చెఱకుసంద్రము.

ఇగము - వి. (హిమము) మంచు. రూ. ఇవము, ఈము.

ఇగిరిక - తె. 1. అత్తెసరు. 2. హవిస్సు.

ఇగిలించు - తె. పండ్లుచూపు. రూ. ఇగులుచు, ఇగుల్చు, ఇవులుచు, ఇవుల్చు. కృ. ఇగిలింత.

ఇగురు - తె. 1. ఇంకు. 2. చిగురు. 3. అంకురము. రూ. ఇవురు. సమా. ఇగురుఁబోఁడి - ఆఁడుది. క్రి. ఇగిరించు, ఇగురించు, ఇగురుచు, ఇగుర్చు.

ఇగో - తె. ఇదిగో.

ఇగ్గు - తె. వెనుకకొఱకు. రూ. ఈగు. క్రి. ఇగ్గులాడు. 1. ఒకరినొకరు లాగుకొను. 2. వెనుకకీడ్చు. కృ. ఇగ్గులాట.

ఇచటు-తె.(ఈ+చోటు)ఈస్థలము.రూ. ఇచ్చటు, ఇచ్చొటు, ఇచ్చోటు. ఇచ్చో. [గించు.

ఇచ్ఛ-వి. (ఇచ్ఛ) 1.కోరిక.2.చిత్తము. క్రి. ఇచ్ఛ

ఇచ్చకము-తె. 1. ప్రియవచనము, ముఖస్తుతి.

ఇచ్చకాలమారి-తె. ముఖస్తుతులాడువాఁడు. రూ. ఇచ్చగొండి.

ఇచ్చు-తె. 1. ఒసఁగు. 2. దానముచేయు.

ఇచ్ఛ-స. ఇచ్ఛ. క్రి. ఇచ్ఛించు.

ఇజురు-తె. 1. శ్రమము. 2. సంకటము.

ఇట-తె. ఇక్కడ.

ఇటిక-వి. (ఇష్టిక) మట్టితోఁజేసి కాల్చిన ఱాయి. రూ. ఇట్టిక.

ఇటు-తె. 1. ఈ ప్రకారము. 2. ఇక్కడకు. రూ. ఇటులు, ఇట్టు, ఇట్టులు.

ఇట్టలము-తె. అధికము. [(బ. ఇట్టిరు.)

ఇట్టి-తె. ఇటువంటి. సమా. ఇట్టిఁడు - ఇట్టివాఁడు.

ఇడ-స. 1. ఒకనాడి. 2. బుధుని భార్య. రూ. ఇల, ఇళ.

ఇడి-తె. ఆవిపెట్టి యుడికించిన భక్ష్యము.

ఇడియు-తె. చీలు. కృ. ఇడుపు.

ఇడు-తె. 1. ఉంచు. 2. ఇచ్చు.

ఇడుపు-తె. 1. చీలిక. 2. గోడయిరుపార్శ్వముల మీఁది చోటు. 3. ప్రక్క.

ఇడుమ-తె. ఆపద.

ఇడ్డెన-తె. వాసెనకుడుము.

ఇతఁడు-తె. ఈ మనుజుఁడు. రూ. ఈతఁడు.

ఇతము-వి. (హితము) ఇంపు. రూ. ఇతవు.

ఇతరము-స. అన్యము. సమా. ఇతరేతరము- పరస్పరము.

ఇతవు-చూ. ఇతము. సమా. ఇతవరి- హితము చెప్పువాఁడు. రూ. ఇతకరి, ఇతవుఁడు.

ఇతిహాసము-స. పూర్వపు కథ. [పిత్తళి.

ఇత్తడి-వి. (పిత్తలము) ఒక లోహము.రూ.ఇత్తళి.

ఇత్తిగ-తె. (ఇరు+తిగ) ఆఱు. [రూ. ఇద్ది.

ఇది-తె. (ఈ+అది) 1. ఈవస్తువు. 2. ఈమె.

ఇద్దుగ-తె. (ఇరు+దుగ) నాలుగు.

ఇద్దుము-తె. (ఇరు+తూము) రెండు తూములు.

ఇద్ధము-స. 1. ప్రకాశము. 2. పరిశుద్ధము.

ఇధ్మము-స. సమిధ. (వ్యు. కాల్పఁబడునది)

ఇని-తె. ఇంతమాత్రము. రూ. ఇన్ని.

ఇను-తె. (సమాసమందు) రెండు. సమా.—మడి- రెట్టింపు. రూ. ఇన్మడి, ఇమ్మడి, ఇబ్బడి. క్రి. ఇనుమడించు.—మనుమఁడు-మనుమని కొడుకు. —మాఱు- రెండుమాఱులు.—మిక్కిలి- అత్యధికము. ఇన్నూఱు- రెండువందలు.

ఇనుము-తె. ఒకలోహము.సమా.ఇనుపకచ్చడము, ఇనుపగోచి- ఇంద్రియనిగ్రహము.

ఇపుడు-తె. (ఈ+ప్రొద్దు) ఈ సమయము. రూ. ఇప్పుడు, ఇప్డు.

ఇప్ప-తె. మధూకవృక్షము.

ఇబ్బంది-తె. (ఇరు+బంది) 1. మిక్కిలి నిర్బంధము. 2. కష్టము. 3. (ఇరు+పంది) అడవి పందికిని ఊరఁబందికిని పుట్టిన పంది.

ఇబ్బడి-చూ. ఇనుమడి. క్రి. ఇబ్బడించు.

ఇభము-స. ఏనుఁగు. (వ్యు. పోవునది.)

ఇభి-స. ఆఁడేనుఁగు. రూ. ఇభ్య.

ఇభ్య-స. 1-చూ. పై. 2. ఒడయురాలు.

ఇభ్యుఁడు-స. 1. ఒడయఁడు. 2. ధనికుఁడు. (వ్యు. గొప్పవాఁడు)

ఇముడు-తె. 1. పొందుపడు. 2. అణఁగు. 3. చొచ్చియుండు. కృ. ఇమిడిక.

ఇమురు-తె. 1. ఇంకు. 2. తేమయగు. కృ. ఇమ్మిరి, ఈమిరి.

ఇమ్మడి-తె. ఇనుమడి.

ఇమ్మిరి-తె. తేమ. రూ. ఈమిరి.

ఇమ్ము-తె. 1. స్థానము. 2. ఇంపు. 3. అనుకూల్యము. 4. ఉపాయము. 5. సుఖము. 6. యుక్తము. 7. స్పష్టము. 8. ఇల్లు. సమా. ఇమ్ముదప్పు- సంకటము.

ఇయ్యకొను-తె. సమ్మతించు. రూ. ఈయకొను. కృ. ఇయ్యకోలు.

ఇరవు-తె. 1. చోటు. 2. స్థిరము.

ఇరిణము-స. చౌటినేల. రూ. ఈరిణము.

ఇఱియు-తె. 1. కదియు. 2. నలఁగు. 3. సన్నగిలు. కృ. ఇఱుకు.

ఇరివిలి-తె. పోగర.

ఇరు-తె. (సమాసమందు) రెండు. సమా. ఇరాఱు-పంౘ్రెండు. రూ. ఈరాఱు. ఇరుగడ- రెండు ప్రక్కలు.( ఇట్లే ఇరుగెలఁకులు మొ.)—గురు-ఇద్దఱు. రూ. ఇరువురు. —ఁదలపాము- రెండు ప్రక్కల ఒకేతీరుననుండుపాము, పూడుఁబాము, డుండుభము.—ఁదలపులుగు-గండభేరుండపక్షి. —ఁబుట్టువు- 1. పక్షి. 2. బ్రాహ్మణుఁడు, ద్విజుఁడు.—తిగ-అఱు. రూ. ఇత్తిగ.—దంతి-ఏనుఁగు. —వంౘ్రు- ఇరువదిమంది. (ఇరు + పదుంౘ్రు) —వది- రెండుపదులు.—వాఁగు- ఉభయసేన. —వాయి- మలమూత్రద్వారములు. —వాయిపక్కి- గండభేరుండము.

ఇఱుకు-తె. 1. కొంచెములో అడఁగు, అడఁచు. 2. అదుముపడు. 3. అదుము. 4. కృ. గొంది. సమా.— మ్రాను- పశువులుపోకుండ నాటు పంగల గుంజ.

ఇరుగు-తె. ప్రక్కయిల్లు. రూ. ఇరవు.

ఇఱుము-తె. మఱుఁగు.

ఇరులు-తె. చీఁకటి. సమా.— గొంగ- సూర్యుఁడు.

ఇరుస-తె. రెండు పంచములు.

ఇరుసు-తె. బండిచక్రముల కడ్డముగా వేయు ఇనుప కడ్డీ, అక్షము.

ఇఱ్ఱి-తె. జింక. సమా.— గోఱజము- కస్తూరి.

ఇఱ్ఱింకులు-తె. (ఇంకులు + ఇంకులు) మిక్కిలి యింకుటలు.

ఇఱ్ఱియలు-తె. పార్శ్వము. [3. గోవు.

ఇల-స. 1. బుధునిభార్య. (రూ. ఇడ) 2. భూమి.

ఇలకటుచు-తె. పండ్లు బిగించు. రూ. ఈలకటుచు.

ఇలకోడి-తె. కిఱ్ఱుమని యఱచు పురుగు. రూ. ఈల పురుగు.

ఇలాయి-తె. చుట్టువత్తులువేయు దివ్వటి.

ఇలి-తె. 1. మెతుకు. 2. అన్నము.

ఇలు-తె. గృహము. రూ. ఇల్లు. సమా.—దొర-గృహస్థు. (ఇట్లే ఇలుతేఁడు మొ.) —పడి- 1. మంచినడత. 2. కులగౌరవము. —వరము- చిన్నగుడిసె. రూ. ఇలువారము. —వరుస- వంశానుక్రమము. —వేలుపు- కులదేవత.

ఇలుకు-తె. 1. కీళ్లసరము బెణఁకు. 2. కృ. బెణఁకుట.

ఇలుగు-తె. చచ్చు. రూ. ఈలుగు.

ఇల్లము-తె. రెండుపలములు. (ఇరు + పలము)

ఇల్లామల్లి-తె. కొండీఁడు.

ఇల్లి-తె. ఉపవాసము.

ఇల్లిగులు-తె. (ఇగ్గులు + ఇగ్గులు) 1. మిక్కిలి ఒఁగుట. 2. అధైర్యము.

ఇల్లిముక్కు-తె. పగిలి నెత్తురు కాఱు ముక్కు లోపలి భాగము.

ఇల్లు-తె. గృహము. రూ. ఇలు. సమా. ఇల్లటము- అల్లుఁడు మామగారింటనే వసించుట. రూ. ఇల్లంట్రము, ఇల్లఱికము. ఇల్లడ - దాఁచుమని యిచ్చిన సొమ్ము. ఇల్లరము - గార్హస్థ్యము. ఇల్లరి-1. ఇంటిపన్ను. 2. అద్దె. ఇల్లాలు- 1. భార్య. 2. ఇంటి యజమానురాలు.

ఇవక-వి. (హిమము) 1. శైత్యము. 2. చెమ్మ.

ఇవతల-తె. ఈవలిప్రదేశము. రూ. ఈతల.

ఇవతళించు-తె. వల్లనగు. రూ. ఇవతాళించు. కృ. ఇవతాళింపు.

ఇవము-చూ. ఇగము. సమా.—సూడు-సూర్యుఁడు.

ఇవల-తె. (ఈ+వలను) ఇవతల. రూ. ఇవ్వల. ఈవల.

ఇవురు-చూ. ఇగురు.

ఇవులుచు-చూ. ఇగిలించు.

ఇషణము-స. ఇచ్ఛ. రూ. ఈషణము.

ఇషికము-స. 1. బాణము. 2. కుంచె. రూ. ఇషీకము.

ఇషువు-స. బాణము. (వ్యు. శత్రువునుగూర్చిపోవునది) సమా. ఇషుధి-అమ్ములపొది. ఇష్వాసము-విల్లు.

ఇష్టక-స. ఇటిక. రూ. ఇష్టిక.

ఇష్టము-స. 1. కోరిక. 2. కోరఁబడినది. 3. యజ్ఞకర్మము. క్రి. ఇష్టించు. సమా.—దేవత-కులదేవత. క్రి. ఇష్టపడు.

ఇష్టి-స. 1. యజ్ఞము. 2. కోరిక.

ఇష్టుఁడు-స. ప్రియుఁడు.

ఇసడిలు-తె. 1. విసుగు. 2. అలయు.

ఇసిరో-తె. 1. ఛీకొట్టుట. 2. విసుగుసూచన. రూ. ఇస్సిరో, ఇస్సీ.

ఇసిఱింతలు-తె. చలనము.

ఇసుక-తె. ఏటనుండు సన్నని ఱాలు. రూ. ఇసుము. సమా. దిన్నె-సైకతము--పులకండము-కలకండ.

ఇసుమంత-తె. కొంచెము.

ఇసుళ్లు-తె. ఱెక్కచెదలు. రూ. ఈసుళ్లు.

ఇహము-స. ఈలోకము. (వ్య. పరము)

ఇహిహీ-తె. నవ్వుటయందలి ధ్వని.

## ఈ

ఈ-తె. ఎదుటనుండుదానిని దెలుపునది.

ఈంద్ర-తె. కల్లుగీఁచిజీవించు ఒకజాతి. (ఈఁడిగ అనియు.)

ఈంద్రము-తె. పీడనము. క్రి. ఈండ్రించు.

ఈఁక-తె. పక్షియెఱక. రూ. ఈఁకె.

ఈఁకు-చూ. ఇంకు. [సొరెపురుగు.

ఈఁగ-తె. మక్షిక. రూ. ఈవ. సమా. ఈఁగపులి-

ఈఁగు-తె. 1. ప్రవేశించు. 2. తొలఁగు. 3. ఓడు. 4. డయ్యు. 5. చచ్చు. [ఈఁటె.

ఈఁటియ-తె. పొడిచెడి సాధనము, కుంతము. రూ.

ఈఁత-తె. 1. ఈఁదుట. 2. ఈనుట. 3. అడవిఖర్జూరపుచెట్టు.

ఈఁద-తె. చలిగాలి. రూ. ఈఁదర.

ఈఁడు-తె. 1. ఈఁతకొట్టు. 2. దాఁటు. 3. గాలి. 4. ఈఁతచెట్టు.

ఈకడ-తె. ఈచోట. రూ. ఇక్కడ.

ఈకువ-తె. తడి.

ఈకె-తె. (ఈ+అక+ఎ) ఈమె.

ఈకొను-చూ. ఇయ్యకొను. కృ. ఈకోలు.

ఈక్షణము-స. 1. కన్ను. 2. చూపు. రూ. వీక్షణము. క్రి. ఈక్షించు.

ఈగడ-తె. జాడ.

ఈగి-తె. దానము. రూ. ఈవి. సమా.—కాఁడు-దానశీలుఁడు. —మ్రాను- కల్పవృక్షము.

ఈగు-చూ. ఇగ్గు. [రూ. ఈస.

ఈఁచ-తె. కాలుచేతులు సన్నగిలిపోయిన వంకర.

ఈచు-తె. 1. పాలు వట్టిపోవు. 2. అడుగంటు.

ఈచుకపోవు-తె. చావుదూడను కను.

ఈటు-తె. వ్యర్థము. క్రి. ఈటువోవు.

ఈశేరు-తె. అన్నము చల్లారు.

ఈడ-తె. 1. ఇక్కడ. 2. ఎట్టికిత్తలి.

స. స్తోత్రము.

ఈడిగ-తె. కల్లుగీఁచిజీవించు ఒకజాతి.రూ.ఈండ్ర.

ఈడిగిలఁబడు-తె. 1. చతికిలఁబడు. 2. మొండి వేసికొనికూర్చుండు. రూ. ఈడిగిలు,ఈడిగిల్లు.

ఈడు-తె. 1. సాఁగు. 2. జాఱు. 3. పాలుపిదుకు. 4. సమానము. 5. వయస్సు. 6. యౌవనము. 7. జీవితకాలము. సమా.—ప్రాయము - యౌవనము. —ముంత - పాలుపితుకు ముంత. క్రి. ఈడుచు - లాగు. కృ. ఈడుపు. ఈడుపెట్టు-తాకట్టించు.

ఈడేఱు-1. వృద్ధినొందు. 2. నెఱవేఱు. 3. ప్రథమ రజస్వలయగు.

ఈతఁడు-చూ. ఇతఁడు.

ఈతల-చూ. ఇవతల.

ఈతి-స. ఉపద్రవము. (ఈతిబాధ లాఱు: ఎలుకల దండు, మిడుతలదండు, చిలుకలదండు, చేరువనున్నరాజు, అతివృష్టి ,అనావృష్టి)

ఈదృశము-స. ఇటువంటిది.

ఈన-తె. 1. ఆకులలోని నరము. 2. విస్తరి కుట్టుటకై సన్నగాఁజీల్చిన జొన్నకఱ్ఱబొబ్బడము. రూ. ఈనియ, ఈనె.

ఈను-తె. పశ్వాదులు ప్రసవించు. కృ. ఈనిక.

ఈపి-తె. పేనుగ్రుడ్డు. రూ. ఈరు.

ఈపె-తె. (ఈ+అప+ఎ) ఈయమ.

ఈప్స-స. కోరిక.

ఈప్సితము-స. 1. కోరఁబడినది. 2. కోరిక.

ఈబరి-తె. నిష్ప్రయోజకుఁడు. రూ. ఈబరికొట్టు.

ఈమిరి-తె. తడి. ఈ. ఇమ్మిరి.

ఈము-చూ. ఇగము.

ఈమె-తె. (ఈ+అమ+ఎ) ఈపె.

ఈయ-తె. కోరిక. [కోలు, ఈకోలు.

ఈయకొను-అంగీకరించు.రూ.ఈకొను. వ్యు. ఈయ

ఈయన-తె. (ఈ+అన) ఇతఁడు.

ఈఱతాఱలు-తె. హెచ్చుతగ్గులు.

ఈరము-తె. పొదరిల్లు. రూ. ఈఱమి, ఈఱము.

ఈరస-వి. (ఈర్ష్య) 1. పగ. 2. కోపము. 3. అసూయ.రూ.ఈరసము,ఈసు. క్రి. ఈరసించు.

ఈరాలు-చూ. ఇరాలు.

ఈరిక-తె. మొలక.

ఈరు-తె. 1. అల్పము. 2. పేనుగ్రుడ్డు.రూ.ఈపి. సమా. ఈరెండ-కొంచెపాటి ఎండ.ఈరెలుఁగు-హీనస్వరము.

ఈరుచు-తె. ఈపివచ్చునట్లు ఈర్పెనతో ఈడ్చు.

ఈరుపెన-తె. ఈపినీడ్చు పొడవైన దువ్వెన. రూ. ఈర్పెన. [3. యథేష్టము.

ఈరువాఱు-తె. 1. విహరించు. 2. విహారము.

ఈరువు-తె. మాంసము.

ఈరేడు-తె. (ఇరు+ఏడు) పదునాలుగు.

ఈరేను-తె. (ఇరు+ఏను) పది.

ఈర్ష్య-స. ఓర్వలేమి. (వి. ఈరసము)

ఈర్ష్యాళువు-స. ఓర్వలేనివాఁడు.

ఈల-తె. 1. నాలుక మడిచి చేయు సన్ననిశబ్దము. (రూ. ఈన) 2. చిమ్మటకూఁత. 3. సిగ్గు. క్రి. ఈలకలుచు-ఊపిరిబిగఁబట్టి పండ్లుకలుచుకొను. రూ. ఇలకలుచు.సమా.—గ్రద్ద-1. ఒక తెగడేగ. 2. లోభి.—పురుగు-1. చిమ్మట. 2. ఇలకోడి.

ఈలుగు-తె. చచ్చు. రూ. నీలుగు, ఈల్గు, నీల్గు.

ఈలువు-తె. 1. పాతివ్రత్యము. 2. మానము. 3. ధైర్యము.

ఈవ-తె. ఈఁగ.

ఈవరి-తె. (ఈవి+అరి) ఈవికాఁడు, దాత.

ఈవల-మా. ఇవల.

ఈవి-తె. రూ.ఈగి.సమా. ఈవుల మొదవు - కామధేనువు.—మ్రాను-కల్పకము.-రతనము-చింతామణి.

ఈవు-తె. నీవు.

ఈశానుఁడు-స. 1. శివుఁడు. 2. రాజు.

ఈశాన్యము-స. ఈశానునిదిక్కు, పూర్వోత్తరము. సమా. ఈశాన్యభూమి-శ్మశానము.

ఈశుఁడు-స. 1. శివుఁడు. 2. ప్రభువు.

ఈశ్వర-స. అఱువదింట పదునొకండవ సంవత్సరము.

ఈశ్వరి-స. పార్వతి.

ఈశ్వరుఁడు-స. 1. శివుఁడు. 2. పరమాత్మ. 3. ప్రభువు. 4. (రెండవ పదమైనచో) శ్రేష్ఠుఁడు.

ఈషణము-స. 1. కోరిక. 2. ప్రేమ. రూ. ఇషణము. (ఈషణత్రయము: ధనేషణము, దారేషణము, పుత్రేషణము)

ఈస-మా. ఈచ.

ఈసడము-తె. 1. నింద. 2. అసహ్యము. క్రి. ఈసడించు.

ఈసరుఁడు-వి. ఈశ్వరుఁడు.

ఈసు-మా. ఈరస.

## ఉ

ఉంకించు-తె. యత్నించు. రూ. ఊఁకించు, ఊఁకు.

ఉంకు-తె. 1. ఎగురు. 2. సమ్మతి. సమా. ఉంకుటుంగరము-పెండ్లియందు వధూవరులు మార్చుకొనెడి ఉంగరము.

ఉంకువ-తె. అల్లుఁడు కన్యకొఱకు మామకిచ్చు ద్రవ్యము, ఓలి.

ఉంగ-తె. ఉగ్గు.

ఉంగరము-తె. చేతివ్రేలినగ. రూ. ఉఁగ్రము.

ఉంగడి-తె. నాము. రూ. ఉంగిడి.

ఉంగుటము-వి. (అంగుష్ఠము) బొటనవ్రేలు.

ఉంచు-తె. 1. పెట్టు. 2. నిలువచేయు.

ఉంఛము-స. పొలములలో రాలిన గింజల నేఱికొని జీవించుట, ఏరికపని.

ఉంట-తె. 1. ఉండుట. 2. గుండ్రనిది. 3.ఉండ.

ఉండ-తె. 1. గుళిక, 2. గుండ్రము. రూ.ఉంట.

ఉండు-తె. 1. వసించు. 2. నిలువు. 3. మిగులు. ప్రే. ఉంచు.

ఉండ్ర-తె. చండ్రచెట్టు. రూ. ఉండ్రస.

ఉండ్రము-తె. గుండ్రనిది. బ. మోదకములు.

ఉందురము-స. 1. ఎలుక. 2. పందికొక్కు. రూ. ఉందురువు. (వ్యు. ముఖముచే ముట్టినదానిని ద్రవింపఁజేయునది)

ఉంపదము-తె. ఉంచుకొన్న వేశ్య.

ఉంపుడుగత్తె-తె. ఉంచుకొన్న స్త్రీ.

ఉంబ-వి. (అంభా) పశుధ్వని.

ఉంబలి-తె. పలుచనిబురద. రూ. ఉబ్బలి,ఉమ్మలి, ఊబి.

ఉంబళి-తె. పన్నులేని ఇనాము గ్రామము.

ఉక్క-తె. 1. ఉమ్మ. 2. తాపము. 3. వేడి.

ఉక్కడము-వి. (ఉత్కటము) 1. గొప్ప. 2. దుస్సహత్వము. సమా. ఉక్కడీఁడు-శూరుఁడు.

ఉక్కణము-తె. కావలి. [ఉక్కళుఁడు.

ఉక్కటుఁడు-వి. (ఉత్కటుఁడు) శూరుఁడు. రూ.

ఉక్కళము-తె. దండెత్తి వచ్చుటను తెలిసికొనుటకై ఉంచు కావలి.
వి. (ఉపనిష్కరము) పురాభిముఖ రాజమార్గము.

ఉక్కిరిబిక్కిరి-తె. ఊపిరాడమి.

ఉక్కివము-తె. కపటము. డు. కపటి.

ఉక్కిస-తె. పొడిదగ్గు.

ఉక్కు-తె. 1. చచ్చు. 2. నలఁగు. 3. క్రుగ్గు. 4. మేలియినుము. 5. శౌర్యము. సమా. ఉక్కరి - శూరుఁడు. ఉక్కిఁడు - మూర్ఖుఁడు. ఉక్కుతునుక - శూరుఁడు. క్రి. ఉక్కడఁగు - 1. క్షీణించు. 2. చచ్చు. (ఇట్లే ఉక్కణఁగు మొ.)

ఉక్కెఱ-తె. తీపువెట్టిన ఉప్పిండి.

ఉక్తము-స. చెప్పఁబడినది.

ఉక్తి-స. మాట.

ఉక్షము-స. ఎద్దు.

ఉగము-తె. 1. ఆయువు. 2. సంవత్సరము. (ఉగాది-సంవత్సరాది)

ఉగ్గ-తె. బిగువైన. క్రి. ఉగ్గఁబట్టు.

ఉగ్గడించు-వి. (ఉద్ఘాటించు) 1. చెప్పు. 2. మ్రోఁగు.

ఉగ్గడువు-వి. (ఉత్కటము) అధికము.

ఉగ్గము-వి. (ఉద్గ్రాహము) పట్టుకొని పోవ ననుకూలముగా పాత్రలకుఁగట్టు త్రాడు.

ఉగ్గళించు-తె. నట్టువుఁడు కొలిపించు.

ఉగ్గాడు-తె. నాశముచేయు.

ఉగ్గించు-తె. 1. నేఁతదట్టముచేయు. 2. పొగడు.

ఉగ్గు-తె. 1. బిడ్డలకుపోయు చనుఁబాలాముదము. 2. ముడుత. క్రి. ఉగ్గుపడు-ముడుతలుపడు.

ఉగ్గుడు-తె. మేర.

ఉగ్మలి-తె. ఆఁడుది.

ఉగ్రము-స. భయంకరము. డు. శివుఁడు.

ఉగ్రాణము-తె. సామగ్రు లుంచు గది.

ఉచిఁత-తె. ఉస్త్రిచెట్టు. రూ. ఉచ్చిఁత.

ఉచితము-స. 1. తగినది. 2. వెలలేమి.

ఉచుకరించు-తె. ఉచుక్కుమను.

ఉచ్చ-తె. మూత్రము. సమా.—బుడ్డ - మూత్రాశయము.—మల్లి-దినమొల ఆఁడుది.

ఉచ్చము-స. ఉన్నతము.

ఉచ్చయము-స. 1. సమూహము. 2. పోఁకముడి.

ఉచ్చరణము-స. చెప్పుట. రూ. ఉచ్చారణము. క్రి. ఉచ్చరించు.

ఉచ్చాటనము-స. 1. వేళ్లతోఁబెఱుకుట. 2. పిశాచములను పాఱఁదోలుట.

ఉచ్చారము-స. మలము.

ఉచ్చావచము-స. నానావిధములైనది.

ఉచ్చి-తె. బ్రహ్మరంధ్రము, సోదు.

ఉచ్చు-తె. 1. దూఱు. 2. నాటిబయలువెడలు. 3. ఉరి.

ఉచ్చైశ్శ్రివము-స. ఇంద్రుని గుఱ్ఱము. (వ్యు. చెవులు నిక్కఁబొడుచుకొనియుండునది)

ఉచ్ఛిష్టము-స. (ఉత్ + శిష్టము) ఎంగిలి.

ఉచ్ఛ్రియము-స. (ఉత్ + శ్రయము) పొడవు.

ఉచ్ఛ్వాసము-స. (ఉత్ + శ్వాసము) 1. ఊపిరి బయటికివిడుచుట. 2. ఊఱట. 3. గ్రంథభాగము.

ఉజ్జ-తె. ఊహ. క్రి. ఉజ్జాయించు, ఉజ్జగొను. కృ. ఉజ్జాయింపు.

ఉజ్జగము-వి. (ఉజ్ఝనము) విడుచుట. క్రి. ఉజ్జగిల్లు-తొలఁగు. ఉజ్జగించు-1. తొలఁగించు. 2. విడుచు.

ఉజ్జి-తె. జత. రూ. ఉద్ది.

ఉజ్జీవనము-స. 1. జీవనము. 2. మరల ప్రాణము వచ్చుట. క్రి. ఉజ్జీవించు. [రాయి.

ఉజ్జువకల్లు-తె. అగ్నిపర్వతమునుండి బయలుపడు

ఉజ్జ్వలము-స. (ఉత్+జ్వలము) 1. ప్రకాశించునది. 2. తెల్లనిది. 3. సింగారము.

ఉజ్ఝనము-స. విడుచుట. (వి. ఉజ్జగము)

ఉటంకము-స. సంగ్రహము. క్రి. ఉటంకించు.

ఉటంకి-తె. ధీరుఁడు. రూ. ఉటంకు.

ఉటజము-స. పర్ణశాల. (వ్యు. ఆకులచే కప్పఁబడినది)

ఉటము-స. 1. ఆకు. 2. గడ్డి.

ఉట్టి-తె. పాత్రలుంచుకొనుటకు ఇంట వ్రేలఁగట్టిన చిక్కము.

ఉట్టిచీల-తె. రెండుప్రక్కలు తలలుగల చీల.

ఉట్టిపడు-తె. 1. ఉన్నట్టుండి ఏర్పడు. 2. తొనఁకు. [ల.

ఉట్టు-తె. 1. కాఱు, స్రవించు. 2. ఉప్పుపండఁదగిననే

ఉరాణి-తె. 1. ఎత్తు, ఉన్నతము. 2. గొప్ప.

ఉడిగము-తె. సేవ. రూ. ఊడిగము.

ఉడివోవు-తె. ఫలించుట పూర్తియగు. [కాయ.

ఉడుఁబోతు-తె. కట్టకడపట ఏర్పడు సారహీనమగు

ఉడుక-వి. (హుడుక్క) డుబుడక్కవంటి పెద్ద వాద్యసాధనము. రూ. ఉడుక్క, హుడుక, హుడుకు.

ఉడుకు-తె. 1. తపించు. 2. పచనమగు. 3. కృ. తాపము. 4. వేఁడి. సమా. ఉడుకాటము-1. సంతాపము. 2. బాధ. ఉడుకుఁగప్ప-ఉఱుకుడుగప్ప. ఉడుకుఁబోతు-అసూయాపరుఁడు. క్రి. ఉడుకాడించు-1. తొందరపెట్టు. 2. బాధించు.

ఉడుకువ-తె. 1. ఉడుగుట, 2. ఊఱుట. [కట్నము.

ఉడుగర-తె. 1. బహుమానము. 2. కానుక. 3.

ఉడుగు-తె. 1. మాను. 2. చిక్కిపోవు. రూ. ఉడువు. (ప్రే. ఉడుపు)

ఉడుత-తె. వీఁపుపై మూఁడు చారలు గల చిన్న జంతువు, చిక్రోడము. రూ. ఉఱత.

ఉడుచు-తె. ధరించు. ప్రే. కృ. ఉడుపు.

ఉడుపము-స. తెప్ప. (వ్యు. తేలునట్లు వదిలింపఁబడినది.

ఉడుపు-తె. 1. ఉడుగఁజేయు. 2. దుస్తు.

ఉడుము-తె. బల్లివంటి యొక పెద్దజంతువు, గోధ. రూ. ఉఱుము.

ఉడువు-తె. చూ. ఉడుగు. స. నక్షత్రము. (వ్యు. పైనుండునది) సమా. ఉడురాజు-చంద్రుఁడు.

ఉడ్డ-తె. 1. నాలుగు. 2. రాశి. సమా.—కేలు వేలుపు - విష్ణువు, చతుర్భుజుఁడు.—మోము వేలుపు-బ్రహ్మ, నలువ.

ఉడ్డీనము-స. పక్షి క్రిందనుండి పైకెగురుట.

ఉడ్డుగుడుచు-తె. ఊపిరితిరుగక బాధపడు.

ఉతక-తె. ఉత్తరాసి తిరిగెడుకొయ్య.

ఉతుకు-తె. 1. గుంజు. రూ. ఉదుకు. 2. కృ. ఉతుకుట.

ఉత్కంఠ-స. కోరినవస్తువు పొందుటకుఁ గలుగు వేగిరపాటు, తహతహ. రూ.. ఉత్కము.

ఉత్కటము-స. 1. అధికమైనది. 2. మదించినది.

ఉత్కరము-స. రాశి.

ఉత్కర్షము-స. 1. మేలు. 2. అతిశయము. 3. అభివృద్ధి. 4. సంతసము.

ఉత్కళము-స. ఆంధ్రదేశమున కుత్తరముననుండు నొకదేశము.

ఉత్కలిక-స. 1. ఉత్కంఠ. 2. గొప్ప అల.

ఉత్కలుఁడు-స. 1. నిర్వాహకుఁడు. 2. ఉత్కళదేశస్థుడు.

ఉత్కృష్టము-స. మేలు.

ఉత్క్రమణము-స. 1. పైకిఁబోవుట. 2. చావు.

ఉత్క్రోశము-స. 1. ఉద్రేకము. 2. సంకటము.

ఉత్త-తె. వట్టి.

ఉత్తంభనము-స. నిలుపుట. క్రి. ఉత్తంభించు.

ఉత్తంసము-స. 1. కర్ణభూషణము. 2. శిరోభూషణము. డు. గొప్పవాడు.

ఉత్తమము-స. (ఉత్+తమము) 1. శ్రేష్ఠము. 2. ముఖ్యము. 3. (వ్యాక.)కడపటిది. సమా. ఉత్తమర్ణుఁడు-అప్పిచ్చినవాఁడు. ఉత్తమాంగము-తల.

ఉత్తర-స. 1. ఇరువదియేడింట పండ్రెండవ నక్షత్రము. 2. విరటుని కూఁతురు. ము. 1. బదులు. 2. జాబు. 3. వడదెస. 4. మీఁదిది. సమా. ఉత్తరక్రియ-అపరకర్మము.—పక్షము- సిద్ధాంతము. (వ్య. పూర్వపక్షము)—ఫల్గుని-పదునొకండవ నక్షత్రము.—వాది - 1. ప్రతివాది. 2. పూఁటకాఁపు.—వాసము-పై వస్త్రము. రూ. ఉత్తరీయము. —సభ - పైన్యాయస్థలము. —సాక్షి-సాక్షికిసాక్షి.—ఉత్తరాయణము-సూర్యుఁడు ఉత్తరదిక్కున కేగు ఆఱుమాసములకాలము. ఉత్తరాషాఢ - ఇరువది యొకటవ నక్షత్రము. ఉత్తరోత్తరము-పైపై.

ఉత్తరణము-స. దాఁటుట. తె. ఖండించుట } క్రి. ఉత్తరించు.

ఉత్తరుఁడు-స. (ఉత్+తరుఁడు) 1. శ్రేష్ఠుఁడు. 2. విరటునికొడుకు.

ఉత్తరువు-తె. ఆజ్ఞ. [శైఖరిక.

ఉత్తరేను-తె. ముండ్లవంటి గింజలుగలఒక మొక్క.

ఉత్తలము-తె. 1. త్వర. 2. భయము. 3. పరితాపము. 4. వ్యత్యస్తము. క్రి. ఉత్తలపడు.

ఉత్తానము-స. 1. లోఁతులేనిది. 2. వెలికిలినది.

ఉత్తారకుఁడు-స. దాఁటించువాఁడు.

ఉత్తాలము-స. పొడవైనది.

ఉత్తి-స. 1. ఈడు. 2. ప్రతినిధి.

ఉత్తీర్ణము-స. దాఁటఁబడినది.డు. 1.దాఁటినవాఁడు. 2.కడతేఱినవాఁడు, కృతార్థుఁడు. [పొడవైనది.

ఉత్తుంగము-స. (ఉత్+తుంగము) మిక్కిలి

ఉత్తుఁడు-వి. (యుక్తుఁడు)తగినవాఁడు,సమర్థుఁడు.

ఉత్థానము-స. 1. లేచుట. 2. ప్రయత్నము.

ఉత్థితము-స. 1. లేచినది. 2. పుట్టినది.

ఉత్పత్తి-స. పుట్టుక.

ఉత్పథము-స. 1. ఆకాశమార్గము. 2. చెడుత్రోవ.

ఉత్పన్నము-స. పుట్టినది.

ఉత్పలము-స. 1. కలువ. 2. నల్లకలువ.

ఉత్పాటనము-స. పెల్లగించుట. క్రి. ఉత్పాటించు.

ఉత్పాతము-స. 1. అపశకునము. 2. తెలియక వచ్చు కీడు.

ఉత్పాదనము-స. కలిగించుట.

ఉత్పాదిల్లు-స. కలుగు. (వి.ఉప్పతిల్లు) [హాస్యము.

ఉత్ప్రాసము-స. మనస్సునొచ్చునట్లుచేయు అప

ఉత్ప్రేక్ష-స.(ఉత్+ప్ర+ఈక్ష)స్వభావసిద్ధమగు దానికి సామర్థ్యముచే అర్థాంతరము కలిగించు ఒక అలంకారము. క్రి. ఉత్ప్రేక్షించు.

ఉత్ఫుల్లము-స. వికసించినది.

ఉత్సంగము-స. 1. తొడ. 2. ఒడి. [మైనది.

ఉత్సన్నము-స. 1. పెల్లగింపఁబడినది. 2. శిథిల

ఉత్సర్గము-స. 1. దానము. 2. విడుచుట. రూ. ఉత్సర్జనము.

ఉత్సవము-స. 1. ఊరేగింపు. 2. పండుగ.

ఉత్సాహము-స. 1.సంతోషము .2.కోరిక. 3.పట్టుదల.4.ప్రభుశక్తి.క్రి.ఉత్సహించు,ఉత్సాహించు.

ఉత్సుకుఁడు-స.ఇష్టకార్యమునప్రయత్నించువాఁడు.

ఉత్సేకము-స. 1. అతిశయము. 2. గర్వము. 3. ప్రోక్షణము. క్రి. ఉత్సేకించు.

ఉత్సేధము-స. 1. పొడవు. 2. శరీరము.

ఉదంచనము-స. (ఉత్+అంచనము) 1. మూఁకుడు. 2. విజృంభించుట.

ఉదంతము-స. (ఉత్+అంతము) వృత్తాంతము. డు. మంచివాఁడు.

ఉదకము-స. నీరు. (వ్యు.తడుపునది) రూ.ఉదము. సమా. ఉదజము-నీటఁబుట్టినది.—ధి, ఉదన్వంతము-సముద్రము.

ఉదగ్రము-స. (ఉత్+అగ్రము) 1. పొడవైనది. 2. భయంకరము. 3. పెద్దది. 4. రమణీయము.

ఉదయము-స. 1. పుట్టుక. 2. ఉన్నతి. 3. పొడుపుఁగొండ. 4. ప్రాతఃకాలము. క్రి. ఉదయించు.

ఉదరము-స. 1. కడుపు. (వ్యు. ఆహారముచేనిండింపఁబడునది) 2. లోపలిభాగము. సమా. ఉదరంభరి - తనపొట్టనుమాత్రము చూచుకొనువాఁడు.

ఉదరు-తె. అదరు.

ఉదర్కము-స. 1. భవిష్యత్కాలము. 2. భవిష్యత్ఫలము.

ఉదర్చి-స. (ఉత్+అర్చి) అగ్ని.

ఉదాత్తము-స. (ఉత్+ఆత్తము) 1. వేదమందలి ఉచ్చస్వరము. 2. ఈవి. 3. ధారాళము. 4. ఎత్తైనది. డు. 1. గొప్పవాఁడు. 2. కరుణాళువు.

ఉదానము-స. (ఉత్+అనము) 1. బొడ్డు. 2. కంఠమందలి గాలి. (చూ. వాయువు)

ఉదారము-స. 1. గొప్పది. 2. డు. గొప్పవాఁడు. 3. ఇచ్చువాఁడు, దాత.

ఉదాసీనము-స. 1. తటస్థముగానుండునది, మైత్రియు శత్రుత్వమును లేకయుండుట. 2. అక్కఱలేమి.

ఉదాహరణము-స. దృష్టాంతము. రూ. ఉదాహారము. క్రి. ఉదాహరించు.

ఉదితము-స. 1. పుట్టినది. 2. చెప్పఁబడినది.

ఉదియ-తె. యత్నము. రూ. ఉద్దియ.

ఉదిరి-తె. అపరంజి.

ఉదిల-తె. 1. పరితాపము. 2. భయము.

ఉదీచి-స. ఉత్తరపు దిక్కు.

ఉదీచ్యము-స. ఉత్తరపు దిక్కుది.

ఉదీర్ణము-స. గొప్పది, ఉదారము.

ఉదుంబరము-స. 1. కడప. 2. రాగి. 3. అత్తిచెట్టు. 4. డు. పేడి.

ఉదుకు-చూ. ఉతుకు.

ఉదుటు-తె. 1. గర్వము. 2. పీటు, రూ. ఉదురు.

ఉదూఖలము-స. రోలు. రూ. ఉలూఖలము. (వ్యు. మీఁద బయలైయుండునది)

ఉద్గతము-స. భేదించుకొని బయటికివచ్చినది.

ఉద్గతి-స. 1. ఎగయుట. 2. పుట్టుట. రూ. ఉద్గమము. క్రి. ఉద్గమించు.

ఉద్గాత-స. యజ్ఞమందు సామవేదతంత్రము నడపు నతఁడు.

ఉద్గారము-స. 1. వెడలఁగ్రక్కుట. 2. త్రేపు. క్రి. ఉద్గారించు.

ఉద్గ్రాహము-స. (వి) ఉగ్గము.

ఉద్ఘాటనము-స. 1. ఏఁతము. 2. ఎత్తుట. 3. భేదించుట. 4. ఉగ్గడించుట. క్రి. ఉద్ఘాటించు.

ఉద్ఘాతము-స. 1. ఆరంభము. 2. దెబ్బ. 3. ఇనుపగుదియ.

ఉద్ఘోషము-స. 1. మొఱ. 2. పెద్దధ్వని. క్రి. ఉద్ఘోషించు.

ఉద్ద-తె. మిక్కిలి. సమా. ఉద్దవడి- 1. మిక్కిలి వేగము. 2. క్రమము. రూ. ఉద్దవిడి- ఉద్దరి. (ఉద్ద+దరి) ఏటవాలైన గట్టు.

ఉద్దండము-స. పొడవైనది. క్రి. ఉద్దండించు.

ఉద్దరువు-వి. (ఉద్ధారము) నేం మొ. ఉంచి తీసికొను వడ్డిలేనిఅప్పు, స్వాధీనపు అడమానము.

ఉద్దాముఁడు-స. 1. స్వతంత్రుఁడు. 2. వరుణుఁడు.

ఉద్ది-తె. 1. జత. 2. సమాసము. 3. కాలువకై పోసిన మిట్ట. క్రి. ఉద్దించు. సమా.—

ఉద్దికాఁడు, ఉద్దీఁడు } 1. జతకాఁడు. 2. మిత్రుఁడు.

ఉద్దిష్టము-స. ఉద్దేశింపఁబడినది.

ఉద్దీపనము-స. (ఉత్+దీపనము) 1. వెలుఁగుట. 2. ఆలంబనగుణాదికము. క్రి. ఉద్దీపించు.

ఉద్దేశము-స. 1. తలంపు. 2. నిశ్చయము. 3. గుఱి. క్రి. ఉద్దేశించు.

ఉద్ధతము-స. 1. గర్వించినది. 2. ఎత్తఁబడినది. 3. కఠినమైనది. 4. డు. గర్వి.

ఉద్ధతి-స. గర్వము.

ఉద్ధరణము-స. 1. పైకెత్తుట. 2. బాగుచేయుట. రూ. ఉద్ధారణము. క్రి. ఉద్ధరించు.

ఉద్ధర్త-స. ఉద్ధరించువాఁడు. రూ. ఉద్ధారకుఁడు.

ఉద్ధరణి-స. చేతిలో నీళ్లుపోసికొను చిన్న గరిటె వంటిది.

ఉద్ధారము-స. 1.వడ్డిలేనియప్పు.చూ.ఉద్ధరువు. 2. ఉద్ధరణము.

ఉద్ధూతము-స. (ఉత్+ధూతము) కదలింపఁబడినది.

ఉద్ధృతము-స. 1. పైకెత్తఁబడినది, ఉద్ధరింపఁబడినది. 2. చేఁదఁబడినది.

ఉద్ధృతి-స.1. పైకెత్తుట.2.గర్వము. [వికాసము.

ఉద్బోధము-స. 1. తలఁపు. 2. మేలుకోలు. 3.

ఉద్భటము-స. అధికము.

ఉద్భవము-స. పుట్టుక. క్రి. ఉద్భవించు, ఉద్భవిల్లు.

ఉద్భిజ్జము-స. (ఉత్+భిత్+జము) భూమిని భేదించుకొని పుట్టునది, చెట్టు. రూ. ఉద్భిదము.

ఉద్భిన్నము-స. వికసించినది.

ఉద్భూతము-స. పుట్టినది.

ఉద్భ్రాంతము-స. తిరుగుడుపడినది.

ఉద్యతము-స.1.యత్నించినది.2.పైకెత్తఁబడినది.

ఉద్యతి }
ఉద్యమము } స. యత్నము. క్రి. ఉద్యమించు.

ఉద్యానము-స. 1. రాజుతోఁట 2. వెడలుట.

ఉద్యాపనము-స. 1.వ్రతసమాప్తి. 2.వెడలించుట.

ఉద్యుక్తము-స. యత్నింపఁబడినది. డు. 1. యత్నించువాఁడు. 2. సంసిద్ధుఁడు.

ఉద్యోగము-స. 1. యత్నము. 2. పని. 3. కొలువు. క్రి. ఉద్యోగించు.

ఉద్యోతము-స.1.ప్రకాశించునది. క్రి.ఉద్యోతించు.

ఉద్రిక్తము-స. ఉద్రేకించినది. [ఉద్రేకించు.

ఉద్రేకము-స. అతిశయము, విజృంభణము. క్రి.

ఉద్వర్తనము-స. 1. నలుఁగు. 2. నలుఁగుపిండి. 3. ఎగయుట. 4. అతిక్రమించిన నడత.

ఉద్వహనము-స. 1. పైకిపట్టుట. 2. భరించుట. క్రి. ఉద్వహించు.

ఉద్వహుఁడు-స. 1. పైకెత్తువాఁడు. 2. కొడుకు. (రూఁతురు ఉద్వహ)

ఉద్వాసనము-స. లేవఁగొట్టుట.

ఉద్వాహము-స. పెండ్లి.

ఉద్వాహనము-స. 1. పెండ్లాడుట. 2. ఉత్కంఠ.

ఉద్విగ్నము-స. 1.భయమునొందినది. 2. వ్యవస్థ తప్పినది.

ఉద్వృత్తి-స. గర్వము.

ఉద్వేగము-స. 1. భయము. 2. కలఁత. రూ. ఉద్వేజనము. క్రి. ఉద్వేగిల్లు.

ఉద్వేలము-స. మేరమీఱినది, అధికము.

ఉనికి-తె. 1. ఉండుట. 2. స్థితి. 3. స్థానము. 4. నివాసము. 5. మృగములకై పొంచియుండుట. రూ. ఉనుకువ.

ఉనుచు-చూ. ఉంచు.

ఉన్నతము-స. పొడవైనది.

ఉన్నతి-స. పొడవు.

ఉన్నరూపు-తె. యథార్థము.

ఉన్ని-తె. గొఱ్ఱె మొ. వాని బొచ్చు. సమా. ఉన్ని బట్టలు-కంబళి వస్త్రములు.

ఉన్నిద్రము-స. 1.మేలుకొన్నది. 2.వికసించినది.

ఉన్మత్తము-స. 1. వెఱ్ఱియెత్తినది. 2. ఉమ్మెత్త.

ఉన్మాదము-స. వెఱ్ఱి, పిచ్చి.

ఉన్మీలనము-స. వికసించుట. క్రి. ఉన్మీలించు.

ఉన్మూలము-స. 1. వేరుతెగినది. పూర్తిగ చెడినది. క్రి. ఉన్మూలించు.

ఉన్మేషము-స. 1. కనువిచ్చుట. 2. వికాసము.

ఉప-స. సమీపము, సాహాయ్యము, బాగు అను నర్థములుగలిగించు ఉపసర్గము. సమా.—కంఠము-సమీపము. —కథ-కథతో వచ్చు చిన్న కథ. — కరణము - కొఱముట్టు. క్రి. ఉపక

రించు.—కర్త-మేలుచేయువాఁడు. రూ. ఉపకారి.—కారము-మేలు. రూ. ఉపకృతి. క్రి. ఉపకరించు.—క్రమము-ప్రారంభించుట. క్రి. ఉపక్రమించు.—క్రోశము - నింద.— గతి-ప్రాప్తి.—గమము-1. అంగీకారము. 2.సమీపించుట. క్రి. ఉపగమించు.—గూఢము - 1. కౌఁగిలింపఁబడినది. 2. దాఁపఁబడినది.—గూహనము - 1. కౌఁగిలింత. 2. దాఁచుట. —గ్రహము-1. ఉపయోగము. 2. చెఱ. 3. ఒక గ్రహమునుచుట్టి వచ్చు మఱొకగ్రహము. —గ్రాహ్యము-కానుక.—చయము-1. పొడవు. 2. వృద్ధి.—చారము- 1. సేవ. 2.సమ్మానము. 3. చికిత్స. 4. పూజ. క్రి. ఉపచరించు.(షోడశోపచారములు: — ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము) —జిహ్వక-కొండనాలుక.—జీవి- ఒకరిననుసరించి బ్రతుకువాఁడు.క్రి.ఉపజీవించు.—జీవిక-జీవనోపాయము.—జ్ఞ-ఉపదేశములేక తనంతఁగలుగుజ్ఞానము .—ద - కానుక.—దంశము-ఊరుఁగాయ. —దర్శకుఁడు-తప్పునడవకుండఁజూచుకొను అధికారి.—దానము - 1.అరణము. 2. కానుక.—దేశము - 1. హితవచనము. 2. నేర్పుట. క్రి. ఉపదేశించు.—దేష్ట-ఉపదేశించువాఁడు.—ద్రవము - విప్లవము,పీడ.—ధ - 1. ఉద్యోగమిచ్చుటకై చేయు పరీక్ష. 2. (వ్యాక) కడపటి యక్షరమునకు ముందటియక్షరము. —ధానము - 1. తలగడ. 2. స్నేహము. —నయనము-వడుగు. రూ. ఉపనయము,—నాయము.—నిషత్తు-1. వేదాంతము. 2. ధర్మము. 3. ఏకాంతము.—నిష్క్రరము - ఉక్క్రశము.—నీతుఁడు - వడుగైనవాఁడు. — న్యాసము- ఒక విషయమును విస్తరించి చెప్పుట. క్రి. ఉపన్యసించు.—పతి- ఱంకుమగఁడు.—పత్తి-1. కలిమి. 2. పుట్టుక. 3. కారణము. 4. దృష్టాంతము. —పన్నము - ఉపపత్తి కలది. —పాదనము-1.కలిగించుట. 2.సభలో నొక విషయమును ప్రవేశపెట్టుట. క్రి ఉపపాదించు. —ప్లవము- ఉపద్రవము.—బర్హము-తలగడ. —భోగము- అనుభవము.—మానము-పోలిక. రూ. ఉపమితి. క్రి. ఉపమించు.—మేయము-పోలికయందలి విషయము, ముఖ్యవస్తువు. పోల్పఁదగినది.—యమము-పెండ్లి. రూ. ఉపయామము. — యుక్తము - ఒదవుబడియైనది. —యోగము-ఒదవుబడి. క్రి. ఉపయోగించు. —రతము-ఉడిగినది.—రతి-1. నిలుపుదల. 2. పురుషాయితము. — రథ్య-రాకపోకలచే నేర్పడిన ఊరిముందరి దారి, పుంత.—రాగము-1. గ్రహణము. 2.వ్యసనము. 3.అన్యాయము. —రామము-నిలుపుదల. రూ. ఉపరమము. —లంభము-అనుభవము. — లాలనము-బుజ్జగించుట. క్రి. ఉపలాలించు.—లేఖనము-తఱిమెన.—లేపనము-అలుకుట.—వనము-తోఁట. —వాసము-పస్తు.క్రి.ఉపవసించు.—విష్టుఁడు-కూర్చున్నవాఁడు.—వీతము-సవ్యముగా వేసికొన్న జందెము.—వేశము-1. ఆసనము.2.కూర్చుండుట.—శమము-1. అడఁగుట. 2. ఓర్పు. రూ. ఉపశాంతి. క్రి. ఉపశమించు—శయము-మాటు.—శ్రుతము-ఒడంబడినది. —శ్రుతి-1. తమ సంభాషణమప్పుడు దబ్బాటునఁ గలుగు శుభాశుభ సూచకమగు అన్యసంభాషణశ్రవణము. 2. సమ్మతి.—సంహారము-1. మరలించుట. 2. పూర్తిచేయుట. క్రి. ఉపసంహరించు. —సర్గ-1. సంస్కృతపదములకు మొదట చేరు ప్ర, పర, ఉప, మొ. 2. ఆపద.—సర్జనము-అప్రధానము. — సర్పణము-1. ఆశ్రయము, ప్రాపు. 2. పెండ్లాడఁగోరుట. క్రి.ఉపసర్పించు. —స్పర్శము-1. ఆచమనము. 2. తాఁకుట. 3. స్నానము.—హతి-1. ఉపద్రవము. 2. నాశము.—హారము-కానుక. ఉపాంగము- 1. సుతి. 2.మీమాంసాది-(ఇవినాలుగు:—మీమాంస. న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము)

ఉపాంతము-1. సమీపము. 2. మూల. ఉపాఖ్యానము-ఇతిహాసము. —త్తము- 1. పొందఁబడినది. 2. అపహరింపఁబడినది.—దానము-కారణము. — దేయము - గ్రహింపఁదగినది. —ధానము-1. ఉంచుట. 2. ధరించుట. 3. కప్పుట.—ధి-1. ధర్మచింత. 2. కపటము. 3. విశేషణము. —ధ్యాయ-చదువుచెప్పు స్త్రీ. —ధ్యాయాని-ఉపాధ్యాయుని భార్య.—ధ్యాయి-1. ఉపాధ్యాయ. 2. ఉపాధ్యాయాని.—ధ్యాయుఁడు - చదువుచెప్పువాఁడు. —యనము - కానుక.—లంభము-మర్మముదూఱిపాలనాడుట. క్రి. ఉపాలంభించు.—సనము-1. సేవ. 2. పీఠము. క్రి.ఉపాసించు. ఉపేంద్రుఁడు-విష్ణువు. ఉపేక్ష-అశ్రద్ధ. క్రి. ఉపేక్షించు. ఉపోద్ఘాతము-1. పీఠిక. 2. ఉదాహరణము.

ఉపత్యక-స. కొండచేరువ నేల.

ఉపమ-తె. ఉపాయము. సమా. ఉపమరి-ఉపాయశాలి. స. 1. పోలిక. 2. సమానము.

ఉపవసము-తె.మేలుకొనుట. రూ. ఉప్పవసము.

ఉపస్కారము-స. సంబారము.

ఉపాకరణము } స.సంస్కార పూర్వకముగా వేద
ఉపాకర్మము } మును గ్రహించుట.

ఉపానహము-స. చెప్పు, పాదరక్ష. (వ్యు. పాదములయందు కట్టఁబడునది)

ఉపాయము-స. 1. పొందిక. 2. వెరవు. (ఇవి నాలుగు.—సామ దాన భేద దండములు)

ఉపాసము-వి. (ఉపవాసము) పస్తు.

ఉపేతము-స. కూడుకొన్నది. (వ్యు. అపేతము)

ఉపోషణము-స. ఉపవాసము.

ఉప్తము-స. గింజలు చల్లఁబడినది.

ఉప్తి-స. విత్తుట. [తించు.

ఉప్పత-తె. ఓర్వలేక ఆడిపోసికొనుట. క్రి. ఉప్ప

ఉప్పతిల్లు-వి. (ఉత్పాదిల్లు) పుట్టు.

ఉప్పన-తె. ఉప్పుగానుండుట.

ఉప్పర-తె. 1. ఉప్పమ్మిజీవించుఒకజాతి. 2. ఒడ్డెజాతి.

ఉప్పరము-వి. (ఉపరి) 1. ఆకాశము. 2.మీఁదు. సమా. ఉప్పరవీది - ఆకాశమార్గము. క్రి.ఉప్పరించు. రూ. ఉప్పరించు.

ఉప్పరి-తె. ఒడ్డెవాఁడు.

ఉప్పరిగ-వి. (ఉపరిగృహము) మేడ.

ఉప్పలవాయి-తె. బొట్టనజుట్టనవ్రేళ్ల నడిమిభాగము.

ఉప్పలి-తె. కీడు. [లుండు చోటు.

ఉప్పళము-తె. 1. ఉప్పుపండునేల. 2. ఉప్పురాసు

ఉప్పరించు-తె. ఉప్పరించు, పైకొను.

ఉప్పిఁడి-తె. (ఉప్పు+ఇఁడి) ఉప్పులేనిది.

ఉప్పిప్పి-తె. ఉప్పుడు బియ్యము.

ఉప్పు-తె. 1. ఆవిరిపోకుండ సుడుకఁబెట్టు. 2. లవణము. 3. ఉప్పఁదనము, ఉప్పన. సమా. ఉప్పుఁగండ-ఎండిన మాంసపు ముక్క.—గడలి-లవణసముద్రము. —గాయ - ఊరుఁగాయ. — జేఁప-ఎండినచేఁప. ఉప్పుపిండి- ఉడికించినపిండి.—బట్టి-ఉప్పు తనంతట పండెడు నేల.

ఉప్పుడు-తె. ఉడుకఁబెట్టినవి. (వడ్లు)

ఉప్పురియు-తె. ప్రాతగిల్లి ఉప్పుగా రాలు.

ఉప్పెన-తె. సముద్రము పొంగి వెల్లువవచ్చుట.

ఉప్పొంగు-తె. (ఉబ్బు+పొంగు) 1. ఉబుకు. 2. సంతోషించు. 3. విజృంభించు.

ఉబలాటము-తె. ఉత్కంఠ, తహతహ.

ఉబుకు-తె. 1. పొంగు. 2. కృ. పొంగుట.

ఉబుసు-తె. 1. విరామకాలము. 2. వృత్తాంతము.

ఉబ్బ-వి. (ఊష్మము) 1. ఉక్క. రూ. ఉమ్మ. ఉమ్మదము. 2. చాకలి గుడ్డల సుడుకఁబెట్టుట. సమా.ఉబ్బనీరు-ప్రసవజలము. రూ. ఉమ్మనీరు.

ఉబ్బకము-తె. 1. హెచ్చు. 2. ఉత్సాహము.

ఉబ్బతిల్లు-వి. (ఉత్పత్తి) 1. ఉబుకు. 2. పొంగు.

ఉబ్బరము-తె. 1. కడుపుబ్బుట. 2. అతిశయము. క్రి. ఉబ్బరపోవు- నివ్వెఱపడు. ఉబ్బరించు-

1.కడుపుబ్బు.2.అతిశయించు. కృ.ఉబ్బరింపు.
ఉబ్బలి-చూ. ఉంబలి.
ఉబ్బసము-తె. ఊర్ధ్వశ్వాసరోగము.
ఉబ్బు-తె. 1. ఉబ్బరించు. 2. పొంగు. 3. లేచు. 4. సంతోషించు. 5. లావగు. 6. సంతోషము. 7.ఉబ్బరము.ప్రే.ఉబ్బించు-స్తుతించిఉప్పొంగఁజేయు. సమా. ఉబ్బెత్తు - నడుమ పై కుబికియుండుట.
ఉభయము-స. 1. రెండవయవములుగలది. 2. స్వామికార్యము నడపు వంతు.
ఉమ-స. 1.పార్వతి. 2. కాంతి. 3. నూనెయవిసెచెట్టు. (వ్యు. తపము వలదని తల్లిచే అడ్డు పెట్టఁబడినది.) సమా. ఉమాపతి- శివుఁడు.
ఉమక-తె. వరిపొట్టు. రూ. ఉముక, ఊఁక.
ఉమాదము-వి.(ఉన్మాదము)వెఱ్ఱి.రూ.ఉమ్మాదము.
ఉమి-తె. ఉమిసిన ఎంగిలి. రూ. ఉమ్మి.
ఉమియు-తె. ఎంగిలిఉమ్ము.
ఉముక-చూ. ఉమక
ఉమ్మ-చూ. ఉబ్బ. క్రి. ఉమ్మగిల్లు- ఉక్కపెట్టు. సమా. ఉమ్మనీరు-ఉబ్బనీరు.
ఉమ్మడి-తె. 1. పొత్తు. 2. ఒక్కుమ్మడిగా.
ఉమ్మదము-తె. ఉక్క, ఉబ్బ. [ఉమ్మలికించు.
ఉమ్మలము-తె. దుఃఖము. క్రి. ఉమ్మలించు,
ఉమ్మలి-చూ. ఉంబలి.
ఉమ్మలిక-తె. దుఃఖము. రూ. ఉమ్మలికము.
ఉమ్మాదము-చూ. ఉమాదము. [మాయముత్తెము.
ఉమ్మాయముత్తెము-తె. 1. క్షుద్రమౌక్తికము. 2.
ఉమ్మి-చూ. ఉమి.
ఉమ్మెత-వి (ఉన్మత్త) దుత్తూరము. రూ.ఉమ్మెత్త.
ఉయాల-తె.ఊఁగెడుడోల. రూ. ఉయేల, ఉయ్యాల, ఉయ్యాల,ఉయ్యెల, ఉయ్యేల,ఊయల, ఊయాల, ఊయెల,ఊయేల. సమా.ఉయ్యాలతొట్టి-బిడ్డలను పరుండఁబెట్టుతొట్టి.—పులుఁగు- సారసపక్షి. —మంచము- డోలామంచము.
ఉరక-తె. మిన్నక. రూ. ఊరక.
ఉరగము-స.పాము.రూ.ఉరంగము, ఉరంగమము. (వ్యు. ఱొమ్ముతో ప్రాఁకునది)
ఉరడించు-తె. 1. వేగిరపడు. 2. విజృంభించు. రూ. ఉరణించు, ఉరవడించు, ఉరవణించు, ఉరువడించు.
ఉరణము-స. పొట్టేలు. రూ. ఉరభ్రము. (వ్యు. బిగ్గఱగా మొఱపెట్టునది)
ఉరమరిక-తె. రమారమి. రూ. ఉరామరిక.
ఉరము-స. వక్షము. రూ. ఉరస్సు. (వి. ఱొమ్ము) సమా. ఉరోజము- స్తనము.
ఉరలు-తె. 1. దొరలు. 2. కాఱు. 3. రాలు.
ఉరవడి-తె. (ఉరవు+వడి) అతివేగము. క్రి. చూ. ఉరడించు.
ఉరవు-తె. 1. తగినది. 2. అధికము.
ఉఱవు-తె. 1. తగినది. 2.సౌందర్యము.3.గొప్ప.
ఉరశించు-తె. ప్రకాశించు.
ఉరి-తె. 1. ఉచ్చు. 2. బంధము. క్రి. ఉరిదీయు- మెడకు త్రాడుగట్టి లాగి చంపు. క్రి. ఉరియాడు- ఊఁగులాడు.
ఉరిదె-తె. కుమ్మరపురుగు.
ఉఱిది-తె. దిట్టతనము.
ఉఱియ-తె. ధీరుఁడు.
ఉరియు-తె. 1. విడిపోవు. 2. చలించు. 3 నెరయు. 4. దుఃఖించు.
ఉఱియు-తె. కప్పునుండి నీరుకాఱు. కృ. ఉఱుపు.
ఉఱు-తె. 1. లక్ష్యపెట్టు. 2. శ్రేష్ఠమగు. 3. తగు.
ఉఱుఁద్రాళ్లు-తె.పాలుపితుకునపుడావుకాళ్లకుఁగట్టెడిత్రాళ్లు. రూ. ఉఱ్ఱుఁద్రాళ్లు.
ఉఱుకు-తె. 1.దాఁటు. 2.దుముకు. 3.పరుగెత్తు.
ఉఱుకుడుఁగప్ప-తె. తేమయున్న చోటనుండుకప్ప. రూ. ఉడుకుగప్ప.
ఉఱుకుడుబొడ్డు-తె. పైకుబికిన బొడ్డు.

ఉఱుగొట్టు-తె. కోఁతి ఉఱ్ఱుమను.
ఉఱుత-చూ. ఉడుత.
ఉఱుపు-తె. ఉఱియుట, ఇంటనీరు కాఱుట.
ఉరుమ-తె. ఒక చర్మవాద్యము.
ఉరుమంజి-తె. ముత్తెములుపుట్టు ఒకదేశము. రూ. హురుమంజి.
ఉఱుము-తె. 1.గర్జించు. 2.గర్జనము. 3.ఉడుము.
ఉరువడించు-చూ. ఉరడించు.
ఉరువడు-తె. నెఱవేఱు.
ఉరువడి-తె. 1. ఉరవడి. 2. వస్తుసమూహము.
ఉరువు-తె. 1. పరిత్యజించు. 2. తోలొలుచు. వి. 1. రూపము. 2. గొప్ప. స. 1. విరివియైనది. 2. శ్రేష్ఠమైనది.
ఉఱువు-తె. ఉఱుగొట్టుట.
ఉఱ్ఱటలూగు-తె. మిక్కిలి చలించు.
ఉఱ్ఱాడు-తె. వ్రేలాడు.
ఉఱ్ఱు-తె. కోఁతి చేయు ధ్వని.
ఉఱ్ఱుకట్టు-తె. ఉఱుఁద్రాళ్లకట్టు.
ఉఱ్ఱూఁతలూగు-తె. మిక్కిలి యూఁగు.
ఉర్వర-స. 1.ఎల్లపైరులచేనిండిన నేల. 2.భూమి.
ఉర్వి-స. భూమి. (వ్యు. విశాలమైనది) సమా. ఉర్వీశుఁడు- రాజు. (ఇట్లే ఉర్వీపతి. మొ.)
ఉలక-తె. 1. చులుక. 2. నిర్లక్ష్యము.
ఉలగరము-తె. తడిచేత నేల యుబుకుట. రూ. ఉలవరము. క్రి. ఉలవరించు.
ఉలవ-తె. కుళత్థము అను పైరు. బ. దానిధాన్యము.
ఉలి-తె. 1. వడ్రంగిసాధనము. 2. అల్పము. (రూ. నులి)
ఉలిపి-తె. తులువ. రూ. ఉలిపిగొట్టు.
ఉలియు-తె. 1. చలించు. (రూ. ఉరియు) 2. మ్రోయు. కృ. ఉలివు.
ఉలుకు-తె. 1. భయపడు. 2. కృ. భయము.
ఉలుచ-వి. (ఉలూపి) ఒకతెగ చేఁప.
ఉలుచు-తె. ఊడఁదీయు. రూ. ఉలుపు.
ఉలుప-హిం. 1.బహుమతి. 2.కానుక. రూ. ఉలుపా.
ఉలుపఁడు-తె. శోఫరోగముగలవాఁడు. రూ. ఉలుపి.
ఉలుము-తె. కుష్ఠరోగము. రూ. పులుము.
ఉలూకము-స. గుడ్లగూబ. (వ్యు. నేత్రతేజస్సుచే కాకులను దహించునది, బలముగలది)
ఉలూఖలము-స. రోలు. రూ. ఉదూఖలము. (వ్యు. దంచుటచే పొల్లును పైకిత్రోయునది)
ఉలూపి-స. 1. ఉలుచమీను. 2. ఒక నాగకన్యక.
ఉల్క-స. మంటలేని నిప్పు.
ఉల్బణము-స. 1. పొంగు. 2. అతిశయము.
ఉల్ముకము-స. కొఱవి. రూ. ఉల్మూకము.
ఉల్లంకి-స. చేఁపలనుపురుగులను తినుఒకతెగపిట్ట.
ఉల్లంఘనము-స. (ఉల్+లంఘనము) అతిక్రమణము. క్రి. ఉల్లంఘించు.
ఉల్ల-తె. అతిదూరము అతిసమీపముగా నడిమిచోటు
ఉల్లకుట్టు-తె. (ఉల్లము+కుట్టు) ఎత్తిపొడుచుట
ఉల్లడ-వి. (ఉల్లాభము) మేలుకట్టు. రూ. ఉల్లెడ
ఉల్లము-తె. హృదయము.
ఉల్లఱము-తె. (ఉల్లము+అఱు) దుస్సహము
ఉల్లల-తె. ఉడుకుటయందగు ధ్వని.
ఉల్లలము-తె. చలనము.
ఉల్లసము-తె. ఎత్తిపొడుపు. స. 1. సంతోషము 2. ప్రకాశము. రూ. ఉల్లాసము. క్రి. ఉల్లసిల్లు
ఉల్లాకు-తె. (ఉలి+ఆకు) చీటి.
ఉల్లాపము-స. గద్గదస్వరముతోఁ జెప్పిన మాట
ఉల్లాభము-స. మేలుకట్టు. (వి. ఉల్లడ)
ఉల్లారు-తె. గుఱ్ఱపుజీనుమీఁది పఱుపు.
ఉల్లానము-స. చూ. ఉల్లసము.
ఉల్లి-తె. 1. ఎఱ్ఱగడ్డ. 2. తెల్లగడ్డ. సమా. ఉల్లి పాషాణము- సౌవీరము.
ఉల్లుంఠనము-స. ఉపాలంభము.
ఉల్లెడ-తె. చూ. ఉల్లడ.

ఉల్లోలము-స. పెద్ద అల.
ఉవిద-వి. (యువతి) ఆఁడుది.
ఉవ్వాయి-తె. (ఉరు+వాయి) వికాసము.
ఉవ్విళలూరు-తె. 1.త్వరపడు. 2. ఆసపడు. రూ. ఉవ్విళ్లూరు.
ఉవ్వు-తె. పూనిక.
ఉవ్వెత్తు-తె. నిశ్శేషముగా.
ఉశనుఁడు-స. శుక్రుఁడు.(వ్యు.అసురుల శ్రేయస్సు నిచ్ఛయించువాఁడు.)
ఉశీరము-స.వట్టివేరు.(వ్యు.వాసనచేకోరఁబడునది)
ఉష-స. 1. రేయి. 2. బాణుని కూఁతురు.
ఉషర్బుధుఁడు-స. అగ్ని. (వ్యు. ప్రభాతకాలమున జ్వలించువాఁడు) [కాలము.
ఉషస్సు-స. తెల్లవాఱుటకుముందు నాలుగుగడియల
ఉషితము-స. 1. చలిది. 2.కాల్పఁబడినది.
ఉష్ట్రము-స. ఒంటె. (ఆఁడుఒంటె ఉష్ట్రిక) (వ్యు. ఎల్లపుడు ఎండచే తపింపఁబడునది)
ఉష్ణకము-స. వేసవికాలము.
ఉష్ణము-స. 1. వేఁడి. 2. ఎండకాలము. సమా. ఉష్ణరశ్మి- సూర్యుఁడు.—వారణము- గొడుగు.
ఉష్ణీషము-స. 1. తలపాగ. 2.కిరీటము. 3. తల. (వ్యు. ఉష్ణనివారణార్థ మిచ్ఛగింపఁబడునది)
ఉసి-తె. 1. పొడి. (రూ. నుసి) 2. గుఱితప్పుట.
ఉసికొలుపు-తె. రేఁపు.
ఉసిరిక-తె. నెల్లిచెట్టు.
ఉసుక-తె. ఇసుక.
ఉసుము-తె. 1. ఉదుకు. 2. తుడుచు.
ఉసురు-తె.సంతాపమునందగు ధ్వని.రూ. ఉసూరు, ఉస్సు, ఉస్సురు.
ఉహూహూ-తె. చలియందగు ధ్వని.
ఉహ్హూ-తె. అగ్నిమూఁదుటయం దగు ధ్వని.

## ఊ

ఊఁ-తె. ప్రశ్నను ఊఁకొట్టుటను దెలుపునది.
ఊఁక-తె. 1. ఊఁగులాట. 2. ఉముక.
ఊఁకర-తె. ఊఁకొట్టుట.
ఊఁకు-తె. పూను. రూ. ఊఁకించు, ఉంకించు. కృ. ఊఁకువ. [ఊఁకొను.
ఊఁకొట్టు-తె.ఊఁఊఁ అని వృత్తాంతమువిను. రూ.
ఊఁగు-తె. 1. కదలు. 2. ఇటునటు కదలు. రూ. ఊఁగాడు, ఊఁగులాడు. ఊవు, ఊవాడు. ప్రే. ఊఁచు, ఊఁపు.
ఊఁచ-తె. 1. జొన్నలోనగువాని కంకికాఁడ. 2. అరటిబొందె. 3. ముండ్లదుబ్బు. క్రి. ఊఁచ పట్టు, ఊఁచపడు, ఊఁచపోవు.సమా.ఊఁచబియ్యము-ముదురనిధాన్యము. —ముట్టు-నిశ్శేషము.
ఊఁటు-తె. పొడుచు. రూ. దూఁటు.
ఊఁత-తె. 1. ఊనిక, అవలంబము. 2. చేఁపలఁ బట్టు సాధనము. రూ. ఊఁతము. సమా. —కోల- ఊసుకఱ్ఱ. ఊఁతాణి- (ఊఁత+ ఆణి) నొగ ఊడిరాకుండవేయు చీల.
ఊఁద-తె. 1. వాఁపు. 2. ఈర్ష్య. సమా. ఊఁద బొద్దు-ఉఱుకుబొద్దు.
ఊఁదర-తె. కాయలు పండుటకును ఎలుకలు లోనగునవి చచ్చుటకును వేయు పొగ.
ఊఁదు-తె. 1. వాఁచు. 2. నిప్పుమున్నగువాని రగిలించు. 3. శంఖములోనగువానిని శబ్దింపఁ జేయు. 4. ఊను. 5. అదుము. 6. ఉంచు. 7. నొక్కు. 8. ఊఁతతో చేఁపలనుబట్టు. కృ. 9. చేఁపలఁబట్టు ఊఁత. 10. వాఁపు. సమా. ఊఁదుక్రోవి-ఊఁదెదు గొట్టము. —వెండి-శుద్ధముచేసిన వెండి. రూ. ఊఁదిన వెండి.
ఊఁపు-తె. 1. ఊఁగఁజేయు, 2. కృ. ఊఁచుట.
ఊఁపురము-తె. మూఁపురము.
ఊచు-తె. 1. వ్యాధిచే తలవెండ్రుకలు రాలు. 2. సన్నగిలు.

ఊట-తె. 1. ఊరెడు నీరు. 2. ఊరుఁగాయరసము. 3. మూలగ. 4. చేవ.

ఊటాడు-తె. 1. చలించు. 2. సంభ్రమించు.

ఊటించు-తె. వంచించు.

ఊటు-తె. వానచే భూమిపై నేర్పడు ఊట.

ఊడ-తె. మఱ్ఱిమున్నగువాని కొమ్మలనుండి క్రిందికి దిగు వేరు, అవరోహము.

ఊదనిఁబాడు-తె. 1. తొలఁగు 2. పాఱు. [ఊదెము.

ఊడిగము-చూ. ఉడిగము. రూ. ఊడియము,

ఊడు-తె. 1. విడుచు. 2. రాలు. 3. జాఱు. 4. కాఱు. 5. తెగు. 6. పాఱు.

ఊడుగు-తె. అంకోల వృక్షము.

ఊడుచు-తె. 1. చెత్తత్రోయు. 2. నాఱునాటు. రూ. ఊడ్చు. కృ. ఊడుపు, ఊడ్పు.

ఊఢ-స. 1. పెండ్లాము. 2. పెండ్లాడినది.

ఊతము-స. కుట్టఁబడినది.

ఊతి-స. 1. కుట్టు. 2. రక్షణము. 3. నేయుట.

ఊదర-తె. ఒకతెగకసవు. బ. ఊదరగింజలు.

ఊదా-హిం. ఎఱుపునలుపు కలిసినరంగు.

ఊదువత్తి-హిం. సాంబ్రాణి వత్తి.

ఊధము-స. పొదుఁగు.

ఊధస్యము-స. పాలు, క్షీరము.

ఊనము-స. తక్కువైనది.

ఊనిక-తె. 1. ఆనిక. 2. దిటవు.

ఊను-తె. 1. అవలంబించు. 2. పొందు. 3. వహించు. (రూ. పూను) 4. తోలును మెత్తపఱచు. కృ. ఊనిక.

ఊపిరి-తె. శ్వాసము. రూ. ఊరుపు, ఊర్పు. సమా. ఊపిరికుట్టు-ఊపిరివిడువనీక బాధించురోగము, యౌకము.

ఊబ-తె. పేడి, నపుంసకుఁడు.

ఊబి-తె. బురద. చూ. ఉంబలి.

ఊయల-చూ. ఉయాల.

ఊరక-చూ. ఉరక.

ఊఱట-తె. 1. ఊఱడుట. 2. విరామము.

ఊఱడు-తె. ఉపశమిల్లు. రూ. ఊఱడిలు, ఊఱడిల్లు.

ఊరవ్యుఁడు-స. కోమటి. (వ్యు- ఊరువులనుండి పుట్టినవాఁడు.

ఊరాఱుచు-తె. (ఊరుపు+ఆఱుచు) ఓదార్చు.

ఊరు-తె. 1. నీరుబయల్పడు. 2. నాను. 3. తడియగు. 4. పుట్టు. 5. ఏడికోల లేని నాఁగలి. 6. గ్రామము. 7. దేశము. 8. దేశాంతరము. సమా. ఊరఁగంద-ఒక తెగకంద.—బంది-ఊరిలో పెంపఁబడు ఒక తెగపంది.—బిచ్చుక-చటకము. —జోగి-బిచ్చగాఁడు. క్రి. ఊరఁబోవు-తగ్గు. ఊరుఁగాయ-ఊరవేసిన మామిడిలోనగువానిదబ్బ, ఉపదంశము.—బిండి-నంజుకొన నూఱిన వ్యంజనము. క్రి. ఊరుకొను-ఆఘ్రాణించు. రూ. మూరుకొను.

ఊఱు-తె. సరిపోలు.

ఊరుచు-తె. 1. ఊడుచు. 2. ఊపిరివిడుచు.

ఊరుపు-తె. 1. వ్యంజన విశేషము. 2. శ్వాసము. చూ. ఊపిరి.

ఊరువు-స. తొడ. సమా. ఊరుజుఁడు-వైశ్యుఁడు.—పర్వము-మోఁకాలు.

ఊర్జము-స. 1. పూనిక. 2. బలము. 3. ఊపిరి వెలికి విడుచుట. 4. కార్తికమాసము.

ఊర్జస్వలుఁడు, ఊర్జస్వి — స. 1. మిక్కిలి యుత్సాహముకలవాఁడు. 2. మిక్కిలి బలవంతుఁడు.

ఊర్జితము-స. దృఢము.

ఊర్ణము-స. 1. ఉన్ని. 2. నూలు. సమా. ఊర్ణనాభము-సాలెపురుగు. రూ. ఊర్ణనాభి. ఊర్ణాయువు-1. సాలెపురుగు. 2. పొట్టేలు 3. కంబళి.

ఊర్ధ్వము-స. 1. పొడవైనది. 2. మీఁదిది. సమా. ఊర్ధ్వరేతసుఁడు, —రేతస్కుఁడు — 1. జితేంద్రియుఁడు. 2. ఋషి. 3. శివుఁడు.

—లోచనము - మీఁగండ్లమెకము, శరభము.

ఊర్ధ్వేవు-తె. (ఊర్పు+పోవు) ఊపిరివిడుచు. కృ. ఊర్ధ్వేర.

ఊర్మి-స. 1. అల. 2.(వి)ఉమ్మి. 3.తహతహ. 4. నొప్పి. 5. పరంపర. 6. వస్త్రపుముడుత. (షడూర్ములు:ఆకలిదప్పిశోకమోహజరామరణములు)

ఊర్మిక-స. 1. అల. 2. వస్త్రపుముడుత. 3. ఉంగరము.

ఊర్మిళ-స. 1. జనకరాజుకూఁతురు, లక్ష్మణునిభార్య. 2. మగని నెడఁబాసిన స్త్రీ.

ఊలమాలగుడుచు-తె. తహతహ పడు.

ఊవాడు } చూ. ఊఁగు.
ఊవు

ఊషరము-స. చవుటిది (నేల) రూ. ఉషరము.

ఊష్మము-స. 1. (వి) ఉష్మ. 2. వేసఁగి. 3. (వ్యాక) శ ష స హ లు.

ఊష్మలము-స. ఉమ్మగలది.

ఊసరము-తె. కృశించినది. క్రి.ఊసరిలు,ఊసరిల్లు. వి. (ఊషరము) చవుటిది.

ఊసరవెల్లి-తె. రంగులుమార్చు తొండ,ఖింబకము.

ఊసివాసము-తె. ఊసు.

ఊసు-చూ. ఉబుసు.

ఊహ-స. తేనిమాటలు కొన్ని తెచ్చుకొనుట. రూ. ఊహము. క్రి. ఊహించు. సమా. ఊహాపోహలు- సంపూర్ణచర్చ.

ఊహ్యము-స. ఊహింపఁదగినది.

ఊళ-తె. నక్కకూఁత.

## ఋ

ఋక్కు-స. 1. మొదటివేదము. 2. వేదభాగము.

ఋక్షము-స. 1. నక్షత్రము. 2.ఎలుఁగుబంటి.రూ. రిక్షము. (వ్యు. చీఁకటిని పోఁగొట్టునది)

ఋజువు-స. చక్కనైనది.

ఋణము-స. అప్పు. (ఋణత్రయము:—దేవఋణము, ఋషిఋణము, పితౄణము) సమా. ఋణార్ణము- అప్పుతీర్చుటకై చేసిన అప్పు.ఋణీ. ఋణికుఁడు- అప్పుగొన్నవాఁడు.

ఋతము-స. 1. నీరు.2. సత్యమైనది. (వ్యు.అన్నతము) 3.పూజితము. 4. ప్రకాశ మొందినది.

ఋతి-స. 1.త్రోవ. 2.పోటీ. 3.రోఁత. 4.శుభము.

ఋతువు-స. రజస్వలయగుట. 2. వెలుఁగు. 3. వసంతాది.(ఇవి యారు:—వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము)

ఋత్విజుఁడు-స. కర్తచేధనముపుచ్చుకొని యజ్ఞము చేయించువాఁడు.

ఋద్ధము-స. 1. సమృద్ధినది. 2. పెరిఁగినది.

ఋభుక్షుఁడు-స. ఇంద్రుఁడు. (వ్యు. దేవతలసు పనులయందు ప్రేరేఁచువాఁడు)

ఋభువు-స. వేలుపు. (వ్యు. సత్యముచే జనించినవాఁడు, అదితికి జనించినవాఁడు)

ఋశ్యకేతువు-స. మన్మథుఁడు.

ఋశ్యము-స. మనుఁబోతు. రూ. ఋష్యము.

ఋషభము-స. 1. ఎద్దు. (వ్యు. ఆవునుగూర్చి పోవునది) 2. తిరుమల. 3. సప్తస్వరములలో రెండవది.4.డు.(ఉత్తరపదమగుచో)శ్రేష్ఠుఁడు.

ఋషభి-స. 1. మాచకమ్మ. 2. ముండ.

ఋషి-స.1.జ్ఞానాధికుఁడు.2.వేదము. 3.వెలుఁగు. 4.ముని. [సప్తర్షులు:—అత్రి, మరీచి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు,వసిష్ఠుఁడు. (మతాంతరవిధము) కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు.]

## ఎ

ఎ-1. ప్రశ్నమునువ్యతిరేకమును ప్రశంసను దెలుపునది. 2. ఒక స్త్రీప్రత్యయము. 3. లేమిని దెలుపు ప్రత్యయము.4.చూపుటనుఎక్కువతక్కువలను తనంతట అనునర్థమును దెలుపు ప్రత్యయము.

ఎంగిలి-తె. ఉచ్ఛిష్టము.రూ.ఏఁగిలి. క్రి. ఏగిలించు.

ఎంచు-తె. 1. లెక్కించు. 2. తలఁచు. 3. ఆక్షేపించు. 4. ప్రశంసించు.

ఎండ-తె. సూర్యప్రకాశము. సమా.—దొర-సూర్యుఁడు. (ఇట్లే ఎండతేఁడు మొ.) —మావులు-మృగతృష్ణ.

ఎండు-తె. 1. తడియాఱు. 2. నీరింకు. 3. తపించు. 4. శుష్కించు. కృ. ఎండ. ఎండఁగట్టు-ఆఱఁగట్టు. —గొట్టు- ఎండఁజేయు, ఎండించు. —బెట్టు- ఎండలోవేయు. సమా. ఎండుతెవులు-దేహము శుష్కించెడువ్యాధి. ఎండుపుఁదట్ట - ధాన్యను ఎండఁబెట్టుటకై అల్లిన తట్ట. [వులు.

ఎండుగులు-తె. ఎండఁబోసిన ధాన్యము. రూ. ఎండు

ఎండ్రకాయ-తె. కర్కటకము. రూ. ఎండ్రి, ఎండ్రిక.

ఎంత-తె. (ఏ+అంత) ఏకొలఁది.

ఎందఱు-తె. (ఎంత+వారు) ఎన్నిమంది.

ఎందు-తె. ఎచ్చోట.

ఎందులకు-తె. 1. దేనికి. 2. ఎచ్చోటికి.

ఎంబన్న-తె. (ఎంబె+అన్న) చేతవాతఁగానివాఁడు.

ఎంబె-తె. —పై—

ఎఁడు-తె. పరిమాణార్థకప్రత్యయము. గంపెఁడు మొ.

ఎకదొట్టు-తె. అతిశయించు.

ఎకరము-ఆం. 4840 చదరపు గజముల నేల, 100 సెంట్లు. రూ. ఎకరా. తె-ఏనుఁగునుగట్టు మొగసాల.

ఎకసకియము-తె. 1. వికటము. 2. పరిహాసము. రూ. ఎకసకెము, ఎకసక్కియము, ఎకసక్కెము, ఎకసెకియము, ఎకసెకెము, ఎకసెక్కియము, ఎకసెక్కెము, (వీనిరెండవయక్కరమునకుద్విత్వమును గలదు.) [నిలువక.

ఎకాయెకి-హిం. అతివేగముగా, నడుమార్గమున

ఎకిమీఁడు-తె. రాజు, ప్రభువు.

ఎకిరింత-తె. వాహనము. రూ. ఎక్కిరింత.

ఎక్కటి-వి. (ఏకము) 1. ఒకటి. 2. అసహాయము. సమా. ఎక్కటీఁడు-అసహాయశూరుఁడు.

ఎక్కడ-తె. (ఏ+కడ) ఏచోటు.

ఎక్కము-తె. గనిమ. వి-(ఏకము) ఒకటి. బి. గుణకహారపఠకము. రూ. ఎక్కాలు.

ఎక్కలి-తె. ప్రవాహముచేవచ్చి చేరిన యిసుక.

ఎక్కసకియము-చూ. ఎకసకియము. రూ. ఎక్కసకెము, ఎక్కసక్కియము, ఎక్కసక్కెము, ఎక్కసెకియము, ఎక్కసెకెము, ఎక్కసెక్కియము, ఎక్కసెక్కెము. [ఎక్కులు పెట్టు.

ఎక్కాడు-తె. (ఎక్కు+అడు) పురికొలుపు. రూ.

ఎక్కిడు-తె. (ఎక్కు+ఇడు) మోపెట్టు, నారి యెక్కించు. రూ. ఎక్కుడుపెట్టు, ఎక్కుపెట్టు.

ఎక్కిరింత-చూ. ఎకిరింత. [గలుగు బాధ.

ఎక్కిలి-వి. (హిక్క) దప్పి మున్నగువానిచేఁ

ఎక్కు-తె. 1. అతిశయించు. 2. ఇష్టమగు. 3. సిద్ధించు. 4. ఆరోహించు. 5. వింటినారి. 6. బి. ప్రేరేఁపణ. కృ. ఎక్కుడు. ఎక్కువ, ఎక్కిరింత. [లించు.

ఎక్కుడించు-తె. 1. హెచ్చించు. 2. నారిసడ

ఎక్కుడు-తె. 1. ఆరోహణము, ఎక్కుట. 2. వాహనము. 3. అధికము. 4. ఉత్కృష్టము. సమా. ఎక్కుడుమెకము-ఏనుఁగు, మహామృగము.

ఎక్కువ-తె. ఆధిక్యము.

ఎగ-తె. ఎగువ శబ్దమునకు సమాసమున మిగిలిన. రూపము. సమా. ఎగఁగొట్టు-1. ఎగురఁజేయు, 2. ప్రేరేఁచు. —ఁగ్రోలు-పీల్చు. —ఁజల్లు-పైకి చల్లు. —ఁజేఁపు-పాలువిడువకుండు. —ఁదన్ను-ఎగురవేయు. —ఁబట్టు- ఎత్తిపట్టు. —ఁబోఁత- 1. ఎగువకు వ్యాపించుట. 2. దుర్బోధ. —ఁబోయు-దుర్బోధచేయు. (ఇట్లే ఎగదిగ, ఎగదువ్వు, ఎగనీఁదు, ఎగరోఁజు, ఎగవేయు, ఎగాదిగ, మొ.)

ఎగచు-తె. 1. ఎగయఁజేయు. 2. తఱుము.

ఎగతాళి-తె. గేలి. [నెగపు.

ఎగపు-తె. 1. గర్వము. 2. మండిపడుట. రూ.

ఎగయు-తె. 1. పైకిలేచు. 2. ఎగురు. రూ. ఎగురు, నెగయు. కృ. ఎగవు, నెగవు.

ఎగసన-తె. ఎగువగా.

ఎగు-తె. ఎగురు ఎగువశబ్దములకు సమాసమందు మిగిలిన రూపము. సమా. —బుజము-ఉన్నత భుజము. —దల-1. పైభాగము. 2. వృద్ధి. —బోద-ఱెక్కలువచ్చి యెగిరెడు పక్షిపిల్ల. —మతి-సరకులెక్కించుట.

ఎగుచు-తె. తఱుము. రూ. ఎవుచు. [కానిది.

ఎగుడు-తె. మిట్ట. సమా. ఎగుడు దిగుడు-సమము

ఎగురు-తె. 1. ఎగయు. 2. కృ. ఎగురుట.

ఎగువ-తె. 1. మీఁదు. 2. ఆధిక్యము.

ఎగ్గతము-వి. (ఏకాంతము) రహస్యస్థలము.

ఎగ్గు-తె. 1. కీడు. 2. అపకారము. 3. దోషము. 4. అనాదరము. 5. బ. దూషణము. క్రి. ఎగ్గాడు-దూషించు. రూ. ఎగ్గులాడు-ఎగ్గించు. అనాదరించు. [హము. రూ. ఎగ్గుఱ్ఱు.

ఎగ్గుఱుతు-తె. (ఎగువ+గుఱుతు) విషయసంగ్ర

ఎచటు-తె. (ఏ+చోటు) ఎక్కడ. రూ. ఎచొటు, ఎచ్చటు, ఎచ్చొటు, ఎచ్చోటు.

ఎచరించు-తె. ఎచ్చరికచేయు. రూ. ఎచ్చరించు, హెచ్చరించు, ఎచ్చరికించు.

ఎచ్చరము-తె. 1. అవధానము. 2. సూచన. రూ. ఎచ్చరిక, హెచ్చరిక, ఎచ్చరింత.

ఎచ్చిరిలు-తె. 1. వర్ధిల్లు. 2. బాగుపడు. రూ. ఎచ్చిలు.

ఎచ్చు-తె. 1. అధికమగు. 2. అధికము. 3. ఆధిక్యము. రూ. హెచ్చు.

ఎట-తె. ఎక్కడ.

ఎటు-తె. ఏప్రకారము. రూ. ఎటులు, ఎట్టులు, ఎట్లు.

ఎట్టకునేని-తె. 1. కట్టకడకు. 2. అతిప్రయాసమున. రూ. ఎట్టకేని, ఎట్టకేలకు.

ఎట్టపోగు-తె. దండు. [ఎదురు.

ఎట్టయెదురు-తె. (ఎదురు+ఎదురు) మిక్కిలి

ఎట్టి-తె. ఎటువంటి. సమా. ఎట్టిఁడు - ఎట్టివాఁడు. (బ. ఎట్టిరు.)

ఎట్టూ-తె. ప్రశ్నార్థకము. రూ. ఎట్లూ.

ఎడ-తె. 1. స్థానము. 2. అవకాశము. 3. దూరము. 4. భేదము. 5. విఘ్నము. 6. వ్యవహారము. 7. లేఁబ్రాయముగలది. 8. నడుమ. 9. వి. (హృదయము) మనస్సు. (రూ. ఎడద. ఎడ+ఎద) సమా. ఎడఁబాటు-వియోగము. క్రి. ఎడఁబాయు. ఎడగట్టు-ఆఱినపుండు మరల చీముపట్టు. —కత్తియ-తార్పుకత్తె. —కాఁడు-తార్పుకాఁడు. —కారు-మాఘమునుండి జ్యేష్ఠ మాసములోపల పండించుపంట. —గడ్డ-చిన్న దరి. —గిల్లు-తొలఁగు. —తాఁకు-చేరు. —తెగు- 1. ఎడపడు. 2. విడివడు. రూ. ఎడత్రెచ్చు. —తెఱపి-1. వ్యవధానము. 2. విరామము. —దవ్వు-అతిదూరము. —నీరు-లేఁతటెంకాయలోని నీరు. రూ. ఎలనీరు, ఎళనీరు. —పడు-1. ఎడతెగు. 2. పూఁటపడు. —సాల. వేత్తైనగది. —పోవు-దౌత్యముచేయు. —వాఁడు-అన్యుఁడు.

ఎడపదడప-తె. అప్పుడప్పుడు.

ఎడమ-తె. సవ్యము. (వ్య. కుడి)

ఎడము-తె. 1. చోటు. 2. అవకాశము. సమా. ఎడమడుగు- వ్యత్యాసము. రూ. ఎడమడువు.

ఎడయిక-తె. ఎడఁబాటు. [ఎడపు)

ఎడయు-తె. 1. తొలఁగు. 2. ఎడఁబాయు. (ప్రే.

ఎడరు-తె. 1. భగ్నమగు. 2. కృ. ఆపద. 3. భంగము. 4. సందు. 5. ఎడారి. [విసర్జించు.

ఎడలు-తె. 1. వికలమగు. 2. విచ్ఛిన్నమగు. 3.

ఎడవు-తె. దవ్వు.

ఎడాటము-తె. విషయము.

ఎడారి-తె. నిర్జలమైన ఇసుకబయలు.

ఎడ్డ-చూ. ఎడ.

ఎడ్డమి-తె. ఆపద.

ఎడ్డము-తె. అడ్డంకి. రూ. అడ్డము.

ఎడ్డియ-తె. మూఢుఁడు. రూ. ఎడ్డె, ఎడ్డెఁడు.

ఎడ్డెన-తె. భోజనపాత్రముంచుకొను ఉన్నతపీఠము.

ఎతఁడు-తె. ఏపూజ్యుఁడు. రూ. ఏతఁడు.

ఎతుబరికాఁడు-తె. దొంగ. రూ. ఎత్తుబరికాఁడు.

ఎత్తనగోలు-తె. ఆరంభము.

ఎత్తరము-తె. ఉన్నతము. రూ. ఎత్తరవు.

ఎత్తళి-తె. కొఱముట్టు.

ఎత్తిలి-తె. గట్టిగా.

ఎత్తు-తె. *1.* కలుగు. *2.* అపహరించు. *3.* దండెత్తు. *4.* పైకెత్తు. *5.* తీయు. *6.* ప్రస్తావించు. *7.* వహించు. *8.* సంగ్రహించు. కృ. *9.* ఉన్నతి. *10.* చదరంగపుటెత్తు. *11.* ఉపాయము. *12.* తూనిక. *13.* దడియము. *14.* ప్రయత్నము. *15.* పూసరము. సమా. ఎత్తికొను-*1.* యత్నించు. *2.* కైకొను. *3.* అపహరించు. *4.* వహించు. *5.* ఉద్ధరించు. రూ. ఎత్తుకొను. కృ. ఎత్తికోలు. ఎత్తిపొడుచు-మర్మము దూఱనాడు. —వేయు-తీసివేయు. ఎత్తుగడ-*1.* ఉపాయము. *2.* యత్నము. —గడ్డలు-ప్రొయ్యిగడ్డలు. —గున్న-ఏనుఁగుపిల్ల. —వచ్చు-సరిపోలు. —వడు-*1.* లేవలేక పడు. *2.* చెడు. —వోవు-*1.* చెడు. *2.* తగ్గు.

ఎత్తెల-తె. చేఁపలఁబట్టు ఒకతెగ వల.

ఎద-తె. *1.* ఎడ, హృదయము. *2.* పశుఋతువు. ఎదవడు-*1.* భయపడు. *2.* పశువు ఫలపడు.

ఎది-తె. ఏవస్తువు. రూ. ఎద్ది, ఏది.

ఎదిరి-తె. *1.* విరోధి. *2.* ప్రతివాది. క్రి. ఎదిరించు.

ఎదుగు-తె. వర్ధిల్లు.

ఎదురు-తె. *1.* ఎదిరించు. కృ. *2.* ముందుభాగము. *3.* ఎదుటివాఁడు. *4.* వలపుకత్తె తావలచినవాని కిచ్చు ధనము. సమా. —కుత్తుకలు-బ. కుత్తుకలో లేచుగడ్డలు. —కొను-అభిముఖమగు. కృ. ఎదురుకోలు. —కడ-మాఱువ్రాసిన యొడంబడిక. —చుక్క-శుక్రుఁడెదురగుట, కానిది. —చూచు-ప్రతీక్షించు, వేచియుండు ఎదురొత్తు-మాఱొత్తు. —బొమ్మ-బొమ్మనడిమిభాగము.

ఎదురుచు-తె. *1.* ప్రతికూలమగు. *2.* ఎదిరించు.

ఎద్దడి-తె. (ఎత్తు+తడి) *1.* దారిద్ర్యము. *2.* శూన్యము.

ఎద్దము-తె. పట్టెతీరిన యంచు.

ఎద్దు-తె. వృషభము. (బ. ఎడ్లు, ఎడ్ల) సమా. —పట్టు-పిడిగొట్టు. —రాసి-వృషభరాశి.

ఎద్రుచు-తె. ఎదిరించు, ఎదురుచు.

ఎన-తె. సమానము. [ఎనయిక.

ఎనయు-తె. *1.* పొందికపడు. *2.* సరిపోలు. కృ.

ఎని-తె. ఎంత సంఖ్య. రూ. ఎన్ని.

ఎనిక-తె. గణనము. రూ. ఎన్నిక.

ఎనిమిది-తె. ఏడునొకటి. సమా. —కాళ్లచుక్క-పూర్వభద్రపదము. —కాళ్లరిక్క-నెల-భాద్రపదమాసము. ఎనమండ్రు- ఎనిమిదిమంది. ఎనమండుము- ఎనిమిదితూములు. ఎనమనూఱు- ఎనిమిదివందలు. రూ. ఎనమన్నూఱు.

ఎనియు-తె. కలిసికొను. (ప్రే. ఎనుచు, ఎనుపు.) కృ. ఎనుపుడు. [మంది.

ఎనుబండ్రు-తె. (ఎనిమిది+పదుండ్రు) ఎనుబది

ఎనుబది-తె. (ఎనిమిది+పది) ఎనిమిదిపదులు, అశీతి. రూ. ఎన్బది.

ఎనుము-తె. బఱ్ఱె, మహిషి. సమా. ఎనుపతేయు-నల్లతేలు. ఎనుపసరము, —పెంటి-బఱ్ఱె, గేదె. —పోతు-దున్న, మహిషము. [ఏదినము.

ఎన్నఁడు-తె. (ఏ+నాఁడు) *1.* ఏకాలము. *2.*

ఎన్నాళ్లు-తె. (ఎన్ని+నాఁడులు) ఎన్నిదినములు.

ఎన్ని-తె. (ఏ+అన్ని) ఎంతసంఖ్య. సమా. ఎన్నియేని- అనేకము. రూ. ఎన్నేని.

ఎన్నిక-చూ. ఎనిక. [సస్యాదిమంజరి. రూ. వెన్ను.

ఎన్ను-తె. *1.* లెక్కించు. *2.* ఆక్షేపించు. *3.*

ఎన్నువ-తె. ఆఁడువారేడ్చునపుడు అనుభవము నెంచి యెంచి పాటగాఁ బాడు చరిత్రము.

ఎన్నెమ-తె. పురిటిపురుగు.

ఎపుడు-తె. (ఏ+ప్రొద్దు) 1. ఏకాలము. 2. ఎల్లపుడు. రూ. ఎప్పుడు, ఎప్డు.

ఎప్పటి-తె. అప్పటి, మరల.

ఎప్పుడు-చూ. ఎపుడు.

ఎబ్బె-తె. అసహ్యసూచకము. సమా.—రాసి-రోఁతకలవాఁడు.—టికము-రోఁత.

ఎమిడిక-తె. కడుపులోఁగలుగు పామువంటి తెల్లని పురుగు. రూ. ఏటిక.

ఎముక-తె. అస్థి. రూ. ఎమ్ము, ఎమ్ముక. సమా. ఎముకలవఱ్ఱు - బక్క చిక్కినది. ఎమ్మూ్మటి-మూలగ.

ఎమ్మె-తె. 1. మనోహరత్వము. 2. విలాసము. సమా.—కాడు,—లాఁడు - విలాసవంతుఁడు.—లాఁడి-విలాసిని.

ఎయిదు-తె. 1. వెంబడించు. 2. పొందు. రూ. ఎయ్దు.

ఎర-తె. 1. ఆహారము. 2. బలి. 3. వ్యసనము.

ఎఱ-తె. 1. వానపాము. 2. ఎఱ్ఱనైనది. రూ. ఎఱ్ఱ.

ఎరఁగు-తె. 1. దిగు. 2. నమస్కరించు. రూ. ఎఱఁగు. కృ. ఎరఁగుడు, ఎఱఁగుడు.

ఎఱగందు-తె. (ఎఱ+కందు) లేత శిశువు.

ఎఱగన్ను-తె. శివుని అగ్నినేత్రము.

ఎరగలి-తె. కార్చిచ్చు. రూ. ఎరవలి.

ఎరగొను-తె. పరవశమగు.

ఎఱగొను-తె. కోపగించు.

ఎఱచి-తె. మాంసము. సమా.—తిండి-1. అసురుఁడు. 2. మాంసాహారి.

ఎఱబటికము-తె. రోఁత.

ఎరవలి-తె. 1. కార్చిచ్చు. రూ. ఎరగలి. 2. ఎరవు.

ఎరవు-తె. 1. ఒకటిరెండుదినములు వాడుకొనుటకై యితరులయొద్దతెచ్చికొనుసొమ్ము, యాచితకము. 2. భేదము. 3. అన్యము. 4. లాఘవము.

ఎఱసంజ-తె. సాయంసంధ్య.

ఎరియు-తె. 1. మండు. 2. పరితపించు.

ఎఱుఁగు-తె. తెలియు. కృ. ఎఱుక.

ఎఱుక-తె. 1. ఎఱుఁగుట. 2. పరిచయము. 3. సోదె. 4. జోస్యము. 5. గుఱుతు. 6. ఎఱుకచెప్పెడిజాతి.

ఎఱుకత-తె. ఎఱుకచెప్పెడి స్త్రీ, దైవజ్ఞ, ఎఱుకసాని.

ఎఱుకు-తె. 1. ఎఱుకజాతివాఁడు, బోయ.

ఎఱుకువ-తె. ఎఱుక, తెలివి.

ఎఱుపు-తె. ఎఱ్ఱన, రక్తవర్ణము.

ఎరువు-తె. (వ్యు. ఎండచేఎరియునది) పైరుకైచేర్చియుంచినచెత్త, పేడ. మొ. పాంసువు.

ఎరుసు-తె. (వ్యు. ఎరియుట.) ఈసు.

ఎఱ్ఱ-తె. 1. వానపాము. 2. ఎఱుపు. రూ. ఎఱ్ఱన. సమా.—గంధము-రక్తచందనము.—గద్ద-నీరులి. ఇప్పే—గన్నేరు,—గోరంట-మొ. ఎఱ్ఱని వేలుపు-అగ్ని. ఎఱ్ఱవాఱు-1. కోపించు. 2. ఎఱ్ఱనయగు.

ఎల-తె. 1. లేఁత. 2. స్వల్పము. 3. యౌవనముగలది. రూ. ఎడ 4. సాక్షి. సమా.—గోలు- 1. కలకలము. 2. ముందునడచుట.—తోఁట-ఆరామము.—నాఁగ-1. యౌవనవతి. 2. ఆఁడుది.—నీరు- ఎడనీరు. రూ. ఎళనీరు.

ఎలమి-తె. 1. వికాసము. 2. సంతోషము.

ఎలయు-తె. 1. చేరు. 2. కలుగు. 3. ఆసపడు. 4. పొందు. కృ. ఎలరు.

ఎలరు-తె. 1. అతిశయము. 2. వికసనము. క్రి. ఎలరారు. ప్రే. ఎలరుచు. కృ. ఎలరుపు.

ఎలుఁగు, ఎలువు } తె. 1. కంఠస్వరము. 2. భల్లూకము. రూ. (ఎలుఁగు గొడ్డు, ఎలుఁగుబంటి.)

ఎల్ల-తె. 1. పొలిమేర. 2. అంతయు. సమా. ఎల్లమ్మ-(ఎల్ల+అమ్మ) ఒక గ్రామదేవత. ఎల్లరు-ఎల్లవారు. ఎల్లవాఁడు-ఎవ్వఁడును. ఎల్లాఁపి-ఎల్లయందుండి జనులనాఁపి దోచుకొనువాఁడు. స్త్రీ. ఎల్లాపి కత్తియ,—కత్తె.

ఎల్లి-తె. 1. రేపు. 2. గొడుగు.

ఎల్లిదము-తె.చులుకఁదసము.రూ.ఏలిదము.డు.చులుకనివాఁడు.

ఎల్లుండి-తె. (ఎల్లి+ఉండి) రేపటి కావలిదినము.

ఎవఁడు-తె.(ఏ+వాఁడు)ఏమనుజుఁడు. రూ.ఎవ్వఁడు, ఎవ్వాఁడు,ఏవాఁడు,ఏఁడు. వేఁడు.

ఎవత-తె. (ఎవరి+త)ఎవరిస్త్రీ.రూ.ఎవతి,ఎవతుక, ఎవతె,ఎవరిత,ఎవరితి,ఎవరుతుక,ఎవరితె. (వీనిలోనివకారమునకుద్విత్వమును రేఫతకారసంయుక్తమునేర్పడఁగామఱికొన్ని రూపములేర్పడును.)

ఎవుచు-చూ. ఎగుచు.

ఎవ్వల-తె. (ఏ+వలను) ఏ ప్రక్క.రూ.ఏవల.

ఎస-తె. *1.* ఆధిక్యము. *2.* అత్యంతము. సమా. ఎసకొలుపు-ప్రేరేఁచు.రూ.ఎసవెట్టు. ఎసరేఁగు-విజృంభించు. ఎసలారు-అతిశయించు.

ఎసఁగు-తె. *1.*అతిశయించు. *2.* విజృంభించు.రూ. ఎసవు. కృ.ఎసకము.

ఎసరు-తె. *1.*మీఱు. *2.*వంటకై కాఁగఁబెట్టిననీరు.

ఎసలిక-తె. తీఱిక.

ఎసవు-చూ. ఎసఁగు.

ఎళనీరు-చూ. ఎడనీరు.

ఎళ్లము-తె. (ఏడు+పలము) ఏడు పలములు.

ఎళ్లు-తె. ఎద్దులు. రూ. ఎడ్లు.

## ఏ

ఏ-తె. *1.*ప్రశ్నమునుఉద్దేశమునుప్రశంసనువ్యతిరేకమునుదుఃఖమునుప్రార్థననునిర్ధారణమును నిర్దేశమును తనంతట అనునర్థమును సూచించునది.

ఏఁకట-తె. మిక్కిలియపేక్ష, ఏఁకరుట.

ఏఁకరి-తె. కిరాతులలో నొక తెగ.

ఏఁకరు-తె. వాఁచిపోవు. రూ. ఏకారు. కృ.ఏఁకట.

ఏఁచు-తె. బాధించు. కృ. ఏఁపు.

ఏఁజెల్ల-తె.(ఏను+చెల్లె) సంతాప సూచకము.

ఏఁడాది-తె.(ఏఁడు+ఆది) సంవత్సరము.

ఏఁడి-తె.ఎక్కడనున్నాఁడు.రూ.ఏఁడీ.(బ.ఏరి,ఏరీ.) *2.* నాఁగటిమేడి. (ఏడికోల అనియు)

ఏఁడు-తె. *1.*సంవత్సరము.*2.*ఎవఁడు.*3.*ఎల్లవాఁడు. సమా.ఏఁడుడి-ఆబ్దికము.

ఏఁదర-తె. కుటుంబముతోఁజేరనిస్వతంత్రపుసొత్తు.

ఏఁదుము-తె. (ఏను+తూము) అయిదుతూములు.

ఏఁపు-తె. ఏఁచుట, బాధ.

ఏఁబండ్రు-తె. (ఏను+పదుండ్రు) ఏఁబదిమంది.

ఏఁబది-తె. (ఏను+పది) ఐదుపదులు.

ఏఁబలము-తె.(ఏను+పలము) అయిదుపలములు. (వాడుకలో పదిపలములు)

ఏకకుండలుఁడు-స. *1.*బలరాముఁడు.*2.*కుబేరుఁడు.

ఏకకుఁడు-స. అసహాయుఁడు, ఎక్కటి, ఏకాంగి.

ఏకగురువు-స. సహపాఠి.

ఏకచరము-స. ఒంటరిగాఁడు. (పంది)

ఏకతము-వి. (ఏకాంతము) *1.*రహస్యస్థలము. *2.* ఆలోచన.

ఏకదంతుఁడు-స.వినాయకుఁడు,ఒంటికొమ్ము వేలుపు.

ఏకదృష్టి-స.*1.*కాకి.*2.*ఒకచూపుగలది.(ఇట్లే ఏకాక్షము. మొ.)

ఏకదేశము-స. అంశము, భాగము.

ఏకపత్ని-స. పతివ్రత.సమా. ఏకపత్నీ వ్రతుఁడు-ఒకే భార్యనుగలిగి ఆమెయందే ప్రేమయుంచువాఁడు.

ఏకము-స.*1.*ఒకటి.*2.*ముఖ్యము.*3.*అన్యము. *4.*అసహాయము.సమా.—పది-మార్గము.--పింగళుఁడు-కుబేరుఁడు. ఏకాంగి-ఒంటివాఁడు. ఏకాండము-అఖండము.ఏకాంతము-*1.*మిక్కిలి. *2.*ఇద్దఱకంటె నెక్కువజనములేనిది. ఏకాకి-ఏకాంగి. ఏకాదశము-పదునొకండు.ఏకాదశి-*1.*పదునొకండవతిథి. *2.*పదునొకండుతంత్రులుగలపరివాదిని అనువీణ.ఏకావళి-ఒంటిపేటహారము.ఏకాహము-*1.*ఒకదినము.*2.*మృతినొందినవారికి పదునొకం

దవనాఁడుచేయుశ్రాద్ధము. ఏకీభావము-ఐక్యము. క్రి. ఏకీభవించు.
ఏకలము-తె. ఒంటరిగాఁడు (పంది) స. అసహాయము.
ఏకు-తె. 1. దూదిని చక్కఁజేయు. 2. నిందించు. 3. కృ. ఏకిన దూదిచుట్ట.
ఏకుడు-తె. ఏకుట.
ఏకె-తె. (ఏ+అక) ఏయమ.
ఏగాని-తె. దుగ్గాని.
ఏగు-తె. పోవు. సమా.—దెంచు. 1. వచ్చు. 2. పోవు. రూ.ఏతెంచు.—పెండ్లి- వధూవరులను ఊరేగించు వేడుక.
ఏగురు-తె. అయిదుగురు. రూ. ఏవురు.
ఏచ-తె. 1. గ్రామ్యము (మాట).2.వక్రము.రూ. ఏస. సమా. ఏచకంకటిచుక్క -ఉత్తరాషాఢ.
ఏచు-తె. 1.అతిశయించు. 2.పెరుగు.3.విజృంభించు. కృ. ఏపు.
ఏట-తె.ప్రక్క.రూ.ఏటము.సమా.—వాలు-1.రాను రాను పల్లము. 2. పక్షపాతము.
ఏటికపాము-తె. ఎమిడిక. [మము.
ఏటికోళ్లు-తె.ప్రవరచెప్పిచేయునమస్కారము,ప్రణా
ఏటిరింత-తె. భారద్వాజపక్షి.రూ.ఏట్రింత.
ఏటు-తె.1.దెబ్బ.2.బాణప్రయోగము. క్రి. ఏటులాడు- ఆయుధములతో పోరు.
ఏడ-తె.(ఏ+కడ) ఏచోట. రూ. ఎక్కడ,ఏకడ.
ఏడక-స. గొఱ్ఱె.
ఏడకము-స. పొటేలు. (వి. ఏడిక)
ఏడాగోడము-తె. విరుద్ధము. [మిక్కిలిశ్రమపఱచు.
ఏడాటలాడించు-తె. సప్తవ్యసనములు గలిగించు,
ఏడిక-వి.(ఏడకము)పొటేలు.
ఏడు-తె. ఆఱునొకటి.
ఏడుగడ-తె.(ఏడు+కడ) (గురువు,తల్లి, తండ్రి, నాయకుఁడు,విద్య,దైవము,దాత అనుఏడువిధములుగల) రక్షణము. రూ. ఏగ్గడ.
ఏడుగురు-తె. ఏడుమంది.
ఏడుచు-తె. దుఃఖించు,రోదనముచేయు. రూ.ఏడ్చు. కృ. ఏడుపు, ఏడ్పు.
ఏణము-స. పెద్ద కన్నులుగల నల్లజింక. స్త్రీ. ఏణి.
ఏతఁడు-చూ. ఎతఁడు.
ఏతము-తె. నీరెత్తు యంత్రము. రూ. ఏతాము.
ఏతరి-తె. దుర్నయపరుఁడు.
ఏతు-తె. ఉద్ధతి.
ఏతెంచు-చూ. ఏగుదెంచు.
ఏది-చూ. ఎది.
ఏదీ-తె. 1. ఎక్కడనున్నది. 2. ఎట్లు.
ఏదు-తె. 1. నశించు. 2.పెంచు. 3.ముండ్లపంది.
ఏనాదము-తె. సముద్రతీరము.
ఏనాది-తె. అడవులలో నివసించుఒకతెగబోయజాతి.
ఏనాళ్లు-తె.1.అయిదుదినములు.2.వివాహానంతరము వియ్యంకు లొకరికొకరు పంపుకొనెడు సారె.
ఏని-తె. పక్షాంతరమును వికల్పమును దెలుపునది.
ఏనిక-తె.దంతి. రూ. ఏనుఁగు.సమా.—తిండి-సింహము.—దోమ- ఒకతెగ పెద్దదోమ, ఘోణిక.
ఏను-తె. 1.అయిదు.2.నేను.3.నాఁగు.సమా. ఏనూఱు-అయిదువందలు.చూ. ఏఁబది,ఏబండ్రు.
ఏనుఁగు-తె. 1.ఏనిక. 2.పెద్దది. సమా.—కాలు-కాలులావగువ్యాధి, శ్లీపదము.—గొంగ-సింహము.—పల్లేరు-పెద్దపల్లేరు.— మోముసామి-గజాననుఁడు.—రాకాసిగొంగ-శివుఁడు, గజాసురవైరి.— సొరము-సప్తస్వరములలోఏడవది,నిషాదము.
ఏపరించు-తె.1.అతిశయించు.2.విజృంభించు.
ఏపి-తె.నల్లనిగట్టిచేవగల ఒకచెట్టు. [చు, ఏపారు.
ఏపు-తె. 1.ఆధిక్యము. 2.విజృంభణము.క్రి·ఏపరిం
ఏపె-తె. (ఏ+అప) ఏయమ.
ఏమఱు-తె. (ఏమి+మఱచు) ప్రమాదపడు.రూ. ఏమఱిలు,ఏమఱిల్లు.ప్రే.ఏమఱుచు, ఏమఱించు.
ఏమఱుపాటు-తె. 1.ప్రమాదము.2.వంచనగా. 3. అకస్మాత్తుగా.
ఏమి-తె. 1. ప్రశ్నార్థకము. 2.ఏది.
ఏమె-తె. (ఏ+అమ) ఏ పూజ్యురాలు. [ఏటు.
ఏయు-తె. ప్రయోగించు.రూ.వేయు, ప్రేయు. కృ.
ఏరండము-స. ఆముదపుచెట్టు. [గుఱ్ఱము.
ఏరాది-తె. (ఎరవు+అది) ఒకదాని సంతతియైన
ఏరాలు-తె. (ఎరవు+ఆలు) తోడికోడలు.
ఏరాళము-తె. 1. అధికము. 2. అసంఖ్యము. రూ.

హేరాళము.
ఏరు-తె. 1. నాఁగలి. 2. తలనొప్పి. [2. నది.
ఏఱు-తె.1. క్రిందనుండువాని నొకటొకటిగానెత్తు.
ఏరుగు-తె.1. విషించు. 2.కృ.మలము.
ఏరుపడు-తె.1.వేఱుపడు. 2.తేటపడు. 3.బయలుపడు.4.నిర్ణయింపఁబడు. 5.సిద్ధపడు. రూ.ఏర్పడు. ప్రే. ఏఱుపఱచు,ఏర్పఱచు. కృ.ఏరుపాటు. ఏర్పాటు.
ఏఱువ-తె. దేశము.
ఏరువాక-తె. దుక్కికి మొదలు. [కృ. ఏర్చు.
ఏర్చు-తె. 1.తలనొచ్చు.2.ఏర్పఱచు.3.దహించు.
ఏల-తె. ఎందులకు. రూ. ఏలా.
వి. (హేల)స.శృంగారపుపాట, ఏలకి.
ఏలకి-వి. (ఏల) ఏలకితీఁగ.
ఏలము-హిం. గుంపుచేర్చివెలనుహెచ్చించుటకై రేఁ పెట్టుట. [రూ. ఏలాము.
తె.కల్లుగీచువాఁడాతోఁపులో వేసికొనుగుడిసె.
ఏలముపట్టు-తె. ఆలంబనము.
ఏలి-తె.కృత్రిమము.(ఏలిమాట,ఏలిసింగము మొ.)
ఏలిక-తె.రాజు. రూ. ఏలినవాఁడు.(స్త్రీ.ఏలికసాని)
ఏలిదము-చూ. ఎల్లిదము.
ఏలు-తె. 1.పరిగ్రహించు. 2.పాలించు. రూ. ఏలుకొను. సమా.—కోటిజనము-పరిపాలనమునకు లోఁబడినప్రజ.—బడి-పరిపాలనము.
ఏవ-తె. రోఁత.రూ.ఏవము.క్రి.ఏవగించు,ఏవపడు.
ఏవల-తె. (ఏ+వలను) ఏప్రక్క. రూ. ఎవ్వల.
ఏవాఁడు-చూ. ఎవఁడు.
ఏవురు-చూ. ఏగురు.
ఏషణి-స. శలాక.
ఏష్యము-స. కాఁగలది.
ఏస-తె. 1. విజృంభణము.క్రి. ఏసరేఁగు. 2.గ్రామ్యపుమాట. 3. వక్రము. రూ.ఏచ.
ఏసరు-తె. మీఱు.
ఏసి-తె. 1. కొలఁది. 2. వంతున.

## ఐ

ఐందవము-స. ఇందుని సంబంధమైనది.
ఐంద్రజాలికుఁడు-స. ఇంద్రజాలము నేర్చినవాఁడు.
ఐకకంఠ్యము-స. ఏకకంఠత్వము, ఒద్దిక.
ఐకమత్యము-స. ఏకమతిత్వము, ఒద్దిక.
ఐక్యము-స. ఏకీభావము, ఒరిమ.
ఐణేయము-స.ఏణచర్మము మొదలైనది.
ఐతి-తె. శక్యము. రూ. అయితి.
ఐతిహాసికుఁడు-స. ఇతిహాసము తెలిసినవాఁడు.
ఐతిహ్యము-స. పారంపర్యముచే నగు ఉపదేశము.
ఐదు-తె.నాలుగునొకటి.రూ. అయిదు.సమా.—గురు-అయిదుమంది.—పదిచేయు-నమస్కరించు.—మోముల వేలుపు-శివుఁడు,పంచముఖుఁడు.—వ-(వ్యు. మంగళసూత్రము,పసుపు,కుంకుమ,గాజులు,చెవ్వాకుఅనుఐదుగుర్తులుగలది) సుమంగలి. రూ. ఐదువరాలు.
ఐద్దాయులు-తె.(ఐదు+దాయులు) వడ్రంగి,కమ్మరి,కంచరి,అగసాలె,కాసెవాఁడు అను నైదుతెగల పనులు చేయువారు.
ఐనిల్లు-తె.(ఐన+ఇల్లు) 1.నట్టిల్లు.2.మేలుకలిగించు ఇల్లు. రూ. అయినిల్లు.
ఐపు-తె. తప్పు, దోషము. రూ. అయిపు. [పోవు.
ఐపోవు-తె. 1.వెచ్చమగు. 2.ముగియు. రూ.అయి
ఐమూల-తె. మూలవాటు. రూ. అయిమూల.
ఐర-తె. నేత్రరోగము. రూ. అయిర, అవిర.
ఐరకొను-తె.చక్కఁబడు. రూ. అయిరకొను.
ఐరావణము-స. ఇంద్రునియేనుఁగు. (వ్యు.కల్లుగల వనమునఁ బుట్టినది.)
ఐరావతము-స.1.ఐరావణము. (వ్యు.సముద్రమునఁ బుట్టినది)2.వంపులేనినిడుపైన ఇంద్రధనుస్సు. 3.మబ్బుమీఁదవచ్చుమబ్బు,రాజమేఘము.4.తూరుపుదిక్కేనుఁగు. (దీనిభార్య అభ్రము)
ఐరావతి-స. 1. మెఱపు. 2. కోలమెఱపు. [రేని.
ఐరేని-తె. బచ్చెనపనిచేసినపెండ్లికుండలు.రూ.అయి
ఐలబిలుఁడు-స. ఇలబిలకొడుకు,కుబేరుఁడు.
ఐవచ్చు-తె. అచ్చివచ్చు. రూ. అయివచ్చు.
ఐశ్వర్యము-స.1.సంపద.2.అణిమాది. (ఇవిఎనిమిది:అణిమ,మహిమ,గరిమ,లఘిమ,ప్రాప్తి, ప్రాకామ్యము,ఈశత్వము,వశిత్వము)
ఐహికము-స. ఇహసంబంధమైనది.

## ఒ

ఒ-తె. సందేహార్థకము.
ఒంకియ-వి. చిలుకకొయ్య. రూ. ఒంకె. [ఒందిలి.
ఒంజిలి-తె. 1.దుఃఖము. 2.దుఃఖముకలవాఁడు. రూ.
ఒంటరము-తె. (ఒంటి + అఱు) విరోధము.
ఒంటరి-తె. (ఒంటి + అరి) 1.ఏకాకి. 2.అసహాయశూరుఁడు. రూ. ఒంటరీఁడు. సమా.—కాఁడు- ఒంటిమైఁదిరుగు పంది, ఏకచరము.
ఒంటి-తె. ఏకాకిత్వము. సమా.—కంటిగాము-శుక్రుఁడు.—కాఁడు-ఏకచరము.—కొమ్ము వేలుపు-ఏకదంతుఁడు.—పాటు-ఏకాంతము.—పోఁగు-బలరాముఁడు.
ఒంటింపు-తె. 1.అనుకూల్యము. 2.పసులయేర్పాటు.
ఒంటియ-వి. (ఉష్ట్రము) మహాంగము, లొట్టిపిట. రూ. ఒంటె.
ఒంటు-తె. 1.ఇముడు. 2.అనుకూలించు. కృ. ఒంటింపు, ఒంటు, వంటు. [క్రమక్రమముగా.
ఒండు-తె. 1.ఒకటి. 2.అన్యము. సమా. ఒండొండ-
ఒండె-తె. (ఒండు + ఎ) 1. అటుకానిపక్షమున. 2.కాని. (ఒండేనిఅనియు) [ఒద్దిక, పొందిక.
ఒందిక-తె. 1.ఆనుకూల్యము. 2.ప్రతిమానము. రూ.
ఒందిలి-తె. దుఃఖము. రూ. ఒంజిలి.
ఒందు-తె. 1.కలుగు. 2.పొందు. కృ. ఒందిక, ఒద్దిక.
ఒక-వి. (ఏకము) 1.రూ. ఒక్క. 2.ఒకానొక. సమా. ఒకఁడు-1. ఒకమనుజుఁడు. 2. అన్యుఁడు. రూ. ఒకొఁడు, ఒకరుఁడు, ఒకొరుఁడు, ఒకరువుఁడు, ఒకొరువుఁడు. (వీనికి కారద్విత్వములునుగలవు) 3.ఒకటి. 4.అన్యము. రూ. ఒకఁడు, ఒకొఁడు, ఒకొటి, ఒక్కటి, ఒక్కొటి, ఒక్కఁడు, ఒక్కొఁడు.
ఒకత - ఒకస్త్రీ. రూ. ఒకతి. ఒకతుక, ఒకతె. ఒకరిత, ఒకరితి, ఒకరుతుక, ఒకరితె, ఒకొరిత, ఒకొరితి, ఒకొరుతుక, ఒకొరితె. (వీనికి కారద్విత్వములును, రేఫతకారసంయుక్తములునుగలవు) మఱియు ఒర్త, ఒర్తి, ఒర్తు, ఒర్తుక.
ఒకట-వి. 1.ఏకకాలమున. 2.కూడ. రూ. ఒక్కట, ఒకొట, ఒక్కొట.
ఒకొ-తె. సందేహార్థకము. రూ. ఒకో. ఒక్కొ, ఒక్కో.
ఒక్క-చూ. ఒక. సమా. ఒక్కప్రొద్దు - వ్రతనియమముచేఁ జేయు ఒకపూటభోజనము.
ఒక్కెఱ-వి. (ఉగ్రత) కోపభావము.
ఒగరు-వి. (తువరము) కుత్తుకను పట్టుకొను పచ్చివెలఁగకాయ లోనగువానిరుచి. క్రి. ఒగరుచు.
ఒగి-తె. క్రమముగా. రూ. మొగి.
ఒగుడు-తె. జొన్నలోనగువానియెండినయాకు. క్రి. ఒగుడుకలుచు-కృశించు.
ఒగ్గము-తె. అవపాతము.
ఒగ్గు-తె. 1.మొనయు. 2.ఒడ్డు. 3.చాఁచు. సమా.—బల్ల-తటిమెనకొయ్య కాధారముగా నుంచునది.
ఒచ్చెము-తె. 1.న్యూనత, కొఱఁత. 2.అవమానము.
ఒచ్చెల-తె. (ఓ + చెల్లె) సంతాపసూచకము. రూ. ఒచ్చెల్ల, ఓచెల, ఓచెల్ల. రూ. ఓజ.
ఒజ్జ-తె. 1.ఉపాధ్యాయుఁడు. 2.పురోహితుఁడు. 3.యాజకుఁడు. (ఇది ఉపాధ్యాయశబ్దభవము కాదు. వ్యు. ఓజకలవాఁడు.) సమా.—తనము-ఉపాధ్యాయత్వము.—బంతి - ఉపాధ్యాయుఁడు చూపిన పద్ధతి, మేలుబంతి.—సాని-ఒజ్జభార్య.
ఒట్టు-తె. 1.కలుగు. 2.ఉంచు. 3.రగుల్చు. 4.అంటించు. 5.శపథము.
ఒడఁగూడు-తె. 1.సిద్ధించు. 2. చేరు.
ఒడఁబడు-తె. 1.సమ్మతించు. 2.సంతోషించు. 3.అనుకూలించు. కృ. ఒడఁబడిక, ఒడఁబాటు. రూ. ఒడంబడు.
ఒడపి-తె. గండి.
ఒడమి-తె. ధనము. [యుఁడు.
ఒడయఁడు-తె. 1.మగఁడు. 2. ప్రభువు. రూ. ఒడయుఁడు.
ఒడలు-తె. మేను, దేహము. రూ. ఒడ్లు. సమా. ఒడలిచూపొడయఁడు- ఇంద్రుఁడు.
ఒడి-తె. 1.కూర్చున్నప్పుడు తొడలనడిమిభాగము, ఉత్సంగము. 2. కట్టువస్త్రమున నాభికిసరిగా వస్తువులుంచుకొనఁ జేసికొన్నది. 3.పశుయోని. సమా.—బ్రాలు- ఒడిలో పోసెడి బియ్యము.—కట్టు. 1. యత్నించు. 2. పాల్పడు. 3 ఒడ్డాణము.—దారము-స్త్రీల మొలనూలు.

ఒడికము-తె. 1. ఉపాయము. 2. ఇంపు. 3. యుక్తము.
ఒడియు-తె. 1. కొంచెము పైకెగురు. 2. ఆకర్షించు.
ఒడిసియు-తె. ప్రథమసురతముచే గజ్జలలో లేచు గడ్డ. రూ. ఒడిసె. [కేర్పఱచిన త్రాడు, క్షేపణి.
ఒడిసెల-తె. (ఒడియు+సెల) ఱాళ్ల విసరుట
ఒడుచు-తె. ఓడించు.
ఒడుదొడుకు-తె. (ఒడుకు+తొడుకు) 1. సమము కానిది. 2. సంకటము. [హానిక. 3. లాభము.
ఒడుపు-తె. 1. లక్ష్యమునుండి దాఁటిన దాఁటు. 2.
ఒడ్డగిల్లు-తె. 1. ఒఱగు. 2. అతిశయించు. 3. చిప్పిలు. [పైకినిలేచుట.
ఒడ్డగెడపు-తె. ఒకప్రక్క క్రిందికిని మఱొకప్రక్క
ఒడ్డనము-తె. 1. పందెము. 2. బెత్తము మున్నగు వానిచే చేయఁబడిన కేడెము.
ఒడ్డాణము-తె. నడుమున ధరించు నగ.
ఒడ్డాది-వి. ఓఢ్రదేశము.
ఒడ్డారము-తె. 1. ద్వేషము. 2. మాఱొడ్డుట. 3. మూర్ఖము, విస్తారము. క్రి. ఒడ్డారించు.
ఒడ్డిమి-తె. పందెము.
ఒడ్డియ-వి. (ఓఢ్ర) రూ. ఒడ్డె. [పావురము.
ఒడ్డీఁడు-వి. 1. ఒడ్డెవాఁడు. 2. పల్లటీలగొట్టు
ఒడ్డు-తె. 1. పందెమిడు. 2. వలపఱచు. 3. చాఁచు. 4. మొనయించు. 5. అడ్డగించు. కృ. 6. తీరము. 7. పందెము. 8. అడ్డు. 9. స్థూలము. 10. అధికము. 11. అన్యుఁడు. 12. ఒంటరి. సమా. ఒడ్డొఱకము-వెగుడు దిగుడు.
ఒత్తగిల్లు-తె. 1. ఒఱగు. 2. ప్రక్కకుజరగు. 3. అంటుకొను. రూ. ఒత్తిలు, ఒత్తిల్లు.
ఒత్తడము-తె. 1. ఒత్తుట. 2. తఱచు.
ఒత్తడి-తె. 1. రాపు. 2. తఱచుఁదనము. 3. పీడింపు. రూ. ఒత్తిడి.
ఒత్తరము-తె. ముమ్మరము.
ఒత్తరించు-తె. 1. మించు. 2. ఆక్రమించు.
ఒత్తిలి-తె. గట్టిగా.
ఒత్తిలు-చూ. ఒత్తగిల్లు.
ఒత్తు-తె. 1. పొదుచుకొను. 2. ఒఱగు. 3. అదుము. 4. కాళ్లపిసుకు. 5. ఊఁదు. 6. బలాత్కరించు. 7. నొక్కు. 8. తుడుచు. 9. త్రోయు. 10. తీర్చు. 11. ఆక్రమించు. 12. అదుముడు. 13. తఱచుఁదనము. 14. ఆక్రమణము. 15. బ. బిడ్డలచేతినగ. కృ. ఒత్తిడి, ఒత్తుడు.
ఒత్తారపు-తె. (ఒత్తు+ఒరపు) మిక్కిలియదుముడు.
ఒదరు-తె. 1. విజృంభించు. 2. ఎందించు. రూ. వదరు.
ఒదరుచు-తె. విడఁదీయు. రూ. ఒదర్చు.
ఒదలు-తె. వర్ధిల్లు. రూ. పొదలు.
ఒదవు-తె. 1. కలుగు. 2. ఉపయుక్తమగు. సమా. —బడి-ఉపయోగము.
ఒదుఁగు-తె. తొలఁగు. రూ. ఒదిగిలు.
ఒదుగు-తె. 1. సమృద్ధమగు. 2. కృ. సమృద్ధి. రూ. ఒదువు. సమా.—బడి-సమృద్ధి.
ఒదువు-తె. 1. ఒదుగు. 2. క్రమ్ము. రూ. పొదువు.
ఒద్ద-తె. దాపు, సమీపము. రూ. వద్ద.
ఒద్దిక-తె. 1. ఒందిక. 2. నటకులు మున్నగు వారు చేయు అభ్యాసము.
ఒనగూడు-తె. సిద్ధించు. ప్రే. ఒనగూర్చు.
ఒనరిక-తె. పొందిక, పొంకము.
ఒనరు-తె. 1. కలుగు. 2. పొసఁగు. 3. ఒప్పు. 4. ఇంపు. 5. పొందిక. రూ. పొనరు.
ఒనరుచు-తె. చేయు. రూ. ఒనరించు, ఒనర్చు, పొనరుచు, పొనర్చు.
ఒప్పందము-తె. వ్యాపారుల యొడంబడిక. [గింత.
ఒప్పగించు-చూ. అప్పగించు. రూ. ఒప్పించు. కృ. ఒప్ప
ఒప్పనము-తె. ఒప్పించుట.
ఒప్పమి-తె. (ఒప్పు+అమి) 1. కీడు. 2. తప్పు.
ఒప్పరము-తె. జలదారి.
ఒప్పరికము-తె. ఉపేక్ష. క్రి. ఒప్పరికించు.
ఒప్పించు-చూ. ఒప్పగించు. [3. విధము.
ఒప్పిదము-తె. 1. అందము. 2. అలంకారము.
ఒప్పు-తె. 1. ఒప్పిదమగు. 2. తగు. 3. సమ్మతించు. రూ. ఒప్పుకొను. కృ. 4. అందము. 5. తప్పుకానిది. 6. సమ్మతి. కృ. ఒప్పందము, ఒప్పనము, ఒప్పిదము, ఒప్పు. సమా. ఒప్పు

లాఁడి- 1. చక్కదనముగలఆఁడుది. 2. ఆఁడుది.
ఒబ్బట్లు-తె. (ఒమ్మ+అట్లు) పోళీలు.
ఒబ్బిడి-తె. 1. పంటకోఁత. 2. నాశము.
ఒమ్మిక-తె. ఇమిడిక, పొందిక.
ఒమ్మ-తె. సరిపడు. రూ. ఒవ్వు.
ఒయారము-తె. 1. విలాసము. 2. సౌందర్యము. రూ. ఒయ్యారము, ఓయారము. సమా. ఒయారి- 1. విలాసిని. 2. సుందరి. రూ. ఒయ్యారి, ఓయారి.
ఒయ్య-తె. 1. తిన్నగా. 2. మెల్లగా. ఒయ్యన-మెల్లన. రూ. ఓయన.
ఒర-తె. 1. ఒరపెట్టుట. 2. సామ్యము.
ఒఱ-తె. 1. గవుసెన. 2. ఖడ్గాదులనుంచు కోశము. 3. జావులకు మట్టితోఁజేసి దించిన కట్టడము.
ఒఱకటము-తె. (ఒఱవ+గడ్డ) 1. సమముకానిది. 2. సంకటము. రూ. ఒఱకాటము, ఒఱగడ్డము.
ఒఱరము-తె. 1. పల్లము. 2. సంకటము.
ఒరగల్లు-తె. (ఒరచు+కల్లు) బంగారు నొరపెట్టు ఱాయి, నికషము.
ఒరగు-తె. 1. వంగు. 2. వ్రాలు. కృ. 3. వంపు. 4. ఒరగుదిండు. రూ. ఒఱగు, ఒఱవు. సమా. —పదను-కొంచెము తేమ.—బిల్ల- ఒరగు దిండు, ఆనుకొనుట కనుకూలమైన పెద్దదిండు.
ఒఱటు-తె. దుశ్శీలుఁడు.
ఒఱపరి-తె. సౌందర్యవంతుఁడు.
ఒరపిడి-స. రాయిడి. రూ. ఒరయిక.
ఒఱపేఁడి-తె. (ఒఱపు+ఇఁడి) అయోగ్యుఁడు.
ఒఱపు-తె. 1. సౌందర్యము. 2. ఉపాయము. 3. యోగ్యత. 4. స్థైర్యము. 5. తాపము. 6. ప్రతాపము. 7. దృఢము.
ఒరయు-తె. 1. ఒరపెట్టు. 2. రాచు, రుద్దు. 3. పరీక్షించు. 4. విచారించు, 5. వెదకు. కృ. ఒరపిడి, ఒరయిక.
ఒఱలు-తె. 1. విలపించు. 2. మ్రోగు. రూ. ఱోలు.
ఒఱవ-తె. 1. వక్రము. 2. వ్యత్యస్తము. 3. వికృతము.
ఒరవడి-తె. మేలుబంతినిచూచి వ్రాయువ్రాఁత.
ఒరిగ-తె. నమస్కారము. [మిక.
ఒరిమ-తె. 1. ఒద్దిక. 2. ఐకమత్యము. రూ. ఒరి
ఒరుఁడు-చూ. ఒకఁడు. [కాఁడు- కొండీఁడు
ఒరుదల-తె. కొండెములుచెప్పుట. సమా. ఒరుదల
ఒఱువీజము-తె. (ఒజ్జు+బీజము) ఒకబీజము వాఁచి పెద్దదగుట.
ఒరుసు-తె. కలయు.
ఒరువుఁడు-చూ. ఒకఁడు.
ఒట్టు-తె. కారమైనది. ఒట్టన. ఒట్టుఁదనము.
ఒట్టియ-తె. 1. సాధువుకానిఅవు. 2. వక్రము. 3. వక్రస్వభావముకలవాఁడు. రూ. ఒట్టె.
ఒజ్జు-తె. పెద్దది.
ఒలయు-తె. 1. వ్యాపించు. 2. ప్రవేశించు. 3. కలుగు. 4. కలయు. 5. చుట్టుకొను. 6. కదియు.
ఒలి-తె. దోఁపుడు. రూ. ఒలుపు. క్రి. ఒలివడు.
ఒలికి-తె. సొదపేర్చుచోటు. సమా. ఒలుకులమిట్ట-శ్మశానము, కాడు.
ఒలియు-తె. తోలువీడు. (ప్రే. ఒలుచు)
ఒలుకు-తె. 1. చిందు. 2. కాఱు. 3. కార్చు. 4. చల్లు. 5. పోయు.
ఒలుచు-తె. 1. ఒలియఁజేయు, తోలూడ్చు. 2. అపహరించు. కృ. ఒలి, ఒలుపు.
ఒలె-తె. 1. వస్త్రము. 2. ఉత్తరీయము. రూ. ఒల్లియ, ఒల్లె, వల్లియ, వల్లె. సమా.—వాటు-కుచ్చెపెట్టి మెడచుట్టిరా భుజముపై వైచికొనుట. రూ. ఒల్లెవాటు, వల్లెవాటు.
ఒల్ల-తె. మందము. రూ. అల్ల.
ఒల్లమి-తె. (వలచు+అమి) ఇష్టపడమి. సమా. ఒల్లఁబాటు - ఒల్లమి. —బోక- అనాదరము. క్రి. ఒల్లఁబోవు.
ఒవ్వు-తె. గిట్టు. రూ. ఒమ్మ, ఓవు.
ఒసఁగు-తె. 1. ఇచ్చు. 2. కృ. ఈవి. 3. బహుమానము. రూ. ఒసవు.
ఒసపరి-తె. సుందరుఁడు.
ఒహో-తె. 1. సంబోధనార్థకము. 2. ఏమీ. 3 ఆశ్చర్యార్థకము. రూ. ఓహో.
ఒళవు-తె. 1. మర్మము. 2. మర్మజ్ఞానము. 3 లోఁతువ. 4. వీణాదండము. సమా. ఒళవరి-మర్మజ్ఞుఁడు.
ఒళ్లు-చూ. ఒడలు. క్రి. ఒళ్లుపెట్టు-బలియు.

ఓ

ఓ-తె. 1. పిలిచినపుడు హెచ్చరించుకొనుటను దెలుపును. 2. సందేహార్థకము. 3. ప్రార్థనా ద్యర్థకము. 4. ప్రశ్నార్థకము.
ఓంకారము-స. ప్రణవము. (అ+ఉ+మ) [ పెట్టు.
ఓంట్ర-తె. గాదెదకూ(త. క్రి. ఓంట్రించు, ఓంట్ర
ఓ(క-తె. పుల్లకలిపెట్టు.
ఓకర-తె. 1. ధ్వనిపూర్వకమగు వాంతి, లేక దోకు. 2. రో(త. ఓకిలి. క్రి. ఓకరించు. కృ. ఓకరింత.
ఓకస్సు-స. 1. ఇల్లు. 2. స్థానము. రూ. ఓకము.
ఓకిలి-తె. ఓకర. క్రి. ఓకిలించు. కృ. ఓకిలింత.
ఓకు-తె. దుర్భిణి, దూరదర్శిని.
ఓగితము-వి. (యోగ్యము) యుక్తమైనది.
ఓగిరము-వి. (ఆహారము) భోజనము. రూ. ఓరెము, ఓయిరము.
ఓగు-తె. 1. కీడు. 2. మూర్ఖు(డు.
ఓగులాడుచు-తె. దేవురించు. [ప్రవాహము.
ఓఘము-స. 1. సమూహము. 2. పరంపర. 3.
ఓచెల-చూ. ఒచ్చెల. రూ. ఓచెల్ల.
ఓజ-తె. 1. క్రమము. 2. విధము. 3. స్వభావము. 4. ఉపాధ్యాయు(డు. రూ. ఒజ్జ. 5. ఉత్సాహము. సమా. ఓజబంతి-ఒజ్జబంతి.
ఓజము-స. బేసి.
ఓజస్సు-స. 1. తేజము. 2. బలము. 3. ఉత్సాహము.
ఓట-తె. 1. భయము. 2. సంకోచము. 3. కుండ పగులు. క్రి. ఓటిల్లు. [జయము. రూ. ఓటము.
ఓటమి-తె. 1. భయము. 2. భంగము. 3. అప
ఓటఱు-తె. నిస్సత్త్వమగు. రూ. ఓటాఱు.
ఓటు-తె. 1. అపజయము. 2. భంగము. 3. ప్రశ్నార్థకము.
ఓటుపడు-తె. 1. అపజయమొందు. 2. భంగపడు. 3. కోలుపోవు. 4. మోసపోవు. [వా(డు.
ఓడ-వి. (హోడము) నావ. సమా. ఓడంగి-ఓడ
ఓడిక-తె. ప్రవాహము. [పరుగెత్తు.
ఓడిగిల్లు-తె. 1. ప్రవహించు. 2. కాఱు. 3.
ఓడు-తె. 1. అపజయమొందు. 2. పరుగిడు. 3. భయపడు. 4. సంకోచించు. 5. కుండ లో నగువాని పగులు. 6. పెంకు. (ఓడుబిల్ల)
ఓతువు-స. పిల్లి.
ఓదనము-స. అన్నము.
ఓదము-తె. అవపాతము.
ఓదారుచు-తె. ఆశ్వాసించు.
ఓదియ-తె. కో(తకోసి చేనిలో అక్కడక్కడ సుంచు చిన్నకుప్ప. రూ. ఓదె.
ఓని-తె. కొండలనడిమి సందు.
ఓపిక-తె. 1. శక్తి. 2. ఓర్పు.
ఓపు-తె. చాలు.
ఓమటి-తె. అన్నము.
ఓమము-తె. జిలకరవలెనుండు ఒకతెగ వాసన గింజలు, దీప్యము. రూ. వాము.
ఓము-తె. కాచు, రక్షించు.
ఓయన-చూ. ఒయ్య.
ఓయారము-చూ. ఒయ్యారము.
ఓయి-తె. పురుషసంబోధనమున నుపయోగింప( బడునది. రూ. ఓయీ.
ఓయిరము-చూ. ఓగిరము.
ఓర-తె. 1. అంచు. 2. ప్రక్క. క్రి. ఓరగిల్లు, ఓరసిల్లు, ఓసరిల్లు. వి. (హోర) రేయిపవలు. సమా.— చూపు-1. ప్రక్కచూపు. 2. ఉపేక్ష. 3. మోహపు చూపు. ఓరంతప్రొద్దు - 1. దినమంతయు. 2. ఎల్లకాలము. ఓరపాక- పంచసు వంచి కట్టినశాల, కొటాయి. రూ. మోరపాక.
ఓరణము-తె. ఒకతెగ దేగ.
ఓరిమి-తె. ఓరుపు. రూ. ఓర్మి.
ఓరు-తె. 1. ఎఱ్ఱమట్టిపట్టె. 2. పెద్ద. రూ. హోరు. సమా.—గాలి - శబ్దముతో వీచు గాలి. రూ. హోరుగాలి.
ఓరుపు-తె. 1. ఓరుచుట, సహనము. 2. క్షమ. 3. జయము. రూ. ఓర్పు. సమా. ఓరుపరి-ఓరుపుకలవా(డు. రూ. ఓర్పరి.
ఓరెము-చూ. ఓగిరము.
ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక-చూ. ఒకత.
ఓల-తె. జలక్రీడయందు ప్రేరే(చుట కుపయోగించు శబ్దము. క్రి. ఓలలాడు, ఓలాడు-1. మును(గు.

2. తేలు. సమా.—గందము-పూఁతపసుపు.—
చెంగనాలు-అపజయము. [లగించు.
ఓలగము-తె. 1. కొలువు. 2. కొలువుకూటము. క్రి. ఓ
ఓలమానగొను-తె. మఱుఁగుపడు.
ఓలము-తె. 1. వృక్షములు లోనగువానిచే మఱుఁ
గగుచోటు. రూ. ఓలిమి. 2. దేహము.
ఓలాకు-తె. శ్రమము, అలయిక. క్రి. ఓలాకుపడు.
ఓలి-తె. 1. ఉంకువ. 2. వరుస.
ఓల్లము-స. 1. అల్లము. 2. కంద.
ఓవరి-వి. (అపవరకము) లోపలిగది.
ఓవు-చూ. ఒవ్వు.
ఓషధి-స. 1. ఫలించినతోడనే నశించు అరఁటి లో
నగునది. 2. మందుచెట్టు. సమా. ఓష
ధీశుఁడు-చంద్రుఁడు.
ఓషము-స. 1. కాలుట. 2. కాల్చుట.
ఓష్ఠము-స. పెదవి.
ఓసరిల్లు-తె. తొలఁగు. కృ. ఓసరింత. చూ. ఓర.
ఓసరు-తె. తొలఁగు.
ఓహటము-తె. వెనుదీయుట. క్రి. ఓహటిల్లు.
ఓహరిసాహరి-తె. తండోపతండముగా.
ఓహో-చూ. ఒహో.
ఓళిగ-తె. పోళీ. రూ. హోళిగ.

## ఔ

ఔ-తె. 1. అంగీకారార్థకము. 2. ప్రశంసార్థ
కము. రూ. అగు, అవు, ఔను. సమా. ఔఁ
గదే-ఔరా.—గాక - అట్లేకానిమ్ము. ఔర -
ఆహా. ఔలెమ్మ, ఔలే-ఔనౌను.
ఔగాములు-తె. (అవుట+కామి) 1. కలిమి
లేములు. 2. మేలుకీళ్లు. 3. యుక్తాయుక్తతలు.
రూ. అవుగాములు.
ఔచితి-స. ఉచితత్వము, యోగ్యత. రూ. ఔచిత్యము.
ఔజు-తె. 1. కాలువ. 2. బురద. 3. పనివాఁడు.
రూ. అవుజు, అవుదు, ఔదు.
ఔడవము-స. ఐదుస్వరములతోఁగూడిన రాగము.
ఔడు-తె. పెదవిక్రింది భాగము. రూ. అవుడు.
ఔత్కంఠ్యము-స. ఉత్కంఠ.
ఔత్కృష్ట్యము-స. ఉత్కృష్టత, మేలు.
ఔత్సుక్యము-స. ఉత్సుకత్వము, ప్రియస్మరణా
దులచే కాలవిలంబనము నోర్వలేకుండుట.
ఔదరికుఁడు-స. పొట్టపోసికొనువాఁడు, ఉదరంభరి.
ఔదల-తె. 1. నడితల. 2. తల. రూ. అవుదల.
ఔదార్యము-స. ఉదారత్వము, దాతృత్వము.
ఔదు-చూ. ఔజు.
ఔద్ధత్యము-స. ఏపు.
ఔపాసనము-స. గృహస్థుఁడగు విప్రుఁడు ప్రాతః
కాలమున చేయు అగ్నియుపాసన.
ఔరసుఁడు-స. ధర్మపత్నియందు తనకుఁగలిగిన
కొడుకు. రూ. ఔరస్యుఁడు.
ఔరు-తె. ఒకతెగవాసనగడ్డి, వీరణము. రూ. అవురు.
ఔర్వము-స. బడబాగ్ని.
ఔల-చూ. అవల.
ఔలు-చూ. అగులు.
ఔశీరము-స. 1. చామరదండము. 2. శయనము. 3. ఆ
సనము. 4. వట్టివేరుతోఁగట్టఁబడినది. [మందు.
ఔషధము-స. (వ్యు. ఓషధులతోఁ జేయఁబడినది)
ఔసు-తె. 1. సొగసు. 2. ఒయ్యారము. రూ.
హౌసు, అవుసు, హవుసు. సమా.—కత్తె -
సొగసుకత్తియ.—కాఁడు-సొగసుకాఁడు.

## క

కంకటము-స. కవచము.
కంకటి-వి. (ఖట్టిక) మంచము. రూ. కంగటి.
కంకణము-తె. ఒకానొక జలపక్షి. రూ. కంకణాయి.
స. 1. చేసరము. 2. తోరము. 3. జలబిందువు.
కంకతము-స. దువ్వెన. రూ. కంకతిక.
కంకపత్రము-స. బాణము.
కంకము-స. రాపులుఁగు.
కంకర-వి. (కర్కరము) 1. గులకరాయి. 2.
గులకరాళ్లు పఱచి ఘట్టించుట. 3. కఠినము.
కంకాళము-స. ఎముకలగూడు, డొక్క.
కంకి-తె. వెన్ను.
కంకిణి-తె. ఇటికగోడలయింటి చూరు, వెల్లువ.
కంకు-తె. 1. గద్దించు. 2. తిట్టు.
కంగాణము-తె. కళ్లమునందలి కావలి.
కంగారు-తె. 1. యుద్ధము. 2. కలఁత. రూ. కంగిస.

కంగు-తె. సూలిపోఁగుతో నేర్పఱచిన కన్ను.
కంగేలి-వి. (కంకేలి) అశోకవృక్షము.
కంగోరు-తె. నిడుపైన కానె. [భోజనపాత్రము.
కంచము-వి.(కాంస్యము)లోహముతోఁజేయఁబడిన
కంచర-వి. (కాంస్యకార) కంచుపనిచేయు జాతి.
కంచరి-కంచుపని చేయువాఁడు.
కంచరము-వి. (పంకరము) రథమువంటి బండి.
సమా. కంచరగాడిద - కంచరము నీడ్చు ఒక
తెగగాడిద, అశ్వతరము.
కంచి-వి. కాంచీపురము. సమా.—మేఁక-రెండేసి
మూఁడేసి పిల్లలనీను ఒకతెగమేఁక.
కంచియ-తె. చేనికివేసిన వెలుగు. రూ. కంచె.
కంచు-వి. (కాంస్యము) వెట్టయైన తెల్లని ఒక
మిశ్రలోహము.
కంచుకము-స. *1*. అవిక. *2*. చొక్కాయ. *3*.
కవచము. *4*. పాముకుబుసము. రూ.కంచులిక.
కంచుకి-స. (కంచుకము + ఇ) *1*. అంతఃపురపు
కావలివాఁడు. *2*. పాము.
కంచుమించు-తె. అగోచరము.
కంచె-చూ. కంచియ. సమా.—కోట- కోటకుచుట్టు
నేర్పఱచిన ఆవరణము.—గోడ-కంపలు పాఁ
తిన గోడ.
కంచెల-వి. (కంచులిక) అవిక.
కంజము-స. *1*. తామర. రూ.కంజాతము. (వ్యు.
నీటఁబుట్టినది.) *2*. డు. బ్రహ్మ. సమా. కంజ
జుఁడు- బ్రహ్మ.
కంజు-వి. (కపింజలము) ఒకానొక పిట్ట. రూ.
కముజు, కవుజు, కౌఁజు.
కంట-తె. *1*. కనుట. *2*. నాట్యబంధము.
కంటకము-తె. *1*. విరుద్ధము. *2*. విరుద్ధపుమాట.
*3*. సహింపరానిది. రూ. కంటసము. క్రి. కంట
గించు. స. *1*. ముల్లు. *2*. రోమాంచము. *3*.
వెదురు. *4*. సూదిమొన. *5*. డు.శత్రువు. సమా.
కంటకఫలము-పనస.
కంటగిల్లు-తె.నొచ్చు. [దూదిమూట. రూ.కంట్లము.
కంటలము-తె. *1*. ఎద్దుపైవైచు సంచులజత. *2*.
కంటసము-చూ. కంటకము.
కంటసరి-వి. (కంఠసరము) మెడనుధరించు నగ.
కంటియ-వి. (కంఠిక) *1*. మెడనగ. *2*. చేతినగ.
*3*. కాలినగ. రూ. కంటె.
కంటివాలు-తె. (కల్లు+వాలు) చక్రాయుధము.
కంటు-తె. పగ. [టియ.
కంటె-తె. పంచమీ విభక్తి ప్రత్యయము. వి. కం
కంఠము-స. *1*. కుత్తుక. *2*. కుత్తుకధ్వని. *3*.సమీ
పము. సమా. కంఠిక- *1*. మెఱపు. *2*. (వి)
కంటె. కంఠీరవము-సింహము. కంఠేకాలుఁడు-
శివుఁడు, నీలకంఠుఁడు.
కండ-తె. *1*. మాంసము. *2* మాంసపు ముక్క.
వి. (ఖండము) కలకండ. సమా. కండ
చక్కెర- ఖండ శర్కర, కలకండ.
కండియ-తె. *1*. నూలిచుట్ట. *2*. జొన్నకంకి. *3*.
సాముచే గట్టిపడిన భుజముఖము. రూ. కండె.
కండువా-హిం. ఉత్తరీయము. [కండూయ.
కండువు-స. *1*. దురద. *2*. తీఁట. రూ.కండూతి,
కండెము-తె.సాముచే గట్టిపడిన భుజముఖము.రూ.
కండియ, కండె.
కంత-వి. (కంథ) *1*. చింపిగుడ్డ. *2*. బొంత.
*3*. గంత. *4*. రంధ్రము.
కంతి-వి. (గ్రంథి) *1*.గడ్డపలెఁబుట్టు కుఱుపు. *2*.
దద్దు. రూ. కడితి, కణితి. [చెల్లించుట.
కంతు-తె. *1*. గడువు. *2*. గడువుమేరకు డబ్బు
కంతుఁడు-స. మన్మథుఁడు.
కంథ-స. *1*. చింపిగుడ్డ. *2*. బొంత. (వి. కంత)
కంద-స. కందగడ్డ. రూ. కందము.
కందకము-తె. అగడ్త.
కందము-స. *1*. మేఘము. (వ్యు. నీటినిచ్చునది.)
*2*. పద్య విశేషము. *3*. దుంప, గడ్డ. వి.
(స్కంధము) మూఁపు.
కందనగాయ-తె. గుండె.
కందరము-స.*1*.గుహ. రూ.కందర.*2*.అంకుశము.
కందర్పుఁడు-స. మన్మథుఁడు. (వ్యు. కుత్సితమగు
దర్పము కలవాఁడు, సుఖవంతులయందు దర్పిం
చువాఁడు)
కందళము-తె. గంత. రూ. కందళికము.
స. క్రొత్తమొలక. క్రి. కందళించు.
కందళి-స. *1*. పెక్కెము. *2*. దొడ్డకడుపును

నల్లని ముంగాళ్లను ఇరువది యంగుళముల నిడివియుఁ గల లేడి.

కందాయము-స. సంవత్సరమందు మూఁడవ [భాగము.

కంది-తె. తువరిచెట్టు. బ. తువరిధాన్యము.

కందు-తె. 1. తపించు. 2. నలుపగు. 3. బిడ్డ. కృ. 4. తాపము. 5. నలుపు.

కందుఁడు-వి. (స్కందుఁడు) కుమారస్వామి.

కందుకము-స. ఆడెడు చెండు. రూ. కండుకము.

కందురు-వి. (గంధోళి) ఒకతెగ తుమ్మెద, కందురీగ. రూ. కదుఁదురు, కణుఁదురు.

కందువ-తె. 1. జాడ. 2. సంకేతస్థలము. 3. ఏకాంతము. 4. చమత్కారము. 5. తెగ.

కందువు-తె. బిడ్డ. రూ. కందు.

స. పెనము.

కందెన-తె. బండియిరుసునకుఁ బూయు మసి.

కందెఱ-తె. (కన్ను+తెఱ) తెప్ప.

కంధర-స. మెడ. రూ. కంధరము. (వ్యు. తలను ధరించునది.)

కంధరము-స. 1. మెడ. 2. మేఘము. (వ్యు. నీటిని ధరించునది)

కంధి-స. సముద్రము. (వ్యు. నీటికి స్థానము.)

కంప-తె. ముండ్లమండ. రూ. క్రంప. సమా.—కోట-కంచెకోట.—గోడ-కంచెగోడ.

కంపనము-స. 1. కదలుట. 2. వణఁకుట.

కంపము-స. వణఁకు. క్రి. కంపించు.

కంపరము-తె. పాడె.

కంపు-తె. 1. (పూర్వము) వాసన. 2.(ఇప్పుడు) చెడువాసన. సమా.కంపెలుక-చుంచు.

కంపె-తె. తాంబూల పాత్రము. రూ. కుంపె.

కంబడి-వి. (కంబళము) ఉన్నితో నేయఁబడినది. రూ. కంబళి.

కంబము-వి. (స్తంభము) గుంజ. సమా. కంబమయ్య, కంబమురాయఁడు- నృసింహుఁడు.

కంబళము-స. 1. నీరు. 2. (వి) కంబళి. 3. కంబళిపురుగు.

కంబళి-చూ. కంబడి. సమా.—పండు-పట్టుపురుగు చెట్టుపండు. —పురుగు-శూకకీటము.

కంబి-స. 1. వెదురు కమ్మి. 2. గరిసె.

కంబు-తె. సజ్జపైరు. బ. సజ్జలు.

స. 1. నీరు. 2. తల. 3. నెమలి.

కంబువు-స. 1. శంఖము. 2.ఏనుఁగు.3.నత్తగుల్ల. 4.కడియము. సమా. కంబుగ్రీవ-మూడుముడుతలుగల మెడ.

కంసము-స. 1. కంచు. 2. కంచుగిన్నె.

కకపాల-వి. (కక్షపాల) సన్న్యాసులజోలె. రూ. కక్కపాల. [వికలు.

కకవికలు-వి. (కాకపికౌ) యథాయథలు.రూ. కకా

కకుత్తు-స. ఎద్దుమూఁపురము. రూ. కకుదము.

కకుప్పు-స. 1.దిక్కు. 2.కాంతి.3.సంపెఁగదండ. 4. అల్లినజడ.

కక్కరము-వి. (కర్కరము) కఱకు.

కక్కసము-వి. (కర్కశము) 1.కఠ.2.బాధ.3.సంకటము. 4. కఠినము. క్రి. కక్కసించు.

కక్కిరిబిక్కిరి-తె. తాఱుమాఱు.

కక్కు-తె. 1. కడుపులోనిది వెలిపుచ్చు. 2. వెలిపుచ్చు.3.విసరురాయి మొవానికిగఱకుకొట్టుట.రూ. కఱకు, క్రక్కు. సమా. కక్కువాయి- ఒకతెగ కానరోగము. కృ. కక్కుడు.

కక్కుఱితి-తె. 1.అశ్రద్ధ.2.లోభము.రూ. కక్కుర్తి.

కక్కెర-వి. (క్రకరము) ఒకానొకపక్షి. రూ. క్రక్కెర.

కక్ష-స.1.కచ్చ. 2. పోటీ. 3. చంక. 4.కసెము.

కక్షపాల-స. కకపాల.

కక్ష్య-స.1.తొట్టికట్టు. 2.మొలనూలు. 3. ఏనుఁగు నడుమునకుఁగట్టు గొలుసు. 4. భాగము.

కగ్గము-వి. (ఖడ్గము) కత్తి.

కచము-స. 1.వెంట్రుక. 2. పుండు.

కచేరి-హిం. కొలువుకూటము. రూ. కచ్చేరి.

కచ్చ-వి. (కచ్ఛము) వెనుకకుచెక్కికొను దోవతి కొంగు. 2. గోచి. [వి.గోచి.

కచ్చడము-వి. (కచ్ఛట) ధాన్యాదులఁదెచ్చుబండి.

కచ్చించు-తె. 1.సారెలునడపు. 2. కచ్చగట్టు.

కచ్చితము-వి.(ఖచితము) హెచ్చుతక్కువలులేమి.

కచ్చు-తె.1.సారెలునడపు.2.గర్వము.3.తేకు. 4. సిగబంతి.5.పెద్దవాసము.6.వి. (కాంక్ష) ఆస. క్రి. కచ్చుకొను.

కచ్ఛపము-స. *1.*తాఁబేలు. *2.*నవనిధులలోనొకటి.
కచ్ఛపి-స. *1.*ఆఁడుతాఁబేలు. *2.* సరస్వతివీణ.
కచ్ఛము-స. *1.* చూ. కచ్చ.
*2.* (వి) కసెము. *3.* దరి.
కజాయము-వి.(ఖాద్యము)తీయనిఒకభక్ష్యము. రూ. కజ్జము, కజ్జాయము.
కజ్జలము-స. *1.*కాటుక. *2.* చీఁకటి. *3.*మేఘము.
కజ్జూరము-వి. (ఖర్జూరము) పేరీఁదుచెట్టు.
కట-తె.*1.*సంతాపార్థకము. రూ.కటా,కట్ట, కట్టా, కటకటా. *2.* కొఱుకుటయందగు ధ్వని.
కటకటపడు-తె. *1.*కోపించు. *2.* బాధపడు.
కటకటాలు-తె. ఇనుపకమ్ములు మున్నగువానిచే నేర్పఱచిన యడ్డు.
కటకరము-వి. (గంధర్వము) కదఁతి.
కటకారుఁడు-స. మేదరవాఁడు.
కటము-స. *1.*చెక్కిలి. *2.*అతిశయము.*3.* మొల. సమా. కటాక్షము- *1.* కడకన్ను. *2.*కడకంటి చూపు. క్రి. కటాక్షించు. [రు.
కటారి-వి. (కఠారము)*1.*కత్తి.*2.*బాఁకు.రూ.కటా
కటాహము-స,*1.*కప్పెర. *2.* తాఁబేటివెన్నుచిప్ప. *3.* మేడ పైభాగము.
కటి-స. నడుము. రూ. కటము.
కటిక-వి. (ఖట్టికుఁడు) మాంసమమ్మువాఁడు. తె.బెత్తముపట్టుకొనియుండువాఁడు.రూ.కట్టిక. సమా.—మెకము-ఖడ్గమృగము.
కటికి-తె.*1.*అధికము. *2.*కఠినము. *3.*సాంద్రము.
కటీరము-స. *1.* మొల. *2.* గుహ.
కటుమరలు-తె. చెక్కిళ్లమీఁది భాగము, హనువు.
కటువు-వి. (ఖాటి) పాడె.
స. *1.*కారము. *2.* వాసన. *3.* కాఠిన్యము.
కట్ట-తె. *1.*మోపు.*2.*గట్టు.*3.*సంతాపార్థకము.రూ. కట్టా.
కట్టకడ-తె. (కడ+కడ) మిక్కిలికడ.
కట్టడ-తె. *1.* నియమము. *2.* ఆజ్ఞ. *3.* తీరు.
కట్టనము-తె.*1.*కానుక.*2.*బంధనము.రూ.కట్నము.
కట్టిఁడి-తె.(కట్టు+ఇఁడి) *1.*కట్టులేనివాఁడు. *2.* నిర్దయుఁడు, క్రూరుఁడు.
కట్టిక-చూ. కటిక.
కట్టియ-వి.(కాష్ఠము)*1.*కట్టె.*2.*చేతికట్టె, *3.* బాణము. రూ. కట్టె.
కట్టు-తె. *1.* (జంతువులు)గర్భముధరించు. *2.*నిబద్ధమగు.*3.*బంధించు.*4.*ఆరోపించు. *5.* (వస్త్రము)ధరించు.కృ.*6.*బంధము.*7.*తొట్టికట్టు.*8.*వస్త్రధారణము. *9.*నిబంధనము. *10.*నిర్బంధము. *11.*ప్రదేశము.*12.*మితి. *13.*ఉడికినపప్పులో నగువానిరసము. సమా. కట్టుఁగంబము-పశ్వాదులఁగట్టెడి కంబము.— గొంగు-చెఱఁగు.— గొమ్మ- అనకట్ట.—గొయ్య-నాఁగటిమేఁడి.— గోక-మొలగుడ్డ.(ఇట్లేకట్టుగుడ్డ మొ.)—గడ-చేర్చియుంచిన ధాన్యాదులు.—గొఱ్ఱు-పసులను బంతికట్టుటకు కళ్లమున పాఁతినగుంజ.—దొన-కోనేఱు.—పకాసి-రణోద్యుక్తుఁడగు శూరుఁడు. రూ. కట్టుపకాసు.—పాటు-నిబంధనము.—బండి-పరికర సహితమైన బండి.—బడి- బంటున కిచ్చుమాన్యము.—మట్టు- *1.*పసులకొట్టము.*2.* నిలయము.*3.*ఏర్పాటు.—మ్రాను-తెప్ప.
కట్టుక-తె. గర్భస్రావము.
కట్టువ-తె. *1.*కంచె.*2.*ఎల్లగాపోసినమిట్ట.
కట్టెడ-తె. ఎడనెడ కట్లుగల సర్పము.
కట్లగుదియ-తె. ముసుండి అను ఆయుధము.
కట్లబల్ల-తె. కత్తెరకాళ్లమడుపుబల్ల. [సంచి.
కట్లసంచి-తె. చుట్టుఅరలేర్పఱచిన నిడుపాటి గుండు
కట్లియ-తె. బంగారు తూనికగుండు. రూ. కట్లె.
కఠారము-స. కటారి.
కఠినము-స. *1.* వంటకుండ. *2.* గట్టిది.
కఠిని-స. బలపము.
కఠోరము-స. గట్టి.
కడ-తె. *1.*దిక్కు.*2.*పార్శ్వము.*3.*అంతము.*4.*సమీపము.*5.*స్థానము. సమా.—గండ్లు-కష్టము.—గన్ను- కటాక్షము.—గొట్టు-*1.*చచ్చు. *2.* కడపటిది.—చుక్క-రేవతి.—పల- అంతము. క్రి.—చను-*1.*చచ్చు.*2.*ముగియు.—తెగు-సమాప్తమగు.—తేఱు-*1.*చచ్చు.*2.*నశించు.*3.*ముగియు.—ఁబడు-*1.* నిస్సారమగు. *2.*తగ్గు.—ముట్టు- *1.*ముగియు. *2.*సిద్ధించు.
కడంగరము-స.*1.*పొల్లు.*2.*పొల్లుకసవు.

కడంగరీయము-స. పొల్లుకసవు మేసెడి యెద్దు.
కడఁగు-తె. యత్నించు,పూను.కృ.కడఁక, కణఁక.
కడఁజు-తె. గోకర్ణమృగము. రూ. కణఁజు.
కడఁత-తె. కడకంటి ప్రక్కచోటు. రూ. కణఁత.
కడఁతి-తె. గంధర్వమృగము.రూ. కడితి, కణఁతి, కణితి. 2. వి. (గ్రంథి) దద్దు.
కడచు-తె. 1. గతించు. 2. చచ్చు. 3. నశించు. 4. హెచ్చు. 5. దాఁటు. (ప్రే. కడపు)
కడప-తె. దేహళి. రూ. గడప. వి. (కదంబము) కడిమిచెట్టు.
కడపు-తె. 1. ఇయ్యక పొమ్మను. 2. కాలహరణముచేయు. 3. త్రోలు. 4. వదలు.5.చంపు.
కడమ-తె. 1.కొఱఁత. 2.శేషము. క్రి.కడమపడు.
కడలి-తె. (కడలు+ఇ) సముద్రము. సమా.—కూఁతురు - లక్ష్మి. (ఇట్లే కడలిపట్టి మొ.) —తేఁడు-వరుణుఁడు. (ఇట్లేకడలియొడయఁడు మొ.)—వెన్న-1. చంద్రుఁడు.2.అమృతము.
కడలు-తె. అల. [వ్యాపించు.
కడలుకొను-తె.1.అతిశయించు.2.ఉప్పొంగు. 3.
కడలొత్తు-తె. వ్యాపించు.
కడవ-వి. (కటాహము) పెద్దకుండ.
కడవఁబడు-తె. 1. గతించు. 2. మించు.
కడవసము-తె. తోలు. రూ. కడాసము, కళవసము, కళాసము.
కడసరము-తె. ఒకతెగ దేగ.
కడాఘి-తె. అపరంజి.
కడి-తె. 1. కబళము. 2. వాసన. క్రి. కడిగొను-కబళించు. కడిపోవు-చెడు.
కడిఁది-తె. 1. ఆపద. 2. అధికము. 3. అశక్యము. 4. కఠినము.
కడికండలు-తె. ఖండ ఖండములు.
కడితి-చూ. కడఁతి.
కడిమి-తె. 1. అతిశయము. 2. ఆధిక్యము. 3. పరాక్రమము. రూ. కడిమ్మి.
వి. (కదంబము) కడపచెట్టు. [కడెము.
కడియము-వి. (కటకము) చేతధరించునగ. రూ.
కడు-తె. అత్యంతము, మిక్కిలి. సమా. (అచ్చుపరమైనచో ద్విరుక్తటకార మాదేశమగు.)
కట్టనువు-(కడు+అనువు) ఇట్లే కట్టలుక, కట్టాయితము, కట్టెండ, కట్టెదురు మొ. క్రి. కడుకొను-అతిశయించు.
కడుఁదురు-చూ. కందురు.
కడుగు-తె. 1. ప్రక్షాళించు. 2. బియ్యము లోనగునవి కడిగిననీరు. రూ. కడువు, కడ్గు.
కడుజు-తె. ఒకతెగ డేగ.
కడుపు-తె. 1. ఉదరము. 2. గర్భము. రూ. కడ్పు. సమా.—మంట-ఈర్ష్య. కడుపూఁద - 1. ఈను. 2. ఇరువాయికట్టువ్యాధి.
కడెము-తె. 1. గానుగ రోఁకలి. రూ. కణెము. 2. (వి) కడియము.
కడ్డి-తె. 1. పుడక. 2. కోపు. రూ. కడ్డీ.
కణము-స. 1. నీటిబొట్టు. 2. నూక. 3. లేశము. రూ. కణిక.
కణఁక-(చూ. కడఁచు) యత్నము.
కణఁజము-వి. (గంజ) 1.ధాన్యముంచు పాఁతఱ. 2. ధాన్యముంచు గరిసె.
కణఁజు-చూ. కడఁజు.
కణఁత-చూ. కడఁత.
కణఁతి-చూ. కడఁతి.
కణితి-చూ. కడితి, కంతి.
కణుఁదురు-చూ. కడుఁదురు.
కణుజు-చూ. కడుజు. [కద.
కత-వి. (కథ) 1. చరిత. 2. వృత్తాంతము. రూ.
కతకము-స. చిల్లచెట్టు. [ముచే.
కతము-తె. కారణము. కతన, కతమున-కారణ
కతుక్కు-తె. 1. కొఱుకుటయందగు ధ్వని. 2. దిగులుపడు హృదయమునూచకము, గబీలు.
కత్తరి-తె. నానావర్ణములు గలది, శబలము.
కత్తరిల్లు-తె. చలించు.
కత్తలాని-వి. (కర్తలాణము) తెల్లని గొరిజయుఁ దోఁకయు వెంద్రుకలును గల నల్లగుఱ్ఱము. రూ. కత్తళఁడు.
కత్తి-వి. (కర్త్రి) 1. ఖడ్గము. 2. మంగలికత్తి. సమా.--పిడిక-ఈంద్రవానికత్తులబుట్ట.—పీఁట-కూరగాయలు తఱుఁగుటకు పీఁటయందమర్చిన కత్తి,ఈళిక.—వాతియమ్ము-అర్ధచంద్రబాణము.

కత్తియ-వి.(కర్త్రి)ఒక స్త్రీప్రత్యయము.రూ.కత్తె.
కత్తియము-తె. అంకెల యద్దబంతి. రూ. కత్తెము.
కత్తువ-తె. 1. మన్ను శెల్లగించు గసిక, తొళిక. 2. గనిమ.
కత్తెర-వి. (కర్తరి) 1.వస్త్రాదుల ఛేదించు ఆయుధము. క్రి. కత్తిరించు, కత్రించు. 2. భరణి మూఁడు పాదములందును కృత్తికయందును మృగశిర రెండు పాదములందును సూర్యుఁడుండు కాలము. 3. కృత్తిక.
కథ-స. ఇంచుక సత్యమైన కల్పిత చరిత్రము. క్రి. కథించు. (వి. కత)
కథకుఁడు-స. కథ చెప్పువాఁడు.
కథనము-స. కథ చెప్పుట.
కథితము-స. చెప్పఁబడినది.
కద-తె. 1. ప్రసిద్ధిని దెలుపునది. రూ. కదా, కాదా, కదే, కాదే. 2. వి. కత. [కదంబించు.
కదంబకము } వి. (కరంబము) మిశ్రము. క్రి.
కదంబము } స. 1. గుంపు. 2. కడిమిచెట్టు.
కదనము-స. 1. పాపము. 2.యుద్ధము.3.హింస.
కదన్నము-స. చెడ్డకూడు.
కదర్యుఁడు-స. పిసినిగొట్టు. [ము.రూ.కదలుడు.
కదలిక-తె. (కదలుట) 1. చలనము. 2. యత్న
కదలు-తె. 1. చలించు. 2. ప్రయాణమగు. 3. యత్నించు. కృ. 4. చలనము. 5. యత్నము.
కదళి-స. అరఁటి.
కదించు-తె. కదియఁజేయు. రూ. కదియించు.
కదియు-తె. 1. దగ్గఱకువచ్చు. 2. సమానమగు. 3. చేరు.
కదుకొను-తె. అతిశయించు.
కదుపు-తె. (వ్యు. కదియునది) సజాతీయ పశుపక్ష్యాది సమూహము.
కదుము-తె. 1. ఆక్రమించు. 2. నెత్తురు గడ్డకట్టి వాఁచిన వాఁపు. (వాడుకలో గదుము)
కదురు-తె. 1. అతిశయించు. 2.కలుగు.3.విజృంభించు. 4. నూలువడుకు సాధనము,తర్కువు. 5. సన్నని కమ్మి.
కదుష్ణము-స. ఇంచుక వేఁడి.
కద్దము-తె. దట్టము.

కనఁబడు-తె. అగపడు. [గనగన.
కనకన-తె. నిప్పునందలి అధిక ప్రకాశము. రూ.
కనకము-స.1.బంగారు.2.ఉమ్మెత్త.3.సంపెంగ. సమా.కనకాక్షి-పైఁడికంటి పిట్ట.
కనరు-తె. 1. కందగడ్డ లోనగువానియందలి నస. 2. అహితము. [కోపము. 4. మంట.
కనలు-తె. 1. కోపగించు. 2. మండు. వి. 3.
కనారిలు-తె. కోపించు. [కనికరించు.
కనికరము-తె. 1. కరుణ. 2. శోకము. క్రి.
కనిపట్టు-తె. వెదకిపట్టు. రూ. కనిపెట్టు,కనుపెట్టు.
కనిపించు-తె. కనఁబడు.
కనియు-తె. మాఁగు.
కనిష్ఠ-స. చిటికెనవ్రేలు. రూ. కనిష్ఠిక.
కనిష్ఠుఁడు-స. 1. తమ్ముఁడు. 2. తక్కువ వయస్సు గలవాఁడు. 3. మిక్కిలి యల్పుఁడు. రూ. కనీయుఁడు.
కనీసము-వి. (కనిష్ఠము) అధమము.
కను-తె. 1.చూచు. 2.ప్రసవించు. 3.తెలియు. 4. పొందు. 5. నేత్రము. 6. చెఱకులోనగువాని గనుపుక్రిందిగుంట.రూ.కన్ను.కృ. కనుకలి, కానుపు.సమా.—కట్టు- జాలవిద్య.—కుట్టు- బాధకుఁడు.—కుట్టుఁదనము-ఈసు.—కూలి- ధాన్యరూపమగుకూలి.—చీఁకటి-లేఁజీఁకటి.—పాప-కంటిలోనిప్రతిమ.—పెట్టు-1.ఎదురుచూచు. 2. వెదకిపట్టు.—బడి-ఉత్పత్తి. —మూయు-నిద్రించు. —మొఱఁగు-1.నిద్రించు.2.వంచించు.—వినికి-పాము,చక్షుశ్శ్రవము.—వెచ్చ-నులివెచ్చ.
కనుఁగొను. 1. చూచు. 2. తెలిసికొను. —బాటు-1.దృష్టి.2.దృష్టిదోషము.--బ్రాము-వంచించు.
కనుక-తె. హేత్వర్థకము, కాన,కాఁబట్టి.
కనుకని-తె. సంభ్రమము. రూ. కన్కని.
కనుపు-తె. చెఱకు లోనగువానియందెడనెడ నేర్పడియుండు ముడి, పర్వము. రూ. గనుపు.
కనుపుగొట్టు-తె. 1. ఖండించు. 2. భంగపఱచు.
కనుమ-తె. 1.సందు. 2. కొండలసందుత్రోవ.
కనుము-తె. 1. పసులపండుగకు మఱుచటిదినము. 2. ఒకతెగకసవు. శరము.
కన్నంట-తె. (కంటన్+కంటన్) ప్రత్యక్షముగా.

కన్న-తె. (కి+అన్న౯) కంటెఅనునర్థమునవచ్చు ప్రత్యయము.

కన్నడ-తె. ఉపేక్ష. క్రి. కన్నడించు.

కన్నడము-తె. *1.* కర్ణాటదేశము. *2.* కర్ణాటభాష. సమా. కన్నడీఁడు-కర్ణాటదేశస్థుఁడు.(ఇది కర్ణాట శబ్దభవముకాదు. ద్రావిడమున 'కఱి+నాడు' చేరి కర్నాడైనది.)

కన్నము-తె. దొంగలోనికేగుటకై గోడయందుచేయు రంధ్రము. సమా. కన్నగాఁడు- కన్నము వేయువాఁడు. క్రి. కన్న పెట్టు- కన్నము వేయు.

కన్నయ్య-తె. *1.* కన్నతండ్రి. *2.* వి. కృష్ణుఁడు.

కన్నఱ-తె. (కన్ను+అఱ) దుఃఖము. కన్నఱి-దుఃఖితుఁడు.

కన్నశవు-తె. ఉపేక్ష, కన్నడ.

కన్నియ-వి. (కన్య) *1.*పెండ్లికానిపడుచు. *2.*కూఁతురు. *3.*కన్యారాశి.*4.*ఆఁడుది.*5.*కొమ్రిత్త. *6.*చిన్న.రూ.కన్నె.

కన్ను-తె. (వ్యు.కనునది) *1.*నేత్రము.*2.*చూపు.*3.*జాడ.*4.*కనుపు.*5.*చక్రము. *6.*వంతెనద్వారము. *7.*నెమలిపురికన్ను.*8.*వలయందలిరంధ్రము.*9.*వ్రణాదులయందలి రంధ్రము. సమా. కన్నవిటి-అంధుఁడు. కన్నాకు- *1.* తమలపాకుకట్టలో మొదటనుండుఆకు.*2.*అగ్రేసరుఁడు. *3.*ముఖ్యుఁడు.కన్నీరు-హర్షశోకములచే కనులనుండివచ్చు నీరు,అశ్రువు. రూ.కన్నునీరు. కన్నులమ్రొను-చెఱకు. కన్నులమ్రాని విలుకాఁడు - మన్మథుఁడు. కన్నొటు- భయము. కన్ను మొఱఁగు-వంచించు.

కన్నె-చూ. కన్నియ.సమా.—బావి-పిల్లబావి.—ఱికము- కన్యాత్వము.

కన్నెము-తె, కోడిగుండెకాయ.

కన్య-స. *1.*పెండ్లికానిపడుచు. *2.*కూఁతురు.*3.*పండ్రెండింట నాలవరాశి. *4.*ఆఁడుది.*5.*కలబంద.

కన్యక-స. *1.*పెండ్లికానిపడుచు. *2.*చెల్లెలు.

కపటము-స. కవుడు. క్రి. కపటించు.

కపర్దము-స. *1.* గవ్వ. *2.* శివుని జడముడి,

కపర్ది-స.శివుఁడు.(వ్యు.కపర్దమనెడిజటగలవాఁడు)

కపాటము-స. తలుపు. రూ. కవాటము.

కపాలము-స. *1.*తలపునుక. *2.*కుండ లోనగువాని పెంకు.*3.*గుంపు.సమా. కపాలభృత్తు, కపాలి-శివుఁడు.

కపి-స. కోఁతి.

కపింజలము-స. కంజు అను పిట్ట.

కపిత్థము-స. వెలఁగ.

కపిల-స.*1.*ఆగ్నేయదిశయందలిఆఁడేనుఁగు.(దీని భర్త పుండరీకము) *2.*పుల్లావు.

కపిలము-స. గోరోజనవర్ణము.

కపిలె-తె. ఎడ్లనుగట్టి నీరెత్తెడు యంత్రము, మోట.

కపిశము-స. పసుపుమించినయెఱుపు.

కపురము-వి.(కర్పూరము)రూ.కప్పురము,కప్రము.

కపోణి-స. మోఁచేయి.

కపోతము-స. *1.*పావురము.*2.*బెళవపిట్ట. (వ్యు.వేగముచే వాయువుకొదమఫలె నుండునది)

కపోలము-స. చెక్కిలి.

కప్ప-తె. మండూకము.సమా.—కుఱుపు-గుదిగాలిలో లేచెడుపుండు.—చిప్ప-ముత్తెపుచిప్పవంటిగుల్ల,శంబూక.—తాళము-ముద్దబీగము. [ము.

కప్పడము-తె. *1.*చినిఁగినగుడ్డ.*2.*కప్పుకొను వస్త్ర

కప్పము-తె. పన్ను. [కప్పరపాటు.

కప్పరము-తె. తొట్రుపాటు. క్రి. కప్పరపడు. కృ.

కప్పలి-తె. ఓడ.

కప్పిరి-తె. (కప్పు+ఇరులు) కొంచెపాటిచీఁకటి.

కప్పు-తె.*1.*క్రమ్ము. *2.*ఆచ్ఛాదించు.కృ.*3.*ఆచ్ఛాదనము.*4.*ఇంటిపైకప్పు. *5.*నలుపు. *6.*చీఁకటి. సమా.—కుత్తుకపులుఁగు-నెమలి.— దెరువరి-అగ్ని.—మల-కాటుకకొండ.— మేనిగాము-శనిగ్రహము.—ఱాయి-నీలమణి.

కప్పుడు-తె. (కప్పునది) ఆచ్ఛాదనము.

కప్పురము-చూ. కపురము. సమా. కప్పురగంధి-కర్పూరవాసనవంటి వాసనగల స్త్రీ. [త్రము

కప్పెర-వి. (ఖర్పరము) *1.*కపాలము. *2.*భిక్షాపా

కఫము-స. తెమడ, శ్లేష్మము.

కబంధము-స. *1.*నీరు. *2.* సముద్రము. *3.*తలతెగిన ట్రుళ్ల శరీరము.

కబంధుఁడు-స. *1.* కేతువు. *2.* ఒకరక్కసుఁడు

కబరి-స. కొప్పు.

కబళనము-స. మ్రింగుట.
కబళము-స. కడి. క్రి. కబళించు.
కబాయి-హిం. అంగీ.
కబురు-హిం. సమాచారము.
కబ్బము-వి. (కావ్యము) కవిచేవ్రాయఁబడిన గ్రంథము. సమా. కబ్బపుఁగూరుపరి-కవి.
కబ్బిలి-తె. కల్లమ్మువాఁడు, శౌండికుఁడు.
కమండలువు-స. సన్న్యాసులుంచుకొను గిండివంటి పాత్రము.
కమటము-తె.అగసాలెవానికుంపటి.రూ.కమ్మటము.
కమఠము-స. 1. భిక్షాపాత్రము. 2. తాఁబేలు.
కమఠి-స. ఆఁడు తాఁబేలు, ధులి.
కమతము-తె. అనేకులుచేరి చేయు సేద్యము. రూ. కమ్మతము. సమా. కమతకాఁడు - కమతము చేయువాఁడు. రూ.కమతీఁడు,కమ్మతీఁడు.
కమనీయము-స. మనోహరము.
కమనుఁడు-స. ఇచ్ఛగలవాఁడు, కాముకుఁడు.
కమరు-తె. 1.కాలు. 2.కృ. కాలినకంపు.3. మొలనూలు. రూ. కమ్మరు.
కమల-స. 1. లక్ష్మి. (వ్యు. చేత కమలము గలది) 2. ఉత్తమురాలు.
కమలము-స. 1. తామర.(వ్యు.జలమునుభూషించునది)2.జలము.3.రాగి. సమా. కమలాప్తుఁడు-సూర్యుఁడు. (ఇట్లే కమలమిత్రుఁడు మొ.) కమలాసనుఁడు,కమలజుఁడు-బ్రహ్మ.
కమలా-హిం. ఒకతెగ చిన్నకిచ్చిలి.
కమలిని-స. 1.తామరకొలను. 2. తామరతీఁగ.
కమసాలి-తె. బంగారుపనిచేయు ఒక తెగ.
కమాను-హిం. 1.విల్లు.2. విల్లువంపు. 3. ఫిడేలు వాయించు కొడుపు.
కమి,కమికిలి-తె. వంపఁబడినవ్రేళ్లుగల పుడిసిలి.
కమియు-తె. 1. కవియు. 2. మాఁగు. 3.నలఁగు.
కముచు-తె. 1. గ్రహించు. 2. మ్రింగు.
కముజు-చూ. కంజు.
కమ్మ-తె. 1.స్త్రీల.కర్ణభూషణము. 2.జాబు. 3.ఒక జాతి.4.పులుపులేనిది. 5.వాసనగలది.సమా.—గాడ్పు-మలయమారుతము.—నిమ్మ-తియ్యనిమ్మ.—నీరు- మకరందము.—నూనె-వాసనతైలము.—పిల్లి-పునుఁగుపిల్లి.—విలుకాఁడు- మన్మథుఁడు.
కమ్మటము-చూ. కమటము. సమా. కమ్మటీఁడు-కమసాలి.
కమ్మన-తె. కమ్మఁదనము.
కమ్మర-వి.(కర్మార)ఇనుముపని చేసి జీవించు ఒక జాతి. రూ. కరుమల.
కమ్మరి-వి. 1. కమ్మరవాఁడు,కర్మకారుఁడు.2.బాణకారుఁడు. రూ. కమ్మరీఁడు.
కమ్మరు-తె. మొలనూలు. రూ. కమరు.
కమ్మి-తె. 1.సన్ననిలోహపుకడ్డీ. 2.సన్ననిసూలియల్లిక.3.పేఁపబొద్దు. సమా. కమ్మచ్చు-కమ్మితీసెడి సాధనము. [కమ్మి.
కమ్ము-తె. 1.కమ్మిగా చాఁగఁగొట్టు. 2.క్రమ్ము. కృ.
కమ్రము-స. 1.ఇంపైనది. 2. ఇచ్ఛగలది.
కయ్య-తె. చుట్టునుగనిమలుగలమడి. రూ. క్రయ్య.
కయ్యము-తె. యుద్ధము. సమా. కయ్యపుఁదిండి-నారదుఁడు, కలహాశనుఁడు. కయ్యాలక్రచ్చ-జగడగొండి, కలహశీలుఁడు.
కయ్యర-తె. తక్కువజాతి ముత్తెము.
కర-తె. 1.తీరము. 2.తీక్ష్ణము. 3. (వి) చేయి. సమా. కరతిత్తి-వస్త్రపుసంచి. కరదివ్వె-దివ్వటి.రూ.కరదివియ, కరదివ్వియ. కరవాలు-కత్తి. కరాచురి-కత్తి.
కఱ-తె. 1. నలుపు. 2. మఱక.
కరంకము-స.1.లోపలనేమియులేనిబొండ్లపుఁజిప్ప. 2. డొక్క. 3. పుఱ్ఱె. [రూ. కరజము.
కరంజము-స. 1.పులిగోరుచెట్టు. 2.కానుగుచెట్టు.
కరండము-స. 1. కత్తి. 2. తేనెపెర. 3. పేటిక.
కరంబము-స. మేళనము.
కరఁగు-తె. ద్రవించు. ప్రే. కరఁచు.
కరక-తె. ఒకానొకఅడవిచెట్టు.సమా. కరకంచు-కరకకాయచాయతో వ్రాసిన అంచు.
స. వడగల్లు. [కంఠుఁడు.
కఱకంఠుఁడు-వి. (గరకంఠుఁడు) శివుఁడు, నీల
కరకర-తె. వ్రాయుటయందగు ధ్వని.
కఱకఱ-తె.కందుట,ప్రొద్దుపుట్టుట,ఒరయుట,తఱుఁగుటలోనగువానియందగు ధ్వని.
కరకరి-తె. (కఱకు+అరి) 1.క్రూరభావము.2.

ద్వేషము. 3. క్రూరుఁడు. 4. కఠినుఁడు. రూ. కఱకరి.

కఱకటి-తె. బాధ.

కరకసా-వి. (కర్కశము) కఱకు.

కఱకు-వి. (కర్కశము) 1. కాఠిన్యము. 2. పదను. 3. బ. పరుషవచనము. క్రి. కఱకుగిలు. సమా.—దుమ్ము-ఇసుక.

కఱకుట్లు-తె. (కఱి+కుట్లు) కఱియందు గ్రుచ్చికాల్చెడు మాంసఖండము. రూ. కఱికుట్లు.

కరగసము-వి. (క్రకచము) ఱంపము.

కఱచు-తె. 1. అభ్యసించు, నేర్చు. కృ. కఱద. (ప్రే. కఱపు) 2. కాటువేయు. కృ. కాటు.

కరటము-స. 1. కాకి. (వ్యు. 'కా' యని శబ్దించునది) 2. ఏనుఁగు చెక్కిలి.

కరటి-స. ఏనుఁగు. (వ్యు. కరటములు గలది)

కఱటి-తె. వంచకుఁడు.

కఱదము-తె. అల. రూ. కఱడు.

కరణము-స. 1. లెక్క వ్రాయువాఁడు. 2. ఇంద్రియము. 3. కారణము. 4. శరీరము. (త్రికరణములు: మనస్సు, వాక్కు, శరీరము) 5. సూర్య చంద్రులకు మధ్యనుండు దూరము, బవాది. (ఇవి 11: బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణజి, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము) 6. శూద్ర స్త్రీకిని వైశ్యునకును బుట్టినవాఁడు.

కరణి-తె. విధము.

కరణీయము-స. చేయఁదగిన పని.

కఱత-వి. (కృత్యము) 1. చేష్ట. 2. దుశ్చేష్ట. సమా. కఱతలాఁడు-దుశ్చేష్టుఁడు.

కఱద-తె. 1. బుద్ధి. 2. నేర్పు. (చూ. కఱచు) రూ. కఱుదు.

కరదివియ-చూ. కర.

కఱదూపము-వి. (కాలధూపము) గృహధూమము.

కఱనూనె-తె. (కఱి+నూనె) ప్రానితైలము.

కరపక్క-తె. వర్ణహీనమైన కెంపు ఱాయి.

కరపత్రము-స. ఱంపము.

కఱపు-తె. 1. బోధించు. 2. దుర్బోధన. చూ. కఱచు.

కరఫలము-స. గొఱపము.

కరభము-స. 1. మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదటివఱకుఁ గల చేతి వెలుపలిచోటు. 2. ఒంటెపిల్ల.

కరమర్దము-స. కలివె చెట్టు.

కరము-తె. మిక్కిలి.

స-1. చేయి. 2. కిరణము. 3. తొండము. 4. కప్పము. 5. వడగల్లు. సమా.—రుహము-గోరు. —వాలము-కత్తి. (వి. కరవాలు)—వాళిక-కత్తిపీఁట. —వీరము-1. కత్తి. 2. గన్నేరు. —శాఖ-వ్రేలు.

కరవటము-వి. (కరండము) బరణి. రూ. కరాటము.

కఱవాడు-తె. ఎండిన చేఁప.

కఱవు-తె. క్షామము.

కరా-వి. (ఖరము) తీక్ష్ణము. సమా.—చురకత్తి-చిన్నకత్తి. రూ. కరాచురి, కరాచూరి.

కరాపువు-తె. లవంగము. [పత్రము.

కరారు-హి. ఏర్పాటు. కరారునామా-ఒడంబడిక

కరాళము-స. 1. వెన్నెముక. 2. ఒడ్డుమిట్టయినది. 3. పొడవైనది. 4. వెఱపు పుట్టించునది. క్రి. కరాళించు.

కరి-తె. 1. నిదర్శనము. 2. మేర. 3. సాక్షి.

స. (వ్యు. కరముగలది) 1. ఏనుఁగు. 2. కోఁతి.

కఱి-తె. నల్లని. సమా.—పక్కము-కృష్ణపక్షము. —వేము-కాలశాకము. —వేలుపు-కృష్ణుఁడు. —వేలుపురిక్క-శ్రవణము.

కరిణె-తె. కట్టడపు పనివాని కొఱముట్టు, తాపి.

కరిణి-స. ఆఁడేనుఁగు. రూ. కరేణువు.

కఱియ-తె. నలుపు.

కరివె-తె. లోహముతోఁ జేసి వీణాదండమును పొదివికొనియుండునట్లు సొరకాయపై నమర్పఁబడినది. కకుభము.

కరివెద-తె. దున్ని విత్తుటకు వాన నెదురుచూచుట.

కరిసనము-వి. (కర్షణము) 1. దున్నుట. 2. సేద్యము. రూ. కర్సనము.

కరిసించు-వి. (ఘర్షించు) రాచు.

కరిసె-వి. (కర్షము) కాలుపలము.

కరీరము-స. 1. వెదురు మొలక. 2. కుండ.

కరీషము-స. 1. పిడక. 2. ఎరువు.

కఱుకు-తె. 1.రాచు. 2.మందాకుమాడ్చిచేసినపొడి.
కఱుకుట్లు-తె. (కఱు+కుట్లు) ఇనుప సలాక యందుఁ గ్రుచ్చి కాల్చిన మాంసఖండము. రూ. కఱుకుట్లు. చూ. కఱకుట్లు.
కరుగు-తె. 1. పోఁతపోసెడి అచ్చు. 2. వరిపొట్ట కఱ. రూ. కరువు.
కఱుగోల-తె.(కఱు+కోల)వాఁతవేసెడికొడుపు.
కరుడు-తె. 1. గట్టిపడిన ముద్ద. 2. దినదినము వ్రాయు సంక్షిప్తపు లెక్క. 3. ప్రాఁత పత్రము. 4. పచ్చికతోడ చెక్కి ఎత్తిన మట్టిపెల్ల.
కరుణ-స. కనికరము. క్రి. కరుణించు.
కఱుదు-చూ. కఱద. సమా.కఱుదులాఁడు-నేర్పరి.
కరుమల. చూ. కష్మర.
కరువ-తె. కొండ.
కరువలి-తె. (కారు+వలి) గాలి. రూ. కర్వలి. సమా.—పట్టి-1. హనుమంతుఁడు. 2. భీమసేనుఁడు. —రిక్క-స్వాతి. —విందు-అగ్ని, వాయుసఖుఁడు.
కరువు-తె. 1. చూ. కరుగు. 2. గర్భస్థపిండము.
కరుసు-వి. (ఘర్షము) పరుషోక్తి.
కరేణువు-స. 1. ఆఁడేనుఁగు. 2. ఏనుఁగు.
కరోటి-స. పుఱ్ఱె. [రాశి. 3. చెఱకు.
కర్కటము-స. 1.ఎండ్రి. 2. పంద్రెండింటనాలవ
కర్కరము-స. 1. కంకర జాయి. 2. అద్దము. 3. కఱకైనది. [కనికరము లేనిది.
కర్కశము-స. 1. కఱకైనది. 2. గట్టిది. 3.
కర్ఘము-వి. (కార్యము) పని. (మొదటి రూపము కరజము)
కర్ణము-స.1.చెవి.2.చుక్కాను.సమా.కర్ణజలూక-చెవిఁజొరుపాము. —ధారుఁడు-ఓడనడపువాఁడు. —పత్రము-చెవికమ్మ. —పూరము-1.పుష్పాదులచేఁ జేయఁబడినచెవికమ్మ.2.నల్లకలువ. —లత-చెవితమ్మె. —వేష్టనము-పోఁగులు.
కర్ణాకర్ణి-స. చెవికిచెవి.
కర్ణాటము-స. 1. కన్నడదేశము. 2. కన్నడభాష. చూ. కన్నడము.
కర్ణిక-స. 1. చెవితమ్మె. 2. తొండము చివర. 3. తామరదుద్దు. 4. చేతి నడిమివ్రేలు.
కర్ణేజపుఁడు-స. కొండెగాఁడు.
కర్త-స. 1. బ్రహ్మ. 2. చేయువాఁడు.
కర్తనము-స. 1. కత్తిరించుట. 2. స్త్రీలు రాట్నమున నూలువడుకుట.
కర్తరి-స.కత్తెర.
కర్తలాణము-చూ. కత్తలాని.
కర్తవ్యము-స. చేయఁదగినది.
కర్తారి-స. కత్తెరవంగ చెట్టు.
కర్దమము-స. బురద.
కర్పరము-స. 1. పుఱ్ఱె. 2. కొప్పెర. 3. భిక్షాపాత్రము.
కర్పూరము-స. ఘనసారము. (వి. కప్పురము)
కర్బురము-స. 1. నీరు. 2. బంగారు. 3. చిత్రవర్ణము. 4. డు. రాక్షసుఁడు.
కర్మంది-స. సన్న్యాసి. (వ్యు. కర్మందుఁడను ఋషి చెప్పిన సూత్రముల నధ్యయనముచేయువాఁడు)
కర్మణ్య-స. 1. కూలి. 2. జీతము.
కర్మము-స. 1. పని. 2.(వ్యాక.)క్రియాఫల మనుభవించునది. (షట్కర్మములు: యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము. షోడశకర్మములు: గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము.) సమా. కర్మకరుఁడు-పనివాఁడు. —కారుఁడు-కమ్మరి. రూ. కర్మారుఁడు. —ఠుఁడు-నెఱవేఱుదాఁకవిడువకపనిచేయువాఁడు. —యుగము-కలియుగము. —సాక్షి-సూర్యుఁడు, చెయువులసాకిరి. (కర్మేంద్రియములు: వాక్పాణిపాదపాయూపస్థలు.)
కఱ-తె. 1. కొయ్య. 2. మఱక. [నల్లనిది.
కఱ్ఱి-తె. 1. అర్జునుఁడు. 2. నల్లనివాఁడు. 3.
కఱు-తె. నాఁగటిదుంపయందమర్చు ఇనుపపాశము, కృషకము. రూ.కాఱు. సమా.—గుద్దలి-తొల్లిక. [బిదుకువాఁడు.
కర్షకుఁడు-స. 1. ఈడ్చువాఁడు. 2. దున్నుకొని

కర్షణము-స. 1. ఈడ్చుట. 2. దున్నుట. 3. ఒరయుట. [ఒరయిక.
కర్షము-స. 1. పదునాఱు మాషముల యెత్తు. 2.
కల-తె. 1. స్వప్నము. 2. ఉన్న. సమా. కలకాలము-ఎల్లప్పుడు.--తెలుఁగు-సత్యము.—రూపు-సత్యము.—వాఁడు-1. ధనికుఁడు. 2. ఆప్తుఁడు. స. 1. ముప్పదికాష్ఠలకాలము. 2. చంద్రునిలో పదునాఱవ భాగము. 3. భాగము. 4. స్త్రీ రజస్సు. 5. శిల్పము. (ఇవి 64) 6. అవ్యక్తమధురము (ధ్వని) సమా.—కంఠము - 1. అవ్యక్తమధురధ్వని. 2. కోకిల. 3. పావురము. 4. హంస. —రవము-పావురము. —హంస-రాజహంస.
కలంకము-స. 1. గుఱుతు. 2. దూఱు.
కలంకారి-తె. వ్రాఁత, అద్దకపు పనిగల వస్త్రము.
కలందాను-హిం. కలములుంచు పెట్టె.
కలఁక-తె.1.కలఁగుట, రూ. కలఁకువ, కలఁత. 2. కంటితెవులు.
కలఁకు-వి. (ఖలము) 1. కళ్లము. 2. స్థానము. 3. యుద్ధము. రూ. కలను.
కలఁగు-తె. సంక్షోభించు. ప్రే. కలఁచు. కృ. కలఁక, కలఁకువ, కలఁత.
కలకల-తె. నవ్వుటయందగు ధ్వని. [బలము.
కలకలము-స. గుంపునఁబుట్టిన పెనుసవ్వడి, అల
కలగలపు-తె. (కలపు + కలపు) 1. కలుపుగోలుతనము. 2. కలుసుఁగూర.
కలగుండు-తె. క్షోభము. [కలిసిన కూరాకు.
కలగూర-తె. (కలపు + కూర) పెక్కుదినుసులు
కలగొను-తె. (కలపు + కొను) కలఁగు.
కలధౌతము-స. 1. వెండి. 2.బంగారు. (వ్యు.కలుషము పోఁగొట్టఁబడినది)
కలన- స. 1. ఎఱుఁగుట. 2. పొందుట.
కలను-చూ. కలఁకు.
కలప-తె. 1. నాఁగటిదుంప. 2.నాఁగలి. 3.ఇంటి కుపయోగించుమ్రాను.సమా.—తాలుపు-1.బలరాముఁడు,హలాయుధుఁడు. 2. శూద్రుఁడు.
కలపడము-తె. కలియుట.
కలపనగంప-తె. కలహశీలుఁడు.
కలపనఁబిండి-తె. సంక్షోభము. [ద్రవ్యములు.
కలపము-తె. 1. కలుపుట. 2. కలిపిన పరిమళ
కలపు-తె. కలియఁజేయు.
కలబంద-తె. కంచెలకును,నారకును,మందునకును ఉపయోగించు చెట్టు, కన్య. రూ. కలుబంద.
కలభము-స. ఏనుఁగుగున్న. (వ్యు. ఉదకమును పొందునది.
కలమము-స. 1. వ్రాసెడుకలము. 2. వరిపైరు. 3. లక్క. 4. మొలక.
కలము-తె. 1.ఓడ. సమా. కలమరి-ఓడవాఁడు. 2. పంద్రెండుతూములు.వి.3.(కలమము)లేఖిని,పేనా.సమా.కలపకట్టియ-లేఖిని.
కలయంపి-తె. (కలయు + రొంపి)దుమ్మడఁగుట కై చల్లెడు నీరు. రూ. కలాఁపి.
కలయిక-తె. సంగమము.
కలయు-తె. కూఁడు, చేరు. రూ. కలియు.
కలవ-తె. 1. కలయుట. 2.ఇసుకయుసున్నమును కలిపినది. [న్నము.
కలవంటకము-తె. (కలపు+వంటకము) చిత్రా
కలవడు-తె. (కలపు+పడు) కలయు.
కలవరము-తె. 1.కలఁత. 2.చింత.క్రి.కలవరించు. కృ. కలవరింత.
కలశము-స. 1.కుండ.2.గోపురముమీఁదిశిఖరము. (వ్యు. జలమును తీసికొనునది) సమా. కలశాబ్ధి-పాలసంద్రము.
కలశి-స.1.పెరుఁగుచిలికెడుకుండ.2.అగస్త్యుఁడు
కలహంస-స. 1. ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్లు ఱెక్కలుగలహంస. 2. రాజహంస. రూ. కలహంసము.
కలహము-స. జగడము, యుద్ధము. క్రి. కలహించు. సమా. కలహాంతరిత - ముందు కోపముచే ప్రియుని వదరి విడనాడి వెనుక పరితపించు నాయిక. కలహాశనుఁడు-నారదుఁడు, కయ్యపుఁబిండి. (ఇట్లే కలహభోజనుఁడు.మొ.)
కలాచి-స. తమ్మపడిగము.
కలాదుఁడు-స. 1.అగసాలెవాఁడు.2. చంద్రుఁడు
కలాపన-తె. కలఁత.
కలాపము-తె. కలఁత.

స. 1. ఇరువదియైదుపేటల యొడ్డాణము. 2. నెమలిపురి. 3. అమ్ములపొది. 4. భూషణము. 5. సమూహము.
కలాపి-స. నెమలి. (వ్యు. కలాపముకలది)
కలాసి-హిం. ఓడపనివాఁడు.
కలి-తె. పులియఁబెట్టినకడుగు నీరు.
స. 1. నాల్గుయుగములలో నాలవది. 2. కల్మము. 3. యుద్ధము. 4. కలియుగదేవత.
కలిక-స. 1. మొగ్గ. 2. కల్మము.
కలికము-తె. కంటికివేయు మందు.
కలికి-తె. 1. మనోజ్ఞము. 2. మనోజ్ఞురాలగు ఆఁడుది. 3. ఆఁడుది. రూ. కల్కి.
లిగొట్టు-తె. పాటలవృక్షము.
లితనము-తె. (కలికి+తనము) సామర్థ్యము.
కలితము-స. 1. ఎఱుఁగఁబడినది. 2. పొందఁబడినది.
కలిమము-తె. మాంసము.
కలిమి-తె. 1. కలుగుట. 2. సంపద. సమా.—చెలి-లక్ష్మి.—దండుగ-నేరము లేకున్న నుధనవంతుల యొద్ద రాజు పుచ్చుకొను ద్రవ్యము.
కలియు-తె. పొందు, చేరు. రూ. కలయు.
కలివె-తె. ఊరుఁగాయకుపయోగించు నల్లని పుల్లని పండ్లుగల చెట్టు, కరమర్దము.
కలు-తె. 1. బండిచక్రము. 2. జాయి. 3. మద్యము. రూ. కల్లు. సమా.—గానుగ- జాతిగానుగ.
కలుఁగు-తె. 1. బొఱియ. 2. గుహ.
కలుఁజు-తె. చెఱువులోనగువాని తూము.
కలుగు-తె. 1. అగు. 2. ఉండు. 3. ఓపు. 4. పుట్టు. 5. కలియు. రూ. కల్గు, కలువు. [3. కలఁత.
కలుచ-వి. (కలుషము) 1. దోషము. 2. క్రోధము.
కలుపు-తె. 1. కలియఁజేయు. 2. పైరులోనికసవు, గాదము.
కలుపుఁగోలు-తె. అభేదము.
కలుము-తె. కలుష గంధము.
కలువ-తె. ఉత్పలము. రూ. కల్వ. సమా.—కంటి- 1. కలువఱేకులవంటికన్నులుగలయాఁడుది. 2. ఆఁడుది.—ఱేఁడు-చంద్రుఁడు. (ఇట్లే కలువరాయఁడు మొ.)—దాయ- సూర్యుఁడు.—విందు-చంద్రుఁడు.
కలువము-తె. మందునూతెడిజాయి. రూ. కల్వము.
కలుషము-స. 1. పాపము. 2. కలఁకఁబాఱినది. క్రి. కలుషించు. [కూర.
కలుసుఁగూర-తె. నంజుకొనుటకై అనుకుగావండిన
కల్పనము-స. 1. క్లుప్తి. 2. రచన. క్రి. కల్పించు.
కల్పము-స. 1. బ్రహ్మదినము. 2. ప్రళయము. 3. వేదవిధి. 4. శాస్త్రము. 5. వేల్పుమ్రాను. రూ. కల్పకము. ఇవియైదు (మందారము, పారిజాతము, సంతానము, కల్పకము, హరిచందనము)
కల్మషము-స. 1. పాపము. 2. నలుపు.
కల్మాషము-స. 1. చిత్రవర్ణము. 2. నలుపు.
కల్య-స. మద్యము.
కల్యము-స. 1. వేకువ. 2. శుభమైనది.
కల్యాణము-స. 1. శుభము. 2. పెండ్లి. 3. అపరంజి.
కల్ల-తె. 1. అసత్యము. 2. మోసము. 3. పరుషము. 4. కంచె. సమా. కల్లతనము- 1. చెడునడత. 2. మోసము. కల్లరి-అసత్యమాడువాఁడు. రూ. కల్లరీఁడు.
కల్లు- చూ. కలు.
కల్లోలము-స. 1. పెద్దయల. 2. సంతోషము.
కల్లోలిని-స. నది.
కల్హారము-స. ఇంచుకయెఱుపును తెలుపును అధిక పరిమళమును గల కలువ, సౌగంధికము.
కవ-తె. 1. జత. 2. అమడ. 3. బ. కుశలవులు, నకుల సహదేవులు మున్నగు అమడలు.
కవచము-స. 1. బొందళము. 2. తప్పెట.
కవట-తె. పెద్దకొమ్మ. [గ్రాసము.
కవణము-వి. (కబళము) గుఱ్ఱము మొదలగువాని
కవను-తె. కనవు.
కవఱలు-తె. పాచికలు.
కవలు-తె. పఠనమందు సామ్యముచే నొకటికొకటి వచ్చి కలియుట. క్రి. కవలుకొను.
కవాటము-స. తలుపు. రూ. కపాటము.
కవాడము-తె. ఎద్దుపైవేయు బరువు.
కవాతు-హిం. సైనికులుచేయు సాధకము.
కవి-స. 1. కల్మము. రూ. కవిక. 2. కవిత్వము చెప్పువాఁడు. 3. పండితుఁడు. 4. శుక్రుఁడు. 5. వాల్మీకి.
కవిత్వము-స. కవిచేయు వాక్యరచన. రూ. కవిత.

(వి.కైత) ఇది నాలుగు విధములు: ఆశుకవిత్వము, చిత్రకవిత్వము, బంధకవిత్వము, గర్భకవిత్వము. [కవిచేయు.
కవియు-తె. వ్యాపించు. ప్రే. కవియించు, కవించు.
కవిరి-తె. తాంబూలపుటుండ.
కవిల-వి. (కపిలము) కపిలవర్ణము.
కవిలియ-తె. లెక్కల పుస్తకము. రూ. కవిలె.
కవోష్ణము-స. ఇంచుకవేఁడి, గోరువెచ్చన.
కవ్యము-స. పితృదేవతల కియ్యఁదగిన అన్నము.
కవ్వడి-తె. (కవ+వడి) రెండుచేతుల వడిగలవాఁడు. అర్జునుఁడు.
కవ్వము-తె. పెరుగుచిలుకుసాధనము, మంథానము. సమా. కవ్వపుఁగొండ- మందరాద్రి. (ఇప్లే కవ్వపుమల. మొ.)
కవ్వు-తె. 1. కబళించు. 2. అపహరించు.
కశ-స. చబుకు, జాటీ.
కశిపువు-స. 1. అన్నము. 2. వస్త్రము. 3. అన్నవస్త్రములు. 4. పఱుపు.
కశేరుక-స. వెన్నెముక. [మాలము)
కశ్మలము-స. 1. మూర్ఛ. 2. మలినము. (వి. కసు
కషము-స. 1. ఒరగల్లు. 2. సాన.
కషణము-స. ఒరయుట.
కషాయము-స. 1. ఒగరు. 2. ఔషధరసము. 3. ఎఱ్ఱనిది. 4. వాసనగలది.
కష్టము-స. 1. దుఃఖము. 2. పాపము. క్రి. కష్టపడు. కృ. కష్టపాటు. (అష్టకష్టములు: దేశాంతరగమనము, భార్యావియోగము, ఆపత్కాలమందు బంధుదర్శనము, ఉచ్ఛిష్టభక్షణము, శత్రుస్నేహము, పరాన్నప్రతీక్షణము, భంగము, దారిద్ర్యము)
కసటు-తె. 1. పాపము. 2. మాలిన్యము.
కసమస-తె. తొట్రుపాటు. రూ. కసిమసి.
కసరతు-హిం. దేహపరిశ్రమము.
కసరు-తె. 1. చలించు. 2. కోపించు. కృ. 3. కోపము. 4. వానగాలి. 5. లాభము.
కసవు-వి. (ఘాసము) 1. గడ్డి. 2. పెంట.
కసాయి-హిం. మాంసమమ్మువాఁడు, కటికవాఁడు.
కసి-తె. 1. కోపము. 2. దురద. 3. అల్పము. (ఇది కసిడికి వృత్తియందైన లోపరూపము)
కసిడి-తె. అల్పము. (చూ. పై.) [3. చంపు.
కసిమసఁగు-తె. 1. విజృంభించు. 2. ఖండించు.
కసిమిరి-తె. కీఁట.
కసీసము-వి. (కాసీసము) నల్లనిది.
కసు-తె. సమాసమందు కసురునకగు లోపరూపము. —గందు- 1. లేఁతబిడ్డ. 2. నలుపు.
కసుగందు-తె. (కందు+కందు) 1. మిక్కిలివాడు. 2. కృ. మిక్కిలివాడుట. [బాధించు.
కసుగు-తె. 1. నలఁగు. 2. నలఁచు. 3. పులుము. 4.
కసుమాలము-వి. (కశ్మలము) మాలిన్యము.
కసురు-తె. లేఁతకాయ, పిందె.
కసెము-వి. (కచ్ఛము) నీరూరెడి ఇసుకనేలకాలువ. రూ. కస్సెము.
కస్తి-హిం. కష్టము.
కస్తురి-వి. (కస్తూరి) మృగమదము. సమా.—పసుపు-ఒకతెగ వాసనపసుపు, గంధహరిద్ర.—పిల్లి-గంధమృగము, పునుఁగుపిల్లి.—వీణియ-కస్తూరిగల జింకబొడ్డు, మృగనాభి.
కస్తూరి-స. మృగమదము. (వి. కస్తురి)
కస్సెము-చూ. కసెము.
కహకహ-స. రాక్షసులు నవ్వుటయందగు ధ్వని.
కహారము-స. నిద్రాదు.
కళ-తె. 1. మూర్ఛ. 2. రెమ్మ.
స. 1. విద్య. 2. కాంతి. రూ. కల. సమా. కళానిధి-చంద్రుఁడు. రూ. కలానిధి.—వతి-1. కళలెఱిఁగిన ఆఁడుది. 2. తుంబురుని వీణ.
కళత్రము-స. 1. భార్య. (వ్యు. ఎన్నుకొనఁబడినది) 2. పిఱుఁదు. 3. కోట.
కళవసము-చూ. కడవసము.
కళవళము-తె. 1. కలఁత. 2. తొట్రుపాటు. క్రి. కళవళించు, కళవళపడు.
కళాయి-హిం. పాత్రలకు పూసెడి సీసపు పూఁత. తె. నీలిమందు కాఁచెడి గంగాళము.
కళాసము-తె. చూ. కడవసము.
కళాసించు-తె. అలయు.
కళుకు-తె. 1. కాంతి. 2. పొడి.
కళేబరము-స. శరీరము.
కళ్యము-వి. (ఖలిక) గుఱ్ఱమునకు నోటఁదగిలించు

నది, ఖలీనము. రూ. కళ్లియము, కళ్లెము.
కళ్ల-తె. శైత్యముచే గట్టిపడిన యుమ్మి. రూ. గళ్ల.
కళ్లము-వి. (ఖలము) ధాన్యమును జిచెడుచోటు. రూ. కల్లాము.
కళ్లియము, కళ్లెము-చూ. కళ్యము.

## కా

కా-తె. 1. కదా. 2. అని. 3. కాకియఱపు.
స. కుత్సిత శబ్దమునకు సమాసమందు వచ్చు రూపము. సమా. కాకృత్యము-అకార్యము. కాపురుషుఁడు-దుర్మార్గుఁడు.
కాంక్ష-స. కోరిక. క్రి. కాంక్షించు.
కాంక్షితము- స. కోరఁబడినది. [ఉమ్మెత్త.
కాంచనము-స. 1. బంగారు. 2. సంపెంగ. 3.
కాంచి-స. 1. ఒంటిపేటగల ఆఁడుదాని మొలనూలు. 2. కాంచీపురము.
కాంచు-తె. 1. చూచు. 2. పొందు. 3. బిడ్డనుకను.
కాంజికము-స. ఆరనాళము, కలి. (వి. గంజి)
కాండము-స. 1. గ్రంథభాగము. 2. సమూహము. 3. బాణము. 4. జలము. 5. ఈనె. 6. కాఁడ. 7. బోదె. 8. గుచ్ఛము. 9. ఏకాంతము. సమా. కాండపటము-తెర.
కాంద్ర-తె. ఒకతెగ కసవు.
కాంద్రు-తె. పులిచేయు ధ్వని.
కాంత-స. 1. కోరఁదగిన ఆఁడుది. 2. ఆఁడుది.
కాంతము-స. 1. ఇనుము. 2. (చంద్రసూర్యపర్యాయ శబ్దములకు తరువాత వచ్చునపుడు) ఱాయి. 3. సూదంటురాయి.
కాంతారము-స. 1. అడవి. 2. పోరానిత్రోవ. 3. తెలుపుకలసిన పచ్చచెఱకు. 4. బండికంటినదుము.
కాంతాళము-తె. 1. ఈసు. 2. తాలిమిలేమి. క్రి. కాంతాళపడు.
కాంతి-స. 1. జిగి. 2. కోరిక.
కాంతుఁడు-స. 1. మగఁడు. 2. ఒప్పిదముగలవాఁడు.
కాందిశీకుఁడు-స. వెఱపుచే పరుగిడువాఁడు.
కాంస్యము-స. 1. కంచు. 2. లోహపుపానపాత్రము.
కాఁక-తె. 1 జ్వరము. 2. తాపము. 3. కోపము. 4. ఉష్ణము. రూ. క్రాఁక. సమా. —వెలుఁగు-సూర్యుఁడు, ఉష్ణరశ్మి.
కాఁకర-వి. (కారవేల్లము) ఒకతెగ కూరగాయ.
కాఁగు-తె. 1. తపించు. 2. కోపపడు. (ప్రే. కాఁచు) కృ. కాఁక. 3. పెద్దబాన. రూ. క్రాఁగు.
కాఁగుడు-తె. తపించుట. రూ. క్రాఁగుడు.
కాఁడ-వి. (కాండ) 1. కూరాకులోనగువాని కామ. 2. తొడిమ.
కాఁడి-తె. 1. పులియఁబెట్టిన కడుగునీరు. 2. బండి నాఁగలిమున్నగువానిఁ బూన్చుటకై ఎద్దు మెడపై నుంచికట్టెడుకట్టె. 3. జత.
కాఁడు-తె. 1. నాటు. 2. పుంలింగ ప్రత్యయము.
కాఁదారి-తె. అర్ధరాత్రము. రూ. కాఁదారిమాఁదారి.
కాఁపడము-తె. నొప్పిగలచోట వేఁడివస్తువులతో ఒత్తుట. రూ. కాఁపుడు.
కాఁపు-తె. 1. కాఁపురము. 2. గృహస్థుఁడు. 3. పంటపెట్టువాఁడు. 4. శూద్రుఁడు.
కాఁపురము-తె. 1. నివాసము. 2. సంసారము. క్రి. కాఁపురించు. [దెలుపునది.)
కాఁబట్టి-తె. (కాన్+పట్టి) కనుక. (హేతువును
కాఁబడు-తె. (కాన్+పడు) అగు.
కాఁబోలు-తె. (కాన్+పోలున్) అగునేమో.
కాక-తె. 1. ఆశీరాద్యర్థకము. 2. వినార్థకము.
కాకము-స. కాకి. (వ్యు. కాయనికూయునది) సమా. కాకతాళీయము-కాకి వ్రాలఁగా తాటిపండుపడిన విధము వంటిది. —పక్షము - పిల్లజుట్టు, కూఁకటి. —పుష్టము-కోయిల. కాకాక్షిన్యాయము-కాకిచూపువలె నేదేనొకప్రక్కకొఱగుట. కాకోదరము-పాము.
కాకలము-స. కాగితము.
కాకలి-స. సూక్ష్మమైన అవ్యక్తమధురధ్వని.
కాకి-వి. (కాకము) 1. వాయసము. 2. అల్పము. సమా. —కలువ- అల్లి పూవు, కాకోత్పలము. —చావు-ఆకస్మికమృతి. —చిప్ప-ముత్తెపుచిప్పవంటి గుల్ల, శంబూక. —చెఱకు-చెఱకువంటి తృణము, తేజనకము. —తీపు-ఈడ్చుకొనిపడు మూర్ఛ. —బంగారు-పచ్చని అభ్రకము. —వెల్లు-కాకివెదురు.
కాకితము-హిం. వ్రాయుపత్రము. రూ. కాగితము.

కాకిణి-స. 1.కర్షమందు నాలవపాలు. 2. గవ్వ. 3. కొలతకోల. [4. శూన్యము.
కాకు-తె. 1. గాసి. 2.తిరస్కారము. 3.వ్యర్థము.
కాకుదము-స. తాలువు. [దగ్గుత్తిక.
కాకువు-స. శోకభయాదులచేనగు ధ్వనివికారము,
కాకోలము-స. 1. ఒక నరకము. 2. ఒకవిషము. 3. మాలకాకి. [దివ్వటీ.
కాగడా-తె. (కాఁగు+గడ) గుడ్డతోనేచుట్టిన
కాచము-స. 1. గాజుప్పు. 2. గాజుపూస. 3. గాజుమన్ను. 4. కాసు.
కాచు-తె. 1. కాయకాచు. 2. ఎండకాయు. 3. రక్షించు. 4. ఎదురుచూచు. 5. సహించు. కృ. కాపు.
కాటకము-తె. కలువు.
కాటు-తె. 1. కఱచుట. 2. కఱచినగాయము. 3. మూఁడి అడుగంటుట.
కాటుక-తె. 1. అంజనము. 2. జొన్న వెన్నునకుఁ గలుగు వ్యాధి. సమా.—కన్ను-చుట్టునునల్లన గలకన్ను. —పిట్ట-ఖంజరీటము. —రాయి-సౌవీరాంజనము.—తేకులపాము-పులిపెంజెర.
కాడు-తె. 1. శ్మశానము. 2. అడవి. 3. నాశము. సమా. కాటిపాపఁడు-గొల్లఁడు. కాటితేఁడు-శివుఁడు. రూ. కాల్పేఁడు. క్రి. కాడుచేయు-నాశము చేయు.—పడు-1. కలఁతపడు. 2. కనఁబడక పోవు. రూ. కాడ్పడు. [రూ. ఖాణము.
కాణము-హిం. గుఱ్ఱమునకుఁబెట్టెడు ఆహారము.
కాణయాచి-తె. 1. చిరకాల వాసస్థానము. 2.చిరకాలానుభవముకలది. రూ. కాణాచి.
కాణుఁడు-స. ఒంటికంటివాఁడు. [అవుత.
కాత-తె. ఆశీరాద్యర్థకము. రూ. కావుత, అగుత,
కాతరము-స. భయము.
కాతాళము-తె. కోపము.
కాత్యాయని-స. 1. పార్వతి. 2. సగము వయసు చెల్లి కావిచీరగట్టినవిధవ.
కాదంబము-స. 1. ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్లు తెక్కలుగలహంస, కలహంస. 2. బాణము.
కాదంబరి-స. 1.ఆఁడుకోయిల. 2.గోరువంక. 3. మద్యము. 4. సరస్వతి.

కాదంబిని-స. మేఘపంక్తి.
కాదాచిత్కము-స. ఒకానొకప్పుడు కలుగునది.
కాద్రవేయుఁడు-స. కద్రువకొడుకు, పాము.
కాన-తె. 1. కనుక. 2. సంబోధనార్థకము.(సామి కాన. మొ.) వి. (కాననము) అడవి.
కాననము-స. 1. అడవి. 2. ఇల్లు.
కాననివాఁడు-తె. అంధుఁడు.
కానరానిచుక్క-తె. అభిజిన్నక్షత్రము.
కాని-తె. 1. వికల్పార్థకము. 2. వినార్థకము. వి. (కాకిణి) వీసమున నాలవభాగము, మూఁడు పైసలు.
కానిక-తె. ఉపహారము. రూ. కానుక, కాన్క.
కానిపించు-తె. కనఁబడు. రూ. కనిపించు, కాన్పించు, కన్పించు.
కానీ-తె. కానిమ్ము. [వ్యాసుఁడు. 3.కర్ణుఁడు.
కానీనుఁడు-స. 1. కన్యకకుఁ బుట్టినవాఁడు. 2.
కాను-తె. నీళ్లకలియనిమజ్జిగ, మథితము.
కానుక-చూ. కానిక.
కానుగు-తె. కరంజవృక్షము.
కానుపు-తె. 1. ప్రసవము. 2. వీక్షణము.
కాపంతము-తె. కుక్కను గట్టు కొయ్య.
కాపథము-స. 1. నీటివట్టివేరు. 2. చెడుత్రోవ.
కాపరి-తె. (కాపు+అరి) రక్షకుఁడు.
కాపాడు-తె. (కాపు+అడు) రక్షించు.
కాపిశాయనము-స. కల్లు.
కాపు-తె. 1. కాయలుకాచుట. 2. రక్షించుట.
కాపుగడ-తె. రక్షణము. [భావము.
కాపేయము-స. 1. కృపణత్వము. 2. కపిస్వ
కామ-తె. 1. కాఁడ. 2.మగగుఱి. 3.చనుమొన.
కామంచి-వి.(కామంజిక)ఒకతెగగడ్డి,కత్తృణము.
కామంజిక.స. —పై.—
కామము-స. 1.కోరిక. 2.మోహము. 3.రేతస్సు. 4. డు. మన్మథుఁడు. సమా. కామధేనువు-కోరినది పిదుకు వేల్పుటావు.—పాలుఁడు-బలరాముఁడు.
కామనుఁడు-చూ. కమనుఁడు.
కామయిత-స. కాముకుఁడు.
కామాటము-తె. 1.బరువుమోయుపని. 2.గోడలు

కట్టుపని. సమా. కామాటి- కామాటము పని చేయువాఁడు. [రూ. కామెల.

కామాల-వి.(కామల) కన్నులుపచ్చనగురోగము.

కామి-స. 1. కాముకుఁడు. 2. జక్కవ. 3. పావురము.

కామిని-స. 1. ప్రియసంగమమం దధికేచ్ఛగల ఆఁడుది. 2. ఆఁడుది. 3. ఆఁడుపావురము. 4. పెంటిజక్కవ. 5. బదనిక.

కాముకి-స. సంభోగమందిచ్ఛగల ఆఁడుది.

కాముకుఁడు-స. ఇచ్ఛగలవాఁడు.

కామ్యము-స. కోరఁదగినది.

కాయ-తె. 1. చెట్టునఁగాచుఫలము. 2. కఠినవస్తు సంస్పర్శచే హస్తాదులందుఁగలుగుకాయ, కిణము. 3. జూదమందలి సారె. మొ. 4. వీణసొరకాయ. 5. నేత్రరోగము. సమా.—కంటి-కుబేరుఁడు. —కన్ను-కాయగాచినకన్ను.

కాయకము-తె. జీవనము.

కాయమానము-స. పందిరి.

కాయము-తె. బాలెంతకిచ్చు మందు.

స. శరీరము. 2. స్వభావము. సమా. కాయజలము-మూత్రము. —జుఁడు-మన్మథుఁడు.—స్థుఁడు- 1. కరణము. 2. పరమాత్ముఁడు.

కాయిక-స. నానాఁటివద్ధి.

కాయికము-స. శరీరసంబంధమైనది. రూ. కాయకము.

కాయిలా. హిం. ఆరోగ్యములేమి.

కాయు-తె. ఎండ, వెన్నెల మొదలగునవిప్రకాశించు.

కాయువు-తె. అనురాగము. రూ. కాయ్వు.

కార-స. 1. చెఱ. 2. చెఱసాల.

కారకము-స. కారణముగలది, చేయునది. (ఇవి ఆఱు: కర్తృకారకము, కర్మకారకము, కరణకారకము, అపాదానకారకము, అధికరణకారకము.)

కారణము-స. 1. హేతువు. 2. పనిముట్టు.

కారము-వి. (క్షారము) 1. ఆఱురుచులలోనొకటి. 2. చవుడు. 3. నూలుతడుపు ఒకానొక ద్రవ్యము. 4. బిడ్డలకుఁబోయుమందు.

స. 1. కష్టము. 2. యత్నము.

కారయిత-స. చేయించువాఁడు.

కారాకూరము-తె. కలఁగినది.

కారించు-తె. బాధించు. కృ. కాటియ. [పెండ్లాము

కారిక-స. 1. సూత్రాదివివరణశ్లోకము. 2. నట్టువుని

కారికము-తె. చలువచేయని క్రొత్తగుడ్డ.

కారిజము-వి. (కాలఖండము) కడుపులో నీరుతిత్తి క్రింద నుండు మాంసఖండము. రూ. కార్జము.

కాటియ-తె. యాతన.

కారు-తె. 1. అడవి. 2. నస. 3. చవుడు. 4. కాలము. 5. వానకాలము. 6. జ్యేష్ఠ మాసము మొదలు నాలుగేసి నెలలకాలము. 7. నలుపు. క్రి. కారుకొను-నల్లబాఁఱు. సమా. కారగ్గి - దావానలము. (ఇక్షే కారుచిచ్చు. మొ.) కారుకొమ్ము మెకము-దుప్పి. —పోతు-అడవిదున్న. కారూరు-అడవిలోనిపల్లె.

కాఱు-తె. 1. స్రవించు. 2. రాలు. 3. అజ్ఞానము. 4. కట్టు. 5. నీఱుకాఱు. 6. దట్టము. 7. అనృతవచనము. 8. పరుషవాక్కు. 9. వ్యర్థవాక్కులు. సమా. కాఱొడ్డెము- పరుషోక్తి. క్రి. కాఱుకొను-సందడించు. [కార్ఖానా.

కారుఖానా-హిం. పనిచేయుస్థలము, పట్టెడ. రూ.

కారుణికుఁడు-స. కరుణగలవాఁడు. [వాఁడు.

కారువు-స. 1. విశ్వకర్మ. 2. శిల్పి. 3. చేయు

కార్తస్వరము-స. బంగారు.

కార్తాంతికుఁడు-స. జోస్యుఁడు.

కార్తికము-స. ఎనిమిదవనెల. రూ. కార్తికికము.

కార్తికేయుఁడు-స. కుమారస్వామి. (వ్యు. కృత్తికల కొడుకు.) [నక్షత్రము.

కార్తె-వి. (కర్తరి) 1. కృత్తిక. 2. సూర్యుఁడుండు

కార్పటికుఁడు-స. 1. కోమటి. 2. తీర్థము మోసికొనిపోవు బాటసారి.

కార్పాసము-స. ప్రత్తి.

కార్ముకము-స. 1. విల్లు. 2. వెదురు. (వ్యు. కర్మకారునిచేఁజేయఁబడునది.)

కార్యము. స. 1. పని. 2. హేతువు. సమా. కార్యదర్శి- పని నిర్వహించువాఁడు. [కార్షికము.

కార్షాపణము-స. కర్షమెత్తు వెండిటంకము. రూ.

కార్షుఁడు-స. దున్నికొనిబ్రదుకువాఁడు.

కాలము-స. 1. సమయము. 2. నలుపు. 3. చావు

సమా.కాలకంఠము-1.ఊరఁబిచ్చుక.2.కాటుక
పిట్ట.3.నెమలి.—కంఠిక-అలక్ష్మి, పెద్దమ్మ.—
కంఠుఁడు-1. శివుఁడు.2.యముఁడు. —కూట
ము-ఒకవిషము. —ఖండము - కారిజము.—
జ్ఞము-1. కోడి.2.కోయిల.3. డు. జోస్యుఁడు.
—ధర్మము-చావు. —పృష్ఠము-1.కర్ణునివిల్లు.
2.విల్లు. —శాకము-కఱివేఁపచెట్టు. —సూత్ర
ము—ఇనుపతంతులు గల నరకము.
కాలకము-స. పుట్టుమచ్చ. [పు.5.చీఁకటి.6.కల్లు.
కాలిక-స.1.పార్వతి.2.ద్రౌపది.3. బొగ్గు. 4.నలు
కాలియ-తె. పిశాచము.
కాలీచి-స. న్యాయవిచారణస్థలము.
కాలీయము-స. కాలసంబంధమైనది.
కాలు-తె. 1. మండు. 2. పాదము. 3. పాతిక.
4. మంచపుకోడు. మొ. సమా. కాలరి-కాలి
బంటు, పదాతి. కాలిత్రోవ- ఒకఁడునడచిపోఁ
దగినత్రోవ, ఏకపది.—నడ-పాదచారము.—
పుట్టువు- శూద్రుఁడు, పాదజుఁడు.—బంటు-
పదాతి, కాలుమానిసి. కాలుదివియ-కాగడా.—
బలము-పదాతిసేన. —బోను-మృగములకాళ్లు
తగులుకొనసుంచుబోను.కాలుమడి-మూత్రము.
రూ.కాల్మడి.క్రి.కాలుమడుచు. క్రి.కాలుద్రవ్వు-
జగడమునకుపిలుచు.—ద్రొక్కు- 1.పెండ్లాడు.
2.కదియు.—పట్టు-కోడెలవట్టలునలఁచు.
కాలుఁడు-స. యముఁడు. [2.పరంపర.రూ.కాల్వ.
కాలువ-తె.1.నీరుపాఱుటకుత్రవ్వినమార్గము,కుల్య.
కాలుష్యము-స. కలుషసంబంధమైనది, కలఁక.
కాలేయము-స. కారిజము. [మైనది.
కాల్యము-స. 1. వేకువ. 2. కాలమునందుయోగ్య
కాల్వురు-తె. పదాతివర్గము.
కావడి-తె. (కవ+అడకము) నీళ్లుమొదలగునవి
మోచితెచ్చుటకై రెండు కొనలయందును ఉట్లమ
ర్చిన వెదురుబద్ద. క్రి. కావడించు.
కావరము-తె. క్రొవ్వు, మదము. క్రి. కావరించు.
కావరుఁడు-తె. దుర్మదుఁడు.
కావలము-తె. పాపము. (కావలుఁడు-పాపి)
కావలయు-తె. (కాన్+వలయున్) 1. ఆవశ్యక
మగు. 2. అపేక్ష్యమగు. 3. అగు. రూ.
కావలెను. [డు. —బొట్టు-రక్షబొట్టు.
కావలి-తె. రక్షణము. సమా. —కాఁడు-రక్షకుఁ
కావా-హిం. గుండ్రముగా తిరుగుట.
కావారి-స. మొగిలియాకులతో నేర్పఱచినగొడుగు.
కావి-తె. 1. ఎఱుపు. 2. కాషాయవస్త్రము. సమా.
—తాలుపు-సన్న్యాసి. —ఱాయి- ఎఱ్ఱఱాయి.
కావించు-తె. కాఁజేయు, నెఱవేర్చు.
కావిరి-తె. నలుపు. సమా. —బొట్టు-కావలిబొట్టు.
కావు-తె.1.ఏడ్చుటలోనగువానియందగుధ్వని. 2.
పాఁతఱమున్నగువానిపై కప్పు.3.కావలిబొట్టు.
కావుట-తె. అగుట.
కావుత-చూ. కాత.
కావున-తె. హేత్వర్థకము. చూ. కాన.
కావ్యము-స. (వ్యు. కవిచే వ్రాయఁబడినది) గ్రం
థము. (వి. కబ్బము.) [కొడుకు.)
కావ్యుఁడు-స. శుక్రుఁడు. (వ్యు. కవి యను ఋషి
కాశము-స. ఱెల్లు. [దుంప. 3. ఒకదేశము.
కాశ్మీరము-స. 1. కుంకుమపూవు.2. మెట్టదామర
కాశ్యపి-స. 1. భూమి. (వ్యు. పరశురామునిచే
కశ్యపునకు యజ్ఞదక్షిణగా నీయఁబడినది) 2.
అనూరుఁడు. (వ్యు. కశ్యపునికొడుకు)
కాషాయము-స. కావివస్త్రము. [దిక్కు. 3. మేర.
కాష్ఠ-స. 1. పదునెనిమిది ఱెప్పపాట్ల కాలము. 2.
కాష్ఠము-స. కట్టె. (వి. కట్టె.)
కాస-తె. దట్టీ. రూ. కాసె, కాసియ. క్రి.కాసించు.
కాసము-స. దగ్గు.
కాసరము-స. దున్న. (వ్యు. ఉదకమును పొందు
నది, గొప్పశరీరముచే మందముగ నడచునది.)
కాసా-హిం. దాసీపుత్రుఁడు. [యునది)
కాసారము-స. కొలఁకు. (వ్యు. జలముగలది, మో
కాసీసము-స. మయిలుతుత్తము.
కాసు-తె. 1.దుగ్గానిలో నాలవభాగము. 2.ధనము.
కాసె-తె. 1. ఱాయితొలుచుపని. 2. కాస. సమా.
కాసీఁడు-ఱాతిపనివాఁడు. కాసెయులి - ఱాతిని
తొలుచు ఉలి. [శిక.2.కోడి.3.సద్దు.
కాహళము-స.1.ఊఁదెడుకొమ్ము.రూ.కాహళి, కా
కాళంజి-వి.(కలాచి) తమ్మపడిగము. [త్స్వరము.
కాళయుక్తి-స. అఱువదింట ఏఁబదిరెండవసంవ

కాళి-స. 1.పార్వతి.2.బొగ్గు.రూ.కాళిక. [నది.
కాళింగము-స. 1.ఏనుఁగు.2.కళింగదేశమునఁబుట్టి
కాళింది-స. యమునానది. సమా. కాళిందీభేదనుఁడు- బలరాముఁడు.
కాళియ-వి.(కాహళి)ఊఁదెడుకొమ్ము. రూ.కాళె.

## కి

కి-తె. షష్ఠీవిభక్తియందు వచ్చు ప్రత్యయము.
కింక-తె. 1. కోపము. రూ. కినుక. 2. పశ్వాదులకు వచ్చు ఒకరోగము.
కింకరుఁడు-స. పరిచారకుఁడు. (వ్యు.ఏమిచేయుదునని యడుగువాఁడు, దేనినైననుచేయువాఁడు.)
కింకిణి-స. 1. గజ్జె. 2. చిఱుగంట. (వ్యు. కొద్దిగా శబ్దించునది) [కింకిరాటము.
కింకిరాతము-స. 1. కోయిల. 2. చిలుక. రూ.
కింకిరాతుఁడు-స.మన్మథుఁడు. రూ. కింకిరాటుఁడు.
కింకిరి-తె. 1. కోపము. 2. రోఁత.
కింగిరి-తె. అల్పము.
కించ-తె. వ్యాకులము.
కించిత్తు-స. ఇంచుక. (వి. కొంచెము)
కించు-తె. అల్పుఁడు. రూ. క్రించు.
కింజల్కము-స. అకరువు. [బ్రదుకువాఁడు.)
కింపచానుఁడు-స. లోభి. (వ్యు. ఇంచుకవంటచే
కింపాకుఁడు-స.మూఢుఁడు. [గల ఒకతెగ దేవత.
కింపురుషుఁడు-స. అశ్వశరీరమును నరముఖమును
కింవదంతి-స. వానుడి. [యముచేయువాఁడు.
కింవరాటకుఁడు-సం. ఆయమునకు మితిమీఱి వ్య
కింశుకము-స. మోదుగుచెట్టు.
కికకిక-తె. నవ్వుటయందగుధ్వని. రూ. కికాకిక.
కికురు } తె. వంచన. క్రి. కికురించు, కిక్కురించు. కృ. కికురింత, కిక్కురింత.
కిక్కురు }
కిక్కెస-తె. మిక్కిలి కదియిక.
కిగ్గాడి-తె. అంబేద.
కిచిడీ-హిం. చిత్రాన్నము,
కిటి-స. పంది. (వ్యు. ఇచ్చకొలఁది చరించునది.)
కిటికీ-హిం. గవాక్షము, దిడ్డి.
కిటుకు-తె. 1. కపటము. 2. మర్మము.

కిట్టు-తె. 1.సమీపించు.2.సరిపడు. 3. బిగించుటకై వేయుదారము సమా. కిట్టికోల-చేతివ్రేళ్లనునలఁపుటకై జంటగాఁగట్టినవెదురుకోల. [కాచెదుకాయ.
కిణము-స. కఠినవస్తుస్పర్శముచే హస్తాదులందు
కిత-తె. కళ్లమున దేవతార్పణముగా మొదటపోయు మూఁడు దోసిళ్లు.
కితవము-స. వంచనము.
కితవుఁడు-స. 1. జూదరి. 2. మోసగాఁడు.
కిత్తనార-హిం. చాఁగనార. [నారబట్ట.
కిత్తాను-హిం. 1.చాఁగ,కలబంద. 2. ఒకవిధమైన
కిత్తలి-తె. నారింజ. (వాడుకలో కిచ్చిలి)
కిత్తి-వి. (కృత్తి) అగ్ని.
కిదుకు-తె. బిడ్డలు నిద్రలేచునపుడాలస్యముచేఁగాని ఏదేనికావలసికాని మూలుగు.
కినియు-తె. 1. కోపించు. 2. సమీపించు. కృ. కినుక, కిన్క, కినుపు. [వీణ. (వి. కిన్నెర)
కిన్నర-స. మూఁడుసొరకాయలపై దండె అమర్చిన
కిన్నరుఁడు-స. అశ్వముఖమును నరశరీరమునుగల ఒకతెగ దేవత. సమా.కిన్నరేశుఁడు-కుబేరుఁడు.
కిన్నెర-చూ. కిన్నర.
కిముడు-తె. అల్పము.
కిమ్మీరము-స. చిత్రవర్ణము.
కియ్య-తె. (క్రింది+య) యావడి.
కిరణము-స. వెలుఁగు, మయూఖము. [త్రవ్వునది)
కిరము-స.పంది.రూ.కిరి.(వ్యు. ముఖముచే భూమిని
కిరాటుఁడు-స. కోమటి.
కిరాతుఁడు-స. 1. బోయ. 2. పొట్టివాఁడు.
కిరీటము-స. రాజుధరించు శిరోలంకారము.
కిరీటి-స. 1. అర్జునుఁడు. (వ్యు. ఇంద్రదత్తమైన కిరీటము కలవాఁడు) 2. కోడి.
కిరీటిపచ్చ-తె. మరకతము.
కిఱుకు-తె. త్రిప్పు. రూ. క్రిక్కు.
కిఱుఁజెప్పు-తె. నడచునపుడుకిఱ్ఱుమనిశబ్దించు కాలిజోడు. రూ.కిఱ్ఱుఁజెప్పు. (ఇట్లేకిఱ్ఱుమెట్టు మొ.)
కిఱుదు-తె. హీనము. రూ. క్రిందు.
కిరుదెస-తె. రొండిలోని వాతరోగము.
కిరుసు-తె. ఇరుప్రక్కలవాదరగలకత్తి.
కిలకొట్టు-తె. మ్రోఁగు.

కిలాతము-తె. గుజ్జము. [కీలారి-గొల్ల(డు)
కిలారము-తె.పసులమంద.రూ.కీలారము.(కిలారి,
కిలారించు-తె. కిలకిలమని శబ్దించు.
కిలాసము-స. సిబ్బెము.
కిలికించితము-స. రోషాశ్రుహర్షభీత్యాదుల సంకర రూపమగు స్త్రీయొక్క శృంగారచేష్ట. రూ. కిలకించితము.
కిల్బిషము-స. 1.పాపము.2.తప్పు.3.చెడువిషము.
కిల్లాకు-తె. చీటి.
కివ్వు-తె. మడియు.
కిశోరము-స. 1. బిడ్డ. 2. గుఱ్ఱపుపిల్ల. [వాఁడు.
కిశోరుఁడు-స.1.సూర్యుఁడు. 2. యౌవనావస్థ కల
కిష్కువు-స. 1. జేన. 2. మూర. 3. ముంజేయి.
కిసమస-తె. వెత. [దోషము. 2. కోపవికారము.
కిసరు-తె. 1. అంటుసోఁకుటచే బిడ్డలకుఁగలుగు
కిసలము-స. చిగురు. రూ. కిసలయము.
కిస్తీ-హిం. వంతుచొప్పున చెల్లించు సర్కారుసిస్తు.

## కీ

కీఁచు-తె. హీనస్వరము. సమా. —బిల్లి- అదిమినపుడు కీఁచుమను తలగడ.
కీకటము-స. గుఱ్ఱము.
కీకటుఁడు-స. 1. పిసినిగొట్టు. 2. పేద.
కీకసము-స. 1. ఎముక. 2. నులిపురుగు.
కీచకము-స. గాలితాఁకునమ్రోఁగెడి వెదురు.
కీటకము-స. పురుగు. రూ. కీటము.
కీటమణి-స. మిడుఁగుఱుఁబురుగు. [పొడవు.
కీటు-తె. గోడపెట్టునపుడు ఒక తడవ పెట్టెడుమట్టి
కీడు-తె. 1. అశుభము. 2. తప్పు. 3. దోషము. 4. పాపము. 5. అపకారము. 6. అధమము. క్రి. కీడుపడు-తక్కువపడు. రూ. కీడ్పడు. కృ. కీడుపాటు, కీడ్పాటు.
కీత-తె. తక్కువ, నికృష్టము.
కీదృశము-స. ఎటువంటిది.
కీనాశుఁడు-స. 1. యముఁడు. 2. రాక్షసుఁడు. 3. పిసినిగొట్టు. 4. పేద. [హించునది.)
కీరము-స. చిలుక. (వ్యు. కీయను శబ్దమును గ్ర
కీరితి-వి. (కీర్తి) యశము, పేరు.
కీర్ణము-స. 1. కప్పఁబడినది. 2. చెదరినది.
కీర్తనము-స. స్తుతి. క్రి. కీర్తించు.
కీర్తనీయము-స. పొగడఁదగినది. [అడుసు.
కీర్తి-స. 1. యశము. 2. విరివి. 3. తేట. 4.
కీలక-స.అఱువదింటనలువది రెండవసంవత్సరము.
కీలకము-తె. మర్మము, కిటుకు. సమా. కీలరి-కీలెఱిఁగినవాఁడు. స. పసులఁగట్టుగూటము.[ము
కీల-స.1.మేకు.2.మంట.3.మోఁచేయి. రూ. కీల
కీలారము-చూ. కిలారము.
కీలాలము-స. 1. నెత్తురు. 2. నీళ్లు.
కీలి-స. అగ్ని.
కీలించు-స. తగిలించు.
కీలితము-స. కట్టఁబడినది.
కీలు-తె. 1. మఱ. 2. కట్టెలకుఁబూసెడి నల్లని చమురు. 3. మర్మము. 4. ఉపాయము. సమా. —కాఁడు-సూత్రధారి. —గంటు-జాఱుగా ముడిచినకొప్పు. —బొమ్మ-ఎట్లాడించిన నట్లాడువాఁడు, బొమ్మ.
కీలుకొను-తె. 1.తగులు. 2.నాటు. రూ. కీలుపడు.
కీశము-స. కోఁతి.
కీస-తె. కొంచెము, అల్పము. [అల్పము.
కీసర-తె. 1. తిత్తిలోనగువాని లోపలిపొర. 2.

## కు

కు-తె. షష్ఠీవిభక్తియందు వచ్చు ప్రత్యయము.
స. 1. భూమి. (దీనికి వ్యస్తముగా ప్రయోగము లేదు) సమా. కువలయము-1.భూమి.2.కలువ. కుతలము-భూమి. కుధరము-కొండ. కుభృత్తు-1. రాజు. 2. కొండ. కుత్సితశబ్దమునకు సమాసమందువచ్చు ఆదేశము: కుజనుఁడు,కుతర్కము మొ.
కుంక-తె. బాలవిధవ, రండ.
కుంకటి-తె. 1. జుట్టు.2. పిల్లజుట్టు.3.ప్రధానము. రూ. కూఁకటి. సమా. —వేరు- మొదటివేరు.
కుంకుడు-తె. 1. ఫేనిలవృక్షము. 2. ప్రధానము రూ. కూఁకుడు.
కుంకుమము-స. 1. కుంకుమపువ్వు, అగ్నిశిఖము. 2. నుదుటఁబెట్టుకొను రాగద్రవ్యము.

కుంకుమ-వి. (కుంకుమము) నుదుట ధరించు ఎఱ్ఱని చూర్ణము. సమా.—పూవు-ఒక సుగంధద్రవ్యము.
కుంచము-వి. (కుంచి) నాలుగు ముంతల పరిమాణము.
కుంచిక-స. కుంచము.
కుంచిక-స. 1. లోగడియ తీసెడు వంకర ఇనుపకమ్మి, కుంచెకోల. 2. చిత్రములు వ్రాయు తూలిక.
కుంచియ-స. వంకరైనది.
వి. (కుంచిక) 1. కుచ్చు. 2. చిత్రములు వ్రాయు తూలిక. 3. చామరము. 4. కుచ్చెంబు డీసవస్త్రము. రూ. కుంచె, కుచ్చె. సమా. కుంచెకోల- కుంచిక.
కుంచు-తె. క్రుంగఁజేయు, కుదించు.
కుంజము-స. 1. పొదరిల్లు. 2. ఏనుఁగు కటుమరలు. 3. ఏనుఁగు కొమ్ము.
కుంజరము-స. 1. ఏనుఁగు. (వ్యు. కుంజములు కలది) 2. పెంట్రుక.
కుంట-వి. (కుండము) 1. కొలను. 2. పల్లము. 3. ఎకరాలో పదునైదవభాగము. రూ. గుంట.
కుంటి-తె. 1. కాలువిఱిగినవాఁడు, ఖంజుఁడు. 2. పుట్టుకతో కాలు చెడినవాఁడు, పంగువు. సమా. —గాము- శనిగ్రహము.
కుంటు-తె. నేల చక్కఁగా కాలుమోపక నడచు.
కుంటుపడు-తె. 1. కుంటు. 2. చెడు. 3. తగ్గు.
కుంటుపిచ్చుక-తె. కాలులేనివాఁడు. రూ. పిచ్చుక కుంటు.
కుంటెన-వి. (కుట్టనిక) తార్చువాఁడు. రూ. కుంటెనకాఁడు, కుంటెనీఁడు. స్త్రీ. కుంటెనకత్తె.
కుంఠితము-స. మొక్కవోయినది.
కుండ-తె. 1. ఇరుసు తగిలించు బండికంటి నడిమి గుబ్బ. 2. ఏనుఁగు కుంభస్థలము. వి. 3. (కుండము) మట్టిపాత్ర. సమా. —గోఁకరి- 1. వంటలవాఁడు. 2. పాత్రలు తోమువాఁడు. —మార్పు- చెలియలినిచ్చి బావచెలియలిని పెండ్లాడు. కృ. కుండమార్పు.
కుండము-స. 1. కుండ. 2. గుడిలోని గుంట. 3. నిప్పుగుంట. 4. కొండ.
కుండలము-స. 1. బ. పోఁగులు. 2. గుండ్రన.
కుండలి-స. 1. మండలాకార నృత్యము, గొండ్లి. 2. పాము. 3. నెమలి. 4. పోఁగులుగలవాఁడు.
కుండలించు-స. 1. సున్నచుట్టు. 2. పదమునకుఁగాని, వాక్యమునకుఁగాని యిరుప్రక్కల వంపుగీఁతలు వేయు, బ్రాకెట్టు.
కుండలీకరణము-స. కుండలించుట.
కుండి-స. కమండలువు. రూ. కుండిక.
కుండుఁడు-స. మగఁడుండఁగా ఱంకుమగనికిఁ బుట్టిన కొడుకు.
కుంతము-స. ఈఁటె.
కుంతలము-స. 1. వెంట్రుక. 2. ఒక దేశము.
కుందకము-తె. 1. అభ్యంతరము. 2. లోపము.
కుందనము-తె. అపరంజి.
కుందము-స. 1. మొల్ల. 2. ఒకనిధి.
కుంది-తె. ఱాయిలో నగువానిచే చేయఁబడిన కుదురు. రూ. కుందియన, కుందెన.
కుందు-తె. 1. క్రుంగు. 2. తగ్గు. 3. దుఃఖించు. 4. ఒంటికాలితో నడచు. కృ. 5. దుఃఖము. 6. తక్కువ.
కుందుఁడు-స. విష్ణువు.
కుందెన-తె. 1. చూ. కుంది. 2. ఱోటిగుంట.
కుందెలు-తె. చెవులపోతు, శశము. రూ. కుందేలు. సమా. కుందేటికొమ్ము- 1. ఒక తెగగడ్డ. 2. శూన్యము. [హసంతి.
కుంపటి-తె. (కుమ్ము + పడిగము) నిప్పుంచు పాత్ర,
కుంపె-తె. తాంబూలపాత్రము. రూ. కంపె.
కుంపెరుగు-తె. (కుండ + పెరుగు) అడుగు పెరుగు, ద్రప్పము.
కుంభకము-స. ఊపిరి బిగఁబట్టుట. క్రి. కుంభించు.
కుంభము-స. 1. కుండ. 2. ఏనుఁగు నెత్తిమీఁది గుబ్బ. 3. పదునొకండవ రాశి. సమా. కుంభకారుఁడు- కుమ్మరి. —సంభవుఁడు- 1. అగస్త్యుఁడు. 2. ద్రోణుఁడు. కుంభాభిషేకము- క్రొత్తగా గుడి కట్టించి ప్రతిష్ఠించిన విగ్రహమునకు కుంభమందుదకము నించి మంత్రపూతమైన యాయుదకముచే చేయించు స్నానము.
కుంభి-స. (కుంభము + ఇ) 1. కుమ్మరి. 2. ఏనుఁగు.
కుంభిని-స. భూమి.
కుంభీనసము-స. విషజ్వాలలు గ్రక్కు పాము.

కుంభీరము-స. మొసలి. (వ్యు. ఏనుఁగునులాగునది)
కుకుందరము-స. పిఱ్ఱుఁదుమీఁదిగుంట.
కుకూలము-స. *1.* వసినాటినగుంట. *2.* కుమ్ము.
కుక్క-వి. (కుర్కురము) *1.* శునకము. *2.* అల్పము, నీచము. సమా.—గొడుగు- పుట్టగొడుగు.—తొళసి- ఒకతెగతులసి. —మూతిపిందె- కాపుడుగునపుడు పుట్టెడువికారపుపిందె.
కుక్కి-తె. (క్రుక్క+ఇ) *1.* పల్లము. *2.* లోఁతు. సమా.—మంచము- త్రాళ్లసడలి పల్లముపడిన మంచము. [*4.* మిడుఁగుఱులు.
కుక్కుటము-స. *1.* కోడి. *2.* కపటము. *3.* కుక్క.
కుక్కురము-స. కుక్క. రూ. కుర్కురము. (వ్యు. ఎముకలుమున్నగువానిని దెచ్చుకొనునది.)
కుక్షి-స. కడుపు. సమా. కుక్షింభరి- తనపొట్టను నిండించుకొనువాఁడు, ఉదరంభరి.
కుచము-స. స్తనము. [బొంత.
కుచ్చులిగంత,—బొంత-తె. సన్యాసులు ధరించు
కుచ్చు-వి. (గుచ్ఛము) *1.* పట్టులోనగువానికుచ్చు. *2.* ఏదేనిచేర్చికట్టినది. సమా. కుచ్చులమెకము- జడలబర్రె, చమరీమృగము.
కుచ్చె-వి. వస్త్రపుమడత. చూ. కుంచె.
కుచ్చెల-తె. *1.* ఎనిమిదిగొఱ్ఱులకొలఁది. *2.* కంకులతోడిజొన్నచొప్ప మున్నగువానిప్రోవు.
కుజము-స. చెట్టు. [(వ్యు. భూమికొడుకు.)
కుజుఁడు-స. *1.* అంగారకుఁడు. *2.* నరకాసురుఁడు.
కుటజము-స. కొండమల్లె.
కుటి-స. *1.* బుడిపి. *2.* గుడిసె. (రూ. కుటిక.) *3.* నీళ్లమోయుపనికత్తె.
కుటిలము-స. వంకరైనది.
కుటీరము-స. గుడిసె. (వ్యు. వక్రమగునది.)
కుటుంబము-స. భార్యబిడ్డలులోనగువారు. (పుం. కుటుంబి. స్త్రీ. కుటుంబిని)
కుట్టనము-స. ఛేదించుట.
కుట్టని-స. కుంటెనకత్తె. రూ. కుట్టనిక.
కుట్టమితము-స. పైకి కోపభావ మభినయించినను లోనానందముచెందు స్త్రీలశృంగారచేష్ట.
ట్టిమము-స. త్రాళ్లపఱచిననేల, నేలకట్టు.
ట్టియ-తె. గుదస్థానము. రూ. కుట్టె.

కుట్టు-తె. *1.* ఆకులుకుట్టు. *2.* గుడ్డలుకుట్టు. *3.* పొడుచు. కృ. *4.* కుట్టుట. *5.* పొయిలోనిండిన బూడిద. *6.* కొంచెపు కడుపునొప్పి. సమా.
—కాఁడ
—పోఁగు } చెవులుకుట్టెడు కమ్మి.
కుట్టుసుఱు-తె. (కుఱుచ+ఉసుఱు) కొనప్రాణము.
కుట్మలము-స. *1.* సగమువిరిసినమొగ్గ. *2.* ఒక నరకము.
కుట్ర-తె. కుత్సితపు ఆలోచన.
కుట్రవాఁడు-తె. గుడ్డలుకుట్టువాఁడు. [నది)
కుఠారము-స. గొడ్డలి. (వ్యు. వృక్షములనుబొందు
కుడపము-స. మానిక. రూ. కుటపము.
కుడి-తె. *1.* కుడుచుట, కుడుపు. *2.* అపసవ్యము. (కుడికన్ను,—కాలు, —చేయి,—ప్రక్క, మొ.) *3.* త్రాగుడు. (కుడినీరు-త్రాగఁదగిన జలము)
కుడితి-తె. బియ్యములోనగువాని కడుగునీరు, తండులీణము.
కుడిపి-వి. (కురూపి) వికృతరూపుఁడు.
కుడిమివాఁడు-తె. *1.* పాములఁబట్టుఒకతెగవాఁడు. *2.* విషవైద్యుఁడు.
కుడుంగము-స. పొదరిల్లు.
కుడుక-తె. తక్కెడతట్ట. [కృ. కుడుపు, కుడి.
కుడుచు-తె. *1.* అనుభవించు. *2.* త్రాగు. *3.* తిను.
కుడుపు-తె. *1.* కుడువఁజేయు. కృ. *2.* అనుభవము. *3.* భోజనము.
కుడుము-తె. మోదకము.
కుడ్యము-స. *1.* గోడ. *2.* పూఁత.
కుణకము-స. పిల్ల.
కుణపము-స. *1.* పీనుఁగు. *2.* దుర్గంధము.
కుతపము-స. *1.* దినమునందెనిమిదవ భాగము. *2.* వాద్యము.
కుతపుఁడు-స. *1.* తోడఁబుట్టినదానికొడుకు. *2.* సూర్యుఁడు. (వ్యు. భూమినితపింపఁజేయువాఁడు)
కుతిక-తె. గొంతు. రూ. కుతుక, కుత్తిక, కుత్తుక.
కుతినీ-హిం. ఒకదినుసుపట్టు. (పట్టును దూదియు కలిసినది)
కుతిల-తె. బాధ. క్రి. కుతిలపడు. కృ. కుతిలపాటు.

కుతుకము-స. అనుభవింపని కోరికయందలియాస. తమి.

కుతూహలము-స. 1. కుతుకము. 2. నాయికకు మనోజ్ఞమైన వస్తువును చూచుటయందుఁగల లోలత్వము.

కుత్కీలము-స. కొండ.

కుత్స-స. నింద. రూ. కుత్సనము. క్రి. కుత్సించు- 1. రోఁతపడు. 2. దూఱు.

కుత్సితము-స. నికృష్టము. [యెట్టుకంబళి.

కుథము-స. 1. దర్భ. 2. ఏనుఁగుపైఁబఱచెడి

కుదప-తె. రొంపిదుక్కి.

కుదరము-స. గుఱ్ఱము.

కుదికిలు-తె. మొగముపైకెత్తుకొని ముడ్డినేలమోవ గొంతుకూర్చుండు. రూ కుదికిలఁబడు.

కుదియు-తె. 1. అడఁగు. 2. క్రుంగు. 3. మరలు. 4. తగ్గు. ప్రే. కుదించు, కుదుచు, కుదుపు.

కుదిర-వి. (కుదరము) గుఱ్ఱము.

కుదిరిక-తె. 1. నిలుకడ. 2. అమరిక. 3. నెమ్మది.

కుదిలిక-తె. కుదులుట.

కుదుకనగోల్లు-తె. వంచన.

కుదుప-తె. 1. దుర్మాంసపిండము. 2. వంచన.

కుదుపు-తె. 1. కుదియఁజేయు. 2. పంగువు.

కుదురు-తె. 1. అనుకూలమగు. 2. స్థిరమగు. 3. స్వస్థమగు. కృ. 4. అమరిక. 5. అగసాలెవాని కుంపటి. 6. నిలుకడ. 7. నెమ్మది. 8. పాదు.

కుదులు-తె. కదలు, చలించు.

కుదువ-తె. తాకట్టు.

కుద్దాలము-స. 1. త్రవ్వు సాధనము, గుద్దలి.

కుధరము-స. కొండ. చూ. కు.

కునుకు-తె. తూఁగు. రూ. కునికిపడు. కృ. కునికిపాటు.

కున్న-తె. బిడ్డ. రూ. కూన.

కున్నఁడు-తె. బాలుఁడు.

కుపసము-వి. (కూర్పాసము) 1. అరచట్టి. 2. నిడుచట్టి. 3. ఱవిక. 4. పాముపొర. రూ. కుప్పసము, కుబుసము, కూసము.

కుపితుఁడు-స. కోపించినవాఁడు.

కుప్ప-తె. రాశి.

కుప్పఁగూర-తె. కుప్పవడుట. రూ. కుప్పనగూర.

కుప్పతిలు-తె. కుప్పవడు.

కుప్పము-తె. 1. గ్రామము. 2. చెంబడివారిపల్లె.

కుప్పసము-చూ. కుపసము. [చుకొని యెగురు.

కుప్పించు-తె. రెండుకాళ్లుసమముగా నొకచో నుం

కుప్పిగంతులు-తె. బాలురపల్లటీలు.

కుప్పె-వి. (కూపి) 1. మెడనిడుపుగాఁగల గాజుపాత్ర. 2. గొడుగుమీఁది గుబ్బ. 3. ఎద్దుకొమ్మునకుఁ దగిలించు గుబ్బ. 4. జడనగ. 5. గిన్నెమూఁత. సమా. కుప్పెకోల—ఒకతెగబాణము.

కుప్పెంటి-తె. (కుప్ప + పెంట) దిబ్బలలో మొలచు ఒక మొక్క, హరితమంజరి.

కుప్యత్-స. కోపమునొందిన.

కుప్యము-స. వెండిబంగారుతక్కఁదక్కినలోహము.

కుబుసము-తె. తలుపునకు క్రిందుమీఁదుల నుంచు కూచము. వి. కుప్పసము.

కుబేరుఁడు-స. ఉత్తరదిక్పాలకుఁడు, ధనదుఁడు. పిల్ల. 3. చిలుక. సమా. కుబేరాక్షము-గచ్చకాయ.

కుబ్జ-స. మఱుగుజ్జు.

కుమారము-స. 1. చొక్కపుబంగారు. 2. గుఱ్ఱపు

కుమారి-స. 1. కూఁతురు. 2. పెండ్లికానిపడుచు. 3. పార్వతి.

కుమారిలు-తె. కుములు. [దుఁడు. 4. మన్మథుఁడు.

కుమారుఁడు-స. 1. కొడుకు. 2. బాలుఁడు. 3. స్కం

కుమి-తె. ధాన్యముంచుగరిసె. రూ. కుమ్మి.

కుముటు-తె. 1. ఓకరకై కంఠబిలమున వికారమెత్తు, ఓఁకరించు. 2. ఓకరకై కంఠమునఁనెత్తు వికారము, ఓకిలింత.

కుముదము-స. 1. ఎఱ్ఱతామర. 2. తెల్లకలువ. (వ్యు. భూమియందు మోదించునది.) 3. నిరృతిదిక్కునందలి యేనుఁగు. (దీని భార్య అనుపమ) సమా. కుముదబాంధవుఁడు- చంద్రుఁడు, కలువవిందు.

కుముదిని-స. తెల్లకలువతీఁగ.

కుముద్వతి-స. 1. తెల్లకలువతీఁగ. 2. కుశునిభార్య.

కుములు-తె. లోలోన తపించు.

కుమ్మర-వి. (కుంభకార) కుండలుచేసిజీవించుజాతి. సమా. కుమ్మరి-కుంభకారుఁడు. కుమ్మరపురుగు-అడుసునఁదిరుగుచుండియు ఒడలికడుసంటుకొ

నని పురుగు, యమకీటము. —సారెచుక్క-
విశాఖ. [రాలు. ప్రే. కుమ్మరించు.
కుమ్మరిలు-తె. 1. కుండనుండి నీళ్లుచిందు. 2.
కుమ్మి-చూ. కుమి.
కుమ్ము-తె. 1. నలియఁగొట్టు. 2.పొడుచు. రూ.
క్రుమ్ము. 3. కృ. పోటు. 4. పొట్టునిప్పు.
సమా. —సుద్ది- సంకేతవృత్తాంతము.
కుమ్మె-తె. పోటు. క్రి. కుమ్మెలువోవు-గాయమగు.
కుయి-తె. 1. మొఱ. 2. రక్షణము. రూ. కుయ్యి,
కూయి.
కురంగమము-స. జింక. రూ. కురంగము.
కురంగము-స. 1. జింక. 2. కోఁతి. (వ్యు.భూమి
యందు చరించునది.) [3. పచ్చచేమంతి.
కురంటకము-స. 1. తుమ్మిచెట్టు.2.పచ్చగోరంట.
కురండము-స. అండవృద్ధి, బుడ్డ.
కుఱఁగలి-తె. సమీపము.
కుఱుకుఱు-తె. అల్పము. [గొఱపము.)
కురపము-స. గుఱ్ఱమునుతోమెడు సాధనము. (వి.
కురము-తె. పశువులకుఁ గలుగు ఒక రోగము.
కురరము-స. లకుముకిపిట్ట.
కురరి-స. 1. గొఱ్ఱె. 2. ఆఁడులకుముకిపిట్ట.
కురవకము-స. 1. ఎఱ్ఱగోరంట. 2. ఎఱ్ఱచేమంతి.
కురాళము-తె. చప్పరము. [కుర్చీ.
కురిచీ-హిం. కూర్చుండునట్టి ఉన్నతపీఠము. రూ.
కురిడి-తె. లోపల నీరింకిన కొబ్బెర.
కురిమిడి-తె. గనిమ.
కురియు-తె. 1. వర్షించు. 2. కురియించు.
కురుంబము-స. సమూహము.
కుఱు-తె. సమానసమందు కుఱుచశబ్దమున కడపటి
యక్కరము లోపింపఁగా మిగిలినరూపము-
కుఱుగద్దియ, కుఱుమావు మొ.
కుఱుకు-తె. ప్రోవు, రాశి.
కుఱుచ-తె. నిడుపులేనిది.
కురుఁజు-తె. 1. దూలముమీఁదనుంచు నిలువుకట్టి.
రూ. గుజ్జు. 2. మంచె.
కురుజీ-హిం. గంత.
కురుజు-తె. 1. జున్ను. రూ. గుజ్జు. 2. ఒక
తెగదేగ. 3. ఈఁకలురాల్చిన పక్షి.
కురుప-తె. గొఱ్ఱెబొచ్చుతో కంబళ్లు నేయు ఒకజాతి.
రూ.కురుమ.సమా. —గొఱ్ఱె-ఒదలియందెక్కు-
వబొచ్చు పెరుఁగు ఒకతెగ గొఱ్ఱె.
కుఱుమట్టము-తె. (కుఱుచ+మట్టము) వినమ్రము.
కుఱుమాడు-తె.ఇంటిమూలకప్పు. [వెంట్రుకలు.
కురులు-వి. (కురుళము) 1.ముంగురులు. 2.తల
కురువ-తె. కొండమీఁది కాలిత్రోవ.
కురువిందము-స. 1.పసుపుదాళగలిగిననడిమిజాతి
కెంపు. 2. ఇంగిలీకము. 3. అద్దము.
కుఱువు-తె. తొడ.
కురువేరు-తె. (కురులు+వేరు) హ్రీబేరము.(వట్టి
వేరువంటి సువాసనగల వేరు)
కురుళము-స. ముంగురులు.
కురుక్కరము-స. కుక్క. రూ. కుక్కురము.
కుర్పరము-స. మోఁచేయి. రూ. కూర్పరము.
కుఱ్ఱ-తె. 1. కొడుకు. 2. బాలుఁడు. 3. బిడ్డ. రూ.
కుఱ్ఱఁడు.) 4. కోడె యెనుఁబోతు.
కుఱ్ఱి-తె. పాడియావు.
కుఱ్ఱు-తె. కూయు.
కుర్వాణుఁడు-స. 1. పనివాఁడు. 2. చేయువాఁడు.
కులకము-స. 1.ఒకక్రియతో ముగిసెడు పద్యముల
సమూహము. 2. పుట్ట.
కులట-స. ఱంకుటాలు.
కులము-స. 1. వంశము. 2. తెగ. 3. ఇల్లు. 4.
ఊరు. 5. శరీరము. సమా. కులపర్వతము-ప్ర
ధాన పర్వతము. (ఇవి యేడు: మహేంద్రము,
మలయము, శుక్తిమంతము, సహ్యము, గంధ
మాదనము, వింధ్యము, పారియాత్రము.)—పా
లిక- తల్లిదండ్రులచే నిచ్చి పెండ్లిచేయఁబడిన
స్త్రీ, కులస్త్రీ.
కులాయము-స. 1. పక్షిగూఁడు. 2. చోటు.
కులాలుఁడు-స. కుమ్మరి.
కులిశము-స. వజ్రాయుధము. (వ్యు.కొండలఱెక్క-
లు ఛేదించి అల్పముగాఁ జేయునది.)
కులీనుఁడు-స. మంచివంశమున పుట్టినవాఁడు. రూ.
కులజుఁడు, కులికుఁడు.
కులుకము-స. నాలుకమీఁది బంపు. జిహ్వామలము.
కులుకు-తె. 1. శృంగారముగ చలించు. 2.పూయు.

3. పోయు. 4. పెదచల్లు. 5. వేయు. 6. కుదిలించు. కృ. 7. శృంగారపు కుదిలిక. 8. వణఁకుట. సమా. కులుకులాఁడు-కులుకులుగలవాఁడు. కులుకులాఁడి- కులుకులుగల స్త్రీ.
కులుప-తె. శోష, వాఁపు.
కుల్య-స. 1. కాలువ. 2. నీళ్లుపోవుక్రోవి.
కువ-తె. రాశి, కుప్ప. రూ. కువ్వ.
కువలము-స. 1. కలువ. 2. ముత్యము. 3. రేఁగుఁబండు.
కువలయము-స. 1. కలువ. (వ్యు. కుత్సితమైన పత్త్రివలయములుకలది) 2. భూమి. చూ. కు.
కువాదము-తె. కపటము. రూ. కువ్వాదము, కువాళము.
కువాళము-తె. 1. కపటము. 2. వాహనము మున్నగువాని గవుసెన.
కువిందుఁడు-స. సాలెవాఁడు.
కువేణి-స. చేఁపలబుట్ట.
కువేలము-స. కలువ.
కుశ-స. త్రాడు. [ఒక ద్వీపము.
కుశము-స. 1. నీరు. 2. దర్భ. 3. పలుపు. 4.
కుశలము-స. 1. క్షేమము. 2. తృప్తి. 3. పుణ్యము.
కుశలుఁడు-స. నేర్పరి.
కుశాలు-హిం. సంతోషము, ఉల్లాసము.
కుశీలవుఁడు-స 1 నానాదేశసంచారకుఁడగు నట్టువుఁడు. 2. నానాదేశసంచారకుఁడగు బట్టువాఁడు. 3. వాల్మీకి.
కుశేశయము-స. తామర. (వ్యు. నీళ్లయందుండునది.)
కుష్ఠము-స. 1. పెద్దరోగము, పులుము. 2. చెంగల్వకోష్ఠు. [చివర.
కుసి-తె. రంధ్రమునఁజొప్పించుటకు చెక్కిన కట్టి
కుసిగుంపులు-తె. శ్రమము.
కుసిలించు-తె. అతృప్తిచే దుఃఖించు. రూ. కుసులు. కృ. కుసిలింత. [Kitchen)
కుసిని. (ఫ్రెంచి. Cuisine) వంటయిల్లు. (ఆం.
కుసీదము-స. వడ్డికిచ్చి జీవించుట.
కుసుంభము-స. 1. కుంకుమపువ్వు. 2. బంగారు. 3. కమండలువు. సమా. కుసుంభరాగము-బయటికగపడి లోపల బొత్తిగాలేని ప్రేమ.
కుసుమ-తె. 1. ఒకానొకచెట్టు. 2. ఒకతెగవడ్లు. 3. పుండునందలిమొలక. వి. 4. (కుసుంభము) కుసుంభవర్ణము. రూ. కుసుమము.
కుసుమము-తె. కుసుమధాన్యము. వి. కుసుమవన్నె.
స. 1. పూవు. 2. కంటిరెప్పులు. 3. స్త్రీరజస్సు. 4. పండు. సమా. కుసుమేషువు- మన్మథుఁడు, పుష్పబాణుఁడు.
కుసులు-తె. కుసిలించు.
కుసూలము-స. ధాన్యముపోయుగరిసె.
కుస్తరించు-తె. 1. ఊఁటడించు. 2. సమాధానపఱచు. 3. సవరించు. 4. చఱచు. [(వి. కొత్తిమిరి)
కుస్తుంబరి-స. ధాన్యకము. రూ. కుస్తుంబురువు.
కుహకము-స. వంచన.
కుహన-స. అర్థాపేక్షచే నగు కపటచర్య.
కుహరము-స. 1. గుహ. 2. బెజ్జము.
కుహాళ-స. కాకి. రూ. కుహూళ. [2. కోకిలధ్వని.
కుహూవు-స. 1. చంద్రకళకానరాని అమావాస్య.
కుళాయి-హిం. టోపీ. రూ. కులాయి, కుల్లాయి, కుళాయ, కుళ్ళాయ, కుళ్ళాయి, కుల్లా, కుళ్ళా.
కుళింగము-స. అడవిపిచ్చుక.
కుళీరము-స. ఎండ్రకాయ. (వ్యు. భూమియందడఁగియుండునది.)
కుళత్థము-స. ఉలవలు.
కుళపు-తె. ఉంగరపుఱాయి.
కుళ్లు-తె. 1. చెడు. 2. లోలో నసూయపడు. రూ. క్రుళ్లు. సమా. —పోతు- క్రుళ్లుచుండువాఁడు. రూ. క్రుళ్లుపోతు.

## కూ

కూ-తె. అఱపు. క్రి. కూఁకరించు.
కూఁక-తె. కూఁత.
కూఁకటి-చూ. కుంకటి.
కూఁత-తె. 1. కూయుట. 2. అఱపు. సమా. —కైదువు-శంఖము. —నేల-క్రోసు. (—పట్టు, —వేటు అనియు)
కూఁతురు-తె. పుత్త్రిక.
కూకీ-తె. పావురము.
కూకు-తె. పాలవిఱుగుడు, ఆమిక్ష.

కూకుదుఁడు-స. వరుని సత్కరించి యలంకృతురాలగు కూఁతునిచ్చువాఁడు. [కూసము.
కూచము-తె. 1. గూటము. 2. స్తంభము. రూ.
కూచి-తె. 1. ప్రయాణభేరివాయించుట. 2. వాఁడి.
కూజా-హిం. మూతి సన్నమగు పాత్రము.
కూటమి-తె. 1. కూడిక. 2. సురతము.
కూటము-తె. 1. కొలువుకూటము. 2. చావడి. రూ. కూటాము.
· స. 1. కపటము. 2. బొంకు. 3. కొండకొమ్ము. 4. ప్రోగు. 5. కట్టు. 6. ఇల్లు. సమా. కూటస్థము- ఎల్లకాల మొక్కరూపుననుండునది. —సాక్ష్యము-తప్పుసాక్ష్యము. కూటాగారము- మేడమీఁది యిల్లు.
కూటువ-తె. 1. గుంపు. 2. ప్రోవు. రూ. కూటువు. సమా. —మూఁక- ప్రోత్సాహపఱచి అక్కడక్కడ వెదకిచేర్చిన పిఱికి బలము.
కూడ-తె. (కూడు+అ) తోడ.
కూడముట్టు-తె. తఱుము.
కూడలి-తె. రెంటిమూఁటికూడిక. సమా. —బాయి-ఎల్లబాయి. —వాయి- రెండుపంచలు చేరుమూల నేర్పఱచిన నీటిదారి.
కూడిక-తె. చేరిక.
కూడు-తె. 1. తగు. 2. చేరు. 3. పొందు. (ప్రే. కూర్చు.) 4. అన్నము. సమా. కూటినీళ్లు. అన్నముతోఁ జేర్చియుంచిననీళ్లు, పుల్లనీళ్లు. —ముత్తెము-చేఁతముత్తెము.
కూడుదల-తె. 1. లాభము. 2. చేరుట.
కూన-చూ. కున్న. సమా. —గుంత - మీటమొదలానెడుగుంట. రూ. కూలగుంత.
కూపము-స. 1. నూయి. 2. చెలమ. 3. పిఱుఁదిమీఁది గుంట. 4. ఓడకంబము. రూ. కూపకము.
కూపారము-స. సముద్రము. రూ. అకూపారము.
కూపి-స. 1. కుప్పె. 2. గాజుకుప్పె.
కూబరము-స. 1. బండినొగ. 2. మనోజ్ఞము.
కూయి-చూ. కుయ్యి. క్రి. కూపెట్టు. [య్యి, కూయి.
కూయు-తె. 1. అఱచు. 2. మొఱవెట్టు. కృ. కు
కూర-తె. 1. వ్యంజనము. 2. కూరగాయ.
కూరట-తె. పొరలుట.
కూరము-స. అన్నము.
కూరాడు-తె. కాఁచినకలి.
కూరిచి-తె. (కూరుచు+ఇ) ఉద్దేశార్థమందు ద్వితీయావిభక్తితోచేరివచ్చుప్రత్యయము. రూ. కూర్చి.
కూరిమి-తె. స్నేహము. రూ. కూర్మి.
కూరు-తె. 1. కలుగు. 2. దూసిపోవు. 3. చొప్పించు. 4. పొందు. 5. వాఁడి.
కూరుకు-తె. 1. నిద్రించు. 2. కృ. నిద్ర.
కూరుకొను-తె. 1. చొచ్చు. 2. చొప్పించు.
కూరుచు-తె. 1. కూడఁబెట్టు. 2. ప్రియపడు. 3. కుట్టు. కృ. కూరుపు.
కూరుచుండు-తె. (కూరిచి+ఉండు) ఆసీనుఁడగు.
కూరుపు-తె. 1. ఘటన. 2. కుట్టుట. సమా. కూరుపరి-కూర్చువాఁడు.
కూర్చిక-స. 1. కుంచెకోల. 2. చిత్రముర్రాయు తూలిక. (వి. కుంచె) 3. జున్ను. 4. మొగ్గ. 5. సూది.
కూర్పరము-స. 1. మోఁచేయి. 2. మోఁకాలు.
కూర్పాసము-స. 1. అఱచట్ట. 2. అవిక.
కూలంకష-స. ఏఱు. (వ్యు. గట్టులనొఱయునది.)
కూలంకషము-స. సముద్రము.
కూలగుంత-తె. కూనగుంత. [వాని దిబ్బ.
కూలము-స. 1. దరి. 2. గుంట. 3. మట్టిలోనగు
కూలి-తె. 1. పనిచేసినందులకిచ్చు ధనాదికము. 2. పన్ను. [కూల్చు.
కూలు-తె. 1. పడు. 2. చచ్చు. ప్రే. కూలుచు,
కూష్మాండము-స. గుమ్మడి.
కూసము-తె. 1. రూ. కూచము. 2. రూ. కుప్పసము.
కూళ-వి. (క్రూరుఁడు) 1. దుష్టుఁడు. 2. కుత్సితుఁడు. 3. మూఢుఁడు. రూ. కూళుఁడు.

## కృ

కృకము-స. కంఠనాళము, బొండుగు.
కృకలాసము-స. ఊసరవెల్లి. 2. తొండ. (వ్యు. కంఠముతో నాడునది)
కృకవాకువు-స. 1. కోడి. 2. నెమలి. (వ్యు. తలయెత్తి కూయునది.) 3. మైలచాయతొండ.
కృకాటిక-స. పెడతల.

కృచ్ఛ్రము-స. 1. పాపము. 2. బాధ. 3. దోషపరిహారమునకై చేయువ్రతము.
కృతకము-స. మనుష్యులచేఁ జేయఁబడినది.
కృతము-స. 1. నాల్గింట మొదటియుగము. 2. చేయఁబడినది. సమా. కృతకర్ముఁడు- నేర్పరి. —శాద్రి- క్రీడించుటకై పోసిన మట్టిదిబ్బ, చేఁతగట్టు. —కృత్యుఁడు-ధన్యుఁడు,కృతార్థుఁడు. —ఘ్నుఁడు-చేసినమేలు మఱచినవాఁడు.—జ్ఞము-కుక్క. —జ్ఞుఁడు - చేసినమేలు తలఁచువాఁడు. —పడు-1. కడచు. 2. విడఁబడు. కృతాంతము-1. అశుభకర్మము. 2. భాగ్యము. 3. సిద్ధాంతము- కృతాంతుఁడు-యముఁడు.కృతార్థుఁడు- తలఁచినపని నెఱవేర్చుకొన్నవాఁడు, కృతకృత్యుఁడు.
కృతి-స. 1. చేయుట. 2. ప్రబంధము. 3. చదువరి. 4. నేర్పరి. 5. కృతార్థుఁడు.
కృత్తము-స. ఛేదింపఁబడినది.
కృత్తి-స. 1. తోలు. 2. నత్తి. రూ. కృత్య. సమా. —వాసుఁడు- శివుఁడు, చర్మవసనుఁడు.
కృత్తిక-స. ఇరువదియేడింట మూఁడవనక్షత్రము.
కృత్యము-స. పని.
కృత్రిమము-స. మనుజులచే చేయఁబడినది.
కృత్రిముఁడు-స. గుణజ్ఞుఁడని యభిమానించి పెంచుకొన్న కొడుకు.
కృత్స్నము-స. 1. నీళ్లు. 2.కడుపు. 3.అంతయు.
కృప-స. దయ.(కృపాళువు-కనికరముగలవాఁడు)
కృపణుఁడు-స. 1. లోభి. 2. కుత్సితుఁడు.
కృపాణము-స. కత్తి. (వ్యు. హింసయందు సమర్థమైనది)
కృపాణి-స. 1. కత్తి. 2. కత్తెర.
కృపీటము-స. 1. కడుపు. 2. నీళ్లు. 3. గాలి. సమా. కృపీటయోని- అగ్ని.
కృమి-స. 1. పురుగు. 2. లక్క. రూ. క్రిమి.
కృశము-స. 1.బక్క. 2.సన్నము. క్రి. కృశించు.
కృశానువు-స. అగ్ని. రూ. కృశానుఁడు. సమా. కృశానురేతసుఁడు- శివుఁడు.
కృషకము-స. కఱు. రూ. కృషికము.
కృషి-స. సేద్యము. (వి. కరిసనము)
కృషికుఁడు-స. సేద్యగాఁడు. రూ. కృషకుఁడు. కృషాణుఁడు- కృషీవలుఁడు. [డువఁబడినది,
కృష్టము-స. 1. ఒకసారి దున్నఁబడినది. 2. ఈ
కృష్టి-స. 1. దుక్కి. 2. చదువరి. [4. నీలి.
కృష్ణ-స. 1. ఒకనది. 2. ద్రౌపది. 3. ద్రాక్ష.
కృష్ణము-స. 1. ఇనుము. 2. మిరియము. 3. కాకి. 4. కోకిల. 5. నలుపు. 6. దున్న. 7. కృష్ణపక్షము. సమా. కృష్ణకర్ముఁడు- దురాచారుఁడు. —ద్వైపాయనుఁడు-వ్యాసుఁడు.—లోహితము-నలుపుమించినయెఱుపు. —వర్త్మ-1. అగ్ని. 2. దురాచారుఁడు. 3. రాహువు. —సారము-నల్లయిఱ్ఱి. డు. 1. విష్ణువు. 2. అర్జునుఁడు. 3. వ్యాసుఁడు. [హము.
క్లప్తము-స. 1. ఏర్పాటుచేయఁబడినది. 2. సంగ్ర
క్లప్తి-స. ఏర్పాటు.

## కె

కెంపు-తె. 1. పద్మరాగమణి. 2. ఎఱుపు. సమా. కెంగేలు-ఎఱ్ఱనిచేయి.(ఇట్లే కెంజడ,కెంజాయ, కెంజిగి, కెందమ్మి, కెందలిరు, కెందొవ, కెంబట్టు, కెన్నురువు,కెమ్మోవి మొ.ఎఱుఁగనగు.) కెంపుకంటి-కోయిల. —కంటిగాము- అంగారకుఁడు.—నవతు-స్వాతి.
కెడ-తె. పార్శ్వము. [కృ. కెడయిక, కెడపు.
కెడయు-తె. 1. పడు. 2. చచ్చు. ప్రే. కెడపు.
కెరకొట్టు-తె. కలకలకూయు.
కెరలు-తె. 1. అతిశయించు. 2. ఆగ్రహించు. 3. కూయు. 4. విజృంభించు. 5. సంభ్రమించు.
కెలఁకు-తె. 1. ముద్దయగునట్లు కలియఁబెట్టు. 2. పెల్లగించు. 3. దిక్కు. 4. ప్రక్క.
కెలను-తె. 1. దిక్కు. 2. ప్రక్క. రూ. కెలఁకు.
కెలయు-తె. విజృంభించు.
కెలవు-తె. అనురాగము.
కెలసము-క. పని.
కెల్లగించు-తె. 1. పెల్లగించు. 2. రేచు.
కెళకుళి-వి. (ఖేలకూలము) క్రీడాసరస్సు. రూ. కెళాకుళి, కెళాకూళి, కేళకుళి, కేళకూళి, కేళాకూళి.

కెళవు-తె. దూరము.

## కే

కేక-తె. కూఁత.
స. నెమలికూఁత. [శబ్దించు.కృ.కేకరింత.
కేకరించు-తె. 1. కేకలువేయు. 2.నకిలించునట్లు
స. కటాక్షించు.
కేకి-స. నెమలి.
కేకినలు-తె. 1. చప్పట్లు. 2. అంజలులు.
కేటత్రాడు-తె. యమపాశము.
కేడ-తె. ధూర్తుఁడు.
కేడి-తె. ఎఱ్ఱబియ్యపువడ్లు. రూ. క్రేడి.
కేడించు-తె. 1. తొలఁగు. 2. అలక్ష్యముచేయు.
రూ. క్రేడించు, కేరడించు. కృ. కేరడము.
కేడెము-వి. (ఖేటకము) డాలు. రూ. కేవడము, కేడియము.
కేతకి-స. పచ్చపూలమొగిలి. (ప్రా. గేదఁగి)
కేతనము-స. 1.టెక్కెము. 2.గుఱుతు. 3.ఇల్లు.
కేతువు-స. 1. తొమ్మిదవ గ్రహము. 2. టెక్కె
ము. 3. గుఱుతు. 4. ధూమకేతువు.
కేదరము-స. 1. వరిమడి. 2. కొండ. 3. పాదు.
4. ఒక పుణ్యక్షేత్రము. రూ. కేదారము.
కేదారుఁడు-స. శివుఁడు.
కేయూరము-స. చూ. అంగదము.
కేరడము-తె. 1. ఉపేక్ష. 2. తిరస్కారము. 3.
వంకరమాట. క్రి. కేరడించు.
కేరించు-తె. విజృంభించు.
కేరు-తె. 1. ఉత్సహించు. 2. కుతూహలపడు.3.
విజృంభించు. 4. తిరస్కరించు. 5. పరిహసిం
చు. 6. కోడి పొదుగుటకై యఱచు.కృ. కేరుపు.
కేలు-తె. 1.చేయి. 2.తొండము. సమా.—మొగ్గ,
—మోడ్పు- అంజలి, చేమోడ్పు.
కేవడము-చూ. కేడెము. [3. ఒకటి.
కేవలము-స. 1. నిర్ణయింపఁబడినది. 2. అంత.
కేవలుఁడు-స. పరమాత్మ. [కొనువాఁడు.)
కేవు-హిం. ఓడకూలి. (కేవరి - ఓడకూలి పుచ్చు
కేశము-స. 1. వెండ్రుక. 2. కురువేరు. సమా.
కేశకారము-గొఱపము. —ఘ్నము- బట్టతల.
—పాశము-సిగ. —వీథి-పాపట. —వేశము-
కొప్పు. [విష్ణువు.
కేశవుఁడు-స. (వ్యు. మంచి వెండ్రుకలుగలవాఁడు)
కేశి-స. మంచివెండ్రుకలు గలవాఁడు. రూ. కేశి
కుఁడు. (స్త్రీ. కేశిని.)
కేసరము-స. 1. ఇంగువ. 2. అకరువు. 3. జూ
లు. 4. పొగడ. 5. పొన్న. [రములు కలది)
కేసరి-స. 1. సింహము. 2. గుఱ్ఱము. (వ్యు.కేస
కేశకుశి-చూ. కెళకుశి. రూ. కేశకూశి, కేళాకూశి.
కేళి-స. 1. ఆట. 2. స్త్రీపురుషుల శృంగారచేష్ట.
కేళిక-వి. (కేళి) ఆట, నృత్యము.

## కై

కై-తె. 1. (కి + అయి) చతుర్థీవిభక్తిప్రత్యయము.
2. చేయి. 3. తొండము. రూ. కయి. సమా.
—కట్టు-సందర్భము, చేమోడ్పు.—కానుక -
గొప్పవారిని జూడఁబోవునపుడు కొనిపోవు ఉప
హారము.—కొను-1. పూను. 2. గ్రహిం
చు. 3. లక్ష్యపెట్టు. కృ. కైకోలు. —
అంగీకారము. — చాపులు- నమస్కృతి. —
జాఱు-ఒఱగు.—జీతము-బత్తెము. —దండ-
హస్తావలంబనము. — మోడ్పు - నమస్కృతి.
—లాగు-కైదండ. — వడి-1. ప్రహారము.
2. పోలిక. — వారము-1. గనిపయించు.
2. స్తోత్రము. 3. పరిధి. 4. వర్తులరేఖ గీచు
సాధనము. —వ్రాలు-1. ఒఱగు. 2. దిగు.
3. పడు. 4. చేవ్రాలు.—సాటిచుక్క -హస్తా
నక్షత్రము. — సేయు - 1. అలంకరించు.
పూజించు. కృ. కైసేఁత.
కైంకర్యము-స. 1. ఊడిగము. 2. భగవంతునకు
భాగవతులకుఁ జేసెడి సేవ. [ఘుని భార్య.
కైక-వి. (కైకేయి) కేకయరాజు కూఁతురు, దశర
కైకోల-తె. 1. గుడ్డలునేసి జీవించు ఒకజాతి.
2. చేతిబెత్తము. [యిజా.
కైజా-హిం. వాగెను వెనుకకీడ్చి కట్టుట. రూ. క
కైజు-వి. కవుజు. రూ. కయిజు, కయిదు, కైదు.
కైత-వి. (కవిత) కవిత్వము. రూ. కయిత.
కైతవము-స. 1. జూదము. 2. మోసము.

కైదు-చూ. కైజా.
కైదువు-తె. ఆయుధము.రూ.కయిదువు. [పదము.
కైపదము-వి. (కవిపద్యము) సమస్య. రూ. కయి
కైపు-తె. 1. అందము. 2. విషము. రూ. కయిపు. హిం. 1. మత్తు. 2. విజృంభణము.
కైరవడి-వి. (ఖాదిరవటకము) తాంబూలముతో నుపయోగించుటకు చేసిన యుండ. రూ. కయిరవడి. [మైనది.)
కైరవము-స. తెల్లకలువ. (వ్యు. హంసలకు ప్రియ
కైరవిణీ-స. 1. తెల్లకలువల గుంపు. 2. తెల్లకలువలకొలను.
కైరవుఁడు-స. 1. జూదరి. 2. పగవాఁడు.
కైలాటము-తె. మాయోపాయము.రూ.కయిలాటము.
కైలాసము-స. వెండికొండ.
కైవర్తుఁడు-స. చేఁపలఁబట్టువాఁడు, జాలరి. (వ్యు. జలజంతువులఁ జంపువాఁడు.) [మైనది)
కైవల్యము-స. మోక్షము. (వ్యు. కేవలునిసంబంధ

## కొం

కొంకనక్క-తె. చిన్నజాతినక్క.
కొంకర-తె.వంపు. క్రి.కొంకరవోవు-నరములీడ్చు.
కొంకి-తె. 1.వంపుచీల. 2.దోఁటి.బ. 3.ముచ్చిలిగుంటకు ప్రక్కలనుండు ఎముకలు. 4. మోఁకాలిచిప్పకు లోతట్టున రెండుప్రక్కల నుండు ఎముకలు. [కోచించు. 4. కృ. సంకోచము.
కొంకు-తె. 1. భయపడు. 2. వెనుదీయు. 3.సం
కొంగ-తె.బకము. సమా. —కాళ్లవాఁడు-నిడుపు మోఁకాళ్లవాఁడు. —వాలు-మాదిగకత్తి.[యగు.
కొంగు-తె. వస్త్రపుచెఱఁగు. క్రి.—మాయు-బహిష్ఠ
కొంగోడువడు-తె. ఒడ్డగిల్లు.
కొంచ-వి. (క్రౌంచము) 1. ఒకానొక కొండ. 2. కొంగవంటి ఒక పక్షి. సమా. —దీవి-క్రౌంచద్వీపము. (ఇట్లే కొంచపుర, కొంచమొగ్గరము, కొంచసారము మొ. ఎఱుఁగనగును) [కొంచు, కొంజు.
కొంచించు-తె. సంకోచించు. రూ. కుంచించు,
కొంచియము-వి.(కించిత్)అల్పము.రూ.కొంచెము.
కొంచు-తె. 1. సంకోచించు. 2. ముణికిచెమట.
కొంజు-తె. 1. చూ. కొంచించు. 2. కొసరు.
కొంట-తె. కొనుట.
కొంటె-తె. 1. తులువ. 2. అకార్యశీలుఁడు.
కొండ-వి. (కుండము) మల. సమా.—కాలువ-సెలయేఱు. —గుఱుతు-సామాన్యలక్షణము. —చిలువ-కొండపాము, అజగరము.—చూలి-పార్వతి. (ఇట్లే కొండరాచూలి మొ.) —త్రిమ్మరి-కోఁతి.—నాలుక-చిఱునాలుక.—పగతుఁడు-ఇంద్రుఁడు, గోత్రారి. —పలుకు-ప్రతిధ్వని. —ముచ్చు-నల్లనిమూతిగల కోఁతి. రూ. కొండముసువ. —యల్లుఁడు-శివుఁడు. —తేఁడు-హిమవంతుఁడు. [గుండము.
కొండము-వి. (కుండము) నిప్పుగుంట. రూ.
కొండాటము-తె. సంతోషము, పొగడ్త.
కొండాడు-తె. పొగడు. [పడు ముణికి.
కొండి-తె. 1. తేలుతోఁక. 2. వత్తికొనను గట్టి
కొండిక-తె. 1. చిన్న. 2. బాలుఁడు. [కొండె.
కొండియ-తె. మొగముతట్టు వేసికొను ముడి. రూ.
కొండియము-తె. చాడీ. రూ.కొండెము. సమా. కొండియుఁడు-చాడీలు చెప్పువాఁడు,పిశునుఁడు. రూ. కొండీఁడు, కొండెగాఁడు.
కొండెంగ-వి. (కుండంగము) నల్లకోఁతి.
కొండొక-తె. 1. కొంచెము.2.చిన్న.3.బాలుఁడు.
కొంద్ర-తె. మళ్లించి దున్నిన చాలు. సమా. —కైదువు-నాఁగలి.
కొంత-తె. (ఒక + అంత) కొంచెము.
కొంతము-వి. (కుంతము) ఈఁటె.
కొందఱు-తె. (కొంత+వారు) కొన్నిమంది.
కొందలము-తె. కలఁత. క్రి.కొందలించు,కొందలపడు. కృ. కొందలపాటు.
కొందు-తె. నజ్జుగ నఱకు.
కొంప-తె. ఇల్లు. (నిందార్థకము)
కొంపోవు-రూ. కొనిపోవు.
కొకిబికి-తె. చక్కనతప్పినది, వంకరైనది.
కొక్కరాయి-తె. కొంగ. రూ. కొక్కెర.
కొక్కరించు-తె. 1. (కోఁతి) వెక్కిరించు. 2. పక్షులు కాళ్లతో కెల్లగించు. కృ. కొక్కరింత.

కొక్కు-తె. పందికొక్కు. సమా.—రవుతు-వినాయకుఁడు.

కొక్కెర-తె. కొంగ.

కొక్కొరొకో-తె. కోడికూఁత. రూ. కొక్కొరోకో.

కొజ్జా-హిం. 1. రాణివాసపు కావలివాఁడు. 2. పుంస్త్వము లేనివాఁడు. [కొటారు, కొట్టరువు.

కొటారము-తె. ధాన్యరాసులుంచెడు చోటు. రూ.

కొటిక-వి. (ఖేటకము) పల్లె. రూ. కొట్టిక. [కాఁడు.

కొటికాఁడు-తె. వేగరి. రూ. కొట్టికాఁడు, కోటి

కొట్టకొన-తె. (కొన + కొన) అన్నిటికంటెకొన.

కొట్టడి-తె. సామగ్రులుంచుగది. రూ. కొట్టు.

కొట్టము-తె. పసులఁగట్టెడు ఇల్లు. రూ. కొట్టాము.

కొట్టి-తె. వేగు. రూ. కోటి. సమా. కొట్టికాఁడు-చూ. కొటికాఁడు. [దెబ్బ. 3. గది, కొట్టడి.

కొట్టు-తె. 1. ప్రహరించు. 2. కృ. ప్రహారము,

కొట్టుపడు-తె. వ్యయమగు. [రూ. కొట్టనము.

కొట్నము-తె. 1. దంపకము. 2. ఊడిగము.

కొట్ర-తె. పిండిలోనగువాని నుడుకఁబెట్టుటకుఁ బెట్టెడి యెసరు.

కొడవలి-తె. కోసెడు సాధనము, (పండ్లుగలకత్తి) లవిత్రము. [చిట్టెము. రూ. కొండి.

కొడి-తె. వత్తికొనను గట్టిపడు ముటికి, దీపపు

కొడిదిలి-తె. 1. వంచిన చేర. 2. పుడిసిలి. రూ. కొణిదిలి. [నము. (వాడుకలో కొడమ)

కొడిమె-తె. 1. అపదూఱు. 2. చేఁపలఁబట్టుసాధ

కొడుఁగురు-తె. కొడి. రూ. కొణుఁగురు.

కొడుకు-తె. కుమారుఁడు. రూ. కొడుకఁడు.

కొడుపు-తె. 1. గంటలోనగువానిని వాయించు కొయ్య. 2. బలపములోనగువాని కోపు. 3. హస్తకవచము. 4. గనుపు నడిమిభాగము.

కొడుము-తె. బింతెపంటి కుండ.

కొణజా-హిం. వాకిటికావలియిల్లు.

కొణత-తె. కుక్కుసుగట్టెడికొయ్య. రూ. కొణతము.

కొణిగ-తె. ముంజూరు.

కొణిఁగె-తె. కుప్ప, దిబ్బ.

కొణిదిలి-చూ. కొడిదిలి.

కొణుఁగురు-చూ. కొడుఁగురు.

కొణుఁజు-తె. పిడుదు. రూ. కొనుజు.

కొతిమిరి-వి. (కుస్తుంబరి) దనియాలమొలకలు. రూ. కొత్తిమిరి.

కొతుకు-తె. 1. వర్ణలోపముగా మాటాడు. 2. సంకోచించు. కృ. 3. వర్ణలోపమగు మాట. రూ. కొదుకు.

కొత్తెము-తె. తాటిపండ్లయందలి విత్తులేని కండ.

కొత్వాలు-హిం. పోలీసు అధికారి.

కొద-తె. తక్కువ. రూ. కొదవ, కొదువ.

కొదమ-తె. 1. పశుపక్ష్యాదులపిల్ల. 2. ఆఁడుమేఁకపిల్ల. 3. యౌవనారంభదశగలది. 4. దృఢము.

కొదరు-తె. 1. అతిశయించు. 2. చెదరు. 3. రేఁగు.

కొదవ-చూ. కొద.

కొదుక-తె. తక్కువ.

కొదుకు-చూ. కొతుకు.

కొదుపు-తె. నోటవేసికొని మ్రింగక ఊరకనములు.

కొద్ది-చూ. కొలఁది.

కొన-తె. చివర. సమా.—రిక్క-రేవతి. క్రి.—కొను-యత్నించు.—లిడు-వర్ధిల్లు. (కొనలొత్తు అనియు) —సాగు-1. నెఱవేఱు. 2. వర్ధిల్లు.

కొనటి-వి. (కునష్టి) అంగహీనుఁడు.

కొని-తె. కొంతసంఖ్యగలవి. రూ. కొన్ని.

కొను-తె. 1. నాటు. 2. పరిపడు. 3. గ్రహించు. 4. పట్టుకొను. 5. లక్ష్యపెట్టు. 6. వేయు. 7. క్రయించు. సమా.—గోలు-1. క్రయము. 2. నట్టువుఁడు కొలిపించుట.—బడి-క్రయము. కొనివచ్చు-తెచ్చు.—పోవు-తీసికొనిపోవు. —యాడు-స్తుతించు. కృ. కొనియాట.

కొనుజు-చూ. కొణుజు. [రూ. కొన్నాళ్లు.

కొన్ని-చూ. కొని. సమా.—నాళ్లు-కొన్నిదినములు.

కొపురు-తె. 1. శిఖరము. 2. ఉన్నతి. 3. కొప్పరము.

కొప్పరము-తె. 1. శిఖరము. 2. మూఁపు. 3. విజృంభణము. రూ. కొప్రము. క్రి. కొప్పరించు. కృ. కొప్పరింత.

కొప్పు-తె. 1. తలయందుదోఁపిన వెండ్రుకలముడి. 2. వింటికొన, కోపు. 3. ఇంటినడికొప్పు. 4. మొగుడు. [పెద్దపాత్రము, కటాహము.

కొప్పెర-వి. (కర్పరము) వెడల్పు ముఖముగల

కొబ్బెర-తె.చిప్పతీయఁగా లోనమిగిలిన టెంకాయ.
కొమ-తె. 1. శాఖ. 2. ఆఁడుది. రూ. కొమ్మ.
కొమరసామి-వి. (కుమారస్వామి) స్కందుఁడు.
కొమరిత-వి. (కుమారి) కూఁతురు. రూ.కొమర్త. కొమారి, కొమారిత, కొమార్త.
కొమరు-తె. 1. మనోజ్ఞత. 2. పైదూలముమీఁది గుజ్జు. సమా. —ఁదనము-యౌవనము. —ఁబాయము-యౌవనము. [రుఁడు.
కొమరుఁడు-వి.(కుమారుఁడు) కొడుకు.రూ.కొమా
కొమిరె-తె. (కొమరు+ఎ) యౌవనముగల స్త్రీ.
కొమ్మ-తె. 1. శాఖ. 2. ఆఁడుది. చూ. కొమ. 3. కోటకొమ్మ. సమా.—త్రిమ్మరి-కోఁతి. —మెకము-కోఁతి.
కొమ్ము-తె.1. ఉకారముయొక్క రూపాంతరనామము.2.ఎద్దులోనగువాని కొమ్ము.3.చిమ్మనఁగ్రోవి.4.పసుపులోనగువాని యెండినగడ్డ.5. పల్లకి వెదురు. 6. ఏనుఁగుదంతము. 7. పందికోఱ. 8. ఊఁదెడు వాద్యము, కాళె. 9. శాఖ. 10. శిఖరము. 11. కొన. 12. ఉత్సాహము. 13. పేన. సమా.—కాఁడు-1. పంది. 2.కొమ్మూఁదెడువాఁడు.—టేనుఁగు-మగయేనుఁగు.—మాచకమ్మ-కొమ్ములుగల మాచకమ్మ.—వాఁడు-కొమ్మూఁదెడువాఁడు.
కొయుగూర-తె. కోయఁగా పెరుగుచుండు ఒకతెగ శాకము. రూ. కొయ్యగూర.
కొయ్య-తె. కఱ్ఱ.
కొఱ-తె. 1.తక్కువ.2.ప్రయోజనము.3.శిల్పము. సమా.—గామి-1.అకార్యము. 2.దుర్లక్షణము. 3. దోషము. 4.నిష్ప్రయోజనము—ప్రాణము-కుట్టుసుఱు. —ముట్టు-సాధనము. —సంధి-అయము.—వోవు-మూర్ఛిల్లు.
కొఱఁకు-వి. 1. పసులుమేయుకంచె. 2. పక్షులెర యేఱితినుచోటు. రూ. కొఱను.
కొఱఁత-తె. తక్కువ. రూ. కొఱ.
కొఱకచ్చు-తె. కొఱవి.
కొఱకు-తె.(కొఱ+కు)చతుర్థీవిభక్తిప్రత్యయము.
కొఱకొఱ-తె. కోపవికారము.
కొరడా-హిం. జాటీ.

కొరడు-తె. వంకరలేని యింద్రధనుస్సు.
కొఱడు-తె. 1. ఒకఆయుధము. 2. ప్రానిమోడు.
కొఱడువాఱు-తె. 1. తిమురుపట్టు. 2. ప్రాస్పడు.
కొఱను-చూ. కొఱఁకు.
కొఱపము-వి. (కురపము) గుఱ్ఱమును తోమెడు సాధనము. రూ. గొఱపము.
కొఱలు-తె. 1. ఉండు.2. ప్రకాశించు.3. పొందు.
కొఱవ-తె. వెదురుబుట్టలల్లెడి ఒకజాతి.
కొరవంజి-తె. 1. ఎఱుకువాఁడు. 2. ఎఱుకత.
కొరవి-వి. (కురవకము) ఎఱ్ఱగోరంట.
కొఱవి-తె.నిప్పుగలకఱ్ఱ. సమా.—దయ్యము-కొఱవులఁగొని తిరుగు ఒకతెగ దయ్యము.
కొరి-తె. తెప్ప నడిమిపెంట్రుక.
కొఱు-చూ. కొఱ్ఱు.
కొఱుకు-తె. 1. కఱచు. 2. మేహరోగవిశేషము.
కొర్నవగండు-తె. గాడిదపులి.రూ.కొరనాసిగండు.
కొఱ్ఱ-తె. 1. ఒకతెగచేఁప, పాఠీనము. 2. ప్రియంగువు అను పైరు.
కొఱ్ఱు-తె. మేకు. రూ. కొఱు.
కొల-తె.1.పాపము.2.హింస.3.హత్య. [కొలను-
కొలఁకు-వి. (కూలము)సరస్సు. రూ. కొలఁకువు.
కొలఁది-తె. 1. పరిమితి. 2. శక్యము.
కొలకొల-తె. కలకలము.
కొలత-తె. 1. కొలుచుట. 2. పరిమాణము.సమా. కొలగాఁడు-ధాన్యముకొలుచువాఁడు.—గారము-ధాన్యముకొలుచుట.రూ.కొలారకము.
కొలను-చూ. కొలఁకు. [ప్రాణిసమూహము.
కొలము-వి. (కులము) 1. వంశము. 2.సజాతీయ
కొలారము-తె. నడుమ బయలును నాలుగుప్రక్కల కట్టడమును గల యిల్లు. రూ. కొలారు, కొల్లారము, కొల్లారు.
కొలి-తె. బిల్లగోడాడుటకు త్రవ్విన పల్లము.
కొలికి-తె. 1. ముక్కునంటిన కంటిమూల. 2. హారములోనగువానిఁ దగిల్చెడు వంకరకమ్మి. 3. పరిపాకము.
కొలిమి-తె. కమ్మరి నిప్పుంచెడి పల్లము.
కొలుచు-తె. 1. ఉపాసించు. 2. సేవించు. 3. కొలతచేయు. 4. కృ. ధ్యానము. ప్రే. కొలి

పించు. కృ. కొలువు.
కొలుపు-తె. 1. నట్టువుఁడు కొలిపించు. 2. సమ్మతించు. 3. సరిపడు. 4. చెల్లు. 5. పురికొలుపు. 6. సైఁగచేయు. 7. గ్రామదేవతఉత్సవము. 8. అనుప్రయుక్తమైనకొను ధాతువు ప్రేరణరూపము.
కొలువడి-తె. (కొలుచు + వడి) కొలత.
కొలువు-తె. 1. ఆస్థానము. 2. సేవ. సమా.—కాఁడు-సేవకుఁడు. రూ. కొలువుడుకాఁడు. —కూటము-ఆస్థానమండపము.
కొల్తె-తె. 1. ఉండియను నర్థమునవచ్చు ప్రత్యయము. 2. కోయఁగా మిగిలిన మొక్క. రూ. కోలె.
కొల్ల-తె. దోఁపుడు. క్రి—కొట్టు,—కొను,—పెట్టు, కొల్లలాడు, కొల్లాడు.
కొల్లారము-చూ. కొలారము.
కొస-తె. కొన.
కొసరు-తె. 1. సంకోచించు. 2. ప్రార్థించు. 3. మఱికొంచె మిమ్మని యడుగు. కృ. 4. కోరిక. 5. తీసికొన్న వస్తువున కిచ్చెడి పెచ్చు. 6. సంకోచము.

## కో

కో-తె. అఱుపునందగు ధ్వని.
కోఁగు-తె. గొఱుగు.
కోఁచ-తె. పిఱికి. క్రి. కోచపాఱు.
కోఁడు-తె. ధాన్యము చేటలోఁబోసికొని ప్రక్కవాటుగా ఇటునటుత్రిప్పు.
కోఁత-తె. కోయుట.
కోఁతి-తె. వానరము.
కోఁదాడు-తె. ఒకతెగతాటిచెట్టు. [ధరించు వస్త్రము.
కోక-తె. 1. వస్త్రము. 2. (ఇప్పటివాడుక) స్త్రీ
కోకనదము-స. 1. చెంగలువ. 2. చెందమ్మి.
కోకము-స. 1. జక్కవ. 2. తోఁడేలు. 3. బల్లి. 4. కప్ప. సమా. కోకవైరి-చంద్రుఁడు.
కోకిలము-స. పికము. (వి. కోయిల) (వ్యు. పలుకులచే వినువారి మనస్సుల నాకర్షించునది.)
కోగిల-వి. (కోకిలము) పికము. రూ. కోయిల, కోవెల.
కోట-వి. (కోట్టము) 1. దుర్గపురము. 2. పట్టణముచుట్టు గల ప్రహరి.
కోటఁడు-వి. (కోటము) గుడ్లగూబ.
కోటము-స.—పై.—
కోటరము-తె. కోడటికము. రూ. కోడంత్రము, కోడంత్రికము, కోటటికము, కోత్రము. స. చెట్టుతొఱ్ఱ. [అసంఖ్యములు.
కోటానఁగోటులు-తె. (కోటులు + కోటులు)
కోటి-తె. వేగు. చూ. కొట్టి. [నూఱులక్షలు. స. 1. అంచు. 2. వింటికొన. 3. చివర. 4.
కోటీరము-స. కిరీటము.
కోటేరు-తె. దుంపసుకాఁడిమీఁదతగిలించిననాఁగలి.
కోట్టము-స. కోట.
కోట్టారము-స. నీటిపల్లము.
కోడంత్రము-తె. కోడటికము. చూ. కోటరము.
కోడలు-తె. (కొడుకు + ఆలు) కొడుకుపెండ్లాము.
కోడాడు-తె. బాధపడు.
కోడి-తె. కుక్కుటము, అజ్జవాలు. సమా.—పీఁటబండినొగక్రింద ఎత్తుగానుంచు కొయ్య, అనుకర్షము.
కోడిగ-తె. ఇరువదిరత్నములు. రూ. కోడీ.
కోడిగము-తె. 1. విలాసచేష్ట. 2. అపహాస్యము. సమా. కోడిగీఁడు-విలాసచేష్ట చేయువాఁడు.
కోడియ-తె. దున్నువయసువచ్చిన ఆఁబోతు. రూ. కోడె. [ఊరిదరినీటిపల్లము.
కోదు-తె. 1. మంచములోనగువాని కంబము. 2.
కోడె-తె. 1. కాఁడి మఱపఁదగిన ఆఁబోతు. రూ. కోడియ. 2. విటుఁడు. 3. యుక్తవయసు. సమా.—కాఁడు-విటుఁడు.—రౌతు-శివుఁడు.
కోణంగి-తె. (కోణ + అంగి) అంగములను వికారముగాఁజూపి బిచ్చమెత్తు దాసరి.
కోణపుఁడు-స. నైర్ఋతుఁడు, మూలఱేఁడు. [రుఁడు.
కోణము-స. 1. మూల. 2. అంచు. డు. శనైశ్చ
కోదండము-తె. బాలురను దూలమునకు త్రాడుగట్టి దానినిపట్టుకొని ప్రేలాడించుట. స. 1. నాలుగుమూరలవిల్లు. 2. విల్లు. 3. వెదురువిల్లు. (వ్యు. కుత్సితమైన దండముగలది.)
కోన-తె. 1. గోసమూహము. 2. అడవి. 3. కొండలయందలి మఱుఁగుచోటు. 4. వి. (కోణము) కొన. సమా.—త్రిమ్మరి-కోఁతి. (ఇక్లే కోనమనికి మె.)—ఱేఁడు-నైర్ఋతుఁడు.

కోనేఱు-తె. (కోన+ఏఱు) చుట్టును మెట్లుగల నలుచదరపుగుంట, పుష్కరిణి. రూ. కోనేఱు.
కోపము-స. కినుక. సమా. కోపి - కోపముగలవాఁడు. (స్త్రీ. కోపన) క్రి. కోపగించు, కోపగిల్లు, కోపించు.
కోపు-తె. *1*. కడ్డీ. *2*. అందము. *3*. వింటికొప్పు. *4*. నమస్కారము. *5*. నాట్యము తీర్పు. *6*. నిమిత్తము. *7*. ప్రక్క. *8*. విధము. *9*. అడుసు. *10*. కల్లు. [ఆఁడుది.
కోమ-తె. *1*. పొదవుగా పెరిగిన పుట్టచివర. *2*.
కోమటి-వి. (కార్పటికుఁడు) వైశ్యుఁడు.
కోమలము-స. *1*. నీళ్లు. *2*. మృదువు. [ఆఁడుది.
కోమలి-తె. *1*. చక్కఁదనముగల ఆఁడుది. *2*.
కోమలికము-తె. చక్కఁదనము.
కోయ-తె. ఒక జాతిబోయ. [రూ. కోవెల.
కోయిల-తె. *1*. గుడి. *2*. వి. (కోకిలము) పికము.
కోయు-తె. *1*. ఛేదించు. *2*. గిల్లు. కృ. కోఁత.
కోర-తె. *1*. గిన్నె. *2*. తట్ట. *3*. పెద్ద. *4*. వంకర. సమా.—కొండె - ప్రక్కవైచిన కొండె.—మీసము-పొడవై కొనవంగినమీసము.—పోవు-కొంకరలుపోవు. —వాయువు - ప్రక్కకీడ్చు (వంకరకలిగించు) వాతరోగము.—సిగ-కోర కొండె.
కోఱ-తె. పొడవైన ప్రక్కపల్లు, దంష్ట్ర.
కోరకము-స. *1*. మొగ్గ. *2*. సగమువిరిసినమొగ్గ. *3*. తామరతూఁడు. క్రి. కోరగించు-*1*. మొలకెత్తు. *2*. ముకుళించు.
కోఱడము-తె. అపహాస్యము.
కోరడి-తె. కరగోడ.
కోరా-తె. చలువచేయనిది, కారికము.
కోరాడు-తె. (కోరి+ఆడు) దుమ్ములోనగువానిని పైకెగఁజిమ్ము, కెల్లగించు.
కోరిక-తె. *1*. ఇచ్ఛ. *2*. కోరుట. *3*. వరము. రూ. కోరికి, కోర్కి.
కోరు-తె. *1*. ఇచ్ఛించు. *2*. ధనేతర వస్తురూపమైన కప్పము. కృ. కోరిక.
కోల-తె. *1*. దండము. *2*. బాణము. *3*. పొడవైనల. సమా. కోలలవారు-వేత్రధరులు. కోలాటము-(కోల+ఆట) చేతులఁగోలలుంచుకొని తట్టుచు ఆడెడి ఆట. —మెఱుఁగు-నిలువు మెఱుపు.
కోలగగ్గెర-తె. కాళ్లకు దారమును పెనఁచి యెద్దులను మూటకట్టుగాఁగట్టెడి కట్టు.
కోలదివియ-తె. వెదురుకఱ్ఱల దివ్వటీ.
కోలము-తె. నృత్యము. స. *1*. రేఁగుఁబండు. *2*. తెప్ప. *3*. పంది. *4*. ఒడి. *5*. కౌఁగిలి.
కోలాహలము-స. కలకలము.
కోలు-తె. *1*. అనుప్రయుక్తమైన కొను ధాతువునకు వచ్చు కృదంతరూపము. (ఇచ్చుకోలు, పీడుకోలు మొ.) *2*. కొల్ల. *3*. పెద్ద. *4*. మిక్కిలి. సమా.—వాఁడు-*1*. నియమించు అధికారి. *2*. కావలివాఁడు. *3*. సుంకరిక్రింది బంటు.—తల-*1*. ఎదుటనిలిచి యుద్ధముచేయుట. *2*. యుద్ధసన్నాహము. రూ. కోల్తల. క్రి. —కొను-*1*. ఉత్సహించు. *2*. తేఱుకొను. *3*. వర్ధిల్లు.—పడు-*1*. చెడు. *2*. అగపడు. *3*. పోఁగొట్టుకొను. కృ. కోలుపాటు.—పోవు-*1*. చెడు. *2*. అగపడు. *3*. పోఁగొట్టుకొను. కృ. కోలుపోక. [*2*. చూ. కాలె.
కోలె-తె. *1*. పైరుకోసివేయఁగా మిగిలినమొక్క.
కోవ-తె. పుట్టచివర, కోమ.
కోవిదుఁడు-స. విద్వాంసుఁడు. (వ్యు. ఇది యది యను నియమములేక సర్వము నెఱిఁగినవాఁడు.)
కోవు-తె. అఱచుటయందగుధ్వని. [పొంచు.
కోవురము-తె. శత్రువులను బట్టుటకై పొంచెడు
కోవెల-తె. *1*. గుడి. *2*. కోకిల. చూ. కోయిల.
కోశము-స. *1*. కత్తియొఱ. *2*. గ్రుడ్డు. *3*. పుస్తకము. *4*. బొక్కసము. రూ. కోషము. (పంచకోశములు: అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము) [కొట్టు. *3*. గాదె.
కోష్ఠము-స. *1*. లోకడుపు. *2*. సామగ్రులుంచు
కోష్ణము-స. ఇంచుకవేఁడి. రూ. కవోష్ణము.
కోసము-తె. నిమిత్తము. రూ. కోసరము.
కోసు-వి. (క్రోశము) రెండువేల విండ్లు పట్టు కొలఁది, రెండువరమైలు. రూ. క్రోసు.

## కౌ

కౌఁగిలి-తె. భుజమధ్యము, క్రోడము. రూ. కవుఁగిలి. క్రి. కౌఁగిలించు-ఆలింగనముచేయు. కృ. కౌఁగిలింత, కౌఁగిలింపు.
కౌఁజు-చూ. కంజు. [నుండునది.)
కౌక్షేయకము-స. కత్తి. (వ్యు. కుక్షివంటియొఱలో
కౌఁచు-తె. చేఁపమీఁదిపొలసు. రూ. కవుచు.
కౌటిల్యము-స. కుటిలభావము.
కౌడు-తె. కపటము. రూ. కవుడు.
కౌణపుఁడు-స. కోణపుఁడు.
కౌతుకము-స. 1. కుతుకము, తమి. 2. కోరిక. 3. పెండ్లియందు చేతఁగట్టుకొను తోరము. 4. స్త్రీపురుష పరిహాసము. 5. సంతోషము.
కౌతూహలము-స. తమి. [కవును.
కౌను-తె. 1. నడుము. 2. వింటినడుము. రూ.
కౌపీనము-స. గోఁచి.
కౌమారము-స. బాల్యమున కావలి వయోవస్థ.
కౌముదము-స. కార్తికమాసము.
కౌముది-స. వెన్నెల.
కౌమోదకి-స. విష్ణువుగద. (వ్యు. భూమిని సంతసపెట్టు విష్ణువుసంబంధమైనది.)
కౌరు-తె. వన్నె. రూ. కవురు.
కౌలటినేయుఁడు-స. భిక్షుకియైన పతివ్రతకొడుకు.
కౌలటేయుఁడు-స. 1. కౌలటినేయుఁడు. 2. లంకుటాలికొడుకు.
కౌలటేరుఁడు-స. లంకుటాలికొడుకు.
కౌలీనము-స. 1. గొప్పకులమందుపుట్టుక. 2. జగడము. 3. నింద్యము.
కౌలు-హిం. ఒడంబడికపత్రము. రూ. కవులు.
కౌశలము-స. నేర్పరితనము. రూ. కౌశల్యము.
కౌశికము-స. 1. గుడ్లగూబ. (వ్యు. వృక్షములందు చరించునది) 2. ముంగిస.
కౌశికి-స. 1. విశ్వామిత్రునిసోదరి. 2. పార్వతి.
కౌశికుఁడు-స. 1. విశ్వామిత్రుఁడు. (వ్యు. కుశికపుత్రుఁడు.) 2. ఇంద్రుఁడు. (వ్యు. కోశసమృద్ధి కలవాఁడు.) 3. నిఘంటువుతెలిసినవాఁడు. 4. పాములవాఁడు(వ్యు. పాముల బుట్ట గలవాఁడు.)
కౌశేయము-స. పట్టుది (వస్త్రము)
కౌసీద్యము-స. 1. కుసీదభావము. 2. అలస్యము. 3. కునికిపాటు.
కౌస్తుభము-స. విష్ణువక్షస్స్థలమందుండు మణి.

## క్ర

క్రంగు-తె. మ్రోఁగుటయందగుధ్వని. రూ. కంగు.
క్రంత-తె. 1. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁదీసికొనిపోవు ప్రధానద్రవ్యము. 2. రచ్చ. 3. సందుత్రోవ. 4. రంధ్రము. రూ. కంత.
క్రందనము-స. 1. అఱపు. 2. ఏడుపు. 3. పిలుపు.
క్రందు-తె. 1. మ్రోఁగు. 2. విలపించు. 3. కృ. మ్రోఁత. 4. సందడి. 5. ఉపద్రవము. సమా. —కయ్యము-దొమ్మిజగడము. క్రి.—కొను-అతిశయించు.
క్రంప-చూ. కంప.
క్రకచము-స. ఱంపము. రూ. క్రకరము.(వ్యు.) కట్టెను శబ్దముగలిగించునది.)
క్రకరము-స. 1. ఱంపము. 2. కొక్కెర.
క్రక్కస-వి. (కర్కశము) కఠినము.
క్రక్కు-తె. 1. వాంతియెత్తు. 2. వాంతి. రూ. కక్కు.
క్రచ్చర-తె. (క్రచ్చు+అఱ) 1. నిష్కల్మషముగా. 2. శీఘ్రముగా. [నుండు తుక్కు.
క్రచ్చు-తె. 1. చుట్టుకొను. 2. కృ. త్రాడుపై
క్రతువు-స. యజ్ఞము. సమా. క్రతుధ్వంసి - శివుఁడు, జన్నపుగొంగ. —భుజుఁడు-వేలుపు. రూ. క్రతుభుక్కు.
క్రథనము-స. వధ. [మఱొకపరి.
క్రన్న-తె. 1. శీఘ్రముగా. 2. పిమ్మట. 3. మరల,
క్రమణము-స. అడుగిడుట. [ముట. 4. వరుస.
క్రమము-స. 1. సొరిది. 2. అడుగిడుట. 3. అఱు
క్రమించు-స. 1. అతిక్రమించు. 2. ఆక్రమించు.
క్రముకము-స. 1. పోఁక. 2. తమ్ములము.
క్రమేలకము-స. ఒంటె. రూ. క్రమేళకము. (వ్యు. పాదవిక్షేపములచేఁబోవునది.) [ఱఁబడు.
క్రమ్మఱు-తె. మరలు. రూ. క్రమ్మఱిల్లు, క్రమ్మ
క్రమ్ము-తె. 1. కవియు. 2. పైకొను. 3. వ్యాపించు. రూ. కమ్ము. కృ. కమ్ముదల.

క్రయము-స. 1. వెల. 2. వెలయిచ్చికొనుట. క్రి. క్రయించు-కొను.
క్రయికు(డు-స. కొనువా(డు. రూ. క్రాయకు(డు.
క్రయ్య-తె. సలుప్రక్కల గనిమలుగల పడి. రూ. రయ్య. [బడినది.
క్రయ్యము-స. అమ్ముటకు అంగడియం దుంచ(
క్రయ్యు-తె. కలయు. రూ. క్రయ్య(బడు.
క్రల్లవడు-తె. ఎండు.
క్రవ్యము-స. మాంసము. సమా. క్రవ్యాదు(డు - 1. మాంసము తినువా(డు. 2. రక్కసు(డు. రూ. క్రవ్యాత్తు, క్రవ్యాశి.

## క్రా

క్రాంతి-స. క్రమణము.
క్రా(క-చూ. కా(క.
క్రా(గు-చూ. కా(గు.
క్రా(గుడు-చూ. కా(గుడు.
క్రా(చు-చూ. కా(చు.
క్రాయకు(డు-స. క్రయికు(డు.
క్రాయు-తె. 1. ధ్వనితో కళ్లలోనగువాని నోటికి( దెచ్చుకొను. 2. క్రక్కు. 3. ఉమియు.
క్రార-తె. (క్రయ్యు+ర) జడ్డయై యొకయక్షరముతో(గలియు రేఫము. రూ. క్రారపడి.
క్రాలు-తె. 1. (రెక్కము) అల్లలాడు, చలించు. 2. గిరగిర(దిరుగు. 3. చెదరు. 4. సంచరించు. 5. అతిశయించు. 6. వర్తిల్లు. సమా. —గంటి-1. చలించునట్టికన్నులుగలఆ(డుది, తరళేక్షణ. 2. ఆ(డుది.

## క్రి

క్రించు-తె. అల్పు(డు. రూ. క్రించు(డు.
క్రింది-తె. 1. అధోభాగము. 2. గతకాలము. 3. తక్కువ. సమా. క్రిందల - క్రిందగుతల. క్రియ్యాట-క్రిందియూట. క్రీ(గడుపు-క్రింది కడుపు. క్రీనేఱు-క్రింద ప్రవహించునది. క్రి. క్రిందుపడు-1.అడుగుపడు. 2.తక్కువయగు.
క్రిక్క-తె. భట్టు, వంది.
కిక్కిఱియు-తె. (క్రిక్కు+ఇఱియు) ఎల్ల చోట్ల వ్యాపించు. రూ. క్రిక్కిఱించు.
క్రిక్కు-చూ. కిఱుకు.
క్రిమి-చూ. కృమి.
క్రియ-స. 1. ధాత్వర్థము. 2. చేయుట. 3. చేష్ట. 4. పని. 5. ఉపాయము. 6. చికిత్స. 7. ప్రాయశ్చిత్తము. 8. (తెను(గున) విధము. సమా. క్రియాకారము - ప్రతిజ్ఞ.—కారు(డు - క్రొత్తశిష్యు(డు. —వంతు(డు - పనియందు పూనికగలవా(డు.
క్రియ్యు-తె. కృశించు. రూ. క్రుయ్యు.

## క్రీ

క్రీ(గడుపు-చూ. క్రింది.
క్రీడ-స. 1. ఆట. 2. పరిహాసము. క్రి. క్రీడించు.
క్రీడి-వి. (కిరీటి) అర్జును(డు. [కొడుకు.
క్రీతు(డు-స. తల్లిదండ్రులకు వెలయిచ్చి కొన్న

## క్రు

క్రుంకు-తె. 1. మును(గు. 2. అస్తమించు. 3. చచ్చు. 4. కృ. మునుక. కృ. క్రుంకు, కుంకుడు. సమా.—గట్టు-అస్తాద్రి. (ఇట్లే క్రుంకుమల మొ.) [రూ. క్రుంగ(బడు, క్రుంగిలు.
క్రుంగు-తె. 1. క్రిందికి అడ(గు. 2. దిగ(బడు.
క్రుక్కు-తె. 1. పేలులోనగువానిని గోళ్లతోచదుపు. 2. అద(చు. 3. తుఱుగు. కృ. క్రుక్కుడు.
క్రుధ-స. కోపము. రూ. క్రోధము.
క్రుద్ధు(డు-స. కోపమునొందినవా(డు.
క్రుమ్మరు-తె. సంచరించు. రూ. క్రుమ్మరిలు, క్రుమ్మరిల్లు. [క్రుమ్ముడు. రూ. కుమ్ము.
క్రుమ్ము-తె. 1. పొడుచు. 2. కృ. పొడుపు. కృ.
క్రుమ్ములాడు-తె. కుమ్ముకొనిపోట్లాడు.
క్రుయ్యు-తె. 1. కృశించు. రూ. క్రియ్యు. 2. వెనుదీయు. రూ. క్రుయ్య(బాఱు.
క్రుళ్లగించు-తె. 1.లోలోదుఃఖించు. 2.కెల్లగించు. కృ. క్రుళ్లగింత.
క్రుళ్లు-తె. 1. అవియు. 2. (పండ్లు మొ.) చెడు. 3. క్రుళ్లగించు.రూ. కుళ్లు. సమా.—పోతు-1. అసూయాపరు(డు. 2. లోలోదుఃఖించువా(డు.

## క్రూ

క్రూరము-స. 1. భయంకరమైనది. 2. నొప్పించునది.
క్రూరుఁడు-స. 1. భయంకరుఁడు. 2. దుష్టుఁడు.
క్రూరు-తె. వాఁడి. రూ. కూరు.

## క్రే

క్రేఁటు-తె. 1. గొంతదుపు తీయుటకు సకిలించునట్లు శబ్దించు. 2. తొట్రుపడు. రూ. క్రేఁటుకొను.
క్రేడి-తె. ఎఱ్ఱబియ్యపువడ్లు. రూ. రేడి.
క్రేడించు-తె. 1. తొలఁగు. 2. అలక్ష్యముసేయు. రూ. క్రేణించు. చూ. కేడించు.
క్రేడిసేయు-తె. గేలిసేయు. రూ. క్రేణిసేయు.
క్రేణి-తె. 1. ఉన్నతపదము. 2. పరిహాసము. క్రి. క్రేణించు, క్రేడించు, క్రేణిసేయు.
క్రేపు-తె. 1. దూడ. 2. పర్వతాదుల శిఖరము.
క్రేయము-స. వెలయిచ్చికొనఁదగినది.
క్రేయో-తె. 1. జలముద్రావఁబసులఁ బిలుచు సంజ్ఞ. 2. వెడలఁగొట్టుటయందగు ధ్వని.
క్రేవ-తె. పార్శ్వము. సమా. క్రేఁగన్ను-కటాక్షము. క్రేఁగయి-హస్తాగ్రము. క్రి. క్రేతొట్టు-గట్టొరయు
క్రేవు-తె. సింహనాదమునందగు ధ్వని.
క్రేళ్లు-తె. ఉన్నతి. క్రి. క్రేళ్లదాఁటు-1. ఎగిరిపడు. 2. గంతులిడు. 3. దూఁకు. రూ. క్రేళ్లుఱుకు. క్రేళ్లిబ్బు-అతిశయించు. క్రేళ్లవాఱు-గంతులిడు.

## కై

కైౖలు-తె. ధాన్యము నుఱిచికొలుచుట, ఒబ్బిడి.
కైౖలుదారి-తె. ఒబ్బిడిచేయించు అధికారి.

## క్రొ

క్రొంకి-చూ. కొంకి.
క్రొంచ-చూ. కొంచ.
క్రొక్కారము-తె. కోడికూఁత.
క్రొత్త-తె. 1. నూతనము. 2. అపూర్వము. సమా. క్రొంజాయ, క్రొంజెమట, క్రొందమ్మి, క్రొందలిరు, క్రొంబసిఁడి, క్రొంబుట్టము, క్రొంబులకలు, క్రొంబొగ, క్రొక్కన్ను, క్రొక్కారు, క్రొత్తరఁగ, క్రొత్తావి, క్రొన్నన, క్రొన్నెత్తురు, క్రొన్నెల, క్రొమ్మావి, క్రొమ్ముడి, క్రొమ్మెఱుఁగు, క్రొమ్మేఘములు, క్రొవ్వాఁడి, క్రొవ్విరి మొ.
క్రొత్తదము-తె. కోటబురుజు. రూ. క్రొత్తళము.
క్రొత్తడి-తె. 1. పగనాలు. 2. పతివ్రత.
క్రొవ్విదము-తె. (క్రొవ్వు + ఇదము) 1. దుష్కార్యము. 2. పరుషము.
క్రొవ్వు-తె. 1. మదించు. 2. కృ. మదము. 3. తెల్లని మాంసపదార్థము.

## క్రో

క్రోఁతి-చూ. కోఁతి.
క్రోడము-స. 1. ఒడి. 2. రొమ్ము. 3. పంది.
క్రోడాడు-తె. కొమ్ములలోనగువానితో మంటిని కోరాడు. [చేర్చుట. క్రి. క్రోడీకరించు.
క్రోడీకరణము-స. 1. ఆలింగనము. 2. ఒకటిగా
క్రోడుఁడు-స. శనైశ్చరుఁడు.
క్రోధన-స. 1. కోపముగలది. 2. అఱువదింట ఏఁబది తొమ్మిదవ సంవత్సరము.
క్రోధము-స. కోపము. క్రి. క్రోధించు.
క్రోధి-స. 1. కోపముకలవాఁడు. 2. అఱువదింట ముప్పదియెనిమిదవ సంవత్సరము.
క్రోయు-తె. విషమముగా చాఁచు.
క్రోలు-తె. 1. అనుభవించు. 2. తిను. 3. త్రాగు. 4. గ్రహించు. రూ. కొఁలు. 5. క్రోవి.
క్రోలుచు-తె. శబ్దించు, కూయు.
క్రోవ-తె. నరము. [తూము. 5. మూస.
క్రోవి-తె. 1. గొట్టము. 2. తుపాకి. 3. బుడ్డి. 4.
క్రోశము-స. రెండువేలవిండ్లు పట్టుకొలఁది. (వి. కోసు)
క్రోష్టువు-స. నక్క.

## క్రౌ

క్రౌంచము-స. 1. ఒకద్వీపము. 2. ఒకకొండ. 3. ఒక పక్షి. (వి. కొంచ.) సమా. క్రౌంచదారణుఁడు-కుమారస్వామి.
క్రౌర్యము-స. క్రూరభావము.

## క్లా

క్లాంతము-స. బడలినది.

క్లాంతి-స. బడలిక.

## క్లి

క్లిన్నము-స. తడిసినది.
క్లిశితము-స. దారిద్ర్యాదులచే క్లేశమునొందినది.
క్లిష్టము-స. 1. క్లిశితము. 2. పూర్వోత్తరవిరుద్ధమైనది (వాక్య).

## క్లీ

క్లీబము-స. నపుంసకము.

## క్లే

క్లేదము-స. తడి.
క్లేశము-స. 1. దుఃఖము. 2. శ్రమము. 3. వ్యవసాయము. 4. కోపము.
క్లోమము-స. కడుపులోని నీరుతిత్తి.

## క్వ

క్వణనము-స. వీణలోనగువాని మ్రోఁత. రూ. క్వణము, క్వాణము.
క్వథితము-స. చక్కఁగా కాఁగినది.

## క్వా

క్వాథము-స. బాధ.

## క్ష

క్షంత-స. ఓర్పరి. రూ. క్షమి, క్షమిత.
క్షణద-స. రాత్రి.
క్షణదము-స. నీళ్లు.
క్షణదుఁడు-స. జోస్యుఁడు.
క్షణనము-స. వధము.
క్షణము-స. 1. ఘటికయందాఱవపాలు. 2. సమయము. సమా. క్షణప్రభ- మెఱపు.
క్షణియించు-స. భోజనమునకుపిలుచు. రూ. క్షణించు.
క్షతము-స. 1. గాయము. 2. గాయమునొందినది. 3. నాశము నొందినది. సమా. క్షతజము- నెత్తురు.
క్షతి-స. గాయము.
క్షత్త-స. 1. బ్రహ్మ. 2. సారథి. 3. దాసీపుత్త్రుఁడు. 4. శూద్రస్త్రీయందు క్షత్రియునకుఁగాని క్షత్రియస్త్రీయందు శూద్రునకుఁగాని పుట్టినవాఁడు.
క్షత్రము-స. శరీరము.
క్షత్త్రియుఁడు-స. రాచవాఁడు. రూ. క్షత్త్రుఁడు. (వ్యు. క్షతమునుండి రక్షించువాఁడు.) (స్త్రీ. క్షత్త్రియాణి, క్షత్త్రియ, క్షత్త్రియి) సమా. క్షత్త్రబంధువు- స్వధర్మములేక క్షత్రియునకు బంధుమాత్రుఁడగువాఁడు. (ఇది నిందయందు వచ్చును)
క్షప-స. రేయి. సమా. క్షపాకరుఁడు- చంద్రుఁడు.
క్షపణకుఁడు-స. బౌద్ధమతస్థుఁడు.
క్షపణము-స. 1. అశుచిభావము. 2. సిగ్గులేనిది.
క్షమ-స. 1. ఓర్పు. 2. భూమి. క్రి. క్షమించు, క్షమియించు- ఓర్చు.
క్షమము-స. 1. యుక్తము. 2. చాలునది.
క్షముఁడు-స. 1. శక్తుఁడు. 2. హితుఁడు.
క్షయము-స. 1. అఱుఁదెవులు. 2. తగ్గుదల. 3. ప్రళయము. క్రి. క్షయించు.
క్షయ్యము-స. క్షీణింపఁదగినది.
క్షరము-స. 1. నాశముకాఁగలది. 2. నీళ్లు. 3. మేఘము.
క్షవథువు-స. 1. తుమ్ము. రూ. క్షవము. 2. దగ్గు.

## క్షా

క్షాంతము-స. ఓర్వఁబడినది.
క్షాంతి-స. ఓర్పు.
క్షాత్రము-స. క్షత్త్రధర్మము.
క్షామము-స. 1. కఱవు. 2. కృశము.
క్షారము-స. 1. ఉప్పు. 2. కారము. 3. గాజు. 4. బూడిద.
క్షాళనము-స. కడుగుట.

## క్షి

క్షితి-స. 1. భూమి. 2. ఉనికి. సమా. —ధరము- కొండ. —పతి- రాజు.
క్షిప్తము-స. 1. త్రోయఁబడినది. 2. వైవఁబడినది.
క్షిప్రము-స. శీఘ్రము.

## క్షీ

క్షీణము-స. క్షయించినది. క్రి. క్షీణించు.
క్షీరము-స. 1. పాలు. 2. నీళ్లు. సమా. క్షీరాబ్ధి- పాలసంద్రము. (ఇట్లే క్షీరోదము మొ.) క్షీరాశము- హంస. క్షీరోదకన్యాయము- నీళ్లను పాలను కలిసినట్లొక్కటిగా కలిసియుండు గుణము.

### క్షు

క్షుణ్ణము-స. పొడిచేయఁబడినది. (వి. సున్నము)
క్షుణ్ణుఁడు-స. వ్యుత్పన్నుఁడు.
క్షుతము-స. తుమ్ము.
క్షుత్తు-స. ఆఁకలి. [యగు ఆఁడుది.
క్షుద్ర-స. *1.* ఈఁగ. *2.* వేశ్య. *3.* అంగహీన
క్షుద్రము-స. అధమము. [లోభి. *4.* హింసకుఁడు.
క్షుద్రుఁడు-స. *1.* అధముఁడు. *2.* అల్పుఁడు. *3.*
క్షుధ-స. ఆఁకలి.
క్షుధితము-స. ఆఁకలిగొన్నది.
క్షుబ్ధము-స. కలఁతపెట్టఁబడినది. రూ. క్షుభితము.
క్షురము-స. మంగలికత్తి. రూ. క్షురిక.
క్షురి-స. మంగలి. [నీచము. *4.* పేద.
క్షుల్లకము-స. *1.* నత్తగుల్ల. *2.* అల్పము. *3.*

### క్షే

క్షేత్రము-స. *1.* వరిమడి. *2.* పెండ్లాము. *3.* శరీరము. *4.* ప్రసిద్ధపుణ్యస్థలము. సమా. క్షేత్రజుఁడు- పెద్దల యనుమతిచే తనభార్యకు మఱఁదిలోనగువారివలనఁ గలిగిన కొడుకు. —జ్ఞుఁడు-*1.* జీవుఁడు. *2.* నేర్పరి. క్షేత్రాజీవుఁడు-దున్నుకొనిబ్రదుకువాఁడు. క్షేత్రియుఁడు - పరదారరతుఁడు. [*4.* ప్రేరణము.
క్షేపము-స. *1.* చిమ్ముట. *2.* త్రుళ్లు. *3.* దూఱు.
క్షేమము-స. *1.* కలిగినది చెడకుండుట. *2.* శుభము. సమా. క్షేమంకరుఁడు- మేలుచేయువాఁడు. రూ. క్షేమకరుఁడు.

### క్షో

క్షోణి-స. *1* భూమి. *2.* బ్రహ్మచారిముంజమొలత్రాడు.
క్షోదము-స. *1.* నూఱుట. *2.* పొడుము.
క్షోభము-స. *1.* కలఁత. *2.* దోఁపుడు. క్రి. క్షోభించు.

### క్షౌ

క్షౌద్రము-స. *1.* తేనె. *2.* నీళ్లు. [*3.* తెల్లచీర.
క్షౌమము-స. *1.* నారచీర. *2.* కుందేటిత్రుప్పుచీర.
క్షౌరము-స. మంగలిపని.
క్షౌరకుఁడు-స. మంగలి.

### క్ష్మ

క్ష్మ-స. భూమి. (వ్యు. భారమునోర్చునది.) సమా. —జ- సీత. (ఇట్లే క్ష్మాపుత్రి మొ.)—జము- చెట్టు.—భృత్తు- *1.* కొండ. *2.* రాజు. [ము.
క్ష్వేద-స. సింహనాదము. రూ. క్ష్వేడితము, క్ష్వేళ
క్ష్వేడము-స. *1.* చెవుఁడు. *2.* మ్రోఁత. *3.* విషము. రూ. క్ష్వేళము.
క్ష్వేళి-స. పాము. సమా.—భుక్కు- నెమలి.

### ఖ

ఖంగుఖంగు-తె. ఆయుధములొరసికొను శబ్దము.
ఖంజము-స. కుంటిది.
ఖంజనము-స. కాటుకపిట్ట. రూ. ఖంజరీటము.
ఖండనము-స. నఱకుడు.
ఖండము-స. *1.* తునుక. *2.* కలకండ. క్రి. ఖండించు. సమా. ఖండపరశువు-*1.* శివుఁడు. *2.* పరశురాముఁడు. *3.* రాహువు. —శర్కర- కలకండ.
ఖండిక-తె. చిన్నపల్లె. రూ. ఖండ్రిక.
ఖండిత-స. నాయకుఁడు రేయి మఱొకతెయింటికేగి యా చిన్నెలతో రాఁగా చూచి కోపమునొందిన నాయిక.
ఖండితము-స. నఱకఁబడినది.
ఖంబు-స. *1.* ఆకాశము. *2.* స్వర్గము. *3.* అభావము. *4.* సుఖము. *5.* సున్న.
ఖగము-స. *1.* పక్షి. *2.* బాణము. *3.* గ్రహము. (వ్యు. ఆకసమునఁబోవునది) డు. *4.* సూర్యుఁడు. *5.* వేలుపు. సమా. ఖగేశ్వరుఁడు-గరుత్మంతుఁడు.
ఖచరము-స. *1.* పక్షి. *2.* మేఘము. *3.* గాలి.
ఖచరుఁడు-*1.* దేవుఁడు. *2.* సూర్యుఁడు.
ఖచించు-స. చెక్కు, పొదుగు. రూ. ఖచియించు.
ఖచితము-స. చెక్కఁబడినది.
ఖజానా-హిం. ధనాగారము.
ఖటిక-స. బలపము. రూ. ఖటిని.
ఖట్టి-స. పాడె. రూ. ఖట్టిక.
ఖట్టిక-స. *1.* గద్దియ. *2.* పాడె.
ఖట్టికుఁడు-స. వేఁటకాఁడు.

ఖట్వ-స. మంచము. సమా. ఖట్వాంగము - మంచి
ఖడ్గము-స. 1.కత్తి.2.ఖడ్గమృగము. [పుఁగోడు.
ఖడ్గి-స. 1. ఖడ్గమృగము. 2. కత్తిగలవాఁడు.
ఖతమాలము-స. 1. మబ్బు. 2. పొగ.
ఖతిలకము-స. సూర్యుఁడు.
ఖత్తు-హిం. పద్ధతి. [సూర్యుఁడు.
ఖద్యోతము-స. 1. మిడుగురుఁబురువు. 2. డు.
ఖనకము-స. 1.ఎలుక. 2.పందికొక్కు.డు. 3.త్రవ్వె
డువాఁడు. 4. కన్నపుదొంగ. 5. ఉప్పరవాఁడు.

ఖని-స.రత్నాదులుపుట్టుచోటు.రూ.ఖాని.(వి. గని.)
ఖనిత్రము-స. 1. గడ్డపాఱ. 2. గుద్దలి.
ఖనిత్రి-స. పాఱ. [తిను వ్రతము కలవాఁడు.
ఖపుటుఁడు-స. అన్నమును చేతిలోనే యుంచుకొని
ఖర-స. అఱువదింట నిరువదియైదవసంవత్సరము.
ఖరము-స. 1. గాడిద. 2. వాఁడిమి. 3. వేడిమి.
సమా. ఖరకరుఁడు-సూర్యుఁడు.
ఖరణసుఁడు-స. గద్దముక్కుగలవాఁడు.
ఖరువు-స. 1. గర్వము. 2. గుఱ్ఱము. 3. పల్లు.
4. శివుఁడు.

ఖర్చు-హిం. వ్యయము.
ఖర్జువు-స. 1. తీఁట. 2. చిట్టీఁతచెట్టు.
ఖర్జూరము-స. 1.వెండి. 2.తేలు. 3.పేరీఁడుచెట్టు.
ఖర్పరము-స. 1.భిక్షాపాత్రము. 2.పుఱ్ఱె(వి.కప్పెర.)
ఖర్వము-స. 1.వేయికోట్లు. 2.పొట్టి. 3.అధమము.
ఖలతి-స. బట్టతలవాఁడు.
ఖలము-స. 1. చోటు. 2. నేల. 3. పాపము. 4.
కళ్లము. 5.అధమము. 6.క్రూరము. 7.నీచము.
డు. 1. అధముఁడు. 2.నీచుఁడు. 3.క్రూరుఁడు.
ఖలినము-స. కళ్లెము. రూ. ఖలీనము.
ఖల్వాటుఁడు-స. బట్టతలవాఁడు. రూ. ఖర్వాటుఁడు.
ఖష్ఖసము-స. గసగసాచెట్టు.

## ఖా

ఖాటి-స. పాడె. రూ. ఖట్టి, ఖట్టిక.
ఖాణము-హిం. గుఱ్ఱపుతిండి.
ఖాతకము-స. అగడ్త. రూ. ఖాతిక.
ఖాతము-స. కోనేఱు.
ఖాదనము-స. 1. తినుట. 2. తిండి. 3. పల్లు.
ఖాదిరము-స. కవిరియుండ.
ఖాద్యము-స. తినఁదగినది.
ఖాయము-హిం. స్థిరము.
ఖాలీ-హిం. వట్టి.

## ఖి

ఖిన్నము-స. ఖేదము నొందినది.
ఖిలము-స. 1. దున్ననిది. 2. పాడైనది.
ఖిలీభవించు-స. చెడు.

## ఖు

ఖురణసుఁడు-స. బుఱ్ఱముక్కువాఁడు.
ఖురము-స. గొరిజ.
ఖురముఖము-స. బూరగొమ్ము.
ఖురళి-స. సాము. రూ. ఖురళిక.
ఖురాలకము-స. ఇనుపబాణము.

## ఖే

ఖేంఖాణము-స. గుఱ్ఱము. [రించువాఁడు)
ఖేచరుఁడు-స. వేలుపు. (వ్యు. ఆకసమున సంచ
ఖేటకము-స. డాలు. (వి. కేడెము)
ఖేటము-స. పంటకాఁపు లుండెడు పల్లె.
ఖేదము-స. శోకము.
ఖేయము-స. అగడ్త.
ఖేల-స. ఆట, క్రీడ. రూ. ఖేలనము.

## ఖో

ఖోడుఁడు-స. కుంటివాఁడు.
ఖోలకము-స. 1. కుల్లాయి. 2. పుట్ట.

## ఖ్యా

ఖ్యాతము-స. వాసికెక్కినది.
ఖ్యాతి-స. ప్రసిద్ధి, వాసి.

## గ

గంగ-తె. 1.పూజ్యము. 2.పెద్ద. సమా.—గోవు-
పూజ్యమైనగోవు.—డోలు-పసులకు మెడక్రిం
ద వ్రేలాడు తోలు, సాన్న.—మైలావు-నలుపు
పసుపుగలిసిన వన్నెగల ఆవు.గంగాళము-నీళ్ల
కొప్పెర.

స. ఒక పుణ్యనది. (పంచగంగలు: కావేరి, తుంగభద్ర, కృష్ణ, గోదావరి, గంగ.) సమా. గంగాధరుఁడు-శివుఁడు.
గంగి-తె. 1. పూజ్యము. 2. యజ్ఞియము. సమా. గంగెద్దు- అచ్చువేసివిడువఁగా దాసరులుతెచ్చి ఆడించెడియెద్దు. రూ. గంగిరెద్దు, గంగిటెద్దు.
గంజ-స. 1. కల్లంగడియిల్లు. 2. గని.
గంజము-స. బండారము. [జము.
గంజాయి-హిం. కైపుపుట్టించు ఒక చెట్టుఆకు, కళం
గంజి-తె. అన్నరసము.
గంజు-హిం. బజారు.
గంట-తె. గడ్డిదుబ్బు. వి. (ఘంట) 1. వాయించు గంట. 2. అఱువదినిముసములకాలము.
గంటము-తె. తాటాకులపై వ్రాయు సాధనము.
గంటి-తె. 1. గాయము. 2. దుఃఖము.
గంటు-తె. 1. గాయముచేయు. 2. గనుపు. 3. రూకలమూట. 4. వెండ్రుకల ముడి. 5. ముడి.
గంటువెట్టు-తె. కోపముచే మొగము ముడుచు.
గంటె-తె. 1. గరిటె. 2. సజ్జపైరు.
గంట్లము-తె. గర్భిణుల కోరిక, దోహదము.
గండ-తె. మ్రొక్కుబడి. (గండదీపము మొ.)
గండఁడు-క. శూరుఁడు. సమా. గండరగండఁడు- శూరులలోశూరుఁడు. [విఘ్నము.
గండకము-స. 1. ఖడ్గమృగము. 2. భేదము. 3.
గండగొడ్డలి-తె. పరశువు. సమా. —తాలుపు-పరశురాముఁడు. చూ. గండ్ర.
గండపెండరము-తె. (గండఁడు + పెండరము) శూరులు బిరుదుగా కాల ధరించు అందె. రూ. గండపెండియరము, గండపెండారము, గండపెండేరము.
గండభేరుండము-స. ఏనుఁగులను కాలఁదన్నుకొని పోవు ఒకపక్షి. (మృగవిశేషమని కొందఱు)
గండము-తె. 1. ఆపద. 2. వి. (కంఠము) గొంతు. సమా. గండకత్తెర- మెడకత్తిరించు కత్తెర. స. 1. ఏనుఁగుచెక్కిలి. 2. చెక్కిలి. 3. ఖడ్గమృగము. 4. గుండ్రాయి. సమా. గండశిల- పెద్దగుండు. —మాల- మెడచుట్టును గడ్డలులేచు వ్యాధి.
గండరించు-తె. 1. పుట్టు. 2. పుట్టించు.
గండరులు-తె. తునుకలు.
గండవడము-వి. (కాండపటము) తెర.
గండారు-తె. చెఱసాల.
గండి-తె. 1. బిలము. 2. రంధ్రము. 3. సందు. రూ. గండిక. సమా. —దొంగ-కన్నపుదొంగ.
గండు-తె. 1. పౌరుషము. 2. బలము. 3. పశుపక్ష్యాదులందు మగది. క్రి. గండడఁగు-1. పౌరుషహీనమగు. 2. చచ్చు. గండాడు-రమించు.
గండూపదము-స. ఎఱ్ఱ.
గండూషము-స. 1. పుక్కిలింత. 2. పుడిసిలి. 3. తొండముచివర. క్రి. గండూషించు.
గండె-తె. ఒకతెగ పెద్దచేఁప. [రూ. గండోలి.
గండోలి-స. 1. ఎఱ్ఱతుమ్మెద. 2. కఱుఁదురీఁగ.
గండ్ర-తె. 1. ధృష్టుఁడు. 2. పెద్దది. (గండ్రచీమ, గండ్రగొడ్డలి మొ.) 3. తునుక.
గండ్రించు-తె. ఖండించు.
గండ్రికలు-తె. ఖండములు.
గంత-వి. (కంథ) 1. ప్రాఁతగుడ్డలను చేర్చికుట్టిన బొంత. 2. ఎద్దులపై వేయు బరువు. స. పోవువాఁడు.
గంతవ్యుఁడు-స. పోఁదగినవాఁడు.
గంతు-తె. 1. దుముకు. 2. దుముకుట.
గంతుకొను-తె. 1. దుముకు. 2. చచ్చు.
గందము-వి. (గంధము) చందనము. సమా. గందపట్టె-తలుపుపలకల కడ్డముగావేయు కొయ్య. —పుఁగొండ- మలయపర్వతము. —మ్రాను- శ్రీచందనవృక్షము. —పొడి - సుగంధ ద్రవ్యములుచేర్చి చేసిన పొడి. రూ. గందవడి.
గందరగోళము-వి. (గంధర్వకోలాహలము) పెద్ద కలకలము.
గంధకము-స. ఒక పసుపురంగుగల ఖనిజవస్తువు.
గంధనము-స. 1. ఎఱిఁగించుట. 2. నలుగిడుట. 3. నొప్పించుట. 4. వెలిఁగించుట.
గంధము-స. 1. వాసన. 2. గంధకము. 3. గర్వము. 4. సంబంధము. సమా. గంధగజము - మదపుటేనుఁగు. —ఫలి- 1. ప్రేంకణపుచెట్టు. 2. సంపంగిమొగ్గ. రూ. గంధఫలి.

—మాదనము- 1. ఒక పర్వతము. 2. ఒక కోఁతి. 3. మగతుమ్మెద. 4. మదపుటేనుఁగు. —మూషి-చుంచు. —మృగము-పునుఁగుపిల్లి. —వతి-1. కల్లు. 2. వ్యాసునితల్లి. —వహ- 1. ముక్కు. 2. డు. గాలి.

గంధర్వము-స. 1.ఒకానొకమృగము.2.గుఱ్ఱము. 3. మగకోయిల. 4. డు. దేవతలలో ఒకతెగ. 5. పాటపాడువాఁడు. సమా. గంధర్వకోలాహలము-గుంపులో వారివారి యిష్టమువచ్చిన పని వారు చేయుచుండఁగా ఏర్పడు కలకలము. —హస్తకము-ఆముదపుచెట్టు.

గంధిలము-స. ముదినక్క, వటుడు. [దోంము.

గంప-తె. వెదురుబద్దలతో అల్లిన పెద్దపుటిక, కం

గంబుర-వి. (కర్పూరము) కప్పురము. రూ. గంబురము, గంబురా, గంబూర.

గంభీరము-స. లోఁతుగలది. రూ. గభీరము, సమా. గంభీరవేది - ఎంతబాధపెట్టినసులక్ష్య పెట్టని మదపుటేనుఁగు.

గంభీరిమ-స. గంభీరభావము. రూ. గభీరిమ.

గగనము-తె. దుర్లభము. స. ఆకాశము. (వ్యు. దేవతలు, పక్షులు పోవు మార్గము.)

గగురు-తె. భయహర్షాదులచే మేనివెండ్రుకలు నిక్కవొడుచుట, రోమాంచము. రూ.గగురుపు, గగ్గురు. క్రి. గగురుపొడుచు. కృ. గగురుపొడుపు, గగురుపాటు.

గగ్గు-తె. 1. సంకోచించు. 2. వి. (గద్గదిక) సంతోషాదులచేఁగలుగు గొంతడుపు.

గగ్గులు-తె. ధాన్యమురాల్చినకంకులు.

గగ్గులకాడు-తె. 1. ధాన్యమురాల్చిన కంకుల సమూహము. 2. నిస్సారము.

గగ్గోలు-తె. కలఁత. క్రి. గగ్గోలువడు.

గచ్చ-తె. ఒకానొక ముండ్లతీఁగ. రూ. గ్రచ్చ.

గచ్చు-తె. 1. కాంతి. 2. పూఁత. 3.గారపూఁత. 4. వర్ణలోపముగాని, పదలోపముగాని యైనది. సమా. గచ్చులాఁడి - బయటికి యోగ్యురాలి వలె నటించు ఆఁడుది.

గచ్చుకొను-తె. పట్టుకొను.

గచ్చువిచ్చగు-తె. వైకల్యమగు.

గజ-వి. (గజము) పెద్ద. సమా.—దొంగ-మేటి దొంగ.—నిమ్మ-పొడవు కాయలుగల ఒకతెగ నిమ్మ, లకుచము.

గజగజ-తె. వడఁకుటయందగు ననుకరణము.

గజిబిజి-తె. 1.కలఁత.2.సందడి.క్రి.గజిబిజించు.

గజము-తె. తుపాకికి మందుదట్టించుసలాక.

గజము-స. 1. ఏనుఁగు. (వ్యు. మదించునది.) (దీని భేదములు మూఁడు: భద్రము. మందము, మృగము) 2. మూఁడడుగులకొలఁది. సమా. గజకర్ణము - ఏనుఁగుచెవివంటి విసనకఱ్ఱ.—నిమీలనము-కపటము.—యాన-1. ఏనుఁగునడకవంటి నడకగల ఆఁడుది. 2. ఆఁడుది. —రిపువు-సింహము. (ఇట్లే గజవైరి మొ.) గజాననుఁడు - వినాయకుఁడు, ఏనుఁగుమోముసామి.

గజ్జ-తె. తొడసందు, వంక్షణము.

గజ్జి-వి. (కచ్ఛువు) తీఁటకుఱుపులు.

గజ్జియ-తె. కింకిణి. రూ. గజ్జె.

గజ్జు-తె. మదము.

గజ్జూరము-వి. (ఖర్జూరము) పేరీఁదుచెట్టు.

గట్టన-వి. (ఘట్టనము) గట్టించుట.

గట్టి-తె. 1. దృఢము. 2.కఠినము. క్రి. గట్టించు. సమా. గట్టివాఁడు - సమర్థుఁడు.—వాయి - గయ్యాళి. [ధూర్తురాలు. రూ. గట్టివా.

గట్టివ-తె. (గట్టి+వాయి) 1. ధూర్తుఁడు. 2.

గట్టు-వి. (ఘట్టము) 1. తీరము. 2. కొండ. సమా. —త్రిమ్మరి-కోఁతి. —తాలుపు-విష్ణువు, నగధరుఁడు. —దాయ-ఇంద్రుఁడు, నగవైరి. —రాచూలి- పార్వతి, గిరిజ. రూ. గట్రాచూలి. —ఱేఁడు-హిమవంతుఁడు,నగరాజు. —వాలు-సైరంధ్రి. —విలుకాఁడు- శివుఁడు. రూ. —విలుతుఁడు.

గడ-తె. 1. నిడుపాటికోల. 2. సమూహము. 3. ఓడకంబము. 4. కంబము. సమా. —సాదన-సాము. [క్రి. గడగడలాడు.

గడగడ-తె. వడఁకుటయందగు ననుకరణము.

గడన-తె. సంపాదనము. క్రి.గడించు.వి. (గణన) 1. ఎన్నిక. 2. స్తోత్రము. సమా. —కత్తె-

వేశ్య. (ఇట్లే గడనపడఁతి మొ.)
గడప-చూ. కడప.
గడబిడ-హిం. అల్లరి.
గడి-తె. ఎల్ల, సీమ. సమా. గడిత్రాడు - గడి కాళ్లవేయుపలుపు. గడిదేఱు - సమర్థుఁడగు. గడిదొంగ - ఒళవెఱిఁగినదొంగ. గడిపోతు - ఆఁబోతు. [కాలుచేర్చి లంకెవేయు.
గడికాళ్లవేయు-తె. రెండేసిఅవులను ఒక్కొక్క
గడితము-తె. 1. తఱుచు. 2. ముదుగు.
గడియ-వి. (ఘటిక) 1. ఇరువదినాలుగు నిమిషముల కాలము. 2. గడెమ్రాను. రూ. గడె.
గడియారము-వి. (ఘటికారము) కాలపరిమాణమును దెలుపు యంత్రము.
గడువు-తె. నిర్ణయకాలము.
గడుసు-తె. 1. కాఠిన్యము. 2. ధైర్యము. 3. అసాధ్యము. సమా. గడుసరి-1. అసాధ్యుఁడు. 2. ధీరుఁడు. 3. కఠినుఁడు.
గడ్డ-తె. 1. దుంప. 2. వ్రణము. 3. మంటిపెల్ల. 4. ద్వీపము. సమా.—పలుగు-గుంటకపలుగు. —పాఱ-నేలపెల్లగించుసాధనము, ఖనిత్రము. —ప్రొయ్యి-గడ్డలేర్పఱచిన ప్రొయ్యి.
గడ్డము-తె. 1. చిబుకము. 2. శ్మశ్రువు.
గడ్డి-తె. కసవు. సమా. —బొద్దు-చుట్టకుదురు.
గడ్డు-తె. 1. అసాధ్యము. 2. మిక్కిలి.
గడ్డుకొను-తె. అతిశయించు.
గణకుఁడు-స. 1. జోస్యుఁడు. 2. కరణమువాఁడు.
గణగణ-తె. ఘంటాధ్వనియందగు ననుకరణము.
గణన-స. ఎన్నిక. రూ. గణనము.
గణనీయము-స. ఎన్నఁదగినది.
గణము-స. 1. సమూహము. 2. ప్రమథులసమూహము. 3. ఇరువదేడురథములు అన్నియేనుఁగులు ఎనుబదియొక్కగుఱ్ఱములు నూటముప్పదియేవురు కాల్వురును గల సేన. సమా. గణపతి-వినాయకుఁడు.(ఇట్లే గణేశుఁడు మొ.) [దించు.
గణించు-స. 1. ఎంచు. 2. లక్ష్యపెట్టు. 3. సంపా
గణిక-స. 1. వేశ్య. 2. ఆఁడేనుఁగు.
గణితము-స. 1. ఎంచఁబడినది. 2. అంకవిద్య.
గణితవ్యము-స. ఎంచఁదగినది. రూ. గణేయము.

గణిల్లు-తె. ఎద్దు ఱంకెవేయుటయందగు ధ్వని. రూ. ఖణిల్లు. [3. లక్ష్యము. క్రి. గణుతించు.
గణుతి-స. (వి. గణన) 1. ఎన్నిక. 2. స్తోత్రము.
గణెము-తె. వేషధారులు ధరించు లక్కబొమ్మ.
గణ్యుఁడు-స. ఎంచఁదగినవాఁడు.
గతము-స. 1. పోక. 2. పోయినది, 3. తెలియఁబడినది. క్రి. గతపడు-1. కడచు. 2. చచ్చు.
గతి-స. 1. పోక. 2. త్రోవ. 3. ఉపాయము. 4. ఆధారము. 5. విధము.
గతించు-స. 1. కడచు. 2. చచ్చు.
గతుకు-తె. 1. (కుక్కవలె లబుకులబుకుమని) తిను. 2. తినుట. రూ. గదుకు. (ఇది నిందయందే వచ్చును.)
గత్త-తె. ఎరువు. రూ. గత్తము.
గత్తర-హిం. గాబరా.
గత్తు-తె. మూత్రపువాసన.
గద-స. 1. ఒక ఆయుధము. (వి. గుదియ.) 2. ము. రోగము. సమా. గదాధరుఁడు-విష్ణువు.
గది-తె. ఇంటిలోపలి యఱ. స. 1. గదను ధరించినవాఁడు. 2. రోగి.
గదుకు-చూ. గతుకు. [గదమాయించు.
గదుము-తె. గద్దించు. రూ. గదుముకొను, గదుచు,
గదురు-తె. 1. గద్దించు. 2. చెడుకంపు.
గద్గదము-స. డగ్గుత్తికపడినది.
గద్గదిక-స. డగ్గుత్తిక.
గద్ద-వి. (గృధ్రము) గరుడజాతిపక్షి.
గద్దఱి-తె. దిట్టతనముకలది. (పుం. గద్దఱికాఁడు.)
గద్దించు-తె. కోపముతో అదలించు. [రూ. గద్దె.
గద్దియ-తె. 1. ఉన్నతపీఠము. 2. సింహాసనము.
గద్దువ-తె. గడ్డము.
గద్దె-తె. 1. గద్దియ. 2. వి. (గద్యాణము) వరా. 3. వి. (గద్యము) 1. సోదె. 2. వచనము.
గద్దెపొంకము-తె. పరువునకుఁ దగిన మాట.
గద్యము-స. వచనము. (వి. గద్దె)
గనగన-తె. తపించుటయందును మండుటయందును నగు అనుకరణము.
గనప-తె. పెద్ద.
గనయము-తె. 1. పోకముడి. 2. వింటికొప్పు.

గని-వి. (ఖని) 1. లోహాదులు పుట్టు చోటు. 2. బిలము.
గనిమ-తె. మడికి చుట్టు నేర్పఱచిన చిన్న కట్ట.
గనియ-తె. ఉసుక. రూ. గనె.
గనీబు-హిం. బీద.
గనుపు-చూ. కనుపు. [గన్నేరు.
గన్నెరు-తె. కరవీరము అను పూఁజెట్టు. రూ.
గబీలు-తె. 1. ఉన్నట్టుండి. 2. ఉలికిపాటు.
గబ్బాటు-తె. 1. కలఁత. 2. వెలతక్కువైనది.
గబ్బి-తె. గర్వముగలవాఁడు. [గబ్బిలాయి.
గబ్బిడాయి-తె. తైలపాయిక. రూ. గబ్బిలము,
గబ్బిలి-తె. పిడికిలి.
గబ్బు-తె. 1. (మునుపు) వాసన. 2. (ఇప్పుడు) దుర్గంధము. 3. గర్వము. 4. మదము. సమా. —చీఁకటి-గాఢాంధకారము.—చెంపమెకము - ఏనుఁగు.
గభస్తి-స. 1. అగ్నిభార్య. 2. సూర్యకిరణము. 3. సూర్యుఁడు.
గభీరము-చూ. గంభీరము.
గభీరిమ-చూ. గంభీరిమ.
గమకము-తె. 1. యత్నము. క్రి. గమకించు. 2. అధికము. 3. మనోజ్ఞము.
స. సంగీతమందు స్వరవిన్యాసము.
గమగమ-తె. ఇంపైన వాసనయందగు ననుకరణము. క్రి. గమగమించు-గమాయించు.
గమనము-స. 1. పోక. 2. ప్రయాణము. 3. తలఁపు. క్రి. గమనించు-1. పోవు. 2. తలఁచు.
గమనిక-తె. విధము.
స. నడపుట.
గమము-స. 1. పోక. 2. ప్రయాణము. 3. త్రోవ. క్రి. గమించు-పోవు. రూ. గమియించు.
గమి-తె. 1. సమూహము. 2. తఱచు. సమా. —కత్తె-అంతఃపురమునందు కావలియుండునది. —కాఁడు-1. అధికారి. 2. సేనాపతి. క్రి. గమికొను-గుంపువడు.
గమ్మ-తె. వాసనకొట్టుటయందగు ననుకరణము.
గమ్యము-స. పొందఁదగినది. సమా. గమ్యస్థానము-చేరఁదగినచోటు, సంకేతస్థలము.
గయాళము-తె. ధిక్కారపుమాట. రూ. గయ్యాళము. క్రి. గయాళించు, గయ్యాళించు.
గయాళి-తె. (గయాళము+ఇ) ధిక్కరించి మాటాడునది. రూ. గయ్యాళి.
గర-తె. గడ్డ, ముద్ద. క్రి. గరకట్టు, గరకొను, గరవడు-ముద్దకట్టు.
గరగ-వి. (కరక) 1. నీరుత్రాగుట కుపయోగించు చిన్నపాత్రము. 2. చిన్నకుండ. సమా. గరగడ-(గరగ+గడ) లశిగ.
గరగర-తె. నిర్మలము. (గరగరిక. 1. నైర్మల్యము. 2. అందము)
గఱగఱ-తె. నమలుటయందగుధ్వని. క్రి. గఱగఱలాడు, గఱగఱ మ్రోఁగు.
గఱగొఱ-తె. తక్కువ.
గరము-స. విషము. రూ. గరళము.
గరాసు-వి. (కర్కశుఁడు) దుష్టుఁడు.
గఱి-వి. (గరుత్) 1. ఱెక్క. 2. బాణపుఱెక్క.
గరిఁటె-తె. ఇనుముతోఁగాని ఇత్తడితోఁగాని చేసిన తెడ్డు. రూ. గంటె.
గఱిక-తె. ఒకతెగ లేఁగకసవు. దూర్వ. సమా. —చెక్క-పచ్చికతోడిమట్టిపెల్ల, కరుడు.—చిప్ప-ముత్తెపుఁజిప్ప.
గరిడి-తె. 1. సాము. 2. సాముకూటము. 3. చోటు. 4. సమీపము. సమా.—ముచ్చు-మంచివానివలెఁ జేరి సమయముచూచి దొంగిలించువాఁడు.
గరిడియ-వి. (కరండిక) బుట్ట.
గరిత-వి. (గృహస్థ) 1. ఇల్లాలు. 2. పతివ్రత.
గరిమ-స. గొప్పతనము. రూ. గరిమము.
గరిమిడికొక్కు-తె. పందికొక్కు.
గరివించు-వి. గర్వించు.
గరిష్ఠము-స. మిక్కిలి గురువైనది.
గరిసె-తె. 1. ధాన్యముంచుకొట్టు. 2. పదిపుట్లు. సమా. —బావి-మెల్లెలతోనల్లిన బొట్టలుదించిన బావి.
గరు-తె. రోమాంచము. సమా.—పాటు - గగుర్పొడుపు. క్రి. గరుపాఱు.
గఱుకు-తె. కొడవలిలోనగువాని కక్కు, కఱకు.

గరుటామంతుఁడు-వి. (గరుత్మంతుఁడు) పక్షిరాజు. రూ. గరుటాలమంతుఁడు. [విష్ణువు.
గరుడి-వి. (గరుడుఁడు) పక్షిరాజు. సమా.—రౌతు-
గరుడుఁడు-స. గరుత్మంతుఁడు. సమా. గరుడగంబము-కోవెలలోనుంచు దీపస్తంభము.—ధ్వజుఁడు-విష్ణువు. —పచ్చ-మరకతము. గరుడాగ్రజుఁడు-అనూరుఁడు.
గరుత్తు-స. ఱెక్క. సమా. గరుత్మంతము-పక్షి. గరుత్మంతుఁడు-గరుడుఁడు. [గరువు, గరుసు.
గరుము-తె. గులకఱాలచే గట్టియైనది (నేల). రూ.
గఱువ-తె. పెద్ద.
గరువము-వి. (గర్వము) 1. అహంభావము. 2. విరివి. (గౌరవము) మర్యాద. రూ. గారవము.
గరువు-తె. 1. చెంప. 2. గరుము.
గరుసు-తె. 1. మేర. 2. తోలు. 3. గరుము.
గర్జ-స. 1. మేఘధ్వని. 2. సింహనాదము.
గర్జనము-స. 1. మేఘధ్వని. 2. కోపము. క్రి. గర్జించు.
గర్జితము-స. 1. మేఘధ్వని. 2. మదపుటేనుఁగు.
గర్తము-స. 1. పల్లము. 2. పిఱుఁదులమీఁదిగుంత.
గర్దభము-స. 1. తెల్లకలువ. 2. గాడిద. (వ్యు. శబ్దించునది.) [పూసరము.
గర్భకము-స. వెండ్రుకలలోపల ముడుచుకొన్న
గర్భము-స. 1. కడుపు. 2. కడుపులోనిపిండము. 3. బిడ్డ. 4. ఒకతెగ కవిత్వము. సమా. గర్భాగారము-లోపలిగది. గర్భాశయము-మావి.
గర్భిణి-స. చూలాలు, అంతర్వత్ని.
గర్వము-స. 1. అహంకారము. 2. మదము. (వి. గరువము) క్రి. గర్వించు.
గర్వి-స. గర్వము గలవాఁడు.
గర్వితుఁడు-స. గర్వించినవాఁడు.
గర్హణము-స. నింద. క్రి. గర్హించు. [వాఁడు.
గర్హ్యుఁడు-స. 1. అధముఁడు. 2. నిందింపఁదగిన
గలఁతియ-వి. (గళంతిక) గిండిచెంబు. [ధ్వని.
గలగల-తె. కదలుట, రాలుట, మ్రోయుటయందగు
గలతరించు-తె. జల్లుమను, జలదరించు.
గలబ-హిం. కలకలము.
గలిబిలి-తె. సందడి.
గల్ల-తె. 1. బొల్ల. 2. మాదిగతో లూరవేయుచట్టి.
గల్లము-స. చెక్కిలి.
గల్లు-తె. భూషణములు మ్రోఁగుటయందగుధ్వని.
గవఁను-తె. దుర్గపురద్వారము. రూ. గవను.
గవయము-స. గురుపోతు.
గవరన-వి. (గౌరము) కొద్దిపాటి ఎఱుపు.
గవాక్షము-స. కిటికీ (వ్యు. కిరణవ్యాపారముగలది.)
గవి-తె. 1. గుహ. 2. పల్లము. స. ఆవు.
గవుండ్లు-తె. కల్లుగీచి జీవించు ఒక జాతి.
గవేషణ-స. వెదకుట. క్రి. గవేషించు.
గవ్యము-స. ఆవుపాలు లోనగునది. (పంచగవ్యములు: పాలు, పెరుగు, నేయి, పంచితము, పేఁడ)
గవ్యూతి-స. రెండుకోసుల కొలఁది. [వెలిగారము.
గవ్వ-తె. చిన్నజాతిశంఖము. సమా. —చౌకము-
గశకము-స. గసి.
గస-తె. ఉబ్బసము. [ఒక తెగ తెల్లగింజల చెట్టు.
గసగస-వి. (ఖస్ఖసము) కూరల కుపయోగించు
గసి-తె. 1. మేకు. 2. అడుగున నిలిచిన మురికి.
గసిక-తె. 1. త్రవ్వుటకనువుగా చెక్కినకొయ్య. 2. సలాక. 3. బాణము.
గసిబిసి-తె. గజిబిజి.
గస్తు-హిం. రక్షకభటులు ఊరుతిరిగి కాచు కావలి.
గహనము-స. 1. అడవి. 2. గుహ. 3. దుఃఖము. 4. ఎఱుఁగరానిది. 5. చొరరానిది.
గహ్వరము-స. 1. అడవి. 2. గుహ. 3. పొదరిల్లు.
గహ్వరి-స. భూమి.
గళంతిక-స. గిండిచెంబు. (వి. గలఁతియ)
గళనము-స. జాఱుట. [ల.—శుండిక-చిఱునాలుక.
గళము-స. కుత్తుక. సమా. గళగండము-గండమా
గళితము-స. జాఱినది.
గళ్ల-చూ. కళ్ల.
గళ్లము-తె. పాలమీఁగడవంటి లేఁతకొబ్బెర.

## గా

గాంగుఁడు-స. 1. కుమారస్వామి. 2. భీష్ముఁడు రూ. గాంగేయుఁడు.

గాంగేయము-స. బంగారు. [గాండీవము.
గాండివము-స. 1. అర్జునుని విల్లు. 2. విల్లు. రూ.
గాండివి-స. అర్జునుఁడు. రూ. గాండీవి.
గాంౘ్రించు-తె. (మొగము) ఉబ్బు. [జాతి.
గాండ్ల-తె. నూనెయాడి అమ్ముకొని జీవించు ఒక
గాంధర్వము-స. 1. కన్యావరులు పరస్పరేచ్ఛచే చేసికొను వివాహము. 2. దినమునందు ఏడవ భాగము. [2. సిందూరము. 3. ఒకదేశము.
గాంధారము-స. 1. సప్తస్వరములలో మూఁడవది.
గాంధారి-స. 1. గంజాయి.2.ధృతరాష్ట్రునిభార్య.
గాంభీర్యము-స. గంభీరభావము.
గాఁడి-స.1.నిడుపుగా ఏర్పఱచినపల్లము.2.పసులఁ గట్టుచోట కసవు వేయుటకు పలకలు లోనగు వానితో నేర్పఱచినచోటు. 3. పసులు నీరు త్రాగుటకు ఱాతితోఁగట్టిన తొట్టి.
గాఁడు-తె. కామమదము.
గాగర-హిం. పావడ. రూ. గాగరా.
గాజు-వి. (కాచము) 1. ఒక దినుసు మన్ను. 2. ఆమన్నుతో చేసిన వలయము. సమా. గాజుప్పు-ఒకదినుసు ఉప్పు. గాజులవాఁడు-గాజులమ్ము బలిజ. క్రి. గాజువాఱు-కాంతి హీనమగు. [బొట్టు. రూ. గాదె.
గాజె-తె. మట్టియొఱలచే నేర్పఱచిన ధాన్యపు
గాటము-వి. (గాఢము) అధికము.
గాటు-వి. (కటువు) కారము.
గాడి-హిం. బండి. రూ. గాడీ.
గాడిద-తె. ఖరము, గాలిగాఁడు. రూ. గాడ్ద. సమా. —కాళ్లవాఁడు- ముట్టుమోఁకాళ్లవాఁడు, సంజ్ఞాపు. —పులి - దుమ్ములగొండి, కొర్నవ గండు.
గాడుపు-తె. గాలి. రూ. గాడ్పు. సమా. —చూలి-1. హనుమ. 2. భీముఁడు. (ఇశ్లే గాడుపు పట్టి, —కొడుకు మొ.) —మేపరి-సర్పము, పవనాశనము. —సంగడీఁడు-అగ్ని, వాయు సఖుఁడు.
గాఢము-స. పెల్లు. (వి. గాటము)
గాణ-వి. (గాయన) 1.పాటకాఁడు.రూ.గాణుఁడు. 2. పాటకత్తె. రూ. గాణీ.
గాణిక్యము-స. గణికల సమూహము.
గాణేయము-స. గణనీయము.
గాత-వి. (ఘాతము) దెబ్బ.
స. పాటకాఁడు. [ఏర్పడుపల్లము.
గాతము-వి. (ఘాతము) గడ్డపాఱతోపొడువఁగా
గాతి-తె. తిండి.
గాతుకలఁగు-తె. భేదిల్లు.
గాత్రము-తె. స్థూలము.
స. 1. శరీరము. 2. అవయవము.
గాథ-స. 1. చరిత్రము. 2. పద్యము. 3. పాట. 4. చక్కపఱుపఁబడని భాష.
గాద-తె. చెమటకాయల తఱచు.
గాదము-తె. 1. పైరులోనికసవు,కలుపు. 2.ఆకు.
గాదిలి-తె. ప్రేమము, ముద్దు.
గాదె-చూ. గాజె.
గాధము-స. 1. మిట్ట. 2. కోరిక.
గాధేయుఁడు-స. విశ్వామిత్రుఁడు (గాధికొడుకు).
గానము-స. పాట.
గానుఁగ-తె. నూనెదీసెడి యంత్రము, పరంజము.
గాబు-తె. కొప్పెర.
గామిడి-వి. (గ్రామణి) శ్రేష్ఠుఁడు.
గాము-వి. (గ్రహము) 1. సూర్యాదిగ్రహము. 2.పిశాచము.సమా. గాములఱేఁడు-సూర్యుఁడు.
గాయకము-తె. మర్మము.
గాయకుఁడు-వి. (గ్రాహకుఁడు) గ్రహణశక్తి కలవాఁడు. స. పాటపాడువాఁడు.
గాయత్రి-స. సంధ్యావందన మంత్రము.
గాయని-స. పాటకత్తె. (పుం. గాయనుఁడు)
గాయము-తె. కత్తిలోనగువాని దెబ్బ, క్షతి.
గార-తె. 1. ఇసుకచేర్చి దంచిన సున్నము.2.ఒక మణిదోషము. 3. పంటిపై గట్టిపడిన పాచి.
గారడము-వి. (గారుడము) 1. విషమంత్రము. 2. మాయ. సమా. గారడి-(గారడము+ఇ) పాములవాఁడు. రూ. గారడీఁడు.
గారము-వి. (గౌరవము) 1. గొప్పతనము. 2. ప్రేమము. రూ. గారవము, గారాబము, గారాబు, గారాము. క్రి. గారవించు, గారవిల్లు.
గారు-తె. కాఁడుప్రత్యయ బహువచనరూపము.

పూజ్యార్థమున వచ్చునది.
గారుడము-స. 1. విషమంత్రము. 2. గరుడపచ్చ.
గారుడికుఁడు-స. పాములవాఁడు.
గారుత్మతము-స. పచ్చ, మరకతము.
గారె-తె. మినుపపప్పువడ.
గార్దభము-స. గాడిద. రూ. గర్దభము.
గార్హస్థ్యము-స. గృహస్థ ధర్మము.
గాలము-తె. చేఁపలనుబట్టు సన్నని వంపుగల కొక్కి, బడిశము. రూ. గాలాము. సమా. గాలకాఁడు-గాలముతో చేఁపలఁబట్టువాఁడు.
గాలి-తె. 1. వాయువు. 2. మృగముల దేహ వాసన. 3. పిశాచము. సమా. —గాఁడు-గాడిద. —గుడి - సూర్యచంద్రులకు చుట్టు నేర్పడు మండలము, పరివేషము. —చూలి-1. అగ్ని. 2. హనుమ. 3. భీముఁడు. (ఇట్లే గాలికొడుకు మొ.) —తిండి-సర్పము. (ఇట్లే గాలిమేపరి మొ.) —నెచ్చెలి-అగ్ని, వాయుసఖుఁడు. —పంట-నిర్ణయము లేని పంట. —పటము - బాలుర క్రీడాసాధనము. రూ. గాలిపడగ. —మాట-లోకప్రవాదము. —వాన-గాలితోడివాన. ఝంఝ.
గాలించు-తె. 1. బియ్యము లోనగువానిని నీళ్లలో పోసి ఱాళ్లులేకశోధించు. 2. వెదకు. [2. చంపు.
గావు-తె. బలి. క్రి. గావుపట్టు-1. నాశముచేయు.
గాసటబీసట-తె. 1. సలక్షణముగాని చదువు, 2. తాఱుమాఱు. రూ. కాసటబీసట.
గాసము-వి. (గ్రాసము) ఆహారము.
గాసి-తె. శ్రమము. క్రి. గాసిల్లు.
గాహనము-స. స్నానము.
గాళకుఁడు-తె. 1. ధీరుఁడు. 2. ప్రౌఢుఁడు.

## గి

గి-తె. నిందయందు హ్రస్వాదియైన అమ్రేడితశబ్దము నాద్యక్షరమునకు వచ్చు ఆదేశము. (చిలుక గిలుక మొ.)
గింగురు-తె. గుంయి మను శబ్దము.
గింజ-తె. 1. విత్తు. 2. బ. ధాన్యము.
గింజు-తె. 1. పండ్లుచూపు. 2. బతిమాలు.
గింజుకొను-తె. బిడ్డలు వెలికిలఁబండుకొని కాళ్లు విదిలించు.
గింపెము-తె. జంటనేతవస్త్రము.
గిండి-తె. సన్న మెడగలచెంబు, భృంగారము.
గిచ్చు-తె. 1. గోటితో నొక్కు. 2. గీచు.
గిజగిజ-తె. తన్నుకొనుటయందగు అనుకరణము.
గిజురు-తె. పండులోనుండు గుంజు.
గిటక-తె. పొట్టి.
గిటగిట-తె. పటపట. [క్ష్మము.
గిటగిటన-తె. 1. అల్పము. 2. కృశము. 3. సూ
గిటగిటమను-తె. వడఁకు.
గిట్ట-తె. 1. పసుల కాలిగోరు. 2. బాణము.
గిట్టించు-తె. 1. గిట్టుబడియగు. 2. చంపు. కృ. గిట్టింపు. [చ్చు. 4. నశించు.
గిట్టు-తె. 1. అనుకూలించు. 2. ఇష్టపడు. 3. చ
గిట్టుబడి-తె. అమ్మకమందలిలాభము.
గిడస-తె. పొట్టి, గిటక.
గిడిగిళ్లు-తె. నమస్కారము.
గిడుగు-తె. కామలేనిగొడుగు.
గిడ్డ-తె. పొట్టి, గిడస.
గిడ్డంగి-(మాలేభాష) సరకులుంచి అమ్మెడుఇల్లు.
గిడ్డి-తె. ఆవు. [యెద్దు.
గిత్త-తె. 1. పొట్టి. 2. కాలుపట్టనికోడె. 3. పొట్టి
గిద్ద-తె. సోలయందు నాలవభాగము.
గినుము-తె. వంచన. క్రి. గినుమాడు. [రూ. గిన్నె.
గిన్నియ-తె. 1. చిన్నపాత్రము. 2. కంచము.
గిబ్బ-తె. 1. అచ్చుబెద్దు. 2. ఎద్దు. సమా. —రౌతు-శివుఁడు.
గిరక-తె. నూతిరాట్నము.
గిఱక-తె. గిటక, పొట్టి.
గిరణము-స. మ్రింగుట.
గిరవు-హిం. తాకట్టు, కుదువ.
గిరస-తె. పాఱుఁబోతు.
గిరాకి-హిం. వెలయధికము.
గిరి-స. 1. కొండ. 2. అచ్చనగాయలు. సమా. —జ-పార్వతి. —ధరుఁడు-విష్ణువు, గట్టుతాలుపు. గిరీశుఁడు-1. శివుఁడు. 2. హిమవంతుఁడు. 3. బృహస్పతి.

గిఱి-తె. గుండ్రనిగీఁత. క్రి. గిఱికొను-చుట్టుకొను.
గిరిక-స. 1. చిట్టెలుక. 2. జలగ. 3. వసురాజు భార్య. 4. పార్వతి.
గిరిగిటలు-తె. ఆడునపుడు వాయించు నడుమ పల్లము గల కంచుతాళము. రూ. గిగ్రిటలు. [వాఁడు.)
గిరిశుఁడు-స. శివుఁడు, (వ్యు. గిరియందుశయనించు
గిరిసెము-వి. (శిరీషము) దిరిసెనచెట్టు.
గిఱుకు-తె. 1. అక్షరములు వంకరగాగీఁచు. 2. తప్పువ్రాఁతను తుడుచు. 3. తుడుపు.
గిఱుక్కు-తె. మరలుటయందగు ననుకరణము.
గిఱుపు-తె. 1. కన్నుత్రిప్పు. 2. కదలించు. రూ. గిలుపు.
గిలక-తె. 1. గిలగిలమ్రోఁగు బాలక్రీడా సాధనము. 2. గిలగిలమ్రోఁగు ఇనుపచేకుబిల్ల. సమా. —బండి-చిన్నబండి. [మ్రోఁగు.
గిలకరించు-తె. 1. గిలకొట్టు. 2. చిలుకు. 3.
గిలకొట్టు-తె. 1. వ్రేళ్లతో కలఁచు. 2. కుదిలించు. 3. పుణుకు.
గిలి-తె. భయము.
గిలిగించు-తె. గిలిగింతపెట్టు. రూ. గిలిగిలించు.
గిలిగింత-తె. చక్కిలిగింత. రూ. గిలిగిలి, గిలిగిలింత.
గిలుకు-తె. మెట్టెలవలన నగు ధ్వని.
గిలుపు-తె. (కన్ను) త్రిప్పు. రూ. గిఱుపు.
గిలుబు-తె. మోసము. క్రి. గిలుబాడు.
గిల్లకన్ను-తె. మెల్లకన్ను (గిల్లచూపు-మెల్లచూపు)
గిల్లు-తె. 1. గోటితోనొక్కు. 2. నఖక్షతము.
గిల్లుడు-తె. గోటినొక్కు, నఖక్షతము.
గివుఱు-తె. 1. గోఁకు. 2. భేదించు. రూ. గీఱు.

## గీ

గీ-తె. నిందయందు దీర్ఘాదియైన ఆమ్రేడిత పదాద్యక్షరమునకు వచ్చు ఆదేశము (రాముఁడు గీముఁడు మొ.) [హితము.
గీఁక-వి. (ఘీంకారము) ఏనుఁగుకూఁత, బృం
గీఁకు-తె. కత్తిలోనగువానితో గీచు.
గీఁటు-తె. 1. (పండ్లు) కొఱుకు. 2. (కన్ను) గిఱుపు. 3. చిమ్ము.
గీఁత-తె. రేఖ. రూ. గీటు.
గీచు-తె. గీఁతగీయు. కృ. గీటు. [అనాదరించు.
గీటు-తె. గీఁత. క్రి. గీటడఁగు, చచ్చు. గీటునఁబుచ్చు-
గీతము-స. పాట.
గీతి-స. 1. ఒక పద్యము. 2. పాట. [ఱపెట్టు.
గీపెట్టు-తె. 1. గీఁకపెట్టు. 2. శబ్దించు. 3. మొ
గీము-వి. (గేహము) ఇల్లు.
గీయు-తె. గీచు. కృ. గీఁత.
గీఱ-తె. రేఖ, గీఁత.
గీఱు-చూ. గివుఱు. కృ. గీఱ, గీఱుడు. సమా. —నామము-సన్ననినామము.
గీర్వాణము-స. 1. దేవభాష, సంస్కృతము. 2. డు. వేలుపు, బాసవాలు.
గీలు-తె. స్రవించు, కాఱు.
గీష్పతి-స. బృహస్పతి. రూ. గీర్పతి.

## గు

గుంజ-స. 1. గురిగింజతీఁగ. 2. తప్పెట.
గుంజ-వి. (గుంధము) స్తంభము. సమా. —నసుఁగు-1. పరిహాసముచేయు. 2. ఎలుఁగుగొడ్డాట.
గుంజిలిపెట్టు-తె. గోపనముచేయు.
గుంజిళ్లు-తె. చేతులు కట్టుకొని రెండుకాళ్లు చేర్చిపెట్టి కూర్చుండి లేచుట. రూ. గుంజీలు.
గుంజు-తె. 1. ఈడ్చు. 2. ఉదుకు. 3. తాటిలోనగువాని మోవు మొదలు. 4. గిజురు. రూ. గూఁజు.
గుంజులాడు-తె. లాగులాడు.
గుంట-వి. (కుండము) 1. కొలను. 2. పల్లము. 3. చిన్నచెఱువు. 4. ఎకరాలో పదునైదవ వంతునేల. 5. చిన్న. సమా. —నక్క-చిన్ననక్క. —క్రోవి-నల్లమందుగట్టించికాల్చిశబ్దము చేసెడు ఒక క్రోవి.
గుంటి-తె. (గుంట+ఇ) 1. చేనిలో నొకభాగము. 2. దున్నుట కేర్పఱుచుకొన్న భాగము.
గుండ-తె. వస్త్రము. రూ. గుడ్డ.
గుండఁగి-తె. నీరుకోడి.
గుండఁడు-తె. 1. దాసుఁడు. 2. ధీరుఁడు.
గుండగొయ్య-తె. దుష్టుఁడు.

గుండము-వి. (కుండము) నిప్పులగుంట.[త్రము.
గుండిగ-వి. (కుండిక) వెడల్పునోరుగల లోహపా
గుండియ-తె. హృదయము. రూ. గుండె, గుండె కాయ.
గుండీ-హిం. బొత్తాను.
గుండు-తె. 1. పెద్దఱాయి. 2. గుండ్రనిరాయి. 3. ఫిరంగిగుండు. 4. తూనికఱాయి. 5.కపిలె బానగుండు. 6. కొండ. సమా. —గుత్త - సమస్తస్వాతంత్ర్యములతోనిచ్చు గుత్త.—జల్ల- పెద్దగంప. —పులుఁగు-చక్రవాకము. క్రి. —కొను-చుట్టుకొను. —గిలు-చుట్టువడు.
గుండె-తె. 1. హృదయము. 2. మనసు. రూ. గుండియ.
గుండ్రన-తె. వర్తులత్వము. [గుండ్రతుంగ మొ.)
గుండ్రము-తె. వర్తులము.(సమాసమందు గుండ్ర,
గుండ్రలు-తె. 1. పిండికొట్టి చెరుగఁగా మిగిలిన ఉండలు. 2. చెఱకుగానుఁగ కంబములు.
గుండ్రలుకొలుపు-తె. గుడ్లగూబకూయు.
గుండ్రాయి-తె. (గుండు+ఱాయి) పొత్రము.
గుండ్రించు-తె. కడుపుత్రిప్పు. కృ. గుండ్రింపు.
గుంత-వి. (కుండము) 1. పల్లము. 2. పిఱఁది మీఁది గుంట.
గుంధము-స. గుంజ.
గుంపించు-తె. 1. కుప్పవేయు. 2.అతిక్రమించు.
గుంపు-తె. ప్రాణి సమూహము.
గుంపెన-తె. విజృంభణము. [క్రి. గుంఫించు.
గుంఫనము-స. మాటలులోనగువానిని కూర్చుట.
గుంఫితము-స. కూర్పఁబడినది.
గుంబము-చూ. గుమ్మము.
గుగ్గిలము-వి. (గుగ్గులు) గుగ్గిలపుచెట్టుబంక.
గుగ్గిళ్లు-తె. ఉడుకఁబెట్టిన సెనగలులోనగునవి, అభ్యూషము.
గుగ్గులువు-స. గుగ్గిలపుఁజెట్టు.
గుచ్ఛకము-స. 1. పూగుత్తి. 2. నెమలిపురి. 3. పొద. 4. ముప్పదిరెండుమణులు గ్రుచ్చిన హారము. రూ. గుచ్ఛము, గుత్సము.
గుజగుజ-తె. పీడితము. క్రి. గుజగుజలాడు,—వోవు-పీడితమగు, రహస్యమాడు.
గుజారి-హిం. ధనవంతుఁడు.
గుజురు-తె. గుంజు, గిజురు.
గుజ్జు-తె. అనుకగు రసద్రవ్యము. రూ. గుంజు, గూఁజు, గుజురు.
వి.(కుబ్జ) 1.గిటక. 2. పొట్టియెద్దు, 3.గురుజు. 4. పాపటదూలముకోనగువాని గురుజు. సమా. —వేలుపు-వినాయకుఁడు. గుజ్జనగూళ్లు-బాలికలు గురుగులతో వండిన అన్నము.
గుటక-తె. ఒకసారి నోటఁబోసికొని మ్రింగు నీరు లోనగువాని కొలఁది. [కుక్కు.
గుటుకు-తె. మ్రింగుటయందగుధ్వని. రూ. గుటు
గుట్ట-తె. 1. పెనుమిట్ట. 2.చిన్నకొండ. 3.రాశి.
గుట్టు-తె.మర్మము.సమా. —చెడు-రాజమంత్రము బయలుపడుట. —సాకిరి-రహస్యముగా విన్న సాక్షి.
గుడము-స. 1. బెల్లము. 2. గోలి.[3. పాలడ.
గుడక-తె. 1. టెంకాయలోనగువాని బుఱ్ఱ.
గుడాకేశుఁడు-1. శివుఁడు. 2. అర్జునుఁడు.(వ్యు. జెముడాకులవంటి వెండ్రుకలముడి కలవాఁడు.)
గుడారము-తె. డేరా, గుణాలయము. రూ.గుడారు, గూడారము, గూడారు.
గుడి-తె. 1. దేవళము. 2. ఇకారరూపాంతర నామము. 3. పరివేషము. 4. వలయరేఖ. సమా. —చుట్టు-పరివేషము.క్రి.—కట్టు-ఎల్లల ఏర్పాటు. —కొను-క్రమ్ము. —తిరుగు-గుండ్రముగా తిరుగు. [కవచము.
గుడిగి-తె. మోఁకాలివఱకుఁ దొడిగికొను వస్త్ర
గుడిగుడి-తె. అల్పము.
గుడిసె-తె. 1. ఒకేవిత్తుగల చింతపండు. రూ. గూడిసె. 2. గుండ్రని చిన్న ఆకుటిల్లు.
గుడుక్కు-తె. గుటుక్కు.
గుడుగుడు-తె.పరుగెత్తునపుడు బాలురుచేయుధ్వని.
గుడుసు-తె. 1.పరివేషము. 2.గుండ్రము. సమా. గుడుసరి-కపటము గలవాఁడు. గుడుసుకైదువు-చక్రము. (ఇట్లే గుడుసువాలు మొ.) క్రి. —వడు-గుండ్రమగు.
గుడ్డ-తె. వస్త్రము. రూ. గుండ.
గుడ్డము-తె. చేను. రూ. గుడ్డాము.

గుడ్డి-తె. (గ్రుడ్డు+ఇరి) 1. అంధత్వము. 2. అంధుఁడు. రూ. గ్రుడ్డి.

గుణకము-స. పెంచెడు లెక్క. క్రి. గుణించు.

గుణము-స. 1. స్వభావము. 2. త్రాడు. 3. అల్లె త్రాడు. 4. మడుఁగు. 5. అలవాటు. 6. ఐశ్వర్యాది. (ఇవి ఆఱు: ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము. వీనికే భగమనిపేరు. ఇవికలవాఁడు భగవంతుఁడు.) 7. సత్త్వాది.(ఇవి మూఁడు:సత్త్వము,రజస్సు, తమస్సు.) 8. శబ్దాది. (ఇవి యైదు: శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. ఇవి పంచభూతముల గుణములు. కావ్యగుణములు పది: శ్లేషము, ప్రసాదము, మాధుర్యము,సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి.)

గుణాలయము-స. గుడారము.

గుణి-స. 1. విల్లు. 2. గుణము కలవాఁడు.

గుణితము-స. 1.హల్లులతో అచ్చులను హల్లులను చేర్చి చెప్పుట. 2. గుణింపఁబడినది.

గుణ్యము-స. గుణింపఁదగినది.

గుత్త-తె. ఫలప్రదమైన సొత్తును సొత్తుకానికి కొంత ధనమిచ్చి తనయనుభవమున నుంచుకొనుట. సమా. —కాఁడు-గుత్తగొనువాఁడు.

గుత్తము-తె. 1. కచ్చితము. 2. బిగువు.

గుత్తి-వి. (గుత్సము) 1. పూలులోనగువాని కుచ్చు. 2. చీలమండ.

గుత్సకము-స. పూగుత్తి.

గుత్సము-స. 1.వరిలోనగువానిగంట. 2.పూగుత్తి. 3. ముప్పదిరెండు మణుల హారము.

గుదము-స. మూడి, పాయువు.

గుది-తె. 1. ఆకులు లోనగువాని గ్రుచ్చినసరము. 2. గుత్తి. సమా. —కాలు-చీలమండకుదిగువ పాదము వెనుకటి భాగము, పార్ష్ణి. —కూర్పు-గుంఫనము. —గట్టి-దొంగావుల మెడకుఁ దగిలించు కట్టె. —గుంజలు - పసులదొడ్డి లోనగువాని ద్వారమందు నిలువుగా పాతిన కంబములు. —త్రాడు - దూడకాలికిఁ గట్టు త్రాడు. క్రి.—కొను-1. అతిశయించు.2.దట్టమగు. 3. మూటకట్టుగాఁగూలు. —త్రోయు-కాళ్లుకట్టి త్రోయు. —వడు-కట్టువడు.

గుదియ-వి. (గద) 1. నాలుగుమూరల నిడివిగల దండము. 2. గుదికట్టె. రూ. గుదె. సమా. —కట్టెలు-గుదిగుంజల కడ్డముగాఁ జొప్పించు కట్టెలు. —తాలుపు-యముఁడు.

గుద్దలి-వి. (కుద్దాలము) వేళ్లమున్నగునవి పెల్లగించుసాధనము, త్రొల్లిక. క్రి. గుద్దలించు.

గునపము-తె. గడ్డపార.

గునియు-తె. 1. నర్తించు. 2. కులుకు. రూ. గునిసాడు, గునిసియాడు. కృ. గునుపు.

గునుకు-తె. కొద్దివేగముగాపరుగెత్తు. కృ.గునుగు.

గున్న-వి. (కుణకము) పిల్ల.

గుప్తము-స. 1. కావఁబడినది. 2.దాఁచఁబడినది.

గుప్తి-స. 1. కాపాడుట. 2. దాఁచుట. 3. చెఱసాల. 4.పాఁతఱ.

గుప్పళించు-తె. 1. వస్త్రములోనగువానిని ఉసుము. [2.పుక్కిలించు. 3.ఉంచు.

గుప్పిలి-తె. పిడికిలి.

గుప్పు-తె. 1. ఉంచు. 2. చల్లు. 3.దూడ పాలు త్రాగునప్పుడు పొదుఁగును పొడుచు. 4. ప్రయోగించు. 5. విసరివైచు. రూ. గుప్పించు. 6. ఎగయుట, ప్రమోయుట, వాసనకొట్టుట, వైచుట మున్నగువానియందగు ననుకరణము.

గుప్పున-తె. శీఘ్రముగా. రూ. గుబ్బన.

గుబక-తె. తలుపుగందపట్టెమీఁది గుబ్బ. [ణము.

గుబాలు-తె. పడుటపగులుటయందగు ధ్వన్యనుకర

గుబాళించు-తె. వాసనకొట్టు. [రూ. గులిమి.

గుబిలి-తె. 1. పైఁడికంటి. 2. చెవిలోని మురికి.

గుబుకు-తె. పిడికిటితోపొడుచు. రూ. గుముకు.

గుబురు-తె. 1. దట్టము. 2. సమూహము. రూ. గుమురు. [కొట్టుకొనుధ్వని. క్రి. గుబులుకొను.

గుబులు-తె. 1. గుప్పునవచ్చువాసన. 2. గుండె

గుబుసు-తె. కపటము.

గుబ్బ-తె. 1. కుచము. 2. గందపట్టెమీఁదిగుబక. 3. బాణపుటలుఁగుక్రింది గుబ్బ. 4. గుండ్రమైనది. సమా. గుబ్బలాఁడి-యౌవనవతి. రూ. గుబ్బెత.

గుబ్బటిల్లు-తె. తిరుగుడువడు. రూ. గుబ్బటిలు.
గుబ్బతిల్లు-తె. 1. అతిశయించు. 2. ఉప్పొంగు. రూ. గుబ్బతిలు.
గుబ్బన-తె. శీఘ్రముగా. రూ. గుప్పున.
గుబ్బలి-తె. కొండ.సమా. —విలుకాఁడు-శివుఁడు, శైలధన్వుఁడు. —సరము-పెక్కుదినుసు మణులుగ్రుచ్చినసరము.
గుబ్బిక-తె. పక్షులలోనగువానికిఁబెట్టెడియురి.
గుబ్బెత-తె. గుబ్బలాఁడి, యువతి.
గుమగుమ-తె. 1. సువాసన. 2. వాసనకొట్టుట యందగు అనుకరణము.
గుమాస్తా-హిం. లెక్కవ్రాయువాఁడు.
గుమి-తె. గుంపు.
గుమితి-తె. బాఁకు. రూ. గుమ్మితి.
గుముకు-చూ. గుబుకు.
గుమురు-చూ. గుబురు.
గుమ్మ-తె. పాలుపిండునపుడు వచ్చుధార.
గుమ్మఁడు-తె. అలంకారప్రియుఁడు.
గుమ్మటము-తె. దీపమునుంచు కాకితపుగూడు.
గుమ్మడి-వి. కూశ్మాండము.
గుమ్మము-తె. వాకిలి. రూ. గుంటము.
గుమ్ము-తె. 1. పిడికిటితోఁబొడుచు. 2. పిడికిటిపోటు. రూ. కుమ్ము. 3. వాసనకొట్టుటయందగు ననుకరణము. [గుమ్మెత.
గుమ్మెట-తె. కూజారూపుగల వాద్యము. రూ.
గుఱక-నిద్రయందలి ధ్వని. రూ. గుఱ్ఱు.
గురగుర-తె. 1. పందికూఁత. 2. కొనయూపిరి గలప్పటిధ్వని.
గుఱగుఱ-తె. ఒకవిధమైన దురద.
గుఱి-తె. 1. లక్ష్యము. 2. గుఱుతు. 3. దృష్టాంతము. 4. మితి. సమా. —కట్టు-1. అంచు. 2. మితి. —కాఁడు-లక్ష్యము తప్పక యేయువాఁడు. —కొండి-ఆయము. క్రి. గుఱించు-1. ఉద్దేశించు.2.నిర్ణయించు.గుఱికొను-లక్షించు.
గురిగి-తె. పడుచులాడుకొను చిన్నపిడత.
గుఱిచి-తె. (గుఱి+ఉంచి) కూర్చి.రూ.గుఱించి.
గురిజ-వి. (గుంజ)గురిగింజతీఁగ.రూ.గురివెంద. సమా. గురిగింజ-(గురిజ+గింజ) శిలాపాకి.
గురు-తె. గవయమృగము.
గుఱుకొను-తె. యత్నించు.
గుఱుతు-తె. 1. చిహ్నము. 2. మేర. రూ.గుర్తు. క్రి. గుఱుతించు, గుర్తించు.
గుఱుపొడుచు-తె.గుఱకవెట్టు. రూ. గుఱువెట్టు.
గురువు-తె. వేగపుపరుగు. క్రి. గురువులువాఱు. గురువుదేఱు-చిఱునచిప్పలు.
స. 1. ఉపాధ్యాయుఁడు. 2. బృహస్పతి. 3. కులముపెద్ద. 4. తండ్రి. 5. తండ్రితోఁబుట్టినవాఁడు. 6. తాత. 7. అన్న. 8.మామ. 9. మేనమామ. 10. రాజు. 11. కాపాడువాఁడు. 12. గొప్పది.
గురుసు-తె. 1. ఆయము. 2. మేర.
గుర్తించు-తె. గుర్తుపట్టు.
గుఱ్ఱము-తె. అశ్వము. సమా. గుఱ్ఱపుఁజుక్క-అశ్విని. —పీఁట-ద్వారబంధముపై నుంచు గుఱ్ఱపుమూతిపీఁట. —మోమువేలుపు-కింపురుషుఁడు.—సారము-దైవతము. [2.గుఱక.
గుఱ్ఱు-తె. 1. కోపమునందగు ననుకరణము.
గుర్విణి-స. గర్భిణి.
గుర్వు-వి. (గురువు) అధికము.
గులక-తె. సన్ననిదినుసు ఱాయి.
గులకరించు-తె. 1. రమ్యమగు. 2. కలియఁబెట్టు.
గులగుల-తె. 1.చూర్ణము.2.నలఁగుడు. 3.దురద.
గులప-తె. గుఱ్ఱపువాఁడు.
గులాము-హిం. దాసుఁడు.
గులిబి-తె. గుబిలి. రూ. గులిమి.
గుల్ఫము-స. చీలమండ.
గుల్మము-స. 1. బోదెలేనిచెట్టు. 2. తొమ్మిదిరథములు అన్నియేనుఁగులు ఇరువదియేడు గుఱ్ఱములు నలువదియేవురు కాల్బురును గల సేన. 3. పురాభిముఖ రాజమార్గము.
గుల్మిని-స. పొదరు.
గుల్ల-వి. (గులి) 1. కప్పచిప్ప. 2. బొబ్బ. 3. అల్పము. 4. బోలు. 5. గులక. సమా. —కాఁడు-ఏమియు లేనివాఁడు, వ్యర్థుఁడు. క్రి. —పడు-అవమానపడు.
గువ్వ-తె. 1. బెళవ. 2. అడవిపావురము.

గువ్వకరిగొను-తె. చుట్టుకొను. రూ. గువ్వకోలు గొను.

గుసగుస-తె. రహస్యపు మాటలచప్పుడు.

గుహ-స. 1. కొండబిలము. 2. పల్లము. సమా. గుహాశయము-1. పులి. 2. సింహము.

గుహుఁడు-స. 1. కుమారస్వామి. (వ్యు.తనసైన్యమును రక్షించుకొనువాఁడు. భక్తులహృదయగుహయందు వసించువాఁడు) 2. రాముని మిత్రుఁడగు బోయ. [కేశ్వరుఁడు-కుబేరుఁడు.

గుహ్యకుఁడు-స. ఒకతెగదేవత. సమా. గుహ్య

గుహ్యము-స. 1. ఏకాంతము. 2. స్త్రీపురుషుల గుఱి. 3. దాఁచఁదగినది.

గుళిక-స. రసమణిలోనగునది, మాత్ర. (వి.గుళిగ)

గుళుచ్ఛము-స. పూవులోనగువాని గుత్తి,గుచ్ఛము.

## గూ

గూండ్ర-తె. గుడ్లగూబకూఁత. క్రి. గూండ్రించు.

గూఁటి-తె. (గూఁడు + ఇ) పంది.

గూఁడు-తె. 1. పక్షిగృహము. 2. గోడలో దీపముంచుట కేర్పఱచిన చోటు. 3. పంజరము. 4.ఆకుగుడిసె.సమా.—కానుపు-పక్షి, నీడోద్భవము. —బండి-చాఁపకట్టినబండి,సవారిబండి.

గూటము-తె. 1.వడ్రంగి ఉలిపైఁగొట్టెడు కొయ్యదుంప. 2. గుంజ. 3. మేకు. రూ. గూటాము. క్రి. గూటించు-1. గూటముతోఁగొట్టు. 2. ఆయమెత్తి పొడిచి నిందించు.

గూడ-తె. 1.వానకు తలపైవేసికొను నల్లిన చాఁప. 2. నీరెత్తెడు వెదురుబుట్ట. 3. జోలె. 4.పూలబుట్ట. 5. దొప్ప. సమా. —కట్టు-కచ్ఛములేక కట్టిన దోవతి అడ్డుకట్టు.

గూడారము, గూడారు-చూ. గుడారము.

గూడెము-తె. కొండదొన నాశ్రయించియుండు బోయపల్లె. రూ. గోడెము.

గూఢము-స. 1. రహస్యము. 2.స్త్రీపురుషులగుఱి. 3. దాఁచఁబడినది.సమా. గూఢపదము-పాము. (ఇట్లే—పాదము,—పాత్తు మొ.) —పురుషుఁడు-వేగు. (ఇట్లే—చారుఁడు మొ.) —సాక్షి-గుట్టుసాకిరి.గూఢోత్పన్నుఁడు-తనకు తెలియక భార్యయందు అంకుమగనికి పుట్టిన కొడుకు.

గూన-తె. పెద్దకుండ.

గూను-తె. నడుముమీఁది (వీఁపు) వంపు. క్రి. గూనుగిల్లు.(ముందరివంపు గూను.వెనుకవంపు నడ్డి.) సమా. గూనివాఁడు - గూనుగలవాఁడు, కుబ్జుఁడు.

గూబ-తె. 1. కర్ణమూలము. 2. గుడ్లగూబ.

గూబరి-తె. మాదిగవాఁడు.

గూహనము-స. దాఁచుట.

## గృ

గృధ్రము-స. 1. గ్రద్ద.(వ్యు. మాంసమును కోరునది) 2. ఢు. పిసినిగొట్టు.

గృహము-స. 1. ఇల్లు. 2. భార్య. సమా. గృహకచ్ఛపము-సన్నెకల్లు.—గోధిక-బల్లి.—పతి-1. గృహస్థుఁడు. 2. మంత్రి. 3. విడుపక యిచ్చువాఁడు. —మణి-దీపము.—మృగము-కుక్క. —మేధి-గృహస్థుఁడు. —స్థుఁడు - భార్యనుగ్రహించి పురుషార్థములను పంచయజ్ఞములను నడపుచుండువాఁడు, ఇలుఱేఁడు. రూ. గృహస్థు. —స్థూణము-నిట్రాడు.

గృహి-స. గృహస్థుఁడు. (స్త్రీ. గృహిణి)

గృహీతము-స. గ్రహింపఁబడినది.

గృహీతి-స. గ్రహింపఁజాలిన బుద్ధి.

గృహ్యకము-స.1. పెంపుడుమృగము లోనగునది, దీమము. 2. పరాధీనము.

గృహ్య-స. 1. శాఖానగరము. 2. ము. దీమము. 3. స్వాధీనము. 4. పరాధీనము.

## గె

గెంటసము-తె. పరుషవచనము.

గెంటించు-తె. 1. చలించు. 2.బయటికినెట్టించు.

గెంటు-తె. 1. చలించు. 2.తొలఁగు. 3.త్రోయు. 4. ప్రయోగించు.

గెంటువడు-తె. తప్పిపోవు. [ము. 2. దట్టము.

గెంబెము-తె. 1. జంటనేఁతవస్త్రము. రూ. గెంబె

గెగ్గలు-తె. గేలి.

గెడ-తె. 1. జత. 2. సమీపము.

గెనయు-తె. పుష్టియగు.
గెనసు-తె. చిలగడదుంప.
గెబ్బు-తె. 1. అపహరించు. 2. గ్రహించు.
గెఱ-తె. గీఱ, రేఖ.
గెల-తె. పండ్లగుత్తి. రూ. గొల.
గెలివి-తె. సంతోషము. రూ.గెలివిడి. [కృ.గెలుపు.
గెలుచు-తె. 1. పోవు. 2. పంపు. 3. జయించు.
గెలుపు-తె. 1. జయించుట. 2. జయము. రూ. గెలువము. క్రి. గెలుపుకొను. సమా.—కాఁడు-జయశీలుఁడు.
గెల్లి-తె. ఉప్పుకుప్ప.
గెల్లు-తె. కలకలధ్వని. రూ, గొల్లు.

## గే

గేందుకము-స. కందుకము, చెండు.
గేదెకాళ్లవాఁడు-స. కొంగకాళ్లవాఁడు.
గేదఁగి-వి. (కేతకి) మొగలిచెట్టు. [దూడ.
గేదె-తె. బఱ్ఱె. సమా.—చెలప-మూఁడేండ్ల ఎనుప
గేయము-స.1.పాట.2.పాడఁదగినది.3.పాడునది.
గేలి-తె. పరిహాసము. క్రి. గేలికొట్టు,—కొను.
గేస్తు-వి. (గృహస్థు) ఇలుఱేఁడు. రూ.గేస్తుఁడు. (స్త్రీ. గేస్తురాలు)
గేహము-స. ఇల్లు. రూ. గృహము.
గేహళి-స. కడప. రూ. దేహళి.
గేహి-స. గృహస్థుఁడు. (స్త్రీ. గేహిని)

## గై

గైరికము-స. 1. పర్వతధాతువు. 2. బంగారు.

## గొ

గొంగ-తె. పగతుఁడు. [కంబళిపురుగు.
గొంగడి-తె.కంబళి.రూ. గొంగళి.సమా.—పురుగు-
గొంజ-తె. గొడ్రాలు. [2. కఠినుఁడు.(స్త్రీ.గొంటి)
గొంటరి-తె. (గొంటు+అరి) 1. కుత్సితుఁడు.
గొంటు-తె.1.దుష్టుఁడు.2.బందనలేనివక్క.సమా.
; —కాఁడు-కఠినుఁడు.[ము.3.నర్తకి.రూ.గొండ్లి.
గొండిలి-తె. 1. కుండలాకారనృత్యము.2.నృత్య
గొండెము-తె. తలుపుచిలుకు. రూ. గొండ్లెము.
గొంతి-వి. (కుంతి) పాండురాజు పెద్దభార్య.
గొంతు-తె. 1. కంఠము.2.కంఠధ్వని.3.కుక్కుటాసనము.రూ.గొంతుక. సమా.—ముడి-గొంతు ముందఱి ప్రక్క పోఁకవలెనుండు ఎముక,గొంతుకపోక.
గొంతెమకోరిక-తె. కోరఁదగని కోరికలుకోరుట.
గొంది-తె. ఘూల.
గొగ్గి-తె. ఎచ్చుతక్కువైనది.
గొజ్జఁగ-వి.(కుబ్జిక) పెద్దచేమంతి,పన్నీరుపూవు. రూ. గొజ్జఁగి, గొజ్జెఁగ.
గొట్టము-తె. క్రోవి.[4. దుర్లభము. 5. దుష్టము.
గొట్టు-తె. 1. దౌష్ట్యము. 2. విరోధి. 3.కఠినము.
గొడఁగు-తె. మాటవినరానీక నోరుమెదపు. రూ. గొణఁగు.[పోయిన చిన్ననాఁగలి. రూ. గొణగ.
గొడగ-తె. 1. ఏడికోలలేనినాఁగలి. 2. అఱిగి
గొడగర-తె. మాదిగ.
గొడవ-తె, 1, ఆపద. 2. తప్పు. 3. దుఃఖము. 4. అడ్డి. 5. కలఁత.
గొడవరి, గొడారి-తె. మాదిగవాఁడు.
గొడిగ-తె. గులకఱాయి.
గొడియ-తె. కిట్టికోల. రూ. గొడె.
గొడుగు-తె. ఎండవానల కడ్డముపెట్టికొను సాధనము, ఆతపత్రము. [బి. బిఱుసుమాట.
గొడ్డ-తె. 1. బిఱుసు. 2. బిఱుసగువాఁడు. 3.
గొడ్డగము-వి.(కుట్టకము) బాధకము.రూ.గొడ్డము.
గొడ్డలి-తె. చెట్లు నఱకు సాధనము, కుఠారము.
గొడ్డు-తె. 1. గొడ్రాలితనము. 2. ఈననిపశువు. 3. గొడ్రాలు. 4.పశువు. 5. శూన్యము. సమా. గొడ్డుఁబోతు - నిష్ప్రయోజకుఁడు. —రాలు-(గొడ్డు+ఆలు) బిడ్డలుకననిఆఁడుది, వంధ్య. రూ. గొడ్రాలు. —చెట్టు-పండ్లుకాయనిచెట్టు. —సంకటి - నూకలులేనిసంకటి. గొడ్డేఱు - 1. గుత్తయెత్తు. 2. నీళ్లులేని ఏఱు. క్రి. గొడ్డువోవు-ఫలశూన్యమగు.
గొణఁగు-చూ. గొడఁగు.
గొణగ-చూ. గొడగ. [రూ. గొణిద.
గొణిజ-తె. తలుపుగ్రందె తగిలించెడి ఇనుపచీల.
గొత్తు-తె. వెన్న మున్నగునవి పాసిపోయినకంపు.

గొద-తె. ఆఁకలి. [3. విజృంభించు.
గొదకొను-తె. 1. అతిశయించు. 2. త్వరపడు.
గొదగొద-తె. విరోధము.
గొనకొను-తె. ప్రయత్నించు. [గొనము.
గొనప-తె. 1. అఱిగిననాఁగేలు. 2. పొట్టి. రూ.
గొనబు-తె. మనోజ్ఞము. సమా. —కాఁడు-అందగాఁడు.
గొనము-వి. (గుణము) శౌర్యాదిగుణము.
గొనయము-వి. (గుణము) వింటినారి.
గొప్ప-తె. పెద్ద. [మట్టికుప్పలు. 2. చూరుపట్టె.
గొప్పలు-తె. 1. వరిపైరు మొదట పురుగులు పెట్టిన
గొబ-వి. (గుహ) 1. పర్వతబిలము. 2. గొంది.
గొబ్బండు-తె. (గొప్ప+పండు) పెద్దపండు.
గొబ్బరము-తె, ఎరువు.
గొబ్బి-తె. బాలికలు చేతులుతట్టుచు గుండ్రముగా తిరుగుచు పాటలుపాడి చేయువేడుక.
గొబ్బిళ్ళు-తె. 1. గొబ్బి. 2. నమస్కారము.
గొబ్బున-తె. శీఘ్రముగా.
గొయ్యి-తె. పల్లము. రూ. గోయి.
గొరక-వి. (ఖురాలకము) ఇనుపబాణము. సమా. —కత్తె-అలుఁగులు గల చేతికత్తి.
గొఱకు-తె. నీచుఁడు.
గొరగ-తె. మైలారునుగొలిచెడి ఒక మతస్థుఁడు.
గొఱపము-చూ. కొఱపము.
గొరవంక-చూ. గొరువంక.
గొరిజ-వి. (ఖురము) పశ్వాదుల కాలిగిట్ట. రూ. గొరిసె. [గొఱ్ఱె.
గొఱియ-వి. (కురరి)మేషి. రూ. గొఱె,గొఱ్ఱియ.
గొఱుగు-తె. క్షౌరముచేయు.
గొరువంక-తె. మాటలునేర్చి పలుకఁజాలిన ఒక తెగపక్షి. శారిక. రూ. గొరవంక, గోర, గోరంక, గోరువంక.
గొఱ్ఱు-తె. 1. దున్నినపొలముమీఁద దువ్వెడి యంత్రము. 2. ముప్పదిరెండుకుంటలకొలఁది.
గొఱ్ఱె-చూ. గొఱియ.
గొల-చూ, గెల.
గొలక-తె. 1. కలకలధ్వని. 2.బ. తాటిముంజెలు.
గొలుసు-తె. 1. ఒకసొమ్ము. 2. ఏనుఁగుకాలు గట్టెడినిగళము. 3. సంకెల. సమా.—మోడి-విడివిడిగా లేక గొలుసువలె నొకటితో నొకటి పెనగొన్నవ్రాఁత.
గొల్ల-తె. 1. ద్వారపాలకుఁడు. 2. ధనపాలకుఁడు. 3. పాడిపసరములమేపి పాలమ్మిజీవించు ఒక జాతి. (పుం. గొల్లఁడు. స్త్రీ. గొల్లత.)
గొల్లము-తె. లోఁతుగల పల్లము.
గొల్లియన-తె. గుడారము. రూ. గొల్లెన. సమా. గొల్లెనబండి-కొల్లారుబండి.
గొల్లు-తె. కలకలధ్వని.
గొవరు-తె. తాపము. క్రి. గొవరువోవు-తపించు.
గొహోరు-తె. ఉపద్రవము.

## గో

గో-తె. చూపుటయందువచ్చు 'కొను' శబ్దసంగ్రహరూపము. (అదిగో, ఇదిగో మొ.)
గోండుఁడు-స. 1. పామరజాతివాఁడు. 2.ఉఱుకుబొడ్డువాఁడు. 3. 'గోండు' అనుజాతివాఁడు.
గోండ్రించు-తె. 1. పులికూయు. 2. ఎలుఁగుకూయు.రూ.గోండ్రిలు, గోండ్రిల్లు. [కరణము.
గోండ్రు-తె. అంగలార్చుటయందగు ధ్వన్యను
గోఁకు-తె. 1. గీఁకు. 2. గీఱు. సమా. గోఁకుడుపాఱ-కసవుచెక్కుపాఱ, దోఁకుడుపాఱ.
గోఁగు-తె. ఆకు కూరలకును, పైపట్టనారకును పయోగించు ఒకచెట్టు,తీక్ష్ణవృక్షము.రూ.గోను.
గోఁచి-తె. కౌపీనము. సమా. గోఁచికట్టు-బ్రహ్మచారి.(ఇల్లే గోఁచిబాఁపఁడు. మొ.)—కాఁడు-1. బ్రహ్మచారి. 2. నిర్ధనుఁడు. [గోఁజాట.
గోఁజు-తె. పీడించియడుగు. రూ. గోఁజాడు.కృ.
గోఁటు-తె. 1. కోకయంచున చేర్చికుట్టు సన్నని సరిగపట్టె.2.ఒయ్యారము. 3. రేఖ. 4.ఒకరీతి వీణవాద్యము.సమా.—కాఁడు-ఒయ్యారము కల వాఁడు. (స్త్రీ. గోఁటుకత్తె)
గోఁదు-బంక, జిగురు.
గోఁదురు-తె. పెద్దకప్ప. [గాడిద. 4. పాము.
గోకర్ణము-స. 1. కడితి. 2. జుత్తు. 3. కంచర
గోకిలము-స. 1 రోఁకలి. 2. నాఁగలి.
గోచరము-స. 1. ఇంద్రియార్థము. 2.విషయము.

క్రి. గోచరించు-అగపడు.
గోచారము-స. గ్రహసంచారము.
గోటాపస-తె. పక్షియాఁక.
గోడ-వి. (కుడ్యము) భిత్తి. సమా.—కాలు-కర గోడ.—చేర్పు-జడుఁడు. [స్కరించు.
గోడగించు-తె. 1. మాటాడు. 2. శబ్దించు. 3. తిర
గోడా-హిం. గుఱ్ఱము. (స. ఘోటము)
గోడి-తె. 1. అణఁగుడు. 2. వంపు. క్రి. గోడివడు.
గోడిగ-వి. (ఘోటిక) ఆఁడుగుఱ్ఱము.
గోడు-తె. దుఃఖము. క్రి. గోడాడు.
గోడెము-చూ. గూడెము. [గోవణము.
గోణము-వి. (కౌపీనము) గోఁచి. రూ. గోణాము,
గోణి-తె. ఎద్దు. స. గోనె.
గోతము-తె. జనుపనారసంచి. రూ. గోతాము.
గోతి-తె. ఆఁడుది.
గోత్ర-స. 1. నేల. 2. గోవులగుంపు.
గోత్రము-స. 1. వంశము. 2. పేరు. 3. కొండ. సమా. గోత్రభిదుఁడు-ఇంద్రుఁడు. (ఇట్లేగోత్రభిత్తు, గోత్రవైరి. మొ.)
గోద-తె. ఎద్దు.
గోదరి-తె. ముచ్చివాఁడు.
గోదా-హిం. కుస్తీమొదలగు నాటలాడు ప్రదేశము.
గోదారి-తె. వెన్నకాఁచిన మడ్డి.
గోదావరి-స. గౌతమీనది.
గోదుమ-వి. (గోధూమము) ఒకతెగ వరి.
గోధ-స. 1. ఉడుము. 2. అల్లెత్రాటి దెబ్బతగులకుండుటకై ఉడుముతోలుతోచేసి వ్రేలికితొడుగుకొనుకవచము.
గోధి-స. నొసలు.
గోధిక-స. ఉడుము.
గోధూమము-స. గోదుమలు.
గోనసము-స. కొండచిలువ. రూ. గోనాసము. (వ్యు. గోవునాసికవంటి నాసికగలది)
గోనియ-తె. 1. పదిమణుఁగులకొలఁది. 2. వి. (గోణి) ఎద్దుమీఁద గంతగావేయుసంచి. రూ. గోనె.
గోను-చూ. గోఁగు.
గోపనము-స. 1. దాఁచుట. 2. కాపాడుట.
గోపానసి-స. చూరుపట్టె.
గోపాయితము-స. కావఁబడినది.
గోపిచందనము-స. ఒకతెగ సుద్దమన్ను.
గోపురము-స. 1. గవను. 2. వాకిలి. [వాఁడు.
గోప్యుఁడు-స. 1. ఊడిగపువాఁడు. 2. కావఁదగిన
గోము-తె. సౌకుమార్యము. క్రి. గోమించు. గోముచేయు. [గట్టిన ఇల్లు. 3. ఒక వాద్యము.
గోముఖము-స. 1. అలుకుట. 2. వంకరటింకరగాఁ
గోమేధికము-స. పసుపువన్నెగల రత్నము.
గోర, గోరంక-చూ. గొరువంక. [3. బట్టు.
గోరంకువు-స. 1. గొరువంక. 2. దిసమొలవాఁడు.
గోరఁట-తె. కురంటకవృక్షము. (గోరు+అంటు అని వ్యుత్పత్తి.)
గోరగించు-తె. అందగించు. కృ. గోరగింత.
గోఱజము-చూ. గోరోజనము.
గోరతనము-తె. దౌష్ట్యము.
గోరప-స. గట్టిమ్రోఁత. [తి. రోఁత. క్రి. గోరపడు.
గోరము-తె. 1. ఒడలి అస్వాస్థ్యము. 2. అపద.
గోరించు-తె. ఎగయు. కృ. గోరింపు.
గోరు-తె. 1. నఖము. 2. ప్రతినఖము. 3. అల్పము. సమా. —గల్లు-గోళ్లతీసెడి యినుపసలాక, గోరుగొండి. —గాలము, బడిశము. —చిక్కుడు-ఒకతెగ చిక్కుడు. —చీరణము - గోటివంపుగల ఉలి. —చుట్టు - గోటిక్రిందలేచుపుండు. —వంక-శారికపక్షి. రూ. గోర్వంక. చూ. గొరువంక. గోరొత్తు-నఖక్షతము.
గోరుపదము-తె. కంబళి. రూ. గోర్పడము,
గోరుపులాడు-తె. (గోరు+పిళ్ల+అడు) 1. పుట్టచెండ్లాడు. 2. ఎగురవేయు. రూ. గోర్పిళ్లాడు.
గోరోచన-స. పసులనాభియందుండు పచ్చనివస్తువు. (వి. గోరోజనము.)
గోల-తె. 1. ముగ్ధుఁడు. 2. ముగ్ధ.
గోలకము-స. 1. కాఁగు. 2. గోలి.
గోలాంగూలము-స. 1. కొండముచ్చు. 2. కోఁతి.
గోలించు-తె. చమురుపోసి వేఁచు.
గోలీ-వి. (గోలకము) 1. బాలురాడుకొను చిన్నయుండ. 2. ఒకతెగ కూరాకు.
గోలురించు-తె. (పులి) కూయు.
గోలెము-వి. (గోలకము) 1. కాఁగు. 2. కుడితి.

గోవ-తె. 1. యౌవనము. 2. మనోజ్ఞము.
గోవణము-చూ. గోణము.
గోవావు-తె. (గోవ+అవు) సాధువుకానియావు.
గోవాళ్లు-తె. (గోవ+వారలు) యౌవనము కల వాఁడు. [3. గోవులకొాడయుఁడు.
గోవిందుఁడు-స. 1. కృష్ణుఁడు. 2. బృహస్పతి.
గోవు-స. 1. ఆవు. 2. భూమి. 3. వాక్కు. 4. కిరణము. 5. స్వర్గము. సమా. గోకులము-1. ఆవులమంద. 2. గొల్లపల్లె. —దారణము-నాఁగలి. —ధనము-గోకులము. —దుహుఁడు-గొల్లఁడు. —పతి-1. ఆఁబోతు. 2. ఇంద్రుఁడు. 3. రాజు. 4. శివుఁడు. 5. సూర్యుఁడు. —పాలుఁడు-1. కృష్ణుఁడు. 2. గొల్లఁడు. 3. రాజు. —పిక-గొల్లత. —పీథము-నీటిదొన. —పుఁడు-గొల్లఁడు. —మయము-పేఁడ. —మంతుఁడు-గోవులకొాడయుఁడు. రూ. గోమి. —మాయువు-నక్క. —మిని-లక్ష్మి. —వృషము-ఆఁబోతు. —ష్ఠము-మందయుండుచోటు. —ష్పదము-1. గోవుయొక్క అడుగుకొలఁది. 2. గోవు అడుగిడినగుంట. 3. గోవులు తిరుగుచోటు. —స్తని-ద్రాక్ష.
గోశీర్షము-స. హరిచందనము.
గోష్ఠి-స. 1. సభ. 2. సల్లాపము.
గోసఁగి-వి. (గోహింసకుఁడు) మాలవాఁడు
గోసన-వి. (ఘోషణము) చాటించుట.
గోసర్గము-స. వేకువ. [క్రి. గోసాదు, గోసడుచు.
గోసు-తె. 1. అపదూఱు. 2. దూఱు. 3. దోషము.
గోస్తనము-స. నలువదిపూసలసరము.
గోహరి-తె. పరాక్రమము. [కొడుకు.
గోళకుఁడు-స. విధవకు ఱంకుమగనియందుఁబుట్టిన
గోళము-స. మండలము.

## గౌ

గౌండ్ల-చూ. గవుండ్ల. [పట్టపుపేరు. రూ. గవుఁడు.
గౌఁడు-క. 1. సారాయమ్మువాఁడు. 2. కాఁపువారి
గౌణము-స. 1. గుణసంబంధమైనది. 2. అముఖ్యము.
గౌతమి-స. గోదావరి. [జినుఁడు.
గౌతముఁడు-స. 1. ఒకముని. 2. బుద్ధుఁడు. 3.
గౌద-తె. చెంప. రూ. గవుద.
గౌర-తె. వర్తకుఁడు. రూ. గవుర.
గౌరము-స. 1. అఱరువు. 2. తెల్లావలు. 3. ఎఱ్ఱనిది. 4. తెల్లనిది. 5. పసుపుపచ్చనిది. 6. స్వచ్ఛమైనది. [వించు.
గౌరవము-స. గురుత్వము, గొప్పతనము. క్రి. గౌర
గౌరి-స. 1. పార్వతి. 2. సమర్తాడనికన్య.
గౌరు-తె. 1. ఏనుఁగు. 2. పెద్దకాకి.
గౌరుఁడు-స. చంద్రుఁడు.
గౌలు-తె. 1. దుర్గంధము. 2. వాసన. రూ. గవులు.
గౌష్ఠీనము-స. ఆవులమందయుండినచోటు.
గౌసెన-తె. వీణమున్నగువాని యొఱ. రూ. గవుసెన.
గౌళి-తె. బల్లి. రూ. గవుళి.

## గ్ర

గ్రంథనము-స. రచన.
గ్రంథము-స. 1. కావ్యము. 2. ముప్పదిరెండక్షరముల శ్లోకము. 3. ధనము. సమా. గ్రంథకుటి-వ్రాసెడుగది. గ్రంథాలయము-పుస్తకభాండాగారము.
గ్రంథి-స. 1. కంతి. 2. ముడి. 3. గసుపు.
గ్రంథికుఁడు-స. జోస్యుఁడు.
గ్రంథిలము-స. గసుపులుగలది.
గ్రక్కతిల్లు-తె. బెదరు. [రూ. క్రక్కదలు.
గ్రక్కదలు-తె. (కదలు+కదలు) మిక్కిలికదలు.
గ్రక్కన-తె. శీఘ్రముగా. రూ. గ్రక్కున.
గ్రచ్చ-తె. కాలపత్రి. రూ. గచ్చ.
గ్రచ్చు-చూ. గచ్చు.
గ్రథనము-స. 1. కూర్పు. 2. గ్రుచ్చుట.
గ్రద్ద-వి. (గృధ్రము) రూ. గద్ద.
గ్రద్దన, గ్రమ్మన } తె. శీఘ్రముగా.
గ్రసించు-స. 1. తిను. 2. మ్రింగు. 3. కవ్వు.
గ్రసిష్ణువు-స. 1. తినువాఁడు. 2. మ్రింగువాఁడు.
గ్రస్తము-స. 1. తినఁబడినది. 2. మ్రింగఁబడినది. 3. గ్రచ్చుమాట. [2. గ్రహించుట. 3. బుద్ధి.
గ్రహణము-స. 1. రాహువుసూర్యచంద్రులఁబట్టుట.

గ్రహణి-స. అతిసారరోగము.
గ్రహము-స. 1. గ్రహించుట. 2. అనుగ్రహము. 3. చెఱ. 4. యుద్ధయత్నము. 5. పిశాచము. 6. సూర్యాది. (నవగ్రహములు: సూర్యుఁడు, చంద్రుఁడు, అంగారకుఁడు, బుధుఁడు, బృహస్పతి, శుక్రుఁడు, శని, రాహువు, కేతువు.) సమా. గ్రహపతి-సూర్యుఁడు. —రాజు-1. సూర్యుఁడు. 2. చంద్రుఁడు. [గ్రహియించు.
గ్రహించు-స. 1. తీసికొను. 2. తెలిసికొను. రూ.
గ్రహీతుఁడు-స. గ్రహించువాఁడు. రూ. గ్రహయాళువు.
గ్రహీత-స.—పై—
గ్రహీనుఁడు-స. గాలిసోకినవాఁడు.

## గ్రా

గ్రాంథికము-స. గ్రంథసంబంధమైనది.
గ్రాద-తె. కదుము.
గ్రామటిక-స. పల్లె. [ముఖ్యుఁడు.
గ్రామణి-స. 1. మంగలి. 2. గ్రామాధిపతి. 3.
గ్రామత-స. గ్రామసమూహము. [సింహము-కుక్క.
గ్రామము-స. 1. ఊరు. 2. సమూహము. సమా. గ్రామ
గ్రామీణ-స. 1. వేశ్య. 2. ము. గ్రామసంబంధమైనది. [సమా. గ్రామ్యధర్మము-సురతము.
గ్రామ్యము-స. 1. అసభ్యమైనది. 2. పామరము.
గ్రావము-స. 1. కొండ. 2. ఱాయి.
గ్రాసము-స. కబళము.
గ్రాహకము-స. గ్రహించునది.
గ్రాహము-స. 1. గ్రహించుట. 2. చెఱ. 3. మొసలి.
గ్రాహ్యము-స. గ్రహింపఁదగినది.

## గ్రి

గ్రీవ-స. 1. మెడ. 2. మెడసరము. రూ. గ్రీవము.
గ్రీష్మము-స. 1. వేఁడిమి. 2. వేసఁగి.

## గ్రు

గ్రుక్క-తె. 1. మ్రింగుట, గుటక. 2. ఊపిరి రూ. గ్రుక్కిలి. [చించు. రూ. గ్రుక్కిళ్లుమ్రింగు.
గ్రుక్కలుమ్రింగు-తె. 1. అపేక్షించు. 2. సంకో
గ్రుక్కుమిక్కను-తె. మాటాడనోరెత్తు.
గ్రుచ్చు-తె. 1. నాటు. 2. నాటించు. రూ. క్రుచ్చు.
గ్రుడ్డి-తె. 1. అంధత్వము. 2. అంధుఁడు. రూ. గుడ్డి. సమా. —నాటు-దైవికము.
గ్రుడ్డు-తె. 1. గ్రుడ్డితనము. 2. కనుగ్రుడ్డు. 3. పక్షిలోనగువాని అండము. సమా. —కాను వు-1. పక్షి. 2. సర్పము, అండజము. గ్రుడ్లగూబ-ఘూకము. రూ. గుడ్లగూబ. [కిటిపోటు.
గ్రుద్దు-తె. 1. పిడికిటితోపొడుచు. 2. కృ. పిడి
గ్రుద్దులాడు-గ్రుద్దుచుపోట్లాడు. కృ. గ్రుద్దులాట.

## గ్రై

గ్రైవము-స. మెడనుగట్టెడుత్రాడు. రూ. గ్రైవేయము.
గ్రైవేయకము-స. మెడను బెట్టెడిసొమ్ము.

## గ్రో

గ్రొచ్చు-తె. త్రవ్వు.
గ్రొయ్యు-తె. పల్లముపడు. కృ. గొయ్యి.

## గ్లా, గ్లౌ

గ్లాని-స. శ్రమముచేఁ గలిగిన దౌర్బల్యము.
గ్లాసుఁడు-స. తెవులుగొంటు.
గ్లౌ-స. చంద్రుఁడు.

## ఘ

ఘంట-స. 1. అఱువదినిముసములకాలము. 2. ఒకవాద్యము. సమా. ఘంటాపథము - పదిబారల వెడల్పుగల రాజమార్గము.
ఘట-స. 1. గుంపు. 2. ఏనుఁగులగుంపు.
ఘటము-స. 1. కుండ. 2. ఏనుఁగుకుంభస్థలము.
ఘటకుఁడు-స. ఘటిల్లఁజేయువాఁడు.
ఘటన-స. కూర్పు. [(వి. గడియ.)
ఘటిక-స. ఇరువదినాలుగునిముసముల కాలము.
ఘటిల్లు-స. కలుగు.
ఘటీకారము-స. గడియారము.
ఘటీకారుఁడు-స. కుమ్మరి.
ఘటీయంత్రము-స. 1. ఏతము. 2. నీరెత్తురాట్నము.
ఘట్టన-స. గట్టించుట. [నవి తీయుచోటు.
ఘట్టము-స. 1. తీరము. 2. సుంకము మున్నగు

ఘట్టితము-స. గట్టింపఁబడినది.
ఘనము-స. 1. దట్టము. 2. మేఘము. 3. విరివి.
ఘనసారము-స. కర్పూరము. [గులు.
ఘనాఘనము-స. కురియునట్టిమేఘము, తొలిమొ
ఘనీభవించు-స. ముద్దకట్టు.
ఘనుఁడు-స. గొప్పవాఁడు.
ఘరట్టము-స. తిరుగలి. [4. వేసఁగి.
ఘర్మము-స. 1. చెమట. 2. ఎండ. 3. వేఁడిమి.
ఘర్షణము-స. ఒరయిక. క్రి. ఘర్షించు.
ఘస్మరుఁడు-స. తిండిపోతు.
ఘస్రము-స. 1. దినము. 2. నొప్పించునది.

ఘా

ఘాంటికుఁడు-స. రాజులను మేలుకొలుపువాఁడు.
ఘాతము-స. 1. దెబ్బ. 2. బాణము.
ఘాతించు-స. చంపు.
ఘాతిని-స. చంపునట్టిది. [వాఁడు.
ఘాతుకుఁడు-స. 1. చంపువాఁడు. 2. నొప్పించు
ఘాసము-స. లేఁతపచ్చిక.

ఘీ

ఘీంకారము-స. ఏనుఁగుకూఁత. (వి. గీఁక) రూ. ఘీంకృతి.

ఘు

ఘుణము-స. మ్రానుతొలుచుపురుగు. సమా. ఘుణాక్షరన్యాయము-పురుగుతొలువఁగా కఱ్ఱలపైనక్షరము లేర్పడిన రీతి.
ఘుర్ఘురము-స. పందికూఁత. క్రి. ఘుర్ఘురించు.

ఘూ

ఘూకము-స. గుడ్లగూబ. (వ్యు. ఘూయనికూయునది)
ఘూర్ణనము-స. తిరుగుడు. క్రి. ఘూర్ణిల్లు.
ఘూర్ణితము-స. 1. తిరుగుడువడినది. 2. కూరుకుపాటుపడినది.

ఘృ

ఘృణ-స. 1. కనికరము. 2. రోఁత.
ఘృణి-స. కిరణము.
ఘృతము-స. 1. నేయి. 2. నీరు.
ఘృష్టి-స. 1. పాఁచితీఁగ. 2. పోటీ. 3. రాయిడి. 4. కిరణము. 5. పంది.

ఘో

ఘోటకము-స. గుఱ్ఱము. (స్త్రీ. ఘోటిక, ఘోటీ.) (వ్యు. భూమియందుపొరలాడునది.)
ఘోణ- స. ముక్కు.
ఘోణి-స. 1. ఏనుఁగుదోమ. 2. పంది.
ఘోరము-స. 1. నక్క. 2. భయంకరము. సమా. ఘోరదర్శనము—పులి.
ఘోరుఁడు-స. 1. శివుఁడు. 2. భయంకరుఁడు.
ఘోషము-స. 1. గొల్లపల్లె. 2. ఆలమంద. 3. ఉఱుము. క్రి. ఘోషించు.
ఘోషణ-స. చాటించుట. రూ. ఘోషణము.
ఘోషవతి-స. వీణ.

ఘ్రా

ఘ్రాణము-స. 1. ముక్కు. 2. మూర్కొనఁబడినది. క్రి. ఘ్రాణించు. రూ. అఘ్రాణము.
ఘ్రాతము-స. మూర్కొనఁబడినది. రూ. ఆఘ్రాతము

చ

చంక-తె. కక్షము, బాహుమూలము. రూ. చంకిలి. చక్కిలి. సమా.—తాళి-చంకమూట.
చంకరము-స. 1. తేరు. 2. చెట్టు.
చంక్రమణము-స. దాఁటుట.
చంగము-స. 1. నేర్పరి. 2. చక్కనిది.
చంగలించు-తె. చలించు.
చంగు-తె. దాఁటుటయందగు ననుకరణము.
చంచత్-స. చలించునట్టి. [నది)
చంచరీకము-స. తుమ్మెద. (వ్యు. చరించుచుండు
చంచల-స. 1. లక్ష్మి. 2. మెఱుపు. 3. ము. చలించునది. 4. గాలి. క్రి. చంచలించు.
చంచలుఁడు-స. కాముకుఁడు.

చంచువు-స. పక్షిముక్కు.
చండము-స. భయంకరము. *2.* కోపముగలది.
చండాతకము-స. వేశ్యలచల్లడము.
చండాలుఁడు-స. మాలవాఁడు. రూ. చాండాలుఁడు.
చండి-స. *1.* పార్వతి. రూ. చండిక *2.* కోపము గల ఆఁడుది. *3.* చంపునట్టి ఆఁడుది.
చండి-వి. (చండి) *1.* పార్వతి. *2.* మూర్ఖపుపట్టు గలవాఁడు. *3.* కూ్రరుఁడు. సమా.—పోతు-మూర్ఖపుపట్టుగల స్వభావముగలవాఁడు.
చండించు-స. మిక్కిలి కోపించు.
చండిమ-స. వాఁడిమి. [*2.* వాఁడిమిగలవాఁడు.
చండుఁడు-స. *1.* మిక్కిలి కోపముగలవాఁడు.
చందనము-స. *1.* కుంకుమపువ్వు. *2.* గంధము.
చందమామ-వి. (చంద్రముఁడు) చంద్రుఁడు. రూ. చందురమామ. సమా.—పులుగు-చకోరము.
చందము-వి. (ఛందము) *1.*చందము.*2.*విధము.
చందా-హి. *1.* కానుక. *2.* ధర్మార్థము వసూలగు పైకము.
చందరుఁడు-స. చంద్రుఁడు.
చందిరిక-వి. (చంద్రిక) వెన్నెల.
చందు-తె. *1.* విధము. *2.*అందము.*3.*వి.చంద్రుఁడు. సమా. చందురా-చంద్రకాంతము.
చందురము-వి. (సిందూరము) కుంకుమ. రూ. చంద్రము, చెందిరము, చెంద్రము. సమా. చందురకావి-సిందూరవర్ణము. రూ. చంద్రకావి. —మామ-చంద్రుఁడు.
చందురుఁడు-వి. (చంద్రుఁడు) చందమామ.
చందువ-వి. (చంద్రోదయము) మేలుకట్టు, ఉల్లెడ. రూ. చందువా.
చంద్రకము-స. నెమలిపురికన్ను.
చంద్రకి-స. *1.* నెమలి. *2.* కవుఁజు.
చంద్రము-స. *1.* కర్పూరము.*2.*నీరు.*3.*బంగారు.
చంద్రము-చూ. చందురము.
చంద్రముఁడు-స. చంద్రుఁడు.
చంద్రిక-స. వెన్నెల. (వి. చందిరిక)
చంద్రుఁడు-స.నెల. సమా. చంద్రకాంతము-చలువ రాయి.—చ్ఛందము-వేయిపేఁటలుగల హారము. —బీజము-వెండి. —శాల-*1.* పైమేడ. *2.* వెన్నెల. —శేఖరుఁడు-శివుఁడు, నెలతాలుపు. —హాసము-కత్తి. చంద్రాతపము-వెన్నెల. చంద్రోదయము-ఉల్లెడ. (వి. చందురా) [స్థానము)
చంపకము-స. సంపెఁగ.
చంపు-తె. చావఁజేయు.సమా.చంపుఁడుగట్టు-వధ
చకితము-స. భయము.
చకోరకము-స. వెన్నెలపులుఁగు. రూ. చకోరము. (వ్యు. వెన్నెలఁజూచి తృప్తినొందునది.)
చక్క-తె. *1.* సుందరము. *2.* తిన్న. సమా. —ఁదనము-*1.* సౌందర్యము.*2.*ఋజుభావము. రూ. చక్కన. చక్కనయ్య-*1.* సుందరుఁడు. *2.* మన్మథుఁడు. క్రి. చక్కఁబడు-ప్రే.చక్కఁజేయు, చక్కఁబెట్టు.
చక్కి-తె. స్థానము.
చక్కియ-తె. ప్రక్క. [గిలిగింత.
చక్కిలి-తె. చూ. చంక. సమా.—గిలి,—గింత-
చక్కు-వి. *1.* (షట్కము) అఱ.*2.*(శల్కము) తునుక. క్రి. చక్కాడు, చక్కడుచు-*1.* ఖండించు. *2.* చంపు.
చక్కెర-వి.(శర్కర) పంచదార.సమా.—తిండి-చిలుక. —విలుకాఁడు-మదనుఁడు.
చక్రము-స. *1.* విష్ణునాయుధము. *2.* బండికల్లు. *3.* గుంపు. *4.* దండు. *5.*రాష్ట్రము. *6.*కుమ్మరిసారె. *7.* నీటిసుడి. *8.* జక్కవ. సమా. చక్రిడోల-రంకు(గు)ల రాట్నము.—ధరము-పాము.—ధరుఁడు-విష్ణువు. (ఇట్లే చక్రపాణి. మొ.) —పక్షము-హంస. —వర్తి-సార్వభౌముఁడు. (స్త్రీ. చక్రవర్తిని) —వాకము-జక్కవ. —వాళము-*1.* గుంపు. *2.*మండలము. *3.* లోకాలోకపర్వతము, చుట్టుఁగొండ. —వృద్ధి-వడ్డికివడ్డి. చక్రాంగము-*1.* హంస. *2.* జక్కవ. (స్త్రీ.చక్రాంగి) చక్రి-*1.*విష్ణువు. *2.* రారాజు. *3.* కుమ్మరి.*4.*హంస. *5.*పాము.
చక్షువు-స. కన్ను. సమా. చక్షుశ్శ్రవము-పాము, కనువినికి.
చగుడు-తె. కారపుమన్ను. రూ. చవుడు, చౌడు.
చచ్చవుకము-వి. (చవుకము+చవుకము) సరియైన చౌకము.

చచ్చు-తె. మరణించు. కృ. చావు.
చటకము-స. పిచ్చుక. [రూ. చటిల్లు.
చటాలు-తె. వేయుటయందగు ననుకరణము.
చలము-స. చలించునది.
చటులువడు-తె. మొక్కపోవు.
చట్ట-తె. 1. చిన్నగోనె. 2. తొడకు వెలుపలి భాగము. 3. కవచము. 4. పూఁత. 5. తోలు. 6. పునుఁగుచట్ట.
చట్టన-తె. శీఘ్రముగా.
చట్టము-తె. 1. పునుఁగుచట్ట. 2. న్యాయశాస్త్రము. 3. మంచములోనగువాని పక్కెలచేరిక.
చట్టలుచీరు-తె. చంపు.
చట్టలువాపు-తె. నాశముచేయు.
చట్టి-తె. నోరువెడలుపుగల చిన్నమట్టి పాత్రము.
చట్టు-తె. 1. చాఁపఱాయి. 2. ఱాయి. 3. శిష్యుఁడు.
చట్టువ-తె. తెడ్డు. రూ. చెట్టువ.
చట్టువము-తె. 1. గరిఁటె. 2. తెడ్డు.
చట్రాయి-తె. (చట్టు+ఱాయి) చాఁపఱాయి.
చణకము-స. సెనగలు.
చతికిలు-తె. పిఱ్ఱలునేలనాను. రూ. చదికిలు.
చతురంగము-స. చదరంగము.
చతురంతయానము-స. పల్లకి.
చతురము-స. 1. గజశాల.
చతురస్రము-స. చదరము. [మొ.)
చతురాననుఁడు-స. బ్రహ్మ. (ఇట్లే చతురాస్యుఁడు.
చతురిమ-స. నేర్పరితనము.
చతురుఁడు-స. నేర్పరి. [2. నాలవది.
చతుర్థి-స. 1. పక్షమున నాలవదినము. చవుతి.
చతుర్దంతము-స. ఐరావతము, చౌదంతి.
చతుర్దశి-స. 1. పక్షమున పదునాలవతిథి. 2. పరివాదిని యను వీణ. 3. పదునాలవది.
చతుర్భుజుఁడు-స. విష్ణువు, ఉడ్డకేలువేలుపు.
చతుష్కము-స. 1. చదుకము. 2. చవికె. 3. నాలుగు.
చతుష్టయము-స. నాలుగు.
చతుష్పథము-స. చదుకము.
చతుష్పదము-స. 1. ఒకకరణము. 2. నాలుగు కాళ్ల జంతువు. రూ. చతుష్పాత్తు, చతుష్పాదము.
చతుష్షష్టి-స. అఱువదినాలుగు.

చత్వరము-స. ముంగిలి.
చత్వరిక-స. బాలవిధవ. [రూ. చదరిక.
చదర-తె. 1. కూర్చుండెడుతడిక. 2. చిన్నవి సరి.
చదరంగము-వి. (చతురంగము) ఒకానొకయాట.
చదరము-వి. (చతురస్రము) 1. సమమైననాలుగు మూలలుగలది. 2. సమానమైనది.
చదలము-తె. సైన్యము.
చదలు-తె. ఆకాశము. సమా.—కాపు-వేలుపు. —మానికము-సూర్యుఁడు, ద్యుమణి. చదలేఱు-ఆకాశగంగ, వియన్నది.
చదికిలు-చూ. చతికిలు. [1. చంపు. 2. నలఁచు.
చదియు-తె. నలఁగు. కృ. చదియ. ప్రే. చదుపు-
చదుకము-వి. (చతుష్కము) నాలుగుదారులు కలి
చదుకు-తె. బురద. [యుచోటు.
చదును-తె. 1. సమప్రదేశము. 2. సమము.
చదుము-తె. గ్రుద్దు.
చదుర-వి. (చతుర) సమర్థురాలు. రూ. చదురాలు.
చదురు-వి. 1. (చతురము) నేర్పు. 2. ఆటకచ్చేరి. 3. (సదస్సు) సభ.
చదురుఁడు-వి. (చతురుఁడు) సమర్థుఁడు.
చదువు-తె. 1. పఠించు. 2. పఠనము. 3. విద్య. 4. బ. వేదములు. సమా. చదువరి-విద్వాంసుఁడు. చదువులపడఁతి-సరస్వతి. —పులుఁగు-చిలుక. —ముదుకఁడు-బ్రహ్మ. —య్య-ఉపాధ్యాయుఁడు. —వేలుపు-బ్రహ్మ. ప్రే. చదివించు-1. చదువఁజేయు. 2. పెండ్లిండ్లయందు వధూవరులకు కానుకలు పురోహితునిచే చెప్పించియిచ్చు.
చనవు-తె. 1. అధికారము. 2. అనురాగము. 3. కోరిక. 4. చెల్లుబడి. సమా. చనవరి-చనవుగలవాఁడు.
చను-తె. 1. పోవు. 2. చెల్లు. 3. తగు. 4. కడచు. 5. పొందు. 6. వి. చన్ను. సమా. —గప్పు-ఱవిక. రూ. చన్నుగప్పు. (ఇట్లే చనుమఱుపు. మొ.) —కట్టు.—పై.—. —మఱ-చనుమొనచుట్టునుగల నలుపు. —ముక్కు-చూచుకము. (ఇట్లే—మొన,—మోము. మొ.) చనువాఁడు - చెల్లుఁబడికలవాఁడు. [క్రి.—దెంచు-1. వచ్చు. 2. పోవు.

చనుప-తె. బిదారు.
చనుపకము-వి. (చంపకము) సంపెఁగ.
చన్నీళ్లు-తె. (చల్ల+నీళ్లు) శీతలోదకము.
చన్ను-వి. (స్తనము) 1. చూ. చను. 2. మొగలి యాడ. 3. తాటిముంజె.
చపల-స. 1. లక్ష్మి. 2. మెఱపు. 3. అంకుటాలు.
చపేటము-స. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి. (వి. చప్పట) [నది. (చప్పన, చప్పఁదనము)
చప్ప-తె. 1. రసహీనము. (రూ. చవ్వ) 2. అణఁగి
చప్పట-వి. 1. చపేటము. 2. చఱపు. క్రి. చప్ప టించు-చఱచు.
చప్పరము-తె. 1. పైన పందిరివలె నేర్పఱచిన నలుచదరపు ప్రూనిచట్టము. 2. చౌకముతీర్చి వేసినపందిరి. 3. గుడారము. రూ. చప్రము. సమా. చప్పరమంచము-చప్పర మమర్చిన మంచము.
చప్పరించు-తె. చవిచూచు.
చప్పి-తె. లోపలికణఁగినది, చప్ప.
చప్పిడి-తె. 1. చప్పనిది. 2. లోపలికణఁగినది.
చప్పుడు-తె. శబ్దము. క్రి. చప్పుడించు.
చబుకు-హిం. జాటీ.
చమత్కారము-స. నేరుపు. రూ. చమత్కృతి.
చమరము-స. 1. వింజామరము. రూ. చామ రము. 2. సవరము. 3. సవరపుమెకము.
చమరి-స. ఆఁడుసవరపుమెకము.
చమరు-తె. 1. అఱచేతకొట్టు. 2. చంపు.
చమురు-తె. 1. రాచు. రూ. చరుము. 2. కృ. నేయి, నూనె మొ.
చమువు-స. 1. 729 రథములు, అన్నియేనుఁ గులు, 2187 గుఱ్ఱములు, 3647 కాల్బురు గల సేన. 2. సేన. సమా. చమూపతి-సేనా నాయకుఁడు.
చయము-స. సమూహము.
చయ్యన-తె. శీఘ్రముగా.
చఱచు-తె. 1. అఱచేతతట్టు. 2. అఱచేతకొట్టు. 3. కొట్టు. 4. ఆక్రమించు. 5. తుడుచు. కృ. చఱపు.
చరణము-స. 1. తినుట. 2. తిరుగుట. 3. నడ వడిక. 4. పాదము. 5. వేరు. సమా. చరణా యుధము-కోడి, అజ్జవాలు.
చఱపు-తె. 1. ఆస్ఫాలనము. 2. ఆచ్ఛాదనము.
చరమము-స. 1. కడపటిది. 2. పడమటిది. సమా. చరమక్రియ - అంత్యకర్మము. చరమాద్రి - అస్తగిరి.
చరము-స. 1. కదలునది. 2. తిరుగునది. (వ్య. అచరము) క్రి. చరించు. సమా. చరాచరము- 1. జగత్తు. 2. తిరుగునది తిరుగనిది కలది.
చరలాడు-తె. క్రీడించు. కృ. చరలాట, చర్లాట, చరలాటము, చర్లాటము.
చఱి-తె. సంచరింపనశక్యమగుపర్వత శిఖరము క్రిందిచోటు. రూ. చఱియ.
చరి-తె. 1. గంజి. 2. అంబలి.
చరిత-స. నడవడి. రూ. చరితము, చరిత్ర, చరిత్రము.
చరుఁడు-స. 1. వేగులవాఁడు. 2. అంగారకుఁడు.
చరుము-చూ. చమురు. [కుండ.
చరువు-స. 1. హవ్యము. 2. హవ్యమువండెడు
చర్చ-స. 1. విచారము. క్రి. చర్చించు. 2. చింత. 3. గంధము లోనగువాని పూఁత.
చర్మము-స. 1. తోలు. 2. కేడెము. సమా. చర్మకారుఁడు-మాదిగవాఁడు. చర్మి-కేడెము ధరించినవాఁడు.
చర్య-స. నడచుట, నిలుచుట, కూర్చుండుట, పరుండుటలయందు సమాహితుఁడగుట.
చర్వణము-స. నమలుట.
చర్వితము-స. నమలఁబడినది. సమా. చర్వితచర్వ ణము-నమలినదానిని నమలుట.
చల-స. లక్ష్మి.
చలచలన-తె. ద్రవరూపము.
చలము-తె. మాత్సర్యము. రూ. చలపకారము. సమా. చలపకారి-మాత్సర్యశీలుఁడు. చలపాది- పై.—రూ. చలమరి. క్రి. చలపట్టు-మాత్సర్య ముగొను. రూ. చలముకొను. చలపొడుచు- చలపోరు-చలముతో పోరాడు. [చలించు.
చలనము-స. 1. కదలుట. 2. తిరుగుట. క్రి.
చలవాది-తె. చావువార్త తెలుపువాఁడు.
చలాడము-తె. సగముతొడవఱకు తొడిగికొను గుడిగి. రూ. చల్లడము, చల్లాడము.
చలి-తె. శీతము. సమా.—కారు-1. శీతకాలము.

2. శిశిరఋతువు. (ఇట్లే చలితటి ము.)—గురువు - మీఁదఇసుకగల తాతిపాఱునేల. —గొండ-హిమాద్రి. (ఇట్లే చలిగట్టు,—మల. ము.) —చీమ-నల్లనిపెద్దచీమ. —ది-(చలి+అది) నీటఁబోసినఅన్నము; పర్యుషితము. రూ. చద్ది. —నట్టు-గాలి. —నెల-*1*. మాఘము. *2*. ఫాల్గునము. —పందిరి-దాహమునకు నీరిచ్చుచోటు, ప్రప. —పని-శైత్యోపచారము. —పిడుగు-చెడగరపుమంచుగడ్డ. —యిసుక-హిమవాలుక. —వెలుఁగు-చంద్రుఁడు, శీతకిరణుఁడు. క్రి. —వాపు-బుజ్జగించు.

చలితము-స. కదలింపఁబడినది.

చలిమిరి-తె. చలువ, శైత్యము. రూ. చల్మిరి.

చలుపు-తె. *1*. చేయు. *2*. కడపు. రూ. సలుపు.

చలువ-తె. *1*. శైత్యము. రూ. చలువడి. *2*. ఉదికిన వస్త్రము. క్రి. చలువచేయు. రూ. చల్వ. సమా. —గట్టు-హిమవంతము. —జోతి-చంద్రుఁడు. —మిరియము-తోఁకమిరియము. —తాయి-చంద్రకాంతము. —తేఁడు-చంద్రుఁడు.

చల్ల-తె. *1*. మజ్జిగ. *2*. శీతము. సమా. —చప్పుడు-జడుఁడు. —జంపు-భయంకరుఁడు. —రాడు-తరిగంబము. క్రి. చల్లపడు. చల్లనగు, చల్లారు.

చల్లడము-చూ. చలాడము.

చల్లన-తె. శైత్యము.

చల్లు-తె. *1*. నీళ్లెగురవిడుచు. *2*. విత్తనములు చల్లు. *3*. కృ. చల్లుట. సమా. —పోరు-నీళ్లు చల్లుకొనుచు ఆఁడెడిఆట. క్రి. చల్లులాడు.

చవలము-తె. వరహాలో నెనిమిదవభాగము.

చవి-తె. *1*. రుచి. *2*. రసము.

చవిక-వి. (చతుష్కి) మండపము. రూ. చవికె.

చవ్వ-చూ. చప్ప.

చవ్వంచ-తె. (చవు+పంచ) అయిదు.

చషకము-స. *1*. గిన్నె. *2*. కల్లుత్రాగుపాత్రము. (వ్యు. దీనియందు పానముచేయుదురు)

## చా

చాంచల్యము-స. చపలత్వము.

చాంద్రమానము-స. చంద్రునిగతినిబట్టి యేర్పఱచు కాలపరిమాణము.

చాంద్రాయణము-స. భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములలో చంద్రుని వృద్ధిక్షయముల ననుసరించి కృష్ణపక్షమందొక్కొక్క కడిగా తగ్గించుచు, శుక్లపక్షమందొక్కొక్క కడిగా హెచ్చించుచు భుజించి చేయు వ్రతము.

చాందిని-హిం. మేలుకట్టు.

చాంద్రి-స. వెన్నెల.

చాంపేయము-స. *1*. బంగారు. *2*. సంపెంగ.

చాఁగఱ-తె. నాశము. క్రి. —గొట్టు-చంపు. —గొను-*1*. కొట్టు. *2*. ఖండించు. —లాడు-నాశముచేయు.

చాఁగు-తె. *1*. దీర్ఘమగు. *2*. దండాకారముగా నేలకువ్రాలు. *3*. ప్రశంసార్థకము. రూ. సాఁగు. ప్రే. చాఁచు, చాఁపు. రూ. చాఁగిల్లు. కృ. చాఁగిలింత-నమస్కృతి.

చాఁదు-తె. *1*. నీళ్లుపోసిరాచు. *2*. బొట్టుపెట్టుకొను నల్లని ద్రవ్యము.

చాఁప-తె. *1*. క్రిందపఱచుకొనునది. *2*. ఓడకుఁగట్టెడి చాఁప. సమా. —కట్టు-చాఁపపఱపువంటి పఱపు. —తాయి-బండ.

చాఁపు-తె. *1*. చాఁగఁజేయు. *2*. కృ. చాఁచుట. *3*. పడుగుకొలఁది వస్త్రము.

చాకచక్యము-స. చకచక భావము, నేర్పు.

చాకల-తె. గుడ్డలుదికి జీవించుజాతి. (పుం. చాకలి, చాకి. స్త్రీ. చాకిత)

చాకిరి-హిం. నీచమైన కొలువు.

చాకు-హిం. కత్తి.

చాగము-వి. (త్యాగము) ఈవి. సమా. చాగకాఁడు, చాగి-త్యాగి. —రతనము-చింతామణి.

చాగు-తె. *1*. పోవు. *2*. ప్రవర్తిల్లు. *3*. యత్నించు. రూ. సాగు. సమా. —బడిక-*1*. పూజ. *2*. నమస్కారము.

చాచి-తె. స్తన్యము. (బాలభాష)

చాటు-తె. *1*. విశదపఱచు. రూ. చాటించు. *2*. నెపముపెట్టు. *3*. మఱుఁగు. క్రి. చాటువడు.

చాటువ-తె. *1*. చాటించుట. *2*. నెపము.

చాటువు-స. ప్రియమైన మాట.

చాడీ-హిం. కొండెము. సమా. చాడీగొట్టు-కొండెకాఁడు.

చాడుపు-తె. విధము. రూ. చాడ్పు.

చాతకము-స. వానకోయిల.

చాతు-అ. ధరించు. సమా. చాతనివాఁడు-యజ్ఞోప
  వీతము ధరింపనివాఁడు, శ్రీవైష్ణవుఁడు.
చాతురి-స.నేర్పు. [శుద్ధమువఱకుచేయుఒకవ్రతము.
చాతుర్మాస్యము-స. ఆషాఢశుద్ధము మొదలు కార్తిక
చాతుర్యము-నేర్పు. రూ. చాతురి.  [జాతులు.
చాతుర్వర్ణ్యము-స. బ్రహ్మక్షత్రియవైశ్య శూద్ర
చాదస్తము-వి. (ఛాందసము) లోకజ్ఞానములేమి.
  (పుం. చాదస్తుఁడు.)
చాన-తె. ఆఁడుది.
చానపి-తె. కలయంపి.  [బడునది)
చాపము-స. ధనుస్సు (వ్యు. వెదురుతో చేయఁ
చాపరువు-తె. చావుపరువు.
చాపలము-స. చపలభావము. రూ. చాపల్యము.
చామ-వి. (శ్యామ) 1. యౌవనవతి. 1. నలుపు.
  3.ఒకతెగ పైరు. [చామనచాయ-నల్లనిరంగు.
చామనము-వి. (శ్యామలము) నలుపు. సమా.
చామరము-స. వింజామరము.(వ్యు.చమరమృగపు
  వెంట్రుకలతో చేయఁబడునది.)
చామీకరము-స. బంగారు.
చాయ-వి. (ఛాయ) 1. కాంతి. 2.సూర్యునిభార్య.
  3. నీడ. తె. 4. పోలిక. 5. రంగు. 6.వైపు.
  7. జాడ. 8. సమీపము. 9. చక్కన. సమా.
  —పట్టి-శనైశ్చరుఁడు.--మగఁడు-సూర్యుఁడు.
  క్రి.—వాఱు-పోలు.
చాఱ-తె. 1. గీఱ. రూ. చాఱిక.2. మోరటచెట్టు.
  సమా. చాఱలమెకము-పులి.
చారణుఁడు-స. 1. నానాదేశ సంచారకుఁడైన నట్టు
  వుఁడు. 2. ఒకతెగ ఖేచరుఁడు.
చారము-స. 1. చెఱ. 2.నడ. సమా. చారవాయు
  వు-పడమటిగాలి.
చాఱిక-తె. చాఱ.
చారిత్రము-స. చరిత్రము.  [సూడ్పు.
చారు-తె. పొరకకట్టయడుగుతో నుఱిచిన కళ్లము
చారు-తె. 1. సున్నముకలిసినకల్లు. 2. సంభార
  ములుచేర్చి కాఁచిన చింతపండురసము.
చారువు-స. 1. బృహస్పతి. 2. ఒప్పిదమైనది.
చాలనము-స. జల్లెడ. రూ. చాలని.
చాలు-తె.1.కావలసినంతయగు.2.ఓపు. 3.వరుస.
  4. దున్నునప్పుడు కఱ్ఱుచేనేర్పడురేఖ. 5.ధార.
  సమా. —పేరింటిపూఁబోఁడి - సీతాదేవి. —
  మాసి - పరాధీనుఁడు. —వాఁడు - శక్తుఁడు.
  చాలమి - అశక్తి.  చాలిక - సామర్థ్యము.
  చాలుపు-వరుస. చాలుబడి-చాలిక. క్రి. చాలిం
  చు-1. నిలుపు. 2. శక్తముగఁజేయు.
చావడి-తె. 1. కొలువుకూటము. 2. మండపము.
చావు-తె. మృతి.

## చి

చించు-తె. చినుఁగఁజేయు. రూ. చింపు.
చింత-తె. చింతచెట్టు.
  స. 1. తలఁపు. 2. వ్యసనము. క్రి. చింతించు.
చింతన-స. పలుమాఱు తలఁచుట.
చింతనీయము-స. చింతింపఁదగినది.  [తనము.
చింతామణి-స. కోరికలొసఁగు దేవమణి, చాగర
చింతితము-స. చింతింపఁబడినది.
చింత్యము-స. చింతింపఁదగినది.
చింధము-తె. శంఖము.
చిందఱ-తె. విజృంభణము.
  వి. (ఛిద్రము) 1. రంధ్రము. 2. ఖండము.
  సమా. —వందఱ-1. తునాతునుకలు. 2. కల
  గుండు. క్రి.—గొను-విజృంభించు. —రేఁగు-
  ఆవేశమెత్తు. —పోవు-తూఁటుపడు.—సేయు-
  భేదించు.
చిందియ-తె. జెట్లకుల్లాయ. [చు.కృ.చిందిలిపాటు.
చిందిలి-తె. చలించినది. క్రి.—పడు-సంభ్రమిం
చిందిలు-తె. చలించు.
చిందు-తె. 1. నీళ్లు తొనఁకిపడు. 2.రాలు. 3.వ్యా
  పించు. 4. వెచ్చముసేయు. 5. నాట్యము.
  6. మాదిగలయొద్ద యాచించు ఒకతెగ. క్రి.
  చిందాడు-నాట్యమాడు. రూ. చిందుద్రొక్కు.
  చిందులుద్రొక్కు.
చిందువ-తె. చిన్నపెళ్ల.
చిందువందు-తె. చెదరినది.
చింపి-తె. చినిఁగిన వస్త్రము. రూ. చింపు.
చింపిఱి-తె. 1. బిఱుసెక్కిన చిన్నవంకర వెంట్రు
  కలు. 2. విరియఁబోసికొన్నది. 3. చింపి.

చింపు-తె. 1. చించు. 2. చినిఁగిన వస్త్రఖండము.
చింబు-తె. మేఁక. సమా. చింబోతు-(చింబు+పోతు) మేఁకపోతు. [చిక్కటారి.
చికటారి-తె. (చికి+కటారి) చిన్నకటారి. రూ.
చికమక-తె. చిక్కు.
చికిచికి-తె. చిన్న. [చికిత్సించు.
చికిత్స-స. రోగమునకుఁ జేయు ప్రతిక్రియ. క్రి.
చికిత్సకుఁడు-స. వైద్యుఁడు.
చికినము-వి. (చిక్కణము) చాయవక్క. రూ. చికిని.
చికిలి-తె. తుడిచి చిక్కఁ జేయుట.
చికిలు-తె. పసవుతో నేడ్చు.
చికీర్ష-స. చేయనిచ్ఛ. (పుం. చికీర్షువు)
చికురము-స. 1. వెంట్రుక. 2. కదలునది.
చిక్కంబె-తె. తలచిక్కుడీసికొనెడి నిడుపుదువ్వెన.
చిక్కటారి-చూ. చికటారి. [3. తళుకైనది.
చిక్కణము-స. 1. చాయవక్క. 2. నునుపైనది.
చిక్కన-వి. (చిక్కణము) 1. తఱచు. 2. దార్ఢ్యము. 3. బలము.
చిక్కము-వి. (శిక్యము) 1. ఉట్టి. తె. 1. దారముతో అల్లినసంచి. 2. పసుల మూతికిఁ గట్టు బుట్ట.
చిక్కు-తె. 1. కృశించు. 2. తక్కు. 3. తగులు. 4. దొరకు. 5. మిగులు. 6. మెలి. 7. టంకము. క్రి. చిక్కుపడు-1. మెలిపడు. 2. సంకటపడు. కృ. చిక్కుపాటు. [చీకొట్టు.
చిక్కొట్టు-తె. (చీ+కొట్టు) చీ చీ యను. రూ.
చిక్కోల-తె. చిక్కంబె.
చిగురు-తె. 1. పల్లవము. 2. లేఁత. రూ. ఇగురు. చివురు. క్రి. చిగిరించు, చిగురుచు. కృ. చిగిరింత. సమా. చిగురాకుదిండి-కోకిల. —విలుకాఁడు-మదనుఁడు. —బోఁడి-1. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది. 2. ఆఁడుది. క్రి. చిగురొత్తు-1. చిగురుచు. 2. అనురక్తమగు.
చిచ్చు-వి. (శుచి) 1. అగ్ని. 2. తాపము. సమా. చిచ్చఱ-(చిచ్చు+అఱ) అగ్నిమయము. రూ. చిచ్చుఱ. చిచ్చఱకంటి-శివుఁడు.
చిటపొట-తె. ఈర్ష్యచేఁగలుగు స్త్రీకోపము.
చిటి-తె. చిన్న. రూ. చిట్టి. సమా. —తాళము-కఱతాళము. —పోటి-అల్పము. —వ్రేలు-చిన్నవ్రేలు.

చిటిక-తె. 1. నడిమివ్రేలిని పెద్దవ్రేలిని చేర్చి ధ్వనింపఁ జేయుట. 2. అట్లు ధ్వనింపఁ జేయు నంతకాలము. క్రి. చిటికరించు. కృ. చిటికరింత.
చిటికెన-తె. చిన్నవ్రేలు, కనిష్ఠిక.
చిటుకు-తె. అల్పశబ్దము. రూ. చిటుక్కు. క్రి. చిటుకను, చిటుక్కను.
చిటులు-తె. 1. పగులువాఱు. 2. మిక్కిలికోపించు. 3. వృత్తాంతము. రూ. చిట్లు.
చిట్ట-తె. 1. ఆశ్చర్యము. 2. చిన్నపొద. క్రి. చిట్టమిడుచు. చిటికవేయు.
చిట్టకము-తె. 1. శృంగారచేష్ట. 2. లీల. 3. కపటము. రూ. చీటకము.
చిట్టచివర-తె. (చివర+చివర) మిక్కిలి చివర.
చిట్టి-తె. 1. చిన్న. రూ. చిటి. 2. సోలయందు నాలవభాగము. సమా. చిట్టంటులు-నఖక్షత దంతక్షతములు. —చేఁతలు-విలాసము. చిట్టాముదము-చిన్నతెగ ఆముదపుచెట్టు. చిట్టుడుకునీళ్లు-పొంగునీళ్లు. చిట్టుములు-(చిట్టి+ఉములు) గర్భిణికిఁగలుగు లక్షణము. చిట్టెలుక-చిన్నతెగయెలుక. క్రి. చిట్టాడు-1. సంచరించు. 2. తప్పటడుగులిడు. 3. ప్రసరించు. 4. చలించు. 5. క్రీడించు.
చిట్టియ-తె. 1. వెదురుకనుపులనుండి పుట్టు సన్నని కఱ్ఱ. 2. వస్త్రపు టంచులసన్నకమ్మి. రూ. చిట్టె.
చిట్టియము-తె. ఇనుముకాఁచునప్పుడు వచ్చుముఱికి. రూ. చిట్టెము. [గలవాఁడు.
చిట్లు-చూ. చిటులు. సమా. —కట్టె-మిక్కిలి కోపము
చిడిపి-తె. 1. అల్పము. 2. పరుషము. రూ. చిలిపి.
చిడిముడి-తె. తొట్రు. క్రి. —పడు. కృ. —పాటు.
చిడుగు-తె. అల్పము.
చిడుము-తె. చిన్నకుఱుపు.
చిత-స. 1. సొద. 2. ప్రోగు. రూ. చితి.
చితుకు-తె. కుఱుపులోనగునవి నలఁగు.
చిత్త-వి. (చిత్ర) పదునాలవనక్షత్రము. సమా. చిత్తడి-(చిత్త+తడి) మిక్కిలితడి. చిత్తఱి-(చిత్త+తఱి) వర్షర్తువు.
చిత్తగించు-వి. (చిత్తము+ఇంచు) 1. నమస్కరించు. 2. తలఁచు. 3. యోచించు.

చిత్తము-స. మనస్సు. [సందలిరూపు.
చిత్తరువు-వి. (చిత్రము) 1.ఆశ్చర్యము.2.పటము
చిత్తిని-వి. (చిత్రిణి) ఒక స్త్రీజాతి.
చిత్తు-తె. మొదట వ్రాసిదిద్దనిది. స. జ్ఞానము.
చిత్ర-స. చిత్త.
చిత్రభాను-స. అఱువదింటపదునాఱవసంవత్సరము.
చిత్రము-స. 1. ఆశ్చర్యము. 2. పటమునవ్రాసిన రూపము. 3.నానావర్ణము.4.ఒకతెగ కవిత్వము. క్రి. చిత్రించు.సమా. చిత్రకంఠము-కపోతము.
చిత్రకము - చిఱుతపులి. రూ. చిత్రకాయము. —కారుఁడు-చిత్తరువు వ్రాయువాఁడు. రూ. చిత్రకుఁడు. —గుప్తుఁడు-1. యముఁడు. 2.యమునొద్ద లెక్కవ్రాయు కరణము.—బింబము - ఊసరవెల్లి. —భానుఁడు-1. అగ్ని. 2. సూర్యుఁడు. —శిఖండిజుఁడు-బృహస్పతి.
చిత్రిణి-స. ఒక స్త్రీజాతి.
చిత్రితము-స. చిత్రింపఁబడినది.
చిదక-తె. చప్పట. రూ. చిరుక.
చిదగొాద-తె. వ్యత్యాసము.
చిదియు-తె. నలఁగు. కృ. చిరక, చిదుక.
చిదుకు-తె. చిప్పిలు. ప్రే. చిదుపు.
చిదుగు-తె. ఎండిన సన్నపుల్ల, సమిధ.
చిదుము-తె. 1. గిల్లు.2.పూలుకోయు.3.త్రుంచు. 4. వైచు. 5. కృ. చిదురు.
చిదురలు-తె. 1. సూక్ష్మఖండములు. 2. సూక్ష్మభాగములు. రూ. చిదురుపలు, చిద్రుపలు.
చిన-చూ. చిన్న.
చిని-చూ. చిన్ని. [చింపు.
చినుఁగు-తె. వస్త్రాదులు ఛిన్నమగు. ప్రే.చించు,
చినుకు-తె. 1. కాఱు. 2. కురియు. 3. కార్చు. 4. కృ.వర్షబిందువు. సమా.—పూస-ముత్తెము.
చిన్న-తె. 1. అల్పము. 2. కనిష్ఠము. సమా. —నాఁడు-బాల్యసమయము. రూ.చిన్నటనాఁడు. —వాఁడు-బాలుఁడు. —ది-1.బాలిక.2.చిన్నవస్తువు.
చిన్నము-తె. నాలుగు గురిగింజల యెత్తు.
చిన్నరిపొన్నరి-తె. మిక్కిలి మనోజ్ఞము. రూ. చిన్నారి పొన్నారి.
చిన్నవోవు-తె. ఖిన్నుఁడగు.
చిన్నారి-చూ. చిన్నరి పొన్నరి.
చిన్ని-తె. 1. చిన్న. 2. మనోజ్ఞము.
చిన్నిదము-తె. 1. చిన్నిపువ్వు. 2 బంగారు.
చిన్నిపువు-తె. సమస్కారము: రూ. చిన్నిపువ్వు.
చిన్నియ-వి. (చిహ్నము) 1. గుఱుతు. 2. విలాసము. రూ. చిన్నె. సమా. చిన్నెలాఁడి-విలాసవతి. (పుం. చిన్నెలాఁడు) [ముక్కుగలవాఁడు.
చిపిటము-స. 1. అడుకులు. 2. దు. చప్పట
చిప్ప-తె. 1. కప్పచిప్ప. 2. కల్లుత్రాగుగిన్నె. 3. టెంకాయచిప్ప. 4. తాఁబేటిచిప్ప.5.ముత్తెపుఁజిప్ప. 6. మోఁకాటిచిప్ప. 7. తలపుఱ్ఱె. 8. తునుక. 9. చేఁపపొలసు. సమా.—కత్తి-మోటకత్తి. —కూఁకటి-పిల్లజుట్టు.—గొడ్డలి-చెట్లునఱకు గొడ్డలి. —పెడక-ఇంటిపార్శ్వములకప్పు. —ముత్తెము - చేఁతముత్తెము. —మూతి-కళాహీనమగు మొగము.
చిప్పిలు-తె. నీటిబొట్టులోనగునవి లోనుండి పైకుఱుకు. రూ. చిప్పిలు.
చిప్పెవాఁడు-తె. కుత్రపువాఁడు.
చిబుకము-స. గడ్డము. రూ. చుబుకము,చీబుకము.
చిబుకు-తె. చప్పరించు. [రూ. చిమ్మట.
చిమట-తె. వస్త్రాదుల పాడుచేయుపురుగు, ఝిల్లి.
చిమిడిక-తె. చిమిడిన అన్నము.
చిముటు-తె. కనుసైఁగచేయు.
చిముడు-తె. 1. అన్నమధికముగా ఉడికి ముద్దయగు. 2. పాకముచెడు. ప్రే. చిముడుచు.
చిమ్మ-తె. (చిమ్మినది) జలకణసమూహము.
చిమ్మచీఁకటి-తె. గాఢాంధకారము.
చిమ్మట-చూ. చిమట.
చిమ్మదిరుగు-తె. గిరగిర తిరుగు.
చిమ్మనము-తె. చిమ్ముట. సమా. చిమ్మనగ్రోవి-జలక్రీడయందునీళ్లు చిమ్మెడు గొట్టము.
చిమ్మిరేఁగు-తె. మిక్కిలి విజృంభించు.
చిమ్మిలి-తె. నువ్వులు, బియ్యపుపిండి, బెల్లము చేర్చి దంచిన పిండి.
చిమ్ము-తె. 1. వైచు. 2. మీటు. 3. పొడుచు. కృ. 4. పొడుచుట. 5. మీటుట.

చిమ్మఁడు-తె. చిమ్మట.
చియ్య-తె. కండ.
చిరంటి-స. 1. ఐదువరాలు. 2. జవరాలు.
చిరంతనము-స. బహుదినములది.రూ.చిరత్నము.
చిఱచిఱ-తె. కోపవికారము.
చిరమర-తె. భేదము.
చిరము-స. బహుకాలము. సమా. చిరక్రియుఁడు-తామసించి కార్యముచేయువాఁడు. రూ. చిరకారి. —జీవి-1. చిరకాలము జీవించువాఁడు. 2. కాకి. 3. విష్ణువు. రూ. చిరంజీవి. చిరాయువు-వేలుపు.
చిరాకు-తె. కోపము.
చిరి-స. చిలుక.
చిఱు-తె. సమాసమందు చిఱుత శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.—గాలి-మందమారుతము. —గూబ - పైఁడికంటి. —తిండి-భక్ష్యము. —తొడ-పిక్క.—నవ్వు-స్మితము. —పాలు-ఇగురఁగాఁచిన పాలు. రూ. చిలువాలు.
చిరుఁగు-తె. చినుఁగు.
చిఱుత-తె. 1. చిన్న. 2. చిన్నజాతిపులి.
చిఱుతుక-తె. చిన్నవయసుగల ఆఁడుది.
చిరునామా-హిం. పై విలాసము.
చిఱుము-తె. 1. విజృంభించు. 2. చిమ్ము.
చిట్టు-తె. 1. కోపము. 2. చింపి.
చిట్టుచిట్టు-తె. తొట్రుపాటు.
చిట్టులువొడుచు-తె. తొట్రుపడు.
చిట్టు-తె. కోపము. క్రి. చిట్టుమను.
చిట్టుద్ది-తె. (చిఱు+ఉద్ది) చిన్నయుద్ది.
చిట్టుముట్టాడు-తె. 1. పెనఁగులాడు. 2.భేదించు.
చిలిపి-తె. 1. అల్పము. 2.నికృష్టము.రూ.చిడిపి.
చిలివిలిపోవు-తె. సందడించు.
చిలుక-తె. కీరము, శుకము. రూ. చిల్క. సమా. — తాళి - చిలుకరూపేర్పఱచిన పతకము. —రౌతు-మదనుఁడు.
చిలుకలకొలికి-చిలుకకొలుకులవంటి కొలుకులు గల ఆఁడుది. —కొయ్య-ఉడుపులు తగిలించు గూటము, నాగదంతకము.
చిలుకడ-తె.(చిలుకు+కడ)పగ్గములోనగువానికొనను వేయు కొలికిముడి.
చిలుకరించు-తె.చిలుకు.
చిలుకు-తె. 1. చిందు. 2. ప్రసరించు 3. మీఱు. 4. చల్లు. 5.త్రచ్చు. 6.కొలికి. 7.గొండ్లెము. 8. బాణము. 9. బాణపు అలుఁగు. 10.దోఁటి.
చిలుకుడు-తె. చిలుకుట.
చిలుప-తె. 1. కొంచెముగచేరి నిలిచిన నీళ్లు. 2. జందెమువలె చుట్టిన నూలిచుట్ట.3.అల్పము.
చిలుము-తె. 1. రాగిలోనగు లోహములందుఁగల ముఱికి. 2. విషము. 3. పొగపీల్చుట కుపయోగించు గొట్టము. సమా. —వాలు-తులువ.
చిలువ-తె. (చిలుము+వాయి) పాము. సమా. —తాలుపు-శివుఁడు. —తిండి-1.గరుడుఁడు. —ఱేఁడు-శేషుఁడు.
చిలువాయినము-తె. 1. చిల్లర, క్షుద్రము.
చిలువాలు-తె. ఇగురఁగాఁచినపాలు, ఆనవాలు.
చిల్ల-తె. కతక వృక్షము.
వి. (శల్యము) విషము. సమా.—కోల-తోమరము.—గొండి-కలహకారి.—మడ్డి-అందుగు బంకతోఁజేసిన ధూపద్రవ్యము.
చిల్లపెంకు-తె.(చిల్లర+పెంకు) తునిఁగిన చిన్న పెంకు.
చిల్లర-తె. (చిల్లి+అఱ) 1.కొంచెపాటి నాణెము. 2.చింతపండు మున్నగుసరకు.3.సామాన్యము.
చిల్లి-తె. రంధ్రము.
చిల్లింగి-తె. ఉచ్చాటనక్రియ.
చిల్లు-తె. చిమ్ముటయందగు ననుకరణము.
చిల్లుపొల్లు-తె. కలఁత.
చివఁగి-తె. ఒకతెగ వేఁటకుక్క. రూ. చివ్వఁగి. సివఁగి, సివ్వఁగి.
చివక-తె. సన్నని నిడుపాటికొమ్మ, బెత్తు.
చివర-తె. కొన.
చివుక-తె. పాతికరూపాయ.
చివుకు-తె. 1. సారహీనమగు. 2. ఎగయుటయందగుధ్వని. రూ. చివుక్కు.
చివుక్కుమను-తె. మనసు కలఁగు.
చివురు-చూ. చిగురు.
చివ్వ-తె. 1. కలహము. 2. చివక. సమా. చివ్వలాఁడి-కలహశీలురాలు.
చివ్వఁగి-చూ. చివఁగి.

చివ్వు-తె. *1.* చెక్క. *2.* బిగువుచేయుటయం దగుధ్వని.
చివ్వున-తె. శీఘ్రముగా.
చిహ్నము-స. *1.* గురుతు. *2.* పెక్కెము.

## చీ

చీ-తె. తిరస్కారార్థకము. క్రి. చీకొట్టు.
చీఁకటి-తె. (చీఁకు+కట్టు) అంధకారము. సమా. —గాము-రాహువు. —గొంగ-సూర్యుఁడు. —చెట్టు-తమాలవృక్షము. —తప్పు-జారత్వము. —యోఁగ-చిన్నదోమ.
చీఁకిలి-తె. చీఁపురుకట్ట.
చీఁకు-తె. *1.* చప్పరించు. *2.* చుంబించు. *3.* అంధుఁడు. రూ. చీకు. సమా. చీఁకురువాయి-ఒకతెగ గబ్బిలము, ఋషిపక్షి, జతుక. క్రి. చీఁకురించు-అంధమగు.
చీఁదఱ-తె. *1.* ఉపద్రవము. *2.* వి. ఛిద్రము. క్రి.—గొను-తె. *1.* ఉపద్రవపడు. *2.* ఆవేశమెత్తు. —ఱరేఁగు-ఆవేశమెత్తు.
చీఁదు-తె. చీమిడి బయలుపడ ముక్కునదిమి ఊపిరివిడుచు.
చీఁపురు-తె. పొరకకట్ట, సమ్మార్జని.
చీకాకు-తె. (చీకు+ఆకు) *1.* చివికిన ఆకు. *2.* నలఁకువ. క్రి.—పడు.
చీకిలించు-తె. మిఱుమిట్లుగొను.
చీకిలిమాకిలి-తె. కొక్కిరి బిక్కిరి.
చీకు-తె. *1.* సారహీనమగు. *2.* కృ. నిస్సారము. రూ. చివుకు. *3.* అంధుఁడు. రూ. చీఁకు.
చీటకము-చూ. చిట్టకము.
చీటి-హిం. *1.* చిన్నజాబు. *2.* జాబు. *3.* రంగుల ముద్రగల వస్త్రము. రూ. చీటి.
చీటికిమాటికి-తె. మాటిమాటికి.
చీడ-తె. పైరులను చెఱిచెడి పురుగు.
చీపు-అ. అరఁటిగెలలో నొక భాగము. నత్తము.
చీమ-తె. పిపీలిక.
చీమిడి-తె. నాసామలము, శింఘాణము.
చీము-తె. చెడితెల్లనైన నెత్తురు, పూయము.
చీర-వి. (చీరము) *1.* (మునుపు) వస్త్రము. *2.* (ఇప్పుడు) ఆఁడుదిధరించుకోక. సమా. —పేను, —పోతు - గుడ్డనంటుకొనియుండు తెల్లపేను, ధేనుకము.
చీరణము-తె. చిన్నయులి. రూ. చీర్ణము.
చీరము-స. *1.* కౌపీనము. *2.* నారచీర. *3.* నలువది పూసలు గ్రుచ్చిన సరము.
చీరిక-తె. పాయ. రూ. చీలిక. [కృ. చీరుడు.
చీరు-తె. *1.* చీల్చు. రూ. చీఱు. *2.* పిలుచు.
చీఱు-తె. *1.* గీఱు. *2.* చీల్చు. కృ. చీఱుడు.
చీల-తె. మేకు, కీలము. రూ. సీల.
చీలమండ-తె. కాలిమడమ కిరుప్రక్కలనుండు కీలు, గుల్ఫము. రూ. సీలమండ.
చీలి-తె. పిల్లి. (బాలభాష)
చీలిక-చూ. చీరిక. [చీలుచు, చీల్చు.
చీలు-తె. బ్రద్దలగు. కృ. చీరిక, చీలిక. ప్రే.
చీవాట్లు-తె. (చీ+పాటులు) గద్దింపు మాటలు.

## చు

చుంగు-తె. *1.* వ్రేలాడు. *2.* వస్త్రపు కుచ్చెకొన.
చుంగుడు-తె. నిలువయగు చిల్లర.
చుంచు-తె. తలకు ముందుప్రక్కవిడిచిన పిల్లజుట్టు. వి. (చుచుందరి) కంపెలుక. సమా.—మిద్దె-గోపురమువలె పొడవైన కట్టడము.
చుండు-తె. *1.* కాఁగు, ఇగురు. రూ. చూఁడు. *2.* తలపై ఉప్పుపూచినట్లు పూచు వ్యాధి. సమా. చుండెలుక-చుంచు.
చుంబకము-స. *1.* త్రాసుముల్లు. *2.* సూదంటుఱాయి.
చుంబకుఁడు-స. *1.* పెక్కుగ్రంథము లించించుక చదివినవాఁడు. *2.* ముద్దుపెట్టుకొనువాఁడు. *3.* మోసకాఁడు.
చుంబనము-స. ముద్దు. క్రి. చుంబించు.
చుఁడి-తె. చూడుఁడి. రూ. చుఁడీ, చుఁడు. (ఇవి సకారాదియునగు)
చుక్క-వి. (శుక్రుఁడు) *1.* శుక్రనక్షత్రము. *2.* నక్షత్రము. *3.* గుండ్రనిబొట్టు. *4.* నీరు మున్నగువానిబొట్టు. సమా. —కూర-ఒకతెగ కూరాకు. —చేఱు-*1.* నుదుటవ్రేలాడవైచు పతకము. *2.* చుక్కలచాలు. —యెదురు

షుక్రుఁడెదురుగానుండుట (అశుభము. చుక్క-వాలు. అనియు) —ల తెరువు - మిన్ను. —ఱేఁడు-చంద్రుఁడు. (ఇట్లే—దొర,—రాయఁడు మొ.) చుక్కాను-(చుక్క+అను) పడవనడుపుతెడ్డు, అరిత్రము.

చుక్రము-స. 1. చింతపండు, 2. పులుపు.

చుచుందరి-స. చుంచు. రూ. చుందరి. (వ్యు. ధాన్యములను ఛేదించునది.)

చుచ్చు-తె. 1. మేఁక. 2. సంతాపమునందు కలిగించుధ్వని. క్రి. చుచ్చుకొట్టు. [చుఱుకు.

చుచ్చుఱుకు-తె. (చుఱుకు+చుఱుకు) మిక్కిలి

చుట్ట-తె. 1. గుండుగాచుట్టినది. 2. పొగచుట్ట. 3. మోపుక్రింద తలపైనుంచుకొను చుట్ట. సమా. —కుదురు-కుండలు కుదురుటకుంచు వెంటిలోనగువాని చుట్టు.

చుట్టము-తె, 1. బంధువు. 2. సంబంధి. 3. స్నేహితుఁడు. 4. బంధుత్వము. (చుట్టఱికము-బంధుత్వము)

చుట్టు-తె. 1. చుట్టగాచుట్టు. 2. తిరిగిరాఁజేయు. కృ. 3. చుట్టిరాఁజేయుట. 4. తిరిగితిరిగిపోఁదగినమార్గము. 5. నాలుగుప్రక్కలు. సమా. చుట్టిల్లు-నిట్రాలునాటి గుండ్రముగాఁగట్టినఇల్లు, చుట్టుగుడిసె. చుట్టలుఁగు-చక్రాయుధము.(ఇట్లే చుట్టుఁగ్రొద్దువు,—వాలు, మొ.) చుట్టుఁగొండ-చక్రవాళము. (ఇట్లే—గట్టు,—మల. మొ.) —ఁబులుఁగు-చక్రవాకము. —కొల్లారము-కొల్లారము, కొల్లారుబండి. —గుల్ల-వలయాకారశంఖము. —దలి-చుట్టుట. —మాలియ-గుండ్రనియిల్లు. —వేదెము - గుఱ్ఱపుమండలగతి. క్రి. చుట్టివచ్చు-1. ప్రదక్షిణించు. 2. పరివేష్టించు. చుట్టుకొను-పరివేష్టించు, చుట్టువాఱు.

చుప్పనాక-వి. (శూర్పణఖ) రావణునిచెల్లెలు. రూ. చుప్పనాతి.

చుబుకము-స. గడ్డము. రూ. చిబుకము.

చుబ్బనచూఱ-తె. (చూఱ+చూఱ) మిక్కిలి చూఱ, పెద్దకొల్ల.

చుమి-తె. చూడుమి. రూ. చుమీ, చుము, చుమ్మి, చుమ్మీ, చుమ్ము, చుమె, చుమ్మె. (ఇవి నకారాది యునగు.)

చుమ-తె. పై.— రూ. చుమా, చుమ్మ, చుమ్మా.

చుమ్మ-తె. 1. వేధన. 2.చుమ. సమా.—చుట్టు-కడుపునఁగలుగువేదన. క్రి. చుమ్మలు చుట్టు, —వాఱు-వేదనపడు. [చురి, చూరి, చూరీ.

చురకత్తి-వి. (ఛురిక) చిన్నకత్తి. రూ. సురియ,

చుఱచుఱ-తె. కాలుటయందగు ధ్వన్యనుకరణము. రూ. చురచుర. క్రి.—వోవు.

చురి-చూ. చురకత్తి.

చుఱుకు-తె. 1. వాఁడిమి. 2.వేఁడిమి 3.వేగము. 4. ఆయుధమునాటుట, నిప్పునోకుటయందగు ననుకరణము. రూ. చుఱుక్కు. క్రి. చుఱువుచ్చు-కాల్చు.

చుఱ్ఱు-తె. కాలుట మొదలగువానియందగు ననుకరణము. క్రి. చుఱ్ఱుకొను-కాల్చు.

చులక-తె.1. తేలిక.2. సులభము. రూ. చుల్క. క్రి. చులకచేయు. [చులకపాటు.

చులకన-తె. 1. లాఘవము. 2. సౌలభ్యము.రూ.

చులకము-స. 1. చేర. 2. పుడిసిలి.

చుల్లరము-తె. 1. కోడెవయసుగలపంది. 2.కోడెవయసుచేఁ గలుగుమిట్టిపాటు.

చుల్లి-తె. మగగుఱి. రూ. చుల్ల.

చుల్లి-స. 1. ప్రొయ్యి. 2. సొద. రూ. ఛుల్లి.

చువక-తె. చివక. రూ. చువ్వ.

చువ్వె-చూ. చుమి.

## చూ

చూ-తె. 1. చూడుము. 2. చూడుఁడు. రూ. సూ.

చూఁడి-తె. గర్భము, చూలు.

చూఁడు-తె. 1. కాల్చు. 2. చుండు. 3. కృ. వాఁత. సమా. —ఁగొడుపు-పసులకువాఁతవేయు ఇనుపకోల.

చూకురు-తె. శోకము. క్రి. చూకురుపడు.

చూచాయ-తె.(చూపు+చాయ) 1.జాడ. 2.తేలిక.

చూచు-తె. 1. వీక్షించు. 2. యత్నించు. కృ. చూపు, చూడికి, చూడ్కి,

చూచుకము-స. చను మొన.

చూడ-స. 1. నెమలిజుట్టు. 2. జుట్టు. 3. ఛూరు.

4. బాహ్యపురి. సమా. చూడామణి. 1. శిరోరత్నము. 2. (రెండవపదమైనచో) శ్రేష్ఠము, శ్రేష్ఠుడు.
చూడికి-తె. చూపు. రూ. చూడ్కి. చూ. చూచు.
చూతము-స. మామిడిచెట్టు.
చూపట్టు-తె. కనుపట్టు.
చూపు-తె. 1. చూపించు. 2. చూచుట. 3. దృష్టి. సమా. చూపరి - రూపవంతుడు. చూపఱు-(చూపు+వారు) చూచువారు. చూపుగుట్టము-1. ఉపయోగములేనిది. 2. అప్రయోజకుడు. చూపుడుబూట-చూపనొప్పుకొన్నపూట. —వ్రేలు-జుట్టనవ్రేలు, ప్రదేశిని.
చూపెట్టు-తె. 1. చూపించు. 2. కనిపెట్టు. 3. ఎదురు చూచు. [సూయ)
చూపోవు-తె. చూడనసహించు. (చూపోపమి. అ
చూఱ-తె. కొల్ల. సమా. —కారుడు-కొల్లపెట్టినవాడు. క్రి. చూఱకొను, (కొల్లవెట్టు) చూఱలాడు, చూఱాడు-కొల్లవెట్టు. చూఱవోవు-కొల్లపోవు.
చూరకత్తి, చూరి. చూ. చురకత్తి.
చూరు-తె. 1. పొగతగులు. 2. ఇంటికప్పుచివర. 3. వక్క-చెక్క.
చూరె-తె, చూడరే-రూ. చూరే.
చూర్ణకుంతలము-స. అలకము. [దుమ్ము. 4. పొడి.
చూర్ణము-స. 1. గంధపొడి. 2. సున్నము. 3.
చూర్ణిక-స. యమకముగల గద్యము.
చూలిక-స. పిల్లజుట్టు.
చూలు-తె. 1. గర్భము. 2. బిడ్డ. సమా. చూలాలు-గర్భిణి. చూలి-బిడ్డ. క్రి. చూలుకొను,—వడు—గర్భముగలదియగు.
చూవె-చూ. చుమీ. రూ. చూవే.
చూషణము-స. పీల్చుట.

## చె

చెంక-తె. కపోలము. రూ. చెంప, చెక్కిలి, చెరప.
చెంగగొట్టు-తె. ఓడించు.
చెంగనాలు-తె. 1. గంతులు. 2. నమస్కృతి.
చెంగలి-తె. సమీపము.
చెంగలించు-తె. 1. అతిశయించు. 2. ప్రకాశించు. 3. విజృంభించు. 4. హసించు. కృ. చెంగలింపు. [చెల్లగు.
చెంగు-తె. 1. తొలగు. 2. వెనుదీయు. 3.
చెంచు-తె. ఒకతెగబోయ. స్త్రీ. చెంచిత, చెంచెత.
చెండు-తె. 1. ఖండించు. రూ. చెండాడు, చెండు బెండాడు. 2. కందుకము, బంతి. 3. పూబంతి.
చెంత-తె. చేరువ. [ద్రము, చందురము.
చెందిరము-వి. (సిందూరము) కుంకుమ. రూ. చెం
చెందిరిక-తె. కమ్మపైదుద్దు. రూ. చెంద్రిక.
చెందు-తె. 1. కలుగు. 2. పొందు.
చెంప-తె. 1. కపోలము. రూ. చెంక. 2. పార్శ్వము. సమా. —కాయ-చెంపదెబ్బ. —కొప్పు-ప్రక్కకొఱగవేసిన కొప్పు.
చెంబు-తె. చిన్నలోహపాత్రము. సమా. —తల-బట్టతల.
చెకపికలాడు-తె. తొందరపెట్టు.
చెకుముకి-తె. నిప్పుగలిగించుకొనుఱాయి.
చెక్క-తె. మ్రానులోనగువాని తునుక.
చెక్కడము-తె. రత్నములు పొదుగుట.
చెక్కియము-తె. మూలగ. రూ. చెక్కెము.
చెక్కిలి-తె. చెంప. రూ. చెక్కు.
చెక్కు-తె. 1. (రత్నములు) పొదుగు. 2. చేర్చు. 3. చెక్కలుచేయు. 4. చెంప. సమా. చెక్కుదుపాఱ-కసవుచెక్కెడు చిన్నపాఱ, గోకుడుబాఱ.
చెచ్చెర-తె. (చెర+చెర) శీఘ్రముగా.
చెట్ట-తె. 1. కీడు. 2. చేయి. 3. దుష్టుడు. క్రి. —వట్టు-పెండ్లాడు.
చెట్టు-తె. 1. గుల్మము. 2. వృక్షము. సమా. —ద్రిమ్మరి, —నట్టు - కోతి. క్రి. —గట్టు-చెట్టుగానేర్పడు. —పడు-స్తంభించు, మ్రానుపడు.
చెట్టుప-తె. తెక్క. రూ. చట్టుప.
చెడగరము-తె. క్రూరుడు.
చెడిప-తె. (చెడిన+అప) అంకుటాలు.
చెడు-తె. 1. కనబడకపోవు. 2. కొల్లపోవు. 3. నశించు. కృ. చెట్ట, చెడుగు, చెడ్డ. ప్రే. చెఱచు.

క్రి. చెడనాడు-1. నిందించు. 2. శపించు.
చెడుగు-తె. 1. అశుభకార్యము. 2. క్రూరము.
3. దుష్టురాలు. (పుం. చెడుగఁడు.)
చెడ్డ-తె. 1. కీడు. 2. దుష్టము. [రూ. చెడ్డి.
చెడ్డి-తె. మోఁకాలివఱకుఁ దొడిగికొను గుడిగి.
చెడ్డు-తె. తొడచఱచు.
చెత్త-తె. తృణము.
చెదరు-తె. 1. నీళ్లలోనగునవి యెగిరిపడు.2.వ్యాపించు.కృ.3.చెదరుట.4.కలఁత. [అనియు)
చెదలు-తె. పుట్టపెట్టు తెల్లచీమ. (చెదపురుగు
క్రి. చెదవట్టు-చెదలుపట్టు. [కణము.
చెదారము-తె. 1. తృణలేశము. 2.రాల్చఁగాపడిన
చెనఁగి-తె. 1. పొట్టి టెంకాయచెట్టు. 2. ఒకతెగవరి. రూ. చెన్నఁగి. [ము. రూ. చెన్నఁటి.
చెనఁటి-తె. 1. కుత్సితము. 2. వ్యర్థము.3.శూన్య
చెనకు-తె. 1. ఎదిరించు. 2. తాఁకు. రూ. చెనయు. కృ. 3. ఎదిరించుట. 4. తాఁకుట. 5. (గోటి) నొక్కు.
చెనయు-తె. 1. ఎదిరించు. 2. తాఁకు.
చెనుపరి-తె. గ్రామ్యము (మాట)
చెన్ను-తె. 1. అందము. 2. విధము. 3.ఎఱుపు. సమా. చెంగలువ-ఎఱ్ఱకలువ. (ఇట్లే చెందొవము.) చెంగావి-ఇంపైన యెఱుపు. చెందమ్మి-ఎఱ్ఱతామర. చెన్నుఁడు-అందగాఁడు.
చెప్పు-తె. 1. పాదరక్ష. 2. క్రి. వచించు, అను.
చెప్పుడుమాట-ఒకరుచెప్పినమాట, తానువిననిది.
చెమట-తె. స్వేదము. రూ. చెమరు, చెమట. సమా. —కాయ-ఎండవేఁడిమికి దేహమున లేచు చిన్నగుల్ల. —గొట్టు-చెమటపట్టినవాఁడు. క్రి.—పట్టు, — పోయు - చెమటగలదియగు. రూ. చెమరించు.
చెమరు-తె. 1. చెమట. 2. జెముడుకాకి. క్రి. చెమరుచు, చెమ్మరించు. సమా. —బోతు-మిక్కిలి చెమటకలవాఁడు. [యుఱుకు.
చెమ్మ-తె. తడి.క్రి.చెమ్మగిలు,చెమ్మగిల్లు, చెమ్మ
చెయి-తె. (వ్యు. చేయునది) 1. హస్తము. 2. తొండము. రూ. చెయ్యి. చేయి, చే.
చెయిదము-తె. పని. రూ. చెయిది, చెయువు, చెయ్దము, చెయ్ది, చెయ్వు. సమా. చెయ్వులసాకిరి-సూర్యుఁడు, కర్మసాక్షి. [ను,—వడు.
చెఱ-వి. (చారము) కారాగృహము. క్రి. చెఱగొ
చెఱఁగు-తె. 1. అంచు. 2. కొంగు. 3. దిక్కు. క్రి.—మాయు-బహిష్ఠయగు.
చెరఁప-తె. చెంప.
చెఱకడము-తె. బెల్లము. [ఘుఁడు.
చెఱకు-తె. ఇక్షువు. సమా. —విలుకాఁడు-మన్మ
చెఱచు-తె. 1. చెడఁజేయు. 2. పోఁగొట్టు. రూ. చెఱుచు.
చెరచెర-తె. శీఘ్రముగా. రూ. చెచ్చెర.
చెఱచెఱలాడు-తె. కోపమునమండు.
చెఱపనచేట-తె. వినాశకుఁడు.
చెఱపు-తె. 1. చెఱచు. 2. కీడు.
చెరమ-తె. నాసాపుటము. రూ. చెఱమ.
చెరలాడు-తె. 1. విహరించు,2.క్రీడించు. 3.వ్యాపించు. కృ. చెరలాట, చెరలాటము.
చెరవము-వి. (చరువు) వంటకు, నీళ్ల కాఁచుటకు నుపయుక్తమగు ఇత్తడి పాత్రము.
చెఱి-తె. ఒక్కొకనికి. రూ. చెఱుక.
చెరికి-తె. ధూర్తుఁడు.
చెరుగు-తె. ధాన్యమును చేటతో చెరుగు.
చెఱుచు-చూ. చెఱచు. [చెఱుపరి-చెడుగఁడు.
చెఱుపు-తె. 1. చెడఁజేయు. 2. చెడుగు. సమా.
చెఱుము-తె. ఱాచు.
చెరువు-తె. 1. చెక్కు. 2.గ్రుచ్చు.3.తటాకము. రూ. చెఱువు. 4. కృ. చెక్కుట.
చెఱువు-తె. తటాకము. రూ. చెరువు, చెర్వు.
చెలఁగు-తె. 1. ఉత్సహించు. 2. సంతోషించు. 3. ఒప్పు. 4. వికసించు. 5. శబ్దించు.
చెలఁది-తె. సాలెపురుగు. సమా. —తెర-సాలెపురుగు నేఁత.
చెలగము-వి. (శలకము) సాలెపురుగు.
చెలగు-తె. ఖండించు. రూ. చెలవు.
చెలమ-తె. నీటికొఱకు ఇసుకలోఁ త్రవ్విన పల్లము, కూపకము.
చెలయు-తె. విజృంభించు. [భించు.
చెలరేఁగు-తె. (చెలగి+రేఁగు) మిక్కిలి విజృం

చెలి-తె. 1. ఆఁడుది. 2. స్నేహితురాలు. 3. స్నేహితుఁడు. సమా. —కత్తియ-స్నేహితురాలు. (పుం. చెలికాఁడు.) —కారము-స్నేహము. రూ. చెలిమి. [రూ. చెల్ది.
చెలిది-తె. 1. చర్మరోగము. 2. మేహరోగము.
చెలిమి-తె. స్నేహము. సమా. —కాఁడు-మిత్రుఁడు. (స్త్రీ.—కత్తె) చెలిమరి-పై.—చెలిమిచుక్క-అనూరాధ.
చెలియ-తె. ఆఁడుది.
చెలియలు-తె. తనకంటె చిన్నదగు సోదరి. రూ. చెల్లియలు, చెల్లెలు. సమా. —చెలియలికట్ట-సముద్రపుగట్టు, వేల. రూ. చెల్లెలికట్ట.
చెలువము-తె. అందము. రూ. చెలువు. సమా. చెలువ - (చెలువు+అ.) 1. అందగత్తె. 2. ఆఁడుది. రూ. చెల్వ. [సుందరుఁడు.
చెలువుఁడు-1. ప్రియుఁడు. 2. విటుఁడు. 3.
చెల్ల-తె. సంతాపారకము. రూ. చెల్లఁబో, చెల్లరె, చెల్లరే. [రు. రూ. చెల్లాచెదరు.
చెల్లచెదరు-తె. (చెదరు+చెదరు) మిక్కిలి చెద
చెల్లియలు-చూ. చెలియలు.
చెల్లు-తె. 1. అయిపోవు. 2. కడచు. 3. కొనసాగు. 4. తగు. 5. శక్యమగు. 6. చేరు. 7. సాగు. 8. (నాణెము) మాఱు. 9. చచ్చు. 10. చెల్లినది.
చెల్లుబడి-తె. 1. అధికారము. 2. మాటసాగుదల, 3. చెల్లుట.
చెల్లెలు-చూ. చెలియలు.
చెవి-వి. (శ్రవము) 1. వినెడి అవయవము. 2. తాళపుచెవి. 3. రాట్నములోనగువానియందుఁగల ఒక అవయవము. సమా. —కొణక-కొనచెవి. చెవిటి-(చెవి+అవిటి) బధిరుఁడు. చెవిటిమూఁగ-చెవుడును మూఁగతనమును గలవాఁడు, ఏడమూకుఁడు. చెవియాకు- 1. లక్కాకు. రూ. చెవ్వాకు. 2. కమ్మ. చెవులపిల్లి,—పోతు-కుందేలు.
చెవుడు-తె. చెవులువిననిరోగము, బాధిర్యము.
చెవ్వ-తె. బిడ్డలకు పుట్టినతోడనే కలుగు ఒకవ్యాధి.
చెవ్వాకు-చూ. చెవియాకు.

## చే

చే-తె. 1. తృతీయావిభక్తి ప్రత్యయము. 2. హస్తము. 3. తొండము. చూ. చెయి.
చేఁత-తె. 1. చేయుట. 2. చేష్ట. 3. చేయఁబడినది. సమా. —కాఁడు-క్రియావంతుఁడు. —గట్టు-కృతకాద్రి. —టికము-కీడు.
చేఁత్రాడు-తె. (చేఁదు+త్రాడు) నీళ్లచేఁదుత్రాడు.
చేఁద-తె. (చేఁదు+అ) నీళ్లచేఁదుపాత్రము.
చేఁదు-తె. 1. ఆకర్షించు. 2. నీళ్లుచేఁదు. 3. ఆఱురుచులలో నొకటి, తిక్తము.
చేఁప-తె. మత్స్యము.
చేఁపు-తె. 1. పాలుద్రవించు. 2. కృ. పాలద్రవము.
చేఁపుడు-తె. చేఁపుట.
చేఁగ-తె. 1. కొయ్యనడిమి నల్లనిగట్టిభాగము. 2. సారము. 3. ధైర్యము. రూ. చేవ.
చేట-తె. చెరిగెడి సాధనము, శూర్పము. సమా. —కొల్లారు - మూఁడుప్రక్కల కట్టడము గల యిల్లు. —గోళ్లబోటి - శూర్పణఖ. —రిక్క-విశాఖ. —చెవుల మెకము-ఏనుఁగు.
చేటి-స. పనికత్తె. రూ. చేటిక.
చేటు-తె. 1. వినాశము. 2. కీడు. సమా. చేట్లకొఱవి-నిర్భాగ్యుఁడు.
చేటుఁడు-స. 1. పనివాఁడు. 2. శృంగారనాయకుని సచివుఁడు. 3. నికృష్టుఁడు.
చేడియ-వి. (చేటి) ఆఁడుది. రూ. చేడె. [ర్పాటు.
చేద్పడు-తె. 1. బాధపడు. 2. చలించు. కృ. చే
చేత-తె. (చేయి+అఁ) తృతీయావిభక్తిప్రత్యయము. రూ. చేఁ.
చేతనము-తె. ప్రాణముకలది. (వ్య. అచేతనము)
చేతస్సు-స. మనస్సు. రూ. చేతము. సమా. చేతోభవుఁడు-మన్మథుఁడు.
చేను-తె. 1. మెట్టపంటనేల. 2. అడవి. (బ. చేలు.)
చేమంతి-వి. (సేవంతి) ఒకానొకపూఁజెట్టు. రూ. సేమంతి.
చేమటియావు-తె. చిత్రవర్ణముగలగోవు.
చేమిరి-తె. పాలుపేరుటకై మజ్జిగవిడుచుట.

చేయి-చూ. చెయి. సమా. చేకట్లు-1. చేతికట్లు. 2. హస్తభూషణము. —కత్తి-చిన్నకత్తి.—కానుక-పెద్దవారినిజూడఁబోవునపుడుకొనిపోవు ఉపహారము. —గలమెకము-ఏనుఁగు, హస్తి. —గలవాఁడు-ఈవికాఁడు. —తాఁకు-సాహసము. చేతిబిడ్డ-పసిబిడ్డ. —వ్రాలు-1. చేతితో తన పేరువ్రాసినది. 2. చేతితో వ్రాసినది. రూ. చేవ్రాలు. చేదండ - హస్తావలంబము. —దర్పనము-చేకానుక. —దివియ-దివ్వటీ. —దోడు-కార్యసహాయుఁడు. రూ. చేయిదోడు. —పెట్టె-చిన్నపెట్టె.రూ.చేతిపెట్టె.—బదులు-మరల ఇచ్చెదనని తీసికొన్నది, చేతిబదులు.—బోడి-నిర్ధనుఁడు. —మోడుపు-నమస్కారము. రూ. చేమోడ్పు. —యమ్మ-చేతితోవేయు అమ్మ. —యలఁతి-సమీపము. —వలఁతి-అధీనము. —వాటు-సమీపము. —విప్పు-నమస్కారము. —వెలుఁగు-దివ్వటీ. —వ్రాలు-సంతకము. క్రి. చేకుఱు-లభించు. —కూడు-హస్తగతమగు. రూ. చేకూరు. —కొను-1. గ్రహించు. 2. ఆదరించు. —తవులు-1. లభించు. 2. నష్టమువచ్చు. —పట్టు-1. అవలంబించు. 2. గ్రహించు-3. పెండ్లాడు. కృ. 4. అనుగ్రహము. 5. స్థానము. —పడు-చిక్కు, లభించు. —మోడుచు-మ్రొక్కు. —విచ్చు-పై—

చేయు-తె. 1. ఒనర్చు. 2. నిర్వహించు. కృ. చేఁత, చెయిదము, చేయి.

చేర-తె. ఇఁచుకవంచినచేయి, ప్రస్మృతి.

చేరిక-తె. 1. కూడిక. 2. సమీపము.

చేరు-తె. 1. ఒఱగు. 2. సమీపించు. 3. పొందు. 4. సరము. 5. గొలుసు. 6. త్రాడు. కృ. చేరిక, చేరువ. సమా. చేరుచుక్క-పాపటబొట్టు. రూ. చేర్చుక్క.

చేఱు-తె. 1. సరము. 2. గొలుసు. 3. త్రాడు. రూ. చేరు. సమా. —కోల-జాటీ.

చేరుగడ-తె. 1. సమీపము. 2. దిక్కు,శరణము.

చేరుగొండి-తె. దుష్టము.

చేరుచు-తె. చేరఁజేయు. రూ. చేర్చు.

చేరుడు-తె. తెల్లగా దంచని బియ్యము.

చేరుపు-తె. సమీపము. రూ. చేర్పు,చేరుబడి.చేర్వ.

చేరువ-తె. 1. సమీపము. 2. సమూహము. 3. సేన. సమా. —కాఁడు-1. సేనాపతి. 2. కావలివాఁడు.

చేలము-స. వస్త్రము. రూ. చేల. (వి. సేల.)

చేవ-చూ. చేగ.

చేష్ట-స. పని, వ్యాపారము. క్రి. చేష్టించు.

చేష్టితము-స. 1. గతి. 2. చేష్ట.

చేసి-తె. (చేయు+ఇ) తృతీయావిభక్తి ప్రత్యయములగు 'చేత,చే' లకు మాఱుగా ద్రుతపూర్వకముగావచ్చు ప్రత్యయము.

చేసేత-తె. (చేతన్+చేతన్) 1. ఒకరొకరిచేతిమీఁదుగా. 2. అప్పుడే.

## చై

చైతన్యము-స. 1. తెలివి. 2. ప్రాణము.

చైత్యము-స. 1. కట్టడము. 2. గుడి.

చైత్రము-స. మొదటినెల. సమా. చైత్రరథము-కుబేరునితోఁట. —సఖుఁడు, —సారథి-మన్మథుఁడు.

## చొ

చొంగ-తె. జొల్లు. హిం. పొగత్రాగుగొట్టము.

చొకా-1. వి. (కంచుకము) చొక్కాయ. రూ. చొకాయ, చొక్కా, చొక్కాయ, చొగా. 2. వి. (చోక్షము) స్వచ్ఛమైనది. రూ. చొకాటము, చొకారము, చొక్కాటము, చొక్కటము, చొక్కము, చొక్కారము. [చొకా.

చొక్కము-తె. దోషములేనిది, స్వచ్ఛము. చూ.

చొక్కు-తె. 1. పరవశమగు. కృ. 2. పారవశ్యము. 3. ఒడలు మఱపించు మందు, చొక్కుపొడి. 4. మూర్ఛ. 5. మోహము. 6. వి. (శుష్కము) ఎండినది. రూ. సొక్కు. సమా. చొక్కిలి-చొట్ట. క్రి. చొక్కిళ్లవోవు. చొక్కు సిరు-కల్లు. —పొడి, —మందు-మీఁదజల్లిన ఒడలు మఱచు భస్మము. క్రి. చొక్కిడు-మోసపుచ్చు.

చొచ్చు-తె. 1. ప్రవేశించు. 2. ఆరంభించు. రూ.

చొచ్చిలు. చొచ్చిల్లు, సొత్తెంచు, చొరఁబడు. కృ. చొరవ.

చొటచొట-తె. కాఱుట వడియుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. రూ. జొటజొట.

చొదచొద-తె. చిప్పిల్లుటయందగు ధ్వని.

చొత్తెంచు-తె. (చొచ్చు+తెంచు) రూ. చొచ్చు.

చొదుగు-తె. చెమ్మ.

చొదుము-తె. ఎండిన అరఁటిపట్ట.

చొనుపు-తె. చొరఁజేయు, చొప్పించు.రూ.చొన్పు.

చొప్ప-తె. జొన్న లోనగువానిదంటు.

చొప్పడు-తె. (చొప్పు+పడు) 1. సరిపడు. 2. దొరకు. రూ. చొప్పిల్లు. ప్రే. చొప్పఱచు,చొప్పరించు.

చొప్పు-తె. 1. జాడ. 2. మార్గము. 3. విధము. సమా. చొప్పరి-త్రోవతెలిసినవాఁడు.

చొబలము-తె. గుజ్జుపుగర్భపిండము.

చొఱ-తె.ఒకతెగపెద్దచేఁప. రూ. చోఱ.

చొరఁబడు-చూ. చొచ్చు. రూ. చొరఁబాఱు.

చొఱచొఱ-తె. వడియుట.

చొరవ-తె. 1. ప్రవేశము.2.బుద్ధికుశలత. సమా. చొరపోఁత-ఎడములేనిది. చొరవకత్తె - చొరవ కలది. (పుం.—కాఁడు)

చొఱిగాఁడు-తె. బోయ.

చొరుగు-తె. చొక్కాకు, ఎండినఆకు.రూ.చొరువు.

చొలయు-తె. 1. మూర్ఛిల్లు. 2. వెనుదీయు. 3. వైముఖ్యమునొందు. 4. వైరస్యమునొందు.రూ. సొలయు.

చొల్లు-తె. చొంగ. రూ. జొల్లు. [ము, చొళ్లెము.

చొల్లియము-తె. జడచుట్ట. రూ. చొల్లెము. చొళ్లియ

## చో

చోఁ-తె. 1. చోట. 2. అప్పుడు. [జ్ఞము.

చోక్షము-స. 1. తీక్ష్ణము. 2. పరిశుద్ధము. 3. మనో

చోటు-తె. తావు.

చోడి-తె. రాగిపైరు. (బ. రాగులు)

చోదు-తె. బ్రహ్మరంధ్రము. రూ. సోదు.

చోద్దుమ-తె. కష్టము. రూ. చోద.

చోదకుఁడు-స. త్రోలువాఁడు.2.ప్రేరేపించువాఁడు.

చోదనము-స. త్రోలుట.

చోద్దెము-వి. (చోద్యము) ఆశ్చర్యము.

చోద్యము-స. 1. ఆశ్చర్యము. 2. త్రోలఁదగినది.

చోపు-1. కలచు. 2. త్రోలు. 3. తఱుము.

చోపుడు-తె. కలఁత.

చోపుదారుఁడు-హిం. వెండిబెత్తమువాఁడు.

చోఱ-తె. 1. చూ. చొఱ. 2. బాలుఁడు. సమా. —బుడుత - చోఱమీనుపిల్ల. —వాఁడు - బాలుఁడు.

చోరీ-హిం. దొంగతనము.

చోరుఁడు-స. దొంగ. రూ. చౌరుఁడు.

చోలము-స. 1. కుప్పసము. 2. ఱవిక.

చోవి-తె. బూరెలమీఁద మూఁతగాపెట్టెడుపిండి.

చోషము-స. పీల్చుట.

చోష్యము-స. పీల్చఁదగినది.

## చౌ

చౌ-వి. (చతుః) 1. నాలుగు. రూ. చవు. 2. సమాసమందు చౌకమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము. సమా. చౌకటులు-నాలుగు ముత్తెములు చేర్చికట్టిన పోఁగులు.రూ. చౌకట్టులు, చౌకట్లు, చవుకటులు, చవుకట్టులు. —కళి-కోకలందు నూలిపోఁగులచే నేర్పఱచిన చౌకపుటిల్లు. రూ. చవుకళి. —కాఁడిగుదియ-నాలుగుప్రక్కలుతీరిన యినుపదండము. రూ. చవుకాఁడిగుదియ. —కాలిపీఁట-నాలుగుకాళ్లగల యెత్తుపీఁట. రూ. చవుకాలిపీఁట. —గంటి-1. అగ్ని. 2.శరభము. (చౌ+కన్ను+ఇ) రూ. చవుగంటి. —దంతి-ఐరావతము. (ప్ర. చతుర్దంతి) రూ. చవుదంతి. —పదము-నాలుగుమూలలు. రూ. చవుపదము. —పుటము-నాలుగుకాళ్లపైకెత్తి దాఁటెడుగుఱ్ఱపుదాఁటు.రూ. చవుపుటము. —షష్టి-అఱువదినాలుగు. (ప్ర. చతుష్షష్టి.)—సాల-చుట్టుకొల్లారు. (ప్ర. చతుశ్శాల.) —సీతి ఎనుబదినాలుగు. (ప్ర. చతురశీతి.)

చౌక-తె. 1. అగువ. 2. తక్కువ. రూ. చవుక.

చౌకము-వి.(చతుష్కము) 1.చదరము. 2.నిడుపు.

వెడల్పు సమముగానుండు తుండుగుడ్డ. రూ. చవుకము. చూ. చౌ.
చౌకళించు-తె. (చౌ+రాళ్లు+ఇంచు) నాలుగు కాళ్లపైకెత్తిదాఁటు. రూ. చవుకళించు.కృ. చౌకళింత, చవుకళింత. [చవుకారము.
చౌకారము-తె. (చవుడు+కారము) నబ్బు. రూ.
చౌకీ-హిం. సుంకరిమెట్టు. రూ. చవుకీ.
చౌకు-హిం. కొరడా. రూ. చవుకు, చబుకు.
చౌడు-తె. *1.* ఊషరక్షేత్రము. *2.* చౌటినేల.
చౌడోలు-వి. (చతురంతడోల) ఏనుఁగుమీఁది అంబారి. రూ. చవుడోలు, చౌతా, చవుతా.
చౌతి-వి. (చతుర్థి) పక్షమందు నాల్గవతిథి. రూ. చవుతి. [కులలో పెద్ద.
చౌదరి-తె. కమ్మవారి పట్టపుపేరు. హిం. వర్త
చౌరు-తె. *1.* తీపుతోకలిసిన ఇంచుకయుప్పు. *2.* వేఁడిమిచే వరియెన్ను ఎండిపోవు రోగము. రూ. చవురు.
చౌర్యము-స. దొంగతనము.
చౌలము-స. జుట్టుపెట్టి వెంద్రుకలుతీయుట.
చౌలు-తె. ముత్తెపు కాంతి. రూ. చవులు.
చ్యుతము-స. జారినది.
చ్యుతి-స. *1.* జారుపు. *2.* విడుపు.

ఛ

ఛందము-స. *1.* అభిప్రాయము. *2.* వశము.
ఛందస్సు-స. పద్యలక్షణము తెలిపెడి శాస్త్రము.
ఛగలము-స. *1.* మేఁకపోతు. (వ్యు. రోగములఁ జెఱచునది) రూ. ఛాగము.(స్త్రీ.ఛాగి) *2.* పిడక నిప్పు.
ఛట-స. *1.* గుంపు. *2.* వరుస.
ఛత్రము-స. గొడుగు. (వ్యు. పురుషుని కప్పునది) సమా. ఛత్రభంగము - *1.* రాజ్యనాశము. *2.* స్వాతంత్ర్యము. *3.* వైధవ్యము.
ఛత్రాకము-స. పుట్టగొడుగు. రూ. ఛత్ర.
ఛదము-స. *1.* ఆకు. *2.* ఈఁక. *3.* తెక్క. రూ. ఛదనము.
ఛద్మము-స. *1.* నెపము. *2.* మోసము.
ఛన్నము-స. *1.* ఏకాంతము. *2.* కప్పఁబడినది.
ఛర్ది-స. వమనము. రూ. ఛర్దనము.
ఛలము-స. *1.*నెపము. *2.*ఒక యభిప్రాయముతోఁ జెప్పిన పదమునకు మఱొక యభిప్రాయము చేసికొని యుత్తరము చెప్పుట.
ఛవి-స. *1.* కాంతి. *2.* కిరణము.

ఛా

ఛాందసుఁడు-స. వేదము చదివినవాఁడు, లౌకికము లేనివాఁడు.
ఛాగము-చూ. ఛగలము.
ఛాత్రుఁడు-స. శిష్యుఁడు.
ఛాదనము-స. కప్పుట.
ఛాయ-స. *1.* నీడ. *2.* కాంతి. *3.*వర్ణము.*4.*ప్రతిబింబము. *5.* సూర్యుని భార్య. *6.* వరుస. సమా. ఛాయాకరుఁడు- గొడుగు పట్టువాఁడు. —పుత్త్రుఁడు-శని.

ఛి

ఛిద-స. ఛేదము, నఱకుడు.
ఛిద్రము-స. *1.* బెజ్జము. *2.* తప్పు.
ఛిన్నము-స. ఛేదింపఁబడినది.

ఛు

ఛురిక-స. చిన్నకత్తి. (వి. చురకత్తి)
ఛుల్లి-స. పొయ్యి. రూ. చుల్లి.

ఛే, ఛో

ఛేకము-స. నాగరికము.సమా. ఛేకానుప్రాసము - రెండేసి హల్లు లెడనెడ జతజతగా వచ్చునట్లు చెప్పుట.
ఛేత్త-స. ఛేదించువాఁడు.
ఛేత్తవ్యము-స. ఛేదింపఁదగినది.
ఛేదనము-స. ఛేదించుట.
ఛేదము-స. *1.* నఱకుడు. *2.* తునుక. *3.*భిన్నాంకమందు క్రిందిసంఖ్య. క్రి. ఛేదించు.
ఛేదితము-స. ఛేదింపఁబడినది.
ఛేదితవ్యము-స. ఛేదింపఁదగినది. రూ. ఛేద్యము.
ఛోటిక-స. చిటిక.

జ

జంకు-వి. (శంక) 1. భయపడు. 2. సంకోచపడు. కృ. 3. భయము. 4. సంకోచము. ప్రే. జంకించు. కృ. జంకు, జంకె, జంకెన.
జంగ-వి. (జంఘ) పిక్క. క్రి. జంగగొను. 1. దాటు. 2. దుముకు. సమా. —నడక-కాలు చాచిపెట్టి నడచు నడక.
జంగమము-స. తిరుగునది. (వ్య. స్థావరము)
జంగముడు-స. జంగమువాడు. (వి. జంగము)
జంగాళము-వి. (జంఘాల) నిడువాటు.
జంగి-తె. అగ్ని ప్రసారణము.
జంగియ-తె. ఒక దినుసుగజ్జె. రూ. జంగె.
జంగిలి-తె. పశు సమూహము.
జంగుపిల్లి-తె. అడవిపిల్లి.
జంఘ-స. పిక్క.
జంఘాలుడు-స. మిక్కిలి వడిగనడచువాడు.
జంజడ-తె. చీల.
జంజా-తె. గుంపు.
జంజాటము-తె. తగులము.
జంజాడి-వి. (యమధాటి) రెండుప్రక్కల పదను గల కత్తి. రూ. జముదళము, జముదాడి. (హిం. జమ్‌దార్)
జంట-తె. 1. జత. 2. వెంట. 3. సమీపము. రూ. జమట. క్రి.జంటు. సమా. —ముక్కాలి-తుమ్మెద,షట్పదము. —మోము వేలుపు-అగ్ని.
జంటి-తె. సరిగపట్టీ. రూ. జంటీ.
జంటు-తె. జంటపడు.
జండా-హిం. టెక్కెము. రూ. జెండా.
జంత-తె. ధూర్తురాలు.
జంతపట్టు-తె.కలుపుతెగుటకు పైరు నడుమదున్ను.
జంతిక-తె. 1. ఒకానొక భక్ష్యము, చుట్లు. 2.దానినిచేయు యంత్రము. సమా. —పుండు-అనేకరంధ్రములుగల వ్రణము.
జంతువు-స. ప్రాణముగలది, చేతనము.
జంత్రము-వి. (యంత్రము) 1. సూత్రము. 2. సూత్రపుబొమ్మ. సమా. జంత్రకాడు-సూత్రధారుడు.
జందియము-తె. (జన్నియ+ఇదము) యజ్ఞోపవీతము. రూ. జందెము, జన్నిదము.
జంపతులు-స. ఆలుమగలు. రూ. దంపతులు.
జంపు-తె. 1. ఆలస్యము. 2. జాలరు. 3. సన్నదనము. 4. పొడవు. క్రి. జంపాడు-కదలు. జంపారు-మందమగు.సమా. జంపాలు-జోలపాట. జంపులు-(జంపు+పూలు) చెంపసరాలు.
జంపె-వి. (ఝంప) పదియక్షరముల కాలముగల తాళభేదము.
జంబాలము-స.1.అడుసు.2.పాచి. [జంభీరము.
జంబీరము-స. 1. నిమ్మ. 2. మరువము. రూ.
జంబు-తె. 1. ఒకతెగ తుంగ. రూ. జమ్ము.2.వి. (జంబువు) నేరేడు. సమా. జంబుగూడ-జంబుతోనల్లినగూడ. రూ. జమ్ముగూడ. జంబేటి-నేరెటేటి, జంబూనది. [చునది.)
జంబుకము-స. నక్క. (వ్యు. మాంసమును భక్షించునది.)
జంబుకుడు-స. 1. వరుణుడు. 2. నీచుడు.
జంబువు-స. 1. నేరేడుచెట్టు. 2. నేరేడుదీవి. 3. నేరెటేటి.
జంభభేది-స. ఇంద్రుడు. (ఇట్లే జంభారి. మొ. వ్యు. జంభుని సంహరించినవాడు.)
జక్కర-తె. నది. సమా. —రాయడు-సముద్రుడు, సరిత్పతి.
జక్కలించు-తె. గేలిసేయు.
జక్కవ-వి. (చక్రవాకము) ఒకతెగ పిట్ట. రూ. జక్కువ. సమా. —గొంగ-చంద్రుడు. —లతేడు-సూర్యుడు.
జక్కి-తె. 1. గుట్టము. 2. తిరుగలి. సమా. —మోరవేలుపు-కింపురుషుడు.
జక్కించు-తె. కట్టువడు.
జక్కిని-వి. (యక్షిణి) 1. కుబేరునిభార్య. 2. లోకాంతరమొంది దేవత్వముపడసిన ముత్తైదువ. సమా. జక్కినీడు-కుబేరుడు.
జక్కులు-వి. (యక్షులు) దేవతలలో నొక తెగవారు. సమా. జక్కులతేడు-కుబేరుడు.
జగడము-వి. (ఝకటము) 1.కలహము.2.యుద్ధము. క్రి. జగడించు. సమా. జగడగొండి-

1. కలహశీలుఁడు. 2. కలహశీలురాలు. జగడాలమారి—పై.—
జగడి-తె. తిన్నె. [2. జనము. 3. భూమి.
జగతి-స. 1. లోకము. రూ. జగత్తు, జగము.
జగము-వి. (జగము) 1. లోకము. 2. గొప్ప. సమా. జగజంపు-మిక్కిలిజంపు. జగజెట్టి - గొప్ప శూరుఁడు. జగముకన్ను - సూర్యుఁడు. జగచ్చక్షువు. —చుట్టము-సూర్యుఁడు. లోక బాంధవుఁడు. —తల్లి-1. లక్ష్మి. 2. పార్వతి. 3. లోకమాత.
జగా-తె. సమాసమందు జగమునకువచ్చు రూపము. గొప్ప. రూ.జగ. (చూ. జగము) సమా. —చెంగల్వ,—జిగి,—డంబు. మొ.
జగిలె-తె. తిన్నె. రూ. జగ్గిలె.
జగిలెఁడు-తె. తోడియల్లుఁడు. రూ. జగిలెకాఁడు.
జగ్గు-తె. తళతళ.
జగ్ధి-స. భోజనము.
జఘనము-స. మొల.
జఘన్యము-స. 1. మగగుఱి. 2. తోఁక. 3.వెనుకటిది. 4. దూఱఁదగినది. [(స్త్రీ.—కత్తె.)
జజ్జర-తె. వంచన. సమా. —కాఁడు-వంచకుఁడు,
జజ్జు-తె. మిక్కిలి చినిఁగినది.
జజ్జుకొను-తె. బలహీనత నొందు.
జట-స. 1. జడ. 2. డేఁక. (వి. జడ)
జటాలము-స. జడలుగలది. రూ. జటిలము.
జటి-స. జడలుగల సన్న్యాసి.
జటిలము-స. 1. జటాలము. 2. సింహము.
జటులము-స. పుట్టుమచ్చ. రూ. జడులము.
జట్టి-తె.1.వెల.2.అమ్మట.సమా.—కాఁడు,-కత్తె.
జఠరము-స. 1. కడుపు. 2. ముదిసినది. 3. కఠినమైనది.
జడ-వి. (జట) 1. వెంట్రుకలయల్లిక. 2.జూలు. సమా. —గాఁజ-గంజాయిచెట్టు.—దారి-జటి. —ముడి-కపర్దము. —జంగము-శివుఁడు,కపర్ది. జడలమెకము-1. సింహము. 2.చమరము. —బఱ్ఱె-చమరమృగము.
జడత-తె. బొంత.
జడము-స. 1. నీళ్లు. రూ. జలము. 2. తెలివిలేనిది. సమా. జడధి-సముద్రము.
జడత-స. చేష్టలుడిగియుండుట. రూ. జడత్వము, జాడ్యము, జడిమ, జడిమము.
జడి-తె. 1. బాధ. 2. వాన. 3. ఎడతెగకపడెడు వాన. క్రి. జడిగొను-1. ఎడతెగక కురియు. 2. ఎడతెగకుండు.
జడియు-తె. 1. భయపడు. 2. చలించు. 3. తొలఁగు. 4. మ్రోఁగు. 5. త్రోయు. 6. నివారించు. కృ. జడుపు.
జడ్డ-తె. 1. సంకటము. 2. ఒకటితోనొకటి కూడినది (హల్లు)
జడ్డన-తె. తటాలున.
జడ్డి-తె. మోపుమోసికొనిపోవుకఱ్ఱ.
జడ్డిగము-తె. 1.పిడతకు ఘూఁడుగొట్టము లమర్చి విత్తుట కుపయోగించు నాఁగలి. 2. మదము.
జడ్డు-వి. (జాడ్యము) 1. మాంద్యము. 2. తగులము. 3. జోలి. జడ్డుఁదనము-జడత్వము. క్రి. జడ్డుపడు-జడత నొందు.
జత-తె. 1. జంట. 2. సామ్యము. క్రి. జతపడు.
జతన-వి. (యత్నము) ప్రయత్నము. రూ. జతనము, జతను. క్రి. జతనపడు, జతనుపడు.
జతి-తె. గాననాట్యయోగ్య శబ్దసంతతి. (తక్కిట తరికిట. మొ.)
జతిగెలు-తె. (జత+తీఁగెలు) కాఁడిపట్టెడలు.
జతుక-స. 1. లక్క. రూ. జతువు. 2. ఇంగువ. రూ. జతూక.
జత్తిగె-తె. జడ్డిగము.
జత్రువు-స. కొంకులు, మూఁపులసంధియెముకలు.
జద్దు-తె. కఠిన హృదయత్వము.
జనకుఁడు-స. 1. తండ్రి. 2. సీతతండ్రి.
జనత-స. జనసమూహము.
జననము-స. 1. పుట్టుక. 2. వంశము.
జనని-స. తల్లి.
జనపదము-స. 1. గ్రామము, 2. దేశము, రూ. జానపదము 3. డు. పల్లెటూరి మనుష్యుఁడు. రూ. జానపదుఁడు.
జనము-వి. (శణము) నారకై చేయుఒకతెగ పైరు. రూ. జనుము. సమా. జనపనార-జనుముకట్టల

నుండి తీసిననార.
జనము-స. ప్రజ. సమా. జనశ్రుతి-నానుడి. సమా. జనాంతము. జనపదము-దేశము. జనాశ్రయము-మండపము.
జనయిత-స. తండ్రి. (స్త్రీ. జనయిత్రి.)
జనార్దనుఁడు-స. విష్ణువు. (వ్యు. ప్రళయకాలమందెల్ల జనులఁబీడించువాఁడు.) [పుట్టుక.
జని-స. 1. ఆఁడుది. 2. భార్య. 3. కోడలు. 4.
జనువు-స. పుట్టుక. సమా. జనుషాంధుఁడు-పుట్టుగ్రుడ్డి.
జన్నము-వి. (యజ్ఞము) వేలిమి. సమా. జన్నపుఁజుక్క-మఘ. —ఁదిండి-వేలుపు, క్రతుభుజుఁడు. —గొంగ-శివుఁడు, క్రతుధ్వంసి. —టొజ్జ - ఋత్విజుఁడు. —రిక్క-నెల - మాఘమాసము. [మోహరోగము.
జన్ని-వి. (సన్నిపాతము) త్రిదోషముచేఁగలిగిన
జన్నిదము-తె. యజ్ఞోపవీతము. చూ. జందియము.
జన్నియ-తె. 1. దేవతాదుల నుద్దేశించి యెత్తియుంచిన వస్తువు, మీఁదు. 2. ముద్రవేసివిడిచిన యెద్దు. 3. వ్రతము. రూ. జన్నె. సమా. జన్నిగట్టు-(జన్నియ + కట్టు) బ్రాహ్మణుఁడు. క్రి. జన్నియపట్టు-మీఁదెత్తికట్టు. —విడుచు-దూడను ముద్రవేసివిడుచు.
జన్మము-స. పుట్టుక.
జన్మి-స. జంతువు, మేతాలుపు.
జన్య-స. 1. తల్లిచెలికత్తె. 2. తోడిపెండ్లికూఁతురు.
జన్యము-స. 1. యుద్ధము. 2. అంగడి.
జన్యుఁడు-స. 1. తండ్రి. 2. తోడిపెండ్లికొడుకు. 3. పుట్టఁదగినవాఁడు. 4. పుట్టించువాఁడు.
జన్యువు-స. 1. జంతువు. 2. అగ్ని. 3. బ్రహ్మ.
జపము-స. 1. మంత్రావృత్తి. 2. వేదాధ్యయనము. రూ. జాపము. క్రి. జపించు.
జబర-తె. పోఁకమీఁదినార, ఖపురము.
జబ్బ-తె. 1. భుజము. 2. తొడవెలిమీఁదిభాగము.
జబ్బు-తె. 1. అలసము. 2. వ్యాధి.
జఘ-హిం. రాబడి.
జమట-చూ. జంట.
జమలి-వి. (యమళము) జంట. క్రి. జమలించు. సమా. —ముక్కాలి-తుమ్మెద, షట్పదము.
జమలిక-వి. (యమళిక) ఒక చర్మవాద్యము. రూ. జమళిగ.
జమాబంది-హిం. సిస్తు ఏర్పాటుచేయుట.
జమీను-హిం. భూమి. సమా. —దారుఁడు-రాజునకు సిస్తుకట్టు ఒక అధికారి. —దారి-జమీను దారుని వశమునందు భూమి.
జముఁడు-వి. (యముఁడు) శమనుఁడు. సమా. జమునయ్య - సూర్యుఁడు. జమునెక్కిరింత - దున్న. [నేసినపట్టె.
జముకాణము-తె. కూర్చుండుటకు ముతకనూలితో
జదముళము, జముదాడి-చూ. జంజాడి.
జమున-వి. (యమున) కాళిందినది. సమా. —తోఁబుట్టువు-యముఁడు, యమునాభ్రాత.
జమ్మి-వి. శమీవృక్షము.
జమ్ము-చూ. జంబు.
జయ-స. 1. పార్వతి. 2. పార్వతిచెలి. 3. అఱువదింట ఇరువది యెనిమిదవ సంవత్సరము.
జయంతి-స. 1. ఇంద్రుని కూఁతురు. 2. పార్వతి. 3. జెక్కెము. [డు. 3. శివుఁడు.
జయంతుఁడు-స. 1. ఇంద్రుని కొడుకు. 2. భీముఁ
జయము-స. గెలుపు. క్రి. జయించు-గెలుచు. జయవెట్టు. జేజేయని దీవించు. సమా. జయఘంట-జేగంట. —వారము-మంగళవారము.
జయుఁడు-స. 1. ఇంద్రునికొడుకు. 2. ధర్మరాజు.
జయ్యము-స. గెలువశక్యమైనది. (వ్య. అజయ్యము)
జర-తె. కత్తి పిడి.
జర-స. ముసలితనము. సమా. జరద్గవము-ముసలియెద్దు. జరాభీరువు-మదనుఁడు.
జరగు-తె. 1. భూమ్మితో ప్రాఁకు. 2. జాఱు. 3. జీవనమునడచు. 4. కడచు. 5. పోవు. రూ. జరుగు. ప్రే. జరుపు.
జరఠము-స. 1. ముదిసినది. 2. గట్టియైనది.
జరత-హిం. సరిగ. రూ. జరతారు, జలతారు, జరి, జరీ.
జఱభి-తె. ఒంకుటాలు, అసతి.
జరాయువు-స. మావి.
జరీన-తె. తటాలున. రూ. జరీలున, జఱ్ఱున.

జరుగు-చూ. జరగు. క్రి.జరుపు.సమా. —బాటు-జీవనము. రూ. జరుగుబడి.
జరుగుడు-తె. జారుట.
జరుపుడు-తె. దినములు జరపుట.
జర్జరము-స. శిథిలమైనది. రూ. జర్జరితము.
జలకము-వి. (జలము) 1.ఉదకము.2.స్నానము. క్రి. జలగడుగు-బంగారు రజమెత్తుటకు ఇసుకను నీళ్లలోఁబోసి గాలించు. జలగరి-జలగడుగువాఁడు. —దారి - మురికినీరు పోవుదారి. —పోత-మలాము. రూ. జలపోసనము.జలేరి-(జలకము+ఏరి) పానవట్టము.
జలతారు-చూ. జరత.
జలదరము-తె. 1. కంపము. 2. భయముచేనగు రోమాంచము. క్రి. జలదరించు, జలపరించు.
జలము-స. నీరు. రూ. జడము. సమా. జలచరము-నీటఁదిరుగుజంతువు. —జము-1. తామర. 2. శంఖము.—దము-మొగులు.—ధరము-పై— —ధి-సముద్రము.—నిధి-పై——ముచము-మొగులు. జలాశయము-తటాకము, నీటిబెంకి.
జలుబు-తె. శైత్యము. [మాట.
జల్పము-స. ఊరకమాటాడెడి ఉపయుక్తముకాని
జల్పాకుఁడు-స. వదరుఁబోతు.
జల్లి-తె. 1. నవరము. 2. చామరము. 3. కుచ్చు. 4.జాలరు.5.అసత్యవచనము.సమా.—కాఁడు-కల్లరి. —మూఁకుడు-సగమువఱకు చిల్లులుగల మూఁకుడు. —మెకము-చమరమృగము. —వేరు-సన్ననివేరు. [శోధించు.
జల్లించు-తె. 1. కొఱు. 2. జల్లెడలో త్రిప్పు. 3.
జల్లు-తె. 1. ఉమియుట రాలుట లోనగువానియందగు ధ్వని. 2. వాన. 3. తుంపురు. రూ. దల్లు.
జల్లెడ-తె. జల్లించుసాధనము, చాలని సమా. —కుఱుపు. జల్లెడరంధ్రమువలె ఏర్పడు వీఁపున లేచు పుండు, రాచపుండు.
జల్లెడె-తె. చామరము.
జవ-తె. 1. జడబిల్ల పటములోనగువానికి కట్టెడు అంచు. 2. హద్దు.
జవట-తె. తాటిమట్టకు అడుగునసుండు పంగ.
జవనము-స. వేగముగలది.
జవనిక-స.తెర.రూ.యవనిక-జనని. (వి.జవనిక.)
జవము-స. వేగము.
జవర-తె. 1. మృదువు. 2. చక్కి.
జవరము-తె. తఱచుఁదనము.
జవళి-తె. అమ్మఁదగిన క్రొత్తవస్త్రము. రూ. జవిళి.
జవాజి-తె. సంకుమదము. రూ. జవాది, జవ్వాజి, జవ్వాది. సమా. —పిల్లి-జవాజితీసెడి పిల్లి.
జవాను-హిం. బంటు.
జవాబు-హిం. ప్రత్యుత్తరము.
జవ్వనము-వి. (యౌవనము) పదునాఱేండ్లకుపై ప్రాయము. సమా. జవరాలు- (జవ్వనము+ఆలు) యౌవనవతి. జవ్వని-పై— [పొర.
జవ్వు-తె. 1. దుర్మదజలము, 2, చర్మపులోపలి
జహ్నువు-స, 1. ఒకముని. 2. విష్ణువు. సమా. జహ్నుతనయ-గంగ.
జళిపించు-తె. (కత్తిని) ఆడించు.
జళుకు-తె. బెదరు.

## జా

జాంగలము-స. 1. మెరకనేల. 2. నిర్జలస్థానము.
జాంగలికుఁడు-స. విషవైద్యుఁడు.
జాంబవము-స. 1. నేరేడుపండు. 2. బంగారు.
జాంబూనదము-స. బంగారము. (వ్యు. జంబూనది యందు పుట్టినది.)
జాగరము-స.మేలుకొనియుండుట.(వి.జాగారము)
జాగరిత-స. మేలుకొనియుండువాఁడు.
జాగరూకుఁడు-స.—పై,—
జాగా-తె. పెద్ద. రూ. జగ.
జాగా-హిం. చోటు.
జాగారము-వి. (జాగరము) మేల్కొనియుండుట.
జాగిలము-తె. పెద్దవేఁటకుక్క.
జాగీరు-హిం. రాజు బహుమానముగా నిచ్చుభూమి.
జాగు-తె. ఆలస్యము. [వాఁడు.
జాగ్రత్-స. 1. ఒకయవస్థ. 2. మేల్కొనియుండు
జాగ్రత్త-స. జాగరూకత.
జాజము-తె.పాలికలయందుఁబోసిన నవధాన్యముల నారు. రూ. జాజాము.
జాజర-తె. వంచన. రూ. జజ్జర.

జాజి-వి. (జాతి) 1. మాలతీవృక్షము. 2. ఒక తెగమల్లె. రూ. జాది.
జాజు-తె. ఎఱుపు. రూ. జాదు. క్రి. జాజువాఱు.
జాటీ-తె.పశ్వాదులనదలించుటకైదారముకట్టినకోల.
జాడ-తె. 1. అడుగుల గుఱుతు. 2. సైఁగ. 3. పోబడి. 4. త్రోవ. 5. విధము.
జాడించు-తె.1.విదిలించు. 2.అటునిటు కదలించు.
జాడు-తె. గింజపట్టని జొన్నకఱ్ఱ.
జాడ్యము. స. జడత్వము. (వి. జడ్డు.)
జాణ-వి. (చణ) నేర్పరి. రూ. జాణఁడు. (స్త్రీ. జాణెత.)
జాతము-స. 1.సమూహము. 2.పుట్టినది. సమా. జాతకర్మము-పుట్టినపుడుచేయుక్రియ.—కుఁడు-పుట్టినవాఁడు. —రూపము-బంగారు. —వేదుఁడు-అగ్ని. జాతాపత్య-బాలెంత. [ఉత్సవము.
జాతర-వి. (యాత్ర) 1. శక్తియుత్సవము. 2.
జాతి-స. 1. కులము. 2. పుట్టుక. 3. సామాన్యము. 4. జాజికాయ. పురుషజాతులు. 4. భద్రుఁడు, దత్తుడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు. స్త్రీజాతులు. 4.చిత్రిణీ,శంఖిని,హస్తిని, పద్మిని. సమా. —కోశము-జాజికాయ. —పత్రి-జాపత్రి. జాత్యంధుఁడు-పుట్టుగ్రుడ్డి.
జాత్యము-స. 1. మంచికులమునఁబుట్టినది. 2. మేలైనది. 3. చక్కనిది.
జాది-చూ. జాజి.
జాదిలి-తె. బుడుబుడుక్కలవాఁడు.
జాదు-చూ. జాజు.
జాదుకొను-తె. తఱచుకొను:
జాదుర-వి. (చాతుర్యము) నేర్పరితనము. [డు.
జానకి-తె. తుపాకులచెవియందునిప్పుముట్టించు త్రా
జానకి-స. జనకుని కూఁతురు, సీత.
జానపదము-చూ.జనపదము.
జానము-తె. గుఱ్ఱపు జీనుమీఁది మెత్త.
జాని-స. 1. ముదిమి. 2. సమాసమందు జాయా శబ్దమునకుఆదేశరూపము. (జానకీ జాని. మొ.)
జాను-తె. అందము. రూ. జానువు.
జానుగు-తె. చెవి.
జానువు-స. మోఁకాలు.
జాపత్త్రి-వి. (జాతిపత్రి.) జాజికాయకు పై భాగమునను పైచర్మమునకు లోపలను ఉండువస్తువు.
జాపిరము-తె. ఆలస్యము. రూ. జాప్యము.
జాబాలుఁడు-స. మేఁకలమేపువాఁడు.
జాబితా-హిం. పట్టీ.
జాబిలి-తె. (జాను + బిల్లిక) చందమామ. రూ. జాబిల్లి సమా. —తాలుపు-శివుఁడు, చంద్రధరుఁడు. —మేపరి - రాహువు. —ఱాయి-చంద్రకాంతము.—రిక్క-మృగశీర్షనక్షత్రము.
జాబు-తె. లేఖ, కమ్మ.
జామ-తె. ఒకఫలవృక్షము.
జామాత-స. 1. అల్లుఁడు. 2. పెనిమిటి.
జామీను-హిం. పూఁట. [(బ. జాలు)
జాము-వి.(యామము) ఏడున్నరగడియలకాలము.
జాయ-స.భార్య.సమా.జాయాజీవుఁడు-నట్టువుఁడు.
జాయమానము-స. కలుగుచున్నది.
జారిణి-స. ఱంకుటాలు.
జారీ-తె. 1. గిండి. 2. కమండలువు.
జాఱు-తె. 1. జరగు. 2. ఉఱుకు. 3. వదలు. 4. స్రవించు. 5. కృ. జాఱుడు.
జారుఁడు-స. ఱంకుమగఁడు, ఉపపతి.
జాఱుడు-తె. జాఱుట. రూ. జాఱుపాటు.
జాఱుపు-తె. 1. కొండచఱి. 2. జాఱుట.
జాల-వి. (జాలము) 1. చేఁపలఁబట్టువల. 2. కిటికీ. సమా. —కట్టు-నల్లఱాతిలో చేసిన కిటికీ. జాలరి-చేఁపలబట్టువాఁడు. —పల్లిక-చిత్రపు పనిచేసిన తాంబూలపుతట్ట. [కపటము.
జాలకము-స. 1. మొగ్గ. 2. వల. 3. గూఁడు.4.
జాలము-స. 1. మొగ్గ. 2. వల. 3. కిటికీ 4. సమూహము. 5. కపటము. సమా. జాలవిద్య-గారడీవిద్య.
జాలము-తె. జాగు.
జాలరు-హిం. గొడుగులోనగువాని కొనసుచుట్టును వ్రేలాడుజల్లి మొదలగునవి, రూ. జాలీ. (సం. ఝల్లరి) [కరము.
జాలి-తె. 1. మనఃఖేదము. 2. విచారము. 3.కవి
జాలు-తె. 1. ఏఱు. 2. చిన్నప్రవాహము. రూ. జాలువు. క్రి. జాలువాఱు.

జాలువా-తె. అపరంజి. రూ. జాళువా, జాళ్వా.
జాలె-తె. 1. ఒకతెగదేగ. 2. వరాలసంచి. 3. బొంగరపుత్రాడు. రూ. జాలియ.
జాల్ముఁడు-స. 1. యోచింపకచేయువాఁడు. 2. క్రూరుఁడు. 3. పామరుఁడు.
జావ-వి. (యవాగువు) పలుచగా కాఁచినగంజి.
జావడము-తె. 1. పిటికితనము. 2. పొట్టిగుఱ్ఱము. రూ. జావళము. 3. ఒకజాతిదేగ.
జావడి-తె. చాకలి.
జావళము-చూ. జావడము.
జావళి-తె. శృంగారగీతము.
జాస్తి-హిం. అధికము. [నుండి వెలువడినది.)
జాహ్నవి-స. గంగ. (వ్యు. జహ్నుముని చెవి
జాళువా-చూ. జాలువా.

జి

జింక-తె. ఇఱ్ఱి. సమా. —తలచుక్క-మృగశీర్షము. —తలచుక్కనెల-మార్గశిరము. —తాలుపరి-1. శివుఁడు. 2. చంద్రుఁడు. రూ. —తాలుపు. —పొక్కిలి-కస్తూరి, మృగనాభి, —రౌతు-వా
జిగట-తె. బందన. [యువు.
జిగమిష-స. పోవనిచ్ఛ. (పుం. జిగమిషువు.)
జిగి-తె. కాంతి.
జిగిలి-తె. చక్కనైనది.
జిగీష-స. గెలువనిచ్ఛ. (పుం. జిగీషువు.)
జిగురు-తె. బంక. రూ. జివురు, జీగురు.
జిఘాంస-స. చంపనిచ్ఛ. (పుం. జిఘాంసువు.)
జిఘృక్ష-స. గ్రహింపనిచ్ఛ. (పుం. జిఘృక్షువు.)
జిజ్ఞాస-స. తెలియనిచ్ఛ (పుం. జిజ్ఞాసువు.)
జిట్ట-తె. 1. వెదురెన్ను. 2. చిన్నపిట్ట.
జిడికిరింత-తె. మోసపుమాట.
జిడ్డి-తె. మోటైనది. [—కడలి-పాలవెల్లి.
జిడ్డు-తె. నేయిలోనగువానియందలి మెఱుఁగు. సమా.
జితము-వి. స్థిరము. స. జయింపఁబడినది. సమా. జితకాశి-యుద్ధమున జయించినవాఁడు. క్రి. జితపడు-1. స్థిరపడు. 2. వాడుకపడు. 3. అనుకూలపడు. రూ. జితించు. జితేంద్రియుఁడు-ఇంద్రియముల జయించినవాఁడు.
జిత్తు-తె. మాయోపాయము. సమా. జిత్తులమారి-జిత్తులుచేయువాఁడు.
జిత్వరుఁడు-స. జయశీలుఁడు.
జిద్దు-తె. జగడము. [జిలుఁగు, జిలువు.
జినుఁగు-తె. 1. సూక్ష్మము. 2. అల్పము. రూ.
జినుఁడు-తె. 1. బుద్ధదేవుఁడు. 2. విష్ణువు.
జిబ్బటీ-తె. గబ్బిలము. రూ. జిబ్బడాయి.
జిమ్మ-తె. జిఱ్ఱునవెలికుఱుకు.
జియ్య-తె. 1. దేవుఁడు. 2. పెద్ద.
జియ్యరు-అ. వైష్ణవసన్న్యాసి.
జిఱ్ఱున-తె. శీఘ్రముగా.
జిల-తె. నవ, దురద.
జిలకఱ-వి. (జీరకము) ఒక సంభారపుదినుసు. రూ. జిలకఱ్ఱ, జీలకఱ, జీలకఱ్ఱ.
జిలిబిలి-తె. 1. అల్పము. 2. సూక్ష్మము. 3. శృంగారయుక్తము.
జిలుఁగు-చూ. జినుఁగు.
జిలుగు-తె. 1. గొలుసుమోడిగావ్రాయు. 2. క్రి. గొలుసుమోడివ్రాఁత. 3. చిక్కు.
జిల్ల-తె. కుఱుచని కఱ్ఱముక్క. [లము.
జిల్లా-హిం. కలెక్టరు స్వాధీనమునసుండు మండ
జిల్లు-తె. శైత్యాధిక్యమును దెలుపుటయందగు ననుకరణము.
జిల్లెడు-తె. అర్కవృక్షము. రూ. జిల్లేడు.
జివురు-చూ. జిగురు.
జివ్వున-తె. శీఘ్రముగా. [శీలుఁడు. రూ. జిష్ణుఁడు.
జిష్ణువు-స. 1. ఇంద్రుఁడు. 2. అర్జునుఁడు. 3. జయ
జిహ్మగము-స. (వ్యు. వంకరగాఁబోవునది) పాము.
జిహ్వ-స. నాలుక. సమా, జిహ్వామూలీయము - ఊర్ధ్వాధోముఖములుగా అర్ధచంద్రాకృతి నుండెడు విసర్గము. (ఌ)

జీ

జీంద్రము-తె. దురవస్థ.
జీగురు-చూ. జిగురు.
జీడి-తె. 1. భల్లాతకవృక్షము. 2. మామిడిలోనగువాని తొడిమయందలి పాలు. సమా. —మామిడి-చాఱచెట్టు.

జీతము-వి. (వేతనము) సంబళము. సమా. జీతగాఁడు-జీతముగొని పనిచేయువాఁడు. (స్త్రీ. జీతగత్తె.)
జీనపటము-తె. దట్టీ.
జీనము-తె. జీనుక్రిందవైచు మెత్త. [జీను.
జీని-తె. నాణెమైనది. హిం. గుఱ్ఱపు పల్లము. రూ.
జీనిగిరివాఁడు-హిం. ముచ్చివాఁడు.
జీను-హిం. జీని. తె. లంగపు.
జీనుఁగ్రోవి-తె. పాములబుఱ్ఱ.
జీనువ-తె. చిత్రమగుగూఁడుకట్టుకొను ఒక తెగ పిచ్చుక. రూ. జీనువాయి.
జీబు-తె. 1. ఆఁడుదానికట్టుఁగోక. 2. ఆకుల తీఁగలతఱచు. 3. త్రాడులోనగువాని మీఁదిపీఁచు. క్రి. —కొను-తఱచగు.
జీమూతము-స. 1. మేఘము. (వ్యు. ఉదకమును తనయందు బంధించుకొనునది) 2. కొండ.
జీర-తె. రేఖ.
జీరకము-స. జిలకఱ. రూ. జీరణము.
జీరా-హిం. 1. కవచము. 2. చక్కెరపాకము.
జీరాడు-తె. నేలఁదగులు. రూ. జీరుకాడు జీరుకలాడు, జీరులాడు.
జీరు-తె. 1. నేలకురాయు.రూ.జీరాడు2.గీఱ.
జీరుకు-తె. 1. జరుగుడు. 2.జరుగుడాట. సమా. —బండ-జీరుకులాడు బండ. [పించు.
జీరువాఱు-తె. 1. పరుగు. 2. లొలఁగు. 3. వ్యా
జీర్ణము-స. 1. అఱిగినది. 2. చినిఁగినది. 3. ప్రాఁతది. క్రి. జీర్ణించు.
జీలకఱ-చూ. జిలకఱ.
జీలుగు-తె. బెండుబెండు.
జీవంజీవము-స. వెన్నెలపులుఁగు. (వ్యు. సహచరముతోఁగూడి జీవించునది.)
జీవనము-స. 1. బ్రతుకుదెరువు. 2. నీళ్లు.
జీవము-స. ప్రాణము. సమా. జీవగఱ్ఱ-జీవాధారము. —దంతము-ఏనుఁగు జీవించియుండఁగా కోసికొను దంతము. —దుఁడు-వైద్యుఁడు.—ధనము - గోవులులోనగునది. —న్ముక్తుఁడు - జీవించియుండియు సమస్తబంధముల ఖండించి ముక్తినొందినవాఁడు. —న్మృతుఁడు - జీవించియుండియు చచ్చినవానితోసముఁడు, నడపీనుఁగు. —రత్నము-శ్రేష్ఠమగురత్నము. —వృత్తి-గోవులుమున్నగువానిని కాపాడి జీవించుట. జీవాతువు.-1. జీవగఱ్ఱ. 2.బ్రతుకు. జీవాత్మ-దేహి, జీవుఁడు.
జీవి-స. జీవించువాఁడు, ప్రాణి. క్రి. జీవించు.
జీవిక-స. బ్రదుకుదెరువు.
జీవితము-స. 1. ప్రాణము. 2. జీతము. సమా. జీవితకాలము - ఆయువు. జీవితేశుఁడు - 1. ప్రాణనాథుఁడు. 2. యముఁడు.
జీవుఁడు-స. 1. ప్రాణుఁడు. 2. బృహస్పతి.

జు

జుం-తె. 1. తావివీచుటయందనుకరణము. 2. తుమ్మెదలు, ఈఁగలుచేయుధ్వనికి ననుకరణము.
జుంజము-తె. సుడుదు. రూ. జుంజాము.
జుంజుఱు-తె. 1. చింపిరి. 2. సుడుదు. (జుంజుఱుకట్టు అనియు) రూ. దుందుఱు.
జుగుప్స-స. 1. రోఁత. 2. దయ.
జుజురు-తె. గుబురు. క్రి. జుజుఱుకొను.
జుట్టనవ్రేలు-తె.తర్జని.రూ.జుట్టవ్రేలు.జుత్తనవ్రేలు.
జుట్టిలి-తె. చాఁచినబొటనవ్రేలు చూపుడువ్రేలు నడిమికొలఁత, ప్రాదేశము. రూ.జుత్త, జుత్తిలి.
జుట్టు-తె. సిగ. సమా. —పిట్ట-నెమలి.
జుడుఁగు-తె. 1. భయముచే ఒదుఁగు. 2. డాఁగు. 3. వెసవీయు. రూ. జుణుఁగు.
జుత్త-చూ. జుట్టిలి.
జుత్తనవ్రేలు-చూ. జుట్టనవ్రేలు.
జున్ను-తె. 1.ఈనినమూఁడుదినములలోపలిపాలు. 2. జున్నుగడ్డ. 3. తేనెతెట్టె. సమా. జుంటితేనె-జున్నుతేనె. జుంటీఁగ-ఒక తెగచిన్నతేనెటీఁగ, సరఘ. జున్నుఁబాలు-చూ. 1. జున్ను. —గడ్డ-జున్నుఁబాలుకాఁచగా అగు గడ్డ.
జుమ్మఁడు-తె. విటుఁడు. రూ. జుమ్మకాఁడు.
జుఱ్ఱు-తె. 1. పీల్చు. 2. పీల్చుట. 3. పీల్చుటయందగుధ్వని. [పము.
జువ్వి-తె. ప్లక్షవృక్షము. సమా. —దీవి-ప్లక్షద్వీ
జుష్టము-స. 1. ఎంగిలి. 2. సేవింపఁబడినది.

జుహూరాణము-స. గుల్మము. రూ. జుహూరాణము.

జూ

జూంక-తె. తత్తఱపాటు. క్రి. జూంకించు.
జూజము-వి. (ద్యూతము) 1. పందెముపై ఆడు ఆట. 2. మోసము. రూ. జూదము.
జూజి-వి. (దూతి) దూతిక.
జూటము-స. 1. శివుని జడముడి. 2. జడముడి.
జూటా-హిం. అబద్ధము.
జూటు-మోసము. రూ. జూటుఁదనము. క్రి. జూటాడు.
జూదము-చూ. జూజము. సమా. జూదకత్తియ-జూదమాడునది. (పుం. జూదకాఁడు, జూదరి)
జూలు-తె. సింహముమున్నగువాని మెడమీఁది వెండ్రుకలు. 2. ఏనుగుపైఁబఱచు ఎఱ్ఱకంబళి.
జూవరము-వి. (జ్వరము) సంతాపము.

జృ

జృంభము-స. 1. ఆవులింత. 2. ఒడలువిఱుచుకొనుట. 3. వికాసము. రూ. జృంభణము. క్రి. జృంభించు.
జృంభితము-స. 1. ఆవులింత. 2. పెరిగినది. 3. వికసించినది.

జె

జెండా-హిం. టెక్కెము.
జెట్టి-తె. 1. మల్లుఁడు. 2. శూరుఁడు. 3. శ్రేష్ఠుఁడు.
జెన-తె. గ్రుడ్డులోనినీరు.
జెముడు-వి. (సింహుండము) ఒకతెగ నాగదాళి.
జెఱి-తె. పెక్కుకాళ్ళుగల ఒకపురుగు, ఆధారిక. రూ. జెఱ్ఱి. సమా. —పోతు-ఒకతెగ పాము. రూ. జెఱ్ఱిపోతు.
జెల-తె. భూమినుండి పైకుబికివచ్చు ఎడతెగని జలధార, బుగ్గ.

జే

జే-వి. (జయ) 1. జయజయ యను దీవన. 2. నమస్కారము. రూ. జేజే. సమా. జేగంట-జయించునపుడువాయించు పెద్దగంట, జయఘంట. జేజె-వేలుపు. రూ. జేజే. జేజే-1. దీవన. 2. నమస్కారము. జేజేగట్టు-మేరువు. —పట్టు-స్వర్గము. క్రి. జేపెట్టు-దీవించు.

జేంద్ర-చూ. దేంద్ర.
జేగుఱు-తె. ఎఱుపు. రూ. జేవుఱు. క్రి. జేగుఱించు, జేవుఱించు. సమా. —గండ్లు-కోటలోనుండి తుపాకులుకాల్చు రంధ్రములు. —ఁబురువు-ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.
జేడియ-తె. బురదనేల. రూ. జేడె.
జేడు-తె. బంకమట్టి.
జేన-తె. పంద్రెండంగుళములకొలఁది, వితస్తి.
జేబు-తె. 1. జీబు. 2. హిం. చొక్కాయలోనిసంచి.
జేయుఁడు-స. జయింపఁదగినవాఁడు. రూ. జయ్యుఁడు. (వ్యు. అజేయుఁడు.)

జై

జైత్రుఁడు-స. జయించువాఁడు.
జైవాతృకుఁడు-స. 1. చంద్రుఁడు. 2. పంటకాఁపు. 3. వైద్యుఁడు. 4. దీర్ఘాయువుకలవాఁడు.

జొ

జొంపము-తె. 1. ఆకులు కొమ్మలు లోనగువాని గుబురు. 2. రెమ్మ. 3. నిరంతరధార.
జొంపు-తె. కొండయూటనీరు.
జొగ్గు-తె. భిక్షము. రూ. జోగు.
జొత్తు-తె. ఎఱుపు. క్రి. జొత్తిల్లు-1. ఎఱ్ఱనగు. 2. రంజిల్లు. సమా. —పాప-నెత్తురుకందు, లేఁతబిడ్డ.
జొన్న-వి. (జోనాళము) 1. ఒకతెగపైరు. 2. జొన్నధాన్యము.
జొబ్బిల్లు-తె. 1. స్రవించు. 2. నిండారు. 3. ఉప్పతిల్లు. రూ. జొబ్బిలు.
జొఱ్ఱీఁగ-తె. ఒకతెగపెద్దయీఁగ. రూ. జోఱీఁగ.
జొల్లు-తె. చొంగ, లాల.
జొహారు-తె. నమస్కారము. రూ. జొహారువు, జోహారు, జోహారువు.

జో

జో-తె. జోకొట్టుట.
జోక-తె. 1. సామ్యము. 2. బాగు. 3. జత. 4. విధము. 5. ఉత్సాహము. 6. మొత్తము. 7. యుక్తము. క్రి. —చేయు-1. సంపాదించు. 2. సిద్ధపఱచు. —పడు-జతపడు.

జోకు-తె. 1. తిట్టు. 2. కృ. తిట్టుట. [2.తట్టు.
జోకొట్టు-తె. 1. జోజో యని బిడ్డనునిద్రపుచ్చు.
జోగము-వి. (యోగము) ధ్యానము. సమా.జోగ
పట్టియ-యోగపట్టము. రూ. జోగపట్టె.
జోగి-తె. భిక్షుకుఁడు. వి. యోగి. [సోదెకత్తె.
జోగిణి-వి. (యోగిని) 1. ఒకానొకస్త్రీదేవత. 2.
జోగు-తె. 1. భిక్షము. రూ. జొగ్గు. 2. ఓడ.
జోజో-తె. 1. జోకొట్టుట. 2. దీవన.
జోటి-వి. (యోషిత్) స్త్రీ. రూ. జోటిక.
జోడఁగి-తె. ఒకతెగవేఁటకుక్క. రూ. జోణంగి,
జోనంగి.
జోడన-తె. ధౌరితకము. క్రి. జోడగించు.
జోడమ్ము-తె. (జోడు+అమ్ము) చేయమ్ము.
జోడు-తె. 1. కవచము. 2. జత. 3. చెప్పు. 4.
సమానము. క్రి. జోడించు-జతచేయు. కృ.జో
డింపు. సమా. జోడుకోడె-1. సమానుఁడు.
2. జత. —వేల్పులరిక్క-విశాఖ.
జోత-తె. నమస్కారము. రూ.జోతము,జోతాసు.
జోతి-వి. (జ్యోతి) 1. కాంతి. 2. దీపము.
జోదు-వి. (యోధుఁడు) యుద్ధముచేయువాఁడు.
జోనంగి-చూ. జోడఁగి.
జోనాళము-స. జొన్నపైరు.
జోబిళ్ల-తె. నమస్కారము.
జోలీఁగ-చూ. జొల్లీఁగ. [రూ. జోవ.
జోల-తె. బిడ్డల నిద్రపుచ్చుటకు పాడెడుపాట.
జోలి-తె. 1. సంబంధము. 2. వృత్తాంతము.
జోలియ-తె. పంకకుద్రేళ్లవేసికొన అంచులుచేర్చి
ముడివైచిన చౌకము, బిచ్చపుసంచి. రూ.జోలె.
జోసి, జోస్యుఁడు-వి. (జ్యోతిషికుఁడు) జ్యోతి
శ్శాస్త్రిమెఱిఁగనవాఁడు. [దెలుపు గ్రంథము.
జోస్యము - వి. (జ్యోతిశ్శాస్త్రము) గ్రహగతులఁ
జోహారు-తె. నమస్కారము. రూ. జోహారువు.
చూ. జొహారు.

## జౌ

జౌకు-తె. 1. మిక్కిలిమెత్తగిల్లు. 2. పైకిఁదేలిన
ఊట. రూ. జవుకు. [జవురు.
జౌరు-తె. 1. కొట్టు. 2. చేతులతోవారు. రూ.

## జ్ఞ, జ్ఞా, జ్ఞే

జ్ఞప్తి-స. 1. తెలివి. 2. తలఁపు.
జ్ఞాత-స. తెలియువాఁడు.
జ్ఞాతము-స. తెలియఁబడినది.
జ్ఞాతవ్యము-స.తెలియఁదగినది. [డు-జ్ఞాతికొడుకు.
జ్ఞాతి-స. 1. దాయాది.2.తండ్రి.సమా. —రేతుఁ
జ్ఞానము-స. తెలివి. [వాఁడు.
జ్ఞాని-స. 1. జోస్యుఁడు. 2. కోడి. 3.తెలివిగల
జ్ఞాపకము-స. తెలియఁజేయునది.
జ్ఞాపనము-స. తెలియఁజేయుట. [జ్ఞప్తము.
జ్ఞాపితము-స. తెలుపఁబడినది. రూ. జ్ఞపితము,
జ్ఞేయము-స. తెలియఁదగినది.

## జ్యా, జ్యే, జ్యో

జ్యా-స. 1. వింటినారి. 2. భూమి.
జ్యేష్ఠ-స. 1.పదునెనిమిదవ నక్షత్రము.2.పెద్దక్క.
జ్యేష్ఠము-స. 1. మూఁడవనెల. 2. హంస.
జ్యేష్ఠుఁడు-స.1.అగ్రజుఁడు.2.మిక్కిలివృద్ధుఁడు.
జ్యోతి-స. 1. వెలుఁగు. 2. నక్షత్రము.3.అగ్ని.
4. సూర్యుఁడు.
జ్యోతిరింగణము-స. మిడుఁగుఱుఁ బురువు.
జ్యోతిశ్చక్రము-స. గ్రహనక్షత్ర మండలము.
జ్యోతిషము-స. జోస్యము.
జ్యోతిషికుఁడు-స. జోస్యుఁడు.రూ. జ్యోతిషుఁడు,
జ్యౌతిషికుఁడు.
జ్యోత్స్న-స. 1. వెన్నెల. 2. వెన్నెలరేయి.
జ్యోత్స్ని-స. వెన్నెలరేయి. రూ. జ్యౌత్స్ని.

## జ్వ, జ్వా

జ్వరము-స. వేఁకి.
జ్వరితుఁడు-స. వేఁకిగలవాఁడు.
జ్వలత్-స. ప్రకాశించునట్టి.
జ్వలనము-స. 1. మంట.2.అగ్ని. క్రి. జ్వలించు.
జ్వలితము-స. 1. మండినది. 2. ప్రకాశించినది.
జ్వాల-స. మంట.
జ్వాలాజిహ్వుఁడు-స. అగ్ని.

## ఝ, ఝా, ఝి

ఝంకారము-స. తుమ్మెదరొద. రూ. ఝంకృతి. క్రి. ఝంకరించు.
ఝంఝ-స. వానగాలి.
ఝంప-స. 1. జంపెతాళము. 2. దూఁకుడు.
ఝర, ఝరము-స. సెలయేఱు. రూ. ఝరి.
ఝల్లరి-స. 1. ఉడుక. 2. జాలరు. 3. నీటిసుడి. రూ. ఝాల్లరి.
ఝషము-స. 1. చేఁప. (వ్యు. చిన్నచేపలను జంపి తినునది) 2. మొసలి. సమా. ఝషకేతుఁడు-మదనుఁడు. [3. చీఁపురుకట్ట.
ఝాటము-స. 1. సమూహము. 2. పొదరిల్లు.
ఝిల్లి-స. 1. ఈలపురుగు. 2. ఈలపురుగుకూఁత. రూ. ఝిల్లిక, ఝీరుక.

## ట, టా, టి, టీ, టె, టే, టో

టంకకము-స. వెండినాణెము.
టంకణము-స. వెలిగారము.
టంకము-వి. (టంకకము) పదునాఱు డబ్బుల బంగారు నాణెము, దీనారము. సమా. టంకసాల-నాణెములు ముద్రించుచోటు.
స. 1. వెలిగారము. 2. కత్తి. 3. కోపము.
టంకారము-స. వింటినారి మ్రోఁత. రూ. టంకృతి.
టంకు-తె. 1. నాగరకతగలవాఁడు. 2. డాంభికుఁడు.
టంగు-తె. గుఱ్ఱముమీఁది గంత జాఱక బిగఁగట్టు వాఱు. టంగువాఱు. రూ. తంగు, తంగువాఱు.
టకటొంకు-తె. కుత్సితము.
టక్కు-తె. మోసము. రూ. డక్కు, తక్కు. సమా. టక్కరి-1. మోసగాఁడు. 2. మోసగత్తె. టక్కులాఁడు-మోసగాఁడు. (స్త్రీ. టక్కులాఁడి)
టాకనా-హిం. మట్టసపు గుఱ్ఱము.
టాకు-తె. 1. ఉంగరము. జాఱిరాకుండ వేసికొను సన్ననియుంగరము. 2. ఓర. రూ. తాకు.
టాటోటు-తె. మోసము. రూ. తాటోటు.
టికము-వి. (త్రికము) ముడ్డిపూస.
టిట్టిభము-స. లకుముకిపిట్ట.
టిప్పటము-స. 1. టీకకు టీక. 2. టీక.
టీక-స. అర్థవివరణము.
టీకము-తె. ఒరగల్లు. [చుట.
టీకా-తె. 1. పతకము. 2. స్ఫోటకము పొడిపించుట.
టీకు-తె. నడకయందలినిక్కు. [రొక్కపుజామీసు.
టీపు-హిం. మంచినడవడికకుపూఁటగాఁగట్టినడబ్బు, రొక్కపుజామీసు.
టూకీ-తె. సంగ్రహము. క్రి. టూకించు.
టెంక-తె. మామిడిలోనగు వానిముట్టె. రూ. తెంక.
టెంకణము-తె. నమస్కారము. [రూ. తెంకాయ.
టెంకాయ-తె. (టెంక+కాయ) నారికేళఫలము.
టెంకి-తె. స్థానము. రూ. తెంకి.
టెక్కియము-తె. జెండా. రూ. టెక్కెము.
టెక్కు-తె. యౌవనాదులచేఁగలుగు నిక్కు. రూ. టెక్కువ, తెక్కు. సమా. టెక్కులాఁడి-టెక్కులుగల ఆఁడుది. (పుం. టెక్కులాఁడు)
టెక్కెము-చూ. టెక్కియము. సమా. టెక్కెపుగాము-కేతువు. [శాకద్వీపము.
టేఁకు-శాకవృక్షము. రూ. తేఁకు. సమా. —దీవి-
టోకు-తె. మొత్తము.
టోపి-హిం. కుల్లాయి. రూ. టొప్పి, తొప్పి, తోపి.

## ఠ, ఠా, ఠి, ఠీ, ఠే, ఠో

ఠవఠవ-తె. శ్రమము. [ఠవణించు.
ఠవణిలు-తె. 1. ప్రవర్తిల్లు. 2. ఒప్పు. ప్రే.
ఠవర-తె. నేర్పరి. [మోసగాఁడు.
ఠవళి-తె. మోసము. రూ. తవళి. సమా. —కాఁడు-
ఠవిణ-తె. ఢక్క. రూ. డవిణ.
ఠాణా-హిం. కావలిస్థలము.
ఠాయి-వి. (స్థాయి) స్వరస్థాయి. రూ. ఠాయము.
ఠావు-తె. స్థానము. రూ. తావు.
ఠింగణా-తె. బాలుఁడు.
ఠీవి-తె. 1. వైభవము. 2. ఒయ్యారము.
ఠేవ-తె. 1. ఒప్పిదము. 2. విధము.
ఠోలా-హిం. గుంపు.

## డ

డంక-తె. దిట్ట.
డంకా-వి. (ఢక్క) నగారా. రూ. డక్క.
డంగు-తె. బియ్యములోనగునవి మెదుగు. రూ.

దంగు. ప్రే. దంచు, దంచు.
దంచు-తె. మెదిగించు. రూ- దంచు.
దంబము-వి. (డంబరము) 1. స్థితికిమించినవేష ము. 3. కాంతి. రూ. దంబు. 4. గర్వము. 5. ప్రతిష్ఠ. 6. విధము. 7. అధికము.
దక్కా-చూ. డంకా.
దక్కి-వి. (ఢక్కా) డమరువు.
దక్కు-చూ. దక్కు. క్రి. దక్కొను.
దగర-తె. 1. పిశాచము. 2. గండు. రూ. దగ్గర, దగరము.
దగరము-తె. కీడు. రూ. దగరము.
దగ్గఱ-తె.(దగ్గఱు+అ౯) సమీపము.రూ.దగ్గఱ.
దగ్గఱు-తె. సమీపించు. రూ. డగ్గఱించు. దగ్గఱు.
దగ్గు-చూ. దగ్గు,సమా.డగ్గుత్తిక.(డగ్గు+కుత్తిక) గద్గదస్వరము.
దప్పి-చూ. దప్పి.
దప్పు-తె. దండోరావేయుటప్పెట, తుడుము.
దబదబ-తె. 1. వాద్యమునందగు ధ్వని. 2.ఉద్ధతి.
దబ్బఱ-తె. బొంకు. రూ. దబ్బఱ.
డబ్బా-హిం. పెట్టె.
డబ్బాటు-తె.అకస్మాత్తుగా.రూ.దబ్బాటు.సమా.— సాకిరి-ప్రసంగవశమునవచ్చియెఱిఁగినసాక్షి.
దబ్బీ-హిం. బరణి.
దబ్బు-తె. 1. బొంకాడు. 2. కృ. బొంకు. 3. ధనము.
దమరము-స. దేశోపద్రవము.
దమరుకము-స. డక్కి. రూ. డమరువు. (వి. డమరుగము)
దమాయి-వి. (డమరువు) నగారా. రూ. దమారు, దమ్మారము.
దయనము-స. బాలకాదుల క్రీడాశకటము.
దయ్యు-తె. 1. బడలు. 2.కృశించు.రూ. దయ్యు. కృ. దప్పి, దప్పి.
దలాయతు-హిం. బిళ్లబంటు.
దవాలీ-హిం. బంటు బిళ్లతగిలించుపట్ట.
దవిణ-తె. డంకా.

## డా

డా-తె. ఎడమ. రూ. దా. సమా. డాకన్ను-ఎడమ కన్ను. డాపల-ఎడమప్రక్క.
డాంబికుఁడు-స మాయలుచేయువాఁడు.
డాఁకొను-చూ. దాఁకొను.
డాఁగు-చూ. దాఁగు. ప్రే. డాఁగురించు, డాఁచు- 1. దాఁచు. 2. వంచించు. కృ. డాఁగురింత.
డాఁపు-చూ. దాఁపు.
డాక-తె. 1. విజృంభణము. 2. శౌర్యము.
డాకలి-చూ. దాకలి.
డాకల్లు-చూ. దాకల్లు.
డాకిని-స. పిశాచస్త్రీ.
డాకురు-తె, కొన్లతేలగిలవేయు.
డాకొను-చూ. దాకొను.
డాగు-తె. 1. గుఱుతు. 2. వాఁత. 3. మఱక.
డాపల-చూ. డా. క్రి. డాపలించు-ప్రదక్షిణమగు.
డాపు-చూ. దాపు.
డాపురము-చూ. దాపురము.
డాబా-తె. బోడిమిద్దె.
డాబు-తె. 1. వస్తువులపట్టీ. 2.అతిశయపుమాటలు.
డాయి-చూ. దాయి.
డాయు-తె.సమీపించు. రూ.దాయు.కృ. డాపు,దాపు.
డాలు-తె. 1.కాంతి.2.పెక్కెము.3.వి.(ఢాలము) కేడెము. రూ. దాలువాలు.

## డి

డింకు-తె. చచ్చు. రూ. డింకవేయు.
డింగరీఁడు-వి. (డింగరుఁడు) 1. సేవకుఁడు.2. భక్తుఁడు.
డింగరుఁడు-స. 1. సేవకుఁడు. 2. మోసకాఁడు.
డింగిళ్లు-తె. నమస్కారము.
డించు-తె. దించు.
డిండిమము-స. రాయడిగిడిగిడి అను వాద్యము.
డిండీరము-స. నురుఁగు.
డిందు-తె. 1. అడఁగు. 2. ఇంకు. 3. క్రుంగు. 4. ముగ్గు. 5. కృ.అడఁకువ. క్రి.డిందుపడు.
డింపు-తె. దింపు.
డింభము-స. 1. పిల్ల. 2. గ్రుడ్డు.
డింభుఁడు-స. 1. బిడ్డ. 2. మూర్ఖుఁడు.రూ.డింభకుఁడు.
డిగియ-తె. నడబావి. రూ. డిగ్గియ, దిగ్గియ.
డిగు-తె. 1. దిగు. 2. తగ్గు. రూ. డిగ్గు, దిగు. కృ. డిగుడు, దిగుడు, డిగువ, దిగువ. క్రి. డిగఁద్రావు-విడుచు. రూ. డిగనాడు; డిగ్గనాడు.

డిగ్గఁద్రావు.
డిగువ-తె. క్రింద. రూ. దిగువ.
డిగ్గన-తె. తటాలున. రూ. దిగ్గన, దిగున.
డిగ్గు-తె. *1*. చూ. డిగు. *2*. కృ. తక్కువ.
డిమ్మరి-చూ. దిమ్మరి. [డిల్లపడు, డిల్లపోవు.
డిల్ల-తె. (భయాదులచే) సత్త్వహీనమైనది. క్రి.

డీ

డీ-తె. తలతో పొడుచుట. రూ. దీ. క్రి. డీకొను, డీకొట్టు, దీకొను, దీకొట్టు.
డీకు-తె. ప్రేరేపణ. రూ. దీకు.
డీకొను-తె. *1*. తలతోపొడుచు. *2*. పురికొను. *3*. కవియు. రూ. దీకొను.కృ.డీకోలు.దీకోలు.
డీనము-స. మీఁది కెగురుట. రూ. ఉడ్డీనము.
డీలు-తె. డిల్లపడు. రూ. డీలుపడు. దీలు, దీలుపడు. కృ. డీలుపాటు, దీలుపాటు.

డు, డూ

డుంకు-తె. తగ్గు.
డుండుభము-స. ఇరుదలపాము, మట్టిపాము.
డుక్కు-తె. మఱుఁగుపడు. [బుడుబుడక.
డుబుడక్క-తె. బుడుబుడకవాని వాద్యము. రూ.
డుయ్యి-తె. *1*. పాఱు. *2*. బాణమునాటి వెడలు. *3*. పిడికిటితో ఆకులులోనగువాని నూడఁదీయు. రూ. డూయు, దుయ్యి, దూయు.
డుల్లు-తె. *1*. పడు. *2*. ఊడు. ప్రే. డులుచు.
డూయు-చూ. డుయ్యి.

డె, డే

డెందము-తె. మనస్సు. రూ. దెందము.
డెక్క-తె. గిట్ట. క్రి. డెక్కొను-నెలకొను.
డెక్కు-తె. అడ్డగించు.
డెప్ప-తె. నెత్తము.
డెప్పరము-తె. *1*. ఆపద. *2*. అశక్యము.*3*.దుస్సహము. రూ. దెప్పరము. క్రి. డెప్పరించు, దెప్పరించు. [దెప్పు.
డెప్పు-తె. చేసినకీడును చెప్పి నొప్పించు. రూ.
డెబ్బండ్రు-తె. (ఏడు+పదుండ్రు) డెబ్బదిమంది.
డెబ్బది-తె. (ఏడు+పది) ఏడుపదులు, సప్తతి.
డేగ-తె. పక్షులను వేఁటాడు ఒకతెగపక్షి, శ్యేనము.
డేరా-హిం. గుడారము.

డొ

డొంక-తె. *1*. నడచిపల్లముగా నేర్పడినకాలిదారి. *2*. పొద. *3*. కోన. [వంకర.
డొంకు-తె. *1*. ఇంకు. *2*. ఎండు. *3*.అడఁగు. *4*.
డొంకెన-తె. వంకరఅలుఁగులుగల యీఁటె. రూ. దొంకెన.
డొంగ-చూ. దొంగ. [లోనగు, లోపడు.
డొకారము-తె.లోను,అంతరాళము. క్రి.—సొచ్చు.
డొక్క-తె. *1*. ఒడలియెముకలగూడు. *2*. కళేబరము. *3*. కడుపు. *4*. టెంకాయబొచ్చె.
డొక్కు-తె. *1*. ముదియు. *2*. ముదిసినది.
డొగరు-తె. *1*. అపరాధము. *2*. నింద.
డొప్ప-చూ. దొప్ప. [బల్ల. *2*. బుట్ట.
డొల్ల-తె. *1*. మూఁడుప్రక్కల అడ్డుపలకలుగల
డొల్లు-తె. *1*.పొరలు *2*.పడు. రూ.దొరలు,దొల్లు.

డో

డోఁకు-తె. *1*. ఓకిలించు. *2*.మోఁచేతితోత్రోయు. రూ. దోఁకు.
డోఁగు-చూ. దోఁగు. [(వి. తోరము)
డోరము-తె. కత్తిమీఁదిచాఱ. స. వ్రతసూత్రము,
డోరియా-హిం. చాఱ.
డోల-స. *1*. డోళి. *2*. తొట్ల. రూ. దోలిక.
డోలనము-స. ఊఁచుట. [చర్మ వాద్యము.
డోలు-వి. (ఢోలము) నాదస్వరమునకు జతపఱచు
డౌలు-హిం. *1*. మతింపు. *2*. డంబము.

ఢ, ఢా, ఢు, ఢో

ఢక్క-స. నగారా. (వి. ఢంకా)
ఢాలము-స. కేడెము.
ఢులి-స. ఆఁడుతాఁబేలు. రూ. డులి.
ఢోలము-స. డోలు.

త

త-తె. కులవాచకమగు స్త్రీ ప్రత్యయము. (చాకిత, బోయత. మొ.)

తంగు-చూ. టంగు. [రూ. తంగేడు.
తంగెడు-తె. పచ్చనిపూలుగలచిన్నచెట్టు, గోశ్రేణి,
తంట-హిం. 1. కలహము. 2. చాడీ. 3. శ్రమము. 4. మోసము. రూ. తంటా. [వేయుదంతె.
తండకము-స. మిద్దెటింటికి దూలముపై అడ్డముగా
తండసము-తె. మంగలివెండ్రుకలూడఁదీసెడి సాధనము, చిమ్టా. స. కొలిమి.
తండిరి-తె. జనకుఁడు. రూ. తండ్రి.
తండు-తె. ఇయ్యవలసినది పోయి అడుగు,
తండులము-స. బియ్యము.
తండువు-స. తెడ్డుక్రొయ్య.
తండెలు-తె. ఓడపెత్తనగాఁడు. రూ. తండేలు.
తండ్రి-చూ. తండిరి. సమా. తండ్రి తండ్రి-తాత, పితామహుఁడు. [కమిత్రి.
తంతి-వి. (తంత్రి) సాఁగఁదీసినసన్నని లోహపు
తంతియలు-తె. మెట్లు. రూ. తంతెలు.
తంతు-వి. (తంత్రము) ఉపాయము.
తంతువు-స. నూలిపోఁగు. సమా. తంతుకాష్ఠము-ఎదురు. —నాగము-పామువంటి జలచరము, నెగడు. —నాభము - సాలెపురుగు. (తంతువాయము అనియు) —వాయుఁడు-సాలెవాఁడు.
తంత్రము-స. 1. ఉభయార్థ సాధకమైన ఉపాయము. 2. స్వరాష్ట్రచింత.
తంత్రి-స. 1. తంతి. 2. నరము.
తందనము-వి. (తానము) ప్రతిపాదమున తానముతోఁజేయు పల్లవి. (ఇది దాసరిపాటలో జంగముపాటలో వచ్చును.)
తందర-వి. (తంద్ర) తూఁగు, కునికిపాటు.
తంద్ర-స. తూఁగు. రూ. తంద్రి.
తంపర-తె. తామర గుంపు.
తంపి-తె. 1. దాలిగుంట. (రూ. త్రంపి) 2. కలహము.
తంబళి-తె. శివార్చనచేసి బ్రతికెడు ఒకజాతి. రూ. తమ్మళి. (పుం. తంబళి, తమ్మళి.)
తంబి-తె. తమ్ముఁడు.
తంబిగ-తె. మెడనిడుపగు చెంబు. [తంత్రీవాద్యము.
తంబుర-తె. (తంతి+బుర్ర) శ్రుతికై యుంచుకొను
తకరారు-హిం. వివాదము.
తకపికలాడు-తె. ఇట్టట్టు చలించు.

తక్కటి-తె. మూఁడు మొగములుగల దీపారాత్రికపు తట్ట.
తక్కిడి-తె. మోసము. (పుం. తక్కిడికాఁడు)
తక్కు-తె. 1. మోసముచేయు. రూ. టక్కు. 2. తప్పు. 3. మిగులు. 4. ఇతరము. సమా. తక్కులాఁడి - టక్కులాఁడి. (పుం. తక్కులాఁడు.)
తక్కుడు-తె. తక్కుట.
తక్కువ-తె. కొఱఁత. [రూ. తక్కెడ, తక్కెల.
తక్కెడ-తె. (తక్కు+ఎడ) తట్టలుగట్టిన త్రాసు.
తక్కెలి-తె. అల్పము.
తక్కొను-తె. (తల+కొను) పూను.
తక్రము-స. పాతికపాలు నీళ్లుచేర్చిన మజ్జిగ.
తక్రాటము-స. కవ్వము.
తక్షకుఁడు-స. 1. ఒక నాగరాజు. 2. వడ్లవాఁడు.
తక్షణము-స. (మ్రాను) చెక్కుట.
తక్షణి-స. బాడిస.
తక్షుఁడు-స. వడ్లవాఁడు. రూ. తక్షకుఁడు.
తగటు-తె. సరిగ. (తగటి-సరిగగలది)
తగడు-తె. బంగారు మున్నగువానితేకు.
తగరము-వి. (తమరము) ఒకతెల్లనిలోహము. రూ. తవరము. స. పొతేలు. (వి. తగరు) [అగ్ని-
తగరు-వి. (తగరము) పొతేలు. సమా. —రౌతు-
తగవు-తె. 1. తగుట. 2. న్యాయము. 3. వస్తునిమిత్తమగు జగడము. 4. పెండ్లియప్పుడు పెండ్లికూఁతునకు తల్లిదండ్రులిచ్చు బహుమానము. సమా. తగవరి-న్యాయాధిపతి. తగవుగోరి-సంధిచేయువాఁడు.
తగాదా-హిం. తగవు, వ్యాజ్యము.
తగు-తె. అర్హమగు. రూ. తవు.
తగులము-తె. 1. ఆసక్తి. 2. తగులు. 3. అడ్డపాటు. సమా. తగులాటము-బంధము, తగులు. (పుం. తగులాటకాఁడు. స్త్రీ.—కత్తె)
తగులు-తె. 1. చిక్కు. 2. పట్టు. 3. తాఁకు. 4. సక్తమగు. 5. అంటు. 6. పొసఁగు. 7. వెంబడించు. కృ. 8. ఆసక్తి. 9. అభిలాష. 10. తగులాటము. రూ. తవులు, తౌలు. సమా. —గొండి - తగులుకొనునట్టిది. —డు - తగులుట. —దల - పై —బడి-పట్టుబడి. —పాటు -

తగులుపడుట. క్రి. తగులఁగట్టు - తగిలించు. —(బడు-తగులు, చిక్కు. —(బెట్టు-1. తగిలించు. 2. కాల్చు. తగులుకొను-1. రగులుకొను. 2. వలచు. కృ. తగులుకోలు. —చు-తగులఁజేయు. —వడు-పట్టువడు.
తగ్గు-తె. 1. తక్కువగు. 2. వెనుదీయు. 3. తెగిపడు. 4. కృ. పల్లము. 5. తక్కువ. సమా. —దల-తక్కువ. [తచ్చనలాడు. పరిహసించు.
తచ్చన-తె. 1. కపటము. 2. పరిహాసము. క్రి.
తటకా-తె. నిశ్చేష్టత. క్రి. తటకాపడు.
తటమట-తె. 1. మోసము. 2. కలఁత. రూ. తటవట. క్రి. తటమటించు. [3. ప్రదేశము.
తటము-స. 1. ఏటియొడ్డు. 2. కొండచఱియ.
తటస్థము-స. 1. సమీపమందున్నది. 2. ఒనఁగూడినది. క్రి. తటస్థించు.
తటస్థుఁడు-స. న్యాయస్థుఁడు. [తటముకలది)
తటాకము-స. చెఱువు. రూ. తటాగము. (వ్యు.
తటాన-తె. అతి శీఘ్రముగా రూ. తటాలున.
తటి-స. 1. ఏటియొడ్డు. 2. ప్రదేశము.
తటిత్తు-స. మెఱుపు. సమా. తటిద్వంతము-మేఘము.
తటిని-స. ఏఱు. (వ్యు. తటములుగలది)
తటుకున-తె. తటాలున. రూ. చటుక్కున, తదుకున.
తట్ట-తె. 1. వెదురుబద్దలులోనగువానితో నల్లిన పల్లిక. 2. లోహముతోఁజేసిన తబుకు. క్రి. తట్టగిల్లు-తట్టవలెనగు.
తట్టము-తె. కేడెము.
తట్టన-తె. ధైర్యము.
తట్టాడు-తె. (తట్టు+ఆడు) అడుగులిట్టట్టిడు.
తట్టి-తె. 1. కంచము. 2. తెర. 3. తడక.
తట్టు-హిం. పొట్టి గుఱ్ఱము.
తె. 1. కలుగు. 2. తోఁచు. 3. చఱచు. 4. దరి. 5. ప్రక్క. క్రి. తట్టువడు-బాధపడు.
తట్టుముట్టాడు-తె. చుట్టుకొను.
తట్టువ-తె. గుఱ్ఱము. రూ. తట్టువము.
తట్ర-తె. బంగారుపనిచేసి బ్రదుకుజాతి, అగసాలె.
తడ-తె. 1. అడ్డి. 2. కడ. 3. ఆలస్యము. క్రి. తడకట్టు, తడపేయు. [చలించు. కృ. తడఁబాటు.
తడఁబడు-తె. 1. తొట్రువడు. 2. వ్యత్యాసపడు. 3.
తడక-తె. బద్దలతో అల్లిన తెరచాప. రూ. తడిక.
తడగము-తె. ఎద్దుమీఁద నీళ్లతెచ్చు తోలుసంచి. రూ. తణగము, తణగాము.
తడప-తె. పట్టగాసుండు నార.
తడయు-తె. ఆలస్యముచేయు.
తడవు-తె. 1. చేతులతో ప్రాఁకు. 2. దోఁగాడు. 3. నిమురు. 4. వెదకు. 5. ప్రస్తావించు. 6. విచారించు. 7. ఆలస్యము. 8. చిరకాలము. 9. సేపు. సమా. తడవుల నిడుపఁడు-శేషుఁడు.
తడవుడు-తె. వెదకుట.
తడి-తె. 1. తేమ. 2. నీరు.
తడిక-చూ. తడక.
తడియు-తె. ఆర్ద్రమగు.
తడుకు-తె. వెలుగు, కంచె.
తడుపు-తె. 1. తడియఁజేయు. 2. గోఁచి. 3. చిన్న వస్త్రము. సమా. —దాలుపు-బ్రహ్మచారి.
తడుము-తె. 1. ఆలోచించు. 2. నిమురు.
తణగము-చూ. తడగము.
తత్-స. ఆయొక్క.
తతము-స. 1. విరివియైనది. 2. వ్యాపించినది.
తత్తడి-తె. 1. గుఱ్ఱము. 2. వాహనము.
తత్తబడ-తె. పరివారము.
తత్తఱ-తె. (తఱ+తఱ) సంభ్రమము. రూ. తత్తఱము. క్రి. తత్తఱపడు. కృ. తత్తఱపాటు. తత్తఱించు-1. భ్రమించు. 2. చలించు. రూ. తత్తఱిలు, —ల్లు.
తత్తెర-తె. సారాయిపోసెడు తిత్తి.
తత్పరుఁడు-స. (ఒకట) ఆసక్తిగలవాఁడు.
తత్రత్యము-స. అక్కడఁగలిగినది, అచ్చటి.
తత్త్వము-స. 1. పరమాత్మ. 2. స్వభావము. 3. సారము.
తథ్యము-స. సత్యము.
తదియ-వి. (తృతీయ) పక్షమందు మూఁడవతిథి.
తదీయము-స. తత్సంబంధమైనది.
తద్ద-తె. మిక్కిలి. రూ. తద్దయు.
తద్దినము-స. (తత్+దినము) 1. ఆదినము. 2. మృతిపొందినదినము. [పెట్టునది.
తనకలి-తె. 1. చిక్కు. 2. చిక్కులఁబెట్టువాఁడు, —

తనము-తె. భావార్థమునందువచ్చుప్రత్యయము. (పెద్దతనము, మొ.)

తనయ-స. కూఁతురు.

తనయుఁడు-స. కొడుకు. (వ్యు. కులమును సంతోషమును విస్తరింపఁజేయువాఁడు.)

తనరు-తె. 1. ఒప్పు. 2. అతిశయించు. 3. విజృంభించు. రూ. తనరారు, తనరుచు, తనర్చు. కృ. తనరుపు. [తనర్పు. చూ. తనరు.

తనరుపు-తె. 1. పొడవు. 2. అతిశయము. రూ.

తని-తె. 1. ఒంటరి. 2. వి. (తను) అల్పము. 3. సూక్ష్మము. [తనుపు.

తనియు-తె. తృప్తిపడు. కృ. తనివి, తనివు. ప్రే.

తనివి-తె. తృప్తి. రూ. తనివు-క్రి. తనివోవు, తనినను.

తనుకు-తె. 1. కలుగు. 2. జ్వలించు. 3. ప్రకాశించు. 4. తపించు 5. కృ. తాపము. రూ. తన్కు.

తనుపు-తె. 1. తనియఁజేయు. 2. తనివి. 3. శైత్యము. 4. శైత్యోపచారము. 5. పితృయజ్ఞము. 6. తడి. క్రి. తనుపారు. తనియు. తనుపడు-చల్లఁబడు.

తనువు-స. 1. దేహము. 2. తోలు. 3. చిన్న. 4. సన్న. సమా. తనుత్రము-కవచము. రూ. తనుత్రాణము. —మధ్య. (సన్ననినడుముగలది) ఆఁడుది. తనూజుఁడు-కొడుకు. రూ. తనూజుఁడు, తనూభవుఁడు. తనూనపాత్తు - అగ్ని. —రుహము-1. ఱెక్క. 2. వెండ్రుక. రూ. తనూరుహము.

తన్ను-తె. 1. పాదతాడనముచేయు. 2. ఒరయు. 3. కృ. పాదతాడనము. సమా. —ఁగోల-ఆధారముగానుంచినకఱ్ఱ. క్రి. తన్నులాడు-కొట్టుకొను. [మైనది.

తన్మయము-స. (తత్+మయము) అన్వరూప

తన్మాత్రము-స. శబ్దాది. (ఇవియైదు: శబ్దస్పర్శరూప రస గంధములు. ఇవి పంచభూతములగుణములు.)

తపతప-తె. ఱెక్కలు కొట్టుకొనుటయందగుధ్వని.

తపన-స. తాపము. రూ. తపనము.

తపనీయము-స. బంగారు.

తపనుఁడు-స. సూర్యుఁడు. (వ్యు. తపింపఁజేయువాఁడు. [కాలము. 3. శిశిరఋతువు. (క్రి. తపించు.)

తపము-స. 1. ధ్యానము. రూ. తపస్సు. 2. ఎండ

తపసి-వి. (తపస్వి) 1. తపస్సుచేయువాఁడు. 2. గారచెట్టు. రూ. తబిసి.

తపస్వి-స. తపస్సుచేయువాఁడు. (స్త్రీ. తపస్విని.)

తపారము-తె. కుల్లాయి. రూ. తపారు.

తపించు-స. తాపమునొందు. 2. తపముచేయు.

తప్తము-స. తపింపఁజేయఁబడినది, కాఁచఁబడినది.

తప్ప-తె. గింజపట్టనిధాన్యము, లేక కాయ.

తప్పు-తె. 1. తప్పు. 2. చెడుగుచేయు. 3. అతిక్రమించు. 4. కృ. అపరాధము. రూ. తప్పిదము. సమా. —దారి-చెడుత్రోవ.

తప్పుడు-తె. తప్పుట. క్రి. తప్పుడుపడు.

తప్పుదల-తె. తప్పుట.

తప్పెట-తె. మూలలుకొట్టు పలక.

తబము-వి. (తపము) తపస్సు.

తబిసి-వి. (తపసి) ముని.

తబుకు-హిం. చట్టి. [మృదంగము.

తబేలా-హిం. 1. గుఱ్ఱపులాయము. 2. ఒకరీతి

తబ్బిబ్బు-తె. తడఁబాటు.

తమంగము-స. మంచె. (వి. తమగము) [పడు.

తమకము-తె. 1. త్వర. 2. మోహము. క్రి. తమకి

తమకి-తె. (తమకము + ఇ) 1. త్వరగలవాఁడు. 2. మోహమునొందినవాఁడు.

తమకించు-తె. 1. త్వరపడు. 2. చలించు.

తమకు-తె. 1. చలించు. 2. విధము.

తమగము-వి. (తమంగము) మంచె.

తమటము-తె. తప్పెట. రూ. తమ్మటము.

తమము-స. 1. చీఁకటి. 2. ఒకగుణము. 3. శోకము. రూ. తమస్సు.

తమర-తె. పంగ.

తమరము-స. (వి) తగరము.

తమస్విని-స. రాతిరి. (వ్యు. తమస్సుకలది.)

తమాలము-స. 1. బొట్టు. 2. కత్తి. 3. చీఁకటిమ్రాను.

తమి-తె. 1. త్వర. 2. కుతూహలము. 3. అపేక్ష. 4. వలపు. క్రి. తమికొను. స. 1. రాతిరి. 2. చీకటి.

తమిఁద-తె. రాగిపైరు. రూ. తవిఁద, తవ్విఁద.
తమిరె-తె. కాఁడినడిమిచీల, కమ్మ.
తమిస్ర-న. 1. చీఁకటిరేయి. 2. చిమ్మచీఁకటి.
తమిస్రము-స. 1. చీఁకటి. 2. కోపము.
తముకు-తె. తుడుము. రూ. టముకు.
తములము-వి. (తాంబూలము) వక్కాకు. రూ. తమ్మలము. సమా. తములపాకు - నాగవల్లీ దళము. రూ. తములపుటాకు. [తమ్మపడిగ.
తమ్మ-తె.నమలినతాంబూలము.సమా. —పసుకు-
—పడిగము-తాంబూలముమియుపాత్రము.
తమ్మంటు-తె. (తమ్మె+అంటు) కుండలము.
తమ్మటము-చూ. తమటము.
తమ్మి-వి. (తామరసము) 1. పద్మము. 2. పద్మవ్యూహము. రూ. తామర. సమా. —కంటి-1. ఆఁడుది. 2. విష్ణువు. —కెంపు-పద్మరాగము.—చూలి-బ్రహ్మ.(ఇట్లేతమ్మిపుట్టు.మొ.) —దీవి-పుష్కరద్వీపము.—దొర-సూర్యుఁడు. (ఇట్లే తమ్మలవిందు, మొ.) —పగతుఁడు-చంద్రుఁడు. —యింటిగరిత-లక్ష్మి,పద్మాలయ.
తమ్మియ-తె. 1. చెవితమ్మె. 2. పలుపుతమ్మె. రూ. తమ్మె, తంటె.
తమ్ముఁడు-తె. వెనుకఁబుట్టినవాఁడు, అనుజుఁడు. రూ. తమ్మువాఁడు. సమా. తమ్మగుట్టు-ముద్దుల తమ్ముఁడు.
తమ్మె-చూ. తమ్మియ.
తయారు-హిం. సిద్ధము.
తరంగము-స. అల. (వి. తరఁగ)ఒకరీతి భజన.
తరంగిణి-స. నది. (వ్యు. తరంగములు గలది)
తరండము-స. ఓడ.
తరఁగ-వి.(తరంగము)అల [లోనగువాని మాడుగు.
తఱక-తె.1.గింజసరిగా పట్టనిధాన్యము.2.మీఁగడ
తరకటించు-వి. తర్కించు. కృ. తరకటింపు.
తరకసము-తె. అమ్ములపొది. రూ. తరకసా.
తరక్షువు-స. సివంగి.
తఱచు-తె. 1. అధికము.2.దట్టము. రూ.తఱుచు.
తఱటు-తె. 1. కళతోకొట్టు. 2. కృ. గళ.
తరణము-స. దాఁటుట. క్రి. తరించు.
తరణి-న. 1. ఓడ. 2. దాఁటుట. 3. సూర్యుఁడు.
తఱతఱ-తె. సంభ్రమము. రూ.తత్తఱ,తత్తఱము.
తఱపి-తె. 1. పెయ్య. 2. తారుణ్యము.
తరపు-తె. 1. పోఁగొట్టు.
తరఫు-హిం. పక్షము.
తరము-తె. 1. పురుషాంతరము. 2. మానము. 3. సామ్యము. 4. వరుస. 5. దినుసు. 6. శక్యము. సమా. తరగతి - తరమును దెలుపు భాగము, క్లాసు. తరతరము - 1. క్రమముగా. 2. పరంపరగా.
తరము-స. దాఁటుట. క్రి. తరించు.
తరలు-తె. ప్రయాణమగు. [విడుచు.
తఱలు-తె. 1. చలించు. 2. సంభ్రమించు. 3.
తరవరి-వి. (తరవారి) పట్టాకత్తి. రూ. తరవలి. (హిం. తల్వార్)
తరవాణి-తె. పుల్లనీళ్లు. [3. తడవ.
తరవాయి-తె. 1. సమయము. 2. అనుక్రమము.
తరవారి-స. పట్టాకత్తి. [స్త్రీ. తరస్విని.)
తరస్సు-స. 1. బలిమి. 2. పడి. (పుం. తరస్వి.
తరహా-హిం. రీతి.
తరళము-స. 1. నాయకమణి. 2. చలించునది. 3. ప్రకాశించునది. 4. అనురాగముగలది. సమా. తరళేక్షణ-ఆఁడుది, క్రాలుగంటి.
తరాజు-తె. తూఁచెడు సాధనము. రూ. తరాసు, త్రాసు. (హిం. తరాజ్)
తరి-తె. త్రచ్చుట, చిలుకుట. క్రి. తరుచు,త్రచ్చు. సమా. తరికాఁడు - త్రచ్చువాఁడు. —గంబము-పెరుగుచిలుకు కంబము. —గొండ-మంథాద్రి. —గోల-కవ్వము. క్రి. —చుట్టు-నివేదనముచేయు.
తరి-స. ఓడ.
తఱి-తె. 1. సమయము. 2. సమీపము. 3. ఒకపిడిచేఁగలిగిన రేఖ. 4. బ.వళి. సమా. తఱుల మెకము-కోఁతి, వలీముఖము. రూ. తఱుల మోరమెకము. క్రి. —గొను - యత్నించు. —వడు-ఒత్తుడుపడు.
తరితీపు-తె. 1. ఉపేక్ష.2. అపేక్ష.క్రి.—సేయు-1. గర్వించు. 2. ఉపేక్షించు.
తఱిమెన-తె. కొయ్యను యంత్రమునఁబెట్టి వలసి

నట్లు అఱుగఁదీయుట. క్రి. తఱుము.

తఱియు-తె. 1. సమీపించు. 2. అతిక్రమించు. 3. దాఁటు. రూ. తఱియఁబడు.

తఱుఁగు-తె. క్షయించు. రూ. తగ్గు.

తఱుగు-తె. 1. ఖండించు. 2. చించు. 3. క్రయ విక్రయములలో నూటికింతయని తీసికొనుడబ్బు. సమా. తఱుగరి-తఱుగుతీసికొనువాఁడు.

తఱుచు-చూ. తఱచు. [3. యౌవనముగలది.

తరుణము-స. 1. సమయము. 2. క్రొత్తది.

తరుణి-స. 1.యౌవనముగల ఆఁడుది. 2.ఆఁడుది. రూ. తలుని. (పుం. తరుణుఁడు)

తరుణిమ-స. యౌవనము. రూ. తారుణ్యము.

తఱుపు-తె. 1. చూ. తఱపి. 2. ఒకతెగ కెంపు.

తఱుము-తె. 1. కవియు. 2. త్వరపడు. 3.వెంబడించి పరుగెత్తు. 4. బలాత్కరించు. 5. తఱిమెన పట్టు.

తరువడి-తె. తఱిమెన.

తరువాయి-తె. అనంతరము.

తరువు-తె. ఇయ్యవలసినదానినిమ్మని చేయు నిర్బంధము. సమా. —కాఁడు-తరువువచ్చినవాఁడు. స. చెట్టు. [చు. రూ. తఱుగు.

తఱువు-తె. 1. తగ్గు. రూ. తఱుఁగు. 2. ఖండిం

తఱుసలి-తె. ఉద్ధతుఁడు. [శాస్త్రము.క్రి. తర్కించు.

తర్కము-స. 1. ఊహ. 2.అధ్యాహారము.3.ఒక

తర్జనము-స. అదలుపు.

తర్జని-స. జుట్టన వ్రేలు.

తర్ణకము-స. అప్పుడు పుట్టినదూడ.

తర్పణము-స. తృప్తి.

తఱ్ఱు-తె. నీచుఁడు. రూ. తఱ్ఱు.

తర్షము-స. 1. దప్పి. 2. ఇచ్ఛ. రూ. తృష.

తల-తె. 1. శిరసు. 2. శిరోజము. 3. కొన. 4. పూనిక. 5. ఎత్తు. 6. ముందుభాగము. 7.మొత్తము. 8.ఎడ, స్థానము. 9.సమయము. 10. మొదలు. సమా. తలంటు. అభ్యంగన స్నానము. రూ. తలయంటు.తలఁబ్రాలు-పెండ్లిలో వధూవరుల తలపైఁబోయు అక్షతలు. తలకట్టు-1. అకారరూపాంతరనామము. 2.పాగా. 3. ముఖ్యము. —కాఁడి-బళువెక్కువైనపుడు ముందు చేర్చికట్టు మఱొకకాఁడి. —కాయ-శిరస్సు. —కెడవు. తలక్రిందు. రూ. తల్లకెడవు. —కొట్లమారి-1. శిరచ్ఛేదనము పొందినవాఁడు. 2. అవినీతుఁడు. —కొఱవి-శవము తలకడనుంచునిప్పు. —క్రిందు-1. అధోముఖము. 2.విలోమము. రూ. తల్లక్రిందు.—గడ-1. పరుండునపుడు తలయుంచుకొను దిక్కు. 2. దిండు. రూ. తలాడ. —గడుగు-తలంటు. —గాము-రాహువు. —గుంజ-నిట్రాడు. —చావడి-ఇంటిముందఱిచావడి. —చుట్టు-పాగా. —తల-ఒక్కొక్కనికి. —నట్టు-వేరుపురుగు కొఱకి మోవులెండుట.—పీకనగాయ-కలఁత. —పొలము-పొలిమేరవెంబడినున్న పొలము. —మాటు-చేటు. —మానికము-శిరోరత్నము. —మునుక-1. శిరస్స్నానము. 2. శిరః ప్రమాణము. —యంపి-తలగడ. రూ. తలాఁపి, తల్లఁపి. —వంపు-మానభంగము. —వరి-ఊరికావలివాఁడు. రూ. తలారి. —వాకిలి-మొదటి వాకిలి. (తలసాలఅనియు) —వీఁడు-సమీప ప్రదేశము. తలాటము-తురాయి. క్రి. తలకడచు - అతిక్రమించు. (ఇట్లేతలమీఱు ము.)—కూడు-సిద్ధించు.—కొను-1.కలుగు. 2. యత్నించు. 3. తాల్చు. —చూపు-తోఁచు. —పడు. 1. ఆరంభించు. 2. ఎదిరించు. 3. తాఁకు. కృ. తలపాటు. —పెట్టు-1. ఆరంభించు. 2. ప్రస్తావించు. —పోయు-1. చింతించు. 2. ఆలోచించు. కృ. తలపోఁత. —మించు-ముందుపోవు, అతిక్రమించు. (ఇట్లే తలమిగులు,—మీఱు, ము.) —యెత్తు-1. వర్ధిల్లు. 2. మొలచు.

తలఁకు-తె. 1. చలించు. 2. భయపడు. (రూ. తలఁకీఁచు.) కృ. 3. చలనము. 4. భయము.

తలఁగు-తె. 1. ఒదుఁగు. 2. ఒదిగించు. రూ. తలవు, తగ్లు, తొలఁగు. కృ. తలఁగుడు.

తలఁచు-తె. 1. ఎంచు. 2.ధ్యానించు. రూ.తల్చు. కృ. తలఁపు.

తలఁపు-తె. 1. తలఁచుట. 2. కోరిక. 3. ఆలోచనము. 4. జ్ఞప్తి. 5. హృదయము. 6. అభి

ప్రాయము. సమా. —చూలి - మన్మథుఁడు, భావజుఁడు. —మిన్న - చింతామణి. రూ. తలఁపు ఱాయి. —సాకిరి - నీవెఱిఁగియుండుమని వాది చెప్పియుంచినసాక్షి. [తల్లడిల్లు.
తలడిల్లు - తె. చలించు. రూ. తలడించు. తల్లడించు,
తలము - తె. 1. ఏఁతము. 2. శక్యము. (రూ. తరము) క్రి. తలముదప్పు - అశక్యమగు. స. 1. అత్తెము. 2. స్థలము.
తలరు - తె. 1. చలించు. 2. చింతించు. 3. కలఁగు. 4. ఒప్పు. 5. సంభ్రమించు.
తలా - తె. వెఱి, తలరు.
తలారించు - తె. మరలు.
తలి - తె. జనని. రూ. తల్లి.
తలిమము - స. 1. దూదిపఱుపు. 2. జాతికట్టడపునేల.
తలియ - వి. (స్థాలము) భోజనపాత్రము.
తలిరు - తె. చిగురు. క్రి. తలిరుచు. కృ. తలిరుపు. సమా. —ఁబోఁడి - ఆఁడుది. —దిండి - కోయిల. —విలుతుఁడు - మదనుఁడు. రూ. —విల్తుఁడు, —విలుకాఁడు.
తలివము. వి. (తలిమము) శయ్య.
తలుగు - తె. పలుపు, సందానము.
తలుపు - తె. వాకిటిమూఁతపలక, కవాటము.
తలోదరి - స. ఆఁడుది. (వ్యు. చిన్నకడుపుకలది.)
తల్పము - స. దూదిపఱుపు.
తల్లజము - స. (రెండవపదమైనపుడు) శ్రేష్ఠము.
తల్లడము - తె. చలనము. క్రి. తలడిల్లు, తల్లడిల్లు, తల్లడపడు.
తల్లి - తె. 1. జనని. (రూ. తలి) 2. మొదటిది. (తల్లివేరు. మొ.) స. జవరాలు.
తవన - తె. నిర్ణయకాలము.
తవరము - చూ. తగరము.
తవళి - చూ. తవళి.
తవిఁద - చూ. తమిఁద.
తవు - చూ. తగు.
తవుఁడు - తె. బియ్యముమీఁదిపొట్టు. రూ. తౌడు.
తవులు - చూ. తగులు.
తవెల - తె. నోరు వెడల్పగు లోహపాత్రము.
తవ్వ - తె. రెండుసోలలు.
తసుకు - తె. 1. ప్రేమకలిగినట్లు చేష్టించు. 2. కృ. ప్రేమకలిగినట్లుచేయుచేష్ట. 3. టక్కు. సమా. తసుకులాఁడి - తసుకులు గలది.
తస్కరుఁడు - స. దొంగ. క్రి. తస్కరించు.
తస్స - తె. దుర్మాంసము.
తహతహ - తె. తమి, ఉత్కంఠ. క్రి. —పడు.
తహసీలు - హిం. పన్ను.
తళతళ - తె. 1. మిఱుమిట్లుగొలుపుకాంతి. 2. మెఱయుట యందగు ననుకరణము.
తళిగ - వి. (స్థాలము) 1. భోజనపాత్రము, 2. దేవునికి నివేదించుఅన్నము. రూ. తళియ.
తళుకు - తె. మిక్కిలిప్రకాశము. క్రి. తళుకొత్తు.
తళుక్కు - తె. మెఱయుట యందగు ననుకరణము.

## తా

తా - తె. తాను అనుపదమునకు మొదటి రూపము.
తాండవము - స. ఉద్ధతమైననృత్యము. క్రి. తాండవించు. [తోఁజేసిన అడప.
తాంద్ర - తె. 1. విభీతకవృక్షము. 2. ఫలరసము
తాంతము - స. బడలినది. [2. విషవైద్యుఁడు.
తాంత్రికుఁడు - స. 1. సిద్ధాంతము నెఱిఁగినవాఁడు.
తాంబాళము - తె. పెద్దలోహపు తట్ట.
తాంబూలము - స. వక్కాకు. (వి. తములము) సమా. తాంబూలవల్లి - తమలపాకు తీఁగ. రూ. తాంబూలి.
తాఁకించు - తె. 1. శ్రమపఱుచు. 2. తాఁకఁజేయు.
తాఁకు - తె. 1. మార్కొను. 2. అంటు. 3. కృ. తాఁకుట. సమా. —దల - యుద్ధారంభము.
తాఁకుడు - తె. తాఁకుట, సోఁకుడు. సమా. —వేఁకి - వరుసజ్వరము.
తాఁచు - తె. తన్ను. కృ. తాఁపు.
తాఁట - తె. 1. చెట్టుపైపట్ట. 2. మోసము. సమా. —కత్తె - మోసకత్తె. —దమ్మఁడు - జీవనార్థము సన్న్యాసివేసముతాల్చినవాఁడు, లింగి.
తాఁడి - తె. తాండ్రచెట్టు.
తాఁపు - తె. తన్ను, తాడనము.
తాఁబేలు - తె. కూర్మము. రూ. తామేలు.
తాకట్టు - తె. (తాకు + కట్టు) అడమానము, కుదువ.

తాకీదు-హిం. ఆజ్ఞాపత్రము.
తాగడించు-తె. (తాకు+గడించు) నిర్బంధించు.
తాగు-తె.పానముచేయు.రూ.త్రాగు. సమా. —ఁబోతు-అమితముగా కల్లుద్రాగువాఁడు.
తాచు-తె. 1.చెక్కు. 2.తొలుచు. 3.అవలంబించు.
తాటంకము-స. దంతము లోనగువానిచేఁ జేయఁబడిన చెవికమ్మ.
తాటించు-వి. (తాడించు) కొట్టు.
తాటోటు-తె. మోసము. రూ. టాటోటు.
తాడనము-స. కొట్టుట. క్రి. తాడించు.
తాడితము-స. కొట్టఁబడినది.
తాడు-తె. 1. దారము. రూ. త్రాడు. 2. తాటిచెట్టు. రూ. తాడి. సమా. తాటిపడగవాఁడు-1. బలరాముఁడు. 2. భీష్ముఁడు. —రిక్క-జ్యేష్ఠ. —నెల-జ్యేష్ఠమాసము.
తాత-తె. 1. తండ్రికి తండ్రి. 2. తల్లికితండ్రి. వి. (ధాత) బ్రహ్మ. స. తండ్రి.
తాత్పర్యము-స. అభిప్రాయము.
తాదృశము-స. అటువంటిది. [2. ఉనికి.
తానకము-వి. (స్థానకము) 1.జెట్లునిలుచుండుతీరు.
తానము-వి. 1. (స్థానము) చోటు. 2. స్నానము, మునుక.స. తన్నకారముతో పాడెడుపాట. తోం తోం తిల్లానా మొ.
తాను-తె. ప్రథమపురుషయందు పునరుక్తిని తొలఁగించుట కుపయోగించు సర్వనామము. బ.తాము, తమరు, తారు.
తాప-తె. 1. నిచ్చెన. 2. మెట్టు.
తాపము-స. 1.వేఁడిమి. 2.బాధ. (తాపత్రయము: ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము.)
తాపసుఁడు-స.తపసి.సమా.తాపసతరువు-గారచెట్టు.
తాపి-తె. 1. మర్మము. 2. జాడ. 3. తాతిగోడపెట్టువాఁడు. 4. కరిణె. రూ. తాపీ. [క్కు.
తాపించు-వి. (స్థాపించు.) 1.నెలకొలుపు. 2. చె
తాపింఛము-స. చీఁకటిమ్రాను, తమాలము.
తాపికత్తియ-తె. సంధానముచేయునది. పుం. తాపికాఁడు.
తాపితా-హిం. మేలైన పట్టుగుడ్డ.
తాపు-తె. 1. చెక్కు. 2. అవలంబము.
తామర-వి. (తామరసము.) పద్మము. రూ.తమ్మి. సమా. —చెలి-సూర్యుఁడు, పద్మమిత్రుఁడు. —తంపము-1. తామరల సమూహము.2. అభివృద్ధి. రూ. తామరతంపర. —తూపరి-మదనుఁడు.
తామరసము-స. 1. తామర. 2. బంగారు.3.రాగి.
తామసము-తె. ఆలస్యము. క్రి. తామసించు. స. తమోగుణము కలది. [నరకము.
తామిస్రము-స. 1. చీఁకటి. 2. చీఁకటిమయమైన
తామేలు-చూ. తాఁబేలు.
తామ్రము-స. 1. రాగి. 2. ఎఱుపు. సమా. తామ్రచూడము-కోడి. —పర్ణి-1. ఒకనది. 2. పడమటిదిక్కునందలి ఆఁడేనుఁగు.
తాయి-తె. తల్లి.
తాయెతు-తె. (తాయి+ఎత్తు) తల్లి బిడ్డలకుఁగట్టు రక్షాబంధము. రూ. తాయెత్తు.
తార-స. 1. నక్షత్రము. 2. బృహస్పతిభార్య. 3. వాలిభార్య. సమా. తారాపతి-చంద్రుఁడు. —పథము-ఆకాశము.
తారకము-స. 1. కంటినల్లగ్రుడ్డు. 2. నక్షత్రము. రూ. తారక. 3. తరింపఁజేయునది.
తారకాణ-తె. దృష్టాంతము. రూ. తారకాణము, తార్కాణ, తార్కాణము. క్రి. తారకాణించు, తార్కాణించు.
తారణ-స. పదునెనిమిదవ సంవత్సరము. [వలు.
తారతమ్యము-స. తర తమభావము, హెచ్చుతక్కు
తారము-స. 1. వెండి. 2. పులుగడిగినముత్తెము. సమా. తారహారము-ముత్యాలసరము.
తారసము-తె. 1. సమీపము. 2. తలపాటు. క్రి. తారసించు, తారసిలు, తారసిల్లు.
తారాడు-తె. 1.తిరుగులాడు.2.జీరాడు.3. తడవు.
తారు-తె. 1. సంచరించు. 2. పోవు. 3.కదియు. రూ. తార్కొను. [సమా.తార్పుకత్తె-తాపికత్తె.
తారుచు-కూర్చు. రూ.తార్చు. కృ. తారుపు,తార్పు.
తాఱు-తె. 1. అడఁగు. 2. మఱుఁగుపడు.
తారుణ్యము-స. యౌవనము.
తాఱుమాఱు-తె. వ్యత్యాసము.
తార్కికుఁడు-స. తర్కశాస్త్రముతెలిసినవాఁడు.

తార్క్ష్యుఁడు-స. 1. అనూరుఁడు. 2. గరుడుఁడు. (వ్యు. తృక్షునికొడుకు.)

తాలము-స. తాటిచెట్టు. రూ. తాళము. సమా. తాలధ్వజుఁడు-తాటిపడగవాఁడు. తాలాంకుఁడు-బలరాముఁడు. [—బొట్టు. పై.

తాలి-తె. మంగళసూత్రము. రూ. తాళి. సమా.

తాలించు-తె. (కూరలు) తిరుగఁబోయు. రూ. తాళించు. కృ. తాలింపు, తాళింపు. [కూర.

తాలింపు-తె. 1. తిరుగఁబోఁత. 2. తిరుగఁబోసిన

తాలిక-తె. మెలిక.

తాలిమి-తె. 1. క్షమ. 2. ధైర్యము. రూ. తాల్మి. సమా. —కాఁడు-క్షమగలవాఁడు. స్త్రీ.—కత్తె.

తాలు-తె. ఎన్నుతీసివేసినపైరు.

తాలుచు-తె. 1. ధరించు. 2. పురిపెట్టు. 3. (దారము) పేను. రూ. తాల్చు. కృ. తాలుపు, తాల్పు.

తాలువు-స. దవుడ.

తాలూకా-హిం. జిల్లాలోనొకభాగము. [కట్టిలు.

తావకాళ్లు-తె. ఏఁతమెత్తువాఁడు కాళ్లుంచుకొను

తావకీనము-స. నీది, త్వదీయము.

తావడము-తె. రుద్రాక్షలు మొదలగునవి గ్రుచ్చిన హారము. రూ. తావళము.

తావరము-వి. (స్థావరము) స్థిరమైనది.

తావలము-తె. 1. స్థానము. 2. ఆధారము.

తావి-తె. పరిమళము. సమా. —గట్టు-మలయపర్వతము. —నూనె-అత్తరు. —మోపరి-గాలి, గంధవహుఁడు. —విలుకాఁడు-మదనుఁడు.

తావు-తె. స్థానము. క్రి. తావుకొను-నెలకొను.

తాళము-స. 1. బీగము. 2. పాడునపుడుచేతులతో చఱచుచఱపు. 3. తాటిచెట్టు. 4. తాళమువేయు కంచువాద్యము. సమా. తాళపత్రము-1. తాటాకు. 2. చెవ్వాకు. —వృంతము-విసనకఱ్ఱ.

తాళి-తె. 1. పతకము. 2. హారము. రూ. తాళీ.

తాళిక-తె. 1. ఓర్పు. 2. చాలినది.

తాళు-తె. 1. తాళికయగు. 2. సహించు. 3. నిదానించు. రూ. తాళుకొను. కృ. తాళిక.

తాళువారము-తె. పంచపాళి. రూ. తాల్వారము. (ఇంటికి ముందుభాగమున వంచికట్టినది.)

## తి

తింట-తె. తినుట.

తిండి-తె. ఆహారము. సమా. —కాఁడు-ఎక్కువ తినువాఁడు. రూ. —పోతు, తిండీఁడు. స్త్రీ. తిండికత్తె.

తింత్రిణి-స. చింతచెట్టు. రూ. తింతిడి.

తింత్రిణీకము-స. చింతపండు. రూ. తింతిడీకము.

తికమక-తె. 1. కలఁత. 2. తొట్రుపాటు. క్రి.—గొను,—పడు.

తిక్క-తె. పిచ్చి. రూ. త్రిక్క. క్రి. —గొను.

తిక్కటమక్కట-తె. కలఁత.

తిక్తము-స. చేఁదైనది.

తిగ-వి. (త్రికము) మూఁడు. రూ. తివ. సమా. —కంటి-శివుఁడు.—వంచ-నాలుగు.

తిగియు-తె. ఆకర్షించు. రూ. తిగుచు, తివియు, తివుచు.

తిగ్మము-స. వేఁడిమి.

తిట్ట-తె. రాశి. [పము. 4. నింద.

తిట్టు-తె. 1. శపించు. 2. నిందించు. కృ. 3. శా

తితఉవు-స. జల్లెడ.

తితిక్ష-స. ఓర్పు. (తితిక్షువు-ఓర్పరి). [తిత్తి.

తిత్తి-తె. 1. చిన్నసంచి. 2. కొలిమితిత్తి. 3. సుతి

తిత్తిరి-స. తీతువుపిట్ట. [ద్ధదినము.

తిథి-స. 1. పాడ్యమి మొదలగుపదునైదు. 2. శ్రా

తిను-తె. భుజించు. [క్కి విషించుట.

తినుకు-తె. 1. ముక్కుముక్కి విషించు. 2. ము

తిన్న-తె. 1. మనోజ్ఞము. 2. యుక్తము. 3. స్వస్థము. 4. ఋజువు. 5. సౌమ్యము.

తిన్నియ-తె. అరఁగు. రూ. తిన్నె, తీనియ, తీనె.

తిపురుకట్టు-తె. వ్యాపించు.

తిప్ప-తె. 1. చిన్నకొండ. 2. కొండ. 3. దిబ్బ. సమా. —త్రిమ్మరి-కోఁతి.

తిబిరి-తె. 1. చూఱుపాటు. 2. అల్పము.

తిమి-స. నూఱుయోజనముల పొడవుగలచేఁప.

తిమింగిలము-స. తిమినిమ్రింగెడుజలచరము.

తిమిరము-స. చీఁకటి. [తిమురు.

తిమిరి-తె. స్పర్శము తెలియనిరోగము. రూ. తిమ్మిరి,

తిమురు-తె. 1. త్వరపడు. 2. ఉద్రేకించు. 3.

ఒడలువిఱుచు. 4. గర్వించు. 5. తిమిరి. 6. కృ. గర్వము.

తిమ్మ-తె. స్వప్నము.

తిమ్మఁడు-తె. (తిరుమల+ఁడు) కోఁతి.

తిమ్మనము-వి. (తేమనము) మజ్జిగపులుసు.[రుఁడు.

తిమ్మప్పఁడు-తె. (తిరుమల+అప్పఁడు) వెంకటేశ్వ

తిమ్ము-తె. దీవించు.

తియ్య-తె. మధురము. రూ. తీయ. సమా.—బోఁడి-ఆఁడుది.—గూర-పులుసు లేనికమ్మఁగూర.—విలుకాఁడు-మదనుఁడు. [తీయము.

తియ్యము-తె. 1. ఓదార్పు. 2. ప్రియము. రూ.

తిరము-వి. స్థిరము. క్రి. తిరపడు.

తిరస్కరిణి-స. తెర. [క్రి. తిరస్కరించు.

తిరస్కారము-స. అనాదరము. రూ. తిరస్క్రియ.

తిరి-తె. 1. జట. 2. సుడి. 3. పేలిక. క్రి. తిరివడు-1. కలఁతపడు. 2. మెలివడు.

తిరిక-తె. మెలిక.

తిరితీపులాడు-తె. పెనఁగులాడు.

తిరిపము-తె. భిక్షము. సమా. తిరిపగాఁడు-భిక్షుకుఁడు. రూ. తిరిపరి. స్త్రీ. తిరిపగత్తె. —గొట్టు-బిచ్చమెత్తుటయే వృత్తిగాఁగలవాఁడు. రూ. తిత్తిగొట్టు.

తిరియు-తె. బిచ్చమెత్తు. రూ. తిరుచు. కృ. తిరిపము.

తిరు-అ. శ్రీ, పూజ్యమైన. సమా.—కాపు-భగవంతుని అలంకారము. —కొలను-పుష్కరిణి.—చిన్నము-సన్నకాళె. —చూర్ణము-ఎఱ్ఱనామపుపొడి.—నాళ్ల-దేవోత్సవము.—నీఱు-విబూది.—పగూడ-తిరుమనిపెట్టె.—పతి-విష్ణుక్షేత్రము.—మజ్జనము-భగవంతునభిషేకము. —మణి-తెల్లనామము. రూ. తిరుమన్ను. —మల-వేంకటాచలము. —మాళిగ-గృహము.—ముడి-వైష్ణవుఁడు. —వడికోల-దాసరిదీపస్తంభము.

తిరుఁడు-వి. స్థిరుఁడు.

తిరుగు-తె. సంచరించు. 2. పరిభ్రమించు. 3. వెనుకకుమరలు. 4. పరివేష్టించు. రూ. తిరువు, తిర్గు. సమా. తిరుగడ-మఱుగొట్టము. తిరుగలి-1. (తిరుగు+కల్లు) పిండివిసరు శిలాయంత్రము, ఘరట్టము. 2. (తిరుగు+కలి) భ్రమము. తిరుగుఁబోతు-తిరుగుస్వభావముకల(ది), వాఁడు. క్రి. తిరిగివచ్చు-ప్రదక్షిణించు. తిరుగఁబోయు-తాళించు. కృ. తిరుగఁబోఁత.

తిరుగుడు-తె. 1. తిరుగుట. 2. మాఱుపాటు. 3. మఱ. సమా.—చీల-మఱచీల. క్రి.—పడు-పరిభ్రమించు. కృ. తిరుగుడుపాటు.

తిరుచు-చూ. తిరియు.

తిరుపు-తె. తిరుగుట. క్రి. తిరుపులుగట్టు-వ్యాపించు.

తిరోధానము-స. మఱుఁగుపాటు. రూ. తిరోభావము.

తిరోహితుఁడు-స. మఱుఁగుపడినవాఁడు, అంతర్హితుఁడు.

తిర్యక్కు-స. అడ్డముగాఁబోవునది, పశ్వాది.

తిలకము-స. 1. బొట్టు. 2. నల్లగుఱ్ఱము. 3. పుట్టుమచ్చ. 4. బొట్టుగుచెట్టు. 5. శ్లేష్మము.

తిలకించు-తె. 1. ప్రకాశించు. 2. ప్రసన్నతనొందు. 3. చూచు.

తిలలు-స. నువ్వులు. సమా. తిలఘాతుకుఁడు-గాండ్లవాఁడు. తిల తండులన్యాయము-నువ్వులు బియ్యము కలిసినవిధము. తిలయంత్రము-గానుఁగ.

తివ-చూ. తిగ.

తివాసి-తె. చిత్రాసనము.

తివియు-చూ. తిగియు. రూ. తివుచు.

తివుట-తె. కోరిక.

తివురు-తె. 1. కోరు. 2. త్వరపడు. 3. కుతూహలపడు. 4. యత్నించు. 5. మ్రోగు.

## తీ

తీ-తె. సమాసమందుతిగశబ్దమునకు ఆదేశరూపము. (తీవంప)

తీంట్రము-తె. దురద. రూ. తీఁట.

తీండ్ర-తె. 1. ప్రకాశము. 2. వేఁడిమి. 3. తేజము. 4. చుఱుకు. క్రి. తీండ్రించు, తీఁడిరించు.

తీండ్రము-తె. తీక్ష్ణము.

తీఁగ-తె. 1. లత. రూ. తీఁగియ, తీఁగె, తీవ, తీవియ, తీవె. సమా. —బోఁడి-ఆఁడుది. —మెఱపు-ఉఱుములేనిమెఱపు. —మోడి-వ్రాఁతపని. —యిల్లు-పొదరిల్లు.—యెలుఁగు-

హీనస్వరము. —విలుకాఁడు-మదనుఁడు. క్రి. —సాఁగు-వర్ధిల్లు.

తీఁట-తె. 1. గజ్జి. 2. దురద.

తీఁదిరించు-తె. ప్రకాశించు. రూ. తీంద్రించు.

తీఁపురము-తె. అగడము.

తీక్ష్ణము-స. 1. వేఁడిమి. 2. వాఁడియైనది. 3. చులుకైనది. సమా. తీక్ష్ణతుండము-దోమ.

తీడు-తె. వాఁడిచేయు.

తీతువు-వి. (తిత్తిరి) "తి త్తిత్తి" యనికూయుపక్షి.

తీనియ-చూ. తిన్నియ.

తీపి-తె. 1. మాధుర్యము. 2. ఇచ్ఛ.

తీపు-తె. 1. మాధుర్యము. 2. గుంజెడుబాధ. క్రి. తీపారు. మనోజ్ఞమగు.

తీయ-చూ. తియ్య.

తీయము-చూ. తియ్యము.

తీయు-తె. 1. తొలఁగు. 2. కృశించు. 3. తగ్గు. 4. ఈడ్చు. 5. కొను. 6. వెలయిచ్చికొను. 7. వేయు. (తీసివేయు, ఎత్తివేయు.)

తీఱమి-తె. అక్కఱ.

తీరము-స. దరి.

తీఱిక-తె. అవకాశము, తీఱుబడి.

తీరు-తె. 1. చక్కఁబడు. 2. శక్యమగు. కృ. 3. చక్కన. 4. విధము.

తీఱు-తె. 1. నశించు. 2. పాయు. 3. అవకాశపడు. సమా.—గడ-1. తీఱిక. 2. ముగియిక. —దల-ముగియిక. —పాటు-తీఱిక. —బడి- —పై—క్రి. ప్రే. తీఱుచు-1. నశింపఁజేయు. 2. పాపు. కృ. తీఱుపు, తీఱుపడు-నశించు.

తీరుచు-తె. తీర్పుచేయు. 2. దిద్దు. రూ. తీర్చు. కృ. తీరుపు, తీర్పు.

తీరువ-తె. పిస్తు, పన్ను.

తీర్ణము-స. దాఁటఁబడినది.

తీర్థము-స. 1. పుణ్యనది. 2. రేవు. 3. పుణ్యక్షేత్రము. 4. నూతియొద్దఁగట్టిన తొట్టి. (వ్యు. దీనిచే తరింతురు.) క్రి. తీర్థమాడు-స్నానముచేయు. కృ. తీర్థమాట.

తీలు-తె. అదకము. క్రి. తీలుపడు.

తీవ-చూ. తీఁగ.

తీవంచ-(తిగ+వంచ) నాలుగు.

తీవరము-వి. (తీవ్రము) త్వరితము. క్రి. తీవరించు. తీవరపడు. కృ. తీవరపాటు.

తీవియ-చూ. తీఁగ.

తీవిరము-తె. తీఁట.

తీవ్రము-స. 1. అధికము. 2. వేఁడిమిగలది. 3. [కారముగలది.

## తు

తుంగ-తె. ఒకతెగ కసవు.

తుంగము-స. పొడవైనది.

తుంట-తె. 1. తునుక. 2. చెఱకు. 3. దుష్టుఁడు. రూ. తూఁట. సమా. తుంటరి-దుష్టుఁడు. తుంటవిలుకాఁడు-మదనుఁడు. రూ. తుంటవిలుతుఁడు, —విల్తుఁడు.

తుంటి-తె. కటిపార్శ్వభాగము, రొండి.

తుండము-తె. ఖండము. రూ. తుండు, తుండె, తుండెము. క్రి. తుండించు. స. 1. పక్షిముక్కు. 2. నోరు. 3. మొగము. రూ. తుండి.

తుండి-స. 1. ఉఱుకుబొడ్డు. 2. తుందము. [లుఁడు.

తుండిభుఁడు-స. ఉఱుకుబొడ్డువాఁడు. రూ. తుండి

తుందము-స. కడుపు.

తుంది-స. 1. కడుపు. 2. ఉఱుకుబొడ్డు. 3. బొజ్జకడుపుగలవాఁడు.

తుందిభుఁడు-1. బొజ్జకడుపుగలవాఁడు. 2. ఉఱుకుబొడ్డుగలవాఁడు. రూ. తుందిలుఁడు.

తుందుడుకు-తె. (తుడుకు+తుడుకు) 1. సంతాపము. 2. విచారము. 3. కలఁత. 4. త్వరపడిచేయువాఁడు. రూ. దుందుడుకు.

తుందునుకలు-తె. (తునుకలు+తునుకలు) చిన్నచిన్న తునుకలు రూ. తునాదునుకలు.

తుంపర-తె. చెదరిపడు నీటిబొట్లు. శీకరము. రూ. తుంపురు, తుప్పర.

తుంపిళ్లు-తె. తుంపరలు, తుంపరవాన.

తుంపెసలు-తె. చలనము. క్రి. తుంపెసలాడు, తుంపెసలు-గునియు.

తుంబి-స. 1. తుమ్మిచెట్టు. 2. సొరతీఁగ.

తుంబిక-స. 1. బండిచక్రమునడిమిరంధ్రము. 2. సొరతీఁగ.

తుకతుక-తె. 1. సంతాపము. 2. కోపము.
తుకము-తె. మతింపు.
తుక్కు-తె. సూక్ష్మాంశము.
తుచ్ఛము-స. 1. అల్పము. 2. శూన్యము.
తుజాగు-తె. త్వరపడువాఁడు.
తుటాయించు-తె. అలక్ష్యపఱచు. [క్రి.తుటారించు.
తుటారము-తె. 1. దిట్టతనము. 2.పరుషవచనము.
తుటారి-తె. 1. దిట్టతనముగలది. 2. పారుష్యము గలది. సమా. —కత్తె. పుం.—కాఁడు.
తుటుము-తె. సమూహము. రూ. తుడుము.
తుట్టతుద-తె. (తుద+తుద) చిట్టచివర.
తుట్టమర-తె. బొత్తిగా.
తుట్టియ-తె. సమూహము. రూ. తుట్టె, త్రుట్టియ, త్రుట్టె. సమా. తుట్టెపురుగు-ఒకతెగ చిన్న పాము. క్రి.—గట్టు - ధాన్యాదులు పురుగుపట్టి ఉండగట్టు.
తుట్టు-తె. నష్టము.
తుట్రు.తె. 1. తూరవాన. 2. బొత్తిగా. [తుడుపు.
తుడుచు-తె. 1. తడిపోవనొత్తు. 2. ఊడ్చు. కృ.
తుడుము-తె. 1. తప్పెట. 2. తుటుము.
తుత్తనాగము-తె. బూడిదరంగుగల ఒకలోహము.
తుత్తుంభిక-స. ఒకానొకవాద్యము.
తుత్తునియలు-తె.(తునియలు+తునియలు) మిక్కిలి తునుకలు. [పొడి.
తుత్తుమురు-తె. (తుమురు+తుమురు) మిక్కిలి
తుద-తె. 1. చివర. 2. కడ, అంతము.రూ.తుది. సమా. తుదిరేయి-కల్పాంతము.క్రి. —ముట్టు-చచ్చు.
తునికోల-తె. తూనికకోల.
తునియ-తె. ఖండము. రూ. తునుక. [తునుక.
తునియు-తె.ఖండమగు.రూ.తునుఁగు.కృ.తునియ,
తునుము-తె. 1. ఖండించు. 2.చంపు.రూ.తున్మ్రు.
తుపాకి-హిం. మందుగుండువేసికాల్చుఇనుపక్రోవి.
తుపాను-హిం. గాలివాన.
తుపాసి-వి. (ద్విభాషి) ఒకభాషను మఱొకభాషలో చెప్పువాఁడు. రూ. దుబాసి.
తుప్ప-తె. చిన్నపొద.
తుప్పటిల్లు-తె. తనియు.
తుప్పర-చూ. తుంపర. [చలించు.
తుప్పలుదూలు-తె. (తూలు+తూలు) మిక్కిలి
తుమురు-తె. చిన్నతునుక.
తుములము-స. దొమ్మియుద్ధము.
తుమ్మ్రు-తె. 1. క్షతముచేయు. 2. కృ. క్షతము.
తుమ్మెద-తె.భ్రమరము.సమా.—కంటు-సంపెఁగ.
తురంగమము-స. గుఱ్ఱము, రూ. తురంగము,తురగము. (వ్యు. వడిగాఁబోవునది.)
తుఱఁగలి-తె. ప్రకాశము. క్రి. తుఱఁగలించు-1. ప్రకాశించు. 2. అతిశయించు. రూ. తుఱఁగలి గొను. [—ఱాయి-బొంతఱాయి.
తురక-వి. (తురుష్క) మ్లేచ్ఛుఁడు. సమా.
తురా-హిం. 1. నిడుపుకాఁడపెట్టికట్టినపూబంతి. 2. తలనుంచుకొనునగ. రూ. తురాయి.
తురికి-హిం. తురుష్కదేశపుగుఱ్ఱము.
తురితము-వి. (త్వరితము) శీఘ్రము. రూ.తురీన.
తురీయము-స. 1.బ్రహ్మము. 2.నాలుగవది. రూ. తుర్యము.
తుఱుగు-తె. క్రుక్కు.
తుఱుతు-వి. (త్వరితము) శీఘ్రము.
తుఱుము-తె. 1. పొడిపొడిచేయు. 2. (కొప్పు) ముడుచు. 3. (కొప్పున) చెక్కు. 4. కృ. పొడి. సమా. —పీఁట-తుఱిమెడుపీట.
తుఱ్ఱు-తె. 1. శీఘ్రము. 2. పరుగిడుటయందగు ననుకరణము.
తుల-స. 1. త్రాసు. 2. పోలిక. 3. ఏడవరాశి. సమా. తులాకోటి-అందె.—మానము-త్రాసున తూఁచుతూనిక. [పడు. కృ. తులకింపు.
తులకించు-తె. 1. ప్రకాశించు. 2. కుతూహల
తులము-తె. పలమునమూఁడవభాగము. రూపాయ యెత్తు. [బడినది.
తులితము-స. 1. పోల్పఁబడినది. 2. తూఁచఁ
తులుచ-తె. వేగముకలది. [కత్తి.
తులువ-తె. తుంటరి. సమా. —కత్తి-వంపుచుర
తుల్యము-స. సమానము.
తువర-తుంపురువాన. రూ. తువ్వర, తూర.
తువరము-స. వగరు.
తుషము-స. ఉముక.

తుషారము-స. 1. మంచు. 2. తుంపర.
తుష్టి-స. తృప్తి.
తుస్సు-వి. (తుచ్ఛము) నీచము. [చంద్రుడు.
తుహినము-స. మంచు. సమా. తుహినకరుఁడు-

## తూ

తూఁగు-తె. 1. ఊఁగు. 2. నిద్రించు. 3. చలించు. 4. తూనికయగు. 5. నడచు. కృ. 6. ఊఁగుట. 7. నిద్ర. సమా. —మంచము-ఉయ్యాల. క్రి. తూఁగాడు-తూఁగు. రూ. తూఁగియాడు.
తూఁచు-తె. తూనికవేయు. కృ. తూనిక.
తూట-తె. 1. తుసుక. 2. దుష్టుఁడు. రూ. తుంట. సమా. తూఁటరి-దుష్టుఁడు. రూ. తూఁడరి. క్రి. తూఁటకట్టు-తుసుకయగు.
తూఁటు-తె. రంధ్రము, చిల్లి. క్రి. తూఁటాడు-వేధించు, చిల్లులుచేయు. తూఁటుకట్టు- తూఁటుపడు. [హంస.
తూఁడు-తె. తామరకాఁడ, బిసము.సమా.—తిండి-
తూఁతకొమ్మ-తె. పిల్లనగ్రోవి.
తూకము-తె. 1. తూనిక. 2. పూనిక. రూ.తూకు. క్రి. తూకొను-పూను.
తూణము-స. అమ్ములపొది. రూ. తూణీరము.
తూనిక-తె. తూఁచుట.సమా.—తోల-త్రాసుదండె. క్రి.—వేయు-తూఁచు. [తూనీఁగ.
తూనిఁగ-తె. గాలిలో తిరుగుచుండు ఈఁగ. రూ.
తూపరము-తె. రంధ్రము.
తూపరాణ-తె. తూము. రూ. తూపరాణము.
తూపి-తె. గుడిలో మూల విగ్రహముండెడుచోటికి మీఁద విమానమువలె కట్టినకట్టడము.
తూపు-తె. బాణము. సమా. —రిక్క-శ్రవణము. —నెల-శ్రావణమాసము.
తూపొడుచు-తె. ఉమియు.
తూబరము-స. కొమ్ములు మొలవనియెద్దు.
తూబరుఁడు-స. 1. గడ్డముమీసములురానివాఁడు. 2. అంతఃపురపుకావలివాఁడు.
తూము-తె. 1. నీరుపోవుటకు కట్టిన భూమిలోపలి కాలువ. 2. నాలుగుకుంచములు.
తూర-తె. వానబొట్టు. చూ. తువర.
తూరి-తె. తడవ.
తూరు-తె. 1. సన్ననివానపడు. 2. చొచ్చు. రూ. దూఱు. 3. ధాన్యములో గలిసిన పొల్లుగింజ. సమా. తూరుపాఱఁబట్టు-పొల్లుగింజలు దూరముగాఁబోవునట్లు గాలికెత్తిపోయు. తూరుపెత్తు-—పై.—రూ. తూర్చు, తూర్పెత్తు. కృ. తూర్పిడి.
తూఱు-తె. చొచ్చు. రూ. దూరు. రూ.దూఱఁబడు.
తూరుపు-తె. సూర్యుఁడుదయించుదిక్కు, ప్రాగ్దిశ. రూ. తూర్పు. సమా. —కొండ-ఉదయాద్రి. —ఱేఁడు-ఇంద్రుఁడు.
తూర్ణము-స. త్వరితము.
తూర్యము-స. 1. వాద్యము. 2. వాద్యపుమ్రోఁత.
తూలము-స. దూది.
తూలిక-స. 1. చిన్నఈఁక. 2. వ్రాసెడుకలము. 3. చిత్రమువ్రాయుకుంచె. రూ. తూలి.
తూలు-తె. 1. చలించు, తొలఁగు. రూ. తూలఁబాఱు, తూలాఱు,తూలియాడు, ప్రే. తూలుచు. క్రి. తూలపోవు-చిన్నపోవు.
తూష్ణింభావము-స. మాటాడకూరకుండుట.
తూష్ణీకుఁడు-స. మాటలాడక ఊరకుండువాఁడు.

## తృ

తృట్టు-స. 1. దప్పి. 2. ఇచ్ఛ. రూ. తృష,తృష్ణ.
తృణము-స. 1. గడ్డి. 2. చామలోనగుపైరు. సమా. తృణగ్రాహి-మరకతము. —జలూక-కసవులో తిరుగు జలగవంటిపురుగు. —ద్రుమము-తాటిమొదలగు చెట్టు. (కొమ్మలులేనిది) —ధాన్యము-చల్లకపండెడి నివ్వరిలోనగునది. —ధ్వజము-వెదురు.—రాజము-1. తాటిచెట్టు. 2. టెంకాయచెట్టు. 3. గిఱకతాటిచెట్టు. క్రి. తృణీకరించు-అలక్ష్యముచేయు. [తదియ)
తృతీయ-స. పక్షమందు మూఁడవదినము. (వి.
తృతీయము-స. మూఁడవది. సమా. తృతీయాప్రకృతి-నపుంసకుఁడు.
తృప్తము-స. తృప్తినొందినది.
తృప్తి-స. తనివి.

తృష-చూ. తృట్టు.
తృషితుఁడు-స. దప్పిగొన్నవాఁడు.
తృష్ట-చూ. తృట్టు.

తె

తెంకాయ-చూ. ఒంకాయ.
తెంకి-తె. స్థానము. రూ. టెంకి.
తెంచు-తె. తెగఁజేయు. రూ. త్రెంచు, తెంపు.
తెండు-తె. పరుండు. రూ. తేఁడు.
తెందెప్పలు-తె. (తెప్పలు+తెప్పలు) అపారము. రూ. తెందేపలు.
తెంపి-తె. 1. విధవ. 2. తెగువ.
తెంపు-తె. 1. తెంచు. 2. తెగువ. 3. తెగుట. రూ. తెంపి. సమా. తెంపరి-తెంపుగలవాఁడు.
తెకతెక-తె. ఉడుకుటయందగు ధ్వని. [లేనిది.
తెకతేర-తె. (తేర+తేర) బొత్తిగాసంబంధము
తెక్కరము-తె. విలాసము.
తెక్కలి-తె. 1. దొంగతనము. 2. వంచన. 3. ప్రమాదము. సమా. —కాఁడు-1. దొంగ.2. వంచకుఁడు. —పాటు-ఆపద.
తెక్కు-చూ. టెక్కు.
తెగ-తె. 1. సజాతీయసమూహము. 2. సమూహము. రూ. తెవ. 3. పక్షము. 4. విధము. 5. అల్లెత్రాడు. 6. ఎక్కుపెట్టుట. 7. నిడుపు. 8.నిశ్శేషముగా.9.ఖండితముగా.క్రి. -(గొట్టు-నఱకు. —(జూచు-చంపు. —(బడు-తెగించు. —(బాఱు-తెగించు. —వేయు-నఱకు.
తెగచు-తె. కలఁగు.
తెగటు-తె. త్రుళ్లు. క్రి. తెగటాఱు-చచ్చు.
తెగడు-తె. 1. తిరస్కరించు. 2. ఉపేక్షించు. 3. నిందించు. రూ. తెవడు.
తెగించు-తె. సాహసించు.
తెగు-తె. 1. ఖండితము. 2. భిన్నమగు. 3. తీర్పగు. రూ. త్రెగు, త్రెవ్వు. 4. సాహసించు. చూ. తెగ. సమా. తెగుదల-1. అంతము. 2. క్షయము. —దెంపు-తీర్పు. —బడి-1. తెగుట. 2. దుక్కి. 3. అమ్మకము.
తెగుడు-తె. తెగుట. క్రి. —పడు-వేఱుపడు.
తెగులు-తె. 1. వ్యాధి. 2. చీడ. రూ. తెవులు. సమా. —గొంటు-వ్యాధికలవాఁడు,—కలది. క్రి. తెగులుగొను-రోగపడు.
తెగువ-తె. 1. దాతృత్వము. 2. సాహసము. సమా. తెగుదారి-1. సాహసికుఁడు. 2. దాత.
తెచ్చు-తె. తీసికొనివచ్చు. [బడు.
తెట్టగిలు-తె. నిస్సారమగు. రూ. తెట్టగిల్లు, తెట్టగిలఁ
తెట్టతెరువు-తె. (తెరువు+తెరువు) నడివీథి.
తెట్టియ-తె. 1. తెట్టువ. 2. తేనెపెర. 3. తృణకాష్ఠాదులకుప్ప. రూ. తెట్టె. క్రి. తెట్టెలుగట్టు-రాశిపడు.
తెట్టు-తె. కంపకోట. రూ. తెట్టువు.
తెట్టువ-తె. 1. సమూహము. 2. నీటిపై గాలికొక ప్రక్కగాఁజేరిన తృణాదులసమూహము.
తెట్టెసు-తె. మొత్తము. [క్రి.—కట్టు.
తెడ్డు-వి.(తండువు) 1. కొయ్యగరిఁటె. 2. పడవత్రోసెడుపలక. రూ. త్రెడ్డు.
తెనమఱు-తె. శయనించు.
తెనుఁగు-తె. ఆంధ్రభాష. రూ. తెలుఁగు.
తెన్ను-తె.దారి.
తెన్నుండు-తె. పరుండు.
తెప్ప-తె. 1. నీటిపై పడవవలె తేలఁగట్టినకొయ్యలు. 2. రాశి. రూ. తేప. క్రి. తెప్పలఁదేలు-ఓలలాడు. [తెప్పిఱు.
తెప్పిఱిలు-తె. తేఱు. రూ. తెప్పిఱిల్లు, తెప్పిర్లు,
తెప్పున-తె. శీఘ్రముగా.
తెమడ-తె.శ్లేష్మము, గట్టిపడిన ఉమ్మి.
తెమలు-తె. చలించు.
తెమ్మ-వి. (తేమము) తడి. రూ. తేమ. సమా. తెమ్మెర-(తెమ్మ+ఎర) 1. చల్లనిగాలి. 2. గాలి. [పర.
తెర-తె. 1. మఱుఁగుచీర. 2. అల. 3. బ. పరం
తెఱ-తె.తెఱపయినది.రూ.తెఱ్ఱ.సమా. —గంటి-వేలుపు, అనిమిషుఁడు. —గంటిజేఁడు-ఇంద్రుఁడు. —నోటిమెకము-సింహము, పంచాననము. —వ-(తెఱ+వాయి) ఆఁడుది.
తెఱఁగు-తె. 1.విధము. 2.క్రమము. 3.చక్కన 4.సంధి.రూ.తెఱవు.క్రి. —పడు-సంధియగు

తెలుకువ-తె. *1.* తెలివి. *2.* ఉపాయము.
తెలుచు-తె. తెలుపచేయు.
తెలప-తె. *1.* తెలుచుట. *2.* ఉపశమనము. *3.* మలుఁగులేనిది.
తెలపి-తె. అవకాశము.
తెలుపుమలుపు-తె. తబ్బిబ్బు.
తెరలిక-తె. గుంపు.
తెరలు-తె. *1.* మసలునట్లుకాఁగు. *2.*బయలుదేఱు. *3.* కలఁగు. *4.* తొలఁగు. రూ. తెర్లు.
తెలలు-తె. (వాసన) బయలువెడలు.
తెలవు-చూ. తెలఁగు.
తెరువు-తె. దారి. రూ. తెర్వు. సమా. తెరువాటు-(తెరువు+ఆటు) దొంగలు దారికట్టి కొట్టుట. తెరువాటీఁడు-దారిదోపిడి దొంగ.
తెల-చూ. తెల్ల. (తెలనాకు, తెలవాఱు. మొ.)
తెలచు-చూ. తెలుచు.
తెలి-తె. *1.* తెల్లనిది. *2.*నిర్మలము.సమా. —కంటి-ఆఁడుది. —గాము-శుక్రుఁడు. —దమ్మి-తెల్లదామర. —పక్కము-శుక్లపక్షము.—పిట్ట-హంస. —మొదవు-కామధేనువు. —యేఱు-ఆకాశగంగ.
తెలికలు-వి. (తిలలు) నువ్వులు. సమా. తెలికవాఁడు-గాండ్లవాఁడు. —పిండి-గానుఁగపిండి.
తెలిగొను-తె. ప్రమాణముచేయించు.
తెలియు-తె. *1.* విదితమగు. *2.* మేలుకొను. *3.* ప్రసన్నతనొందు. *4.* తేఱు. *5.* ఎఱుఁగు.కృ. తెలివి.
తెలివి-తె. *1.* వివేకము. *2.*ప్రకాశము,*3.*కాంతి. *4.* వికాసము. *5.* తేఱుట. *6.* తెలుపు.
తెలివిడి-తె. *1.*దృష్టాంతము.*2.*తెలియఁజేయుట.
తెలుఁగు-చూ. తెనుఁగు. (తెలి+అగు)
తెలుచు-తె. *1.* నమస్కరించు *2.* తేర్చు.*3.* ప్రార్థించు. రూ. తెలచు.
తెలుపు-తె. *1.* ఎఱిఁగించు. *2.* మేలుకొలుపు. *3.* తేర్చు. *4.* తెల్లఁదనము. *5.* పరిశుద్ధి. క్రి. తెలుపాఱు-తెల్లనగు. రూ. తెలుపువాఱు.
తెలుపుడు-తె. ఎఱుక. క్రి. —సేయు-ఎఱిఁగించు.
తెల్ల-తె. *1.* ధవళము. *2.* స్పష్టము. సమా. —డాలుమెకము-సింహము. —దొర-*1.* శివుఁడు. *2.* బలరాముఁడు. —యేనుఁగు-ఐరావతము. క్రి. —పాఱు-*1.* ఉదయమగు. *2.* తెల్లనగు. *3.* సారహీనమగు.
తెల్లమి-తె. స్పష్టము. రూ. తెల్లము.
తెవ-తె. సమూహము. రూ. తెగ.
తెవడు-చూ. తెగడు.
తెవులు-చూ. తెగులు.

## తే

తేఁకు-చూ. టేఁకు.
తేఁకువ-తె. *1.* ధైర్యము. *2.*భయము. *3.*మెలఁకువ.
తేఁజెట్టు-తె. పెంకాయచెట్టు. రూ. తేమ్రాను.
తేఁటి-తె. తుమ్మెద, తేనెటీఁగ.
తేఁడు-చూ. తెండు.
తేగ-తె. తాటిమొలక.
తేగడ-తె. అఱిగినది.
తేగము-వి. (త్యాగము) ఈవి. రూ. చాగము.
తేజము-స. *1.* ప్రకాశము. *2.* ప్రభావము. *3.* పరాక్రమము. *4.* రేతస్సు. రూ. తేజస్సు. సమా. తేజస్వి-తేజస్సుగలవాఁడు. క్రి. తేజరిల్లు-ప్రకాశించు.
తేజి-హిం. గుఱ్ఱము. రూ. తేజీ.
తేజు-వి. (తేజము) *1.*ప్రకాశము. *2.*ప్రతాపము.
తేట-తె. *1.* నైర్మల్యము. *2.* ప్రసన్నత. సమా. —తెల్లము-మిక్కిలిస్పష్టము. క్రి. —పడు-విశదమగు.
తేది-వి. (తిథి) దినము.
తేనియ-తె. మధువు. రూ. తేనె. సమా. తేనెతిండి-తుమ్మెద.
తేప-తె. *1.* తడవ. *2.* రూ. తెప్ప.
తేమ-వి. (తేమము) తడి. రూ. తెమ్మ. క్రి.తేమగిల్లు-తడియగు. రూ. తేమము.
తేమనము-స. *1.* మజ్జిగపులుసు. *2.* తడియుట.
తేయాకు-ఆం. 'తేనీరు' పానీయమున కుపయోగించు ఒక ఆకు (Tea).
తేయు-తె. అఱుగు.
తేర-తె. *1.* తేట. *2.* సంబంధములేమి. *3.* వ్యర్థముగా. *4.*అనాయాసముగా.సమా. —కత్తె-సంబంధములేనిది. పుం. —కాఁడు. క్రి. —

—కొను-తేటపడు.

తేరకు-తె. 1. వ్యర్థముగా. 2. అనాయాసముగా.

తేరకుఁదేర-తె. మిక్కిలి అనాయాసముగా.

తేరు-తె. 1. కలుగు. 2. రథము. 3. బండి. సమా. —కాఁడు-రథికుఁడు. —పూన్పరి-సారథి.

తేఱు-తె. 1. తేటపడు. 2. ప్రసన్నతనొందు. 3. ఊఱడిల్లు. 4. స్వస్థతనొందు. 5. ముగియు. ప్రే. తేఱుచు, తేర్చు. సమా. —గడ-1. ముగియిక. 2. తెలివిడి. క్రి. —కొను-స్వస్థతనొందు.

తేలిక-తె. చులుకన.

తేలు-తె. 1. నీళ్లలో మునుఁగక పైకివచ్చు. 2. నీటిలో క్రీడించు. 3. తేలగిల్లు. 4. పొడచూపు. 5. వృశ్చికము. క్రి. తేలగిల్లు - 1. పైకితేలు. 2. పరవశమగు. —వేయు-తేలఁగిలఁజేయు. తేలువాఱు-పుట్టు. సమా. —రాసి-వృశ్చికరాశి.

తేవ-తె. ఉత్సవము.

## తై

తైరు-తె. పెరుగు, దధి. రూ. తయిరు.

తైర్థికుఁడు-స. తీర్థసేవచేయువాఁడు.

తైలపాయిక-స. గబ్బిలము.

తైలము-స. నూనె. (వ్యు. తిలలనుండి తీయఁబడునది.)

తైలికుఁడు-స. గాండ్లవాఁడు.

తైషము-స. పుష్యమాసము.

## తొ

తొంక-తె. పుచ్ఛము. రూ. తోఁక. (వ్యు. తొంగునది.)

తొంగలి-తె. 1. వాలునది. 2. స్రవించునది. క్రి. తొంగలించు-1. అతిశయించు. 2. ప్రకాశించు. 3. వికసించు. 4. వర్ధిలు. 5. నిక్కు. 6. స్రవించు. రూ. తొంగలిగొను. సమా. తొంగలిపాట్లు-నమస్కారము.

తొంగిళ్లు-తె. బ. నీళ్లలోనగువానిబొట్లు.

తొంగు-తె. 1. వాలు. 2. వ్రేలాడు. 3. శయనించు.

తొంట-తె. 1. చెట్టుపట్ట. 2. కసవువెంటి. సమా. —చేయి-ఈచఁబోయినచేయి.

తొంటి-తె. పూర్వపు. రూ. తొల్లిటి.

తొండ-తె. సరటము. సమా. —రూపురిక్క-పుష్యమి.

తొండము-వి. (తుండము) 1. గజహస్తము. 2. కపిలెదానతోఁక. సమా. —దోమ-ఏనుఁగుదోమ.

తొండాడు-తె. త్వరపఱచు.

తొండి తె. రంధ్రము. రూ. దొండి.

తొండు-తె. 1. వేఱుసెనగలోనగువాని ఆకు. 2. సోమరి.

తొంద-వి. (తుందిలుఁడు) బొజ్జకడుపువాఁడు. రూ. తొందు.

తొందర-వి. (తొర+తొర) మిక్కిలిత్వర. క్రి. —చేయు-బాధించు. —పడు-త్వరపడు. కృ. —పాటు.

తొంబండ్రు-తె. (తొమ్మిది+పదుండ్రు) తొంబదిమంది.

తొంబది-తె. (తొమ్మిది+పది) తొమ్మిదిపదులు.

తొంబనూఱు-తె. (తొంబది+నూఱు) తొంబదినూఱులు. రూ. తొమ్మనూఱు.

తొకతొక-తె. తొక్కు (మాట)

తొక్క-తె. చెట్టుపట్ట.

తొక్కట-తె. 1. త్రొక్కుడు. 2. సంకటము. రూ. త్రొక్కట. క్రి. —పడు-సంకటపడు. కృ.—పాటు.

తొక్కు-తె. 1. ఉప్పుకారముచేర్చిదంచినకాయలు. రూ. తొక్కుడు. 2. అవ్యక్తము (మాట)

తొగ-తె. 1. కలువ. 2. సమూహము. 3. విధము. రూ. తొవ. సమా. —కంటి-కలువకంటి. —చెలికాఁడు-చంద్రుఁడు. (ఇట్లే—ఱేఁడు, —విందు మొ.) —సూడు-సూర్యుఁడు.

తొగట-తె. గుడ్డలునేసిజీవించు ఒకజాతి.

తొగడు-తె. లోపలికణఁగుట.

తొగర-వి. (తువరము) వగరు. రూ. తొగరు, తొవర.

తొగరు-తె. 1. ఎఱుపు. 2. వి. తొగర. రూ. తొవరు. క్రి. —కొను-ఎఱ్ఱనగు.

తొచ్చియము-వి. (తుచ్ఛము) తుచ్ఛవచనము. రూ. తొచ్చెము.

తొట్ట-తె. స్థూలము.

తొట్టగిల్లు-తె. 1. అతిశయించు. 2. కలుగు. (తొట్టగిలఁబడు-తొట్రుపడు.)

తొట్టి-తె. 1. నోరువెడలుపైన మట్టి లేక కఱ్ఱ పాత్రము. 2. కొప్పెర. సమా. —కట్టు-లోగిలి.

తొట్టిల-తె. బిడ్డలఁబరుండఁబెట్టు ఉయ్యెల. రూ.

తొట్టల, తొట్ల, తొట్లియ, తొట్లె.
తొట్టు-తె. 1. వ్యాపించు. 2. ప్రవహించు. 3. స్రవించు. 4. ఎగఁదట్టు. 5. నిండు. 6. నాటు. 7. స్పృశించు. 8. మొదలుకొను. 9. చెఱువు లోపలి హాలము.
తొట్టువ-తె. తెట్టువ.
తొట్రి-తె. తొట్టి.
తొట్రు-తె. సంభ్రమము. క్రి. తొట్రిలఁబడు, తొట్రిల్లు, తొట్రుపడు. కృ. తొట్రుపాటు.
తొడ-తె. ఊరువు. సమా. —పుట్టువు-వైశ్యుఁడు. —బెల్లము-తొడగిల్లుట. [తొలఁకు.
తొడఁకు-తె. ఎగిరిపడు, చిందు. రూ. తొనఁకు,
తొడఁగు-తె. 1. ఆరంభించు. 2. పూను.
తొడయు-తె. 1. తుడుచు. 2. కడుగు.
తొడరిక-తె. అనుసరణము.
తొడరు-తె. 1. కలుగు. 2. యత్నించు. 3. సక్తమగు. 4. తొట్రుపడు. 5. అనుసరించు. 6. ఎదిరించు. 7. అనుకరించు.
తొడరువు-తె. యత్నము.
తొడవు-తె. భూషణము.
తొడి-తె. త్వర.
తొడిఁబడు-తె. 1. చలించు. 2. చెదరు.
తొడికిలు-తె. ఒడియు.
తొడిమ-తె. కాఁడ.
తొడు-తె. 1. (సొమ్ములు) తొడుగు. 2. (బాణము) సంధించు. కృ. తొడవు, తొడుగు.
తొడుకు-తె. 1. పట్టు. 2. ఒడియు. 3. ఆవు. 4. దొంగమేఁత.
తొడుకొను-తె. 1.తోడుకొను. 2. తొడుగుకొను.
తొడుగు-తె. 1. (నగలు) ధరించు. 2. (బాణము)సంధించు. 3.కృ.ఆభరణము.4.కవచము. 5. బాణము. 6. గొనెన. 7. ముండ్లకంపమోపు. రూ. తొడువు.
తొడుపు-తె. 1. అనుసు. 2. కవచము. 3. చెప్పినది మరలచెప్పుట.
తొడుసు-తె. సంబంధము.
తొత్తు-తె. 1. బానిస. 2. లంజ.
తొన-తె. 1. తొల. 2. రక్షణము.

తొనఁకు-తె. 1. తొలఁకు. 2. తొట్రుపాటు.
తొన్నుండు-తె. శయనించు. రూ. తెన్నుండు.
తొపారము-తె. దేగల మొగమునకుఁగట్టు తోలు గంత. రూ. తోపారము. [తడియు.
తొప్పదోఁగు-తె. (తోఁగు+తోఁగు) మిక్కిలి
తొప్పటిల్లు-తె. ఒఱగు. రూ. తొప్పటిలు, తొప్పఱు.
తొప్పలుదోరలు-తె. కోటానఁగోట్లు.
తొప్పి-చూ. టోపి.
తొబక-తె. విత్తులురాలినకాయ.
తొమ్మండ్రు-తె. తొమ్మిదిమంది.
తొమ్మనూఱు-చూ. తొంబనూఱు.
తొమ్మాండు-తె. నాశము.
తొమ్మిది-తె. ఎనిమిదియు నొకటి.
తొయ్యలి-తె. ఆఁడుది. రూ. తోయలి. [తొరపడు.
తొర-వి. (త్వర) 1. వేగిరపాటు. 2. ఆపద. క్రి.
తొఱ-చూ. తొఱ్ఱ.
తొరఁగు-తె. 1. స్రవించు. 2. ప్రవహించు. 3. పడు. 4. వ్రాలు. రూ. తొరుఁగు.
తొఱఁగు-తె. 1. విడుచు. 2. కృ. విడివడుట. రూ. తొఱవు.
తొఱట-తె. కోటరము. రూ. తొఱ, తొఱ్ఱ.
తొరలు-తె. 1. కలుగు. 2. మాఱు. ప్రే. తొరలుచు, తొర్లించు. [త్రొక్కుడు.
తొఱ్ఱదొక్కు-తె. (త్రొక్కు+త్రొక్కు) గట్టి
తొరుపు-తె. తొరలించు, నీళ్లచల్లార్చు.
తొఱ్ఱ-చూ. తొఱట.
తొఱ్ఱి-తె. ముందటిపండ్లులేనినోరు.
తొఱ్ఱు-తె.ఆవు.సమా. —పట్టు-ఆలమంద. [తొన.
తొల-తె.పనస,కిచ్చిలి లోనగువానిలోనిభాగము.రూ.
తొలఁకు-తె. 1. తొనఁకు. 2. చలించు. 3. అతిశయించు. 4. ప్రకాశించు. రూ. తొలఁకాడు. 5. కృ. చలనము. 6. అల.
తొలఁగు-తె. ఒదుఁగు. రూ.తొలఁగఁబాఱు.సమా. —బావ-శత్రువు.
తొలఁగుడు-తె. తొలఁగుట. [తుడుచు.
తొలఁచు-తె. 1. తొలఁగఁజేయు. 2. కడుగు.3.
తొలకరి-తె. (తొలుకు+కారు) 1. చైత్రవైశాఖములందు కురియువాన. 2. వర్షర్తువు. రూ. తొ

ల్కరి. సమా. —సూడు-హంస. క్రి. తొలక రించు-1. వానకురియు. 2. పుట్టు. రూ. తొల్కరించు. [రూ. తొల్లి.

తొలి-తె. 1. ముందు. 2. మొదలు. 3.రంధ్రము.

తొలిక-తె. 1. రంధ్రము. 2. త్రవ్వసాధనము. రూ. తొల్లిక, తొళిక.

తొలుకారు-తె. 1. (తొలుకు+కారు) వర్షర్తువు. 2. (తొలుత+కారు) ముక్కారుపంటలలో మొదటికారుపంట.

తొలుకు-తె. కురియు.

తొలుచు-తె. 1. రంధ్రముచేయు. 2. తోఁడు.

తొలుత-తె. 1. ముందు. 2. మొదట. సమా. (తొలు, తొలి) తొలుకారు - మొదటికారు. —కుడుపు-అన్నప్రాశనము.—గట్టు-ఉదయాద్రి. —చదువులు-వేదము. (ఇష్టే తొలుపలుకులు, మొ.) —దీవి-జంబూద్వీపము. —నీటిరిక్క-పూర్వాషాఢ. —పంది-ఆదివరాహము. —పక్కము - శుక్లపక్షము. తొలిమిసుకులు-వేదములు.—మొగులు-కురియుచున్న మొగులు, ఘనాఘనము. —రిక్క-అశ్విని. —నెల-ఆశ్వయుజము. —వేలుపు-1. బ్రహ్మ. 2. అసురుఁడు,పూర్వదేవుఁడు.—సంజ-ప్రాతస్సంధ్య.

తొల్లి-చూ. తొలి.

తొల్లిక-చూ. తొలిక.

తొవ-చూ. తొగ.

తొవర-చూ. తొగర.

తొవరు-చూ. తొగరు.

తొస్స-తె. ఉచ్చారణలోపము.

తొస్సి-తె. బోసి, బొక్క.

తొళసి-వి. తులసి.

## తో

తో-తె. 1. తృతీయావిభక్తిప్రత్యయము. 2.కూడ. 3. వెంబడి. సమా. తోఁబుట్టు-1. సోదరుఁడు. 2. సోదరి. రూ. తోఁబుట్టుగు, తోఁబుట్టువు,తోడఁబుట్టువు. —పాటు-వలె, తో. క్రి. తోకొను-తోడుకొను.

తోఁక-చూ. తొంక. సమా. —చిచ్చు-నిప్పురగిల్చిన పిడకలవరుస. —చుక్క-ధూమకేతువు. —మిరియము-చలువమిరియము.

తోఁగు-తె. 1. మునుఁగు. 2. తడియు.

తోఁచు-తె. 1.ఉదయించు. 2.(మనసున) ఏర్పడు. 3.ప్రత్యక్షమగు.4.తడుపు.కృ.తోఁపిక,తోఁపు.

తోఁట-తె. 1. ఉపవనము. 2. ఆశ్రమము. సమా. —కాఁపు-తోటవాఁడు.—మాలి-తోఁటకాఁపు, వనపాలకుఁడు. —మాలియ-ఆకులుపూలుచేర్చి కట్టినమాల. రూ. తోటమాలె, తోమాలియ, తోమాలె. తోఁటీఁడు-వనపాలకుఁడు.

తోఁడు-తె. 1. కెల్లగించు. 2. పీక్షుచేఁయు. 3. నూలిపోఁగు తీసిచుట్టు.

తోఁడుఁబోతు-1. పంపుచేయుట. మారణక్రియ. 2. పంపుచేయువాఁడు.

తోఁడెలు-తె. వృకము. అడవికుక్క. రూ. తోఁడేలు. సమా. తోఁడేటికడుపుమేటి - భీముఁడు, వృకోదరుఁడు.

తోఁతెంచు-తె. (తోఁచు+తెంచు) 1. ఉదయించు. 2. కనఁబడు. 3. ప్రత్యక్షమగు.4.వచ్చు.

తోఁప-తె. సంకటి.

తోఁపిక-తె. తలఁపు, తోఁచుట. [పు.3.తోఁపిక.

తోఁపు-తె. 1. పెంపుడువనము, తోఁట. 2. ఎఱుకారి బంటు.

తోటా-హిం.తుపాకిమందు పొట్లము.

తోటి-తె. (తోడు+ఇ) 1. మాల. 2. గ్రామాధి

తోడ-తె. (తోడు+అన్) 1. తృతీయావిభక్తిప్రత్యయము. రూ. తో, తోడుత. 2. కూడ. 3. వెంబడి. సమా. —ఁబుట్టు-1. సోదరి. 2.సోదరుఁడు. రూ. —ఁబుట్టుగు,—ఁబుట్టువు.

తోడా-తె. హస్తభూషణము.

తోడు-తె. 1. ఆన. 2. తోఁబుట్టువు. 3. చేమిరి. 4. సహాయము. సమా. తోడికోడలు-మగని తోఁబుట్టినవానిభార్య, యాత. —చూలు-తోఁబుట్టుగు. —యల్లుఁడు-షడ్డకుఁడు. —వాఁడు-తోడసున్నవాఁడు. తోడుఁబాలు - పాలుపిండఁబోవునపుడు దుత్తలోనుంచుకొను పీళ్లు.—చల్ల-చేమిరిపెట్టు మజ్జిగ. —తో-వెంబడిని. రూ. తోడుతోడ, తోడ్తో, తోడ్తోడ. క్రి. తోడితెచ్చు-పిలుచుకొనివచ్చు. రూ. తోతెచ్చు, తోడ్తెచ్చు.

తోడుకొను-1. పాలుపేరు. 2. పిలుచుకొను. రూ. తోడికొను, తోడ్కొను. —పడు-సహాయపడు. రూ. తోడ్పడు. కృ. తోడుపాటు, తోడ్పాటు. —పెట్టు - చేమిరిపెట్టు. —పోవు - [సరియగు.
తోడెము-తె. కొంచెము, లేశము.
తోత్త్రము-స. 1. బరిగోల. 2. మునికోల.
తోదనము-స. 1. నొప్పించుట. 2. మునికోల.
తోదు-తె. వరుసకట్టు.
తోపారము-చూ. తొపారము.
తోపకము-తె. తోముట. రూ. తోముడు.
తోమరము-స. చిల్లకోల.
తోమాలె-చూ. తోఁట మాలియ.
తోము-తె. రుద్దు.
తోయము-తె. 1. విధము. 2. తెగ. 3. తడవ. 4. పరివారము. 5. సమయము. సమా. తోయగాఁడు-విధమువాఁడు.
స. నీళ్లు. సమా. తోయజము-తామర. (ఇట్లే తోయరుహము. మొ.) —జాక్షి-తమ్మికంటి. —దము-1. నెయ్యి. 2. మబ్బు. —ధి-సము [ద్రము.
తోయలి-చూ. తొయ్యలి.
తోరణము-స. 1. మాలలుమున్నగునవి కట్టుటకై ఇంటివెలుపల రెండు స్తంభములునాటి యేర్పఱచిన ద్వారము. 2. ఆద్వారమున నలంకరించు మామిడాకు మున్నగువాని సరము. రూ.తోరణ.
తోరము-వి. 1. (దోరము) వ్రతసూత్రము. 2. (స్థూలము) లావు. 3. బలిష్ఠము. 4.అధికము. సమా. తోరహత్తు-సమృద్ధము.
తోలు-తె. 1. పసులనునడపు. 2. చర్మము. రూ. తోలుక. సమా. —తాలుపు-శివుఁడు. —వాయిదము-ఆనద్ధము.
తోసిరాజు-తె. 1. తొలఁగఁదగినరాజు. 2. (చదరంగమున) బంటునుతోసి రాజునుకట్టుట.

## తౌ

తౌ-చూ. తగు.
తౌడు-చూ. తవుడు.
తౌర్యత్రికము-స. నృత్త, గీత, వాద్యములు.
తౌలు-చూ. తగులు.
తౌల్యము-స. సామ్యము.

## త్య

త్యక్తము-స. విడువఁబడినది.
త్యజనము-స. విడుపు. క్రి. త్యజించు. [2.విడుపు.
త్యాగము-స. 1. ఈవి. (వి. చాగము, లేగము)
త్యాగి-స. ఈవికాఁడు.
త్యాజ్యము-స. విడువఁదగినది.

## త్ర

త్రంపి-తె. దాలి. రూ. తంపి.
త్రచ్చన-తె. 1. చిలుకుట. 2. చెక్కుట.
త్రచ్చు-తె.చిలుకు.మథించు.రూ.తరుచు.చూ.తరి.
త్రప-స. సిగ్గు.
త్రపువు-స. 1. తగరము. 2. సీసము.
త్రమ్మ-తె. 1. దుమ్ముచేయు. 2. కృ. దుమ్ము.
త్రయము-స. మూఁటి సమూహము. రూ. త్రయి.
త్రయి-స. 1. త్రయము. 2. మూఁడు వేదములు. (ఋగ్యజుస్సామములు) సమా. త్రయీతనువు-సూర్యుఁడు. —ధర్మము-వేదవిహితధర్మము.
త్రయోదశము-స. పదుమూఁడవది.రూ.త్రయోదశి.
త్రయోదశి-స. 1. పదుమూఁడవది. 2. పక్షమందు పదుమూఁడవతిథి. 3. పరివాదిని.
త్రవు-తె. 1. లోఁడు, ఖననముచేయు. 2. ఇండించు. 3.పుట్టుపూర్వోత్తరముల నెత్తు. 4.ప్రస్తావనకుఁదెచ్చు. రూ. త్రవ్వు,త్రవ్వటించు.సమా. త్రవుకోల-గుద్దలి. రూ. త్రవ్వుకోల.
త్రవ్వితండము-తె. అసంఖ్యము.
త్రసము-స. తిరుగునది, జంగమము. సమా. త్రసరేణువు-1. సంజ్ఞాదేవి. 2.ముప్పది పరమాణువుల కొలఁది.
త్రస్తము-స. భయపడినది.
త్రస్తరి-తె. పరిహాసము. క్రి. త్రస్తరించు.
త్రస్స-తె. వేదాధ్యయనవేళ రాలు నోటితుంపర, బ్రహ్మబిందువు.

## త్రా

త్రాఁచు-తె. నాగుఁబాము.

త్రాగు-తె. పానముచేయు. రూ. త్రావు. కృ. త్రాగుడు, త్రావుడు.

త్రాడు-తె. 1. పేనినదారము, పాశము. 2. కిరణము. సమా. —త్రాలుపు-వరుణుఁడు, పాశి. క్రి. —వడు-1. కృశించు. 2. దారమగు.

త్రాణ-వి. (ద్రవిణము) బలము, సత్తువ.

త్రాణము-స. 1. కాపు, రక్షణము. 2. కావఁబడినది. రూ. త్రాతము.

త్రాత-స. కాచువాఁడు.

త్రాయమాణము-స. కావఁబడుచుండునది.

త్రావు-చూ. త్రాగు.

త్రాసము-స. భయము.

త్రాసు-చూ. తరాజు.

## త్రి

త్రింశత్తు-స. ముప్పది.

త్రింశము-స. ముప్పదవది.

త్రికము-స. 1. త్రయము. 2. ముడ్డిపూస.

త్రికోణము-స. మూఁడు మొనలు కలిసిన రూపము.

త్రిక్క-చూ. తిక్క.

త్రిక్కు-తె. 1. తక్కు. 2. చిక్కు, బాధ.

త్రితయము-స. మూఁడు.

త్రిదండి-స. మనోదండము, వాగ్దండము, కర్మదండము అను మూఁడు దండములుగల సన్న్యాసి.

త్రిదశుఁడు-స. వేల్పు. (వ్యు. ముప్పదియేండ్లు వయస్సుగాఁగలవాఁడు) సమా. త్రిదశాలయము-స్వర్గము. [వేలుపు.

త్రిదివము-స. స్వర్గము. సమా. త్రిదివేశుఁడు-

త్రిదోషము-స. వాతపిత్తశ్లేష్మములు ప్రకోపించుట.

త్రిద్యుస్పృక్కు-స. మూఁడు వారములు కూడిన తిథి, అవమము. [డు. 4. యముఁడు.

త్రిధాముఁడు-స. 1. అగ్ని. 2. విష్ణువు. 3. శివుఁ

త్రిపతాకము-స. మూఁడు రేఖలుగల నొసలు.

త్రిపథగ-స. గంగ, ముత్త్రోవదిమ్మరి.

త్రిపది-స. ఏనుఁగుకాలి సంకెల.

త్రిపుండ్రము-నొసటనుంచుకొను విబూది మూఁడు రేఖలు. (నామము ఊర్ధ్వపుండ్రము) [తాళము.

త్రిపుట-తె. పాటలు పాడునప్పుడు వేయు నొక రీతి

త్రిప్పట-తె. తిరుగుట.

త్రిప్పరి-తె. త్రిమ్మరి.

త్రిప్పు-తె. తిరుగఁజేయు. సమా. —త్రాడు-తరితాడు. రూ. త్రిప్పుడు త్రాడు.

త్రిమూర్తులు-స. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు.

త్రిమ్మట-తె. 1. త్రిప్పట. 2. ఆపద.

త్రిమ్మరి-తె. ఇచ్చవచ్చినట్లు తిరుగువాఁడు, త్రిమ్మటకాఁడు. రూ. త్రిమ్మరీఁడు.

త్రిమ్మరు-తె. 1. సంచరించు. 2. చుట్టివచ్చు.

త్రియామ-స. 1. రాతిరి. 2. పసుపు. 3. యమున.

త్రిరాత్రి-స. ముట్టుది.

త్రిలోచనుఁడు-స. శివుఁడు, ముక్కంటి.

త్రివర్గము-స. 1. ధర్మార్థకామములు. 2. సత్త్వరజస్తమములు. 3. క్షయ స్థాన వృద్ధులు.

త్రివిక్రముఁడు-స. విష్ణువు. (వ్యు. మూఁడులోకములను విక్రమించి మూఁడడుగులుగా కొలిచిన

త్రివిష్టపము-స. స్వర్గము. [వాఁడు)

త్రివేణి-స. గంగ. (వ్యు. గంగ, యమున, సరస్వతి అను మూఁడునదులుగలది)

త్రిశంకువు-స. 1. హరిశ్చంద్రుని తండ్రి. (వ్యు. మూఁడు దోషములుగలవాఁడు.) 2. పిల్లి. 3. మిడుత.

త్రిశిఖము-స. 1. త్రిశూలము. 2. సిగదండ.

త్రిశూలము-స. ముమ్మొనవాలు. [గలది.)

త్రిస్రోత-స. గంగ. (వ్యు. మూఁడు ప్రవాహములు

## త్రు

త్రుంగు-తె. 1. తునుఁగు. 2. నశించు. 3. చచ్చు. కృ. త్రుంగుడు. ప్రే. త్రుంచు.

త్రుంగుడు-తె. 1. నాశము. 2. ప్రళయము. క్రి. —వడు-నశించు. [చు. కృ. త్రుంపు, త్రుంపుడు.

త్రుంచు-తె. 1. తునుకలుచేయు. 2. చంపు. 3. చిం

త్రుక్కు-తె. 1. గర్వము. 2. తుక్కు.

త్రుటనము-స. తెగుట.

త్రుటితము-తెగినది.

త్రుటి-స. 1. లఘ్వక్షరపు చతుర్థభాగోచ్చారణము చేయునంతకాలము. 2. ఇంచుక.

త్రుట్టియ, త్రుట్టె-చూ. తుట్టియ.

త్రుప్పు-తె. *1*. ఇనుముమీఁది ముఱికి. *2*. అరుచి.
త్రుప్పుడు-తె. మేనిరోమము.
త్రుళ్లు-తె. *1*. ఎగిరిపడు. *2*. గర్వించు. కృ. *3*. ఎగిరిపాటు. *4*. గర్వము. సమా. —ఁబోతు-త్రుళ్లుస్వభావముగలవాఁడు. —పిండి - స్ఫోటకము కనిపించినపుడమ్మవారికి కొట్టిపెట్టెడుపిండి. క్రి. త్రుళ్లగించు-ఎగురు. కృ. త్రుళ్లగింత, త్రుళగింత, త్రుళ్లింత.

## త్రె

త్రెంచు-తె. త్రెగఁజేయు. రూ. తెంచు, తెంపు, త్రెంపు.
త్రెక్కొట్టు-తె. ఎగఁదట్టు.
త్రెక్కొను-తె. (త్రెగ+కొను) *1*. చెఱచు. *2*. కలఁచు. *3*. చంపు. *4*. మ్రింగు. *5*. త్రాఁగు. కృ. త్రెక్కోలు.
త్రెగు-చూ. తెగు.
త్రెడ్డు-చూ. తెడ్డు.
త్రెవ్వన-తె. సౌందర్యము, చక్కన.
త్రెవ్వు-చూ. తెగు.
త్రెళ్లు-తె. పడు.

## త్రే

త్రేఁచు-తె. ఉద్గారించు, త్రేఁపువిడుచు. రూ. త్రేనుచు, త్రేన్చు. కృ. త్రేఁపు, త్రేనుపు.
త్రేఁపు-తె. త్రేఁచుట, ఉద్గారము, రూ. త్రేనుపు.
త్రేగుడు-తె. జిగటపాఱినఎంగిలిలోనగునది. రూ. త్రేవుడు.
త్రేత-స. *1*. రెండవయుగము. *2*. గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము అను మూఁడగ్నులు, త్రేతాగ్ని.
త్రేనుచు-చూ. త్రేఁచు.
త్రేనుపు-చూ. త్రేఁపు.

## త్రై

త్రైగుణ్యము-స. సత్త్వరజస్తమోగుణములు.
త్రైలోక్యము-స. త్రిలోకములసమూహము.
త్రైవర్గికుఁడు-స. ధర్మార్థకామములం దిచ్చగలవాఁడు.
త్రైవిద్యుఁడు-స. వేదముతెలిసినవాఁడు.

## త్రొ

త్రొక్కట-తె. త్రొక్కుడు. క్రి. —పడు. కృ. —పాటు.
త్రొక్కు-తె. *1*. పాదములతో నదుము. *2*. కృ. త్రొక్కుడు.
త్రొక్కుడు-తె. *1*. పాదములతో నదుముట. రూ. త్రొక్కట, త్రొక్కు. *2*. ఆపద. సమా. —ఁగమ్మి-కదపక్రిందిపలక. —పట్టె-*1*. —పై. —*2*. సాలెవాఁడు నేయునపుడు కాలితో త్రొక్కుచెక్కలు. —పలక-ఱాళ్లపనివాని కాలిక్రింది పలక. క్రి. —వడు-మెదుఁగు, నలఁగు. రూ. త్రొక్కువడు.

## త్రో

త్రోచు-తె. *1*. పూను. *2*. మీఱు. *3*. త్రోయు. *4*. ఉపేక్షించు. *5*. చంపు. కృ. త్రోపు.
త్రోటి-స. *1*. పక్షిముక్కు, చంచువు. *2*. చేఁపముక్కు.
త్రోద్రోపు-తె. (త్రోపు+త్రోపు) మిక్కిలిత్రోపు. క్రి. త్రోద్రోపులాడు.
త్రోపడు-తె. (త్రోపు+పడు) త్రోయఁబడు.
త్రోపనఁగొఱవి-తె. *1*. ఉభయభ్రష్టుఁడు. *2*. ఉభయభ్రష్టురాలు.
త్రోపరి-తె. త్రోయువాఁడు.
త్రోపాడు-తె. త్రోయు. కృ. త్రోపాటు.
త్రోపు-తె. *1*. త్రోయుట. *2*. నిరాకరణము. *3*. నిషేధము. రూ. త్రోపుడు. క్రి. —వడు-త్రోపడు. —సేయు-నిరాకరించు.
త్రోపుడు-తె. *1*. త్రోపు. *2*. కొయ్యలు చదును చేయు సాధనము, చిత్రిక. క్రి. —సేయు-త్రోపుడుతో కొయ్య చదునుచేయు.
త్రోయు-తె. తొలఁగనూకు.
త్రోలు-తె. పశ్వాదులనడపు. రూ. తోలు.
త్రోవ-తె. మార్గము. సమా. త్రోవరి-దారితెలిసినవాఁడు.

## త్ర్య

త్ర్యంబకుఁడు-స. (త్రి+అంబకుఁడు) శివుఁడు, ముక్కంటి. సమా. త్ర్యంబకసఖుఁడు - కుబేరుఁడు.

## త్వ

త్వక్కు-స. 1. చర్మము. 2. చెట్టుపట్ట. 3. లవంగపుపట్ట. 4. నార. రూ. త్వచము. సమా. త్వక్సారము-వెదురు. రూ. త్వచిసారము.

త్వర-స. వేగిరపాటు. (వి. తుర,తొర) క్రి.త్వరపడు.

త్వరితము-స. 1. శీఘ్రము. 2.వడిగలది.

త్వష్ట-స. 1. విశ్వకర్మ. 2. ద్వాదశాదిత్యులలో నొకఁడు. 3. వడ్లవాఁడు.

త్వాదృశము-స. నీవంటిది.

త్విట్టు-స. 1. జిగి, కాంతి. 2. మంట. 3. వెలుఁగు. రూ. త్విష. సమా. త్విషాంపతి.సూర్యుఁడు.

త్సరువు-స. కత్తిలోనగువాని పిడి.

## ద

దంగు-తె. (బియ్యములోనగునవి) మెదుఁగు.ప్రే. దంచు. కృ. దంగుడు.

దంచన-తె. పెద్దఫిరంగి. రూ. దంచనము, దెంచనము.

దంచు-తె. దంగఁజేయు, మెదిగించు. రూ. దంపు. కృ. దంపుడు.

దంట-తె. 1. జంట. 2. దిట్టతనముగలవాఁడు.3. నేర్పరి. సమా. —మోములదేవర-అగ్ని.

దంటు-తె. జొన్నలోనగువానికాఁడ.

దండ-తె. 1.సమీపము. 2.ప్రాపు. 3.వి.హారము. సమా.—కడియము-కేయూరము,—కవిలియ-ప్రాఁతలెక్కలపుస్తకపుకట్ట. —కోల-ఊఁత. —చేయి-సందిలి. —చేరు-సందిటఁగట్టుకొను తోరము. క్రి. —పడు-సమీపించు. కృ. దండపాటు.

దండనము-స. శిక్ష. క్రి. దండించు.

దండము-తె. నమస్కారము. స. 1. దుడ్డుగఱ్ఱ. 2. చతురుపాయములలో నొకటి. 3. రాజశిక్ష. 4. దండు. 5. బార. 6. హారమునందలిపేట. 7. కప్పము. 8. జత. 9. గుంపు. సమా.దండధరుఁడు-యముఁడు. —నాయకుఁడు-సేనాపతి. —నీతి-అర్థశాస్త్రము. —పాశకుఁడు-తలవరి. —యాత్ర-1. దిగ్విజయము. 2.యుద్ధమునకు వెడలుట. —లాసకము-కోలాటము. —విష్కంభము - తరికంబము. దండాహతము-మజ్జిగ.

దండసిల్లు-తె. 1. ఇఱుకుకొను. 2. అణఁగు.

దండి-తె. 1.ప్రతాపము. 2.గొప్ప. స.1. యముఁడు. 2.ద్వారపాలకుఁడు.3.దండముగలవాఁడు.

దండిక-స. 1. కిన్నెర. 2. హారమందలిపేట.

దండితుఁడు-స. దండింపఁబడినవాఁడు.

దండియ-వి. (దండిక) 1. కిన్నెర. 2. వీణె.3. వీణాదండము. 4. తంబుఱ. 5. పల్లకివెదురు. 6. త్రాసుకోల. రూ. దండె.

దండియము-తె. గుడ్డలాఱవేయుటకుకట్టిన వెదురులేక దారము. 2. గరిడీసాదనలో నొకవిధము. రూ. దండెము.

దండు-వి. (దండము) 1. సేన. క్రి. దండెత్తు. 2. గుంపు.సమా. —దివియ-దీపపుసెమ్మె.—బాట-ఘంటాపథము. —లంజ-బజారి.

దండుగ-వి. (దండము) 1. రాజు ధనవంతుని బలాత్కారముచేవి పుచ్చుకొనుద్రవ్యము. 2. అధికారి అపరాధివలనఁగొనెడు డబ్బు. 3. నష్టము. రూ. దండుగు, దండువ, దండువు.

దండోరా-హిం. చాటింపు. రూ. తంబోరా.

దండ్యుఁడు-స. దండింపఁదగినవాఁడు.

దంతము-స. 1. పల్లు. 2. కోఱ. సమా. దంతధావనము-పలుతోముట.దంతావళము-ఏనుఁగు.

దంతి-స. 1. ఏనుఁగు. 2. కోఱపండ్లవాఁడు.

దంతియ-తె. మిద్దెటింటికి అడ్డముగావేసెడుపట్టె. రూ. దంతె.

దంతురము-స. ప్రక్కలణఁగి నడుముపొడవైనది.

దంతురుఁడు-స. మిట్టపండ్లవాఁడు.

దంత్యము-స. దంతమునందు పుట్టినది.

దందడి-తె. తఱచు. క్రి.దందడించు-తఱచగు.—వెట్టు-రాయిడిచేయు.

దందన-వి. (దంధనము) మాయ. సమా. —కాఁడు,—కత్తె.

దందశూకము-స. పాము. (వ్యు.కుత్సితముగఁ గఱచునది.)

దంధనము-స. శాశ్వతముకానిది.

దంపతులు-స. ఆలుమగలు. రూ. జంపతులు.

దంపు-చూ. దంచు. కృ. దంపుడు.

దంభము-స. 1. కపటము. 2. తప్పు.

దంభోళి-స. వజ్రాయుధము, ఱాతివాలు. (వ్యు.

శత్రువులను దుఃఖపెట్టునది,)
దంశనము-స. 1.కాటు. 2.పల్లు. రూ.దంసనము.
దంశము-స. 1. అడవియీఁగ. 2. కాటు.
దంశిక-స. పట్టుకాఱు.
దంష్ట్ర-స. కోఱ. సమా. దంష్ట్రాయుధము-పంది.
దంష్ట్రి-స. పంది. (దంష్ట్రిలు కలది)
దక్కనము-వి.(దక్షిణము)వలదెస.సమా. దక్కన
పురాయఁడు-యముఁడు.
దక్కు-తె. 1. అనుభవయోగ్యమగు.2.కృ. అను
భవయోగ్యము.
దక్కొను-తె.(దక్కు+కొను) స్వతంత్రుఁడగు.
కృ. దక్కోలు.
దక్షాయ్యము-స. గ్రద్ద.
దక్షిణ-స. 1. కుడిదిక్కు. రూ. దక్షిణము.సమా.
దక్షిణాపథము-వింధ్యమొదలు సేతువఱకుఁ
గల దేశము.
దక్షిణుఁడు-స. 1. అనేకనాయికలయందు సమ
ముగా వర్తించువాఁడు. 2. చక్కనైనమనను
కలవాఁడు. 3.దాక్షిణ్యముకలవాఁడు. 4.నేర్పరి.
దగ-వి. (దాహము) 1. తాపము. 2. దప్పి.
దగర-చూ. డగర.
దగరము-తె. కీడు. రూ. డగరము.
దగ్గఱ-చూ. డగ్గఱ.
దగ్గఱు-తె. సమీపించు. రూ.డగ్గఱు.
దగ్గు-తె. 1. కాసముచేయు. 2.కృ. కాసము.రూ.
డగ్గు. దగ్గుత్తిక-గద్గదస్వరము. రూ. డగ్గుత్తిక.
దగ్ధము-స. కాల్పఁబడినది.
దచ్చవుక-తె. (దంటు+చవుకము) ఎనిమిది.
రూ. దచ్చి. సమా. దచ్చికాళ్లమెకము - శరభ
ము, అష్టాపదము.
దట్టన-తె. అదలుపు. [రూ. దడము.
దట్టము-తె. 1. పావడ. 2. తఱచు. 3. విరళము.
దట్టించు-తె. 1. అదలుచు. 2. దట్టీకట్టు.
దట్టీ-వి. (ధట్టము) కాసె.
దట్టుఁడు-వి. (ధృష్టుఁడు) దిట్టతనము కలవాఁడు.
దడ-తె. వణఁకు.
దడబడ-తె. ఆటోపము. [1. సేన. 2. గుంపు.
దడము-తె. దట్టము. రూ. దళము.వి.(దండము)-
దడి-తె. తడక.
దడిగ-తె. కేడెము.
దడిబము-వి. (తలిమము) పఱపు. రూ.దడిమము.
దడియ-తె. కొండచేరువనేల, ఉపత్యక.
దడియము-తె. రెండు వీసెలయెత్తు. రూ. దడెము,
దడియ-తె. వణఁకు. [దడ్డియము.
దణా-వి. (దళము) సేన.
దణాయఁడు-వి. (దళనాయకుఁడు) సేనాపతి.
దణీ-వి. (ధని) ప్రభువు.
దత్తకుఁడు-స. దత్తపుత్త్రుఁడు. [కొన్నకొడుకు)
దత్తము-స. ఇయ్యఁబడినది. (దత్తుఁడు-దత్తుతీసి
దత్తు-వి. (దత్తము) స్వీకారము.
దద్దడము-తె. బోడిమిద్దె. రూ. దద్దళము.
దద్దఱిల్లు-తె. తబ్బిబ్బుపడు. రూ. దద్దఱు, దద్దిరు.
దద్దు-వి. (దద్రువు) చిన్నవాఁపు. రూ, దద్దురు.
దద్రువు-స. ——పై.——
దధి-స. పెరుగు.
దనియాలు-వి. (ధాన్యాకము) కొత్తిమిరి విత్తులు.
దనియు-తె. సంగమించు. కృ. దనివు.
దనుక-తె. వఱకు. రూ. దాఁక.
దనుకు-తె. 1. తాఁకు. 2. పొందు. రూ. దన్కు.
దనుజుఁడు-స. తొలివేల్పు. (వ్యు. దనువునందు
పుట్టుకఁగొన్నవాఁడు, దానవుఁడు).
దప్పము-తె. దట్టము.
దప్పళము-తె. పలుచగాఁజేసిన కూర.
దప్పి-తె. 1. నీరువట్టు. 2. శ్రమము. రూ.దప్పి,
దప్పిక.
దబాయించు-హిం. 1. అదుము. 2. అదలించు.
దబ్బ-తె.1.ఒకతెగ నారింజ.2.వి.దర్భ. 3.వెదురు
బద్ద. సమా. —కాఁడు-మేదరి.
దబ్బడము-తె. మూకుడు. రూ.దబ్బుడు,దిబ్బడము.
క్రి. దబ్బడించు.
దబ్బనము-తె. గోనెలుకుట్టెడు పెద్దసూది.
దబ్బఱ-తె. 1. బొంకు. 2. మోసము. 3. విపత్తు.
4. తప్పు. రూ. డబ్బఱ. సమా. —కాఁడు.
దబ్బాటు-చూ. డబ్బాటు. [—కత్తె.
దబ్బు-తె. 1. వచించు. 2. కృ. మాట.
దబ్బున-తె. శీఘ్రముగా.

దబ్బర-తె. గిన్నె. రూ. డబ్బర.
దభ్రము-స. సన్నము.
దమనము-స. 1. అణఁచుట. 2. దవనము.
దమము-స. 1. క్లేశము నోర్చుగుణము. 2.ఇంద్రియనిగ్రహము. 3. అణఁచుట. 4. అదును. క్రి. దమించు.
దమ్మఁడు-వి. (ధర్ముఁడు) కపటము లేనివాఁడు.
దమ్మము-వి. ధర్మము.
దమ్మిడి-హిం. చిన్న రాగినాణెము.
దమ్ము-వి. (దమము) అదును. సమా. దంపకబ్బి, —నాఁగలి-అదును మడక.
దయ-స. కనికరము. క్రి. దయచేయు - 1. కరుణించు. 2. విచ్చేయు. 3. ఇచ్చు.
దయాళువు-స. కనికరము కలవాఁడు.
దయిత-స. 1. ప్రియురాలు. 2. ఆఁడుది. (పుం. దయితుఁడు.)
దయ్యము-వి. (దైవము) 1. దేవుఁడు. 2.దేవత. 3. విధి. 4. పిశాచము.
దయ్యు-చూ. డయ్యు. కృ. దప్పి, డప్పి.
దర-వి. (ధర) వెల.
దరణము-తె. ఎనిమిది డబ్బుల నాణెము.
దరము-స. 1. భయము. 2.శంఖము. 3.ఇంచుక. సమా. దరహాసము-చిఱునవ్వు. [స. గుహ.
దరి-వి. (తీరము) 1.గట్టు.2.మేర. 3.సమీపము.
దరికొను-తె. కాలు, మండు.
దరిద్రుఁడు-స. బీదవాఁడు.
దరిబేసి-హిం. దీనుఁడు. [యిచ్చు.
దరిసించు-వి. (దర్శించు) 1. చూచు. 2. కానుక
దరిసెనము-వి. (దర్శనము) పెద్దలఁజూడఁబోవునపుడు కొనిపోవు కానుక.
దర్జీ-హిం. కుట్టుపనివాఁడు.
దరువు-తె. 1. పాట. 2.వి. (ధ్రువము) తాళము.
దర్దురము-స. 1. కప్ప. 2. ఇంచుకవంగినది.
దర్పకుఁడు-స. మదనుఁడు. (వ్యు. దర్పింపఁజేయువాఁడు.)
దర్పణము-స. అద్దము.
దర్పము-స. 1. గర్వము. 2.కస్తూరి.క్రి.దర్పించు.
దర్బారు-హిం. కొలువుకూటము.
దర్బ-స. కుశము. (వి. దబ్బ.)
దర్వి-స. 1. గరిఁటె. 2. పాముపడగ. 3.అటక. సమా. దర్వీకరము-పాము.
దర్శకుఁడు స. 1. ద్వారపాలకుఁడు, 2. చూచువాఁడు.
దర్శనము-స. 1. చూపు. 2. కన్ను. 3. అద్దము. 4. తెలివి. క్రి. దర్శించు.
దర్శనీయము-స. చూడఁదగినది.
దర్శము-స. అమావాస్య.
దలాలి-హిం. తఱుగరి.
దలిమము-చూ. దడిమము.
దల్లు-చూ. జల్లు.
దవ-తె. దుమ్ము.
దవంత్రి-తె. అగడ్త.
దవనము-వి. (దమనము)వాసనగల ఒక మొక్క.
దవము-స. 1. కార్చిచ్చు. 2.అడవి. రూ.దావము.
దవీయము-స. మిక్కిలి దవ్వైనది.
దవ్వ-తె. మ్రానినడిమి మెత్తని భాగము.
దవ్వు-తె. దూరము.
దశ-స. 1. అవస్థ. 2. వత్తి. 3. బద్దె.
దశకము-స. పది.
దశనము-స. 1. కవచము. 2. కఱచుట. 3.పల్లు.
దశమి-స. 1. పక్షమున పదవతిథి. 2.పదియవది.
దశాహము-స. మృతినొందినవానికి పదవనాఁడు చేయు శ్రాద్ధము.
దష్టము-స. కఱవఁబడినది.
దసరా-వి. (దశరాత్రము) ఆశ్వయుజమాసమున చేయు ఉత్సవము, నవరాత్రము.
దసిలి-తె. 1.వదులు. 2.ఒకతెగపట్టు. రూ.దసిలీ.
దసువంది-తె.గ్రుద్దులాటకు జెట్టీలనుగూర్చువాఁడు.
దస్తరము-హిం. కాకితములమూట. రూ. దప్తరము.
దస్తావేజు-హిం. పత్రము.
దస్తు-హిం. పోగుచేసిన సొమ్ము.
దస్తూరి-హిం. వ్రాఁత.
దస్యుఁడు-స. 1. దొంగ. 2. శత్రువు.
దస్రులు-స. అశ్వినీదేవతలు.
దహనము-స. కాల్చుట. క్రి. దహించు.
దహనుఁడు-స. అగ్ని.
దళనము-స. 1. ఖండించుట. 2. చీల్చుట.
దళము-తె. 1.అధికము.2.తఱచు. 3.దట్టము.రూ.

దడము. క్రి.దళకొను,దళగించు, దళముకొను.
స-1. ఆకు. 2. దండు. 3. భాగము.
దళవాయి-తె. (దళము+వాయి) 1. సేనాధిపతి.
2. సుంకరికి సహాయుఁడైన యుద్యోగి.
దళసరి-తె. 1. మందము. 2. ఘనత.
దళితము-స. 1. ఖండింపఁబడినది. 2. ఛేదింపఁ
బడినది. 3. వికసించినది.

## దా

దా-చూ. డా. సమా. దాకన్ను-ఎడమకన్ను.దాపల-
ఎడమప్రక్క. క్రి. దాపలించు.
దాంతి-స. తపఃక్లేశము నోర్చుగుణము.
దాంపత్యము-స. దంపతి భావము.
దాంభికుఁడు-స. దంభముగలవాఁడు.
దాఁక-చూ. దనుక.
దాఁకొను-తె. దాఁగుకొను. రూ. డాఁకొను.
దాఁగర-తె. ఎండుపుఁదట్టు.
దాఁగు-తె. మఱుఁగుపడు. రూ. డాఁగు. ప్రే.దాఁగు
రించు,డాఁగురించు,దాఁచు,డాఁచు,దాఁపు,డాఁపు.
దాఁటు-తె. 1. లంఘించు. 2. తరించు. 3. ఉల్లం
ఘించు. కృ. 4. లంఘనము.
దాఁటుకట్టు-తె. గుంపుగూడు.
దాఁపన-తె. దాఁచుట. రూ. దాఁపుడు.
దాఁపరము-తె. దొంగిలించుట. క్రి. దాఁపరించు.
సమా. దాఁపరీఁడు - దొంగ. దాఁపటీకము -
దాఁపు-తె. దాఁచు. చూ. దాఁగు. [గోపనము.
దాఁపురము-తె. 1. మఱుఁగుపుచ్చుట, గోపనము.
2. దాఁచినసొమ్ము. [2. వి. ద్రాక్ష.
దాక-తె. 1. వెడలుపు నోరుగల అటికపాత్ర.
దాకలి-తె. (దాయి+కలు) లోహముకాఁచి సాఁ
గఁగొట్టుటకుక్రింద ఊఁతగానుంచుకొను ఇనుప
దిమ్మె, నిఘాతిక. రూ. డాకలి, దాగలి.
దాకల్లు-తె. (దాపు+కల్లు) బండిచక్రపు కట్టు,
నేమి. రూ. డాకల్లు. [డాకొను.
దాకొను-తె. (దాపు+కొను) సమీపించు. రూ.
దాక్షాయణి-స. 1. పార్వతి. 2.రోహిణీనక్షత్రము.
దాక్షిణ్యము-స. మొగమోటము.
దాగలి-చూ. దాకలి.

దాడి-వి. (ధాటి) దండెత్తుట. సమా. —కాఁడు-
వేగు.హిం.గద్దము.[దానిమ్మ,దాడిమ్మ,దాళిమ్మ.
దాడినిమ్మ-వి. (దాడిమము) ఒక ఫలవృక్షము.రూ.
దాడిమము-స. —పై.—
దాత-స. ఇచ్చువాఁడు.
దాత్రము-స. కొడవలి.
దాదాపు-తె. (దాపు+దాపు) మిక్కిలి సమీపము.
దాది-వి. (ధాత్రి) పాలిచ్చి పెంచుతల్లి. రూ.దాదిలి.
దాదుంగ-తె. (దాయి+దుంగ) చెక్కెడుమ్రానికి
ఊఁతగానుంచుకొనుదుంప, ఉద్ఘనము.
దానము-స. 1. ఈవి. 2. ఏనుఁగు కపోలమదము.
3. చతురుపాయములలో నొకటి.
దానవుఁడు-స. దనుజుఁడు. [చు, దాపురించు.
దాపరము-తె. ప్రాప్తి. రూ. దాపురము. క్రి.దాపరిం
దాపు-తె. 1. సమీపము. 2.భయము. క్రి.దాపించు.
దామని-స. దామెనత్రాడు. [దరుఁడు-కృష్ణుఁడు.
దామము-స. 1.పలుపు. 2.హారము. సమా. దామో
దామర-తె. ఉరిత్రాడు. [త్రాడు.
దామెన-వి. (దామని) పెక్కుపలుపులుగల నిడివి
దాయ-వి. (దాయాదుఁడు) 1. జ్ఞాతి. 2. శత్రువు.
దాయము-తె. 1.పాచికలలో ఒకటి. 2.గవ్వలాట.
3. ఆపద. స. పంచుకొనఁదగిన తండ్రిసొత్తు.
దాయాదుఁడు-స. 1. జ్ఞాతి. 2. పుత్త్రిఁడు.
దాయి-తె. దాకలి. స. ఇచ్చువాఁడు.
దాయు-తె. సమీపించు.రూ.డాయు.కృ. డాపు,దాపు.
దార-వి. (ధార) 1. నీటిచాలు. 2. దానము. 3.
క్రమము. స. భార్య. [3. చీల్చువాఁడు.
దారకుఁడు-స. 1. బాలకుఁడు. 2. కృష్ణునిసారథి.
దారణ-వి. (ధర) వెల. రూ. దర.
దారణము-స. చీల్చుట.
దారబందము-వి. ద్వారబంధము.
దారము-తె. పేనినత్రాడు. [ధరించువాఁడు.
దారి-వి. 1. (ద్వారము) మార్గము. 2. (ధారి)
దారించు-స. చీల్చు.
దారితము-స. చీల్పఁబడినది.
దారిద్ర్యము-స. బీదతనము.
దారుణము-స. భయంకరము.
దారున-తె. తటాలున.

దారువు-స. 1. కొయ్య. 2. ఇత్తడి.
దార్ఢ్యము-స. దిటవు.
దాలి-తె. పిడకలప్రోగు.
దావంతము-తె. దుఃఖము.
దావము-చూ. దవము.
దావరి-తె. వీరుఁడు. రూ. దావరీఁడు.
దావా-హిం. వ్యాజ్యము. [వాఁడు)
దాశార్హుఁడు-స. కృష్ణుఁడు. (వ్యు. దశార్హుని సంతతి
దాసరి-వి. (దాసు+అరి) 1. విష్ణుసేవకుఁడగు శూద్రుఁడు. రూ. దాహరి. సమా. దాసరయ్య. తాఁబేలు. రూ. దాసరిగాఁడు. దాసరిపాము-నెత్తి పై మూఁడుచాఱలుగల ఒక తెగ పెద్దపాము.
దాసి-స. వెలకుఁగొన్న పనికత్తె. [డు.
దాసుఁడు-స. 1.వెలకుఁగొన్నపనివాఁడు. 2. భక్తుఁ
దాసేయుఁడు-స. 1. పనివాఁడు. 2. దాసికిఁబుట్టిన వాఁడు. రూ. దాసేరుఁడు.
దాహము-స. 1. కాల్చుట. 2. దప్పి.
దాళా-(మహారాష్ట్ర) సమానము.
దాళిమ్మ-చూ. దాడినిమ్మ.
దాఱ-తె. వర్ణలేశము.
దాఱవ-వి. (తాలువు) దౌడ.
దాఱవా-తె. సీరాధారమునపండెడుపంట.

## ది

దించు-తె. దిగఁజేయు. రూ. దింపు, దిగుచు.కృ. దింపుడు.
దిండు-తె. 1. తలగడ. 2. పొడవుగా గుండ్రముగా చెక్కినద్రాను. 3. దట్టీ. రూ. ద్రిండు.
దింపు-తె. 1. దించు. 2. ద్రేలుట.
దింపుడు-తె. దించుట. సమా. —కళ్లము. మధ్యే మార్గమున పీనుఁగునుదించుచోటు.
దిక్కుమొగములు-తె.భయముచేదిక్కునకొకరుగా పాఱినవారు. రూ. దిక్కుమొగములు.
దిక్కు-స. 1. శరణము. 2. దిశ. సమా. దిగంబరుఁడు. 1. శివుఁడు. 2. నగ్నుఁడు. దిగ్భ్రమము. దిక్కులతబ్బిబ్బు.
దిగు-తె. 1. క్రిందికివచ్చు. 2.దిగుమతియగు.3. విఱియు. రూ. దిగ్గు, డిగు,డిగ్గు. ప్రే.దిగుచు, దించు. కృ. దిగువ. క్రి. దిగఁదీయు-దృష్టి దోషముపోవ చుట్టివేయు.—ఁదుడుచు-పై.— కృ. దిగఁదుడుపు. —ఁదోయు-1. దిగు. 2. విడుచు. —ఁబడు-1. అడఁగు. 2. దిగు. 3. జాఱు. —నాడు,—విడుచు-విడుచు. దిగనన-దిగువగా. దిగుడు-1. అనతము. 2.తక్కువ. రూ. దిగ్గుడు. దిగుచు-దించు. దిగుదల-క్రింది భాగము. —మతి-సరకులుదిగుట. దిగువ-క్రింద. దిగువాయి-తక్కువ. —వాఱు-1.క్రిందికి పడు. 2. కాఱు.
దిగులు-తె. గుండెయదరు. క్రి. —పడు-అదరు. కృ. దిగులుపాటు.
దిగ్గన-తె. తటాలున. రూ. దిగ్గున.
దిగ్గియ-చూ. డిగియ.
దిగ్గురను-తె. గుండెగుభిలుమను.
దిగ్ధము-స. పూయఁబడినది.
దిచ్చరి-వి. (దుశ్చారిణి) వ్యభిచారిణి.
దిచ్చుమొగము-తె. అదృశ్యము.
దిట-వి. (దృఢము) 1. సత్తువ, శక్తి. 2. ధైర్యము. రూ. దిటము, దిటవు.
దిట్ట-వి. 1. (దృఢము) శక్తి. 2. (ధృష్టుఁడు) దార్ఢ్యముగలవాఁడు. 3. ధైర్యముగలవాఁడు.4. నేర్పరి. రూ. దిట్టఁడు. [ము.
దిట్టము-వి. (దృఢము) 1. నిర్ణయము. 2. మిత
దిడ్డి-తె. పెద్దవాకిలి ప్రక్కనుండు చిన్నవాకిలి.
దిద్దు-తె. 1. శిక్షించు. 2. సవరించు.కృ.దిద్దుడు, దిద్దుగడ, దిద్దుపాటు, దిద్దుబడి.
దిదృక్ష-స. చూడనిచ్చ. (పుం. దిదృక్షువు.)
దిధిషువు-స. 1. మాఱుమనువుది. 2. మాఱుమనువుదానిమగఁడు.
దినము-స. 1. పగలు. 2. రేయింబవలుచేరినది. సమా.—దినకరుఁడు-సూర్యుఁడు.—బత్తెము-ప్రతిదినమిచ్చుబత్తెము.(ఇది మిశ్రసమాసము) —వెచ్చము. ప్రతిదినమగు కర్చు.( ,, )
దినారి-వి. (దీనారము) ఒక బంగారునాణెము.
దినుసు-హిం. 1. వస్తువు. 2. ప్రకారము. రూ. [దినుస్సు.
దిబ్బ-తె. 1. ఎత్తైననేల. 2. కుప్ప.
దిబ్బడము-తె. మూకుడు. రూ. దబ్బడము.

దిబ్బెము-వి. దీపము.
దిమాకు-హిం. గర్వము.
దిమ్మ-తె. 1. కుప్ప. 2. దిమ్ము. [రూ.దిమ్మెస.
దిమ్మిస-తె. నేలనణఁచి చదునుసేయు సాధనము.
దిమ్ము-తె. 1. సమూహము. 2. భ్రమము. 3. మత్తు. సమా. దిమ్మరి-1. భ్రమకలవాఁడు,—కలది, 2. మత్తుకలవాఁడు—కలది. రూ. దిమ్మరీఁడు. క్రి. దిమ్ముపట్టు-1. భ్రమగొను. 2. మత్తుగొను.
దిమ్మె-తె. 1. తామరలోనిదుద్దు. 2. కొయ్యబిరడ. 3. రాళ్లమున్నగువానితో నేర్పఱచినచిన్నమిట్ట. 4. లావుపొడవుగల కొయ్య. [సము.
దిరిసెనము-వి. (శిరీషము) బాగిచెట్టు. రూ. దిరి
దివటీ-వి.(దీపయష్టి) ఇనుపసలాకునకుఁగాని కఱ్ఱకుఁగాని గుడ్డలుచుట్టి ముట్టించుదీపము. రూ. దివ్వటీ.
దివము-స. 1. ఆకాశము. 2. స్వర్గము. 3. పగలు. సమా. దివాకరుఁడు-సూర్యుఁడు. దివాంధము, దివాభీతము-గుడ్లగూబ. దివాభీతుఁడు-దొంగ. దివస్పతి-ఇంద్రుఁడు. దివౌకసము-పక్షి. రూ. దివేకసము. దివౌకసుఁడు-వేలుపు. రూ. దివోకసుఁడు.
దివసము-స. పగలు.
దివాణము-వి. (దేవాయనము) కొలువుకూటము.
దివాను-హిం. మంత్రి.
దివి-స. 1. ఆకాశము. 2. స్వర్గము. సమా. —జుఁడు-దేవత. —షదుఁడు—పై.—
దివియ-వి. 1. దీపము. 2. దివ్వటీ. రూ. దివె, దివ్య, దివ్విియ, దివ్వె, దీవియ, దీవె, సమా. —కంబము-దీపస్తంభము. రూ. దీవెకంబము. —కోల-దివ్వటీ. ఇట్లే తక్కిన రూపముల నన్నింటి నూహించుకొనునది. —నుడి-దీపపుగూడు.
దివ్యము-స. 1. దివియందుఁబుట్టినది. 2. ఒప్పైనది. సమా. దివ్యచక్షువు-1. జ్ఞానదృష్టిగలవాఁడు. 2. గ్రుడ్డివాఁడు. 3. మంచికన్నులు కలవాఁడు.
దిశ-స. దిక్కు. (వి. దెస)
దిష్టము-స. 1. భాగ్యము. 2. సమయము.
దిష్టాంతము-స. చావు. (వ్యు. జీవితకాలము యొక్క అంతము.)
దిసంతు-తె. నింద. క్రి.—కొట్టు,—ఆడుచు.
దిసమొల-తె. నగ్నత్వము. రూ. దిస్సమొల. సమా. —వాఁడు-దిగంబరుఁడు. —వేలుపు-1. శివుఁడు. 2. కాలభైరవుఁడు.

## దీ

దీ-చూ. డీ.
దీకు-చూ. డీకు.
దీకొను-తె. 1. తలతోఁపొడుచు. 2. ఎదిరించు. 3. కవియు. చూ. డీకొను. కృ. దీకోలు.
దీక్ష-స. యజ్ఞాదులందు ఆరంభమున అనుష్ఠించు ఆచారనియమము. క్రి. దీక్షించు.
దీక్షితుఁడు-స. యజ్ఞదీక్షవహించినవాఁడు.
దీటు-తె. 1. సరిచేయు. రూ. దీటుకట్టు. 2. సమానము.
దీటుకొను-తె. 1. నిండుకొను. 2. సవరించు. 3. సరిపోలు.
దీదివి-స. 1. అన్నము. 2. బృహస్పతి.
దీధితి-స. కిరణము.
దీనారము-స. బంగరు నాణెము.
దీనుఁడు-స. 1. ఖిన్నుఁడు. 2. దరిద్రుఁడు. (స్త్రీ. దీన. నపుం. దీనము.)
దీపకము-స. 1. ఓమము. 2. దీపము. 3. దీమము.
దీపము-స. 1. వెలుతురుకైయుంచు లాంతరు. మొ. రూ. దీపిక. (వి. దివ్వె) సమా. దీపవల్లి-దీపపువత్తి. —వృక్షము-దీపస్తంభము. —స్తంభము - దీపముంచుట కమర్చిన నిడుపుకఱ్ఱ. దీపావళి - నరకచతుర్దశమఱునాఁడు వచ్చు పం[డుగ.
దీప్తము-స. 1. వెలిగినది. 2. కాలినది.
దీప్తి-స. కాంతి.
దీమము-వి. (దీపకము) వేఁటాడుటకై వేఁటకాఁడు పెంచుపక్షి, మృగము. మొ. రూ. దీము.
దీమసము-తె. 1. ధైర్యము. 2. ఉపాయము. రూ. దీవసము.
దీర్ఘము-స. నిడుద. సమా. దీర్ఘదర్శి-1. విద్వాంసుఁడు. 2. దూరపు యోచన కలవాఁడు. —నిద్ర-చావు. —పృష్ఠము-పాము. —సూత్రుఁడు-ఆలసించి పనిచేయువాఁడు. దీర్ఘాయు

వు-1. కాకి. 2. పెక్కిండ్లు బ్రదుకువాఁడు.
ధీర్ఘిక-స. నడబావి. (వి. దిగియ)
ధీర్ఘము-స. 1. చీల్పఁబడినది. 2. భయపడినది.
ధీలు-తె. డిల్లపడు. చూ. దీలు.
ధీవన-తె. ఆశీర్వాదము. రూ. దీవెన. క్రి. ధీవించు.
సమా. —ప్రాలు-అక్షతము.
ధీవసము-చూ. దీమసము.
దీవి-వి. (ద్వీపము) నీటినడిమిభూభాగము.
ధీవియ, దీవె-చూ. దివియ.
ధీవెన-చూ. ధీవన.
ధీవెనకోలు-తె. నమస్కారము.

## దు

దుంక-తె. రంధ్రము, చిల్లి. రూ. దుంకము.
దుఁగ-తె. మ్రానిమొద్దు. [డటికము.
దుండగము-తె. 1. దౌష్ట్యము. 2. కీడు. రూ.దుం
దుండగీఁడు-తె. దుష్టుఁడు.
దుండి-తె. దొరసాని.
దుండుబలి-తె. సోమరి.
దుంత-తె. దున్న. సమా. —రౌతు-యముఁడు.
దుందుభి-స. 1. పాచికయందలి ఇత్తిగ. 2. భేరి.
3. ఏఁబదియాఱవ సంవత్సరము.
దుందుము-తె. చక్రాకారపు దివ్వటీ.
దుందుఱు-చూ. జుంజుఱు.
దుంప-తె.గెనుసులోనగువానిగడ్డ.2.నాఁగేటిగొడగ.
దుఃఖము-స. 1. బాధ. 2. చింత. క్రి. దుఃఖించు,
దుకాణము-హిం. అంగడి. [దుఃఖపడు:
దుకూలము-స. 1. తెల్లవస్త్రము. 2. సన్నవస్త్రము.
దుక్కి-తె. దున్నుట.సమా. దుక్కిటెద్దు-దున్నుట
కుపయోగపడుఎద్దు. —వాలు - నాఁగలి.
—తాలుపు-బలరాముఁడు.
దుగ-వి. (ద్వికము) రెండు. రూ. దువ. సమా.
—మొగములపులుఁగు- గండభేరుండము. —
వేలుపు-అగ్ని. దుగ్గాని-(దుగ + కాని) రెండు
దమ్మిడ్లు.
దుగినుఁడు-వి.(ద్రుహిణుఁడు) బ్రహ్మ. [డంతలు.
దుగుణము-వి. (ద్విగుణము) 1. రెండు. 2.రెం
దుగులము-తె. వరహాలో పదునాఱవభాగము.

దుగ్గ-వి. (దుర్గ) 1. కాళి. 2.పార్వతి. రూ.దుగ్గి.
దుగ్గు-1. నలిచినపొడి.
దుగ్ధము-స. 1. పాలు.2.పిదుకఁబడినది.[కఁడు)
దుడుకు-తె. 1. దౌష్ట్యము. 2.ఉద్ధతి. (పుం.దుడు
దుడ్డు-తె. 1. మోదు. 2. డబ్బు. 3. లావుకఱ్ఱ.
4. గద. రూ. ద్రుడ్డు. సమా. —గఱ్ఱ.-లావు
కఱ్ఱ, దండము.
దుడ్డె-తె. బాలకుఁడు. 2. ధూర్తుఁడు, ధూర్తురాలు.
దుత్త-తె. చిన్నకడవ.
దుత్తాయి-తె. కుయిచ అరచట్ట.
దుత్తూరము-తె. కపటము. స. ఉమ్మెత్త.
దుద్దు-తె. 1. తామరలోనిదిమ్మె. 2. ఒగతెగచెవి
కమ్మ. 3. తాటాకుచుట్ట.
దుద్దెక్కు-తె. అతిశయించు.
దును-చూ. దున్ను.
దునుకు-తె. బాధ.
దునెదారి-వి. (ద్రుణధారి) 1. కత్తిదాల్చినశూరుఁ
డు. 2. శూరుఁడు. రూ. దునేదారి.
దున్న-తె. మహిషము. రూ. దున్నపోతు.
దున్ను-తె. దుక్కిచేయు. [టము.
దుప్పటము-తె. వెలగలసన్ననివస్త్రము. రూ. దువ్వ
దుప్పటి-వి. (ద్విపటి) కప్పుకొనువస్త్రము, నిచో
ళము. రూ. దుప్పటీ.
దుప్పి-తె. పొడలుగల అడవిమృగము, చమూరువు.
దుబాసి-హిం. భాషాంతరముచేయువాఁడు, ద్విభాషి.
దుబ్బు-తె. గడ్డిలోనగువానిగంట, తృణస్తంబము.
దుమగతికేతు-వి. (ధూమకేతువు) అరిష్టసూచక
మగు తోఁకచుక్క.
దుమదుమ-తె. మిక్కిలి తడి.
దుమారము-తె. దుమ్ము.
దుమాలు-తె. సమూలము.
దుము-చూ. దుమ్ము. [గంతు. రూ. దూఁకు.
దుముకు-తె. 1. ఉఱుకు. 2.గంతువేయు. 3.కృ.
దుముదారు-హిం. దండు.
దుమ్ము-తె. ధూళి. రూ. దుము, దుమారము.
దుమ్ములగొండి-తె. కొర్నవగండు.
దుయ్యు-చూ. దూయు.
దుర్-స. చెడుగు అనునర్థమిచ్చు ఉపసర్గ. సమా.

దురంతము-1. అంతములేనిది. 2. కడపట చెడుగగునది. దురతిక్రమము - అతిక్రమింపఁగూడనిది. దురత్యయము - చేటులేనిది. దురదృష్టము-దౌర్భాగ్యము. దురధ్వము-చెడుత్రోవ. దురాకృతము-అకృత్యము. దురాచారము-చెడునడవడి. దురాత్ముఁడు-చెడుమనస్సుకలవాఁడు. దురాపము-పొందఁగూడనిది. దురాలాపము - చెడుమాట. దురాలోకము - చూడఁగూడనిది. దురాశ-వ్యర్థమైన ఆస. దురాసదము-పొందఁగూడనిది. దుర్గంధము-చెడువాసన. దుర్గము - కోట. దుర్గతి-1. నరకము. 2. బీదతనము. దుర్గమము-పోఁగూడనిది. దుర్ఘటము - ఘటింపనిది. దుర్జనుఁడు - దుష్టుఁడు. దుర్జయుఁడు - జయింపఁగూడనివాఁడు. దుర్జాతి - దుర్జనుఁడు. దుర్జ్ఞేయము-ఎఱుఁగరానిది. దుర్దాంతము - అడఁపఁగూడనిది. దుర్దినము - 1. చెడుగుకలిగిన దినము. 2. మబ్బుక్రమ్మినదినము. దుర్ధర్షుఁడు-తిరస్కరింపఁదగనివాఁడు. దుర్నయము - అన్యాయము, దుర్నీతి. దుర్నిరీక్ష్యము - చూడరానిది. దుర్బలుఁడు-బలహీనుఁడు. దుర్భరము-భరింపఁగూడనిది. దుర్భిక్షము-కఱవు. దుర్మతి-1. చెడుబుద్ధికలవాఁడు. 2. ముప్పదవ సంవత్సరము. దుర్మరణము-చెడుచావు. దుర్ముఖి-ఏఁబదియైదవ సంవత్సరము. దుర్వహము-వహింపఁగూడనిది. దుర్వినీతుఁడు-వినయము లేనివాఁడు.

దురద-తె. 1. జిల. 2. కనరు.

దురదుర-వి. (త్వర) శీఘ్రముగా.

దురపిల్లు-తె. 1. శోకించు. 2. తపించు. 3. కలఁగు.

దురము-వి. 1. (ఉదరము) యుద్ధము. 2. (త్వర) [శీఘ్రము.

దురా-తె. ఆజ్ఞ. రూ. దురాయి.

దురాడము-తె. ఒఱగుదిండు.

దురితము-స. పాపము.

దురుసు-తె. 1. కాఠిన్యము. 2. శీఘ్రము.

దురోదరము-స. 1. జూదము. 2. పందెము. (వ్యు. దుష్టమైన యుదరముకలది.) (పుం. దురో[దరుఁడు.)

దుర్గ-స. పార్వతి. రూ. దుర్గి.

దుర్గము-స. కోట. (వ్యు. పోఁగూడనిది.)

దుర్భిణి-హిం. దూరవస్తు దర్శనయంత్రము.

దులదుల-తె. వేగిరపాటు.

దులుపు-తె. 1. (ప్రక్కలనంటుకొన్న వానిని) [రాల్చు. 2. విదిలించు.

దువ-చూ. దుగ. సమా. దువ్వలువ-1. దుప్పటి. 2. కట్టు వస్త్రము.

దువారము-వి. (ద్వారము) వాకిలి. రూ. దోరము.

దువాళము-తె. వేగమున ఒకే సమముగా పోవు అశ్వగతి, ప్లుతము. రూ. దువాళి. క్రి. దువాళించు.

దువ్వ-తె. దుమ్ము.

దువ్వటము-చూ. దుప్పటము. [రూ. దువ్వు.

దువ్వి-వి. (ద్వీపి) 1. పులి. 2. చిఱుత పులి.

దువ్వు-తె. 1. (దువ్వెనతో తల) చిక్కుదీయు. 2. నిమురు. వి. (ద్వీపి) 1. పులి. 2. చిఱుత పులి.

దువ్వెన-తె. దువ్వెడు సాధనము, కంకతిక.

దుష్టము-స. చెడ్డది.

దుస్-స. దుర్ అను నర్థమునవచ్చు ఉపసర్గ. సమా. దుష్కరము-చేయసాధ్యము కానిది. దుష్కృతము - పాపము. దుష్ప్రాపము, దురాపము, దుస్తరము-తరింపరానిది. దుస్త్యజము-విడువరానిది. దుస్సహము-సహింపఁగూడనిది.

దుసికిలు-తె. 1. జాఱు. 2. తప్పించుకొను. రూ. [దుసికిల్లు.

దుస్తు-తె. 1. ఉడుపు. 2. అందము.

దుస్సేనుఁడు-వి. (దుశ్శాసనుఁడు) దుర్యోధనుని [తమ్ముఁడు.

దుహిత-స. కూఁతురు.

## దూ

దూఁకలి-తె. బాధ.

దూఁకు-చూ. దుముకు.

దూఁకుడు-తె. దిగుడు.

దూఁకొను-తె. 1. రుచిచూచు. 2. పొందు.

దూఁట-తె. అరఁటి బొందె.

దూఁటు-తె. పొడుచు.

దూఁటుకొను-తె. ఎగురు.

దూఁటఱదిండి-తె. మిగులఁబెట్టక అంతయు [వెచ్చించి తినువాఁడు.

దూడ-తె. పశు శిశువు.

దూత-స. 1. రాయబారి. 2. కుంటెనకాఁడు. రూ. [దూతుఁడు.

దూతి-స. కుంటెనకత్తె. రూ. దూతిక.

దూత్యము-స. 1. దూతభావము. 2. దూతకార్యము. [రూ. దౌత్యము.

దూది-తె. ప్రత్తి.
దూప-తె. దప్పి. క్రి. దూపటిల్లు, దూపించు, దూపిల్లు-1. దప్పిగొను. 2. పరితపించు.
దూపము-వి. (ధూపము) వాసనగల పొగ. సమా. దూగలు-కలుదూపము. దూపార్తి - దూపము వేసెడు పాదముపెట్టిన తట్ట.
దూబ-తె. అధముఁడు.
దూయు-తె. 1. పాఱు. 2. బాణమునాటివెడలు. 3. పిడికిటితో ఆకులులోనగువాని నూడఁదీయు. 4. తీయు. రూ. దుయ్యు, డూయు, దుయ్యు. దూయుముడి-జాఱుముడి. రూ. దుయ్యుముడి, దూముడి.
దూరము-స. దవ్వు. సమా. దూరదర్శి-1. విద్వాంసుఁడు. 2. గద్ద. 3. దూరపుయోచనకలవాఁడు.
దూఱు-తె. 1. నిందించు. 2. కృ. నింద. క్రి. దూఱువడు
దూర్వ-స. గఱిక.
దూల-తె. దురద, నవ. [నమచ్చు ద్రూను.
దూలము-వి. (తుల) ఇంటికురుఁజుల కొదరువుగా
దూషణము-స. నిందించుట. క్రి. దూషించు.
దూషిక-స. 1. కంటిపుసి. 2. సాలెపురుగు.
దూష్యము-స. 1. గుడారము. 2. దూషింపఁదగినది.
దూసరి-తె. ఒకతెగ కసవు.
దూళి-వి. (ధూళి) దుమ్ము.

## దృ

దృంభువు-స. పాము.
దృక్కు-స. 1. కన్ను. 2. చూపు. 3. బుద్ధి.
దృఢము-స. 1. దిటవుగలది. 2. గట్టిది.
దృతము-స. ఆదరింపఁబడినది.
దృతి-స. తిత్తి.
దృప్తుఁడు-స. దర్పించినవాఁడు.
దృశ-స. చూపు.
దృశ్యము-న. చూడఁదగినది.
దృషత్తు-స. 1. ఱాయి. 2. సన్నెకల్లు. సమా. దృషత్పుత్రి-కల్వపుగుండు.
దృష్టము-స. చూడఁబడినది.
దృష్టాంతము-స. 1. ఉదాహరణము. 2. శాస్త్రము. 3. చావు. క్రి. దృష్టాంతీకరించు-ఉదాహరించు.
దృష్టి-స. 1. కన్ను. 2. చూపు. 3. బుద్ధి. క్రి. దృష్టించు.

## దె

దెంచనము-చూ. దంచనము.
దెందము-చూ. డెందము. [లక్ష్యము.
దెప్పము-తె. బాణాదుల కెదుటనిల్పిన కృత్రిమ
దెప్పరము-తె. 1. ఆపద. 2. దుస్సహము. 3. అశక్యము. రూ. డెప్పరము. క్రి. దెప్పరిల్లు.
దెప్పు-చూ. డెప్పు. కృ. దెప్పుడు.
దెబ్బ-తె. తాడనము, కొట్టు.
దెబ్బాటు-తె. గొప్పవాన.
దెస-వి. 1. (దిశ) దిక్కు. 2. పార్శ్వము. 3. (దశ) అవస్థ. 4. దురవస్థ. 5. ప్రాపు.

## దే

దేంద్ర-తె. నేతనేసిజీవించు ఒకజాతి. రూ. జేంద్ర.
దేఁకు-తె. ముడ్డితో రాచు.
దేబె-తె. దేవురుగొట్టు.
దేయము-స. ఇయ్యఁదగినది.
దేరీజ-హిం. గుడారము.
దేవత-స. వేలుపు.
దేవనము-స. 1. క్రీడ. 2. జూదము. 3. గెలువనిచ్ఛ.
దేవర-వి. (దేవత) 1. దేవుఁడు. 2. ప్రభువు. (స్త్రీ. దేవేరి.)
దేవరుఁడు-స. మగని తోఁబుట్టువు. రూ. దేవృఁడు. (వ్యు. అన్నదమ్ముల భార్యలతో పరిహాసముగా క్రీడించువాఁడు.)
దేవలుఁడు-స. 1. తంబళవాఁడు. 2. నంబివాఁడు.
దేవళము-వి. (దేవాలయము) గుడి.
దేవి-స. 1. పార్వతి. 2. రాణి.
దేవు-తె. 1. తడవియెత్తు. 2. వెదకు. రూ. దేవులాడు.
దేవుఁడు-స. దేవత. సమా. దేవతరువు-కల్పవృక్షము. —దత్తము-అర్జునుని శంఖము.—భూయము-దేవత్వము. —మణి-1. కౌస్తుభము. 2. గుఱ్ఱపు మెడమీఁదిసుడి.—మాతృకము-వాననీటిచే పండెడుపైరుగలదేశము. దేవాంగులు-జేంద్రవారు. దేవాజీవి-దేవలుఁడు. రూ. దేవాజీవుఁడు. దేవానాంప్రియము-మేఁక. —ప్రియుఁడు-మూ

ర్థుఁడు. దేవాలయము-గుడి.
దేవురు-తె. దైన్యము. క్రి. దేవురించు. కృ. దేవు
రింపు. సమా. —గొట్టు-దేబె, దీనుఁడు.
దేవెరి-వి. (దేవి) దొరసాని. రూ. దేవేరి.
దేశము-స. అనేకపట్టణములుగలగొప్పభూభాగము,
దేశరూపము-స. న్యాయము. [విలాతి.
దేశపాండ్య-కన్న. చిన్నజమీనుదారుఁడు.
దేశికుఁడు-స. 1.గురువు. 2.దేశముతిరుగువాఁడు.
దేశ్యము-స. దేశమునకుఁ దగినది.
దేహము-స. శరీరము, మేను.సమా. దేహయాత్ర-
*1.* తిండి, జీవనము. *2.* చావు.
దేహళి-స. కడప. రూ. గేహళి.
దేహి-స. దేహముగలవాఁడు, జీవుఁడు.

## దై

దైతేయుఁడు-స. దితికొడుకు, తొలివేల్పు. రూ.
దైత్యారి-స. విష్ణువు. [దైత్యుఁడు.
దైన్యము-స. దారిద్ర్యాదులచేఁ గలుగుదురవస్థ,దీన
త్వము. క్రి. దైన్యపడు. కృ. దైన్యపాటు.
దైర్ఘ్యము-స. నిడుపు.
దైవజ్ఞ-స. *1.* సోదెకత్తె. *2.* బల్లి.
దైవజ్ఞుఁడు-స. *1.* జోస్యుఁడు. *2.* గణకుఁడు.
దైవతము-స. *1.* వేలుపు. *2.* దేవతాసంబంధ
మైనది.
దైవము-స. *1.* దేవుఁడు. *2.* అదృష్టము. *3.* య
జ్ఞమునడపిన ఋత్విజు నలంకరించి కన్యనిచ్చి
చేయువివాహము.
దైవాఱు-తె. అతిశయించు. రూ. దయివాఱు.
దైవికము-స. దైవమువలనఁ గలిగినది.

## దొ

దొంకెన-చూ. డొంకెన.
దొంగ-తె. (వ్యు. దొంగువాఁడు) *1.* చోరుఁడు.
*2.* అరఁటిపువ్వులోనియొకతెగనివస్తువు.సమా.
—కూఁడు-ఇతరులెఱుఁగకతిన్నది.—గొడ్డు-
దొంగమేఁతమేయుపసరము. —పని-చోరత్వ
ము. —బీగము-మాఱుబీగము. —యిసుక-
క్రిందినీళ్లతెలియనీక మీఁదవ్యాపించినయిసుక.
—రేయి-అర్ధరాత్రము. —సొమ్ము-*1.* దొం
గిలించినసొమ్ము. *2.*దొంగయొద్దతీసినసొమ్ము.
క్రి. దొంగిలించు, దొంగిలు - దొంగతనము
దొంగు-తె. డాఁగు. రూ. డొంగు. [చేయు.
దొండ-వి. (తుండికేరి)ఎఱ్ఱనిపండ్లుగల ఒకతీఁగ.
దొండి-తె. తూఁటు, రంధ్రము. [*2.* దొంతి.
దొంతర-తె. (దొంతి+తరఁగ) *1.* పరంపర.
దొంతి-తె. *1.* ఒకటిపైనొకటినుంచినకుండలవరు
స. *2.* వరుస. [దొందడించు.
దొందడి-తె. (దొందు+దడి) సమ్మర్దము. క్రి.
దొందము-వి. (ద్వంద్వము) జత. రూ. దొందు.
దొంపు-తె. *1.* పొడవైనమడివరుస. *2.* తలనట్టు.
దొంబులిగొట్టు-తె. (దొందు + పులి + కొట్టు)
దొడవ-తె. కురూపి. [పిటికి.
దొడ్డ-తె. గొప్ప. రూ. దొడ్డు. క్రి. దొడ్డువాఱు.
దొడ్డి-వి. (ద్రోణి) *1.* పసులుమేయుకంచె. *2.*
పసులకొట్టము. *3.* పెరడు. సమా. —కట్టు-
చుట్టుకొల్లారు. —కాళ్లవాఁడు - మోకాళ్లవద్ద
విల్లువలె వంగినకాళ్లుగలవాఁడు.
దొత్త-తె. వ్రేలాడునది.
దొద్ద-తె. కొల్ల. సమా. —కత్తె-కొల్లపెట్టునది.
(పుం. —కాఁడు.) క్రి. —గొను, —పోవు.
దొద్దు-వి. (తుందిలుఁడు) బొజ్జగలవాఁడు.
దొన-వి. *1.* (తూణము) అమ్ములపొది. *2.* ద్రో
ణి, బండమీఁది నీటిపల్లము.
దొన్నియ-వి. (ద్రోణి) దొప్ప. రూ. దొన్నె.
దొప్ప-తె. త్రాగుటకనువుగా ఆకులతోఁ గుట్టినది.
రూ. దొప్ప. సమా. —రోగు-తేలియాడు.
దొబ్బ-తె. *1.* మాంసఖండము. *2.* ముద్ద.
దొమ్మ-తె. *1.*పశువులకువచ్చుతొమ్మడుచువ్యాధి.
*2.* కడుపులోని ఒక అవయవము.
దొమ్మర-తె. గడకట్టియాడిజీవించు ఒకజాతి. (దొ
మ్మరి, దొమ్మరిది)
దొమ్మి-తె. *1.* అందఱుకలియఁబడిచేయు యుద్ధ
ము. *2.* అందఱు కలియఁబడుట. *3.* సందడి,
దొమ్మిలాడు-తె. *1.* దొమ్మికయ్యముచేయు. *2.*
పెనఁగులాడు.
దొర-తె. *1.* రాజు. *2.* సేనాపతి. *3.* యోధుఁడు.

4. గొప్పవాఁడు. 5. సమానుఁడు.
దొరఁకుసన్నాసి-తె. నమ్మించి మోసపుచ్చికొనిపోవుదొంగ. రూ. దొరకోలుసన్నాసి.
దొరఁకొను-తె. 1. యత్నించు. 2. మొదలుకొను.
దొరకు-తె. లభించు. [సిద్ధించు. కృ. దొరకోలు.
దొరకొను-తె. 1. లభించు. 2. సంభవించు. 3.
దొరగడలు-తె. గొప్ప అల.
దొరయు-తె. 1. అంటు. 2. సమానమగు. 3. కలుగు. 4. జరుగు. 5. పోలు.
దొఱయు-తె. పొందు.
దొరలు-తె. 1. పొరలు. 2. పడు. 3. కలియు. 4. మాఱుకొను. 5. అనుభవించు. రూ. దొర్లు.
దొరవి-తె. కొలను. రూ. దొరువు.
దొరసాని-తె. రాణి.
దొరువు-తె. 1. నడబావి. 2. కొలను. సమా. దొరుగండి-దొరువుతూము. దొరువుపట్టెడ-గంతయెద్దులతోఁ క్రిందఁ దగిలించు పట్టెడ.
దొలుపు-తె. దొరలఁజేయు.
దొసఁగు-తె. 1. ఆపద. 2. విఘ్నము. 3. పొరపాటు. 4. తప్పు. రూ. దొసవు.

## దో

దో-స. చేయి. సమా. దోర్మధ్యము-పిడికిటిపోటు. దోర్యుగము-రెండుచేతులు.
దోఁకిస-తె. దోఁకుట. [తోత్రోయు. రూ. దోఁకు.
దోఁకు-తె. 1. నేలపైకసవుచెక్కు. 2. మోఁచేతి
దోఁకుడు-తె. దోఁకుట. సమా. —ఁబాఱ-గసవు చెక్కునట్టిపాఱ.
దోఁగు-తె. 1. మేనితోలు ఒలియు. 2. బిడ్డలు నేల చేతులాని మోఁకాళ్లతోనడచు. రూ. దోఁగియాడు, దోఁగాడు.
దోఁగురు-తె. దొంగతనము.
దోఁచు-తె. 1. దొంగిలించు. 2. అపహరించు.
దోఁటి-తె. పండ్లుకోసికొనుసాధనము. సమా. దోఁటమ్ము-దోఁటివంటి వంపు అలుఁగుగలబాణము, కర్ణికరము.
దోఁటు-తె. ఇచ్చు. [దోఁపుడు.
దోఁపిడి-తె. 1. దోఁచుకొనుట. 2. కొల్ల. రూ.
దోఁపు-తె. 1. చొప్పించు. 2. దోఁచుకొనుట. 3. కొల్ల. 4. పూర్ణానకము.
దోగ్ధ-స. 1. గొల్లవాఁడు. 2. దూడ. 3. కవిత్వము చెప్పి జీవించువాఁడు. 4. పిదుకువాఁడు.
దోగ్ధ్రి-స. ఈనినయావు.
దోణము-తె. 1. భుజమునకు బలమువచ్చుటకై త్రిప్పు ఉపకరణము. 2. మేకులుదిగఁగొట్టు సాధనము. రూ. దోణాము, ద్రోణము, ద్రోణాము.
దోదసి-వి. (ద్వాదశి) పక్షమందుపండ్రెండవతిథి.
దోదుమి-తె. ఒకయాయుధము. రూ. దోదుమ్మి.
దోని-వి. (ద్రోణి) 1. ధోన. 2. అరిణ. 3. కాలువతూము, సమా. దోనసము-అల్పశరము.
దోనె-వి. (ద్రోణి) 1. చిన్నపడవ. 2. అరిణ.
దోమ-తె. చీఁకటీఁగ.
దోమటి-తె. అన్నము.
దోము-తె. పసులుపాఱుకొనుట. [గూడు.
దోయి-వి. (ద్వయి) జత. క్రి. దోయికట్టు - జత
దోయిడి-తె. శూన్యము, రిత్త.
దోయిలి-తె. వంపఁబడినచేరలచేరిక, అంజలి. రూ. దోసిలి. క్రి. దోయిలించు.
దోర-తె. 1. రాశి. 2. ఎట్టిపాటినది. 3. ఒఱిగినది. సమా. —గల్లు-ఒడ్డగెడవు. —పాక-ఓరపాక. క్రి. దోరగిలు-1. కాయలు ఎట్టివాఱు. 2. వ్రాలు.
దోరణ-వి. (తోరణము) వాకిటఁగట్టు మామిడాకులు మున్నగునవి గ్రుచ్చినసరము. రూ. దోరణము. సమా. దోరణపుఁగమ్మి-ద్వారముమీఁది అడ్డకమ్మి. —ఁబట్టె-కపిలెచక్రముక్రింది అడ్డపలక. —సాటిరిక్క-అనూరాధ.
దోరము-చూ. దువారము.
దోరు-తె. 1. తొలఁగు. 2. చచ్చు. ప్రే. దోరుచు, దోరించు, దోర్చు-చెలమనీటిని తోడు.
దోల-స. డోల.
దోవతి-తె. మగవాని కట్టువస్త్రము.
దోష-స. 1. భుజము. 2. రాత్రి. సమా. దోషాకరుఁడు-చంద్రుఁడు. —చరుఁడు - 1. చంద్రుఁడు. 2. తొలివేల్పు.
దోషకము-స. దోసె.

దోషము-స. 1. తప్పు. 2. పాపము.(వి.దోసము) క్రి. దోషించు. సమా.దోషకారి-దోషముచేయువాఁడు. —జ్ఞుఁడు-1. విద్వాంసుఁడు. 2. వైద్యుఁడు. 3. దోష మెఱిఁగినవాఁడు.

దోషి-స. దోషముగలవాఁడు. (వి. దోసి.)

దోస-తె. కర్కటిలత.

దోసము-చూ. దోషము.

దోసి-చూ. దోషి.

దోసిలి-చూ. దోయిలి. క్రి. దోసిలించు.

దోసె-వి. (దోషకము) అట్టు.

దోహదము-స. 1. ఇచ్ఛ. 2.గర్భిణికిఁగలవేవిళ్లు. 3.ఎరువు.4.తరుగుల్మ లతాదులను అకాలమున పుష్పింపఁజేయు స్త్రీలపాదతాడనాదిక్రియ.(అశోకమునకు దోహదము పాదతాడనము,పొగడకు ముఖసీధువు. గోరంటకు ఆలింగనము. బొట్టుగునకు వీక్షణము. మామిడికి కరస్పర్శము. సంపెఁగకు ముఖరాగము. కొండగోఁగునకు సల్లాపము. వావిలికి ఊర్పు. మోరటికి పాట. సురపొన్నకు నవ్వు.) —లక్షణము-1. స్త్రీలవయస్సంధి. 2. గర్భము. సమా. దోహదవతి-వేవిళ్లుగల ఆఁడుది.

దోహనము-స. పాలుపిదుకుట.

దోహలము-స. ఉత్సాహము.

## దౌ

దౌ-తె. దూరము. రూ. దవు, దవ్వు, దౌవు.

దౌద-తె. తాలువు. రూ. దవుద.

దౌడు-హిం. 1. పరుగు. 2. జోడన.రూ. దవుడు.

దౌత్యము-చూ. దూత్యము.

దౌరు-తె. కాంతి. రూ. దవురు.

దౌర్జన్యము-స. చెడ్డతనము.

దౌర్భాగ్యము-స. దురదృష్టము.

దౌవారికుఁడు-స. ద్వారపాలకుఁడు.

దౌవు-చూ. దౌ.

దౌష్ట్యము-స. దుష్టత్వము.

దౌహిత్రుఁడు-స. దుహితకొడుకు.(స్త్రీ.దౌహిత్రి.)

దౌహృదము-స. వేవిళ్లు.

## ద్య

ద్యావాపృథువులు-స. మన్ను మిన్ను. (ఇట్లే ద్యావాభూములు. మొ.)

ద్యుతి-స. 1. కాంతి. 2. కిరణము.

ద్యుమణి-స. సూర్యుఁడు, చదలుమానికము.

ద్యుమ్నము-స. 1. ధనము. 2. బలము.

ద్యూతము-స. జూదము.

ద్యోతకము-స. ప్రకాశింపఁజేయునది.

ద్యోతనము-స. ప్రకాశించుట.

ద్యోతము-స. ప్రకాశము. క్రి. ద్యోతించు.

ధ్యోతితము-స. ప్రకాశింపఁబడినది.

## ద్ర

ద్రప్సము-స. 1. అడుగుపెరుగు. 2. నీటిబొట్టు.

ద్రవము-స. 1. తడి. 2. పరిహాసము. 3.పరుగు. 4. యుద్ధమునుండిపాఱుట. క్రి. ద్రవించు.

ద్రవిడము-స. 1. దక్షిణదేశము. 2. దక్షిణదేశభాష. రూ. ద్రావిడము.

ద్రవిణము-స. 1. ధనము. 2. బంగారు. 3. బలము.

ద్రవ్యము-స. 1. ధనము. 2.వస్తువు.

ద్రాక్ష-స.ఒకఫలలత; దానిపండు;కిస్మిస్ పండు. (వి.దాక)

ద్రాఘిష్ఠము-స.మిక్కిలిదీర్ఘము.

ద్రాబ-తె. 1. అసారము, అసారుఁడు. 2. అధమము,అధముఁడు.

ద్రావకము-స. 1. వస్తువులనుండితీయురసము. 2. బరువైనతాయి.

ద్రిండు-చూ. దిండు.

ద్రుఘణము-స. 1.ఇనుపగుదియ.2.గండ్రగొడ్డలి.

ద్రుడ్డు-చూ. దుడ్డు.

ద్రుణము-స. 1. కత్తి. 2. విల్లు. 3. తేలు.

ద్రుతము-స.1.త్వరితము.2.కరఁగినది. 3. జాఱినది. 4. వ్యాకరణమందు నకారము.

ద్రుపదము-స. బొందకొయ్య.

ద్రుమము-స. వృక్షము. రూ. ద్రువు.

ద్రుహిణుఁడు-స. బ్రహ్మ. రూ. ద్రుఘణుఁడు. (వ్యు. అసురులకు హింసచేయువాఁడు.)

ద్రూణము-స. 1. ఎఱ్ఱతేలు. 2. తేలు.

ద్రొబ్బు-తె. పడఁద్రోయు.

ద్రోణము-తె చూ.దోణము.స.1. తూము. 2.రేలు. 3. మాలకాకి
ద్రోణి-స. 1. చిన్నపడవ. (వి దోనె) 2. పసులు మేయు కంచె 3. కొండపల్లము. 4. అరిణ.
ద్రోవది-వి (ద్రౌపది) ద్రుపదరాజుకూఁతురు
ద్రోహము-స. 1 కీడుతలఁపు. 2. చంపనిచ్చ.
ద్రోహి-స. ద్రోహముగలవాఁడు.

## ద్వ

ద్వంద్వము-స.1 జత. 2.స్త్రీపురుషులజత. 3.ఇద్దఱొకరితో నొకరుచేయుయుద్ధము. 4. రహస్యము 5. శీతోష్ణాదులు
ద్వయము-స. 1. జత 2. రెండు.
ద్వయి-స జత (వి. దోయి)
ద్వాదశకము-స. పంద్రెండు. [దు-సూర్యుఁడు
ద్వాదశము-స. పంద్రెండవది. సమా ద్వాదశాత్ముఁ
ద్వాదశి-స.పక్షమందుపంద్రెండవతిథి.(వి దోదసి)
ద్వాపరము-స. 1. మూఁడవయుగము. 2. సందేహము.
ద్వారము-స. వాకిలి. 2 ఉపాయము. సమా.ద్వారపాలకుఁడు-వాకిటికావలివాఁడు —బంధము-వాకిలికమర్చిన ద్రూనిపట్టము. ద్వార్థితుఁడు-ద్వారపాలకుఁడు. రూ. ద్వార్థ్సుఁడు.
ద్వికము-స. 1 రెండు. 2. కాకి. (వ్యు. రెండు 'కా' లనుగలది ) 3. జక్కవ.
ద్విజము-స. 1. పక్షి. 2. పాము. 3.పల్లు. రూ. ద్విజన్మము. (వ్యు. రెండుపుట్టుకలగొన్నది )
ద్విజిహ్వము-స. పాము. (వ్యు. రెండునాల్కలు గలది.) డు. కొండెగాఁడు.
ద్విజుఁడు-స 1. బ్రాహ్మణుఁడు. 2. క్షత్రియుఁడు. 3. వైశ్యుఁడు.(వ్యు.జన్మించినపిదప ఉపాకర్మచే రెండవ పుట్టుకఁగొన్నవాఁడు.) రూ. ద్విజన్ముఁడు. సమా. ద్విజరాజు-1. చంద్రుఁడు. 2. గరుడుఁడు. 3. శేషుఁడు.
ద్వితయము-స. రెండు.
ద్వితీయ-స. 1. భార్య. 2 విదియ. 3.రెండవది.
ద్వితీయుఁడు-స. 1. కొడుకు. 2. రెండవవాఁడు.
ద్విపటి-స. 1. దుప్పటము. 2. దుప్పటి. (వ్యు. రెండుమడతలుకలది.)
ద్విపద-స. రెండుపాదములుగలపద్యము.
ద్విపము-స. ఏనుఁగు, రెంటఁద్రావుడు.
ద్విభాషి-స. రెండుభాషలుతెలిసినవాఁడు. దుబాసి.
ద్విరదము-స ఏనుఁగు. (వ్యు. రెండుదంతములు కలది) [కలది)
ద్విరసనము-స. పాము. (వ్యు. రెండునాలుకలు
ద్విరేఫము-స. భ్రమరము. (వ్యు. భ్రమరశబ్దమందు రెండురేఫములుకలది)
ద్విషత్తు-స. శత్రువు రూ. ద్విషుఁడు.
ద్వీపము-స. 1 పులితోలు. 2. దీవి. (వి. దీవి.) సప్తద్వీపములు : జంబూప్లక్షకుశ క్రౌంచశాకశాల్మలపుష్కరములు. సమా. ద్వీపవతి-నది.
ద్వీపి-స. 1. పులి. 2. చిఱుతపులి. 3. సముద్రము. (వ్యు. ద్వీపము కలది)
ద్వేషణుఁడు-స. శత్రువు.
ద్వేషము-స. పగ. క్రి ద్వేషించు.
ద్వేషి-స. ద్వేషముగలవాఁడు.
ద్వేష్ట-స ద్వేషించువాఁడు. [వాఁడు.
ద్వేష్యుఁడు-స. 1 పగవాఁడు. 2.పగఁగొనఁదగిన
ద్వైతము-స. 1. జీవాత్మ పరమాత్మలకు భేదము చెప్పెడి ఒకమతము. 2. ఒకవనము.
ద్వైపము-స. ద్వీపి చర్మముచేఁగప్పఁబడినరథము. 2. ద్వీపసంబంధమైనది.
ద్వైమాతురుఁడు-స. 1.వినాయకుఁడు. 2. జరాసంధుఁడు. (వ్యు. ఇద్దఱు తల్లులుగలవాఁడు)
ద్వ్యష్టము-స. రాగి, తామ్రము.

## ధ

ధట-స. కొయ్యత్రాసు. రూ. ధటము.
ధటి-స. 1. దట్టి. 2. గోఁచి.
ధటిని-స. నూలిమొలత్రాడు.
ధనంజయుఁడు-స. 1.అగ్ని. 2.అర్జునుఁడు.(వ్యు. ధనమును జయించువాఁడు.)
ధనము-స. 1. విత్తము. 2. ఆలమంద. సమా. ధనదుఁడు, ధనాధిపుఁడు- 1 కుబేరుఁడు.2.దాత.
ధని-స ధనముకలవాఁడు.
ధనిక-స. 1. మంచిఆఁడుది. 2. యౌవనవతి.

ధనికము-స. దనియాలు. [వాఁడు. 3. అప్పులవాఁడు.
ధనికుఁడు-స. 1. ధనముగలవాఁడు. 2. మంచి
ధనిష్ఠ-స. ఇరువదిమూఁడవనక్షత్రము.
ధనువు-స. 1. విల్లు. 2. తొమ్మిదవరాశి. 3. నాలుగుమూరలకొలఁది. రూ. ధనుస్సు. సమా. ధనుర్ధరుఁడు, ధనుష్మంతుఁడు-విలుకాఁడు.
ధన్య-స. 1. దాది. 2. ధన్యురాలు.
ధన్యుఁడు-స. పుణ్యవంతుఁడు. [3. మహేశ్వరుఁడు.
ధన్వంతరి-స. 1. దేవవైద్యుఁడు. 2. సూర్యుఁడు.
ధన్వము-స. 1. మెట్టనేల. 2. విల్లు. 3. నిర్జల
ధన్వి-స. 1. విలుకాఁడు. 2. నేర్పరి. [భూమి.
ధమని-స. 1. అవయవములకు గుండెనుండి నెత్తురు దీసికొనుపోవు నరము. 2. మెడ. 3. అగసాలెవాని ఊఁదుగొట్టము.
ధమనుఁడు-స. 1. అగ్ని. 2. కొలిమితిత్తినూఁదువాఁడు. 3. క్రూరుఁడు.
ధమ్మిల్లము-స. కొప్పు. (వ్యు. శిరస్సున ఊర్ధ్వముందుగాని అధోభాగమునఁగాని కట్టఁబడునది.)
ధర-స. భూమి. (వ్యు. ధరించునది.) సమా. ధరాధరము. 1. కొండ. 2. తాఁబేలు.
ధరము-స. 1. కొండ. 2. వెల. రూ. ధరాధరము.
ధరణము-స. 1. ధరించుట. 2. ఒకకొలత.
ధరణి-స. భూమి. రూ. ధారణి. సమా. ధరణీధరము-కొండ, నేలతాలుపు: —ధరుఁడు-1. రాజు. 2. శేషుఁడు. 3. విష్ణువు. —శ్వరుఁడు-రాజు. —సురుఁడు-బ్రాహ్మణుఁడు.
ధరించు-స. తాల్చు.
ధరిత్రి-స. భూమి.
ధర్త-స. ధరించువాఁడు.
ధర్తవ్యము-స. ధరింపఁదగినది.
ధర్మము-స. 1. పుణ్యము. 2. న్యాయము. రూ. ధర్మువు. 3. సామ్యము. 4. స్వభావము. 5. ఆచారము. 6. అహింస. 7. వేదోక్తవిధి. 8. విల్లు. సమా. ధర్మధ్వజి-టాఁటదమ్మఁడు. —రాజు-1. యుధిష్ఠిరుఁడు. 2. యముఁడు. 3. బుద్ధదేవుఁడు. ధర్మాధికరణము-న్యాయవిచారణస్థలము. ధర్మాధితుఁడు - న్యాయమువిచారించువాఁడు. రూ. ధర్మాధికారి. ధర్మాసనము-ధర్మాధికారికూర్చుండుపీఠము.
ధర్మి-స. ధర్మముగలది.
ధర్ముఁడు-స. 1. యముఁడు. 2. సోమయాజి.
ధర్మ్యము-స. ధర్మమునుండి తొలఁగనిది.
ధర్షణము-స. 1. తిరస్కరించుట. 2. బెదరించుట.
ధర్షణి-స. ఱంకుటాలు. [క్రి. ధర్షించు.
ధవళ-స. ఆవు. [నిది.
ధవళము-స. 1. ఆఁబోతు. 2. తెల్లనిది. 3. చక్క
ధవిమ-స. తెలుపు.
ధవిత్రము-స. జింకతోలు విసనకఱ్ఱ.
ధవుఁడు-స. 1. పెనిమిటి. 2. రాజు.

## ధా

ధాటి-స. దండయాత్ర. (వి. దాడి)
ధాత-స. 1. బ్రహ్మ. 2. పదియవసంవత్సరము. 3. ధరించువాఁడు. 4, రక్షించువాఁడు.
ధాతువు-స. 1. వాతాది. ఇవిమూఁడు : వాత పిత్త శ్లేష్మములు. 2. వసాది. ఇవిఏడు : వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్లము. 3. శిలావికారము (కావుఱాయి) 4. పృథివ్యాది. (పంచభూతములు) 5. శబ్దాది (గుణములు) [చునది.
ధాత్రి-స. 1. భూమి. 2. దాది. 3. తల్లి. 4. ధరిం
ధాత్రేయి-స. 1. దాది. 2. భూమి.
ధానుష్కుఁడు-స. విలుకాఁడు.
ధాన్యము-స. 1. కొలుచు. నవధాన్యములు: గోధుమలు, యవలు, పెసలు, సెనగలు, కందులు, బొబ్బరలు, మినుములు, నువ్వులు, ఉలవలు. 2. దనియాలు. సమా. ధాన్యామ్లము-పులియఁబెట్టిన
ధాన్యాకము-స. దనియాలు. [కడుగునీరు.
ధామము-స. 1. ఇల్లు. 2. చోటు. 3. కిరణము. 4. కాంతి. 5. ప్రభావము. 6. మేను. 7. పుట్టువు. సమా. ధామనిధి-సూర్యుఁడు.
ధార-స. 1. నీటిచాలు. 2. ఆయుధముల వాదర. 3. చిల్లి. 4. అశ్వగతి. (ఇవి ఐదు: ఆస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము.) 5. ప్రవాహము. 6. పరంపర. క్రి.—పోయు. - చేతనీరుగాని దత్తముచేయు. సమా.

ధారాధరము-1. మేఘము. 2. కత్తి.
ధారణ-స. 1. భగవంతునం దేకాగ్రచిత్తము. 2. మేర. 3. వస్తువినిమయము.
ధారణి-స. భూమి. (వ్యు. సర్వమునుధరించునది.) రూ. ధారుణి, ధరణి.
ధారాటము-స. 1.గుఱ్ఱము. 2. వానకోయిల.
ధారాళము-స. అడ్డపాటులేనిది.
ధార్తరాష్ట్రము-స. నల్లనిముక్కు కాళ్లు గల హంస.
ధార్మికుఁడు-స. 1. పుణ్యాత్ముఁడు.2.విలుకాఁడు.
ధార్యము-స. ధరింపఁదగినది.
ధార్ష్ట్యము-స. దిట్టతనము.
ధావకుఁడు-స. చాకలి.
ధావనము-స. 1. పరుగు. 2. శుద్ధి.
ధావళ్యము-స. తెలుపు.

## ధి

ధిక్కారము-స. తిరస్కారము. రూ. ధిక్క్రియ, ధిక్కృతి.
ధిషణ-స. బుద్ధి.
ధిషణుఁడు-స. బృహస్పతి.

## ధీ

ధీ-స. బుద్ధి. సమా. ధీంద్రియము-జ్ఞానేంద్రియము. ధీమంతుఁడు-1. బుద్ధిమంతుఁడు. 2. విద్వాంసుఁడు.
ధీర-స. 1. వ్యంగ్యముగా కోపప్రకాశముచేయు నాయిక. 2. ధీరురాలు. సమా. ధీరాధీర-వ్యంగ్యావ్యంగ్యముగా కోపప్రకాశముచేయునాయిక.
ధీరుఁడు-స. 1. విద్వాంసుఁడు. 2. ధైర్యముగలవాఁడు. 3. స్వాతంత్ర్యముగలవాఁడు.
ధీవరుఁడు-స. జాలరి.

## ధు

ధుంధుమారము-స. 1. కఱదూపము. 2. పట్టుపురుగు.
ధుతము-స. 1. కదలింపఁబడినది. 2. విడువఁబడినది. రూ. ధూతము.
ధుత్తూరము-స. ఉమ్మెత్త.
ధుని-స. ఏఱు.
ధుర-స. భారము. సమా. ధురంధరము-బరువుమోసెడియెద్దు. పుం. ధురంధరుఁడు.
ధురీణము. —పై— (పుం. ధురీణుఁడు)
ధుర్యము.—పై— (పుం. ధుర్యుఁడు)

## ధూ

ధూంక్ష్మము-స. తెల్లకాకి.
ధూతము-చూ. ధుతము.
ధూపనము-స. కదలించుట.
ధూపము-స. వాసనగలపొగ. (వి. దూపము)
ధూపాయితము-స.తపింపఁజేయఁబడినది,తప్తము.
ధూపితము-స.తప్తము. 2.ధూపమువేయఁబడినది.
ధూమము-స. పొగ. సమా. ధూమకేతువు-1.తోఁకచుక్క, ఉత్పాతము. 2. అగ్ని. —యోని-మేఘము.
ధూమలము-స. నలుపుమించఁగలిసినయెఱుపు.రూ. ధూమ్రము.
ధూమిక-స. మూడమంచు.
ధూము-హిం.వాంతిభేదిజాడ్యము,కలరా.
ధూర్జటి-స. శివుఁడు. (వ్యు. భారమగు జడలుగలవాఁడు.)
ధూర్తుఁడు-స. 1. జూదరి. 2. మోసకాఁడు. రూ. ధూర్తు. (స్త్రీ. ధూర్త, ధూర్తురాలు.)
ధూర్వహము-స. బరువుమోసెడియెద్దు. (పుం. ధూర్వహుఁడు.)
ధూళి-స. దుమ్ము. (వి. దూళి.) సమా. —ధ్వజుఁడు-వాయువు.
ధూసరము-స. 1. బూడిదరంగు. 2. గాడిద.

## ధృ

ధృతము-స. ధరింపఁబడినది.
ధృతరాష్ట్రుఁడు-స. 1. దుర్యోధనునితండ్రి. 2. ఒక సర్పరాజు.3.రాజు.
ధృతి-స. 1. ధరించుట. 2. ధైర్యము. 3. సంతోషము.4.సౌఖ్యము.
ధృష్టుఁడు-స. దిట్టతనముకలవాఁడు. రూ.ధృష్టువు.

## ధే

ధేనుక-స. 1. లేఁగటియావు. రూ. ధేనువు. 2. ఆఁడేనుఁగు. 3. ఆఁడుగుఱ్ఱము. 4.చిన్నకత్తి. 5. పార్వతి.
ధేనుకము-స. చీరపేను.
ధైర్యము-స. ధీరత్వము.
ధైవతము-స. సప్తస్వరములలో ఆఱవది.

## ధో

ధోరణము-స. వాహనము.
ధోరణి-స. 1. పద్ధతి. 2. పంక్తి.

## ధౌ

ధౌతము-స. కడుగఁబడినది.
ధౌరితకము-స. బోధన. రూ. ధోరితకము.
ధౌరేయము-స. బరువుమోసెడియెద్దు. (పుం. ధౌరేయుఁడు.)
ధౌర్త్యము-స. ధూర్తత్వము.

## ధ్యా

ధ్యాత-స. ధ్యానించువాఁడు.
ధ్యాతము-స. ధ్యానింపఁబడినది.
ధ్యాతవ్యము-స. ధ్యానింపఁదగినది, ధ్యేయము.
ధ్యానము-స. చాంచల్యములేక మనసున భగవంతుని తలఁచుట. క్రి. ధ్యానించు.
ధ్యేయము-స. ధ్యానింపఁదగినది.

## ధ్రు

ధ్రువము-స. 1. ఊహ. 2. నిశ్చయము. 3. దిక్కులకొన. 4. పదునాలుగక్షరములకాలము గల తాళము. 5. కదలనిది. 6. నిలుకడగలది.
ధ్రువుఁడు-స. 1. ఉత్తానపాదునికొడుకు. 2. విష్ణువు. 3. శివుఁడు.

## ధ్వ

ధ్వంసము-స. నాశము.
ధ్వంసితము-స. నాశముచేయఁబడినది.
ధ్వజము-స. 1. టెక్కెము. 2. టెక్కెపుకంబము. 3. గుఱుతు. 4. గర్వము.
ధ్వజిని-స. సేన.
ధ్వని-స. 1. శబ్దము. 2. వ్యంగ్యప్రధానశబ్దము. క్రి. ధ్వనించు.
ధ్వనితము-స. శబ్దించునది.
ధ్వస్తము-స. 1. నశించినది. 2. జాఱినది.
ధ్వాంక్షము-స. 1. కాకి. 2. కొక్కెర. 3. కోకిల.
ధ్వాంతము-స. చీఁకటి.
ధ్వానము-స. ధ్వని.

## న

న-తె. సప్తమ్యేకవచనప్రత్యయము.
నంకు-తె. నేలనుకోరాడు.
నంగ, నంగనాచి-తె. 1. వడ్లచిలుక. 2. దిట్టయయ్యుపైకేమియు తెలియనిదానివలె నుండునది.
నంగి-తె. ముక్కుతో మాటాడుట.
నంగు-తె. ముక్కుతో మాటాడు.
నంజ-తె. పల్లపుపంటనేల, మాగాని.
నంజు-తె. 1. (కూరలు) తిను. 2. విషము. 3. నెత్తురుచచ్చితెల్లఁబాఱుట. క్రి. నంజుపాఱు.
నంజుడు-తె. మాంసము. సమా. —తిండి - 1. రక్కసుఁడు. 2. మాంసముతినువాఁడు.
నంటు-తె. 1. స్నేహము. 2. స్నేహితుఁడు. రూ. నంటుకాఁడు. (స్త్రీ. నంటుకత్తె.)
నందకము-స. 1. విష్ణుఖడ్గము. 2. సంతోషించునది.
నందన-స. 1. కూఁతురు. 2. ఇరువదియాఱవ సంవత్సరము.
నందనము-స. 1. ఇంద్రునియుద్యానవనము. 2. ఉద్యానవనము.
నందనుఁడు-స. 1. కొడుకు. 2. సంతోషించువాఁడు.
నంది-స. 1. శివునివృషభము. 2. వృషభము.
నందివర్ధనము-వి. (నంద్యావర్తము) ఒకపూలచెట్టు. స. పర్వదినము.
నంద్యావర్తము-స. 1. పడమటఁదక్కఁ దక్కిన మూఁడుదిక్కులవాకిళ్లుగల రాజగృహము. 2. నందివర్ధనము.
నంబి-తె. విష్ణుపూజకుఁడు.
నంబెరుమాళ్లు-అఱ. శ్రీరంగనాయకుఁడు.
నకనకలు-తె. కార్శ్యము. క్రి. —పడు, నకనకలాడు-కృశించు.
నకలు-హిం. ఒకదానినిచూచి వ్రాసినది.
నకిషీ-హిం. అలంకారపుపని.
నకీబు-హిం. వెండిబెత్తమువాఁడు.
నకులము-స. ముంగిస.
నక్క-వి. (నాక్రము) జంబుకము.
నక్కు-తె. 1. ఒదుఁగు. 2. మ్రానియతుకు. 3. బంగారుబిల్ల. 4. బంగరునఱుకఁగా నడుమ నగపడు నిగ్గు. 5. నాఁగటికఱ్ఱు. సమా. నక్కిళ్లు-

(నక్క+కీళ్లు) ప్రక్కపండ్లకీళ్లు. [వస్త్రము.
నక్తకము-స. 1. చినిఁగినవస్త్రము. 2. మాసిన
నక్తము-స. రాత్రి. సమా. నక్తంచరము-గుడ్లగూబ.
—చరుఁడు-రాక్షసుఁడు, రేద్రిమ్మరి.
నక్రము-స. 1. అడ్డగమ్మి. 2. త్రొక్కుడుగమ్మి.
3. మొసలి.
నక్షత్రము-స. రిక్క. (వ్యు. నశింపనిది) ఇవి
ఇరువదియేడు : అశ్విని, భరణి, కృత్తిక, రోహి
ణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆ
శ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి,
విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ,
ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము,
పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి. సమా. నక్ష
త్రమాల-1. ఇరువదేడు ముత్యములుగ్రుచ్చిన
యొంటిపేఁటహారము. 2. ఇరువదేడు పద్యము
లుగల ఖండకావ్యము. నక్షత్రేశుఁడు-చంద్రుఁ
డు, రిక్కరాయఁడు.
నఖము-స. గోరు. రూ. నఖరము. సమా. నఖాయు
ధము-కోడి. రూ. నఖరాయుధము. నఖోత్పాటని-
నగ-తె. భూషణము. [గోరుగల్లు.
నగదు-హిం. నాణెరూపమైనసొమ్ము.
నగము-స. 1. కొండ. 2. చెట్టు. (వ్యు. వెళ్లనిది.)
రూ. అగము. సమా. నగధరుఁడు - విష్ణువు,
గట్టుతాలుపు. —వైరి-ఇంద్రుఁడు.
నగరము-స. పట్టణము. రూ. నగరి. [రూ. నవరు.
నగరు-తె. 1. రాజగృహము. 2. దేవగృహము.
నగవు-తె. హాసము. రూ. నవ్వు.
నగారా-హిం. పెద్ద ఢంక.
నగు-తె. 1. హసించు. 2. అపహసించు. 3. కృ.
హాసము. రూ. నవ్వు. కృ. నగు, నగవు, నవ్వు.
సమా. —బాటు-అపహాసము.
నగ్గు-తె. నుగ్గు. [రూ. నగ్న.
నగ్నిక-స. 1. కన్యక. 2. దిసమొలయాఁడుది.
నగ్నుఁడు-స. 1. బుద్ధదేవుఁడు. 2. దిసమొలవాఁడు.
నచ్చిక-తె. విశ్వాసము. రూ. నచ్చిగ.
నచ్చు-తె. 1. నమ్మి. 2. ఆలస్యము. 3. బాధ.
సమా. —కాఁడు-1. అలసుఁడు. 2. బాధకుఁ
డు. —కుప్ప, —గొట్టు-బాధకుఁడు. క్రి. —
నచ్చుపెట్టు.
నజరు-హిం. కానుక.
నజ్జు-తె. 1. అణువు. 2. మిక్కిలినలఁగినది. రూ.
నఱుజు.
నటనము-స. 1. నాట్యము. 2. కపటవర్తనము.
నటవాలు-తె. రేచితము. రూ. నట్వాలు.
నటి-స. 1. వేశ్య. 2. నట్టువునిభార్య. (పుం. నటుఁడు)
నటించు-స. 1. నర్తించు. 2. వర్తించు. 3. కపట
నట్ట-తె. పాచిక. [ముగా వర్తించు.
నట్టనడుము-తె. (నడుము+నడుము) సరిమధ్యము.
నట్టు-తె. 1. వాసస్థానము. 2. స్థానము. 3. ఆల
స్యము. 4. ఆటంకము. 5. నట్టువుఁడు. సమా.
—పులుఁగు-నెమలి, నర్తనప్రియము. నట్టువొ
జ్జ-నాట్యోపాధ్యాయుఁడు.
నడ-తె. 1. గమనము. 2. ప్రవర్తనము. రూ.
నడక. సమా. —గఁడు-(నడ+కాఁడు) గు
ఱ్ఱము. —జోదు-కాలిబంటు. —దివియ-
దివ్వటీ. —బావి-నడచుటకుతగిన మెట్లుగల
బావి, డిగ్గియ. క్రి. —గొట్టు-నిలుచు, ఉండు.
—యాడు-1. సంచరించు. 2. చలించు.
నడచు-తె. 1. గమనించు. 2. ప్రవర్తించు. రూ.
నడుచు. ప్రే. నడపు, నడుపు. కృ. నడక,
నడత, నడవడి. క్రి. నడతెంచు-(నడచు+
తెంచు) నడచు.
నడత-తె. ప్రవర్తనము, నడవడి. రూ. నడితి, నడ్తి.
నడవ-తె. 1. తలవాకిటికిని లోపలివాకిటికినినడిమి
చోటు. 2. సేతువు. 3. మార్గము. [నడవడి.
నడవడి-తె. నడత, చరిత్రము. రూ. నడవడిక,
నడి-తె. నడుముశబ్దమునకు సమాసమందువచ్చు
రూపము. రూ. నడు. సమా. —కట్టు - బిగికై
నడుమునఁ గటుకొనుకట్టు, సారసనము.
—త్రాడు-ఏనుఁగునడుమునఁగట్టుత్రాడు. కక్ష్య.
నడికిరేయి-అర్ధరాత్రము. రూ. నడురేయి. నడి
ప్రేలు-మధ్యమ.
నడుకు-తె. 1. కంపించు. 2. కృ. కంపము. క్రి.
నడుకొను.
నడుచు-చూ. నడచు.
నడుము-తె. 1. కౌను. 2. మధ్యభాగము. రూ.

నడుమ. సమా. నడుమంతరము-*1*. కొను. *2*. మధ్యకాలము. *3*. మధ్యకాలమునఁ గలిగినది. క్రి. నడుముకట్టుకొను-సిద్ధపడు. రూ. నడుమంత్రము,

నడ్డి-తె. *1*. పూర్వకాయము వెనుకకు వంగియుండుట. (వ్య. గూను) *2*. చప్పట. సమా. —గుంట-కుకుందరము. —ముక్కువాఁడు-అవటీటుఁడు. [తైనది.

నతము-స. *1*. వంగినది. *2*. వంకరైనది.*3*.లోఁ

నతి-స. మ్రొక్కు.

నత్త-తె. గుల్లయందు పురుగు.

నత్తి-తె. తడఁబడుచుమాటాడువ్యాధి. సమా. —వాఁడు-నత్తిగలవాఁడు, ఆక్షేపకుఁడు.

నత్తు-తె. *1*. తడఁబడుచుమాటాడు. కృ. నత్తి. *2*. ఆఁడువారి ముక్కుపోఁగు.

నదము-స. పడమరగాఁబాఱెడి యేఱు. *2*.మడుపు. *3*. సముద్రము. *4*. మోరఁత.

నది-స. *1*. ఏఱు. *2*. ఆమడకుమీఱిపాఱెడియేఱు. సమా. నదీమాతృకము-ఏటినీళ్లచేపండెడుపైరు గలదేశము.

నద్ధము-స. *1*. కట్టఁబడినది. *2*. పైకెత్తఁబడినది.

నన-తె. *1*. పూవు. *2*. మొగ్గ. *3*. చిగురు. క్రి. ననయు, ననుచు. సమా. —ఁబోఁడి-అలరుఁబోఁడి. —కారు-వసంతము. —నీరు-మకరందము, తేనె. —విలుకాఁడు, —విలుతుఁడు-మదనుఁడు.

ననయు-తె. *1*. పూచు. *2*. చిగిరించు.

ననుఁబ్రాయి-తె. (నాను+ప్రాయి) చక్కగా ఉడుకనిబియ్యము. రూ. నన్బ్రాయి,

ననుచు-తె. *1*. పూచు. *2*. చిగిరించు. *3*. మొగ్గయెత్తు. *4*. అతిశయించు. *5*.అనురాగమొందు. *6*. ఇంపగు. కృ. ననుపు.

ననుపు-తె. *1*. అనురాగము. *2*. అతిశయము. *3*. ఇంపు. సమా. —కత్తె-*1*. ప్రియురాలు. *2*. విటి. —కాఁడు-*1*. ప్రియుఁడు. *2*. విటుఁడు. క్రి. —పడు-స్నేహపడు.

నన్న-తె. కుఱుచ.

నన్నూఱు-తె. (నాలుగు+నూఱు) చతుశ్శతము.

నపుంసకుఁడు-స. పేడివాఁడు, షండుఁడు.

నప్త-స. *1*. మనుమరాలు. రూ. నప్త్రి. *2*. మనుమఁడు. *3*. ముమ్మనుమఁడు.

నభము-స. *1*.ఆకాశము. *2*.మేఘము.రూ.నభస్సు. సమా. నభస్వంతుఁడు-వాయువు.

నమనము-స. వంగుట.

నమలు-తిను.

నమసితుఁడు-స. అర్చితుఁడు.

నమస్కారము-స. మ్రొక్కు. రూ. నమస్క్రియ,నమస్కృతి. క్రి. నమస్కరించు.

నమస్య-స. పూజ, సపర్య.

నమస్సు-స. నమస్కారము.

నమించు-స. నమస్కరించు.

నమితము-స. వంగినది. [లి, నెమ్మి, నెమ్మిలి.

నమిలి-తె.మయూరము.రూ. నెమలి, నమ్మి,నెమ్మి

నముచిసూదనుఁడు-స. ఇంద్రుఁడు.

నమూనా-హిం. మాదిరి.

నమేరువు-స. సురపొన్నచెట్టు. [నమ్మిగ.

నమ్మకము-తె. విశ్వాసము, నచ్చిక. రూ. నమ్మిక,

నమ్మి-చూ. నమిలి.

నమ్మిక-చూ. నమ్మకము. [నమ్మిగ.

నమ్ము-తె. విశ్వసించు. కృ. నమ్మకము, నమ్మిక.

నమ్రము-స. వంగినది, నతము.

నయ-తె. అందము. రూ. నయము. సమా. —గారము-*1*. మృదుత్వము. *2*. మృదువచనము. —గారి-మృదుత్వము కలవాఁడు.

నయనము-స. *1*. కన్ను. *2*. పొందించుట.

నయము-తె. *1*. లాభము. *2*. నునుపు. *3*. మృదుత్వము. *4*. అందము. *5*. చౌక. స. *1*. నీతి. *2*. పొందించుట. క్రి. నయించు.

నర-తె. *1*. వెండ్రుకలయందుఁగలుగు తెలుపు.*2*. తెల్లఁబాఱిన వెండ్రుక. రూ.నరపు.క్రి.నరయు.

నరకుఁడు-తె. దుష్టుఁడు. [నది) రూ.నారకము.

నరకము-స. దుర్గతి. (పాపముచేసి అనుభవించు

నఱకు-తె. *1*. ఖండించు. *2*. కృ. నఱకుడు.రూ.

నఱకుడు-తె.ఖండనము.రూ.నఱుకుడు. [నఱుకు.

నరగ-తె. భేరి. రూ. నరగజము.

నరపు-తె. నర. రూ. నరుపు. సమా. నరపగడ్డ

ము, నరపమీనము. మొ.)
నరము-తె. నాడి. [నరియు. కృ. నరపు, నరుపు.
నరయు-తె. ముదిమిచే వెండ్రుకలు తెల్లనగు. రూ.
నరవ-తె. కొండత్రోవ.
నఱవ-తె. అఱవ, సాధువుకానియావు.
నరాజి-తె. కత్తి. రూ. నరాజీ. నారాజి, నారాజీ.
నరియఁడు-తె. నక్క.
నరుఁడు-స. 1. మనుష్యుఁడు. 2. అర్జునుఁడు. 3. ఒకఋషి. సమా. నరపాలుఁడు-రాజు. (ఇట్లే నరపతి. మొ.)—వాహనుఁడు-కుబేరుఁడు.—సింహుఁడు-వి. నరసింగఁడు. నరేంద్రుఁడు-1. రాజు. 2. పాములవాఁడు.
నఱుజు-తె. అణువు. రూ. నజు.
నఱుమాడు, నఱుము-తె. పొడిచేయు.
నర్తకి-స. 1. ఆటకత్తె. 2. ఆఁడేనుఁగు.
నర్తకుఁడు-స. నట్టువుఁడు. 2. పాములవాఁడు. 3. ఆడెడువాఁడు.
నర్తనము-స. నటనము, ఆట. క్రి. నర్తించు, నర్తిలు, నర్తిల్లు. సమా. నర్తనప్రియము-నెమలి.
నర్మము-స. పరిహాసము. సమా. నర్మసఖుఁడు-వే
నర్మిలి-తె. అపేక్ష. రూ. అర్మిలి. [డుకచెలికాఁడు.
నల్టి-తె. ప్రయాసముచే పిదుకఁదగినయావు. 2.
నల-చూ. నల్ల. సమా. నలమేనిదొర-విష్ణువు. [ఎద్దు.
నలఁక-తె. 1. వ్యాధి. 2. శ్రమము. 3. బాధ. రూ. నలఁకువ, నలుకువ.
నలఁగు-తె. 1. నలియగు. 2. పీడితమగు. 3. చెడు. 4. శ్రమపడు. కృ. నలఁక, నలఁకువ,
నలఁగుడు-తె. పీడనము. [నలఁగుడు.
నలఁచు-తె. నలఁగఁజేయు.
నలకూబరుఁడు-స. కుబేరునికొడుకు.
నలదము-స. 1. వట్టివేరు. 2. పూఁదేనె.
నలి-తె. 1. రోగము. 2. పొడి. 3. నలఁగినది. 4. సన్నము. 5. అత్యంతము. 6. యోగ్యము. సమా. —గొట్టు-తచ్చము. —తిండి-చిఱుతిండి. [నలికిఁచు.
నలికండ్లపాము-తె. రక్తపుచ్ఛిక. రూ. నలికిరి,
నలికము-తె. సన్నఁదనము.
నలిగులి-తె. మిక్కిలి నలఁగినది.
నలినము-స. 1. తామర. 2. నీరు. [మరతీఁగ.
నలిని-స. 1. తామర. 2. తామరకొలను. 3. తా
నలియు-తె. నలఁగు,
నలు-తె. సమాసమందు నాలుగునకు వచ్చురూపము. సమా. —గడ-నాలుగుప్రక్కలు. —గురు-నాలుగుమంది. రూ. నలువురు, నల్గురు, నల్వురు. —తుము-నాలుగుతూములు. రూ. నల్తుము. —వ-(నాలుగు+వా) బ్రహ్మ, చతుర్ముఖుఁడు.—వంద్రు-(నాలుగు+పదుండ్రు) నలువది మంది. —వది-(నాలుగు+పది) నాలుగుపదులు. రూ. నల్వది. —పాల-చుట్టు కొల్లారు.
నలుఁగు-తె. 1. నలియగు. రూ. నలఁగు. ప్రే. నలుచు, నలుపు. 2. ఒడలురుద్దుకొననూఱిన సుగంధద్రవ్యములపిండి, ఉద్వర్తనము. 3. స్నానమప్పుడు వధూవరులకు నలుఁగుపిండి
నలుకువ-చూ. నలఁక. [పెట్టుట.
నలుచు-తె. నలియఁజేయు. రూ. నలుపు.
నలువు-తె. 1. ఒప్పిదము. 2. సామర్థ్యము.
నలుసు-తె. రేణువు.
నల్ల-తె. 1. నెత్తురు. 2. వి. (నీలము) నలుపు. సమా. —గ్రుడ్డు-కంటిలోనినల్లభాగము, కనీనిక. —చ్చిగాఁడు-(నల్ల+లచ్చనము+కాఁడు) భరద్వాజపక్షివంటి ఒక చిన్నపిట్ట.—ద్రావుడు-రక్కసుఁడు, అస్రపుఁడు. నల్లనయ్య-కృష్ణుఁడు, కఱివేల్పు. —నలువతాలుపు-బలరాముఁడు, నీలాంబరుఁడు.
నల్లవో-తె. ఔరా. రూ. నల్లవో.
నల్లి-తె. (నల్ల+ఇ) పడకలోనుండి నెత్తురుత్రావు పురుగు, మత్కుణము.
నల్లిండ్లు-తె. (నల్ల+ఇండ్లు) అగ్రహారము.
నల్లిక-తె. నలికండ్లపాము.
నల్లె-తె. జేన.
నల్లేరు-తె. ఒకతెగతీఁగ, వజ్రవల్లి. రూ. నల్లెరు.
నవ-తె. దురద. రూ. నవ్వ.
నవఁత-తె. 1. నవయుట. 2. దుఃఖము.
నవకము-తె. మృదుత్వము. స. తొమ్మిది.
నవక్షారము-స. నవాసారము.

నవగోజ-తె. పెద్దగుడారము.
నవతి-స. తొంబది.
నవనము-స. స్తోత్రము.
నవనీతము-స. అప్పుడుచిలికియెత్తినవెన్న.
నవమము-స. తొమ్మిదవది.
నవమాలిక-స. విరజాజి. [మ్మిదవది.
నవమి-స. 1. పక్షమందు తొమ్మిదవతిథి. 2. తొ
నవము-స. 1. స్తోత్రము.2.క్రొత్త. [కృ.నవఁత.
నవయు-స. రోగాదులచే కృశించు. 2.శుష్కించు,
నవరు-చూ. నగరు, [(Novel)
నవల-తె. ఆఁడుది. రూ. నవలా. ఆం. చిత్రకథ.
నవారు-హిం. మంచమున కల్లు నూలు పట్టె.
నవాసారము-వి. (నవక్షారము) ఒకదినుసుఉప్పు.
నవి-తె. కరగోదపెట్టుటకు త్రవ్విన నిడుపాటి
నవీనము-స. క్రొత్త. [పల్లము.
నవుకరి-హిం. కొలువు. రూ. నౌకరి.
నవుకరు-హిం. కొలువుకాఁడు. రూ. నౌకరు.
నవ్యము-స. 1. నూతనము. 2. నుతింపఁదగినది.
నవ్వు-తె. 1. హసించు. 2. వికసించు. 3. పరి హసించు. 4. అపహసించు. రూ. నవు,నగు, కృ. 5. హాసము. 6. వికాసము. 7. పరిహాసము. 8. అపహాసము. రూ. నగవు, నవు, నౌ సమా. —ఁబాటు-నగుఁబాటు. రూ. నవుఁబాటు. —టాల-పరిహాసము. రూ. నవ్వులాట. నవ్వులబండి - నవ్వెడుస్వభావము కలవాఁడు, [—కలది.
నశించు-స. నాశమగు.
నశ్వరము-స. నశించునది.
నష్టము-స. 1.నాశమొందినది.2.మఱుఁగుపడినది.
నష్టి-స. 1. నాశము. 2. ద్రవ్యనాశము.
నస-తె. 1. దురద. 2. ఉపద్రవము. సమా. —గూఁటి-కామోద్రేకముకలది.—గూఁడు-కామోద్రేకము. స. ముక్కు. రూ. నాసిక.
నసిమిరి-తె. దురద.
నసుకు-తె. 1. అసత్యవచనము.
నళ-స. ఏఁబదియవసంవత్సరము.

## నా

నా-తె. నేను శబ్దమునకు ప్రాతిపదికము.
నాంది-స.1.పెద్దలు చేయు ఆశీర్వాదము. 2.నాటక ప్రారంభమున జరపు మంగళము. 3. భేరి. సమా. నాందీకరుఁడు - 1. ఆశీర్వాదముచేయువాఁడు.2.భేరివాయించువాఁడు.రూ.నాందీవాది.
నాఁగలి-తె.దున్నుసాధనము, లాంగలము. రూ. నాఁగెలు, నాఁగేలు. సమా. నాఁగటిచాలు పేరి యతివ-సీత.—చిప్ప,—దుంప-మడకతుండు. —జోదు-బలరాముఁడు, హలాయుధుఁడు.
నాఁగు-తె. ధాన్యమునకు వడ్డిగానిచ్చు ధాన్యము.
నాఁచు-తె. 1. అపహరించు. రూ. నాఁచికొను. కృ. నాఁచికోలు. 2. తీఁగపాఁచి.
నాఁడు-తె. 1. ఆకాలము.2.ఆదినము.3.కాలము.
నాఁడెము-చూ. నాణెము.
నాకబలి-స. నాగవల్లి.
నాకము-స. 1. స్వర్గము. 2. ఆకాశము. సమా. నాకేశుఁడు-ఇంద్రుఁడు. నాకౌకసుఁడు-వేలుపు.
నాకిని-స. దేవతాస్త్రీ.
నాకు-తె. నాలుకతో రుచిచూచు, లేహనముచేయు.
నాక్రము-స. నక్రముఖమువంటిముఖముగలనక్క.
నాగ-తె. 1. పూజ్యమైన. 2. పెద్ద. సమా. నాగబెత్తము-మంత్రపూతమైనబెత్తము.నాగపసాని-నాగవల్లినడపుముత్తైదువ. రూ. నాపసాని. నాగవల్లి - పెండ్లిలో నాలవనాఁడు జరపు శుభకార్యము. రూ. నాగవల్లి.
నాగఁడు-వి. శేషుఁడు. (అష్టనాగములు : అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్మఁడు, మహాపద్మఁడు, కర్కోటకుఁడు.) సమా. నాగపాశము-వరుణుని యాయుధము. —లోకము-పాతాళము. —స్వరము-పాములవాఁడు ఊఁదు క్రోవి.(వి. నాగసరము) నాగాంతకుఁడు-గరుడుఁడు.
నాగఁడు-వి. (నాగము.) శేషుఁడు.
నాగదాళి-తె. ఒకతెగ ముండ్లపొద.
నాగము-స. 1. సత్తు. 2. తగరము. 3. పాము. 4. ఏనుఁగు. 5. కొండ.
నాగరంగము-స. నారింజచెట్టు. రూ. నారంగము.
నాగరము-స. 1. శొంటి. 2.తుంగ.3.సంస్కృత లిపి. 4. నగరమునఁబుట్టినది.

నాగరికత-స. నాణెము.
నాగరికము-స. నాణెమైనది. [ము.స.తమలపుతీఁగ.
నాగవల్లి-తె. పెండ్లిలో నాలవనాఁడుచేయుశుభకార్య
నాగవాసము-తె. గొండెము తగిలించుఇనుపకమ్మి.
నాగిని-వి. (నాకిని) లోకాంతరముపొంది దేవతాత్వ
ముVahించిన ముత్తైదువ. [నాగులు.
నాగువు-వి. (నాగము) త్రాఁచు. రూ.నాగుఁబాము,
నాజూకు-హిం. నాణెము.
నాటకము-తె. పైరునాటుట. వి. 1. నర్తనము, ఆ
ట. 2. ప్రవర్తనము. సమా. నాటకసాల. నాట్య
శాల. స. నటింపయోగ్యముగావ్రాయఁబడిన
గ్రంథము.(ఇవి రూపకభేదములంది నాటకము,
ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము,
వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము,
ఈహామృగము అని 10 విధములు)
నాటు-తె. 1. గ్రుచ్చు. 2. గ్రుచ్చుకొను. 3. కృ.
నాటుట. 4. గడ్డపాఱమున్నగువానిచే పొడిచిన
లోఁతైనరంధ్రము.
నాట్నము-తె. నాటుట. రూ. నాటనము, నాటకము.
నాట్యము-స. 1. నృత్యము. 2. నృత్తగీతవాద్యముల
నాడా-హిం. సన్నని నూలుపట్టె. [కూడిక.
నాడి-స. 1. నరము. 2. గడియకాలము. 3. ఈనె.
4. కాఁడ. సమా. నాడీవ్రణము-నారికుఱుపు.
నాడిక-తె. దేశము. రూ. నాడు. స.గడియకాలము.
రూ. నాడి.
నాడు-తె. 1. నాటు. 2. దేశము. 3. గ్రామము.
నాడె-తె. సాలెవాఁడు నూలికండెనుంచుగొట్టము.
నాణకము-స. రూపాయలోనగునాణెము.
నాణెము-తె. 1. సొగసు, అలంకారము. 2. నాగ
రికత. రూ. నాణ్యము, నాఁడెము. వి.నాణకము.
సమా. నాణెకత్తె,—కాఁడు.
నాతము-తె. బత్తెము.
నాతి-తె. ఆఁడుది. రూ. నాతుక.
నాదము-స. ధ్వని. క్రి. నాదించు. సమా. నాదస్వ
రము-మేళగాండ్రుపాటలు పలికించుక్రోవి, స
నాదు-వి. (నాదము) ధ్వని. [న్నాయి.
నాదేయము-స. నదీసంబంధమైనది.
నాధము-స. ముకుఁద్రాడు. రూ. నాథము.

నాధుఁడు-స. 1. పెనిమిటి. 2. తేఁడు. రూ. నాథుఁడు.
నాన-తె. సిగ్గు. సమా. నానగండ-సిగ్గుమాలినవాఁడు.
నానా-స. అనేకము.
నాను-తె. 1. ద్రవద్రవ్యమున చాలకాలముండు.
2. హారము. సమా. నానఁబ్రాలు - నీటనానిన
బియ్యము. —బియ్యము. ——పై.——
నానుడి-తె. (నాను + నుడి) 1. కింవదంతి. 2. సామె
నానుచు-తె. నానఁజేయు. రూ. నాన్చు. [త.
నానుడు-తె. తడిసినది. సమా. —వాన-విడువక
నానుపు-తె. చలువచేయు. [కురియు పొడిపొడివాన.
నాపసాని-చూ. నాగపసాని.
నాపితుఁడు-స. మంగలి.
నాభి-స. 1. కస్తూరి. 2. బొడ్డు. 3. బండిచక్రపు
నడిమితూము. సమా. —జన్ముఁడు-బ్రహ్మ.
పొక్కిలిచూలి.
నామధేయము-స. పేరు. రూ. నామము.
నామము-తె. నొసటఁబెట్టుకొనుబొట్టు. సమా. నామ
గుంట-గొంతుకయందలిపల్లము, గళగర్తము.
స. పేరు, నామధేయము. సమా. నామకరణము-
బిడ్డలకు పేరుపెట్టుట. క్రి.నామమడఁచు-చంపు.
నామరులు-తె. (నాము + మరులు) పాచికలు.
నాము-తె. పురుగులు గలిగిన జొన్నలోనగువాని
మొలక. సమా. నాఁపచేను-నాముగలచేను. —
ఱాయి-విషశిల.
నాయఁకరము-తె. ఆధిపత్యము. [ణపుబంటు.
నాయఁకవాడి-తె. సేద్యపుపనులు చూచుకొను దివా
నాయఁకుఁడు-వి. (నాయకుఁడు) 1. అధిపతి, 2.
పన్నిద్దఱుభటులకధిపతి.
నాయఁడు-వి. (నాయకుఁడు) 1. ప్రభువు. 2. బలి
జలుమున్నగువారిపట్టపుపేరు.
నాయకము-స. పతకము నడిమిరత్నము.
నాయకుఁడు-స. 1. అధిపతి.(వీరునలువురు: ధీరో
దాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీర
శాంతుఁడు.) 2. శృంగారరసాలంబనపురుషుఁడు.
(వీరునలువురు : అనుకూలుఁడు, దక్షిణుఁడు,
ధృష్టుఁడు, శఠుఁడు.) 3. శ్రేష్ఠుఁడు.
నాయన-తె. (నా + అన) తండ్రి. [ణము. 2. నీతి.
నాయము-వి. (న్యాయము) ధర్మము. స. 1. ప్రావ

నాయిక-స. శృంగారరసాలంబనస్త్రీ. (త్రివిధనాయికలు : స్వీయ, పరకీయ, సామాన్య. అష్టవిధనాయికలు : స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.)
నార-తె. 1.చీల్చినచెట్టుపట్టలోనిపీచు. 2. వల్కలము. సమా. నారమడి-నారతోనేసినమడిబట్ట.
నారకము-చూ. నరకము.
నారదము-స. నారింజ. రూ. నారంగము, నాగరంగము.
నారము-స. 1. నరసమూహము. 2. నీళ్లు.
నారసము-వి. (నారాచము) బాణము.
నారాచము-స. ఇనుపబాణము. (వ్యు.నరసమూహమును గూర్చిపోవునది.)
నారాజి-చూ. నరాజి.
నారాయణి-స. 1. పార్వతి. 2. లక్ష్మి.
నారాయణుఁడు-స. 1. విష్ణువు. 2.సూర్యుఁడు.3. చంద్రుఁడు. 4. శివుఁడు. 5.అగ్ని. 6.బ్రహ్మ. (వ్యు. సముద్రము లేకజననసమూహముస్థానముగాఁగలవాఁడు)
నారి-తె. 1. అల్లెత్రాడు. 2. వి. (నాడి) నరము. సమా. నారికుఱుపు-నాడీవ్రణము. స. ఆఁడుది.
నారింజ-వి. (నారంగము) నారదవృక్షము, కిత్తలి.
నారికడము-వి.(నారికేళము)టెంకాయ.
నారికేడము-స. టెంకాయ. రూ. నారికేళము, నాళికేరము.
నాలము-హిం. గుఱ్ఱపులాడము.
నాలి-తె. 1. కుత్సితపుపని. 2.కుత్సితము. 3.మందము. 4. వంచకము. సమా. —బూతము,—ముచ్చు-కుత్సితుఁడు.
నాలిక-తె. 1. జిహ్వ. 2. బ. జ్వాలలు. రూ. నాఱుక, నాల్క.
నాలుగు-తె. మూఁడునొకటి. రూ. నాలువు, నాల్గు. సమా. —కన్నులవేల్పు-అగ్ని.
నావ-స. ఓడ. రూ. నావి.
నావి-తె. సస్యరోగము.
నావికుఁడు-స. ఓడనడపువాఁడు.
నావ్యము-స. నావచే దాఁటఁదగినది.
నాశము-స. 1. చేటు. 2. కనఁబడమి. 3. అనుభవములేమి. క్రి. నశించు, నాశిల్లు, నాశిల్లు.
నాస-స. ముక్కు. రూ. నస, నాసిక. సమా. నాసామణి-ముక్కర.
నాసత్యులు-స. అశ్వినీదేవతలు. (వ్యు. అసత్యములేనివారు)
నాసి-తె. పిల్లి.
నాసిరిల్లు-వి. (నాశిల్లు) నశించు.
నాసీరము-స. 1. సేనాముఖము. 2. దర్పము.
నాస్తికుఁడు-స. పరలోకము (దేవుఁడు) లేదనువాఁడు. (వ్య. ఆస్తికుఁడు.)
నాస్తిక్యము-స. నాస్తికభావము. రూ. నాస్తికత.
నాళము-హిం. 1. లాడము. రూ. నాలము. స. 1. తామరలోనగువానికాఁడ. 2. క్రోవి. 3. చిమ్మనఁగ్రోవి.
నాళికము-స. 1. తామర. 2.బాణము. 3. బాణపుములికి.

## ని

ని-తె. ద్వితీయావిభక్తిప్రత్యయము.
నింకెఱ-తె. శీఘ్రము.
నింగి-తె. ఆకాశము. సమా. —చూలి-వాయువు. —సిగ-శివుఁడు,వ్యోమకేశుఁడు. క్రి. —వడు-అస్తమించు.
నించు-తె. నిండించు. రూ. నినుచు, నింపు.
నింట-తె. జలపూరము.
నిండు-తె. 1. పూర్ణమగు. నిండారు, నిండుకొను. 2. కృ. పూర్ణత.
నింద-స. 1. దూఱు. 2.అపదూఱు.క్రి.నిందించు.
నిందితుఁడు-స. దూఱఁబడినవాఁడు.
నింద్యుఁడు-స. దూఱఁదగినవాఁడు.
నింపు-తె. 1. చూ. నించు. 2. కృ. సమృద్ధి.రూ. నినుపు. సమా. నింపాది. సమృద్ధము. క్రి. నింపారు-పూర్ణమగు. రూ. నినుపారు.
నింబము-స. వేఁపచెట్టు.
నికటము-తె. నిర్బంధము. స. సమీపము.
నికము-చూ. నిక్కము.
నికరము-తె. త్రోపుడుపోఁగా మిగిలినది. స. 1. సమూహము. 2. నిధి.
నికషము-స. 1. ఒరగల్లు. 2. సాన.
నికామము-స. యథేచ్ఛము.
నికాయము-స. 1. ఇల్లు. 2. తెగ. 3. గుంపు.
నికాయ్యము-స.ఇల్లు.రూ.నీకాయ్యము, నికాయము.
నికారణము-స. వధము.
నికారము-స. 1. వంచన. 2. తిరస్కారము.

నికాశము-స. 1. నిశ్చయము. 2. తుల్యము.
నికుంజము-స. పొదరిల్లు.
నికురుంబము-స. సమూహము.
నికృంతనము-స. ఖండనము, నఱుకుడు. [పుడు.
నికృతి-స. 1. బెదరుమాట. 2. వంచన. 3.త్రో
నికృత్తము-స. నఱకఁబడినది.
నికృష్టము-స. అధమము.
నికేతనము-స. ఇల్లు.
నిక్కచ్చి-తె. నిర్బంధము.
నిక్కము-తె. 1. నిశ్చయము. 2. యథార్థము.3. అన్వర్థము. రూ. నికము, నిక్కువము. సమా. నిక్కల-(నిక్కము+కల)కన్నది సత్యమగు [కల.
నిక్కవుడు-తె. నిష్కపటము.
నిక్కాఁక-తె. (నిండు+కాఁక) మిక్కిలికాఁక.
నిక్కు-తె. 1. ఉన్నతమగు. 2. అతిశయించు.3. గర్వించు. 4. వర్ధిల్లు. కృ. 5. ఉన్నతి. 6. గర్వము. సమా. —ఁబోతు-గర్వ స్వభావము కలవాఁడు. —వీనులజక్కి-ఉచ్చైశ్శ్రవము. క్రి. నిక్కవొడుచు-నిలువుననిలుచు.
నిక్కుడు-తె. 1. ఉన్నతి. 2. గర్వము.
నిక్కువము-చూ. నిక్కము. [ణము.
నిక్వణము-స. వీణలోనగువానిమ్రోఁత. రూ. నిక్వా
నిక్షేపము-స. 1. చెప్పిచూపియుంచినయిల్లడ. 2. నిధి. క్రి. నిక్షేపించు-పూడ్చు.
నిఖాతము-స. త్రవ్వఁబడినది.
నిఖిలము-స. సమస్తము.
నిగదము-స. స్పష్టముగాచెప్పుట. క్రి. నిగదించు.
నిగమము-స. 1. వేదము. 2. అంగడివాడ. 3. మార్గము. 4. పట్టనము.
నిగముఁడు-స. వణిజుఁడు.
నిగరణము-స. 1. మ్రింగుట. 2. కంఠము.
నిగరము, నిగారము-తె. శ్రేష్ఠము.
స. మ్రింగుట. [రూ. నిగడము.
నిగళము-స. 1. ఏనుఁగుకాలిసంకెల. 2. సంకెల.
నిగా-హిం. దృష్టి. రూ. నిఘా.
నిగుడు-తె. 1. వ్యాపించు. 2. నిక్కు. 3. చాఁగు. 4. విజృంభించు. 5. కవియు. 6.చక్కఁబడు. 7. వర్ధిల్లు. రూ.నివుడు.క్రి.నిగిడారు-వ్యాపించు. నిగుడుదెంచు-నిక్కు. [నీఱు.
నిగుఱు-తె. కట్టెనిప్పుమీఁది బూడిద. రూ.నివుఱు,
నిగూఢము-స. మఱుఁగుపుచ్చనది.
నిగ్గడి-తె. కఠినము.
నిగ్గు-తె. 1. నిర్వహిల్లు. 2. కాంతి. 3.నికరము.
నిగ్రహము-స. 1. త్రోపాట. 2. బెదరుమాట. 3. చెఱ. క్రి. నిగ్రహించు. [గ్రంథము.
నిఘంటువు-స. పదపదార్థములను తెలియఁజేయు
నిఘాతిక-స. దాఁగలి.
నిఘ్నుఁడు-స అధీనుఁడు.
నిచయము-స. సమూహము.
నిచితము-స. పఱపఁబడినది.
నిచులము-స. కప్పుడు దుప్పటి.
నిచోళము-స. 1. గౌసెన. 2. కప్పుడుదుప్పటి.
నిచ్చ-వి. (నిత్యము) 1. సదా. 2. ప్రత్యహము.
నిచ్చయము-వి. నిశ్చయము.
నిచ్చలము-వి. 1. నిశ్చయము. 2. నిశ్చలము. 3. నిర్దోషము. 4. నిరంతరము.
నిచ్చలు-వి. 1. నిశ్చయము. 2. సదా.
నిచ్చెన-వి. (నిశ్రేణి) పైకెక్కఁదగిన సాధనము.
నిజము-వి. 1. (నిజము) సత్యము. 2. నిశ్చయము. సమా. నిజమరి-సత్యశీలుఁడు. [మైనది.
నిజము-స. 1. స్వభావము 2. తనది. 3. శాశ్వత
నిటలము-స. నొసలు. రూ. నిటాలము. సమా. నిటలాక్షుఁడు-శివుఁడు.
నిట్ట-తె. 1. ప్రవాహము. 2. స్తంభము. 3. స్థానము. 4. నిక్కు. క్రి. నిట్టకనిలుచు-సరిగా నిలుచు.రూ.నిట్టనిలుచు.కృ.నిట్టకనిలువు,నిట్టనిలువు. నిట్టుగమ్ముకొడుచు-1. ఉప్పొంగు.2.రోమాంచితమగు. 3.విజృంభించు.నిట్రించు-నిలువుగానుంచు. సమా. నిట్టరాడు. గుడిసెయింటినడుమ నిలువుకొడవుకంబము,కహారము.రూ.నిట్రాడు, నిట్రాయి.
నిట్టు-తె. 1.ఉపవాసము. 2.క్షామము.3.శుష్కము. సమా. నిట్టుపాసము-శుష్కోపవాసము.
నిట్టూరుచు-తె. (నిడుద+ఊరుచు)దీర్ఘనిశ్వాసముచేయు. కృ. నిట్టూరుపు.
నిట్రు-తె. 1. ఉపవాసము. 2. శుష్కము. రూ.

నిట్టు. సమా. నిట్టుపానము - ఉపోషపవాసము. క్రి. నిట్టిల్లు-ఉపవాసముండు.
నిడివి-తె. పొడవు.
నిడుద-తె. పొడవు, దీర్ఘము. రూ. నిడుపు, నిడివి, నిడు. సమా. —వెన్ను-పాము. రూ.నిడుపడు. —మోము-పొడవైన మొగము.రూ.నిడుమోము.
నిడువెండ్రుక-రోమాంచము.
నితంబము-స. 1. పిఱుఁదు, 2. మొల. 3. కొండనడుము. 4. మూఁపు. 5. దరి. [ఆఁడుది.
నితంబిని-స. (వ్యు. గొప్పపిఱుఁదులు గలది)
నితాంతము-స. పెల్లు.
నిత్యము-స. ఎల్లప్పుడు. 2. ఎడతెగనిది.
నిదర్శనము-స. దృష్టాంతము.
నిదాఘము-స. 1. వేసఁగి. 2. వేఁడిమి. 3.చెమట.
నిదానము-తె. ఆత్రపడకుండుట. క్రి. నిదానించు, స. 1. ఆదికారణము. 2. పెయ్యపలుపు.
నిదిధ్యాసనము-స. మఱిమఱి తలఁచుట.
నిదుర-వి. (నిద్ర) కునుకు, కూరుకు. రూ.నిద్దుర. క్రి. నిదురించు, నిదురవోవు. సమా. —పోతు-నిద్రాళువు. రూ. నిద్దురపోతు. [నిదేశించు.
నిదేశము-స. 1. ఆజ్ఞ. 2. చెప్పుట. 3. దాపు.క్రి.
నిదేష్ట-స. ఆజ్ఞాపించువాఁడు. [రూ. నిద్దా.
నిద్దము-వి. (స్నిగ్ధము) 1.నునుపు.2.స్నేహము.
నిద్దుర-చూ. నిదుర. [నిద్రిలు, నిద్రిల్లు.
నిద్ర-స. కూరుకు. (వి. నిదుర) క్రి. నిద్రించు,
నిద్రాణుఁడు-నిదురపోతు. రూ. నిద్రాళువు.
నిధనము-స. 1. కులము. 2. చావు. 3. చేటు.
నిధానము-స. 1. ఉంచుట. 2. పాఁతఱ.
నిధి-స. పూడ్చియుంచినధనము, పాఁతఱ. (నవనిధులు: పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము.)
నిధువనము-స. 1. కలయిక. 2. వణఁకు.
నినదము-స. ధ్వని. రూ. నినాదము.
నినుచు-తె. నిండించు. రూ. నించు,నింపు,నినుపు.
నినుపు-తె. 1. నిండించు. 2. సమృద్ధి.రూ.నింపు. క్రి. నినుపారు. పూర్ణమగు. రూ. నింపారు.
నిన్న-తె. (నిరు+నాడు) కడచినదినము.

నిపతము-స. పాతము, చదువు. రూ. నిపాతము.
నిపాతనము-స. దిగద్రొబ్బుట. క్రి.నిపతించు,నిపాతించు.
నిపాతము-స. 1. పడుట. 2. (వ్యాక) సాధారణవిధికిలొంగక వేఱుగా విధింపఁబడినశబ్దము.3. అవ్యయము. [ఱఁగట్టినతొట్టి.
నిపానము-స. పశ్వాదులు నీరుత్రాగుటకు బావిదగ్గ
నిపుణుఁడు-స. నేర్పరి.
నిప్పచ్చరము-తె. (నిరు+పచ్చ) దారిద్ర్యము.
నిప్పటి-తె.(నిప్పు+అట్టు)కజ్జాయము.రూ.నిప్పట్టు.
నిప్పస్తు-తె. (నిఱు+పస్తు) ఉపోషపవాసము.
నిప్పు-తె. 1.అగ్ని. 2. అగ్నికణము. రూ. నిప్పుక. సమా. —కోడి-ఎడారిలోనుండు ఒకతెగపెద్ద పక్షి. (నిప్పుఁదిండి అనియు.) [కూర్పఁబడినది.
నిబంధనము-స. 1. ఏర్పాటు. 2. బంధము. 3.
నిబంధము-స. 1. మలమూత్రబంధము.2.బంధము. క్రి. నిబంధించు. 1. బంధించు. 2.అడ్డగించు
నిబద్ది-తె. నిజము. రూ. నిబ్బద్ది. క్రి. నిబద్దించు, నిబద్దిలించు-నిజపఱచు. [బడినది.
నిబద్ధము-స. 1. బంధింపఁబడినది. 2. అడ్డగింపఁ
నిబర్హణము-స. చంపుట.
నిబిడము-స.దట్టము. [నిబిడీకరించు-దట్టముచేయు.
నిబిడీకృతము-స. నిబిడముగాఁజేయఁబడినది. క్రి.
నిబోధనము-స. చూపు.
నిబ్బరము-వి. (నిర్భరము) 1.అశ్వగతి, ప్లుతము. 2. అధికము. క్రి. నిబ్బరించు-1.అతిశయించు. 2. నిదానించు. [ణించు. 2. ఉప్పొంగు.
నిబ్బరికము-తె. కరుణ. క్రి. నిబ్బరికించు-1.కరు
నిభము-స. 1. నెపము. 2. సమానము.
నిభాయించు-హిం. సహించు.
నిభృతము-స. తీర్పఁబడినది.
నిమంత్రణము-స.శ్రాద్ధభోజనాదులందు తగినవారిని నియమించుట. క్రి. నిమంత్రించు.
నిమంత్రితుఁడు-స. నిమంత్రింపఁబడినవాఁడు.
నిమజ్జనము-స. స్నానము. రూ. మజ్జనము.
నిమయము-స.వస్తువులమాఱుపు. రూ.వినిమయము.
నిమిత్తము-స. 1. కారణము. 2. శకునము. 3. గుఱి. 4. గుఱుతు.

నిమిషము-స. 1. తెప్పవేయుట. 2. తెప్పపాటుకాలము. రూ. నిమేషము. (వి. నిముసము)
నిమీలనము-స. 1. కనులుమూయుట. 2. చావు.
నిముకు-తె. స్తన్యపానముచేయు. [నివురు.
నిమురు-తె. (శరీరమును) మెల్లగాతడవు. రూ.
నిముసము-చూ. నిమిషము.
నిమ్నగ-స. ఏఱు. (వ్యు.పల్లమునకు పాఱునది.)
నిమ్నము-స. 1. లోఁతు. 2. పల్లము.
నిమ్మ-తె. జంబీరవృక్షము. [మ్మళించు.
నిమ్మళము-తె. 1. నెమ్మది. 2. స్వస్థము. క్రి. ని
నియంత-స. 1.నడపువాఁడు. 2.తేరునడపువాఁడు.
నియతము-స. 1. నియమముగలది. 2.నిత్యమైనది.
నియతి-స. 1. నియమము. 2. భాగ్యము.
నియమనము-స. ఏర్పాటు.
నియమము-స. 1. ఏర్పాటు. 2. కట్టు. 3.పనుపు. 4. ప్రతిజ్ఞ. 5. వ్రతము. రూ. నియామము. క్రి. నియమించు-1. ఏర్పాటుచేయు. 2. ఆజ్ఞాపించు. [బడినది.
నియమితము-స. 1. నియమింపఁబడినది. 2.కట్టఁ
నియమ్యము-స. నియమింపఁదగినది.
నియామకుఁడు-స. నియమించువాఁడు.
నియుతము-స. లక్ష.
నియుద్ధము-స. బాహుయుద్ధము.
నియోక్తవ్యము-స. నియోగింపఁదగినది. [గించు.
నియోగము-స. ఆజ్ఞ. రూ. నియోజనము. క్రి.నియో
నియోగి-స. (నియోగము కలవాఁడు) మంత్రి.
నియోగ్యుఁడు-స. (నియోగింపఁదగినవాఁడు) ప్రభువు. [హ్మణులతెగ.
నియ్యోగి-వి. (నియోగి) 1. మంత్రి. 2. ఒకబ్రా
నిర్-స. వ్యతిరేక విశేషార్థములనిచ్చు ఉపసర్గము. రూ. నిస్. సమా. నిరంకుశము-అడ్డులేనిది. నిరంజనము-1. కాటుకలేనిది. 2. దోషములేనిది. నిరంతరము-1. దట్టము. 2.ఎడతెగనిది. నిరతము-మిక్కిలిఆసక్తిగొన్నది.నిరతి-మిక్కిలి ఆసక్తి. నిరత్యయము-నాశములేనిది. నిరర్గళము-అడ్డులేనిది. నిరర్థకము-ప్రయోజనము లేనిది. నిరవధికము-మేరలేనిది. నిరస్తము-1.తిరస్కరింపఁబడినది. 2. వెడలఁగ్రక్కఁబడినది. 3. నిరాకృతము. నిరాకారము-ఆకాశము. నిరాకృతము-న్యాయముచే త్రోయఁబడినది, నిరస్తము. నిరాఘాటము-మేరలేనిది. నిరాతంకము-1. భయములేనిది 2. వ్యాధిలేనిది. నిరామయము-రోగములేమి, సౌఖ్యము. నిరీక్షణము-చూపు. క్రి. నిరీక్షించు. నిరుద్ధము-నిరోధింపఁబడినది. నిరుపమము-సాటిలేనిది. నిర్గతము-వెడలఁబడినది. నిర్గతి-వెడలఁబాటు. రూ. నిర్గమనము, నిర్గమము. క్రి. నిర్గమించు. నిర్గుణుఁడు-1. భగవంతుఁడు. 2.గుణరహితుఁడు. నిర్ఘాతము-1. పిడుగు. 2. వజ్రము. నిర్ఘృణుఁడు-కనికరములేనివాఁడు. నిర్ఘోషము-ధ్వని.క్రి. నిర్ఘోషించు. నిర్జనము-జనములేనిది. నిర్జరుఁడు-వేలుపు. (వ్యు. ముసలితనములేనివాఁడు) నిర్జితుఁడు-గెలువఁబడినవాఁడు. క్రి. నిర్జించు-గెలుచు. నిర్ఝరము-సెలయేఱు. రూ. ఝరము. నిర్ఝరిణి-నది. నిర్ణయము-ఏర్పాటు.క్రి. నిర్ణయించు. నిర్ణాయకుఁడు-ఏర్పాటుచేయువాఁడు.రూ. నిర్ణేత. నిర్ణీతము-నిర్ణయింపఁబడినది.నిర్దగ్ధము-చక్కఁగ కాలినది.నిర్దయుఁడు-దయలేనివాఁడు. నిర్దళనము-చక్కఁగా భేదించుట. నిర్దహనము - చక్కఁగాకాల్చుట. క్రి. నిర్దహించు. నిర్దారణము-చక్కఁగాచీల్చుట. నిర్దిష్టము-నిర్దేశింపఁబడినది. నిర్దేశము-1. ఆజ్ఞ. 2. చెప్పుట. క్రి.నిర్దేశించు. నిర్దేష్ట-నిర్దేశించువాఁడు. నిర్ధారణ-నిశ్చయము. క్రి. నిర్ధరించు. నిర్ధారణీయము-నిశ్చయింపఁదగినది.నిర్ధూతము-విడువఁబడినది.నిర్నిద్రము-జాగరూకతకలది. నిర్బంధము-1. బలాత్కారము. 2. కదలమెదలఁగూడనికట్టు. క్రి.నిర్బంధించు. నిర్భయము-భయములేనిది. నిర్భరము-పెల్లు. నిర్భర్త్సనము-అదలుపు.క్రి. నిర్భర్త్సించు. నిర్భాగ్యుఁడు-భాగ్యములేనివాఁడు. నిర్భిన్నము-చక్కఁగా భేదింపఁబడినది. నిర్మలము-మలినములేనిది. నిర్మాల్యము-ధరించి తీసివేసినది. నిర్ముక్తుఁడు - సంగము విడిచినవాఁడు. నిర్మూలము - వేరులేనిది. క్రి. నిర్మూలించు-మొదలంట నాశముచేయు. నిర్యాణము-1. వెడలుట. 2. ముక్తి. 3. చావు. నిర్వచనము-అర్థ

వివరణముచేసిచెప్పుట. క్రి. నిర్వచించు. క్రి.
నిర్వర్తిల్లు-నెఱవేఱు. ప్రే. నిర్వర్తించు. నిర్వా
ణము - చలింపనిగాలి. నిర్వాదము-1.నిశ్చిత
వాదము. 2. అపవాదము. 3. వాదములేమి. ని
ర్వాపణము-1. కొల. 2. ఈవి. నిర్వాసనము-
1. చంపుట. 2. వెడలఁగొట్టుట. నిర్వాహకుఁ
డు-నిర్వహించువాఁడు. నిర్వాహము-1. శక్తి.
2. జరగుఁబాటు. క్రి. నిర్వహిల్లు-1. జరుగు.
2. నెఱవేఱు. ప్రే. నిర్వహించు. నిర్విణ్ణుఁడు-
నిర్వేదము నొందినవాఁడు. నిర్విష్టము-1.చొరఁ
బడినది. 2. పొందఁబడినది. నిర్వృతి-1. సు
ఖము. 2. ఊఱట. 3. నాశము. నిర్వృత్తి-1.
సంతోషము. 2. మోక్షము. 3. నెఱవేఱుట.
నిర్వేదము-తత్త్వజ్ఞాన దుఃఖేర్ష్యాదులచేఁ గలుగు
హేయత్వబుద్ధి. క్రి. నిర్వేదించు.నిర్వేశము-1.
కూలి. 2. జీతము.నిర్వ్యాజము-నెపములేనిది.

నిరయము-స. దుర్గతి, నరకము.

నిరసనము-స. 1. తిరస్కారము. 2.ఆక్షేపము.3.
వధము. రూ. నిరాసనము. క్రి. నిరసించు.

నిరాబారి-తె. మౌని. [కడచిన సంవత్సరము.

నిరు-తె.గతించినది.సమా.నిరుడు-(నిరు+ఏఁడు)

నిఱు-తె. నిప్పచ్చు-(నిరు+పచ్చు)నాశము.మిక్కి
లి. (నిఱుపేద, మొ.)

నిరూఢి-స. ప్రసిద్ధి. రూ. రూఢి.

నిరూపణము-స. 1. అరయిక. 2. చూపు. 3. తా
ర్కాణము. క్రి. నిరూపించు.

నిరృతి-స. (నిర్+ఋతి) 1. అలక్ష్మి. 2. ఒక
దిక్పాలకుఁడు. 3. ఉపద్రవములేనిది. రూ.
నైరృతి. [చు-అడ్డగించు.

నిరోధము-స. 1. అడ్డు. 2. చేటు. క్రి. నిరోధిం

నిర్మాణము-స. 1. నిర్మితి. 2. యోగ్యత.

నిర్మాత-స. నిర్మించువాఁడు. రూ. నిర్మాయి.

నిర్మితి-స. నిర్మాణము, సృష్టి. క్రి. నిర్మించు-కలు
గఁజేయు, సృష్టించు. [నీలుగు. 2. గర్వించు.

నిఱ్ఱనీలుగు-తె. (నీలుగు+నీలుగు) 1. మిక్కిలి

నిలక-తె. నిలుపు.

నిలయము-స. ఇల్లు.

నిలింపుఁడు-స. 1. దేవత. 2. బోయ.

నిలీనము-స. మిక్కిలి అడఁగినది.

నిలుకడ-తె.1.ఉనికి.2. స్థైర్యము. 3. విరామము.

నిలుగు-తె. 1. ఒడలువిఱుచుకొను. 2.గర్వించు.
3. కృ. గర్వము. రూ. నీలుగు.

నిలుచు-తె. 1. కాళ్లూనిలేచియుండు. 2. ప్రతిష్ఠిత
మగు. 3. ఉండు. 4. మిగులు. రూ.నిలఁబడు,
నిలువఁబడు. కృ. నిలక, నిలుపు, నిలువు.ప్రే.
నిలుపు. నిలుచుండు, క్రి.నిలుచుకొను-నిలఁబడి
యుండు.

నిలుపు-తె. 1. నిలువఁబెట్టు. 2. ప్రతిష్ఠించు. 3.
అడ్డగించు. 4. స్థిరపఱచు. కృ. 5. నిలుచుట.
6. నిష్ఠ. 7. స్థైర్యము. క్రి. నిలుపోపు-(నిలు
పు+ఓపు) ఓర్చు. [1.నిలుచు.2.అడ్డుపడు.

నిలువ-తె. శేషము. రూ. నిల్వ. క్రి. నిలువఁబడు-

నిలువరము-తె. స్థిరమైనది. క్రి. నిలువరించు-1.
చలింపకనిలుచు. 2. నిలుపు.

నిలువు-తె. 1. నిలుపు. నిలుచుట. 2.చేయి మీఁది
కెత్తుకొని నిలుచున్న మనుజునిపొడవుకొలఁది.
3. మీఁదియంతస్తు. 4. ఆకృతి. 5. ఒడలు.
సమా. —ఁగొలువు-నిలుచుండిచేయుసేవ. —
జీతము-నిలుచుండుపనిచేయనిచ్చెడుజీతము.

నివర్తనము-స. మరలుట. క్రి. నివర్తిల్లు. ప్రే. నివ

నివసతి-స, ఇల్లు. [ర్తించు.

నివసథము-స. గ్రామము. [చేయు.

నివసనము-స. ఇల్లు. క్రి. నివసించు-ఉండు.వాసము

నివహము-స.గుంపు.[చము)2.గాలిలేనిది(చోటు)

నివాతము-స. 1. బాణములచే భేదింపరానిది (కవ

నివాపము-స. పితరుల నుద్దేశించిన తిలతర్పణాదిక

నివారణము-స.అడ్డగింత.క్రి. నివారించు. [ర్మము.

నివారణీయము-స. అడ్డగింపఁదగినది.రూ. నివార్య

నివాసము-స.ఇల్లు.రూ. నివసనము, వాసము. [ము.

నివాసి-స. వాసముచేయువాఁడు.

నివాళి-తె. హారతి. రూ. నివాళిక, నివ్వాళి, నివ్వా
ళిక. క్రి. నివాళించు. [చినవాఁడు.

నివిష్టుఁడు-స. 1. కూర్చున్నవాఁడు. 2. ప్రవేశిం

నివుడు-చూ. నిగుడు.

నివురు-చూ. నిమురు.

నివుఱు-చూ. నిగుఱు.
నివృతము-స. పరిక్షిప్తము.
నివృత్తి-స. 1. మరలుట. 2. మోక్షము.
నివేదనము-స. 1. ఎఱుక. 2. సమర్పణము. క్రి. నివేదించు. [సినపాళెము. 4. ఇల్లడ.
నివేశము-స. 1. ఇల్లు. 2. చొరవ. 3. దండువిడి
నివ్వటిల్లు-వి. (నిర్వహిల్లు) 1. నెఱవేఱు. 2. అతిశయించు. 3. కలుగు. 4. వ్యాపించు. రూ. నివ్వటిలు. [లు. రూ. నివరి. నీవరి.
నివ్వరి-వి. (నీవారము) ఊదర యను కసవుగింజ
నివ్వాళి-చూ. నివాళి.
నివ్వెఱ-తె. (నిండు+వెఱ) 1. పారవశ్యము. 2. నిశ్చేష్టత. 3. భ్రాంతి. రూ. నివ్వెర. 4. మిక్కిలిభయము. రూ. నివ్వెఱగు. క్రి. —పడు. కృ. —పాటు.
నిశ-స. 1. రేయి. 2. పసుపు. సమా. నిశాంతము-1. వేకువ. 2. ఇల్లు. నిశాకరుఁడు-చంద్రుఁడు. (ఇట్లే నిశాపతి. మొ.) —చరి-1. రక్కసి. 2. ఱంకుటాలు. 3. పైఁడికంటిపక్షి. —చరుఁడు-1. రక్కసుఁడు. రేద్రిమ్మరి. (ఇట్లే నిశాటుఁడు. మొ.) [నిశితము.
నిశాతము-స. మిక్కిలి వాఁడి చేయఁబడినది. రూ.
నిశీథము-స. 1. నడురేయి. 2. రేయి.
నిశీథిని-స. రేయి.
నిశ్చయము-స. నిర్ణయము. క్రి. నిశ్చయించు.
నిశ్చితము-స. నిశ్చయింపఁబడినది.
నిశ్రేణి-స. నిచ్చెన.
నిశ్రేయసము-స. 1. ముక్తి. 2. మేలు. [సించు.
నిశ్వసనము-స. నిట్టూర్చుట. క్రి. నిశ్వసించు, నిశ్వా
నిశ్వాసము-స. నిట్టూర్పు.
నిషంగము-స. అమ్ములపొది.
నిషణ్ణము-స. 1. ఉండినది. 2. కూర్చుండినది.
నిషాదము-స. సప్తస్వరములలో ఏడవది.
నిషాదుఁడు-స. 1. బోయవాఁడు. 2. మాలవాఁడు.
నిషిద్ధము-స. నిషేధింపఁబడినది.
నిషూదనము-స. చంపుట.
నిషేకము-స. గర్భాధానము.
నిషేధము-స. త్రోపుడు. క్రి. నిషేధించు.
నిషేవణము-స. చక్కఁగా సేవించుట.
నిష్కళ-స. 1. ముట్టుడిగిన ఆఁడుది.
నిష్కము-స. 1. మాడ. 2. టంకము. 3. పతకము. 4. బంగారు. 5. వెండి.
నిష్కర్షి-స. నిశ్చయము. క్రి. నిష్కర్షించు.
నిష్కాసితము-స. 1. ఉనుపఁబడినది. 2. వెడలింపఁబడినది.
నిష్కుటము-స. 1. తొఱ్ఱ. రూ. నిష్కూటము. 2. అంతిపురము. 3. ఇంటితోఁట. 4. తలుపు.
నిష్కృతము-స. ప్రాయశ్చిత్తము.
నిష్క్రమము-స. వెడలుట. క్రి. నిష్క్రమించు.
నిష్క్రాంతి-స. బయలువెడలుట. [నిష్ఠించు-స్థిరమగు.
నిష్ఠ-స. 1. ఉనికి, 2. చేటు. 3. ముగియిక. క్రి.
నిష్ఠితము-స. చక్కగా నుంచఁబడినది.
నిష్ఠీవనము-స. ఉమియుట.
నిష్ఠురము-స. 1. కఠినము. 2. పరుషము (వాక్కు)
నిష్ఠ్యూతము-స. 1. ఉమియఁబడినది. 2. త్రోయఁ
నిష్ణాతుఁడు-స. నేర్పరి. [బడినది.
నిష్పత్తి-స. 1. సిద్ధి. 2. పరిసమాప్తి.
నిష్పన్నము-స. సిద్ధించినది. [జేయు.
నిష్పాదనము-స. సిద్ధి. క్రి. నిష్పాదించు-సిద్ధింపఁ
నిస్-చూ. నిర్. సమా. నిశ్చేష్ట-చేష్టలుడుగుట. నిష్ప్రయోజనము - ప్రయోజనములేనిది. నిష్ఫలము-ఫలములేనిది. నిస్తంద్రము - చొరవగలది. నిస్తరణము-దాఁటుట. రూ. నిస్తారము. క్రి. నిస్తరించు. నిస్పృహము-ఆసలేనిది. నిస్సరణము-1. ఇంటిముందటిభాగము. 2. చావు. 3. ముక్తి. నిస్సారము-సారములేనిది.
నిసర్గము-స. స్వభావము.
నిసి-వి. (నిశ) రేయి. సమా. —వెలుఁగు-చంద్రుఁడు.
నిసుఁగు-వి. (శిశువు) బిడ్డ. రూ. నిసువు.
నిస్త్రింశము-స. కత్తి.
నిస్పందము-స. మిక్కిలిచలనము.
నిస్వనము-స. శబ్దము, మ్రోత. రూ. నిస్వానము.
నిస్సంతు-వి. (నిస్సంతానము) సంతానములేనిది.
నిస్సత్తువ-వి. (నిస్సత్త్వము) అశక్తి.
నిస్సహణము-తె. ఒకయుద్ధవాద్యము. రూ. నిస్సా
నిస్యందము-స. కాఱుట. [ణము, నిస్సానము.

నిహంత-స. చంపువాఁడు. [నది. 3. గుణింపఁబడినది.
నిహతము-స. 1. గుణకారము. 2. చంపఁబడి
నిహతి-స. చావు.
నిహితము-స. ఉంచఁబడినది.
నిహ్నవము-స. 1. అపనమ్మిక. 2. కపటము. 3. తిరస్కారము. 4. దాఁపఱికము. 5. నమ్మిక. 6. మఱుఁగుమాట. క్రి. నిహ్నవించు-మఱుఁగుపుచ్చు.
నిహ్నుతి-స. మఱుఁగుపుచ్చుట.

## నీ

నీ-తె. నీవు శబ్దమునకు ప్రాతిపదికము.
నీఁగు-తె. నివర్తించు.
నీఁడు-తె. కమ్మవారి బిరుదుపేరు. రూ. నాయఁడు.
నీకాశము-స. 1. ప్రకాశము. 2. నిశ్చయము. 3. తుల్యము. [నీరైనది. 3. నీచుఁడు.
నీచు-తె. 1. చేఁపమీఁది పొలుసు. 2. రక్తముచెడి
నీచుఁడు-స. అధముఁడు. రూ. నీచు. [కాఁడు.
నీటు-తె. శృంగార గర్వము. సమా. —గత్తె,
నీడ-తె. ఛాయ.
నీడము-స. 1. చోటు. 2. పక్షిగూఁడు. సమా. నీడోద్భవము-పక్షి, గూఁటికానుపు.
నీతము-వి. (నియతము) నియమము. రూ. నీతకము. స. 1. తేఁబడినది. 2. పొందింపఁబడినది.
నీతి-స. న్యాయము.
నీపము-స. కడిమిచెట్టు.
నీరంధ్రము-స. (నిర్ + రంధ్రము) సందులేనిది.
నీరము-స. జలము. సమా. నీరజము-1. తామర. 2. ముత్తెము. —దము-మేఘము. —ధి-సముద్రము. నీరాటము-జలచరము.
నీరసము-స. రసములేనిది.
నీరాజనము-స. హారతి.
నీరు-వి. (నీరము) 1. జలము. 2. మూత్రము. సమా. నీటికానుపు-అగ్ని. (ఇట్లే నీటిచూలి. మొ.) —కుప్ప-జలరాశి. రూ. నీరుకుప్ప. —తాత-వాయువు. —దయ్యము-జలగ్రహము. —పుట్టువు-తామర. —యిక్క-కౌస్తుభము. —రిక్క-పూర్వాషాఢ. —ఱేఁడు-1. వరుణుఁడు. 2. సముద్రుఁడు. —ఱేనిరిక్క-శతభిషము. నీరాకు-పాఁచి. నీరాట-1. స్నానము. 2. జలక్రీడ. క్రి. నీరాడు. నీరామని-వర్షఋతువు. నీరుకట్టు-మూత్రబంధరోగము. —కాయ-బుద్బుదము. —కొఱు-(ఒక కమసాలి) కొఱముట్టు. —కావి-కొంచెమెఱుపు. (నీటితెమ్మచేఁగలుగు కావి) —కాళ్లు-సాయంకాలములందుఁ దోఁచు ఎఱ్ఱనిపచ్చని కిరణములు. —గండి-తూము. —చిచ్చు-బడబాగ్ని. —చుఱుకు-మూత్రము దిగునపుడు మంటయెత్తురోగము. —చెంకి-జలాశయము. —డి-అతిమూత్రము. —తాలుపు-మబ్బు. —తిత్తి-మూత్రకోశము. —పాప-1. అగ్ని. 2. నీటిమనుష్యుఁడు. —పుట్టువు-1. తామర. 2. శంఖము. 3. కౌస్తుభము. (అబ్జము) —మజ్జిగ-మూఁడుపాళ్లు నీళ్లుకలిసిన మజ్జిగ. —మట్టము-సమమును గనిపెట్టు సాధనము. —మోపరి-1. కడవ. 2. మేఘము. —వామి-జలరాశి. క్రి. నీరాడు-స్నానము చేయు. నీరుముట్టు-మూత్రించు, జలస్పర్శము చేయు. —వట్టు-దప్పిగొను.
నీఱు-తె. భస్మము. రూ. నిగుఱు, నివుఱు.
నీలము-స. 1. నీలిచెట్టు. 2. నలుపు. సమా. నీలకంఠము-1. నెమలి. 2. పిచ్చుక. —కంఠుఁడు-శివుఁడు. —కము-నల్లకోఁతి. —లోహితుఁడు-శివుఁడు. నీలాంబరుఁడు-1. బలరాముఁడు. 2. నిర్ఋతి. 3. శని. (నల్లవలువతాలుపు) నీలాబ్జము-నల్లకలువ.
నీలాలి-తె. రెండు మొగముల దీపారాత్రికపుతట్ట.
నీలి-తె. 1. గారడము. 2. వి. నీలిచెట్టు. 3. నీలిమందు.
నీలిమ-స. నలుపు. [రూ. నిలుగు, ఈలుగు, ఇలుగు.
నీలుగు-తె. 1. ఒడలువిఱుచుకొను. 2. చచ్చు.
నీవరి-చూ. నివ్వరి.
నీవారము-స. నివ్వరి.
నీవి-స. 1. సంచిమొదలు. 2. పోఁకముడి. 3. పందెపుసొమ్ము. 4. చెఱసాల. [బ. ఈరు, మీరు.
నీవు-తె. నీశబ్దమునకు ప్రథమైకవచనము. రూ. ఈవు.
నీవృత్తు-స. 1. దేశము. 2. గ్రామము.
నీహారము-స. మంచు.

నీళ-స. విష్ణు భార్యలలో నొకతె.
నీళ్లు-వి. నీరు. సమా. నీళ్లవరుగు-ఉప్పు. క్రి.నీళ్లాడు-1. ప్రసవించు. 2. మునుఁగు.

## ను

ను-తె. 1. ద్వితీయా ప్రత్యయము. 2. క్రియా ప్రత్యయము. 3. సముచ్చయార్థకము.
నుంకు-తె. పస్తు.
నుక్కట-తె. చలనము.
నుగ్గు-తె. 1. నలఁగు. కృ. 2. చూర్ణము. 3. ఖండము. 4. బ. పిడకతునుక. క్రి. నుగ్గాడు. ఖండించు.
నుచ్చిళ్లు-తె. నురుఁగు.
నుచ్చు-తె.1.గొఱ్ఱెలమేఁకలచనులకుఁ జుట్టు గుడ్డ, నుచ్చుపాఁత. 2. పెంట్రుక.
నుడి-తె. 1. మాట. 2. అపవాదు. రూ. నొడి. —కాఁడు-మాటలమారి. సమా. —కారము-మాటచమత్కారము.
నుడుగు-తె. 1. చెప్పు. 2. కృ. మాట. రూ.నుడువు, నొడుగు, నొడువు. సమా. —ఱేఁడు-బృహస్పతి, గీష్పతి. నుడువరి - మాటలమారి, వాచాలుఁడు.
నుతము-స. నుతింపఁబడినది.
నుతి-స. స్తోత్రము. క్రి. నుతించు.
నుదురు-తె. నొసలు.
నునుపు-తె. స్నిగ్ధత. సమా. నునుపరి-నునుపుగలది. నునుసిగ్గు-కొంచెముసిగ్గు.
నున్న-తె. నునుపైన.
నుయి-తె. బావి. రూ. నుయ్యి, నూయి.
నుఱిపిడి-తె. నుఱుచుట.
నురుఁగు-తె. ఫేనము. రూ. నురువు. సమా. —దబ్బ-కారిజము.
నుఱుచు-తె. ధాన్యమును కాళ్లతో త్రొక్కినలుపు. కృ. నుఱిపిడి.
నుఱుపు-తె. 1. నుఱుచు. 2. చంపు.
నుఱుము-తె. 1. చూర్ణముచేయు.2.చంపు. 3.కృ. చూర్ణము. క్రి. నుఱుమాడు, నుఱుముచేయు.
నులక-తె. మంచమల్లెడు దారము. రూ. నుల్క.
నులి-తె. 1. ప్రేవులలోనినొప్పి. 2. చిక్కు.3.అల్పము. —పురుగులు-కడుపులోని సన్ననిపురుగులు. సమా. —వెచ్చ-గోరువెచ్చ. క్రి.—గొను-చిక్కువడు. —వెట్టు-నులుచు.
నులించు-తె. నులుచు. కృ. నులివు.
నులియు-తె. 1. స్థానముతప్పు. 2. పొడియగు.
నులుచు-తె. 1.పొడిచేయు.2.నలుపు. రూ.నులుపు.
నులుము-తె. 1. ప్రేళ్లతోనలుపు. 2. పెల్లగించు.
నులుసు-తె. న్యూనత.
నువు-తె. తిల. రూ. నువ్వు, నూగు, నూవు.
నుసలు-తె. 1. ఆలసించు. 2. పూను. 3. ఒడలు విఱుచుకొను.
నుసి-తె. 1. (పురుగులుతొలువఁగా రాలు) పొడి. 2. అల్పము. సమా. —పురుగు-ఘుణము.
నుసుఁగు-తె. తిరస్కరించు.
నుసుమ-తె. కన్నులయొద్ద ముసరెడి చిన్నదోమ.
నుసుము-తె. ఆకర్షించు.
నుసులు-తె. 1. మెదలు. 2. లాఘవము.

## నూ

నూఁగు-తె.1. ఆకులులోనగువానిపైనుండు సన్నని ముండ్లు. 2. లేఁత. సమా. —మీసము-అప్పుడే మొలచుచున్న మీసము.(అప్రే.నూనూఁగు)
నూక-తె. బియ్యపు తునుక.
నూకు-తె. 1. త్రోచు. 2. త్రోలు. కృ. నూకుడు.
నూగు-చూ. నువు.
నూచ-తె. పొడి. రూ. నూచము.
నూతనము-స. క్రొత్త. రూ. నూత్నము.
నూనియ-తె. (నూవు+నేయి)చమురు. రూ.నూనె. సమా. నూనెముడి-కీలుగంటు.
నూపురము-స. అందె.
నూయి-తె. చేఁదబావి. చూ. నుయి.
నూఱు-తె. 1.వాఁడిచేయు.2.మర్దించు. 3.శతము.
నూఱుచు-చూ. నుఱుచు. కృ. నూఱిపిడి, నూర్పిడి.
నూలిగరను-తె. బట్టతల.
నూలు-తె. ప్రత్తివడికినపోఁగు, తంతువు.
నూలుకొను-తె. 1. ఒప్పుకొను. 2. కుదురుకొను. 3. చక్కఁబడు. 4.పురికొను.రూ.నూల్కొను. కృ. నూలుకోలు, నూల్కోలు.
నూవు-చూ. నువు.
[నూఱుపు, నూర్పు.

## నృ

నృత్తము-స.నర్తనము. [సు తెలుపుచు ఆడెడి ఆట.
నృత్యము-స.శరీరహస్తనేత్రాభినయములచే భావము
నృపతి-స. రాజు. రూ. నరపతి. (ఇట్లే నృపాలుఁడు, నృపుఁడు. మొ.)
నృపలక్ష్మము-స. రాజునకుఁబట్టెడి తెల్లగొడుగు.
నృశంసుఁడు-స. క్రూరుఁడు.
నృసింహుఁడు-స. 1.నరసింహుఁడు. 2.నరశ్రేష్ఠుఁడు. (ఇట్లే నృహరి. మొ.)

## నె

నెంజిలి-తె. మనోవ్యథ. [నెక్కోలు.
నెక్కొను-తె. పొదుకొను. రూ. నెలకొను. కృ.
నెగడి-తె. మృగములు బెదరుటకును చలికాఁచుకొనుటకును వేసెడిమంట. [నెవడు.
నెగడు-తె. 1. బయలుమెఱయు. 2. వర్ధిల్లు. రూ.
నెగపు-చూ. ఎగపు.
నెగయు-చూ.ఎగయు.రూ.నెగయుదెంచు, నెవయు.
నెగవు-చూ. ఎగయు.
నెగులు-తె. 1. బాధ. 2.మనోవ్యథ. రూ.నెవులు.
నెగ్గు-తె. నిర్వహిల్లు.
నెటిక-తె. వ్రేళ్లకీళ్లకదలిక చప్పుడు. రూ. నెట్టిక.
నెట్టన-తె. అనివార్యముగా. రూ. నెట్టనము.
నెట్టికసీల-వి.(నైష్ఠికశీలుఁడు)సదాచారసంపన్నుఁడు.
నెట్టియము-తె. 1. చుట్టకుదురు. 2. గుండుపొగ. రూ. నెట్టెము.
నెట్టు-తె. 1. పూనిత్రోయు. కృ. 2. పూనిక. క్రి. నెట్టుకొను-1. పూనుకొను.2.నెలకొను. 3.అతిశయించు. 4. బలాత్కరించు.
నెట్టె-తె. సరియగుజత, ఉద్ది.
నెత్తము-తె. 1. పాచికలాట. 2.పందెము.3.కొండమీఁది విశాల సమప్రదేశము.సమా.నెత్తకమ్మ-పాచికలపందెము. నెత్తపలక - పాచికలాడెడు
నెత్తి-తె. తల. [పలక, అష్టాపదము.
నెత్తురు-తె. రక్తము. రూ. నెత్రు.సమా. —కందు-జొత్తుపావ. —ప్రొద్దు-సంధ్యాకాలము. —త్రావుడు-రక్కసుఁడు. —బంక-బంకవిరేచనము.
నెనడు-తె. మజ్జ, మూలగు.
నెనరు-తె. 1. కృతజ్ఞత. 2. ప్రేమము.
నెపము-వి. (నిభము) 1. వ్యాజము.2.కారణము.
నెప్పరము-తె. వేగము. [3.తప్పు.రూ.నెవము.
నెప్పరించు-తె. నిరూపించు, మూదలించు.
నెప్పు-తె. 1. స్థానము. 2. స్థైర్యము. 3. ఉపాయము. సమా.నెప్పరి-ఉపాయశాలి. క్రి.—కొను-
నెమకు-తె. వెదకు. కృ. నెమకుడు. [పొదుకొను.
నెమరు-తె. పశువులు మొదటతిన్నదానిని మరల నోటికిఁదెచ్చుకొని చక్కఁగా నమలుట,రోమంథము. క్రి. నెమరుచు.
నెమిలి-తె. మయూరము. రూ. నెవిలి. చూ.నమిలి.
నెమ్మి-తె. 1. ప్రేమ. 2. నెమ్మది. 3. సంతోషము. 4. క్షేమము. రూ. నమ్మిక. 5. నెమిలి. వి. (నేమి) వంజుళవృక్షము.సమా. —రౌతు-
నెమ్మిలి-చూ. నమిలి. [కుమారస్వామి.
నెమ్ము-తె. 1. తడి. 2. పలకలంటవేయ లోపలఁ జొప్పించుమేకు. [రూ. నెయ్యి, నేయి.
నెయి-తె. కరగింపఁగా ఏర్పడునది, ఘృతము.
నెయ్యము-వి. (స్నేహము) 1.చెలిమి. 2.ఇంపు. రూ. నెయ్యమి, నేయము. (పుం. నెయ్యుఁడు, నెయ్యరి. స్త్రీ. నెయ్యురాలు. సమా. నెయ్యపుటలుక-ప్రణయకోపము. —ఱేఁడు-మదనుఁడు. క్రి. నెయ్యమాడు-స్నేహించు.
నెఱ-తె. సమాసమందు నెఱవుశబ్దమునకు మీఁది వర్ణములోపింపఁగా మిగిలినరూపము. రూ.నెర, నెఱా, నేఱా. సమా. (నెఱజాణ, నెఱజోదు. మొ.) నెచ్చెలి-(నెఱ+చెలి) ప్రాణస్నేహితుఁడు, —రాలు. నెత్తమ్మి-పెద్దతామర. నెత్తావి-ఎక్కువ వాసన. (ఇట్లే నెమ్మది, నెవ్వగ, నెవ్వడి. మొ. గ్రహింపవలెను.) [నెఱసు.
నెఱఁకు-తె. 1. మర్మము. 2. జీవస్థానము. రూ.
నెఱక-తె. వెంద్రుక.
నెరదు-తె. గొగ్గి, విషమము.
నెరపు-తె. 1. నిండించు.2. పఱచు.3.నెఱవేర్చు. 4. వ్యాపింపఁజేయు. కృ.5.వ్యాపనము.6.అధికము. రూ. నెఱపు.

నెరయు-తె. 1. నిండు. 2. నెఱవేఱు. 3.వ్యాపించు. నెఱయు. ప్రే.నెరపు.కృ.నెరయిక, నెరవు.

నెరవు-తె. 1. పూర్తి. 2,వ్యాపనము. 3.మార్గము. 4. అధికము. 5. యుక్తము.6.విశాలము. రూ. నెఱవు. సమా. నెఱవాది - (నెఱపు+అది) నేర్పరి. నెఱవిద్దె - హస్తలాఘవముగల జాలవిద్య. చూ. నెర, నెఱ. క్రి. నెఱవేఱు-1. ముగియు. 2. సిద్ధించు.

నెఱసరి-తె. శూరుఁడు. [4. నలుసు.

నెరసు-తె. 1. తప్పు. 2. కళంకము. 3.దోషము.

నెరి-తె.వంకర. సమా. —కురులు-వక్రాలకములు.

నెఱి-తె. 1. అందము. 2. ఆచారము. 3. వస్త్రపుకుచ్చె. 4. క్రమము. 5. న్యాయము. 6. పరాక్రమము. 7. పూర్తి. 8. తెక్కు. 9. వక్రత. (నెరి) 10. విధము. 11. ఱ. వెంద్రుకలు. 12.వంకర వెంద్రుకలు.క్రి. —పడు-సిద్ధించు. సమా. నెన్నడుము-అందమైన నడుము. (ఇట్లే నెన్నడ, నెన్నుదురు, నెన్నొసలు, నెమ్మేను, నెమ్మోము, మొ. గ్రహింపనగు.)

నెఱిక-తె. 1. వస్త్రపుకుచ్చె. 2. పైఁటపావడ.

నెఱియ-తె. 1. చీలిక. 2. నేలపగులు. రూ.నెఱె, నెఱ్ఱియ, నెఱ్ఱె.

నెరుము-తె. 1.రాచు.2.నెరపు.

నెల-తె. 1. మాసము. 2. చంద్రుఁడు. 3. పున్నమ. 4. స్థానము. 5. కర్పూరము. సమా. —కట్టు-ఠాతికట్టడపునేల, కుట్టిమము. —కూన-1. బాలచంద్రుఁడు. 2. నఖక్షతము. —చూలి-బుధుఁడు. (ఇట్లే నెలపట్టి, మొ.) —తాలుపు-చంద్రశేఖరుఁడు.—త్రావడము-చకోరము, నెలపులుఁగు. —పాలు-చంద్రకళ. —మేపరి-రాహువు.—ఱాయి-చంద్రకాంతశిల.—వంక-నెలకూన.—కోల-అర్ధచంద్రబాణము.—వత్తి-పచ్చకప్పురపుపలుకు. —వీసము-నెలపాలు. —వెలుఁగు-వెన్నెల.

నెలఁత-తె. ఆఁడుది. రూ. నెలఁతుక.

నెలకువ-తె. స్థానము.

నెలగ-తె. ధనము.

నెలవు-తె. 1. వాసస్థానము. 2. స్థానము. 3. పరిచయము. క్రి. —కొను-1. నిలుకడయగు. 2. నిలుచుండు. రూ. నెలకొను.

నెల్లి-తె. అగ్నిమంథవృక్షము, ఉసిరిక.

నెవడు-చూ. నెగడు.

నెవము-చూ. నెపము.

నెవయు-చూ. నెగయు.

నెవిలి-చూ. నెమిలి.

నెవులు-చూ. నెగులు.

నెవ్వ-తె. 1. దారిద్ర్యము. 2. అపద. 3. వఱపు.

నెళవు-తె. 1. పరిచయము. రూ. నెలవు. 2. మర్మము. సమా. నెళవరి-1. పరిచయముకలవాఁడు. 2. మర్మమెఱిఁగినవాఁడు.రూ.నెలవరి.

## నే

నే-తె. నేయి.

నేఁజెల్ల-తె. (నేస+చెల్లె) సంతాపార్థకము.

నేఁడు-తె.(ఈ+నాఁడు) ఈదినము.

నేఁత-తె. నేయుట. సమా.—కాఁడు,నేయువాఁడు-తంతువాయుఁడు. —పురుగు - సాలెపురుగు. నేఁతరి-నేఁతకాఁడు.

నేజ-హిం. ఈఁటె. రూ. నేజము, నేరిజము, నేజా.

నేటు-తె. 1. నిశ్చయము. 2. దృఢము. క్రి.నేటించు, నేటుకొను.

నేత-స. ప్రభువు.

నేత్రము-స. 1.కన్ను. 2.తరిత్రాడు.3. వలిపము.

నేదిష్ఠము-స. మిక్కిలి సమీపము.

నేను-తె. నాశబ్దప్రథమైకవచనము. రూ. ఏను.

నేపథ్యము-స. 1.వస్త్రాద్యలంకారము. 2. నాట్యస్థానము.రూ.నైపథ్యము.

నేమకము-వి. (నియామకము) నియమము. రూ. నేమము.క్రి.నేమించు.

నేమి-స. 1. బండికిట్టు. 2. గిఱక.

నేము-తె. 1. ధాన్యము చేటలోఁబోసికొని యిటునటుత్రిప్పు. 2.నేనుయొక్క బహువచనరూపము. రూ. ఏము,మేము.

నేయము-చూ. నెయ్యము.

నేయి-చూ. నెయి.

నేయు-తె. 1. నేఁతచేయు. 2. చాపలులోనగునవి అల్లు. కృ. నేఁత.

నేరమి-తె. 1. అజ్ఞానము. 2. దోసము. సమా. నేరఁబోతు-తెలియనివాఁడు.

నేరము-తె. తప్పు. సమా. నేరగాఁడు, నేరగత్తె.

నేఱా-చూ. నెఱ.

నేరిమి-తె. సామర్థ్యము. రూ. నేరుపు,నేర్మి,నేర్పు.
నేరుచు-తె. 1. ఓపు. 2. అభ్యసించు. రూ. నేర్చు. కృ. నేరిమి, నేరుపు.
నేరుపు-తె. 1. నేరవఁజేయు. 2. సామర్థ్యము. సమా. —కాఁడు, —లాఁడు, నేరుపరి,నేర్పరి-సమర్థుఁడు.
నేరెడు, నేరేడు-తె. జంబూవృక్షము. సమా. నేరెటేరు-జంబూనది. —దీవి-జంబూద్వీపము.
నేల-తె. 1. భూమి. 2. ప్రదేశము. 3. దేశము. సమా. —చూలి-సీత, భూపుత్త్రి. —తాలుపు-భూధరము. —పట్టి-1. అంగారకుఁడు. 2.నరకాసురుఁడు. 3. సీత. —మాలియ - భూమిలో పలియిల్లు. —ఱేఁడు-రాజు. —వేలుపు-భూసురుఁడు. క్రి. నేలఁగలుపు-చంపు. నేలకుఁగోలకుఁదెచ్చు-క్రిందు మీఁదుచేయు.
నేవడము-తె. మణులుగ్రుచ్చిన హారము. రూ. నేవళము, నేహరము.
నేస్తము-వి. (స్నేహము) నెయ్యము. సమా.నేస్తకాఁడు-మిత్రుఁడు. స్త్రీ.నేస్తకత్తె, నేస్తురాలు.

## నై

నైకభేదము-స. అనేక భేదములుకలది.
నైగనిగ్యము-స. నిగనిగ లాడుట.
నైగమము-స. వేదాంతము. [పాలు గల ఆవు.
నైచికి-స. మంచి రూపము ప్రాయము సమృద్ధిగ
నైచ్యము-స. నీచభావము.
నైజము-స. 1. తనది. 2. స్వాభావికము.
నైపథ్యము-చూ. నేపథ్యము. [ణ్యము.
నైపుణము-స. నేర్పరితనము. రూ. నైపుణి, నైపు
నైమిత్తికము-స. నిమిత్తమువలన కలిగినది.
నైయాయికుఁడు-స. న్యాయశాస్త్రము తెలిసినవాఁడు.
నైరాశ్యము-స. ఆశలేనితనము.
నైరృతి-చూ. నిరృతి.
నైరృతుఁడు-స. నాలవదిక్కు నేలువాఁడు, నిరృతి.
నైర్ఘృణ్యము-స. దయలేనితనము.
నైర్మల్యము-స. నిర్మలత్వము.
నైష్ఠికుఁడు-స. నిష్ఠగలవాఁడు.
నైసర్గికము-స. స్వాభావికము.

## నొ

నొంచు-తె.నొప్పించు.[గలిగినపల్లము.3.ముడుత.
నొక్కు-తె. 1. అదుము. కృ. 2. అదుముటచేఁ
నొక్కుడు-తె. 1.ముడుత. 2.అదుముడు. [రము.
నొగ-తె. కాఁడికిఁదగిలించు నిడుపు ప్రాను, కూబ
నొగులు-తె. 1. వికలమగు. 2.నొచ్చు.కృ.3.వికలమగుట. 4. నొప్పి.
నొచ్చిళ్లు-తె. చొంగ.
నొచ్చు-తె. 1. నొప్పిచెందు. 2. దారిద్ర్యాదులచే పీడనొందు. రూ. నోయు. కృ. నొప్పి, నొవ్వి, నొవ్వు, నోవి, నోవు. క్రి.—కొను - పరితాపమొందు. కృ. నొచ్చుకోలు.
నొడి-చూ. నుడి. సమా. —కాఁడు - నుడికాఁడు. —కారము-నుడికారము.
నొడుగు, నొడువు-చూ. నుడుగు.
నొడుచు-తె. తప్పులుపట్టు. కృ. నొడుపు.
నొప్పి-తె. 1. బాధ. 2. ఆపద.సమా. —కుంటి-వ్యాధిగ్రస్తుఁడు.
నొల్లు-తె. బిడ్డలు నోట వ్రేళ్లిడుకొని చప్పరించు.
నొవ్వి-తె. 1. వేదన. 2.వ్యాధి. రూ. నొవ్వు, నోవి, నోవు.
నొసలు-తె. నుదురు, ఫాలము.

## నో

నోఁచు-తె. వ్రతమాచరించు. కృ. నోఁత, నోము.
నోఁత-తె. నోఁచుట. [వ్రతము.
నోము-తె. 1. వ్రతముచేయు.2.పోఁగొట్టు.3.కృ.
నోయు-చూ. నొచ్చు. కృ. నోవి, నోవు.
నోరు-తె. ముఖద్వారము,వదనము. సమా. —మెంగ-మూఁగ. నోటిబీగము-దేవతాప్రార్థనచే దౌడలయందు కుట్టుకొను లోహపుకమ్మి. క్రి. నోరూరు-1. రుచిగల వస్తువులుతిను కోరికచే నోటనీళ్లూరు. 2. ఆపేక్షించు. నోరెత్తు-మాటాడయత్నించు.
నోవి, నోవు-చూ. నొవ్వి, నోయు.

## నౌ

నౌ-చూ. నవ్వు. [నడపుగడ.
నౌక-స. ఓడ, నావ. సమా. నౌకాదండము - ఓడ
నౌకు-తె. మొత్తి. రూ. నవుకు.

నొడుకొట్టు-తె. మిణకరించు. రూ. నవుడుకొట్టు.
నౌబతు-హిం. ఒక వాద్యము.
నౌరు-తె. మృదువు. రూ. నవురు.

## న్య

న్యగ్రోధము-స. 1. మఱ్ఱి. 2. జమ్మి.
న్యర్బుదము-స. పదియర్బుదములు.
న్యస్తము-స. ఉంచఁబడినది.
న్యాయము-స. 1. తగవు. 2. స్వధర్మమునుండి చలింపకుండుట. 3. తర్కశాస్త్రము. వి. నాయము.
న్యాయ్యము-స. న్యాయముతోఁగూడినది.
న్యాసము-స. 1. ఉంచుట. 2. ఇల్లడ. 3. వాడిక.
న్యూనము-స. తక్కువైనది.

## ప

పంకము-స. బురద. సమా. పంకజము-తామర. రూ. పంకేజము. —రుహము-తామర. రూ. పంకేరుహము.
పంకా-హిం. పెద్ద విసరుఁగఱ్ఱ.
పంకి-వి. (పంకము) బురద.
పంకించు-తె. 1. పట్టించు. 2. గౌరవించు, లక్షించు. 3. చలించు.
పంకిలము-స. బురదగలది.
పంకెన-తె. తడి, పదను.
పంక్తి-స. 1. వరుస. 2. పది.
పంగ-తె. 1. ఎడముగాచాఁగినశాఖ. రూ. ప్రంగ, ప్రగ్గ. 2. పని. (నిందయందు) సమా. —నామము-నడుమ ఎడముగలుగ తీర్చిన నామము.
పంగటి-తె. ఎడముగలది. క్రి. పంగటించు. ఎడముగాచాఁచు. సమా. —కాళ్లు - కొన ఎడముగా వంగినకాళ్లు, దొడ్డికాళ్లు.
పంగము-తె. దేవబ్రాహ్మణ వృత్తులపై తీయుచతుర్థాంశమైన కప్పము.
పంగిడి-తె. ఓదము. రూ. పంగెన.
పంగు-తె. భయము.
పంగువు-స. ఈచకాలుగలవాఁడు.
పంచ-తె. 1. ఇంటిముందు భాగము. 2. పజ్జ. సమా. —పాక-తాటువారము.
పంచకము-స. అయిదు. సమా. పంచగవ్యము-ఆవుపేఁడ, పంచితము, పాలు, పెరుగు, నేయి అనునైదు. పంచగూఢము - తాఁబేలు. (ఇట్లే పంచగుప్తము. మొ.) —జనుఁడు-మనుజుఁడు. —త్వము-చావు. —దశి-1. అమవస. 2. పున్నమ. —నఖము - 1. పులి. 2. ఏనుఁగు. 3. తాఁబేలు. —పాత్రము-అయిదు పాత్రములు. —శరుఁడు-మదనుఁడు. (ఇట్లే పంచసాయకుఁడు. మొ.) —శాఖము-చేయి. —సారము-చక్కెర. వి. పంచదార. పంచాంగము-తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను తెలియఁజేయు గ్రంథము. —ననము-సింహము. (ఇట్లు పంచాస్యము. మొ.) —ననుఁడు-శివుఁడు. (ఇట్లు పంచాస్యుఁడు. మొ.) —యతి - న్యాయము తీర్చుటకుచేరిన ఐదుగురి కూటమి.
పంచకరపాటులు-తె. అత్యధిక దుఃఖములు.
పంచదార-వి. (పంచసారము) చక్కెర.
పంచబంగాళము-తె. 1. దూరము. 2. నాశము.
పంచమము-స. 1. అయిదవది. 2. సప్తస్వరములలో అయిదవది. 3. కోయిల.
పంచమి-స. పక్షమందైదవతిథి.
పంచముఁడు-స. మాలవాఁడు.
పంచవన్నె-వి. అయిదు రంగులు.
పంచాణము-వి. శిల్పము. సమా. —వాఁడు-శిల్పి.
పంచాణుఁడు-స. శిల్పి.
పంచాది-తె. 1. పంచ. 2. పంచపాక.
పంచారము-వి. (ప్రచారము) 1. వ్యాపనము. 2. అతిశయము. క్రి. పంచారించు.
పంచితము-తె. గోమూత్రము. క్రి. పంచితించు.
పంచు-తె. 1. ఆజ్ఞాపించు. 2. పంపు. 3. భాగించు. (పంచివేఁత-చందా.)
పంచె-తె. అంగవస్త్రము. రూ. పంచియ.
పంజ-తె. ఆవిక.
పంజరము-వి. స. పక్షులనుంచి పెంచుగూఁడు.
పంజి-తె. కప్పము.
పంజు-తె. 1. దివ్వటీ. 2. సుడుదు. 3. విడవలిలోనగువానిగంట. రూ. పముజు.
పంట-తె. 1. పండుట. 2. సేద్యము. 3. ఫలము. సమా. —వలఁతి-భూమి. —సాల-1. ఉగ్రాణము. 2. కణజము.
పంటి-చూ. పనఁటి.
పంటించు-తె. 1. జాగుచేయు. 2. తడఁబడు.

పంచె-తె. సాలెవాఁడు నూలుచుట్టెడు సాధనము. రూ. పరఁజె.
పంట్రు-తె. చిల్లులుగల అలుఁగులు మూఁడు నాలుగు గలకఱ్ఱ. క్రి. పంట్రించు - పంట్రుతోఁబొడుచు.
పండితుఁడు-స. విద్వాంసుఁడు.
పండు-తె. 1. ఫలించు. కృ. పంట. 2. శయనించు. రూ. పరుండు, పండుకొను. కృ. 3. ఫలము. 4. పండినది. సమా. పండుటాకు-పండిన ఆకు. —వెన్నెల-నిండువెన్నెల.
పండుఁడు-స. నపుంసకుఁడు.
పండుగ-తె. 1. ఉత్సవము. 2. సంక్రాంతిలోనగునది. రూ. పండుగు, పండువ, పండువు.
పండ్రెండు-తె. (పది+రెండు) ద్వాదశ సంఖ్య.
పంతము-తె. 1. పోటీ. 2. ప్రతిజ్ఞ. 3. పౌరుషము. 4. విధము. క్రి. పంతగించు.
పంతులు-వి. (పండితులు) ఉపాధ్యాయుఁడు.
పంద-తె. పిఱికి.
పంది-తె. వరాహము. సమా. —కొక్కు-మూషిక.
పందిరి-తె. కాయమానము. రూ. పందిలి.
పందుము-తె. (పది+తూము) పదితూములు.
పందెము-వి. (పణితము) జూదములోనగువానియందు ఒడ్డుధనము. రూ. పందియము, పన్నిదము.
పందొమ్మిది-తె. (పది+తొమ్మిది) ఏకోనవింశతి.
పంపకము-తె. 1. పంపుట. 2. చందా.
పంపర, పంపరపనస-తె. అనాసచెట్టు.
పంపిణి-తె. 1. పంచిపెట్టుట. 2. పద్ధతి.
పంపు-తె. 1. ఆజ్ఞాపించు. 2. అంపించు. కృ. 3. ఆజ్ఞ. 4. ఆజ్ఞాపించినపని. 5. వరుస. 6. మారణకర్మము.
పంబ-తె. (వ్యు. పంబునది) జంటవాద్యసాధనము.
పంబు-తె. అతిశయించు. రూ. పమ్ము. సమా. —త్రాళ్లు-ఈడ్చికట్టుత్రాళ్లు. [పకాపక.
పకపక-తె. నవ్వుటయందగు ననుకరణము. రూ.
పక్క-తె. పడక. వి. 1. పక్షము. 2. పార్శ్వము.
పక్కణము-స. బోయపల్లె. [రూ. ప్రక్క.
పక్కణి-తె. బరణి.
పక్కము-తె. తోడు. వి. (పక్షము) మాసార్ధము.
పక్కి-వి. (పక్షి) పులుఁగు. సమా. —డాలువేలుపు-గరుడధ్వజుఁడు. —మొదలివాఁడు-కిన్నరుఁడు. —రాయఁడు-గరుడుఁడు.
పక్కియ-వి. (పార్శ్వము) తట్టు. [ననుకరణము.
పక్కు-తె. 1. ఎండినపట్టు. 2. నవ్వుటయందగు
పక్కున-తె. తటాలున. [కవచము.
పక్కెర-వి. (ప్రఖరము) గుఱ్ఱము మొదలగువాని
పక్కెరాలు-తె. అంతఃపురపుకావలికత్తె. [దినది.
పక్వము-స. 1. పరిపాకమునొందినది. 2. చేటుమూ
పక్షకము-స. 1. దిడ్డివాకిలి. 2. ప్రక్క.
పక్షతి-స. 1. ఱెక్కమొదలు. 2. పాడ్యమి.
పక్షము-స. 1. నెలయందుపదునైదుదినములు. (ఇవి శుక్లపక్షము కృష్ణపక్షము అనిరెండు) 2. ఱెక్క. 3. ప్రక్క. 4. పగ. 5. సహాయుఁడు. సమా. పక్షచరము-1. కదుపునుబాసి యొంటిఁదిరుగు ఏనుఁగు. 2. పక్షి. —చరుఁడు-చంద్రుఁడు. —పాతము-ఒకప్రక్కకొఱగుట. పక్షాంతము-1. పున్నమ. 2. అమాస. క్రి. పక్షీకరించు-పక్షముంచు. [పక్కి)
పక్షి-స. (వ్యు. పక్షములుకలది) పులుఁగు. (వి.
పక్షిణి-స. 1. రెండుపగళ్ళతోఁగూడినరాత్రి. 2. రాత్రి. 3. పున్నమ. [3. అకరువు.
పక్ష్మము-స. 1. ఱెప్పవెండ్రుక. 2. పక్షిత్రుప్పుడు.
పక్ష్మలము-స. పక్ష్మములుకలది. క్రి. పక్ష్మలించు-ఱెప్పవేయు.
పగ-తె. 1. విరోధము. 2. విరోధి. క్రి. —గొను. —ఁబట్టు. సమా. —దారి-విరోధము గొన్నవాఁడు.
పగడ-తె. పాచికలమీఁది యొంటిచుక్క. సమా. —సాల-సొగటాలపలక. [పగడపురిక్క-ఆర్ద్ర.
పగడము-వి. ప్రవాళము. రూ. పవడము. సమా.
పగతుఁడు-తె. (పగ+అతఁడు) విరోధి. రూ. పవతుఁడు. స్త్రీ. పగతురాలు.
పగఱు-తె. బ. శత్రువులు.
పగలు-తె. దినము. రూ. పవలు. సమా. పగటివేలుపు-సూర్యుఁడు. (ఇట్లుపగలింటిదొర, మొ.)
పగిది-వి. (ప్రకృతి) 1. విధము. 2. కప్పము. రూ. పవిది.
పగులు-తె. 1. చీలు. 2. కృ. చీలిక. రూ. పవులు. పౌలు. రూ. పగులఁబాఱు, పగుళ్లవాఱు.

పగ్గము-వి. (ప్రగ్రహము) 1. పశ్వాదులగట్టుత్రాడు. 2. త్రాడు. రూ. ప్రగ్గము.
పగ్గె-వి. (వ్రజ్ఞ) 1. సామర్థ్యము. 2. సామర్థ్యమును దెలుపు మాట. రూ. పగ్గియ.
పచ-స. పాకము. క్రి. పచించు.
పచనము-స. వండుట.
పచరణ-తె. నటన. క్రి. పచరించు - 1. ప్రవర్తించు. 2. ప్రసరింపఁజేయు. 3.అమ్మటకునరకులమర్చు. 4. వలపఱచు. 5. ప్రయోగించు.6. నడపు. 7. నవరించు. 8. ప్రకటించు. కృ. పచరింపు.
పచారము-తె. అంగడి. [రూ. పచరించు.
పచారించు-తె. 1. నడపు. 2. ప్రసరింపఁజేయు.
పచారు-వి.(ప్రచారము) విహారము.రూ.పచేరము.
పచేళిమము-స. తనంతట పక్వమైనది.
పచ్చ-తె. 1. పసరువన్నె. 2. పసుపువన్నె. 3. మరకతమణి. 4. కాళ్లేతులలో పొడుచుకొను రేఖ. సమా. —ఁబ్రాలు-అక్షతలు. —కన్నులమెకము-సింహము, హర్యక్షము. —కప్పురము-ఒకతెగకర్పూరము.—వలువదారి-పీతాంబరుఁడు,విష్ణువు. —వారువపుజోదు-1.సూర్యుఁడు, హరిదశ్వుఁడు. 2. మదనుఁడు, శుకవాహుఁడు. —విలుతుఁడు-మదనుఁడు.
పచ్ఛదము-వి. (ప్రచ్ఛదము) 1. పఱపుమీఁది దుప్పటి. 2. వస్త్రము,
పచ్చడి-తె. 1.కాయలు పచ్చిగా నూరి చేసినకూర. ఊరుఁబిండి. 2. పలుచనికూర. 3. తునుక.
పచ్చముపాడు-తె.(పాడు+పాడు)మిక్కిలిపాడు.
పచ్చి-తె. 1. తడిగలది. 2. ఉడుకనిది. 3. ఎండనిది. 4. మఱుఁగు లేనిది. 5. కాలనిది. 6.తేఱనిది. క్రి. — దేఱు-పచ్చియగు. సమా. —బియ్యము-ఉప్పుడుచేయనిబియ్యము.
పచ్చిక-తె. పచ్చికసవు.
పచ్చెము-తె. చూచుచుండఁగా దొంగిలించుట,పశ్యతోహరము. రూ. పచ్చియము. సమా.పచ్చె [కాఁడు,—కత్తె.
పజ-వి. (ప్రజ) జనము.
పజ్జ-వి. (పశ్చాత్) 1. వెనుక. 2. సమీపము.
పటము-వి. (స్ఫటము) పాముపడగ. స. 1. వస్త్రము. 2. చిత్తరువువ్రాయువస్త్రము మొదలగునది. సమా. పటకారుఁడు-సాలెవాఁడు. —వాసము-గుడారము.[కంటిపొర.4.గ్రంథభాగము.
పటలము-స. 1. సమూహము. 2. ఇంటికప్పు.3.
పటలి-స. సమూహము.
పటవణి-తె. వ్యాపనము. క్రి. పటవణించు.
పటహము-స. 1. తప్పెట. 2. యుద్ధవాద్యధ్వని.
పటా-చూ. పట్టా.
పటాణి-తె. పఠానుదేశపుగుఱ్ఱము.
పటాపంచ-తె. 1. అగోచరము. 2. చెల్లాచెదరు.
పటాలము-ఆం. (Battalion) దండు.
పటిక-వి. (స్ఫటికము) బంగారునకు మెఱుఁగు కలిగించు ఒక యుప్పు. రూ.పటికారము, పటికము. సమా. —బెల్లము-కలకండ.
పటికిరింత-తె. చలము.
పటితళించు-తె. చఱచు.
పటిమ-స. 1. నేర్పు. 2. ఓపిక.
పటిష్ఠము-స. మిక్కిలిపటువైనది.
పటీరము-స. 1.చందనము. 2.శ్రీచందనవృక్షము.
పటుకాఱు-తె. కాలినయినుము నెత్తుసాధనము, సందంశము. రూ. పట్టుకాఱు.
పటువు-స. 1. చొరవ. 2.తెవులులేమి.3.నేర్పరి.
పటేలు-(మహారాష్ట్ర.) గ్రామాధికారి.
పటోలి-స. పొట్లతీఁగ, దాని కాయ.
పట్ట-తె. 1. చెట్టుమీఁదితోలు. 2. గోనెపట్ట.
పట్టడ-తె. వడ్రంగిలోనగువారుపనులుచేయుచోటు.
పట్టణము-స. నగరము. రూ. పట్టనము, పత్తనము.
పట్టపగలు-తె. (పగలు+పగలు.) మట్టమధ్యాహ్నము. [నూలు.3.కిరీటము.4. సన్నెకల్లు.
పట్టము-తె. బిరుదు. స. 1. రాజ్యము, 2. పట్టు
పట్టా-తె. 1. రెండువైపుల వాదరగల పెద్దకత్తి. 2. గోనెపట్ట, మొ. రూ. పటా, హిం. ప్రభువు రైతులకిచ్చు కవులు.
పట్టి-తె. 1. పంచమీవిభక్తిప్రత్యయము. 2. బిడ్డ. స. 1. పలక. 2. నొసటిపట్టము. రూ. పట్టిక.
పట్టించు-తె. ఆరంభముచేయించు. కృ. పట్టింపు.
పట్టింపు-తె. 1.ఆరంభముచేయించుట. 2.అక్కఱ.
పట్టియ-తె. 1. మంచములోనగువానిపట్టె. 2. రే

ఖ. వి. (పట్టిక) *1.* పలక. *2.* నొసటిపట్టము. రూ. పట్టె.
పట్టియము-వి. (పట్టిసము) పెద్దకత్తి. రూ. పట్టెము.
పట్టిలి-తె. ఎడముగావంచినచేరు. (పట్టెఁడు)
పట్టిసము-స. అడ్డకత్తి. రూ. పట్టిశము.
పట్టీ-తె. లోపల వక్కలుపెట్టిచుట్టిన తమలపాకు చుట్ట. హిం. జాపితా.
పట్టు-తె. *1.* చెల్లు. *2.* పద్దుపూను. *3.* ఇంపగు. *4.* ఆరంభించు. *5.* అంటు. *6.* అక్కఱకలుగు. *7.* కలుగు. *8.* గ్రహించు. *9.* అవలంబించు. *10.* ఊఁదు. *11.* పిసుకు. కృ. *12.* గ్రహణము. *13.* పద్దు. *14.* పూఁత. *15.* వాసస్థానము. *16.* అవకాశము. *17.* అవలంబము. *18.* విషయము. *19.* కారణము. *20.* పట్టుదల. *21.* ఘట్టము. *22.* ఒక పురుగువలనఁ గలిగెడు నూలు. సమా. —ఁగొమ్మ-ఆధారము. —కాఱు-చూ. పటుకాఱు. —దల-వదలనిపట్టు. —పురుగు-*1.* పట్టునుగలిగించుపురుగు. *2.* ఇంద్రగోపము. —బడి-ఒకనిదానికై వ్యయమైన ధనము. క్రి. —కొను-*1.* నెలకొను. *2.* బిగిసికొను. *3.* గ్రహించు. —వడు-*1.* చిక్కు. *2.* విదితమగు.
పట్టె. చూ. పట్టియ. సమా. —మంచము-నవారు పట్టె అల్లినమంచము. —వర్దనము-వెడలుపుగా దళముగా పెట్టిన నామము.
పట్టెడ-తె. *1.* నవారు. *2.* పశ్వాదులకు మెడకుఁ గట్టు పట్టె. *3.* కమసాలివాని దాఁగలి.
పట్నము-వి. (పట్టనము) నగరము.
పఠనము-స. చదువు. క్రి. పఠించు.
పఠిత-స. పఠించువాఁడు.
పఠితవ్యము-స. పఠింపఁదగినది.
పడఁకు-తె. *1.* సందు. *2.* గుహ. రూ. పణఁకు.
పడఁత-తె. *1.* హనువు. *2.* కాఁడిభారము. రూ. పణఁత. [తుక.
పడఁతి-తె. ఆఁడుది. రూ. పడఁతుక, పణఁతి, పణఁ
పడక-చూ. పడుక.
పడగ-వి. *1.* (పతాక) టెక్కెము. *2.* (స్ఫట) పడగ. సమా. —దారి-పాము.
పడచు-చూ. పడయు.
పడత-తె. నాఁగటిగొడగ. రూ. పణత.
పడపు-తె. *1.* ఆర్జనము. *2.* సంపాదించినధనము. సమా. —ఁగొమ్మ-వేశ్య. (ఇప్లె—ఁజెలి,—ఁజేడియ, మొ.)
పడమర-తె. (పడు+మల) పశ్చిమదిక్కు. సమా. పడమటికొండ-అస్తాద్రి. —దొర-వరుణుఁడు.
పడయు-తె. *1.* పొందు. *2.* సంపాదించు. రూ. పడచు. *3.* (బిడ్డను) కను. కృ. పడపు.
పడలు-తె. రాసులు.
పడవ-తె. *1.* యుద్ధము. *2.* ప్రళయము. *3.* వి. (ప్లవము) తెప్ప.
పడవలము-తె. సేనాముఖము. [
పడవాలు-తె. సేనాపతి. రూ. పడాలు.
పడసాల-తె. కూటము.
పడి-తె. రెండుసోలలు.
పడికట్టు-తె. *1.* మర్యాద. *2.* సోపానము.
పడిగ-వి. (పట్టకము) తమ్మయుమి సెడుపాత్రము.
పడిగల్లు-తె. తుపాకిగుండు. [రూ. పడిగము.
పడిగాపు-తె. పంచనుగాచియుండు సేవకుఁడు.
పడితరము-(అఱవ) బత్తెము.
పడిదియ-తె. చాకలిబట్టలుఅద్దెకిచ్చుట. రూ. పడిదె.
పడియ-తె. నీళ్లనిలిచిన చిన్నపల్లము. రూ. పడె.
పడియచ్చు-తె. ఒత్తి రూపమేర్పఱచుటకై తొలిచిన అచ్చు.
పడివాగె - తె. ఎక్కుట కాయ త్తపఱచు గుఱ్ఱపు పడిసెము-వి. (ప్రతిశ్యాయము) జలుబు. [సవరణ.
పడిహారి-వి. (ప్రతీహారి) ద్వారపాలకుఁడు. రూ. పణిహారి.
పడు-తె. *1.* పతనమగు. *2.* రాలు. *3.* శయనించు. *4.* చచ్చు. *5.* అనుభవించు. *6.* పొందు. సమా. —వరి-కోయునపుడు రాలి మొలిచినవరి పైరు. [శయనగృహము.
పడుక.తె. పఱపు. రూ. పడక. సమా. పడుకటిల్లు-
పడుకు-తె. జాయి.
పడుగు-తె. నేఁతయందలినిడుపునూలు.
పడుచు-తె. *1.* వ్యభిచరించు. కృ. పడుపు. *2.* కన్యక. *3.* బాలిక. *4.* బాలుఁడు. సమా. —ఁజేఁత-జారత్వము. —రాసి-కన్యారాశి. —వాఁ

డు-యువకుఁడు. (స్త్రీ. పడుచుది.)
పడుపు-తె. వ్యభిచారము. సమా.—ఁగత్తె-జారిణి.
—ఁగూడు-జారత్వముచేచేయు జీవనము.
పడ్డ-తె. తొలిచూలియావు. [ధనము.5.జూదము.
పణము-స. 1. పందెము. 2. వెల. 3. కూలి.4.
పణవము-స. ఉడుక.
పణస-స. పనసచెట్టు. [చేయఁబడినది.
పణితము-స. 1.పొగడఁబడినది. 2. పందెముగా
పణిహారి-చూ. పడిహారి.
పణ్యము-స. 1. పొగడఁదగినది. 2. అమ్మఁదగి
నది. సమా. —వీథి-అంగడివీథి. పణ్యాంగన-
వేశ్య. పణ్యాజీవుఁడు-వర్తకుఁడు.
పణ్యారము-తె. కజ్జము. [(వ్యు. పోవునది.)
పతంగము-స. 1.పక్షి. 2. మిడుత. 3.బాణము.
పతంగుఁడు-స. సూర్యుఁడు. [బిళ్ల.
పతకము-వి. (పదకము) హారపునడిమిరత్నపు
పతగము-స. పక్షి. రూ. పతంగము.
పతత్రము-స. ఱెక్క.
పతత్రి-స. పక్షి, గరుత్మంతము.
పతద్గ్రహము-స. తమ్మపడిగము.
పతనము-స. పడుట.
పతాక-స. 1. టెక్కెము. 2. టెక్కెపుకంబము.
పతాకిని-స. సేన.
పతి-స. 1. మగఁడు. 2. ఏలిక. (స్త్రీ. పత్ని.)
సమా. పతింవర-తనయంత మగనివరించు ఆఁ
డుది, వర్య.పతిపత్ని-మగనాలు.రూ.పతివత్ని.
—వ్రత-క్రొత్తడి. [వాఁడు.
పతితుఁడు-స. 1. పడినవాఁడు. 2. పదవిచెడిన
పతిమ-వి. ప్రతిమ.
పత్తనము-చూ. పట్టణము.
పత్తి-తె. దూది. రూ. ప్రత్తి. స. 1. గమనము.
2. ఒకరథము, ఒకయేనుఁగు,మూఁడుగుఱ్ఱము
లు, ఏవురుకాల్బురు గల సేన. 3.కాలిబంటు.
పత్తిరి-వి. (పత్రము) పూజకుపయోగించు ఆకు.
పత్ని-స. భార్య. [రూ. పత్రి.
పత్రము-స. 1. ఆకు. 2.ఱెక్క. 3.వ్యవహారము
చెల్లుబడికై వ్రాసికొనుకాగితము.4.వాహనము.
5. బాణము. సమా. పత్రపరశువు-ఆకుత్రాయి.
—భంగము-మకరికాపత్రము.—రథము-పక్షి.
—రేఖ-పత్రభంగము. రూ. పత్రలేఖ.
పత్రి-వి. చూ. పత్తిరి. స. 1. డేగ. 2. పక్షి. 3.
బాణము. 4. మ్రాను.
పత్త్రిక-స. కాగితము. [పద్ధతి.
పథకము-స. ఎక్కములు మొదలగు మానము.2.
పథము-స. మార్గము.
పథికుఁడు-స. తెరువరి.
పథ్యము-స. హితము. [మఱియు.రూ.పదపడి.
పదంపడి-తె. (పదము+పడి) 1. వెనుక. 2.
పదకము-వి. (పథకము) పద్ధతి. స. పతకము.
పదటము-తె. తత్తఱము. రూ. పదటు.
పదడు-తె. బూడిద.
పదను-తె. 1. సమయము. 2. వాఁడి. 3. పరిపా
కము. 4. తేమ. రూ. పదును. క్రి.—కొను-
తడియు.
పదము-తె. పాట. స. 1. కాలు. 2. పద్యమం
దునాలవభాగము. 3.చిహ్నము. రూ. పాదము.
4. శబ్దము. 5. వాక్యము. 6. స్థానము.సమా.
పదగుఁడు-కాలిబంటు.
పదరు-తె. 1. త్వరపడు. 2. కోపించు. 3.చలిం
చు. 4. ఆక్షేపించు. కృ. పదటము, పదటు.
పదవి-వి. (పదము) ఉన్నతస్థితి. స. మార్గము.
పదాతి-స. కాలిబంటు. రూ. పదాజి.
పదార్థము-స. 1. వస్తువు. 2. పదవివరణము.
పది-తె. తొమ్మిదియు నొకటి, దశకము. సమా.
పదుగురు-పదిమంది. రూ. పదుగుండ్రు, పదుం
డ్రు, పదురు, పదువురు. పదింబదిగ-అధికము
గా, పెక్కుమాఱులు.
పదికుఁడు-స. కాలిబంటు.
పదిలము-తె. 1. స్థిరము.2.జాగరూకము.3.దృఢ
ము. (పుం. పదిలుఁడు.) క్రి. పదిలపడు, పది
లించు. [పదుపు, పదువు.
పదుగు-తె. సజాతీయప్రాణి సమూహము. రూ.
పదును-తె. 1. తేమ. 2. ఐదంగుళములలోఁతు
తడియగునంత వర్షప్రమాణము.
పదుపు-చూ. పదుగు.
పదురు-తె. 1. త్వరపడు.రూ. పదరు. 2.విధము.

3.అధికారము.4.పదుగురు.5.బ.తొందరమాట.
పద్దియము-వి. (పద్యము) ఛందోబద్ధమైన వాక్య
ములుగలది. రూ. పద్దెము.
పద్దు-తె.1.పంతము.2.ప్రతిజ్ఞ.3.అంకెలకత్తెము.
పద్ధతి-స. 1. మార్గము. 2. వరుస.
పద్మ-స. లక్ష్మి.
పద్మము-స. 1.తామర. 2.ఒకనిధి.3.ఒక వ్యూహ
ము. 4. ఒక సంఖ్య. 5. ఏనుఁగు మొగమందలి
చుక్కలు. సమా. పద్మనాభుఁడు - విష్ణువు.
—బాంధవుఁడు-తామరచెలి. —రాగము - కెం
పు. పద్మాకరము-కొలను. పద్మాలయ-లక్ష్మి.
పద్మి-స. ఏనుఁగు.
పద్మిని-స. 1. తామరతీఁగ. 2. తామరకొలను.
3. ఆఁడేనుఁగు. 4. ఒక స్త్రీజాతి. 5. లక్ష్మి.
పద్య-స. త్రోవ.
పద్యము-స. పద్దియము.
పన-తె. చేనిలోఁగోసియుంచిన ఓదె. [పరఁటి.
పనఁటి-తె. 1. వంటకుండ. 2. కుండ. రూ.పంటి,
పనవు-వి. పలవరించు. చూ. పలవరము.
పనస-వి.1.(పంచాశత్) వేదభాగము.2.(పణస)
ఒక ఫలవృక్షము.
పని-తె. 1. వ్యాపారము. 2. కార్యము.3.ప్రయో
జనము. 4. నియోగము. 5. శిల్పము. సమా.
—ముట్టు-ఉపకరణము. —వాఁడు-సేవకుఁడు.
క్రి.—గొను-నియోగించు. —పడు-అక్కఱ
పడు. —విను-1.ఆజ్ఞావశవర్తియగు. 2.(గౌర
వముతో) వచ్చు. 3. పోవు.
పనుకు-తె. ఆగ్రహించు.
పనుగొను-తె. 1. గట్టిపడు. 2. కలుగు.
పనుచు-తె. 1. నియోగించు. 2. అనుచు. రూ.
పంచు. కృ. పనుపు, పంపు.
పనుపడు-చూ. పన్ను.
పనుపు-తె. ఆజ్ఞ. చూ. పనుచు.
పన్న-తె. 1. అనామధేయుఁడు. 2. వృద్ధుఁడు.
పన్నకము-తె. రచన. రూ. పన్నిక, పన్నుగడ.
పన్నగము-స. పాము. (వ్యు. పడినట్టుగాఁబోవు
నది, పాదములతోఁబోవనిది.) సమా. పన్నగి
వైరి, పన్నగాశనుఁడు-గరుత్మంతుఁడు.

పన్నము-వి. (ప్రశ్నము) వేదమందలి అష్టమున
కు అవయవము. స. జాటినది.
పన్నా-హి. వెడలుపు. [గడ.
పన్నాగము-తె. 1.అందలముమీఁదికప్పు. 2.పన్ను
పన్నిక-చూ. పన్నకము.
పన్నిదము-వి. (పణితము) 1. జూదమందొడ్డు
పందెము. 2. పాచికలులోనగువాని పౌరలిక.
చూ. పందెము.
పన్నిద్దఱు-తె. (పది+ఇద్దఱు) పండ్రెండుగురు.
(ఇట్లే పన్నిరుగురు, పన్నిరువురు.) [బువు.
పన్నీరు-తె.చల్లనినీరు,(అఱ.పని+నీరు)హిమాం
పన్ను-తె. 1. యుద్ధమునకు సిద్ధపడు. 2.కలుగు.
3. చేయు. 4. ఏర్పఱచు. 5.కల్పించు.6.కప్పు
ము. 7. ఒప్పు. కృ. పన్నికము,పన్నిక,పన్ను
గడ. క్రి. —పడు-1. వాడుకపడు. 2.కలుగు.
3. నాటు. రూ. పనుపడు.
పన్నె-తె. 1. నేఁతయచ్చు. 2. అంకవన్నె వెనుక
భాగముననుండు ముల్లు.రూ.పన్నియ.[యిండ్లు.
పప్పళి-ఆం. (Paplin) వస్త్రమునందలి నేఁత
పప్పు-తె. 1. పొట్టుపోయి బద్దలైనకాయధాన్యము.
పబువు-వి. ప్రభువు. [2.కందిపప్పు,సూపము.
పబ్బము-వి. (పర్వము) 1.పండుగ.2.ఉత్సవము.
పముజు-చూ. పంజు. [3. ఆతిథ్యము.
పమ్మకము-తె. అంచులు మడిచికుట్టెడి కుట్టు.
పమ్ము-తె. 1. అంచులుమడిచికుట్టు. 2. అతిశ
యించు. రూ. పంబు.
పయఁట-తె. (పై+అంటు+అ) స్త్రీలఱొమ్ము
మీఁదివస్త్రము. రూ. పయ్యఁట, పైఁట.
పయనము-వి. ప్రయాణము. రూ. పైనము, పయ
నము. క్రి.పయనించు.
పయర-తె. 1. దక్షిణపుగాలి. 2. గాలి.రూ.పైర,
పయ్యర. సమా. —ధాన్యము-కాయధాన్యము.
పయస్సు-స. 1. పాలు. 2. నీరు. సమా. పయ
స్విని-1. ఆవు. 2. ఏఱు. పయోజము-తామర.
—ధరము-1. స్తనము.2.మబ్బు.3.టెంకాయ.
—ధి, —రాశి-సముద్రము.
పయ్యెద-తె. (పై+ఎద) పయఁట. రూ.పయ్యద.
పర-తె. 1. కంటిపొర. 2. పొర.

పఱ-తె. 1. బయలు. 2. సమూహము. రూ.పఱ్ఱ.
వి. (పరము) ఇతరము. రూ. పెర, పెఱ.
పరంగి-హిం. ఐరోపాదేశస్థుఁడు.
పరంజ-తె. సొరువ.
పరంపర-స. 1. వరుస. 2. సంతానము.
పరఁగు-తె. 1. ప్రయుక్తమగు. 2. ప్రవర్తిల్లు. 3. ప్రసరించు. 4. ప్రసిద్ధమగు. 5. ఒప్పు. 6. విహరించు. రూ. పఱఁగు.
పరఁట-తె. ఏఱుపిడక, కరీషము.
పరఁటి-చూ. పనఁటి. సమా. —పుట్టువు-అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు.
పరఁటె-చూ. పంటె.
పరక-తె. 1. రెండువీసములు. 2. గడ్డిపోఁచ. 3. చీపురు.
పరకాళా-తె. దళమైనతెల్లబట్ట.
పరకీయ-స. ఒకనాయిక.
పరకీయము-స. ఇతరునిది. 2. పార్శ్వము.
పఱగడ-తె. 1. ఇతరస్థలము. రూ. పఱగడము,
పరగణా-హిం. జమీలోనొకభాగము.
పరచి-తె. ఎరవు.
పఱచు-తె. 1. పాఱు. 2. పడఁజేయు. 3. (చాపమొ) పఱచు. రూ. పఱుచు. ప్రే. కృ. పఱపు. క్రి. పఱతెంచు-(పఱచు+తెంచు)పాఱివచ్చు.
పఱత-తె. ప్రవాహము. రూ. పఱతి, పఱద.పఱవ.
పరదా-హిం. తెర. రూ. పరపత్తెము.
పరపతి-తె. చేబదులుగా ద్రవ్యము పుచ్చుకొనుట.
పరపు-తె. 1. బాణముప్రయోగించు. 2. ప్రవహింపఁజేయు. 3. విరివి.
పఱపు-తె. 1. పోఁగొట్టు. 2. త్రోలు. 3. ప్రయోగించు. 4. పూయు. 5. కృ. పడక. 6. వేగము. 7. విరివి.
పరమము-స. 1. పరమాత్మ. 2. ఆద్యము. 3. ఉత్కృష్టము. 4. ప్రధానము. సమా. పరమపదము-వైకుంఠము. పరమాణువు-మిక్కిలిసూక్ష్మమైన అణువు. పరమాత్మ-పరబ్రహ్మము. పరమాన్నము-పాయసము. పరమేశ్వరుఁడు-1. శివుఁడు. 2. విష్ణువు. పరమేష్ఠి-బ్రహ్మ.
పరము-తె. 1. బండిమీఁది పఱపుమ్రాను, పాఱపట్టె. 2. చదును. 3. ప్రాణాచారము.సమా. పరగడుపు-ఆహారమువేయనికడుపు. క్రి. —పడు-ప్రాణాచారముపడు.స.1. కేవలము. 2. మోక్షము. 3. అన్యము. 4. దూరము. 5. మీఁదిది. 6. శ్రేష్ఠము. సమా. పరతంత్రుఁడు-పరాధీనుఁడు. —దేశి-1. ఇతరదేశమునుండివచ్చినవాఁడు. 2. అతిథి. —భృతము-కోకిల. —భృత్తు-కాకి. —వశము-1. పరాధీనము. 2. ఒడలుమఱచుట. —శ్శతము-నూటికంటె హెచ్చుసంఖ్యగలది. —స్పరము-అన్యోన్యము. పరాక్రమము-1. వీర్యము. 2. శౌర్యము. 3. సామర్థ్యము. రూ. పరాక్రాంతి. —ధీనుఁడు-ఇతరులకులోఁబడినవాఁడు. —మర్శము-చక్కఁగా విచారించుట. పరార్థవాది-వకీలు. క్రి. పరామర్శించు.
పరవాది-తె. ఆత్రగొట్టు.
పరవు-తె. వ్యాపించు. రూ. పరగు, పర్వు, ప్రాపు.
పరశువు, పరశ్వథము-స. గండగొడ్డలి. (వ్యు. పరులను హింసించునది.)
పరస-తె. ఉత్సవమునకువచ్చుజనము. రూ.పరుస.
పరా-స. వ్యతిరేకార్థమునిచ్చుఒకఉపసర్గము.సమా. —జయము-అపజయము. —భవము-అవమానము. —భూతి - —పై— క్రి. పరాభవించు.
పరాకు-తె. 1. తత్పరత. 2. ప్రమాదము.
పరాగము-స. 1. పుప్పొడి. 2. దుమ్ము. 3. నలుఁగుఁబిండి. 4. రాహువుసూర్యచంద్రులఁబట్టుట. 5. చందనము.
పరాఙ్ముఖుఁడు-స. పెడమోముపెట్టినవాఁడు, విముఖుఁడు.
పరాత్పరుఁడు-స. శ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడు.
పరాభవ-స. నలువదియవసంవత్సరము.
పరామరిక-వి. (పరామర్శము) చక్కఁగావిచారించుట. రూ. పరామరిస. క్రి. పరామరిసించు.
పరాయణము-స. 1. ఆశ్రయము. 2. అభీష్టము.
పరాయి-వి. (పరము) ఇతరుఁడు.
పరారి-హిం. పాఱిపోయినవాఁడు.
పరాసు-ఫ్రెంచిదేశస్థుఁడు.
పరి-తె. 1. సేన. 2. గుంపు. 3. వరుస. 4. వేపనము. 5. తడవ. రూ. పారి. సమా. —కాఁడు-తెగకు ముఖ్యమైనయేనుఁగు, యూథపము. —పరి-బహుప్రకారము. క్రి. —గొను-1. బారుతీరు. 2. చుట్టుకొను. —మాఱుచు-1.

ఖండించు. 2. చంపు.

పతి-తె. 1. విధము. 2. కాఁడిబరువు, పగ్గత. 3. ఉపద్రవము. క్రి. —గొను - కొల్లగొను. —వోవు-1. కొల్లవోవు. 2. నశించు.

పరి-స. మిక్కిలి, యోగ్యమైన, బొత్తిగా అనునర్థములిచ్చు ఒక ఉపసర్గము. —కరము-1. పనిముట్టు. 2. పరివారము. సమూ. —క్రమము-విహారము. క్రి. పరిక్రమించు. —క్రియ-చుట్టుకొనివచ్చుట. —క్షేపము-1. చుట్టుకొనియుండుట. 2. విత్తుట. —ఖ-అగడ్త. —గణనము-ఎన్నిక. క్రి. పరిగణించు. —గ్రహణము-ప్రియముతో గ్రహించుట. క్రి. పరిగ్రహించు. —గ్రహము - 1. పరిగ్రహణము. 2. భార్య. 3. శాపము. —ఘాతనము-ఇనుపకట్లగుదియ. రూ. పరిఘము. —ఘోషము - 1. ఉఱుము. 2. మ్రోఁత —చయము-ఎఱుక. రూ. పరిచితి. —చర్య-సేవ. —చారము-—పై.—క్రి. పరిచరించు. (పుం. పరిచారకుఁడు. స్త్రీ పరిచారిక.) —చ్ఛదము-దుప్పటి. —చ్ఛేదము-1. గ్రంథభాగము. 2. మేర. —జనము - బలఁగము. —ణతి-పరిపాకము.—ణద్ధము-కట్టఁబడినది. —ణయము-పెండ్లి. —ణామము - 1. క్షేమము. 2. మాఱురూపు. క్రి. పరిణమించు-1. మార్పునొందు. 2. సంతోషించు. —ణేత-భర్త. —తాపము-సంతాపము. రూ. పరీతాపము. —తుష్టి-మిక్కిలి సంతోషము. —తోషము-—పై.— —త్యక్తము-బొత్తిగా విడువఁబడినది. —త్యాగము - బొత్తిగా విడుచుట. క్రి. పరిత్యజించు. —త్రాణము-రక్షణము. —దానము - వస్తువుల మాఱుపు, వినిమయము. —దేవనము-దుఃఖముతోడిమాట. క్రి. పరిదేవించు. —ధానము-ధోవతి. —ధి-1. పరివేషము. 2. యజ్ఞశాలయందు పశువునుగట్టి నాటిన పైపట్టగల కొయ్య.—పంథి-1. శత్రువు. 2. తెరువాటుదొంగ. —పాకము-పరువము. —పాలనము-చక్కఁగా కాపాడుట. క్రి. పరిపాలించు. (పుం.—పాలకుఁడు) —పూర్తి-చక్కఁగా నిండుట. —ప్లవము-1. నీరుకోడి. 2. కదలునది. —భవము-అవమానము. రూ. పరిభావము, పరీభావము. క్రి. పరిభవించు. —భాష-సంకేతవాక్యము.—భాషణము-1. నిందాసహితమైన ఉపాలంభము. 2. నియమము. —భూతము - అవమానింపఁబడినది. —భ్రమము-అంతటను తిరుగుట. క్రి. పరిభ్రమించు. —మళము-1. మంచితావి. 2. మెదుపుట. 3. రాయిడి. క్రి. పరిమళించు. —మాణము-కొలత. —మితి-కొలఁది. —రంభము - ఆలింగనము. రూ. పరీరంభము.—వర్తనము-వినిమయము. రూ. పరివర్తము, పరీవర్తము. క్రి. పరివర్తించు. —వాదము-దూఱు. రూ. పరీవాదము. —వాదిని-ఏడుతంతులుగల వీణ. —వాపనము-గొఱుగుట. —వాపము-1. విత్తుట. 2. పాదు. రూ. పరీవాపము. —వారము-1. పరిజనము. 2. సేన. రూ. పరీవారము. —వాహము-కలుజు. రూ. పరీవాహము. —విగ్నము-ఉద్విగ్నము. —విత్తి-తమ్మునికి పెండ్లి కాఁగా పెండ్లిలేనియన్న. రూ. పరివిత్తుఁడు. —వృఢుఁడు - ప్రభువు. రూ. పరీవృఢుఁడు. —వృతము-చుట్టఁబడినది. రూ. పరీవృతము. —వేత్త-అన్నకంటెముందు పెండ్లాడినవాఁడు. —వేషము-1. గాలిగుడి. 2. చుట్టివచ్చుట. రూ. పరివేశము. —వేష్టనము-1. చుట్టివచ్చుట. 2. పరివట్టము. క్రి. పరివేష్టించు. —వ్రాజకుఁడు-సన్యాసి. రూ. పరివ్రాట్టు. —శిష్టము-కడపటమిగిలినది. —శీలనము-శోధనము. క్రి. పరిశీలించు. —శుద్ధి-మిక్కిలి శుద్ధి. —శోధనము - మిక్కిలి శోధనము. క్రి. పరిశోధించు. —శ్రమము-1. అలవాటు. 2. మిక్కిలి అలపు. —శ్రాంతి-మిక్కిలి యాఱట.—షత్తు-1. సభ. 2. సమూహము. —షేచనము-పుడిసిట నీళ్లుంచుకొని భోజనపాత్రాదుల చుట్టునువిడుచుట. క్రి. పరిషేచించు. —ష్కారము-1. చక్కఁబెట్టుట. 2. నగ. క్రి. పరిష్కరించు. —ష్కృతి - —పై.— —ష్వంగము-కౌఁగిలింత. —సరము-సమీపము. —సర్పము-చుట్టివచ్చుట. క్రి.

పరిసర్పించు. —హారము-విడుపు. క్రి. పరిహరించు. —హాసము-ఎగతాళి. రూ. పరీహాసము. క్రి. పరిహసించు. (వి.పరియాచకము.) పరీక్ష-పరిశీలనము (పుం.పరీక్షకుఁడు.) క్రి. పరీక్షించు. పరీతము - చుట్టుకొనఁబడినది. పర్యంకము-1. మంచము. 2. యోగపట్టె. పర్యంతము-వఱకు. వి.పరియంకము.) పర్యటనము-తిరుగుట. క్రి. పర్యటించు. పర్యవసానము - ముగియుక. పర్యస్తము - 1. పడినది. 2. కొట్టఁబడినది. పర్యాప్తము-1. యథేష్టము. 2.తృప్తి. పర్యాప్తి-చాలుననెడిబుద్ధి, తనివి. పర్యాలోచనము-చక్కఁగా ఆలోచించుట. క్రి. పర్యాలోచించు. పర్యుదంచనము-అప్పు. పర్యుషితము-చలిది.

పరిక-తె. ముగ్గు.

పరికరించు-వి. పరీక్షించు.

పరికించు-వి. 1. పరీక్షించు. 2. విచారించు.

పరికిణీ-తె. పావడ.

పఱిగ-తె. కోయునపుడు చేనిలోరాలినయెన్ను.

పరిఢవము-తె. అతిశయము. క్రి. పరిఢవిల్లు-1. ప్రవర్తిల్లు. 2. అతిశయిల్లు. ప్రే. పరిఢవించు.

పరితము-వి. (పరభృతము) కోయిల.

పరిది-వి. (పరిధి) సూర్యాది పరివేషము, గాలిగుడి.

పఱిపఱి-తె. పీడితము.

పరియ-తె. బ్రద్ద. రూ. పఱియ.

పరియంకము-వి. (పర్యంకము) శయ్య.

పరియాచకము-వి. (పరిహాసము) గేలి.

పరియు-తె. 1. తప్పు. 2. చెడు. 3.మీఁదిభాగము మురిసి చెక్కలుగా రాలు.

పరివట్టము-వి. (పరివేష్టనము) విష్ణు ప్రసాదముగా గ్రహించి తలఁజుట్టుకొను పట్టు.

పరిసెనము-తె. గంతు.

పరీధావి-స. నలువదియాఱవ సంవత్సరము.

పరుండు-తె. (పడి+ఉండు) శయనించు.

పరుఁజు-వి. (పరంజము) కత్తిపిడి. క్రి.పరిఁజించు. పరుఁజుతోఁబట్టు. [3. ఇతరుఁడు.

పరుఁడు-స. 1. పరమాత్ముఁడు. 2. శత్రువు.

పరుగు-తె. 1. పరుగెత్తుట. 2. కోసుదూరము. రూ. పరువు. క్రి. పరుగెత్తు, పరుగిడు, పరువిడు.

పఱుచు-తె. 1. పడఁజేయు. 2. పఱచు. 3.పాటు పడఁజేయు. కృ. పఱువు.

పరువము-వి. (పర్వము) యౌవనము.

పరువు-తె. 1. పరుగు. 2. గౌరవము. రూ.పర్వు.

పరుషము-స. 1. నిష్ఠురము. 2. నిష్ఠురవాక్యము. (వి. పరుసము.)

పరుస-తె. 1. పరస. 2. వి. కఠినుఁడు.

పరుసము-వి. 1. (పరుషము) కఠినము. 2. స్పర్శవేధి, సోఁకఁగా ఇనుము బంగార మగు వస్తువు.

పరుసు-తె. విధము. [రూ. పరుసవేది.

పరేతము-స. 1. పీనుఁగు. 2.భూతము. రూ.ప్రేతము. సమా. పరేతరాట్టు-యముఁడు.

పరోక్షము-స. ఇంద్రియగోచరము కానిది.

పరోఢ-స. (పర+ఊఢ) ఇతరుని పెండ్లాడిన నాయిక, పరకీయ.

పర్జన్యము-స. 1. ఉఱుము. 2.ఉఱిమెడుమేఘము.

పర్జన్యుఁడు-స. వర్షాధిదేవత, ఇంద్రుఁడు.

పర్ణము-స. ఆకు. సమా. పర్ణశాల-ఆకుటిల్లు.

పర్యయము-స. క్రమము తప్పుట. [రూ. పఱ.

పఱ్ఱ-తె. 1. ఉప్పుపండెడు బయలు. 2. బయలు.

పఱ్ఱియ-తె. బ్రద్ద. రూ. పఱియ, పరియ, పఱ్ఱె.

పర్వతము-స. కొండ. [3. పండుగ.

పర్వము-స. 1. గనుపు. 2. దర్శప్రతిపత్సంధి.

పర్వరీణము-స. 1. గనుపు. 2. ఈనె. 3.ఆకులు

పర్శుక-స. ప్రక్కయెముక. [నలిపిన పసరు.

పలంకష-స. 1. పల్లేరు. 2. మోదుగుచెట్టు.

పలక-వి. (ఫలకము) 1.వ్రాయఁదగిన సాధనము. 2. కేడెము. 3. మ్రానులోనగువాని చెక్క.

పలకము-తె. చిన్నమంచము.

పలచము-తె. కప్పము. [ణము. 2. విరళము.

పలపల-తె. 1. రాలుట వేగుటయందగు ననుకర

పలము-స. 1.నాలుగు కర్షముల యెత్తు. 2.మూఁడు తులములు. 3. మాంసము. సమా. పలాశి-పొలసుదిండి. రూ. పలాశుఁడు.

పలలము-స. 1. మాంసము. 2. బురద. సమా. పలలాశి-మాంసముదినువాఁడు.

పలవ-తె. రెండుకొమ్మల మొదలు.

పలవరము-వి. ప్రలాపము. క్రి. పలవరించు.

పలవించు, పలవు, పనవు. కృ. పలవరింత.
పలాయనము-స. పాఱిపోవుట.
పలాలము-స. 1. గింజలేని పోఁచ. 2. పలలము.
పలాశము-స. 1. ఆకు. 2. ఆకుపచ్చ. 3. మోదుగు చెట్టు.
పలితము-స. 1. నరపు. 2. నరవెంద్రుక. 3. బురద.
పలు-తె. 1. దంతము. రూ. పల్లు. 2. అనేకము. సమా.—కప్పు,—తెర-పెదవి.—కెంపు-దంత క్షతము. —గఱ-పండ్లపొడి. —గాఁడి-దొడ్డి. తలుపు. —గుండ్రు-అనేకులు. రూ. పలుగురు, పలువురు. —మాఱు-మాటిమాటికి. రూ. పలుమరు, పలుమాఱు. —వలువ-పెదవి. —విత్తు-పలువురకుఁబుట్టినవాఁడు. పల్లఱపులు-పెక్కుమాటలు.
పలుఁగు-తె. స్ఫటికము. [వివర్ణమగు.
పలుక-తె. తెల్లన. క్రి. పలుకఁబాఱు - తెల్లనగు,
పలుకు-తె. 1. మాటాడు. 2. అను. కృ. 3. నింద. 4. మాట. 5. విద్య. 6. తునుక. రూ. పల్కు. సమా. —ఁజెలి-సరస్వతి. —తత్తడి-చిలుక. —తోడు-మాటతోడు. —బడి-1. ఉచ్చారణము. 2. మాటచెల్లుబడి. —బోయి-ప్రతిధ్వని యిచ్చు శిల. క్రి. పలుకరించు-1. మాటాడు. 2. మాటాడించు. కృ. పలుకరింత, పలుకరింపు.
పలుగాకి-తె. దుష్టుఁడు. రూ. పలుగు, పల్గాకి.
పలుచ-తె. 1. దళసరికానిది. 2. చిక్కనకానిది.
పలుపు-తె. 1. తలుగు.
పలుము-తె. 1. ప్రలాపించు. 2. కృ. ప్రలాపము.
పలుసము-వి. (పరుషము) కఠినము. రూ. పరుసము.
పల్యంకము-స. 1. మంచము. 2. మంచె.
పల్యంకిక-తె. పల్లకి. (ఇది సంస్కృతసమాసమున ప్రయోగింపఁబడినది. సంస్కృతముకాదు. ఇట్టివే కైవారము, రాహుత్తుఁడు, పన్నీరము, మొ.)
పల్యయనము-స. గుఱ్ఱపుజీను. రూ. పల్యాణము.
పల్ల-తె. 1. పాటలవర్ణము. 2. కపిలవర్ణము. 3. ఎఱుపు. [రూ. పల్యంకిక, పల్లకీ.
పల్లకి-తె. మనుజులు మోసికొనిపోవు వాహనము.
పల్లట-తె. 1. చలనము. 2. వ్యత్యాసము. [బాఱు.
పల్లటిల్లు-తె. 1. చలించు. 2. తెల్లఁబోవు. 3. ఎఱ్ఱఁ
పల్లటీ-హిం. ఎగవు.
పల్లన-వి. (పల్యాణము) 1. గుఱ్ఱపుజీను. 2. అంబారి. రూ. పల్లనము, పల్లము.
పల్లము-తె. 1. తగ్గు. 2. గుఱ్ఱపుజీను. క్రి. పల్లించు.
పల్లవము-స. 1. చిగురు. 2. చిగురుఁగొమ్మ.
పల్లవి-స. పాటమొదటిపాదము. [క్రి. పల్లవించు.
పల్లవితము-స. చిగిర్చినది.
పల్లవుఁడు-స. విటుఁడు.
పల్లాయనము-తె. మైత్రి.
పల్లి-స. 1. పల్లె. 2. బల్లి.
పల్లిక-తె. బద్దలతోనల్లినతట్ట.
పల్లియ-వి. (పల్లి) చిన్నగ్రామము. రూ. పల్లె. సమా. పల్లెకూటము-పాఠశాల. పల్లెటూరు-పల్లె.
పల్లు-తె. 1. దంతము. రూ. పలు. 2. పల్లము. రూ. పల్లుడు. సమా. పల్లొత్తు-దంతక్షతము.
పల్లెరు-వి. పలంకష. రూ. పల్లేరు.
పల్వలము-స. పడియ.
పవడము-చూ. పగడము.
పవడించు-తె. శయనించు. రూ. పవళించు. పవ్వడించు, పవ్వళించు. కృ. పవళింత, పవ్వళింత.
పవతుఁడు-చూ. పగతుఁడు.
పవనము-స. 1. గాలి. 2. తూర్పెత్తుట. రూ. పవము. సమా. పవనతనయుఁడు-1. హనుమంతుఁడు. 2. భీముఁడు. 3. అగ్ని. పవనాశనము-పాము, గాలిమేపరి.
పవమానుఁడు-స. గాలి. (వ్యు. పవిత్రముచేయువాఁడు, సంచరించువాఁడు.)
పవలు-చూ. పగలు.
పవాడము-తె. ఒకకార్యమునెఱవేఱఁ బ్రార్థించి యదినెఱవేఱినయెడ దేవునియెదుటచేయుజిహ్వాచ్ఛేదనాది సాహసకృత్యము. రూ. పావాడము.
పవి-స. వజ్రాయుధము. (వ్యు. వైరశుద్ధిచేయునది.)
పవిత్రము-స. 1. జందెము. 2. దర్భ. 3. గోమయము. 4. పరిశుద్ధము.
పవిది-చూ. పగిది.
పవ్వళించు-చూ. పవడించు.
పశువు-స. 1. చతుష్పాదము. 2. ఆవు. సమా. పశుపతి-శివుఁడు. —మక్షిక-జోఱీఁగ.

పశ్చాత్-స. వెనుక. సమా. —తాపము-వెనుకచిం
 తించుట, అనుతాపము.
పశ్చిమము-స. *1*. పడమటిది. *2*. వెనుకటిది.
పశ్యతోహరుఁడు-స. *1*. కమసాలెవాఁడు. *2*.పచ్చె
పశ్యత్ఫాలుఁడు-స. ముక్కంటి. [కాఁడు.
పస-తె. *1*. సారము. *2*. చాతుర్యము.
పసఁగు-తె. విశదమగు.
పసందు-హిం. అందము.
పసగరగొను-తె. పీడించు.
పసదనము-వి. (ప్రసాదనము) పారితోషికము.
పసను-తె. *1*. ఎఱుపుమించిన పసుపువన్నె. *2*.
 బాగు. [లము.
పసరము-వి. (పశువు) గో మహిషజాతి. రూ.పస
పసరించు-వి.(ప్రసరించు)వ్యాపించు. [వ్యాపనము.
పసరు-తె. *1*. ఆకురసము. *2*. ఆకుపచ్చన. *3*.
పసాదము-వి.(ప్రసాదము)అన్నము.క్రి.పసాపడు.
పసారము-హిం.(పన్సార్) అంగడి. రూ.పసారు.
పసి-తె. *1*. పశ్వాదులమీఁదిగాలి. *2*. వి. ఆవు.*3*.
 లేఁత.సమా. —కాఁపు-గోపకుఁడు. —తిండి-
 పులి, —పాప-లేఁతబిడ్డ.
పసిఁడి-తె. *1*. బంగారు. *2*. ధనము. రూ. పయిఁ
 డి, పైఁడి. సమా. —కంటి-చిన్నజాతిగుడ్ల
 గూబ,పైఁడికంటి. —కాయ-పొత్తిసూలికాయ,
పసిక-తె. పస.
పసిమి-తె. *1*. ఆకుపచ్చన. *2*. గోరోచనవర్ణము.
పసిరిక-తె. *1*. పసరువన్నె. *2*. కామెల.
పసుపు-తె. *1*. హరిద్ర. *2*. హరిద్రవర్ణము.
పస్తు-తె. ఉపవాసము.
పళ్లెము-తె *1*. భోజనపాత్రము. *2*. తాంబాళము.
 రూ. పళ్లెరము, పళ్యము.

## పా

పాంచజన్యము-స. విష్ణుశంఖము. (వ్యు. పంచజ
 నుని ఎముక.)
పాంచాలి-స. *1*. ద్రౌపది. (వ్యు. పాంచాలరాజు
 కూఁతురు) *2*. బొమ్మ. రూ.పాంచాలిక.
పాండరము-స. తెలుపు. రూ. పాండురము.
పాండవబీడు-తె. చాలకాలమునుండిదున్ననినేల.
పాండితి-స. పండితభావము. రూ. పాండిత్యము.
పాండిమ-స. తెలుపు. [*3*.తెలుపుమించినపచ్చన.
పాండువు-స. *1*. తెలుపుపాఱురోగము.*2*.తెలుపు.
పాంథుఁడు-స. తెరువరి. [సువు.
పాంసువు-స. *1*. దుమ్ము. *2*. ఎరువు. రూ. పాం
పాంసనుఁడు-స. దూషకుఁడు.
పాంసుల-స. *1*. ఱంకుటాలు. *2*. భూమి.
పాఁకుడు-తె. పండ్లపాఁచి. రూ. ప్రాఁకుడు.
పాఁచి-తె. *1*. పండ్లమురికి. రూ. ప్రాఁచి. సమా.
 —తీఁగ-మజ్జిగను చిక్కనచేయు ఒకతీఁగ,
పాఁడి-తె. పాలు, క్షీరము. [బదర.
పాఁత-వి. (పురాతనము) *1*. వస్త్రము. *2*. చినిఁ
 గినవస్త్రము, *3*. బహుదినములనాఁటిది. రూ.
 ప్రాఁత. క్రి. పాఁతగిలు, ప్రాఁతగిలు.
పాఁతఱ-తె. (పాఁతు+అఱ) *1*. ధాన్యముంచు
 టకై నేలత్రవ్వినపల్లము. *2*. నిధి.
పాఁతు-తె. పూడ్చు. [ప్రాక.
పాక-తె. దూలములుంచకకట్టినయిల్లు, శాల. రూ.
పాకము-స. *1*. పక్వము. *2*. పంట. (కావ్యమం
 దు పాకములుమూఁడు : కదళీపాకము,ద్రాక్షాపా
 కము, నారికేళపాకము.)
పాకశాసనుఁడు-స. ఇంద్రుఁడు. (వ్యు. పాకుఁడను
 రక్కసుని చంపినవాఁడు.) పాకశాసని-ఇంద్రు
 నికొడుకు, జయంతుఁడు.
పాకాన్నము-స. పెండ్లియందు మూఁడవనాఁటి బు
 వ్వము. (వి. పాకెన.) [ప్రాకెన్న.
పాకెన-వి. పాకాన్నము. రూ. పాకెన్న, ప్రాకెన.
పాక్షికము-స. పక్షమునఁగలిగినది.
పాగా-తె. *1*. తలగుడ్డ. రూ. పాగ.*2*. అశ్వశాల.
పాగు-వి. (పాకము) చక్కెరలోనగునవి కాఁచిన
 ద్రవము.
పాచకుఁడు-స. *1*. వంటవాఁడు. *2*. అగ్ని.
పాచనము-తె. విరేచనము. రూ. పాసనము.
పాచనము-స. *1*. ప్రాయశ్చిత్తము. *2*. పులుసు.
పాచిక-వి. (పాశకము) అడ్డసాళ్లు. రూ. పాసిక.
పాచితము-వి. ప్రాయశ్చిత్తము. రూ. ప్రాచితము.
పాచు-తె. *1*. తొలఁగించు. *2*. చిక్కెడలించు.
పాట-తె. *1*. కీర్తన. *2*. విధము,

పాటకము-వి. స్ఫోటకము. రూ. పోటకము. స. 1. పాడగము. 2. పట్టాకత్తి.
పాటచ్చరుఁడు-స. దొంగ. (వ్యు. పీడించుచుతిరుగువాఁడు. చినిఁగిన వస్త్రమునైనను తీసికొనువాఁడు.) [పాటించు.
పాటన-తె. 1. అలంకారము. 2. ఆదరణము. క్రి.
పాటనము-స. చీల్చుట.
పాటపాట-తె. కొంచెకొంచెము.
పాటము-తె. కెంపులు నాణెముచూచుట.
పాటలము-స. తెలుపుమించినయెఱుపు. [శక్తత.
పాటవము-స. 1. ఆరోగ్యము. 2. నైపుణ్యము. 3.
పాటి-తె. 1. సామ్యము. 2. ప్రమాణము. 3. న్యాయము. 4. కొలఁది. క్రి.—గొను-సరిచేయు. సమా.—నేల-ఊరుపాడుపడిననేల.—రేవు-దిగినడచిపోఁదగినరేవు. [ధరించు. 4. ప్రతీక్షించు.
పాటించు-తె. 1. ఆదరించు. 2. విచారించు. 3.
పాటితము-స. చీల్పఁబడినది.
పాటిల్లు-స. కలుగు. [జల్లెడ.
పాటీరము-స. 1. చందనము. రూ. పటీరము. 2.
పాటు-తె. 1. పడుట. 2. శ్రమము. 3. ఆపద. 4. అలయడఁగుట. క్రి. —పడు-శ్రమపడు.
పాఠము-స. పఠనము. సమా. పాఠశాల-బడి.
పాఠకుఁడు-స. చదువువాఁడు.
పాఠీనము-స. వేయికోఱలచేఁప, కొఱ్ఱమీను.
పాఠ్యము-స. పఠింపఁదగినది. [పాగడము.
పాడగము-వి. (పాటకము) స్త్రీల కాలియందె. రూ.
పాడి-తె. 1. ధర్మము. 2. వ్యవహారము. 3. న్యాయము. 4. స్వభావము.
పాడు-తె. 1. పాటపాడు. 2. పాటినేల. 3. పల్లె. 4. నాశము. క్రి. పాడఱు, పాడువడు, పాడు
పాడె-తె. శవవాహనము, ఖట్వీక. [వాఱు-నాశమగు.
పాడ్యమి-వి. (ప్రథమ) పక్షమందు మొదటితిథి.
పాణి-స. మనికట్టుమొదలు వ్రేళ్లతోఁగూడిన చేయి. సమా. పాణింధమము-కొలిమితిత్తి. పాణిగృహీత-పెండ్లము. —గ్రహణము-పెండ్లి. —పీడనము.—పై.
పాణిపదము-తె. అమ్మలపొది.
పాతకము-స. గొప్పపాపము. (ఇవిఅయిదు : స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, ఇవి చేయువారితోడి సహవాసము.)
పాతము-స. పడుట. [లాడు-నర్తించు.
పాతర-వి. (పాత్రము) చట్టి, మొ. క్రి. పాతర
పాతాళము-స. క్రిందిలోకము. [కొన్నిచోట్ల.)
పాతిక-తె. నాలవభాగము. (25 రూప్యములు అని
పాతివ్రత్యము-స. పతివ్రతాత్వము.
పాత్రము-స. 1. యోగ్యము. 2. భాజనము. 3. నాటకవేషము. [సంద్రము.
పాథస్సు-స. జలము. సమా. పాథోధి, పాథోనిధి-
పాథేయము-స. దారిబత్తెము.
పాదట్టు-తె. ఇండ్లలోపలపట్టెడుబూసి. రూ. పాదొట్టు.
పాదము-స. 1. అడుగు. 2. కిరణము. 3. వేరు. 4. పాతిక. సమా. పాదకటకము-అందె. —గ్రహణము-అభివాదనము. —చారి-1. కాలిబంటు. 2. నడచిపోవువాఁడు. —జుఁడు-శూద్రుఁడు. —పము-చెట్టు. —పట్టము-అందియ. వి. (పాయవట్టము) —సరము-గజ్జెగొలుసు.
పాదాగ్రము-మీఁగాలు.
పాదరసము-వి. (పారదము) రసము.
పాదాతము-స. పదాతిసమూహము.
పాది-తె. ఆలవాలము. రూ. పాదు. క్రి. పాదుకొను-1. నెలకొను. 2. నిలుచు.
పాదుక-స. పావకోడు. రూ. పాదువు.
పాదుసా-హిం. రాజు. రూ. పాదుసాహి. [ము.
పాద్యము-స. పాదములు కడుగుకొనుట కిచ్చుజల
పానకము-తె. ఫలరసము. స. బెల్లముకలిపిననీరు.
పానము-స. 1. త్రాగుడు. 2. త్రాగుడుగిన్నె. తె.
పానలు-తె. సందేహము. [పానవట్టము.
పానవట్టము-తె. లింగపీఠము.
పానీయము-స. త్రాగఁదగినది.
పానుపు-తె. 1. మంచము. 2. పఱుపు. రూ. పాన్పు.
పాప-తె. 1. శిశువు. 2. కంటినల్లగ్రుడ్డులోని ప్రతిబింబము.
పాపఁడు-తె. 1. పురుషశిశువు. 2. బాలుఁడు.
పాపట-తె. కేశవీథి. సమా.—బొట్టు-లాలాటిక.
పాపటము-తె. గొర్తిపైరుమీఁదకలుపుపోవ దున్ను

పాధనము. రూ. పాపనము.
పాపము-స. దుష్కృతము. రూ. పాప్మము. సమా. పాపాత్ముఁడు, పాపచిత్తుఁడు, పాపి-పాపము కలవాఁడు. రూ. పాపుఁడు. పాపిష్ఠుఁడు-మిక్కి [లి పాపి.
పాపు-తె. 1. పాయఁజేయు. 2. దున్ను.
పాపోసు-హిం. ముచ్చె.
పామ-స. గజ్జి.
పామరుఁడు-స. 1. అజ్ఞుఁడు. 2. నీచుఁడు.
పాము-తె. 1. ఉద్దు. రూ. ప్రాము. 2. సర్పము. సమా. పాఁపజగము-నాగలోకము. —జన్నిఁగట్టు-వినాయకుఁడు. —తూపు-నాగాస్త్రము. (ఇట్లు పాఁపరమ్ము, మొ.)—మేపరి-1. గరుడుఁడు. 2. నెమిలి.
పాయ-తె. 1. చీలిక. 2. మునుము. సమా. —కట్టు-ఒకముఖ్యగ్రామముతోఁ జేరినపల్లెల సమూహము. క్రి. —గిలు-తొలఁగు-—వడు-1. చీలు. 2. తొలఁగు.
పాయము-వి. (ప్రాయము) వయస్సు.
పాయవట్టము-వి. (పాదపట్టము) కాలియందె.
పాయసము-స. (పయస్సుతో వండినది) పరమాన్నము. (వి. పాసెము)
పాయి-తె. పాలు. స. త్రాగుఁబోతు.
పాయు-తె. 1. తొలఁగు. 2. చిక్కుడలు. 3. విడుచు. ప్రే. పాచు, పాపు. కృ. పాయ, పాపట, పాప [టము.
పాయువు-స. గుదము.
పాఱ-తె. త్రవ్వుసాధనము, ఖనిత్రి. సమా. పాఱమ్మ-పాఱవంటివాఁడరగల యమ్ము.
పారంపరి-స. కులక్రమము. రూ. పారంపర్యము.
పారణ-స. ఉపవాసముండి మఱునాఁడు చేయు భోజనము. రూ. పారణము.
పారతంత్ర్యము-స. పరాధీనత.
పారదము-స. పాదరసము.
పారము-స. 1. ఆవలిదరి. 2. సమీపము. సమా. పారంగతుఁడు-దరిఁజేరినవాఁడు. రూ. పారగుఁడు. పారావారము-1. ఈవలావలిదరులు. 2. [సముద్రము.
పారవశ్యము-స. పరవశత్వము.
పారాణి-తె. కుంకుమములోనగువానితో పాదములకుచేయు అలంకారము. క్రి. పారాణించు.
పారాయణము-స. 1. అంతయు. 2. అంతయుచదువుట. 3. పారమును పొందుట. [ముచేఁబోవునది.)
పారావతము-స. 1. పావురము. 2. కోఁతి. (వ్యు. బల
పారాశరి-స. 1. వ్యాసుఁడు. 2. ముని.
పారి-తె. 1. తడవ. రూ. పరి. 2. మన్ను.
పారికాఁపు-తె. పరిచరుఁడు. [బహుమతి.
పారితోషికము-స. (పరితోషముచే నొసఁగునది)
పారిప్లవము-స. చలించునది.
పారీంద్రము-స. సింహము.
పారీణుఁడు-స. పారముముట్టినవాఁడు. [పారుడు.
పారు-తె. 1. పరుగెత్తు. 2. పానసముచేయు. కృ.
పాఱు-తె. 1. పరుగెత్తు. 2. ప్రవహించు. 3. ప్రసరించు. కృ. పాఱుడు. సమా. పాఱుఁడు-బ్రాహ్మణుఁడు. (పాఱు + వాఁడు.) స్త్రీ. పాఱుటక్క, పాఱుత. —ఁబోతు-పిఱికి. —టసుర-బమ్మరాకాసి. —వేఁట-విజయదశమినాఁడు చేయుదేవోత్సవము. క్రి. పాఱఁదోలు-తఱుము. —ఁబోయు-కుమ్మరించు. —వేయు-1. విసరివేయు. 2. విడుచు. పాఱుతెంచు-1. పరుగెత్తివచ్చు. 2. ప్రవహించు. రూ. పాఱెంచు.
పారుపత్తెము-తె. 1. దొరతనమువారికియ్యవలసిన ధనమును జనులవలన రాఁబట్టెడు అధికారము. 2. అధికారము.
పారువ-తె. 1. జాడ. 2. చూపు. రూ. పార్వ.
పారువము-వి. (పారావతము) గువ్వ. రూ. పావురము, పావురాయి, పార్వము. [నము.
పారుష్యము-స. 1. పరుసఁదనము. 2. పరుషవచ
పార్థివ-స. పందొమ్మిదవసంవత్సరము. [మైనది.
పార్థివము-స. 1. గుణము. 2. పృథివీసంబంధ
పార్థివుఁడు-స. రాజు. (వ్యు. పృథివికలవాఁడు.)
పార్వణము-స. 1. పిండప్రదానము. 2. పర్వసం
పార్వతి-స. గౌరి. [బంధమైనది.
పార్శ్వము-స. 1. ప్రక్క. 2. సమీపము.
పార్ష్ణి-స. 1. కాలిమడమ. 2. వెనుక. సమా. —గ్రాహుఁడు-దండెత్తిపోవురాజునకువెనుకనుండు శత్రువు. [చుక్క-మఘ.
పాలకి-చూ. పల్లకి. రూ. పాలకీ. సమా. —బొంగు

పాలకుఁడు-స. రక్షకుఁడు.
పాలనము-స. రక్షణము. క్రి. పాలించు.
పాలసుఁడు-వి. (బాలిశుఁడు) 1. మూర్ఖుఁడు. 2. దుష్టుఁడు.
పాలిక-తె. నవధాన్యములనాఁటనుంచుపాత్రము.
పాలితము-స. రక్షింపఁబడినది.
పాలు-తె. 1. తెల్లనగు. 2. భాగము. 3. వశము. 4. సమీపము. 5. క్షీరము. 6. చెట్లనుండివచ్చు తెల్లనిరసము. సమా. పాలకడలి - క్షీరాబ్ధి. రూ. పాల్కడలి.—వెన్న - చంద్రుఁడు.—కుప్ప-పయోరాశి.—కొయ్య-యూపము.( ఇట్లు పాలగుంజ. మొ. ) —చేరులు-గజ్జనరము.—సొఱ-తెల్లచొఱమీను. పాలడ-(పాలు + అడఁగు) బిడ్డలకుపాలుపోయుశంఖము. —పండ్లు-పుట్టుదంతములు. —పాపఁడు-పాలుత్రావుబిడ్డ. —మన్ను-సుద్ద. —మున్నీరు-క్షీరాబ్ధి. ( ఇట్లు పాలవాఁగు, పాలవెల్లి. మొ.) పాలిండ్లు-స్త్రీస్తనములు. పాలికాపు-భాగస్థుఁడు. పాలిచుట్టము-దాయాది. —వాఁడు-1. జ్ఞాతి. 2. భాగస్థుఁడు. పాలేరు-(పాలు+ఏరు) పాలికి దున్నెడు మడక. పాలేఱు-1. క్షీరనది. 2. క్షీరాబ్ధి. క్రి. పాలాడు-ఖండించు. పాలారుచు-1. ఉపేక్షించు. 2. నాశముచేయు. పాలుగొను-పంచుకొను. రూ. పాల్గొను. —పడు-1. పూనుకొను. 2. స్వాధీనమగు. రూ. పాల్పడు. —పోవు-1. విభాగమగు. 2. నిర్ణేతమగు. ప్రే. పాలుపుచ్చు.—వెట్టు-1. భాగించు. 2. నిర్ణయించు.
పాలుమాలు-తె. సోమరితనముపొందు. రూ. ప్రాలుమాలు. కృ. పాలుమాలిక, ప్రాలుమాలిక.
పావంచ-తె. సోపానము. [పవిత్రముచేయువాఁడు.)
పావకుఁడు-స. 1. అగ్ని. 2. సూర్యుఁడు. (వ్యు.
పావకోళ్లు-తె. పాదుకలు. రూ. పావలు, పావాలు.
పావడ-తె. 1. గాగర. 2. శుభ్రవస్త్రము. 3. వస్త్రము.
పావడము-తె. కానుక. [పవిత్రము.
పావనము-స. 1. జలము. 2. గోమయము. 3.
పావని-స. 1. ఆవు. 2. గంగ. 3. భీముఁడు. 4. హనుమంతుఁడు. 5. పవిత్రురాలు.
పావాడము-చూ. పవాడము.
పావి-వి. పాపి.
పావు-హిం. నాలవభాగము.
పావురము-చూ. పారువము.
పావులా-హిం. పాతికరూపాయ.
పాశకము-స. పాచిక.
పాశము-స. త్రాడు. (కేశపాశము-కేశసమూహము)
పాశి-స. 1. వరుణుఁడు. 2. యముఁడు.
పాశుపతము-స. 1. పశుపతి అధిదైవతముగాఁగల యస్త్రము. 2. పశుపతిమతము.
పాశుపాల్యము-స. పశుపోషణవృత్తి.
పాశ్చాత్యుఁడు-స. 1. వరుణుఁడు. 2. పడమటివాఁడు. 3. వెనుకటివాఁడు.
పాషండము-స. వేదబాహ్యమగు ఒకమతము.
పాషాణము-స. 1. ఱాయి. 2. విషద్రవ్యము. తె. [విషము.
పాసనము-చూ. పాచనము.
పాసిక-చూ. పాచిగ.
పాసెము-చూ. పాయసము. [కుహళి.
పాళ-తె. పోకలోనగువాని కప్పుడుతోడిపూగుత్తి.
పాళము-తె. 1. విధము. 2. సమయము. 3. కొలఁది. 4. లోహపుకడ్డీ. రూ. పాళా.
పాళి-తె. జూదమాడుపలక. రూ. పాళియ, పాళె. స. 1. అంచు. 2. వరుస.
పాళియము-తె. 1. కావలి. 2. పాళెగానిపట్టనము. 3. దండు. 4. దండుదిగుచోటు. రూ. పాళెము. సమా. పాళెగాఁడు - పాళెమున కధికారి. పాళెముపట్టు-పాళెగానిపట్టణము. క్రి. పాళెము దిగు-దండువిడియు.

## పి

పింగము-స. గోరోచనవర్ణము. [వాఁడు.
పింగలి-తె. (పిఱు+కలను+ఇ) వెనుకటిది, —
పింగటించు-తె. అతిశయపుమాటలాడు. రూ. పింగశించు.
పింగళ-స. 1. దక్షిణదిక్కునందలి ఆఁడేనుఁగు పేరు. 2. ఏఁబదియొకటవ సంవత్సరము.
పింగళము-స. గోరోచనవర్ణము.
పింగళుఁడు-స. 1. శివుఁడు. 2. అగ్ని. [సు
పింగాణి-(మహారా.) చిత్రవర్ణపుపనిగల ఒకదిను

తెల్ల మట్టిపాత్రము.
పించము-వి. (పింఛము) మదము. రూ. పీఁచము.
పించియము-వి. (పింఛము) నెమలిపురి. రూ. పించెము.
పింఛము-స. పించియము.
పింజ-స. దూది.
పింజ-వి. (పింజనము) 1. దూదేకువిల్లు. 2. పుంఖము. సమా. పింజనగ్రోవి-చిమ్మనగ్రోవి. పింజారి-దూదేకువాఁడు.
పింజనము-స. దూదేకువిల్లు.
పింజరము-స. 1. బంగారు. 2. ఎఱుపుమించిన పసుపురంగు.
పింజించు-తె. 1. పింజెత్రోయు. 2. నీళ్లచిలకరిలఁజిమ్ము.
పింజిక-స. నూలిచుట్ట.
పింజూషము-స. గులిమి.
పింజె-తె. ముందువెనుకల చెక్కుకొనెడి వస్త్రపు కుచ్చె.
పింఠ-స. విటులవాడ. (వి. పేఁట.)
పిండము-స. 1. బ్రదుకుఁదెరువు. 2. ఇనుము. 3. అన్నపుపిడుచ. 4. పితృదేవతలకిచ్చు అన్నపుముద్ద. 5. గర్భము. 6. సమూహము.
పిండలి-వి. (పిండము) ముద్ద.
పిండి-తె. పిష్టము. సమా. —కూడు-సంకటి. —వంట-భక్ష్యము.
పిండిక-స. 1. బండికంటి నడిమితూము. 2. పిక్కమాంసము.
పిండితము-స. 1. దట్టము. 2. గుణింపఁబడినది.
పిండీకృతము స. ముద్దగాఁజేయఁబడినది.
పిండు-తె. 1. పాలు పితుకు. 2. రసము పిడుచు. వి. (పిండము) 1. గుంపు. 2. చెండు. క్రి. —గట్టు-గుంపుగూడు.
పిందె-తె. లేఁతకాయ. రూ. పిందియ.
పికపికలు-తె. చెల్లా చెదరు. రూ. పికాపికలు.
పికము-స. కోయిల. సమా. పికవర్ధనము-కాకి.
పిక్క-వి. (పిండిక) జంఘ.
పిక్కటిల్లు-తె. 1. నిండు. 2. అతిశయించు. 3. వ్యాపించు. 4. పిగులు. 5. వర్ధిల్లు. రూ. పిక్కటిలు.
పిక్కారు-తె. (పిదప+కారు) దాళవా.
పిక్కు-తె. 1. వెనుదీయు. 2. వంచించు. కృ. 3. వంచన. 4. మర్మము.
పిగులు-తె. బిగువుచే (వస్త్రము) చినుఁగు.
పిచండిలుఁడు-స. పెద్దకడుపువాఁడు.
పిచుమందము-స. వేఁపచెట్టు.
పిచ్చ-తె. 1. చిన్న. 2. హీనము. 3. పిచ్చి. సమా. —పట్టు-ఉద్ధతత్వము.
పిచ్చలించు-తె. 1. అతిశయించు. 2. భయపడు. 3. ప్రశంసించు.
పిచ్చి-తె. ఉన్మాదము.
పిచ్చిక-తె. చటకము. రూ. పిచ్చుక. సమా. —కుంటు-1. అనూరుఁడు. 2. కాళ్లలేనివాఁడు. రూ. పిచ్చుకకుంటు, పిచ్చికకుంటు.
పిచ్చిల్లు-తె. చిప్పిల్లు.
పిచ్చు-తె. 1. చింతగింజ. 2. పిత్తకోశము.
పిటకము-స. 1. పుండు. 2. చిన్నగంప.
పిటము-స. గంప.
పిట్ట-తె. పక్షి. సమా. —కథ-చిన్నకత.
పిట్టపిడుగు-తె. (పిడుగు+పిడుగు) అనివార్యము.
పిట్టు-తె. ఆవిరిచే ఉడికిన పిండి.
పిఠరము-స. వంటకుండ.
పిడి-తె. 1. కత్తిపరుఁజు. 2. పిడికిలి. 3. ఆఁడుమృగము. సమా. —కట్టు - వింటినడుము, లస్తకము. —కోల-మేఁడి. —గంట-నిడుపు పిడిగల గంట. —మూర-ముడువఁబడిన వ్రేళ్లుగల మూర. —వాటు-పనకట్టలను చేతికొలఁది నెత్తి గింజలు రాలఁగొట్టుట. —సాన - కొయ్యలకు రత్నములకు బెజ్జమువేయు సాధనము. క్రి. —గొట్టు-ఎద్దుపట్టు.
పిడికిలి-తె. ముడువఁబడిన వ్రేళ్లగల అఱచేయి. ముష్టి. క్రి. పిడికిలించు-పిడికిటఁబట్టు.
పిడియము-తె. బాఁకు. రూ. పిడెము.
పిడివాదము-(అఱ.) మూర్ఖవాదము.
పిడుఁజు-తె. రక్తము పీల్చు పురుగు. రూ. పిడుఁదు.
పిడుక-తె. పిడుచగాఁజేసి తట్టినపేఁడ.
పిడుగు-తె. అశని, నిర్ఘాతము. రూ. పిడ్గు. సమా. —కైదువు-వజ్రాయుధము.
పిడుచ-తె. అన్నము లోనగువానిముద్ద.
పిడుచు-తె. రసము లోనగువానిని పిండు.
పిడుత-తె. చిన్న మట్టికుండ.
పిణ్యాకము-స. 1. గానుగపిండి. 2. ఇంగువ.
పిత-స. తండ్రి. (వీరైదుగురు: కన్నవాఁడు, వడుగు

చేసినవాఁడు, చదువు చెప్పినవాఁడు, అన్నము పెట్టువాఁడు, వెఱపుదీర్చి కాపాడినవాఁడు.)
సమా. పితామహుఁడు - 1. తండ్రి తండ్రి. (స్త్రీ. పితామహి.) 2. బ్రహ్మ. పితృపతి - యముఁడు. —యజ్ఞము - పితృతర్పణము. —వనము-శ్మశానము. పితృవ్యుఁడు - తండ్రి తోడఁ బుట్టినవాఁడు. [యముఁడు, పితృపతి.

పితర-వి. (పితృ) తండ్రి. సమా. —దొర -

పితరుఁడు-వి. (పితృ) 1. తండ్రి. 2. బ. పితృదేవతలు. సమా. పితరులచుక్క-మఘ.

పితలాటము-అప. (పిత్తలము+హాటకము) ఇత్తడిని బంగారుగాఁ జేయుపని, మోసము. రూ. పితలాటకము, పిత్తలాటకము.

పితాళ్లు-వి. పితరులు.

పితుకు-తె. పాలుపిండు. రూ. పిదుకు.

పితూరి-హిం. రాజద్రోహము, కుట్ర.

పిత్తము-స. ఒక ధాతువు.

పిత్తలము-స. ఇత్తడి. రూ. పిత్తడి.

పిత్ర్యము-స. తండ్రిది.

పిదప-తె. 1. వెనుక. 2. తక్కువ.

పిదపిద-తె. 1. అనుకు. 2. మృదువు. [మొ.)

పిన-తె. చిన్న. రూ. పిన్న. (పినతల్లి,పినతండ్రి.

పినద్ధము-స. 1. కట్టఁబడినది. 2. తొడుగఁబడినది.

పినాకము-స. 1. శివుని విల్లు. 2. త్రిశూలము. సమా. పినాకి-శివుఁడు. [పిలుఁగు.

పినుఁగు-తె. 1. లుబ్ధకుఁడు. 2. లుబ్ధుఁడు. రూ.

పిన్న-తె. చిన్న. రూ. పిన. (పిన్నపాప. మొ.)

పిపాస-స. నీరుత్రావనిచ్ఛ. (పుం. పిపాసువు.)

పిపీలిక-స. చీమ. రూ. పిపీలి.

పిప్పి-తె. రసముతీసిన ఆకు. మొ. రూ. పిప్పరి.

పిప్పిక-స. పండ్లలోని పాఁచి. [3. పరోక్షమందు.

పిమ్మట-తె. 1. మనోవ్యథ. 2. అనంతరము.

పిరంగి-హిం. పెద్దతుపాకి. రూ. పిరంగీ.

పిరి-తె. 1. మెలి. 2. వెంటి. రూ. పురి. క్రి. —గొను-పెనఁగొను.

పిఱికి-వి. (భీరుకుఁడు) భయశీలుఁడు. సమా. —కండ-అధైర్యము. —మెకము-జింక.

పిఱుఁదు-తె. 1. మొలకు వెనుకటిభాగము, నితంబము. 2. వెనుక. క్రి. —కొను-వెంబడించు.

పిఱుతివియు - (పిఱుఁదు+తివియు) వెనుదీయు. —తివుచు —తీయు, వోవు, —నను- —పై.— —వడు-1. వెనుదీయు. 2. భయపడు. —వెట్టు-అనాదరించు.

పిఱుము-తె. పరుష భావము.

పిరువీఁకు-తె. 1. పీఁకులాట. 2. బాధ. రూ. పిర్వీఁకు. క్రి. పిరువీఁకులాడు, పిరువీఁకుసేయు.

పిట్టి-తె. పిఱుఁదు.

పిలుఁగు-చూ. పినుఁగు.

పిలుక-తె. 1. పిట్టలోనగువానిపిల్ల. 2. చిన్న. రూ. పిల్క. సమా. —జుట్టు-చిన్న జుట్టు, పిల్లజుట్టు.

పిలుకు-తె. గర్వము. రూ. పిల్కు. క్రి. —మూరు, —మాలు-1. చచ్చు. 2. నశించు. ప్రే.—మార్చు, —మాల్చు.

పిలుచు-తె. ఆహ్వానించు. రూ. పిల్చు. కృ. పిలుపు, పిలుపుడు.

పిల్ల-తె. 1. పక్షిలోనగువాని నిసుఁగు. 2. పడుచు. 3. చిన్న. 4. బ. బిడ్డలు. సమా. —కాయ-బాలుఁడు. —జుట్టు - బాలుర ముందఱిసిగ. —నూయి-నూయిలోపలి చిన్ననూయి. —మెఱము-తలక్రిందుగా వేయు పల్లటీ. —వ్రేలు - చిటికెనవ్రేలు. పిల్లేరుగంతు-పిల్లమెఱము.

పిల్లఁగ్రోయి-తె. మురళి. రూ. పిల్లఁగ్రోవి, పిల్లనఁగ్రోలు, —గ్రోవి.

పిల్లాకము-స. పక్షిపిల్ల.

పిల్లి-తె. మార్జాలము. సమా. —కన్నతనము-వైడూర్యము. —గడ్డ-పునుఁగుచట్టము.

పిల్లు-తె. కసవు. రూ. పులు, పుల్లు.

పిశంగము-స. కపిలవర్ణము. [(వి. పిసాసి.)

పిశాచము-స. ఒక తెగ దేవయోని. (స్త్రీ. పిశాచి.)

పిశితము-స. మాంసము. [3. దుష్టుఁడు.

పిశునుఁడు-స. 1. నారదుఁడు. 2. కొండెగాఁడు.

పిష్టకము-స. 1. నూఁకబొడి. 2. పిండివంట.

పిష్టము-స. 1. పిండి. 2. పొడిచేయఁబడినది.

పిస-తె. అవివేకము.

పిసక-తె. తలయందు చెమటచే బందనగొనుముఱికి.

పిసరు-తె. 1. మిగత. 2. లేశము. 3. మలము.

పిసాసి-చూ. పిశాచము.

పిసాళము-తె. 1. వికాసము. 2. పరిహాసము. 3. ప్రకాశము. 4. వ్యాపనము. 5. దొంగయెత్తు.
పిసాళి-తె. పిసాళముగలది. క్రి. పిసాళించు.
పిసిడి-తె. లోభి. రూ. పిసినారి, పిసిని,పిసినిగొట్టు.
పిసుకు-తె. 1. మర్దించు. 2. కాళ్లొత్తు.
పిహితము-స. కనుతెప్పమూఁత. 2. కప్పఁబడినది.
పిళ్లారి-(అ౹.) వినాయకుఁడు.

పీ

పీఁకు-తె. 1. పెఱుకు. 2. తీసివేయు. క్రి. పీఁకులాఁడు-పెనఁగులాడు. కృ. పీఁకులాట. పీఁకు పీఁకాడు-పెఱుకులాడు.
పీఁకె-తె. 1. నాగసరములోనగు వాద్యముఖమునఁ జొప్పించు క్రోవిపుల్ల. 2. కాశవలెఁజుట్టిన ఆకు చుట్ట. 3. త్రాగిమిగిలినచుట్ట. క్రి. —వాఱు-1. చప్పటయగు. 2. కృశించు.
పీఁచము-చూ. పింఛము.
పీఁచు-తె. పెనఁచుకొన్న సన్ననార.
పీఁట-వి. (పీఠము) ఆసనము. క్రి. —వెట్టు-ఒక చోటనే పాదుకొను.
పీఠము-స. పీఁట. రూ.పీఠి.
పీఠిక-స. 1. గ్రంథము మొదట వ్రాయు పుట్టుపూర్వోత్తరము. 2. మేలైనపీఠము.
పీడ-స. బాధ. క్రి. పీడించు.
పీడనము-స. రాయిడి.
పీడితము-స. 1. పీడింపఁబడినది. 2. పిసుకఁబడినది.
పీడ్యమానము-స. పీడింపఁబడుచున్నది.
పీత-వి. ఎండ్రి.
పీతము-స. 1. ఎండ్రి. 2. పసుపువన్నె. 3. త్రాగఁబడినది. సమా. పీతాంబరుఁడు-విష్ణువు. పచ్చవలువదారి.
పీనము-స. 1. సంతోషము. 2. బలిసినది.
పీనసము-స. ముక్కునుచెఱచురోగము.
పీనాహము-స. నూతివాతికట్టు, తా గాఁడి.
పీనుఁగు-స. శవము. రూ. పీన్గు.సమా. —ఁదిండి-పిశాచము.
పీయి-తె. మలము. సమా. పీగ్రద్ద-అతాయి, ఒకతెగ పెద్దగద్ద.పీతిరిగ్రద్ద.—పై.—.—గుంట-ముఱికిగుంట.
పీయూషము-స. 1. అమృతము. 2. జున్నుపాలు. (వ్యు. పానము చేయఁబడునది.)
పీరు-తె. పిగులు. రూ. పీలు.
పీరుచు-తె. జుఱ్ఱు. రూ. పీర్చు, పీలుచు, పీల్చు.
పీల-తె. బక్క.
పీలిక-తె. వస్త్రములోనగువాని ఖండము.
పీలు-చూ. పీరు.
పీలుకము-స. పక్షిపిల్ల.
పీలుచు-చూ. పీరుచు.
పీవరము-స. 1. తాఁబేలు. 2. బలిసినది. 3. క్రొవ్వినది.

పు

పుంఖము-స. బాణముగల క్రిందిచివర, పింజ.
పుంగవము-స. 1. ఎద్దు. 2. దు. (ఉత్తరపదమగుచో) శ్రేష్ఠుఁడు.
పుంజము-స. రాశి, ప్రోగు. క్రి. పుంజీభవించు-రాశివడు.
పుంజి-వి. (పుంజము) సమృద్ధి. క్రి. —కొను-గుబురుకొను.
పుంజు-తె. మగకోడి. సమా. —తాలుపు-కుమారస్వామి.
పుంట-తె. సంధ్య. రూ. పూఁట.
పుండరీకము-స. 1. తెల్లతామర. 2. తెల్లగొడుగు. 3. పెద్దపులి. 4. ఆగ్నేయదిక్కునందలి యేనుఁగు.
పుండలించు-తె. అభూత కల్పనముచేయు.
పుండు-తె. వ్రణము.
పుండ్రము-స. 1. నలుపుకలిసిన యెఱ్ఱ చెఱకు. 2. తెల్లతామర. 3. నుదుటి నామము.
పుంత-తె. ఉపరథ్య.
పుంభావము-స. 1. పురుషత్వము. 2.ప్రౌఢిమము.
పుంశ్చలి-స. ఱంకుటాలు.
పుంసవనము-స. గర్భిణికి మగబిడ్డ పుట్టవలెనని చేసెడి. కార్యము.
పుక్క-తె. బుగ్గ.
పుక్కిలి-తె. బుగ్గలోపలి భాగము.క్రి.పుక్కిలించు, పుకిలించు. కృ. పుకిలింత. పుక్కిలింత.
పుచ్చడీక-తె. సిగ్గరి.
పుచ్చు-తె. 1. పుప్పిపట్టు. రూ.ప్రుచ్చు. 2. పంపు. 3. గ్రహించు. 4. పెఱుకు. కృ. పుప్పి. క్రి. —కొను-గ్రహించు. కృ. పుచ్చుకోలు.
పుచ్చె-తె. 1. తల పుఱ్ఱె. 2.టెంకాయ బొండ్లము.

పుచ్ఛము-స. 1. తోఁక. 2. వెనుకప్రక్క.
పుట-వి. (పృష్ఠము) పుస్తకపు కాగితమందొక ప్రక్క. రూ. పొరట.
పుటపుటన-తె. 1. అధికము. 2. సమృద్ధము.
పుటభేదము-స. పట్టణము. రూ. పుటభేదనము.
పుటము-వి. 1.(ప్లుతము) ఒక అశ్వగతి. 2.(స్ఫుటము) స్పష్టము. క్రి. పుటముబ్బు-మీఁదికుబ్బు. స. 1. పూలబుట్ట. 2. దొప్ప. 3. గుజ్జుపుగిన్నె. 4. మందులను కుండమునసుంచుట.
పుటి-స. 1. పూలబుట్ట. 2. దొప్ప.
పుటిక-వి. (పుటి) చిన్నగంప. రూ. పుట్టిక.
పుటితము-స. 1. దోసిలి. 2. కుట్టఁబడినది. 3. గొప్పగాఁ జేయఁబడినది.
పుట్ట-తె. 1. వల్మీకము. 2. జన్మస్థానము. సమా. —కాఁపు - భల్లూకము. —కాలు - పుట్టవలె దుర్మాంసము పెరిగిన కాలు. —కూడు - చీమ గ్రుడ్లతోఁగలిసిన పుట్టమట్టిముద్ద. —తిండి - భల్లూకము. —కొక్కు - భూస్ఫోటము. రూ. పుట్టగోఁగు. —కోట - కోటగోడకు బలముగా బయటిప్రక్క వేసిన తిన్నె. —గోఁచి - కౌపీనము. —చెండు-బంతి. —తేనె-పుట్టలో పెట్టిన పెరతేనె. —తేలు-మండ్రగబ్బ. —ఁబుట్టువు- [వాల్మీకిముని.
పుట్టము-వి. (పటము) వస్త్రము.
పుట్టి-తె. 1. ఇరువది తూములు. 2. తెప్ప.
పుట్టిక-చూ. పుటిక.
పుట్టు-తె. 1. జన్మించు. కృ. 2. జననము. రూ. పుట్టుక, పుట్టుగు, పుట్టువు. పుట్టినిల్లు - మాతృగృహము. రూ. పుట్టినయిల్లు, పుట్నిల్లు. సమా. —కల్లరి-జన్మమాదిగా కల్లలాడువాఁడు. —గట్టు-ఉదయాద్రి. —గొడ్డు - బిడ్డలులేనిది, వంధ్య. —గ్రుడ్డి-జనుషాంధుఁడు. —చెయువు-జాతకర్మము. —బడి-ఉత్పత్తి. —మచ్చ-పుట్టుకతో చర్మముపై ఏర్పడిన గుఱుతు.
పుడమి-వి. (పృథివి) భూమి. సమా. —తాలుపు- 1. శేషుఁడు. 2. రాజు. 3. పర్వతము. —పట్టి- 1. అంగారకుఁడు. 2. నరకాసురుఁడు. 3. సీత. —పుట్టు-చెట్టు. —ఱేఁడు-రాజు. —వేలుపు-భూసురుఁడు.
పుడికిరించు-తె. కొంచెముగా ఇచ్చు. రూ. పుడుకు, పుణికిరించు, పుణుకు. కృ. పుడికిరింత, పుణికిరింత.
పుడిసిలి-తె. కుదియఁబట్టిన చేరలోనగము, ప్రసృతి. క్రి. పుడిసిలించు-పుడిసిటఁబట్టు.
పుడుక-తె. పుల్ల.
పుడుకు-తె. 1. కొంచెముగా ఇచ్చు. 2. ఇచ్చు. 3. అయిదువేళ్లతో గ్రహించు. 4. కృ. ఈవి. రూ. పుణుకు. సమా. —ఁగల్లు - చింతామణి. —ఁదొడుకు-కామధేనువు. —మ్రాను - కల్పవృక్షము.
పుణ్యజనుఁడు-స. 1. నైరృతి. 2. రాక్షసుఁడు. 3. యక్షుఁడు. 4. పుణ్యాత్ముఁడు.
పుణ్యము-స. 1. ధర్మము. 2. సుకృతము. 3. పవిత్రము. (వి. పున్నెము) సమా. పుణ్యభూమి-వింధ్య హిమవంతములకు మధ్యదేశము. పుణ్యాహవాచనము-అశుద్ధినివారక కర్మము.
పుతపుత-తె. చలనమందగు ననుకరణము. క్రి. —పోవు-వివశమగు.
పుత్త-వి. (పృష్ఠము) వీఁపు.
పుత్తడి-తె. 1. బంగారు. 2. వి. బొమ్మ. రూ. పుత్తళి.
పుత్తళి-తె. చూ. —పై. — స. బొమ్మ. రూ. పుత్తళిక.
పుత్తిక-స. పెరతేనెటీఁగ.
పుత్తెంచు-తె. (పుచ్చు+తెంచు) పుచ్చు, పంపు.
పుత్రి-స. 1. కూఁతురు. 2. పుత్తళిక. రూ. పుత్రిక.
పుత్త్రుఁడు-స. కొడుకు. (వ్యు. పుత్ అను నరకము నుండి రక్షించువాఁడు. వీరుపన్నిద్దఱు: ఔరసుఁడు, క్షేత్రజుఁడు, దత్తుఁడు, కృత్రిముఁడు, గూఢోత్పన్నుఁడు, అపవిద్ధుఁడు, కానీనుఁడు. సహోఢజుఁడు, క్రీతుఁడు, పౌనర్భవుఁడు, స్వయందత్తుఁడు, జ్ఞాతిరేతుఁడు.)
పుదియబొట్టు-తె. ఊర్ధ్వపుండ్రము.
పునర్భవ-స. చంద్రకళ. [లఁబుట్టినది.
పునర్భవము-స. 1. గోరు. 2. సంసారము. 3. మరల
పునర్భువు-స. మాఱుమనువుది.
పునర్వసు-స. ఏడవ నక్షత్రము.
పునశ్చరణము-స. మరల పఠించుట.
పునస్సంధానము-స. విచ్ఛిన్నమైన అగ్నిని మరల హోమకుండమునఁ గూర్చుట.

పునాది-హిం. గోడలకు బలముగా నేల లోఁతుగా
పునీతుఁడు-స. పవిత్రుఁడు. [త్రవ్వి పెట్టు గోడ.
పునుఁగు-గె. మార్జారికవలనఁ గలుగు గంధద్రవ్య
ము. సమా. —చట్టము-పునుఁగుండు కోశము,
బిడాలకము. —పిల్లి-మార్జారిక. [శివుఁడు.
పునుక-తె.తలచిప్ప, కపాలము.సమా. —తాలుపు-
పునెము-చూ. పున్నెము. [తిథి.
పున్నమ-వి. (పూర్ణిమ) శుక్లపక్షమున పదునైదవ
పున్నాగము-స. 1. సురపొన్న చెట్టు. 2. ఇంద్రుని
యేనుఁగు. 3. పురుష శ్రేష్ఠుఁడు.
పున్నెము-వి. (పుణ్యము) సుకృతము. రూ.పున్ని
యము, పునెము.
పుప్పము-వి. (పుష్పము) పూవు.
పుప్పి-తె. పుచ్చుట. [పరాగము.
పుప్పొడి-తె.(పువ్వు + పొడి) పూలయందలిదూళి,
పుబ్బ-వి.(పూర్వఫల్గుని)పదునొకండవ నక్షత్రము.
పుయిలోడు-తె. సంకోచించు, వెనుదీయు. కృ.
పుయిలోట. [లను నాశముచేయువాఁడు.)
పురందరుఁడు-స.ఇంద్రుఁడు. (వ్యు. శత్రుపురము
పురంధ్రి-స. 1. కుటుంబిని. 2. ఆఁడుది.
పురః-స. ముందు. సమా. పురస్కారము-1.ముం
దిడుట. 2. పూజ. రూ. పురస్క్రియ, పుర
స్కృతి. క్రి. పురస్కరించు. పురస్సరుఁడు -
ముందునడచువాఁడు. పురస్కృతము-1. ముం
దిడఁబడినది. 2. పూజింపఁబడినది. 3.పరిగ్ర
హింపఁబడినది. పురోగముఁడు-పురస్సరుఁడు.
రూ. పురోగామి, పురోగుఁడు. —ధసుఁడు -
పురోహితుఁడు. రూ. పురోధ. —భాగి - ఎప్పు
డును తప్పులు వెదకువాఁడు. —హితుఁడు -
శుభాశుభ కర్మములు చేయించుచు మేలుకీళ్లను
తెలుపుచుండెడి ఆచార్యుఁడు.
పురఁట-చూ. పూఁట. [పురణించు.
పురడించు-తె. 1. వర్ధిల్లు. 2. విజృంభించు. రూ.
పురపురలాడు-తె. మిక్కిలి యపేక్షించు.
పురము-స. 1. పట్టణము. 2. శరీరము. 3.ఇలు.
సమా. పురహరుఁడు-శివుఁడు. (ఇట్లు పురవైరి,
పురారి. మొ.)
పురాకృతము-స. పూర్వము చేయఁబడినది.
పురాణము-స.సర్గము ప్రతిసర్గము వంశము మన్వం
తరము వంశానుచరితము అను ఐదులక్షణములు
గల గొప్పగ్రంథము. (ఇవి పదునెనిమిది:
బ్రహ్మ, పద్మ, విష్ణు, భాగవత, నారదీయ,
మార్కండేయ, ఆగ్నేయ, భవిష్యత్, బ్రహ్మ
వైవర్త,లింగ,వరాహ,వాయు,స్కాంద,వామన,
కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండములు.)
పురాణించు-తె. 1. వర్ధిల్లు. 2. విజృంభించు.రూ.
పురాయించు. స. పురాణముచెప్పు.
పురి-తె. 1. మెలి.2.నెమిలి పింఛము.రూ.పిరి.
3. ఆక్రమణము. సమా. —పిట్ట-నెమిలి. క్రి.
—కొను-కవియు.—విచ్చు-పాయు.—వెట్టు-
1. ప్రేరేఁచు. 2. మెలివెట్టు. స. పట్టణము.
పురిటియ-తె. పుసుక. రూ. పుట్టె, పుట్టియ.
పురీతత్తు-స. ప్రేవు.
పురీషము-స. మలము.
పురుగు-తె. క్రిమి. రూ. పురువు,పుర్వు, పుర్వు.
పురుడు-తె. 1. జాతాశౌచము.2.సమానము.సమా.
పురుటాలు-బాలెంత. పురుటిల్లు - ప్రసవగృహ
ము. క్రి. పురుడించు-1.పోలికయగు.2.పోలు.
పురులోము-తె. (పురులు + ఓము) క్షౌత్రము మెలి
యించు.
పురుషము-స. క్రియలమీఁది విభక్తుల సంజ్ఞ. ఇవి
ఉత్తమ, మధ్యమ, ప్రథమ అని మూఁడు.
పురుషుఁడు-స.1.మనుష్యుఁడు.రూ. పూరుషుఁడు.
2. పరమాత్మ. పురుషకారము-పురుషయత్న
ము. పురుషాయితము-ఉపరతి. పురుషార్థము -
పురుష ప్రయోజనము.ఇవి నాలుగు : ధర్మము,
అర్థము, కామము, మోక్షము. పురుషోత్తముఁ
డు-1. విష్ణువు. 2. శివుఁడు.
పురుహూతుఁడు-స. ఇంద్రుఁడు. (వ్యు. యజ్ఞము
లందు మిక్కిలి పిలువఁబడువాఁడు.)
పురె-తె. ప్రశంసార్థకము. రూ. పురే.
పురోడాశము-స. 1. యజ్ఞార్థమైన అపూపము.
2. సోమలత రసము. 3. హుతశేషము.
పుఱ-తె. ఎడమ.
పుట్టు-తె. పలుచని బెల్లము,మలము. మొదలగునవి.
పులకండము-తె. కండచక్కెర, కలకండ.

పులకము-స. 1. పులగము. 2. పురుగు. 3. బ. గగుర్పాటు. రూ. పులకలు. క్రి. పులకించు-గగుర్పాటు గలదియగు. [రించు.

పులకరము-వి. (పులకము) గగుర్పాటు. క్రి. పులక

పులగము-వి. (పులకము) పెసరపప్పుఁచేర్చి వండిన

పులపొడుచు-తె. ఱెప్పవేయక చూచు. [అన్నము.

పులము-స. 1. గగుర్పాటు. 2. విపులము.

పులసరము-తె. పాకము చెడుటచేఁగలుగు పులుసు.

పులసరి-తె. గర్విష్ఠుఁడు.

పులాకము-స. 1. పొల్ల. 2. మెతుకు. 3. సంక్షేపము.

పులి-తె. 1. వ్యాఘ్రము. 2. పులిసినది. సమా. —కడుగు-పులిసిన కడుగునీరు. —కూడు-పులిసిన అన్నము. —కోఁడ-పులివంటి మోము గలిగిన సాలెపురుగువంటి పెద్దపురుగు. —గంజి-పుల్లనీళ్లు. —గాయము-ఆఱిన గాయపు మచ్చ. —త్రేఁపు-అజీర్ణముచే పులుపుగావచ్చు త్రేఁపు. —నీరు-రక్తము చెడి గాయమునుండి వచ్చు నీరు, నీచు.

పులినము-స. ఇసుకదిన్నె, సైకతము.

పులిపిరి-తె. దేహముపై మిరియమువలె పెరుగు దుర్మాంసము. రూ. పులిపులి, పుల్పిరి. [పుల్లె.

పులియ-తె. 1. విస్తరి. 2. ఎంగిలాకు. రూ. పుల్లియ,

పులియు-తె. పుల్లనగు. కృ. పులుపు, పులుసు.

పులిరుసు-చూ. పుల్లిరుసు.

పులు-తె. 1. రత్నమాలిన్యము. 2. కనవు. రూ. పిల్లు, పుల్లు. సమా. —దిండిఱాయి-ఇంద్రనీలము. —మానిసి-అల్పుఁడు. —ఁమాను-తాళ నారికేళాది తృణద్రుమము.

పులుఁగు-తె. పక్షి. సమా. —పిట్ట-గుడ్లగూబ. —ఱాయి-గరుడపచ్చ. —ఱేఁడు-గరుడుఁడు.

పులుగాకు-తె. ఉపద్రవము.

పులుగు-తె. 1. గుఱుతు. 2. జాడ. సమా. పులుగరి-జాడయెఱిఁగినవాఁడు.

పులుప-తె. పుల్లని పలుచని యూరుఁబిండి.

పులుము-తె. 1. రుద్దు. 2. నలుపు. 3. ఉసుము. 4. కుష్ఠరోగము.

పులుసు-తె. 1. ఆమ్లము. 2. కూర.

పులోమజ-స. శచీదేవి. (వ్యు. పులోమునికూఁతురు.)

పులోమజిత్తు-స. ఇంద్రుఁడు. (వ్యు. పులోముని జయించినవాఁడు.) [ముఁడు.

పుల్కసుఁడు-స. 1. బోయ. 2. మాలఁడు. 3. అధ

పుల్ల-తె. 1. పుడక. 2. సమిధ. 3. పులుపుగలది. 4. పసుపుమించినతెలుపుగలది. సమా. —ఁగూర-ఎనిపిన పుల్లనికూర. —నీళ్లు-కూటిసీళ్లు. పుల్లావు-కపిలధేనువు. పుల్లిరుసు-(పుల్ల+ఇరుసు) తొండపుత్రాటికి అనుదలగా నమర్చిన ఇరుసు. పుల్లగిలు-భయపడు. రూ. పుల్లగిల్లు. —వడు-స్తంభించు. —సిల్లు-1. వివర్ణమగు. 2. కలఁగు.

పుల్లతి-తె. సాదనకాండ్రు గుఱికై నాటెడు కోల.

పుల్లు-చూ. పిల్లు. సమా. పుల్లంటుఱాయి-ఇంద్రనీలము. పుల్లరి-(పుల్లు+అరి) పసులు కనవు

పుల్లె-చూ. పులియ. [మేయుటకై ఇచ్చు పన్ను.

పువు-తె. పుష్పము. రూ. పువ్వు, పూవు, పూ. సమా. —ఁబోఁడి-పూవువలె నొప్పిదమైన ఆఁడుది. రూ. పువ్వుఁబోఁడి, పూఁబోఁడి. పువ్వాటు-ముందు వెనుకలకు ఊఁగాడుట. పువ్వార-ఊఁత, తాటి లోనగువానిపూఁత. పువ్వారుఁబోఁడి-పువుఁబోఁడి. పువ్విలుకాఁడు-మదనుఁడు. రూ. పువ్విలుతుఁడు, పూవిలుతుఁడు.

పుషితము-స. పోషింపఁబడినది.

పుష్కరము-స. 1. ఆకాశము. 2. నీరు. 3. తామర. 4. తొండము చివర. 5. ఒకద్వీపము. 6. పండ్రెండేండ్ల కొకసారివచ్చు జీవనదుల పండువు.

పుష్కరిణి-స. 1. కోనేఱు. 2. తామరకొలను. 3. ఆఁడేనుఁగు. (మగయేనుఁగు పుష్కరి.)

పుష్కలము-స. 1. శ్రేష్ఠము. 2. సమృద్ధము.

పుష్టము-స. 1. పోషింపఁబడినది. 2. బలిసినది.

పుష్టి-స. 1. పోషణము. 2. బలుపు. 3. సమృద్ధి.

పుష్పము-స. 1. పూవు. 2. స్త్రీరజస్సు. క్రి. పుష్పించు. సమా. పుష్పకము-1. కుబేరుని విమానము. 2. రత్నకంకణము. —కేతువు-మదనుఁడు. —దంతము-వాయవ్యదిశయందలి యేనుఁగు. (దీనిభార్య శుభ్రదంతి.) —ధన్వుఁడు-పూవిలుతుఁడు. —మంజరి-పూగుత్తి. —రసము-పూఁదేనె. —లావిక-పూలుకట్టి అమ్మెడు ఆఁ

దుది. —లిహము - తుమ్మెద. —వంతులు - సూర్యచంద్రులు. —వతి-రజస్వల. రూ. పుష్పిణి. —శరుఁడు - పూవిలుతుఁడు. —సమయము-వసంతర్తువు.

పుష్పిక-స. 1. దంతమలము. 2. లింగమలము.
పుష్పితము-స. పూచినది.
పుష్యమి-స. ఎనిమిదవ నక్షత్రము. [రాగము.
పుష్యము-స. 1. పుష్యమి. 2. పదవనెల. 3. పుష్య
పుష్యరాగము-స. తెల్లని ఒక మణి. [పు.
పుసలాయించు-హిం. బుజ్జగించు. కృ. పుసలాయిం
పుసి-తె. నేత్రమలము, దూషిక. [ము.)
పుస్తకము-స. గ్రంథము. రూ. పుస్తము. (వి. పొత్త
పుస్తు-తె. దుర్గంధము.
పుస్తె-తె. తాలిబొట్టు.
పుళిందుఁడు-స. ఒక తెగబోయ.

## పూ

పూ-తె. పూవు. సమా. పూఁదఱి-వసంతఋతువు. —ఁదేనియ-మకరందము. —ఁబిందె - లేఁత పిందె. —ఁబోఁడి-పువుఁబోఁడి. —నీరు-పన్నీరు. —నూక-సన్ననూక. —నూనె-సంపంగి నూనె. పూలముడుపు - గర్భిణికి చేయించు పుష్పధారణము. పూవింటి-మదనుఁడు. —విలుకాఁడు. —పై.—
పూంచు-తె. పూనించు. రూ. పూనుచు, పూన్చు.
పూఁచు-తె. పూను. కృ. పూఁపు.
పూఁట-తె. 1. సంధ్య. 2. వేళ. 3. దినము. 4. జవాబుదారితనము. సమా. —కాఁపు - జవాబుదారి, ప్రతిభువు.—కూళ్లు- వెలకు పెట్టెడి అన్నము. క్రి. —పడు-ఒకనిపనిని నేను చేసెదనని ఒప్పుకొను.
పూఁడులు-తె. అనేకములు (సంవత్సరములు) రూ. పూండ్లు. (ఇది యేండ్లతోడనే వచ్చును.)
పూఁత-తె. 1. చర్చ. 2. చందనము.
పూగము-స. 1. పోఁక. 2. సమూహము.
పూచీ-తె. బాధ్యత. [పూత.
పూచు-తె. 1. పుష్పించు. 2. నిస్సారమగు. కృ.
పూజ-స. అర్చన. రూ. పూజనము. క్రి. పూజించు.
పూజ-వి. పూజ. సమా. పూజరి-అర్చకుఁడు. రూ. పూజారి. [పూజ్యుఁడు.
పూజనీయుఁడు-స. పూజింపఁదగినవాఁడు. రూ.
పూజితుఁడు-స. పూజింపఁబడినవాఁడు.
పూజె-తె. ఘటాదులమీఁది చిత్రము. సమా. —కుండలు-ఐరేనికుండలు. పూజెగులు-(పూజె+కాఁగులు) —పై.—
పూటము-తె. బరువు.
పూడిక-తె. పూడిన మన్ను.
పూడు-తె. 1. మట్టిలోనగువానిచే పల్లమునిండు. 2. నిండు. 3. కృ. నిండుట, పూడిక.
పూడుచు-తె. 1. పూడఁజేయు. 2. పాఁతు. రూ. పూడ్చు. కృ. పూడుపు.
పూడుపు-తె. 1. పూడ్చుట. 2. నిక్షేపము.
పూత-తె. 1. పూచుట, వికసనము. 2. పూవు.
పూతము-స. పరిశుద్ధమైనది.
పూతిగంధము-స. దుర్గంధము.
పూదియ-తె. బంగారు పూస. రూ. పూదె.
పూనిక-తె. ఉద్యమము. రూ. పూనికి, పూన్కి.
పూను-తె. 1. కడఁగు. 2. ధరించు. 3. వహించు. కృ. పూనిక.
పూనె-తె. బరణి. [4. లేఁత.
పూప-తె. 1. పూఁబిందె. 2. శిశువు. 3. కంటిపాప.
పూపము-స. 1. భక్ష్యము. 2. పిండివంట.
పూయము-స. 1. చీము. 2. పీనుఁగు.
పూయు-తె. 1. అలఁదు. 2. మెత్తు. కృ. పూఁత.
పూరకము-స. ఊపిరినిండించుట. క్రి. పూరించు.
పూరగించు-వి. 1. నెఱవేర్చు. 2. కడపు.
పూరణము-స. 1. నించుట. 2. గుణించుట. 3. కుడుములోనగువానిలోఁబెట్టు బెల్లము కలిపిన పప్పుముద్ద మొదలగునది.
పూరము-స. జలప్రవాహము.
పూరా-హిం. సంపూర్ణమైన.
పూరి-తె. 1. కసవు. 2. మృగములచనుఁబాలు.
పూరిక-స. బూరె. [బడినది.
పూరితము-స. 1. నింపఁబడినది. 2. గుణింపఁ
పూరుషుఁడు-చూ. పురుషుఁడు. [రూ. పూరెడు.
పూరేడు-తె. వేఁట కుపయోగించు ఒకచిన్నపిట్ట.
పూర్ణము-స. 1. నిండినది. 2. శక్తికలది. 3. సమ

స్తము. సమా. పూర్ణపాత్రము-ఉత్సవకాలమందు సంతోషముచే వస్త్రాభరణాదికము దోఁచుకొనుట, దోఁపు. పూర్ణానకము-1. —పై.— 2. తప్పెట. క్రి. పూర్ణీభవించు-నిండు.
పూర్తము-స. 1. నూయి చెఱువు త్రవ్వించుట, గుడి కట్టించుట, తోఁటపెట్టించుట, అన్నము పెట్టుట. 2. నింపఁబడినది.
పూర్తి-స. పూరణము, నింపు.
పూర్ణము-వి. చూ. పూరణము మూఁడవయర్థము.
పూర్వ-స. తూర్పు.
పూర్వము-స. మొదటిది. సమా. పూర్వగంగ-నర్మద. —జ-అక్క. —జుఁడు-అన్న. —దేవుఁడు-అసురుఁడు, తొలివేల్పు. —పక్షము-1. వాదము. 2. శుక్లపక్షము. —పర్వతము-తూరుపుకొండ. —ఫల్గుని-పదునొకండవ నక్షత్రము, పుబ్బ. —భద్రపదము-ఇరువదియైదవ నక్షత్రము. పూర్వాషాఢ-ఇరువదవనక్షత్రము. పూర్వాహ్ణము-లేఁబగలు.
పూర్వులు-స. ముందటివారు.
పూర్వోత్తర-స. ఈశాన్యదిగ్భాగము.
పూవు-తె. పుష్పము. సమా. చూ. పువు, పూ.
పూస-తె. 1. పూదె. 2. మణి. 3. వ్రేలులోనగువాని కీలు.

## పృ

పృక్తము-స. కూడుకొన్నది.
పృచ్ఛ-స. ప్రశ్నము. క్రి. పృచ్ఛించు.
పృచ్ఛకుఁడు-స. అడుగువాఁడు.
పృతన-స. 1. సేన. 2. 243 రథములు, 243 ఏనుఁగులు, 729 గుఱ్ఱములు, 1215 కాల్బలము గల సేన. [పాపి.
పృథగ్జనుఁడు-స. 1. నీచుఁడు. 2. మూర్ఖుఁడు.3.
పృథగ్విధము-స. పెక్కువిధములుగలది.
పృథివి-స. భూమి. రూ. పృథ్వి. (వి. పుడమి.) (వ్యు. పృథుచక్రవర్తిచే చక్కఁజేయఁబడినది, విశాలమైనది.)
పృథుకము-స. 1. పిల్ల. 2. అడుకులు.
పృథులము-స. విరివియైనది.
పృథువు-స. 1. గొప్పది. 2. విరివియైనది.
పృదాకువు-స. 1. పాము. 2. తేలు. 3. పులి. 4. చిఱుతపులి. [పుతోఁ గూడినది. రూ. పృషత్తు.
పృషతము-స. 1. నీటిబొట్టు. 2. బ్రహ్మబిందు
పృషదశ్వుఁడు-స. వాయువు. (వ్యు. జలబిందువులకు వాహనమగువాఁడు.)
పృష్టము-స. అడుగఁబడినది. [4. పుట.
పృష్ఠము-స. 1.మూడి.2.వీఁపు. 3.వెనుకప్రక్క.

## పె

పెంకు-తె. 1. ఇంటికి కప్పు ఓడుబిల్ల. 2. కుండలోనగువాని ఖండము.
పెంకె-తె. 1. మూర్ఖుఁడు. 2. మొండికట్టె.
పెంచిక-తె.1.కుండమున్నగువాని తునుక, పెంకు.
పెంచు-తె. వర్ధిల్లఁజేయు. రూ. పెనుచు. పెంచుకొను-దత్తుతీసికొను.
పెంట-తె. 1. చీఁపురుకట్టతోనూడ్చిన చెత్త. మొ. 2. ఎరువు. 3. ఆవులమంద ముందున్న చోటు. 4. పేఁట. సమా. —పట్టు-పసులు మున్నగువానిదొడ్డి. క్రి. —గట్టు-పెంటకై మందకట్టు.
పెంటి-తె. పశుపక్ష్యాదిస్త్రీజాతి. సమా. —కరడు-చిన్న అల. (పోతుకరడు—పెద్దఅల.)
పెంటిక-తె. మేఁక గొఱ్ఱె లోనగువానిపేఁడ. ‚ రూ. [పెంట్రిక.
పెండ-చూ. పేఁడ.
పెండరము-తె. గండపెండారము. రూ. పెండారము, పెండియము, పెండెము, పెండెరము.
పెండలము-తె. ఒక దినుసుదుంప. [పెండేరము.
పెండియము-తె. 1. గండపెండారము. 2. పఱుగాఁడి తలుపు. రూ. పెండెము.
పెండిలి-తె. వివాహము. రూ. పెండ్లి. సమా. —కుండలు - ఐరేని. —కూఁతురు-వధువు. —కొడుకు-వరుఁడు. —నడక-తిన్ననినడక.
పెండె-తె. వానములను కదలనీక అడ్డముగా వేసి కట్టెడుకొయ్య.సమా.—కట్టు-దట్టముగాతీర్చిన విభూతిరేఖలు. [రూ. పెండ్లాము.
పెండ్లము-తె. (పెండ్లి+అమ) వివాహమైనభార్య.
పెందలకడ-తె. (పెఁ+తలకడ) ప్రొద్దుపోకమునుపు. రూ. పెందలాడ.

పెంపు-తె. *1.* నాశముచేయు. *2.* సమృద్ధి. *3.* నాము. *4.* అతిశయము. *5.* గౌరవము. *6.* మహత్త్వము. క్రి. పెంపగు-వర్ధిల్లు. పెంపారు-గొప్పయగు. పెంపుమీఱు-అతిశయించు.

పెంపుడు-తె. పెంపఁబడినది. [పెగలు.

పెకలు-తె. *1.* పెల్లగిలు. *2.* ప్రయాణమగు. రూ.

పెక్కండ్రు-తె. అనేకులు. రూ. పెక్కురు.

క్కణము-వి. (ప్రేంఖణము) *1.* అభినయముతోడి నృత్యము. *2.* మల్లరంగము. రూ. ప్రెక్కణము. క్రి. పెక్కణించు.

పెక్కు-తె. అనేకము.

పెక్కువ-తె. *1.* వర్ధనము. *2.* ఆధిక్యము.

పెగడ-చూ. ప్రెగడ.

పెచ్చు-తె. *1.* నాణెముల మార్పులోనగువానియందక్కు అనుబట్టి ఎక్కువగా ఇచ్చుధనము. *2.* పండుమున్నగువానిమీఁదితోలు. *3.* అధికము.

పెటుకు-తె. విరసము.

పెట్ట-తె. *1.* పక్షి స్త్రీజాతి. *2.* ఆఁడుకోడి. సమా. —మారి-పెట్టవలెనుండు పుంజు.

పెట్టు-తె. *1.* కలుగు. *2.* ఉంచు. *3.* ధరించు. *4.* ఇచ్చు. *5.* మోపు. *6.* గోడపెట్టు. *7.* నాటు. *8.* కొట్టు. కృ. *9.* దెబ్బ. *10.* ఈవి. *11.* మాఱు. *12.* ఆవృత్తి. సమా. —ఁజెట్టు-కల్పవృక్షము. —బడి-మొదటపెట్టినడబ్బు.—మందు-వశ్యౌషధము. క్రి.—కొను-ఉంచుకొను.

పెట్టుడు-తె. ఈవి. [—వడు-దెబ్బతిను.

పెట్టె-వి. (పేటి) సొమ్ములు మున్నగునవియుంచుకొనునది. రూ. పెట్టియ. సమా. —బండి-పెట్టెవలె నమర్చిన బండి.

పెట్లు-తె. *1.* పెటులు. *2.* దెబ్బలు. సమా. పెట్లకంబము-అదురువేటుగొట్టము. —దిమ్మె-—పై.—మోవి.—పై—పెట్లుప్పు-ఒకతెగఉప్పు.

పెడ-తె. *1.* పెద్ద. *2.* వెనుకటిది. *3.* విపరీతము. సమా. —కట్టె-మూర్ఖుఁడు. రూ. పెడసరకట్టె. —కట్లు - చేతులు వెనుకకు విఱిచి కట్టినకట్లు.—చెవి-చెవివెనుకటిభాగము. —చేయి - మీఁజేయి. —దారి - తప్పుత్రోవ. క్రి. —ఁబాయు-ఎడఁబాయు.—మరలు, —మఱు-వెనుకకుతిరుగు. —మోము-విముఖము. రూ. పెడము.—సరము-మౌర్ఖ్యము. [భాగము.

పెడక-తె. *1.* కత్తివెనుకభాగము. *2.* ఆకువెనుక

పెడులు-తె. పెటులు.

పెడ్డ-తె. మట్టిపెల్ల.

పెణక-తె. *1.* ఇంటి ఒకభాగపుకప్పు. *2.* పెడక.

పెత్తనము-తె. (పెద్ద+తనము) *1.* అధికారము. *2.* వార్ధకము.

పెద-చూ. పెద్ద. [*2.* వార్ధకము.

పెదవి-తె. మోవి, వాతెర.

పెద్ద-తె. *1.* వృద్ధుఁడు. *2.* జ్యేష్ఠుఁడు. *3.* అధికుఁడు. *4.* శ్రేష్ఠము. *5.* దీర్ఘము. *6.* అత్యంతము. సమా.—కాఁపు-గ్రామాధికారి. —తలపెద్దయైకార్యమునడపువాఁడు.—నిదుర-చావు. రూ. పెద్దనిద్దుర. —నెల-జ్యేష్ఠమాసము. —పులి-బెబ్బులి.—పులుఁగు-గుడ్లగూబ.—మ్మ-*1.* జ్యేష్ఠాదేవి. *2.* పెదతల్లి. —రోగము-కుష్ఠువు. —వాకిలి-గోపురద్వారము. —విన్నపము-చెవుడు. —వీది-రాజమార్గము.—వేలుపు-బ్రహ్మ. —వ్రేలు-బొటనవ్రేలు.

పెన-తె. *1.* మెలిక. *2.* బంధము. క్రి. —ఁగొను-*1.* మెలిగొను. *2.* చేరు. —వెట్టు-మెలివెట్టు.

పెనఁకువ-తె. *1.* పెనఁగులాట. *2.* చుట్టుకొనుట. *3.* మేళనము. *4.* యుద్ధము. *5.* వివాదము.

పెనఁగు-తె. *1.* పెనఁగొను. *2.* చుట్టుకొను. *3.* కలయు. *4.* యుద్ధముచేయు. *5.* మాఱాడు. కృ. పెనఁకువ. క్రి. పెనఁగులాడు-మల్లాడు.

పెనఁచు-తె. *1.* పెనఁగఁజేయు. *2.* పెనవైచు. కృ. పెనపు.

పెనపు-తె. *1.* గలపు. *2.* పెనఁచు. *3.* వివాదము. *4.* భేదము. సమా. పెనపరి - *1.* వివాదశీలుఁడు. *2.* భేదశీలుఁడు. [తేకు, స్వేదని.

పెనము-తె. దోసలు మున్నగునవికాల్చు ఇనుప

పెనయు-తె. *1.* కలియు. *2.* పెనఁగు.

పెనిమిటి-తె. (పెనుపు+మేటి) మగఁడు.

పెను-తె. సమాసమున 'పెనుపు'నకు మిగులురూపము. సమా. పెంజీఁకటి-చిమ్మచీఁకటి. పెందరఁగ-పెద్దఅల. పెందుఱుము - పెద్దకొప్పు. పెనుఁగొమ్మ-చెట్టు మొదటికొమ్మ.—ఁబాము-

కొండచిలువ.—మసనము-కాశి.—మినుకులు-వేదము. —వెల్లి-ఏకార్ణవము. —వ్రేలు-బొటనవ్రేలు. పెన్బుద్ధి-పెద్దయుద్ధి. —పెన్బూఁత-గొప్ప ఆధారము. పెన్నీరు-సంద్రము. పెన్నెనరు-గొప్పదయ. పెన్ముద్ద-పెద్దముద్ద.

పెనుచు-తె. చూ. పెంచు. కృ. పెనుపు.

పెనుపు-తె. 1. పెంచుట. 2. వృద్ధి. 3. అధిక్యము. 4. మహత్త్వము. రూ. పెంపు. సమా. పెనుపరి-వృద్ధిపొందించువాఁడు. క్రి. పెనుపడు-1. అతిశయిల్లు. 2. వర్ధిల్లు. పెనుపారు-గొప్పయగు. రూ. పెంపారు. [రూ. పేయ.

పెయ్య-తె. 1. పాలువిడిచినఆఁడుదూడ. 2. ఆవు.

పెర-తె. 1. తేనెతెట్టె. 2. వి. (పరము) అన్యము. సమా. —యీఁగ-పుత్తిక. క్రి. —రేఁచు-ప్రేరేఁచు. —రేఁపు.

పెఱ-వి. (పరము) ఇతరము. రూ. పెర. సమా. —గాయ-కుత్సితుఁడు. —మగఁడు - ఱంకు

పెరసు-తె. మాంసము. [మగఁడు.

పెఱిక-తె. ఎద్దుమీఁది గంత.

పెరిమ-వి. ప్రేమ.

పెరిమె-తె. పెద్దఱికము.

పెరుఁగు-తె. 1. వర్ధిల్లు. 2. ఎదుగు. 3. దధి. 4. ఏండ్లు చెల్లినవాఁడు, —చెల్లినది. రూ. పెరువు.

పెరుఁగుడు-తె. వృద్ధి. [4. మోయించు.

పెఱుకు-తె. 1. పీఁకు. 2. పెల్లగించు. 3. మోయు.

పెరుగు-తె. తెగు.

పెఱుగు-తె. 1. కదఁగు. 2. విజృంభించు.

పెరుమాళ్లు-(అ౦) విష్ణువు.

పెలుకుఱు-తె. భయాదులచే అంగములు విలవిల పోవు, విహ్వలించు. రూ. పెల్కుఱు.

పెలుచ-తె. 1. అతిశయము. 2. ఆగ్రహము. 3. ఆధిక్యము. 4. కాఠిన్యము. 5. గట్టిగా. రూ. పెలుచన, పెల్చ, పెల్చన.

పెల్ల-తె. మట్టిగడ్డ. రూ. పెళ్ళ. క్రి. పెల్లగిలు-1. పాదు ఊడిలేచు. 2. పాఱు. రూ. పెల్లగిల్లు.

పెల్లిదము-తె. పెల్లు.

పెల్లు-తె. 1. అతిశయము. 2. ఆధిక్యము. 3. అత్యంతము. క్రి. —కొను-అతిశయిల్లు.

పెసర-తె. పెసలు పైరు.

పెసలు-తె. పెసర ధాన్యము. [ముగా విఱుగునది.

పెళుచు-తె. 1. మూర్ఖుఁడు. 2. విరసము. 3. సుకర

పెళ్లెము-తె. మద్యముచేయుటకు అనేక వస్తువులు చేర్చి చేసినపిండి, మేదకము.

## పే

పేఁట-హిం. 1. నగరము. 2. శాఖానగరము. రూ.

పేఁటు-తె. 1. బీటిక. 2. బేఁటు. [పెంట.

పేఁడ-తె. గోమయము. రూ. పెండ. సమా. పేన్నీ

పేఁడు-తె. దారముపేను. [ళ్లు-పేఁడనీళ్లు.

పేక-తె. నేఁతయందు అడ్డనూలు. (నిడుపునూలు

పేగు-తె. ఆంత్రము. రూ. ప్రేగు, ప్రేవు. [పడుగు)

పేచకము-స. గుడ్లగూబ. (వ్యు. కాకులను హింసించునది.)

పేట-తె. హారములో ఒక సరము. క్రి. పేటాడు-ఛేదించు. స. పెట్టె. రూ. పేటము, పేటకము.

పేటి-తె. నదికట్టు. స. పెట్టె.

పేటిక-స. 1. పెట్టె. 2. సమూహము.

పేటు-తె. 1. నేఁతపట్టె. 2. పర్వత శిఖరము.

పేడి-తె. నపుంసకుఁడు.

పేడు-తె. సన్నచెక్క. క్రి. పేడెత్తు-తొలఁగు.

పేడె-తె. గడ్డము మీసము లేనివాఁడు.

పేద-తె. 1. భటుఁడు. 2. దరిద్రుఁడు. 3. అశక్తుఁడు. 4. వి. (భీతుఁడు) పిఱికి. సమా. —ఱికము, —ఱిమి-1. దారిద్ర్యము. 2. పిఱికితనము. రూ. పేదర్కి. [ప్రాణి, యూకము.

పేను-తె. 1. దారముపేఁడు. 2. తలలో పెరుఁగు

పేము-చూ. పేత్రము.

పేయ-చూ. పెయ్య.

పేయము-స. 1. నీళ్లు. 2. పాలు. 3. త్రావఁదగినది.

పేరఁటము-తె. 1. శుభకార్యములునడప ముత్తైదువలు ఇరుగుపొరుగు ముత్తైదువల రమ్మని పిలుచుట. 2. వారుచేయుకార్యము. రూ. పేరంట్రము. సమా. పేరఁటాలు-1. పేరఁటమునకువచ్చిన ముత్తైదువ. 2. మృతసువాసిని.

పేరణి-తె. 1. అంగీ. 2. కడవమీఁది నృత్యము.

పేరము-చూ. పేరెము. [రూ. ప్రేరణి, పెరవణి.

పేరు-తె. *1*. ఘనీభవించు. *2*.సాంద్రమగు. *3*.అతిశయించు. *4*. నామము. *5*. కీర్తి. *6*. దండ. *7*. పెద్ద. *8*. అధికము. సమా. పేర్మి-*1*. గౌరవము. *2*.అతిశయము. రూ. పేర్మి. పేరీఁదు-ఖర్జూరము. పేరుంగరము-పేరుచెక్కిన ఉంగరము. క్రి. —కొను-*1*. పేరుపెట్టి పిలుచు. *2*. పిలుచు. *3*. వచించు. *4*. స్తుతించు. రూ. పేర్కొను.

పేరుచు-తె. *1*. అతిశయించు. *2*. విజృంభించు. *3*. ఒకటిపై నొకటిపెట్టు. రూ. పేర్చు. కృ. పేరుపు, పేర్పు.

పేరుడు-తె. ఘనీభవించుట. [పేరము.

పేరెము-తె. *1*. గుఱ్ఱపుపరుగు. *2*. పరుగు. రూ.

పేలలు-తె. లాజలు, బొరుగులు. రూ. పేలాలు. ప్రేలలు, ప్రేలాలు.

పేలవము-స. పలుచనిది, విరళము.

పేలిక-తె. చింపిగుడ్డ. రూ. ప్రేలిక.

పేలు-తె. సెగచే వేఁగియుబుకు. రూ. ప్రేలు. ప్రే. పేలుచు, పేల్చు, ప్రేలుచు.

పేశలము-స. *1*. నేర్పుగలది. *2*. చక్కనిది.

పేశి-స. *1*. గ్రుడ్డు. *2*. కత్తియొఱ. *3*. మాంసపుముద్ద.

పేషణము-స. నూఱుట.

పేషణి-స. సన్నెకల్లు.

## పై

పై-తె. మీఁదు. రూ. పయి. సమా. —కూటమి-ఉపరిసురతము. —జాఱు-ముచ్చె. క్రి. —కొను-*1*. మీఱు. *2*. కవియు. *3*. యత్నించు. *4*. కలుగు. —పడు-*1*. మీఱు. *2*. కవియు. కృ. పైపాటు.

పైఁట-చూ. పయఁట.

పైఁడి-తె. *1*. బంగారు. *2*. ధనము. రూ. పయిఁడి, పసిఁడి. సమా. —కంటి-చిన్నగూబ, కనకాక్షి. రూ. పయిఁడికంటి. —చూలాలు-భూమి, వసుగర్భ. —నెలఁత-లక్ష్మి. —ఱేఁడు-కుబేరుఁడు. క్రి. —ముడుచు - నిశ్చితార్థముచేయు. కృ. పైఁడిముడుపు.

పైకము-తె. *1*. ధనము. *2*. సమూహము. రూ. పయికము. స. పికముల సమూహము.

పైతామహము-స. పితామహ సంబంధమైనది.

పైతృకము-స. పితృ సంబంధమైనది.

పైతృష్వసేయుఁడు-స. మేనత్త కొడుకు. రూ. పైతృష్వసీయుఁడు.

పైత్యము-స. పిత్తమువలనఁ గలిగినది.

పైద-తె. పిల్లకాయ. రూ. పయిద.

పైదలి-తె. ఆఁడుది. రూ. పయిదలి.

పైనము-చూ. పయనము.

పైర-చూ. పయర.

పైరము-తె. ఆవు. రూ. పయిరము.

పైరు-తె. సస్యము. రూ. పయిరు. సమా. పైరులఱేకిమీఁదు-చంద్రుఁడు, ఓషధీశుఁడు.

పైశాచము-స. మైమఱచి శీలము రక్షించుకొనఁబరాకుపడియున్నదానిని సంభోగేచ్ఛచే రహస్యముగాఁజేసికొను వివాహము.

పైశున్యము-స. పిశునభావము.

పైసరము-తె. రతి. రూ. పయిసరము.

## పొ

పొంకము-తె. పొందిక. క్రి. పొంకిపడు. పొందికోపడు. పొంకించు-పొందిక పఱచు.

పొంగలి-తె. పాలుచేర్చి పొంగించిన అన్నము, నైవేద్యము. సమా. పొంగటినెల - మార్గశీర్షమాసము. —పండుగ-మకర సంక్రాంతి. క్రి.

పొంగిలి-తె. పక్షుల మేఁత. [పొంగలించు-నిక్కు.

పొంగు-తె. *1*. ఉబ్బు. *2*. సంతోషించు. *3*. పర్విం చు. కృ. *4*. ఉబ్బు. *5*. సంతోషము. *6*. గర్వము. క్రి. పొంగారు-*1*. ఉబుకు. *2*. సంతోషించు. *3*. అతిశయించు. *4*. విజృంభించు. *5*. నిక్కు.

పొంచిక-తె. పొంచు.

పొంచు-తె. మఱుఁగుననుండి కనిపెట్టియుండు. కృ. పొంచు-కనిపెట్టియుండుట.

పొంజు-చూ. పోఁజు. [నది.

పొంటె-తె. కొఱకు అను ప్రత్యయార్థమందువచ్చు

పొంత-వి. (ప్రాంతము) *1*. సమీపము. *2*. తీరము. సమా. —కడవ - ప్రొయ్యిదగ్గఱి నీళ్లకడవ. —కత్తె-కుంటెనకత్తె.

పొంతనము-తె. (పొందు+తనము) గ్రహమైత్రి.

పొంతము-తె. స్నేహము.

పొందిక - తె. 1. పొంకము. 2. చేరిక. 3. కలయిక.
పొందు - తె. 1. (కన్ను) మోడ్చు. 2. ప్రాపించు. 3. కలయు. కృ. 4. పొందిక. 5. స్నేహము. 6. సంధి. 7. ప్రాప్తి. 8. అనుకూల్యము. 9. అభేదము. సమా. —కాఁడు - మిత్రుఁడు. క్రి. —కొను - నెలకొను. —పడు - సరిపడు. కృ. పొందుపాటు.
పొంపిరి - తె. సాంద్రత. క్రి. —వోవు - 1. అతిశయించు. 2. వర్ధిల్లు. 3. వ్యాపించు. 4. పుట్టు. 5. సంతోషించు. 6. విజృంభించు. 7. ప్రసిద్ధికెక్కు. [క్రి. పొంపెసలారు - ఒప్పగు.
పొంపు - తె. 1. మెడవెనుకటి భాగము. 2. ఒప్పు.
పొకారు - తె. నాశమగు. రూ. పోకారు.
పొకాలు - తె. వెడలు, పోవు. రూ. పోకాలు.
పొక్కలి - తె. 1. ఎత్తుడు ప్రొయ్యి. 2. మూఁడు ఱాళ్లుపెట్టిన ప్రొయ్యి.
పొక్కి - తె. 1. గుఱుతు. 2. ఉపాయము.
పొక్కిలి - తె. బొడ్డు. సమా. —చూలి - బ్రహ్మ.
పొక్కు - తె. 1. దుఃఖించు. 2. బొబ్బలేచు. 3. ఉలుకు. కృ. 4. దుఃఖము. 5. బొబ్బ. 6. ఎండిలేచిన పెల్ల. 7. జనశ్రుతి.
పొక్కుడు - తె. ఎండిలేచినపెల్ల, పొక్కు.
పొగ - తె. ధూమము. రూ. పొవ. సమా. —కన్ను - శివునిఫాలనేత్రము. —కట్టు - ఇంటికప్పు సందులనుండి కనఁబడు సూర్యకిరణము. —గూడు - 1. ఇంటికప్పుపై పొగపోవుట కేర్పఱచిన సందు. 2. గాలిగుమ్మటము. —చుట్ట - పొగాకు చుట్ట. —చెట్టు - పొగాకుచెట్టు. పొగాకు - ధూమ్రపత్రము. క్రి. పొగచు - 1. పొగయించు. 2. తాళించు. —చూరు - పొగపట్టు. పొగపు - తాళించు.
పొగడ - తె. వకుళవృక్షము. రూ. పొవడ.
పొగడిక - వి. స్తుతి. రూ. పొగడిత, పొగడ్త.
పొగడు - తె. 1. స్తుతించు. 2. కృ. స్తుతి. రూ. పొవడు. కృ. పొగడిక, పొగడిత.
పొగడ్త - తె. 1. స్తుతి. 2. కీర్తి. [రూ. పొవయు.
పొగయు - తె. 1. పొగగలదియగు. 2. కుములు.
పొగరు - తె. 1. గర్వము. 2. దైర్ఘ్యము. రూ. పొవరు. సమా. —బోతు - గర్వశీలుఁడు.
పొగులు - తె. 1. పరితపించు. 2. కుములు. 3. కృ. పరితాపము. రూ. పొవులు.
పొచ్చెము - తె. 1. న్యూనత. 2. కపటము.
పొట - వి. (పుటి) దొప్ప.
పొటకరించు - తె. 1. అతిశయించు. 2. వర్ధిల్లు.
పొటమరించు - తె. 1. (బొబ్బ) లేచు. 2. (చిగురు. మొ.) పుట్టు. [(పుటము) ముక్కురంధ్రము.
పొటము - తె. 1. పుట్టు. రూ. పొడము. 2. వి.
పొటి - తె. పొట్టి.
పొటిపొటి - తె. అల్పము.
పొటుకు - తె. ఉపద్రవము. రూ. పొటుక్కు.
పొటేలు - తె. మగగొఱ్ఱె. రూ. పొట్టేలు, పొట్లేలు.
పొట్ట - తె. 1. కడుపు. 2. వరియెన్ను గర్భము. సమా. —కఱ - ఎన్ను గర్భముగాఁగల వరిపైరు. రూ. పొటకఱ, —కట్టు, పొట్టకట్టు. —కఱకు - ఎన్ను పొట్టపట్టు సమయము. —కూడు - జీతమునకు మాఱుగా పెట్టెడి అన్నము. —క్రొవ్వు - ఆహారమదము. —వాఁడు - దొడ్డకడుపువాఁడు.
పొట్టము - తె. గోఁచి.
పొట్టి - తె. 1. కుఱుచ. 2. కుఱుచవాఁడు. రూ. పొటి.
పొట్టియ - తె. తేలు, వృశ్చికము. [తోలు.
పొట్టు - తె. 1. ఉముక. 2. కాయధాన్యముమీఁది
పొట్ల - తె. పటోలిక అను తీఁగ. సమా. —పూరిక్క - పుష్యమి. —నెల - పుష్యమాసము.
పొట్లము - వి. (పోట్టలి) 1. పువ్వులు మొదలగునవి ఉంచికట్టిన మడుపు. 2. సేన. 3. గుంపు.
పొడ - తె. 1. రూపు. 2. జాడ. 3. చూపు. 4. దేహమందు తెల్లగాఁగనఁబడుచుక్క. సమా. —నీడ - సందులలోతోఁచి పొడపొడగా ఏర్పడునీడ. —యెండ - పొడపొడగా తోఁచు ఎండ. —కట్టు - కనఁబడు. —గను - చూచు. —చూపు - కనఁబడు. —తెంచు - పుట్టు. పొడలమెకము - దుప్పి.
పొడక - తె. ఈఁతబద్దలు లోనగువానితో నల్లిన బొట్ట. రూ. పొణక.
పొడవు - తె. రూపు. క్రి. పొడవడఁగు - 1. చెడు. 2. చచ్చు. పొడవుసూపు - కనఁబడు.
పొడి - తె. చూర్ణము. సమా. —చీఁకటి - మసకచీఁకటి.
పొడుగు - తె. 1. ఉన్నతమగు. 2. వర్ధిల్లు. కృ.

3. ఉన్నతము. 4. ఎత్తు. 5. మీఁదు. 6. ఉత్కృష్టము. సమా. —మడుఁగు-ఆకాశగంగ.

పొడుచు-తె. 1. పోట్లాడు. 2. ఉదయించు. 2. పిడికిలి లోనగువానితో క్రుమ్ము. 3. కుట్టు. 4. (ఆన) పెట్టు. కృ. పొడుపు.

పొడుపు-తె. 1. పొడుచుట. 2. ఉదయము. 3. పోటు. సమా. —ఁగొండ-ఉదయాద్రి.

పొడువ-తె. (వ్యు. పొడుచువాఁడు) దుష్టుఁడు. రూ. పొడువఁడు, పొలువ.

పొడువు-తె. 1. ఉన్నతి. 2. ఎత్తు. 3. మీఁదు. 4. ఉత్కృష్టము. రూ. పొడుగు.

పొణక-చూ. పొడక.

పొతక-తె. పొత్తర.

పొతము-తె. 1. పొట్లము. 2. గుంపు.

పొతుకు-తె. ధాన్యరాశి చుట్టునుగీఁచు గిఱి.

పొత్తము-వి. (పుస్తము) 1. గ్రంథము. 2. కావ్యము.

పొత్తర-తె. ఆకులు పూలులోనగువాని కట్ట. రూ. పొత్ర. [రూ. పొత్రము.

పొత్తరము-వి. (పవిత్రము) నూఱెడు గుండ్రాయి.

పొత్తి-తె. 1. మెత్తని సన్నని పొఁతగుడ్డ. రూ. పొత్తిక. 2. చెట్టుమీఁదినార. 3. పోఁకపూగుత్తిమీఁదిపట్ట, పాళ. సమా. —కడుపు-క్రిఁగడుపు. —చీర-నారచీర. —దామర-ముడుగుదామర. —నూలు - పట్టుపురుగువంటి పురుగునేయు నూలు. —నూలికాయ - పొత్తినూలునేయు పురుగుగూడు.

పొత్తు-తె. 1. స్నేహము. 2. సంగతి. 3. అవిభక్తత.

పొత్తువు-తె. సరస్వతి. [మన్ను.

పొత్తెము-తె. గరిడీసాలయందు క్రిందపఱచు ఎఱ్ఱ

పొద-తె. ఒకటితో నొకటి పెనఁగొన్నబోదెలేని చిన్నచెట్లగుంపు. రూ. పొదరు. సమా. పొదరిల్లు-ఇల్లువంటిపొద. రూ. పొదరుటిల్లు. పొదరిండ్లచుక్క - పునర్వసు. క్రి. పొదవెట్టు - 1. సూచించు. 2. ఆరోపించు.

పొదక-తె. పెద్దగొంతు.

పొదడు-తె. పొట్టివాఁడు. రూ. పొదిటి.

పొదలు-తె. వర్ధిల్లు. కృ. పొదలిక. క్రి. —కొను- 1. పెరుఁగు. 2. బలియు.

పొది-తె. 1. పొదుఁగు. 2. భారము. 3. తూణీరము. 4. మంగలి అడపము. 5. సమూహము. సమా. —కట్టు-వాకిటిముందఱి పంచపాక. —గిలి - ప్రక్కకు సందిటికి నడిమిభాగము. క్రి. —గొను-1. గుంపుగూడు. 2. బలయు.

పొదుఁగు-తె. పశ్వాదులకు పాలుండుచోటు, ఊధ

పొదుక-తె. భారము, పొది. [ము. రూ. పొదువు.

పొదుగు-తె. 1. క్రమ్ము. 2. (రత్నాదులు) చెక్కు. 3. కప్పు. 4. పక్షులు గ్రుడ్లను ఱెక్కలతోకప్పు. 5. పొత్తిగుడ్డ. రూ. పొదువు.

పొదుగుడు-తె. కప్పుడు.

పొదుపు-తె. 1. వృద్ధి. 2. (వ్యయమందు) మితము.

పొదురు-తె. పూచు.

పొదువు-చూ. పొదుఁగు.

పొద్దు-చూ. ప్రొద్దు.

పొన-తె. కంటికగపడినది. రూ. పొన్న.

పొనరు-తె. 1. అగు. 2. పొసఁగు. కృ. 3. పొందిక. 4. ఇంపు. రూ. ఒనరు. క్రి. పొనరారు-ఒప్పగు. పొనరువడు-పొందుపడు.

పొనలు-తె. దగదగ మండు.

పొనిక-తె. ముంజిగడ్డి.

పొనుఁగు-తె. 1. నిస్తేజము. 2. పొట్టి. క్రి. —వడు- 1. నిస్తేజమగు. 2. నశించు. 3. శూన్యమగు. రూ. పొనుపడు.

పొనుపు-తె. పరాక్రమము. రూ. పొంపు.

పొన్న-తె. పొన. వి. పున్నాగవృక్షము.

పొన్నగంటి-తె. ఒకతెగకూరాకు, మత్స్యాక్షి.

పొన్నట్టు-తె. అటక.

పొన్నరి-తె. మనోజ్ఞము. రూ. పొన్నారి.

పొన్నాడ-తె. ఒకతెగ చిఱుతపులి. [వలయము.

పొమ్న-తె. 1. బంగారు. 2. కట్టుగా వేయులోహ

పొమ్మ-తె. నిశ్చయార్థకము. రూ. పో.

పొయి-తె. వంటకు అగ్నినిముట్టించుటకు చేసిన చోటు. రూ. పొయ్యి, ప్రొయి, ప్రొయ్యి.

పొర-తె. 1. పలుచనిచర్మము. 2. పాముకుబుసము. 3. కపటము. 4. మడత. 5. ప్రమాదము. క్రి. —పడు-ప్రమాదపడు. కృ. పొరపాటు.

పొరఁటు-తె. నీళ్లగురపొరలించివండు. —పోవు-నీరు తప్పుదారినెక్కు.
పొరక-తె. 1. గడ్డిపోఁచ. 2. చీఁపురుకట్ట. 3. [ఈనెపుడక.
పొరకటి-తె. వాకిటిచేరువగోడ.
పొరచి-తె. చేబదులుతెచ్చుకొన్నది.
పొరట-వి. (పృష్ఠము) పుట.
పొఱడు-తె. గూను.
పొరపు-తె. భేదము. [దు. రూ. పొఱయు.
పొరయు-తె. 1. కలుగు. 2. పొంచు. 3. పొం
పొరలు-తె. 1. ఉరలు. రూ. పొరలాడు. 2. ప్రవర్తిల్లు. కృ. 3. లుంఠనము. రూ. పొర్లు.కృ. పొరలు, పొరలిక. సమా. —దండము-పొరలుచుపెట్టెడు దండము. —కట్ట-వెల్లువపొరలిపోక అడ్డమువేయుకట్ట.
పొరి-తె. 1. పొలి. రూ. పొటి. 2. అత్యంతము. 3. దృఢముగా. 4. క్రమముగా. 5.మాటికి. సమా. —చూపు-1. ఉగ్రదృష్టి. 2. భేదదృష్టి. క్రి. —గొను-1. చంపు. 2. నాశముచేయు.—మాలు-చచ్చు.ప్రే. —మాలుచు,—మాల్చు,—మార్చు,—పుచ్చు-చంపు. పొటిపుచ్చు-కలఁచు. —పోవు-కలఁగు. పొరిపోవు-చచ్చు. [3. సమీపము. రూ. పొరువు, పొర్గు.
పొరుగు-తె. 1. ప్రక్క. 2. ఇరుగునకుప్రక్క.
పొల-తె. 1. మాంసము. 2. మాంసపుదుర్గంధము. 3. చేఁపమీఁదిపొట్టు. సమా. —దిండి-క్రవ్యాదుఁడు. (ఇట్లు పొలమేఁతరి. మొ.) క్రి. —మారు-ప్రమాదపడు. [పొల్తుక.
పొలఁతి-తె. ఆఁడుది. రూ. పొల్తి, పొలఁతుక,
పొలకువ-తె. జాడ, పోబడి. [ప్రకాశము.
పొలపము-తె. 1. వ్యాపనము. 2. వాసన. 3.
పొలము-తె.1.పైరుపెట్టునేల.2.పసులుమేయుకంచె. 3. అడవి. 4. ప్రదేశము. 5. ఊరు. 6. జాడ. 7. విధము.సమా.పొలపరి-(పొలము+అరి) జాడతెలిసినవాఁడు. పొలమరి-పొలముకాఁపు. పొలముపాటు-కృషి.
పొలయలుక-తె.(పొల్ల+అలుక)ప్రణయకోపము.
పొలయిక-తె. 1. సంచారము. 2. వ్యాపనము.
పొలయు-తె. 1. సంచరించు. 2. వ్యాపించు. 3. సమీపించు. 4. ప్రవేశించు. కృ. పొలపము, పొలయిక.
పొలసు-తె. 1. మాంసము. 2. మాంసపుదుర్గంధము. 3. చేఁపమీఁదిపొట్టు. రూ. పొల.సమా. —దిండి-రాక్షసుఁడు. (ఇట్లు పొలసుమేపరి. మొ.)
పొలి-తె. 1.లాభము.2.నష్టము.3.బలి.సమా.—కలను-యుద్ధభూమి. —మేర-రెంతుగ్రామములకు నడిమిగుఱుతు, ఎల్ల. క్రి. —వోవు-1. చచ్చు. 2. చెడు. 3. వ్యర్థమగు, 4. భంగపడు. 5. ఉడుగు.
పొలియు-తె. 1. చెడు. 2. చచ్చు.కృ.పొలియిక.
పొలుచు-తె. 1. కనఁబడు, ప్రత్యక్షమగు. రూ. పొడుచు. 2. ఒప్పు. 3.స్థిరమగు.రూ. పొల్చు. కృ. పొలుపు, పొల్పు.
పొలునోరు-తె. 1. పొల్లునోరు. 2.పొరలునోరు.
పొలుపు-తె. 1. ఒప్పు. 2. విధము. 3. స్థిరము. రూ. పొల్పు. క్రి. పొలుపారు-ఒప్పగు.
పొలువ-చూ. పొడువ.
పొల్ల-తె. 1. గింజపట్టని ధాన్యము. 2. వ్యర్థము. రూ. పొల్లు.క్రి. —వడు, —వోవు-1. వ్యర్థమగు. 2. క్షయించు.
పొల్లు-తె. 1. గింజపట్టని ధాన్యము. 2. అచ్చు కలియనిహల్లు. 3. బొంకు.4.వ్యర్థము. సమా. —ఁదనము-అపౌరుషము. క్రి. —వడు-1. [క్షయించు. 2. వ్యర్థమగు.
పొవ-చూ. పొగ.
పొవడ-చూ. పొగడ.
పొవడు-చూ. పొగడు.
పొవయు-చూ. పొగయు.
పొవరు-చూ. పొగరు.
పొవులు-చూ. పొగులు. [చక్కఁబడు. 4. ఒప్పు.
పొసఁగు-తె. 1. అనుకూలించు. 2. లభించు. 3.
పొసఁగుడు-తె. 1. అనుకూల్యము. 2. ప్రాప్తి.
పొసపొస-తె. త్వరితముగా.

## పో

పో-తె. 1. నిశ్చయార్థకము. 2. అనాదరార్థకము.
పోఁక-తె. వక్క. సమా. —గంజి - కాఁచు.

—ముడి-స్త్రీలుకట్టు కొకముడి, నీవి.పోఁకొత్తు-అడకొత్తు, వక్కలు కత్తిరించు కత్తెర.
పోఁకు-తె. మంచుకప్పినగడ్డి. రూ. పోఁపు.
పోఁగు-తె. 1. దారము. 2.బ. చెవినగ. రూ. పోగు.
పోఁగొట్టు-తె. పోకడపెట్టు.
పోఁచ-తె. గడ్డి పరక.
పోఁచి-హిం. మనికట్టుమీఁది చోటు.
పోఁజు-తె. నారలోని నలుసులువాయ సన్నముగా దీయు. రూ. ప్రోఁజు.
పోఁడి-తె.ఒప్పిదము.రూ.పోఁడిమి,పోణి,పోణిమి.
పోఁడిమి-తె. 1. ఒప్పు. 2.సంపద. 3.సౌఖ్యము. 4. విధము. చూ. పోఁడి.
పోఁత-తె. 1. పోయుట. 2. కరఁగిపోయుట.
పోఁపు-చూ. పోఁకు.
పోక-తె. 1. గమనము. 2. నడత. రూ. పోకడ. సమా. పోకలాడి - కపటప్రవర్తనము గలది. (పుం. పోకలాఁడు) క్రి. పోకాడు - నశించు. ప్రే. పోకార్చు.
పోకడ-తె. 1. గమనము. 2. నడత. 3.నాశము. క్రి.—పెట్టు-1.నాశముచేయు. 2.విక్రయించు.
పోకాలు-తె. పోవు. (కోపదుఃఖములం దుపయోగింపఁబడును.)
పోకిరి-తె. దుష్ప్రవర్తనము కలవాఁడు.
పోకు-తె. 1. నడవడి. 2. నష్టి.
పోగర-తె. కమసాలవాని చిత్రించెడు పనిముట్టు.
పోగు-తె. 1. కుప్ప 2. గుంపు. రూ. ప్రోగు.
పోచిప్ల-తె. శకునము చూచుటకై ఇరుగుపొరుగిండ్లమీఁద అక్షతలు నీళ్ల చల్లి ఆయిండ్లవారాడు కొను మాటలు వినుట. రూ. ప్రోచిప్ల.
పోట-తె. పెద్ద. సమాన—కత్తి-పెద్దకత్తి. స. 1. మీసముగల ఆఁడుది. 2. దాసి.
పోటకము-వి. (స్ఫోటకము) ఒడలెల్ల బొబ్బలు లేచువ్యాధి, పెద్దమ్మవారు. రూ. పాటకము.
పోటనబంతి-తె. పుట్టచెండు.
పోటముంజి-తె. పుట్టగోఁచి. [పోఁటుగంబము.
పోటి-హిం. స్పర్ధ. తె. 1. సమానము, మాఱు.2.
పోటు-తె. 1. పొడుచుట. 2. యుద్ధము. 3. పెద్ద అల. 4.శౌర్యము.సమా. —ఁగంబము-ఆనికగా నిలిపినకఱ్ఱ. —ఁగలుపు - రెండవసారి తీయు కలుపు. —కాఁడు-బంటు,శూరుఁడు. (ఇట్లు పోటుమగఁడు,—మానిసి. మొ.) —ముట్టు-యుద్ధసాధనము. క్రి. పోటులాడు-యుద్ధముచేయు. రూ. పోటాడు. కృ. పోట్లాట.పోటొగ్గు-పోటొడ్డు-యుద్ధప్రయత్నముచేయు.
పోట్లలి-స. పొట్లము. [—మిట్ట-పోసినమిట్ట.
పోడు-తె.1.చిరు వేరు పైరగునేల.2.పోఁత. సమా.
పోణి-చూ. పోఁడి.
పోణిమి-చూ. పోఁడిమి. [ఓడ. 4. వస్త్రము.
పోతము-స. 1. పిల్ల. 2. పదేండ్లయేనుఁగు. 3.
పోతరము-స. క్రొవ్వు, మదము. క్రి. పోతరించు.
పోతు-తె. 1. తాచ్ఛీల్యమందువచ్చు ప్రత్యయము. (త్రాగుఁబోతు, మొ.) 2. పశుపక్ష్యాదులలో పురుషజాతి. 3. దున్న. 4. ఎద్దు. సమా. —కరడు-పెద్ద అల. (చిన్న అల పెంటికరడు.) —రౌతు-యముఁడు. [మొన.
పోత్రము-స. 1. పందిమూతి. 2. నాఁగటిదుంప
పోత్రి-స. పంది. (వ్యు. పోత్రము కలది)
పోది-చూ. ప్రోది.
పోని-తె. పోలిన.
పోయు-తె. 1. పుట్టు. 2. (జలాదికము) విడుచు. 3. (నాఱు) విడుచు. 4. తగుల్చు. 5. (బాణము) సంధించు. [బాలిక.)
పోఁఱఁడు-తె. బాలుఁడు. రూ. పోఱగాఁడు.(పోఱి-
పోరచి-తె. 1. కానుక. 2. వ్యర్థము. 3. నిస్సారము. [పోఁటి.
పోరితము-తె. 1. కలహము. 2. యుద్ధము. 3.
పోరు-తె. 1. కలహించు 2. యుద్ధముచేయు. 3. ఉపద్రవముచేయు. కృ. 4. కలహము. 5.యుద్ధము. 6. ఉపద్రవము. సమా. —దిండి-కలహాశనుఁడు, నారదుఁడు. క్రి. పోరాడు-1. కలహించు. 2. యుద్ధముచేయు. 3. మల్లాడు.కృ. పోరాట, పోరాటము. పోరుపెట్టు-బిడ్డ ఉడుగక
పోరువ-తె. 1. సెల్లా. 2. పొర. [యేడ్చు.
పోలఁడు-తె. భరద్వాజపక్షి. రూ. పోలిగాఁడు.
పోలానిగంటలు-తె. ఏనుఁగు మెడనుగట్టు గంటలు.
పోలిక-తె. సామ్యము. రూ. పోలికి, పోల్కి.

పోలు-తె. 1. ఒప్పు. 2. యుక్తమగు. 3. శక్యమగు. 4. సామ్యమగు. కృ. పోలిక. సమా. —గట్టి. బండినొగమీఁది తొట్టికి ఈవలావల నమర్చు కట్టి. —పొందు-వృత్తాంతము.

పోలె-తె. వలె.

పోవు-తె. 1. అరుగు. 2. చచ్చు. 3. ఆరంభించు. 4. కడచు. 5. చెడు. కృ. పోక, పోకడ, పోకు, పోబడి, పోవడి. సమా. పోరాని-అప్తమైన. పోరామి-1. స్నేహము. 2. సంకటము. పోబడి-జాడ. రూ. పోవడి. క్రి. పోఁగొట్టు-పోకడవెట్టు. పోకాడు-పోవు, నశించు. ప్రే. పోకార్చు. పోనాడు-1. పోఁగొట్టు. 2. నిందించు. పోపడు-పోవు. పోవుదెంచు-పోవు.

పోషకుఁడు-స. కాపాడువాఁడు. రూ. పోష్ట.

పోషణము-స. కాపాడుట. క్రి. పోషించు.

పోష్యము-స. పోషింపఁదగినది.

పోసనము-స. 1. క్షీరము. 2. పైపూఁత. 3. కాంతి.

పోసరము-తె. పోతరము. క్రి. పోసరించు.

పోస్తకాయ-తె. గసగసకాయపైబెరడు.

పోహణ-వి. (ప్రోహము) 1. కూర్పు. 2. నేర్పు. క్రి. పోహణించు-కూర్చు.

పోళీ-వి. (పోలీ) ఒబ్బట్లు.

## పౌ

పౌఁజు-హిం. 1. బారు. 2. దండు.

పౌగండుఁడు-స. బాలుఁడు. [నది.)

పౌత్తికము-స. నేతిచాయగలతేనె. (పుత్తికలుపెట్టు

పౌత్రి-స. మనుమరాలు. (1. కొడుకుకూఁతురు. 2. కూఁతుకూఁతురు.)

పౌత్రుడు-స. మనుమఁడు, కొడుకుకొడుకు.

పౌనఃపున్యము-స. మరలమరల చెప్పుట.

పౌరస్త్యము-స. 1. మొదటిది. 2. మొదటిదిక్కుది.

పౌరాణికుఁడు-స. పురాణము చెప్పువాఁడు.

పౌరుషము-స. 1. పురుషభావము. 2. పురుషప్రయత్నము. 3. పురుషవ్యాపారము. 4. పరాక్రమము, 5. పురుషునిచేయెత్తు పొడుగు, నిలువు.

పౌరుషేయము-స. పురుషుఁడు చేసినపని.

పౌరోహిత్యము-స. పురోహితుని కార్యము.

పౌర్ణమాసి-స. పున్నమ. రూ. పౌర్ణిమ, పూర్ణిమ.

పౌలస్త్యుఁడు-స. (పులస్త్యుని వంశమువాఁడు) 1. కుబేరుఁడు. 2. రావణుఁడు.

పౌలు-చూ. పగులు. [కుబేరుఁడు. 2. రావణుఁడు.

పౌలోమి-స. శచీదేవి. (వ్యు. పులోమునికూఁతురు.)

పౌషము-స. పుష్యనక్షత్రముతోఁగూడిన పున్నమ. పుష్యమాసము.

పౌష్పము-స. పుష్పముతోఁ జేయఁబడినది.

పౌళి-స. గుగ్గిళ్లు.

## ప్ర

ప్ర-స. మిక్కిలి అనునర్థముగల ఉపసర్గ. (సమా. ప్రాణము, ప్రోక్తము, ప్రోత్థితము, ప్రోత్సాహము, ప్రోద్దామము, ప్రోద్ధతము, ప్రక్షాళనము. ప్రఖ్యాతి. మొ. అర్థవిశేషముగలవి వేఱుగా వ్రాయఁబడును.)

ప్రంగ-చూ. పంగ.

ప్రకంపనుఁడు-స. మిక్కిలి బలముగలవాయువు.

ప్రకటనము-స. వెల్లడించుట.

ప్రకటము-స. వెల్లడి. క్రి. ప్రకటించు.

ప్రకటితము-స. ప్రకటింపఁబడినది.

ప్రకరణము-స. 1. ప్రస్తావము. 2. గ్రంథభాగము. 3. ఒక తెగరూపకము. [మొ.)

ప్రకరము-స. 1. గుంపు. 2. చెదరినది. (పువ్వు.

ప్రకర్షము-స. మేలు, అతిశయము.

ప్రకాండము-స. 1. చెట్టుబోదె. 2. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠవాచకము.

ప్రకామము-స. ఇచ్ఛవచ్చినట్లు.

ప్రకారము-స. 1. విధము. 2. పోలిక.

ప్రకాశము-స. 1. ఎండ. 2. వెలుఁగు. 3. బయలుపడినది. క్రి. ప్రకాశించు. [గుట్టము.

ప్రకీర్ణకము-స. 1. వింజామరము. 2. విరివి. 3.

ప్రకృతము-స. ఇప్పుడు.

ప్రకృతి-స. 1. ప్రత్యయము చేరకముందటి శబ్దరూపము. 2. పౌరవర్గము. 3. స్వభావము. 4. స్వామ్యాది. (ఇవిఏడు : స్వామి, అమాత్యుఁడు, మిత్రుఁడు, కోశము, రాష్ట్రము, దుర్గము. బలము.) 5. అవ్యక్తము.

ప్రకృష్టము-స. ప్రకర్షముకలది.

ప్రకోపము-స. ముమ్మరము. క్రి. ప్రకోపించు.
ప్రకోష్ఠము-స. 1. తొట్టికట్టు. 2. ముంజేయి.
ప్రక్క-వి. 1. పార్శ్వము.2.పక్షము.రూ.పక్క.
ప్రక్రమము-స. 1. క్రమము. 2. ఉపక్రమము. 3. తరవాయి.
ప్రక్రియ-స. 1. అధికారము. 2. ప్రకరణము. 3. మేలైనకార్యము. 4. శబ్దరూపము కలిగిన విధము.
ప్రక్షిప్తము-స. చేర్పఁబడినది.
ప్రఖరము-స. 1. గుఱ్ఱపు పక్కెర. 2. కంచర గాడిద. 3. మిక్కిలి కఠినమైనది.
ప్రఖ్యాతి-స. మిక్కిలి ప్రసిద్ధి.
ప్రఖ్యుఁడు-స. (ఉత్తరపదమగుచో) తుల్యుఁడు.
ప్రగండము-స. సందిలి.
ప్రగల్భుఁడు-స. ప్రతిభగలవాఁడు.
ప్రగ్గ-చూ. పంగ.
ప్రగ్గము-చూ. పగ్గము.
ప్రగ్రహము-స. 1.చెఱ.2.చెఱఁబడినది.3.త్రాసు త్రాడు. 4. పగ్గము. (వి. పగ్గము.)
ప్రగ్రీవము-స. 1. ఒఱగుదిండు. 2. మెద. రూ. గ్రీవము.
ప్రఘణము-స. 1. తలవాకిలి ప్రక్కనుండు చిన్న గది. రూ. ప్రఘాణము. 2. ఇనుపగుదియ.
ప్రచండము-స. 1. చేరరానిది. 2. మిక్కిలి వేఁడి మిగలది.
ప్రచక్రము-స. పయనమైన సేన.
ప్రచయము-స. సమూహము.
ప్రచారము-స. సంచారము.
ప్రచురము-స. అధికము. క్రి. ప్రచురించు—వెల్లడించు.
ప్రచేతసుఁడు-స. 1.వరుణుఁడు. 2.వాల్మీకితండ్రి. 3. గొప్పమనస్సుగలవాఁడు. రూ.ప్రచేతుఁడు.
ప్రచ్ఛన్నము-స. 1. లోవాకిలి. 2. కప్పఁబడినది.
ప్రజ-స. 1. సంతతి. 2.జనము.(వి.పజ) సమా. ప్రజాపతి-బ్రహ్మ.—వతి-తోఁబుట్టినవానిభార్య.
ప్రజనము-స. చూలు.
ప్రజాత-స. బాలెంత.
ప్రజ్ఞ-స. 1. బుద్ధి.2.సామర్థ్యమును తెలుపుమాట.
ప్రజ్ఞానము-స. 1. బుద్ధి. 2. గుఱుతు.
ప్రజ్ఞుఁడు-స. 1.పండితుఁడు. 2.దొడ్డికాళ్లవాఁడు. రూ. ప్రజ్ఞువు.
ప్రజ్వలనము-స. 1. మండుట. 2. ప్రకాశించుట. క్రి. ప్రజ్వలించు.
ప్రణతి-స. 1. నమ్రత. 2. నమస్కారము.
ప్రణయము-స. 1. ప్రేమము. 2. వినయము. 3. విశ్వాసము. సమా. ప్రణయకోపము-ప్రేమము యొక్క కుటిలప్రచారమువలన నాయికా నాయకులకుఁగలుగు కోపము, పొలయలుక. క్రి. ప్రణయించు-జ్వలింపఁజేయు.
ప్రణయిని-స. ప్రియురాలు.
ప్రణవము-స. ఓంకారము.
ప్రణాదము-స. 1. అనురాగముచేఁగలిగిన ధ్వని. 2. గట్టిమ్రోఁత. 3. చెవుడు.
ప్రణామము-స. నమస్కారము.
ప్రణాళి-స. 1. నీళ్లపోవుదారి. 2. క్రమము. రూ. ప్రణాళిక.
ప్రణిధి-స. వేగులవాఁడు.
ప్రణిపత్తి, ప్రణిపాతము-స. అభివాదనము.
ప్రణితము-స. 1. ఉంచఁబడినది. 2. ధ్యానము చేయఁబడినది. 3. అగ్ని. 2. చేయఁబడినది.
ప్రణీతము-స.1. మంత్రముచే సంస్కరింపఁబడిన
ప్రణుతము-స. మిక్కిలి పొగడఁబడినది.
ప్రణుతి-స. మిక్కిలి పొగడ్త. క్రి. ప్రణుతించు.
ప్రతతి-స. 1. తీఁగ. 2. విరివి. 3. సమూహము.
ప్రతాపము-స. 1. తేజము. 2. వేఁడిమి. క్రి.ప్రతాపించు-ప్రతాపము చూపు.
ప్రతారణము-స. మోసపుచ్చు. క్రి. ప్రతారించు.
ప్రతి-స. 1. సమానము. 2. మాఱు. 3. ఒక్కొక్క, బాగుగా అను అర్థములుగల ఉపసర్గము. సమా. —కర్మము - కైసేఁత. —కారము - మాఱుచేఁత. రూ. ప్రతీకారము. —కూలము-అనుకూలము కానిది. —కృతి - 1. ప్రతిమ. 2. మాఱురూపు. 3. మాఱుచేఁత. —క్రియ - 1. ప్రతికారము. 2. మందు. —గృహీత - దానముపుచ్చుకొనువాఁడు. —గ్రహము - 1. దానముపుచ్చుకొనుట. 2. దానద్రవ్యము. 3. సేనకు వెనుకటిబలము. 4. తమ్మపడిగము. క్రి.ప్రతిగ్రహించు. —ఘటనము-మాటొడ్డుట. క్రి. ప్రతిఘటించు. —చ్ఛాయ-ప్రతిమ. —జ్ఞ- 1. చేసెదనని దృఢముగా చెప్పుట. 2. శపథము. (వి. ప్రతిన) —జ్ఞాతము-అంగీకరింపఁబడినది. —జ్ఞానము-అంగీకారము. —దారణ

ము-యుద్ధము. —దినము-దినదినము. —ధ్వని-మాఱుమ్రోఁత. క్రి.ప్రతిధ్వనించు. —నిధి-మాఱు. —పక్షుఁడు-1.శత్రువు. 2. ప్రతివాది. —పత్తి-1.గౌరవము.2.తెలివి. 3. నేర్పు. 4. ప్రవేశము. 5. ప్రాప్తి. —పత్తు-1. పాడ్యమి. 2. బుద్ధి. —పన్నము-1. అంగీకరింపఁబడినది. 2. తెలియఁబడినది. —పాదనము-1. ఇచ్చుట. 2. కలిగించుట. 3. తెలుపుట. 4.నిరూపించుట. క్రి. ప్రతిపాదించు. —పాలనము-రక్షణము. క్రి. ప్రతిపాలించు. —ఫలనము-మాఱురూపముతోఁచుట. క్రి. ప్రతిఫలించు. —బంధనము-అడ్డగించునది. —బంధము-అడ్డగింత. క్రి. ప్రతిబంధించు. —బింబము-ప్రతిఫలనము. క్రి. ప్రతిబింబించు. —భ-అప్పటప్పటికివికసించుబుద్ధి. —భటుఁడు-శత్రువు. —భువు-పూఁటకాఁపు. —యోగము-పగ. —రోధి-1. ఎదిరించువాఁడు. 2. దొంగ. —లోమము-అవరోహణక్రమముకలది. —వసథము-ఊరు. —వాక్యము-మాఱుమాట. —వాది-వాదికిప్రతిపక్షమువాఁడు. —విధానము-మాఱుచేఁత. —వేశము-ఇరుగుపొరుగిల్లు.—శాసనము-పిలిచిపనిపంచుట. —శీర్షకము-కుదువ. —శ్యాయము-పడిసెము. —శ్రయము-1. గృహము. 2.ప్రాపు. 3. సభ. 4. సత్రము. —శ్రవము-అంగీకారము. —షేధము-అడ్డగింత. క్రి. ప్రతిషేధించు. —ష్టంభము-అడ్డగింత. —ష్ఠ-1.గౌరవము. 2. శాశ్వతముగ నిలుపుట. క్రి.ప్రతిష్ఠించు. —సర్గము-మన్వాదిసృష్టి. —సీర-తెరచీర. —స్పర్ధ-పోటీ. —హతి-అడ్డగింత. —హారి, —హారుఁడు-ద్వారపాలకుఁడు. రూ. ప్రతీహారి. ప్రతీక్షణము-ఎదురుచూచుట. క్రి. ప్రతీక్షించు. ప్రత్యక్షము - ఇంద్రియగోచరమైనది. సమా. ప్రత్యక్షవాది-బౌద్ధుఁడు. ప్రత్యర్థి - 1. ప్రతివాది. 2. శత్రువు. ప్రత్యవసానము-భోజనము. ప్రత్యవాయము-పాపము. ప్రత్యహము-దినదినము. ప్రత్యాఖ్యాతము-కూడదనినిరాకరింపఁబడినది. ప్రత్యావిష్టము—పై.—ప్రత్యాలీఢము-విలుకాఁడుఎడమకాలుముందుకుచాచినిలుచుట. ప్రత్యాశ-అడియాస. ప్రత్యాహారము-ఇంద్రియములను విషయములనుండి మరల్చు. ప్రత్యుత్తరము-మాఱుత్తరము. ప్రత్యుత్థానము-అభ్యుత్థానము-ప్రత్యుద్గమము.—పై—ప్రత్యూషము-ప్రభాతము. ప్రత్యేకము-వేఱువేఱు. క్రి. ప్రత్యేకించు.

ప్రతిన-వి. (ప్రతిజ్ఞ) పంతము. [2. పోలిక.
ప్రతిమ-స. 1. శిలాదులచే నిర్మితమగు రూపము.
ప్రతీకము-స. 1. అవయవము. 2. ప్రతికూలము. 3. అనుకూలము.
ప్రతీకారము-స. ప్రత్యపకారము. 2. చికిత్స.
ప్రతీకాశము-స. (ఉత్తరపదమగుచో) తుల్యము.
ప్రతీచి-స. పడమర.
ప్రతీతము-స. ప్రసిద్ధికెక్కినది.
ప్రతీతి-స. ప్రసిద్ధి.
ప్రతీహారము-స. 1. ద్వారము. 2.పూర్వముచేసిన మేలునెంచి యిప్పుడునాకు మేలుచేయుమనియెంచిచేయుసంధి,
ప.ప్రతీహారి, ప్రతీహారుఁడు-స. ద్వారపాలకుఁడు.
ప్రతోదము-స. ములుకోల.
ప్రతోళి-స. పెద్దవీథి.
ప్రతిత్తి-తె. విత్తులతోనుదూదికొ్రసము.
ప్రత్నము-స. పురాతనము.
ప్రత్యగ్రము-స. 1. నూతనము. 2. పరిశుద్ధము.
ప్రథ-స. ప్రఖ్యాతి.
ప్రథమము-స. 1. మొదటిది. 2. ముఖ్యము.
ప్రథితి-స. ప్రఖ్యాతి.
ప్రదక్షిణము-స. వలగొనుట. క్రి. ప్రదక్షిణించు.
ప్రదరము-స. 1. బాణము. 2.చీలుట. 3.స్త్రీలకుఁగలుగు రక్తస్రావరోగము.
ప్రదర్శనము-స. విశదపఱచిచూపుట. [4. బెత్తిలి.
ప్రదేశము-స. 1. చోటు. 2. దేశము. 3. జొత్తిలి.
ప్రదేశిని-స. జుట్టనవ్రేలు, తర్జని.
ప్రదోషము-స.1.మునిమాపు.2.మిక్కిలి దోషము.
ప్రద్యుమ్నుఁడు-స. మన్మథుఁడు.
ప్రద్యోతనుఁడు-స. సూర్యుఁడు. (వ్యు. చక్కఁగా ప్రకాశించువాఁడు.) [వము.
ప్రద్రవము-స.యుద్ధమునుండి పాఱుట. రూ.ప్రద్రా
ప్రధనము-స. యుద్ధము.

ప్రధానము-స. 1. పరమాత్మ. 2. ప్రకృతి. 3. బుద్ధి. 4. ముఖ్యము.
ప్రధానుఁడు-స. 1. కార్య సహాయుఁడు. 2. మధ్యమాధికారి. 3. ముఖ్యుఁడు.
ప్రధావించు-స. పరుగెత్తు.
ప్రధి-స. నేమి.
ప్రన్న-తె. మనోజ్ఞము.
ప్రప-స. చలిపందిరి.
ప్రపంచము-స. 1. లోకము. 2. సంసారము. 3. విరివి. రూ. ప్రపంచకము. క్రి. ప్రపంచించు-
ప్రపత్తి-స. భక్తులుచేయు శరణాగతి. [విరివిచేయు.
ప్రపదము-స. 1. ముంగాలు. 2. మీఁగాలు.
ప్రపన్నుఁడు-స. ప్రపత్తిచేసినవాఁడు.
ప్రపాతము-స. 1. కొండచఱియ. 2. కునికిపాటు. 3. కొండకాలువ.
ప్రపితామహుఁడు-స.ముత్తాత. (స్త్రీ.ప్రపితామహి.)
ప్రపౌత్రి-స.పౌత్రుని కూఁతురు, మునుమనుమరాలు.
ప్రఫుల్లము-స.వికసించినది.[(పుం.ప్రపౌత్రుఁడు.)
ప్రబంధము-స. కావ్యము.
ప్రబలము-స. మిక్కిలి బలముకలది.
ప్రబలు-వి. 1. అతిశయిల్లు. 2. వర్ధిల్లు.
ప్రబుద్ధుఁడు-స. మేలుకొన్నవాఁడు.
ప్రబోధము-స. 1. మిక్కిలి తెలివి.2.మేలుకోలు.
ప్రబ్బలి-తె.వేతనము.రూ.ప్రబ్బ. [క్రి.ప్రబోధించు.
ప్రబ్బు-తె. 1. వ్యాపించు. 2. వర్తిల్లు. 3. అతిశయించు. 4. వర్ధిల్లు. 5. సించించు. 6. కలయు. 7. కృ. నింద. క్రి. —కొను - ప్రబ్బు. కృ. ప్రబ్బికోలు.
ప్రభ-స. 1. వెలుఁగు. 2. కుబేరునిపట్టణము. 3. సూర్యునిభార్య. 4. దుర్గ.సమా. ప్రభాకరుఁడు-సూర్యుఁడు. [భంజించువాఁడు.)
ప్రభంజనుఁడు-స. వాయువు. (వ్యు. వృక్షాదులను
ప్రభవ-స. అఱువదింట మొదటి సంవత్సరము.
ప్రభవము-స. 1. పుట్టుక. 2. పుట్టుకకుకారణము. 3. తెలివికి మొదటిచోటు. 4. పరాక్రమము.
ప్రభాతము-స. వేకువ.
ప్రభావము-స. 1. తేజము. 2. శక్తి. 3.మహిమ.
ప్రభిన్నము-స. 1. మదపుటేనుఁగు. 2. మిక్కిలి భేదపడినది.
ప్రభువు-స.1.విష్ణువు.2.అధిపుఁడు.3.సమర్థుఁడు.
ప్రభూతము-స. 1. అధికము. 2. ఉన్నతము. 3. సంభూతము.
ప్రభృతి-స. మొదలు.
ప్రమ-స. యథార్థ జ్ఞానము. రూ. ప్రమితి.
ప్రమత్తుఁడు-స. 1.ప్రమాదపడినవాఁడు.2.మిక్కి-
ప్రమథనము-స. చంపుట. [లి మత్తుగొన్నవాఁడు.
ప్రమథుఁడు-స. శివభటుఁడు.
ప్రమద-స. 1. యౌవనాది మదముగల ఆఁడుది. 2. ఆఁడుది. సమా. ప్రమదావనము - అంతఃపురస్త్రీలు విహరించు ఉద్యానవనము.
ప్రమదము-స. 1. సంతోషము. 2. మిక్కిలి మదముగలది. [వాఁడు.
ప్రమనుఁడు-స. సంతోషమునొందిన మనస్సుగల
ప్రమాణము-స. 1. ప్రత్యక్షాది జ్ఞానకారణము.2. కొలఁత. 3. సత్యము. 4. మేర. 5. శాస్త్రము. క్రి. ప్రమాణీకరించు-సత్యముగా నెంచు.
ప్రమాతామహుఁడు-స.మాతామహుని తండ్రి.(స్త్రీ.
ప్రమాదము-స. ఏమఱుపాటు. [ప్రమాతామహి.)
ప్రమాది-స. పదుమూఁడవ సంవత్సరము,
ప్రమాదీచ-స. నలుపదియేడవ సంవత్సరము.
ప్రమిద-తె. దీపమువెలిఁగించు పాత్రము, మృత్కము. రూ. ప్రమ్మిద.
ప్రమీల-స. కునికిపాటు. [ము.
ప్రముఖము-స. 1. జరుగుచున్నకాలము.2.ముఖ్య
ప్రముదితుఁడు-స. సంతోషించినవాఁడు.
ప్రమేయము-స. యథార్థముగా నెఱుఁగఁదగినది.
ప్రమోదము-స. సంతసము. క్రి. ప్రమోదించు.
ప్రమోదూత-స. నాల్గవ సంవత్సరము.
ప్రమ్మిద-చూ. ప్రమిద.
ప్రమ్మ-తె. పరివేష్టించు.
ప్రయతుఁడు-స. పరిశుద్ధుఁడు. [త్నించు.
ప్రయత్నము-స. మిక్కిలి యత్నము. క్రి. ప్రయ
ప్రయాణము-స. బయలుదేఱుట. (వి. పయనము) క్రి. ప్రయాణించు.
ప్రయాతము-స. ప్రయాణమై పోయినది.
ప్రయాసము-స. శ్రమము.'[క్కిలి కూడుకొన్నది.
ప్రయుక్తము-స, 1. ప్రయోగింపఁబడినది. 2. మి

ప్రయుతము-స. దశలక్ష సంఖ్య.
ప్రయోక్త-స. ప్రయోగించువాఁడు.
ప్రయోగము-స. 1. నడపుట. 2. ప్రయత్నము.
3. తార్కాణము. 4. కర్తృకర్మ క్రియలకూడిక. క్రి. ప్రయోగించు. [కార్యము నెఱవేర్చువాఁడు.
ప్రయోజకుఁడు-స. 1. ప్రయోగించువాఁడు. 2.
ప్రయోజనము-స. 1. కార్యము. 2. హేతువు.
ప్రరోహము-స. మొలక.
ప్రలంభము-స. వంచనము.
ప్రలాపము-స. అర్థశూన్యమైనమాట, పలవరము.
క్రి. ప్రలాపించు- [చ్చు.
ప్రలోభనము-స. మృగాదులనుబట్టుటకు పెట్టుమ
ప్రలోభము-స. మిక్కిలి లోభము. క్రి. ప్రలోభించు.
మిక్కిలి ఆసఁగొనఁజేయు.
ప్రల్లదము-తె. 1. పారుష్యము. 2. దుర్భాషణము.
3. దుష్కృత్యము. సమా. ప్రల్లదకాఁడు-దుష్టుఁడు. రూ. ప్రల్లదుఁడు, ప్రల్లదీఁడు. (స్త్రీ. ప్రల్లదురాలు) ప్రల్లఁదనము. (ప్రల్లదము+తనము)
ప్రవక్త-స. చక్కఁగా మాటాడువాఁడు. [ప్రల్లదము.
ప్రవచనము-స. 1. వేదము. 2. గొప్పమాట.
ప్రవచనీయము-స. చక్కఁగా మాటాడఁదగినది.
ప్రవణుఁడు-స. 1. ఆసక్తుఁడు. 2. నమ్రుఁడు. 3.
ప్రవయుఁడు-స. వృద్ధుఁడు. [సమర్థుఁడు.
ప్రవరము-స. 1. పేరు. 2. కులము.
ప్రవరుఁడు-స. శ్రేష్ఠుఁడు.
ప్రవర్తకుఁడు-స. నడపువాఁడు.
ప్రవర్తనము-స. నడత. క్రి. ప్రవర్తించు, ప్రవర్తిల్లు.
ప్రవర్ధిల్లు-స. మిక్కిలి వృద్ధిపొందు. ప్రే. ప్రవర్ధించు.
ప్రవల్హిక-స. గూఢముగా నుంచఁబడిన యర్థముగల కావ్యము.
ప్రవాదము-స. కారణములేకయే వ్యాపించినమాట.
ప్రవారణము-స. 1. ఫలముగోరి చేయు దానము.
ప్రవాసనము-స. వధము. [2. నిషేధము.
ప్రవాసము-స. 1. పరదేశవాసము. 2. పరదేశగమనము. [పర. క్రి. ప్రవహించు-పాఱు.
ప్రవాహము-స. 1. వెల్లువ. 2. ప్రవృత్తి. 3. పరం
ప్రవాళము-స. 1. పగడము. 2. వీణాదండము.
ప్రవిదారణము-స. యుద్ధము. [3. చిగురు.

ప్రవిష్టుఁడు-స. ప్రవేశించినవాఁడు.
ప్రవీణుఁడు-స. నిపుణుఁడు. [రువు. 4. వృత్తాంతము.
ప్రవృత్తి-స. 1. నడక. 2. ప్రవేశము. 3. బ్రదుకుఁదె
ప్రవృత్తుఁడు-స. ప్రవర్తించినవాఁడు.
ప్రవృద్ధము-స. పెరిఁగినది.
ప్రవేశము-స. చొచ్చుట, చొరవ. క్రి. ప్రవేశించు.
ప్రవ్రజితుఁడు-స. సన్న్యాసి.
ప్రవ్రజ్య-స. 1. సన్న్యాసాశ్రమము. 2. పర్యటనము.
ప్రవ్వ-తె. కుండ.
ప్రశంస-స. పొగడిక. క్రి. ప్రశంసించు.
ప్రశస్తము-స. ప్రసిద్ధికెక్కినది.
ప్రశస్తి-స. ప్రసిద్ధి.
ప్రశాంతి-స. మిక్కిలిశాంతి.
ప్రశాంతుఁడు-స. మిక్కిలిశాంతినొందినవాఁడు.
ప్రశ్న-స. అడుగుట. రూ. ప్రశ్నము.
ప్రశ్రయము-స. అనునయము.
ప్రశ్రితుఁడు-స. వినీతుఁడు.
ప్రష్ట-స. అడుగువాఁడు.
ప్రష్ఠుఁడు-స. అగ్రేసరుఁడు.
ప్రసంగము-స. 1. విషయవిస్తరము. 2. ప్రస్తావము. 3. సంభాషణము. క్రి. ప్రసంగించు.
ప్రసక్తి-స. ప్రస్తావము.
ప్రసన్నము-స. 1. నిర్మలము. 2. సంతుష్టము.
ప్రసభము-స. బలాత్కారము.
ప్రసరణము-స. అంతటవ్యాపించుట. క్రి. ప్రసరించు.
ప్రసవము-స. 1. కానుపు. 2. పువ్వు. 3. పండు.
4. పుట్టుక. 5. బిడ్డ. క్రి. ప్రసవించు-బిడ్డసుకను.
ప్రసాదనము-స. 1. తేర్చుట. 2. బహుమానము.
3. అన్నము.
ప్రసాదము-స. 1. ప్రసన్నత. 2. అనుగ్రహము.
3. భగవంతునికి నివేదించిన అన్నము. మొ.
క్రి. ప్రసాదించు-అనుగ్రహించియిచ్చు.
ప్రసాధనము-స. వస్త్రాద్యలంకరణము.
ప్రసాధని-స. దువ్వెన.
ప్రసారణము-స. 1. చాఁచుట. 2. తిగుచుట.
ప్రసారము-స. వ్యాపనము. [పఁబడినది.
ప్రసిద్ధము-స. 1. ప్రసిద్ధికెక్కినది. 2. అలంకరిం
ప్రసిద్ధి-స. 1. ఖ్యాతి. 2. అలంకారము.

ప్రసువు-స. తల్లి.
ప్రసూత-స. బాలెంతరాలు. రూ. ప్రసూతిక.
ప్రసూతము-స. 1. పువ్వు. 2. పుట్టినది.
ప్రసూతి-స. 1. కానుపు. 2. పుట్టుక. 3. బిడ్డ.
ప్రసూతిక-స. ప్రసూత.
ప్రసూనము-స. 1. పూవు. 2. ఫలము.
ప్రసృత-స. కాలిపిక్క.
ప్రసృతము-స. 1. చేర. 2. కొనసాగ పెరిఁగినది. 3. తీర్పఁబడినది.
ప్రసృతి-స. 1. చేర. 2. పుడిసిలి.
ప్రసేకము-స. చల్లుట.
ప్రసేవకము-స. వీణకరివె.
ప్రసేవము-స. 1. ఎండుపుఁదట్ట. 2. వీణకరివె.
ప్రస్తరము-స. 1. ఱాయి. 2. రత్నము. 3. చిగుళ్లమున్నగువానిచే ఏర్పఱచిన సెజ్జ.
ప్రస్తవము-స. విషయము.
ప్రస్తారము-స. సంగీత,ఛందశ్శాస్త్రములందలి స్వరముల గురులఘువుల గుణకారము. క్రి. ప్రస్తరించు-విస్తరించు.
ప్రస్తానము-స. 1. అవసరము. 2. చెప్పుట. క్రి. ప్రస్తావించు.
ప్రస్తుతము-స. 1. మిక్కిలిస్తుతింపఁబడినది. 2. చెప్పఁబడినది. 3. ప్రయత్నముచేయఁబడినది. 4. ఇప్పుడు. 5. ఉపమేయము.
ప్రస్తుతి-స. మిక్కిలిస్తోత్రము. క్రి. ప్రస్తుతించు.
ప్రస్థము-స. 1. తూములోనగువానికొలత. 2. తూము, నాలుగుమానికలు. 3. కొండనెత్తము.
ప్రస్థానము-స. ప్రయాణము.
ప్రస్థితము-స. ప్రయాతము.
ప్రస్ఫోటనము-స. 1. చేట. 2. ప్రకాశనము. 3. దెబ్బ.
ప్రస్రవణము-స. 1. సెలయూట. 2. చెమట.
ప్రస్రావము-స. మూత్రము.
ప్రహతము-స. 1. కొట్టఁబడినది. 2. విస్తరింపఁబడినది.
ప్రహరణము-స. ఆయుధము.
ప్రహరము-స. 1. జాము. 2. దెబ్బ. క్రి. ప్రహరించు-కొట్టు.
ప్రహరి-వి. ప్రాకారము. రూ. పారి.
ప్రహసనము-స. 1. ఒకరూపకము. 2. పెద్దనవ్వు. 3. పరిహాసము. క్రి. ప్రహసించు.
ప్రహసితము-స. శిరఃకంపముతోఁగూడిననవ్వు.
ప్రహస్తము-స. చప్పట.
ప్రహారకుఁడు-స. ప్రహరించువాఁడు. రూ. ప్రహారి.
ప్రహారము-స. దెబ్బ. రూ. ప్రహరము.
ప్రహితము-స. వింటినుండి విడువఁబడినది. (బాణము.)
ప్రహితుఁడు-స. వ్యుత్పన్నుఁడు.
ప్రహేళిక-స. ప్రవల్లిక.
ప్రహ్లన్నుఁడు-స. సంతసించినవాఁడు.
ప్రహ్లాదము-స. సంతోషము. రూ. ప్రహ్లత్తి.
ప్రహ్వము-స. 1. నమ్రము. 2. ఆసక్తము.
ప్రళయము-స. 1. కల్పాంతము. 2. అపాయము. 3. మృత్యువు. 4. మూర్ఛ.

## ప్రా

ప్రాంగణము-స. ముంగిలి.
ప్రాంతము-స. 1. తీరము. 2. సమీపము.
ప్రాంతరము-స. 1. అడవి. 2. త్రోవ. 3. ఎడారి. 4. పొలిమేర.
ప్రాంశువు-స. పొడుగైనది.
ప్రాఁకు-తె. 1. ఎక్కు. 2. ఱొమ్ముతోజరగు.కృ. 3. తీఁగ. 4. పాఁచి.
ప్రాఁకుడు-తె. 1. ప్రాకుట. 2. పాఁచి. రూ. పాఁకుడు.
ప్రాఁకులాడు-తె. ప్రాఁకియెక్కు.
ప్రాఁకొను-తె. పాఁచిపట్టు.
ప్రాఁచి-చూ. పాఁచి.
ప్రాఁత-వి. (పురాతనము) 1. భృత్యుఁడు. 2. వస్త్రము. 3. జీర్ణవస్త్రము. 4. బహుకాలమునాఁటిది. 5. పూర్వము. 6. జీర్ణము. రూ. పాఁత. సమా. ప్రాఁగబ్బము, —ఁజదువులు, —ఁబలుకులు, —మినుకులు-వేదము. —యేఱు-సంద్రము. —వేలువు-అసురుఁడు. క్రి. ప్రాఁతగిలు-ప్రాఁతదియగు. —పడు—పై.—ప్రాఁబడు-1. ప్రాఁతగిలు. 2. అలవడు.
ప్రాక-చూ. పాక.
ప్రాకటము-స. ప్రసిద్ధము. రూ. ప్రకటము.
ప్రాకారము-స. గుడిమున్నగువానిచుట్టుగోడ, ప్రహరి.
ప్రాకృతము-స. సంస్కృతము రాకమునుపటిభాష.
ప్రాకృతుఁడు-స. పామరుఁడు.
ప్రాకెన-చూ. పాకెన.
ప్రాక్తనము-స. పురాతనము.

ప్రాగల్భ్యము-స. 1. ప్రగల్భత్వము. 2. స్త్రీలఅయ త్నజమగు శృంగారచేష్ట. [శిఖరము.
ప్రాగ్భారము-స. 1. అతిశయము. 2. (పర్వత)
ప్రాగ్రసరుఁడు-స. ముందునడచువాఁడు. [ము.
ప్రాగ్రహరము-స. ముందునడచునది. రూ. ప్రాగ్ర్య
ప్రాచి-స. తూర్పు.
ప్రాచితము-చూ. పాచితము.
ప్రాచీనబర్హి-స. ఇంద్రుఁడు. (వ్యు. తూర్పువెలుఁగు.)
ప్రాచీనము-స. 1. కంపకోట. (రూ. ప్రాచీరము) 2. ప్రాచీదిశయందుఁగలిగినది. 3. పూర్వకాల
ప్రాచుర్యము-స. ప్రచురత్వము. [మునఁగలిగినది.
ప్రాచేతసుఁడు-స. వాల్మీకి. (వ్యు. ప్రచేతసుని కొడు
ప్రాచ్యము-స. తూర్పుదిక్కునందలిది. [కు.)
ప్రాజనము-స. మునికోల.
ప్రాజ్ఞ-స. 1. మంచిబుద్ధిగల ఆఁడుది. 2. బుద్ధి.
ప్రాజ్ఞి-స. 1. లౌకిక వ్యవహారమందు తెలివిగల ఆఁడుది. 2. పండితుని భార్య.
ప్రాజ్ఞుఁడు-స. 1. పండితుఁడు. 2. సమర్థుఁడు.
ప్రాజ్యము-స. అధికము.
ప్రాడ్వివాకుఁడు-స. తగవరి, న్యాయముతీర్చువాఁడు.
ప్రాణగొడ్డము-వి. (ప్రాణకుట్టకము) ప్రాణహింసకము.
ప్రాణము-స. (ప్ర+అనము) 1. గాలి. 2. హృదయమందలిగాలి. 3. బ. ఉసురు. సమా. ప్రాణనాథుఁడు-1. ప్రియుఁడు. 2. యముఁడు. (ఇట్లు ప్రాణేశుఁడు. మొ.) ప్రాణాచారము-ప్రాయోపవేశము. ప్రాణాయామము - మంత్ర పూర్వకముగా శ్వాసము నిరోధించుట.
ప్రాణి-స. ప్రాణముగల జంతువు. సమా. —ద్యూతము-కోడి పొటేలు లోనగువాని పందెము.
ప్రాతికూల్యము-స. ప్రతికూలభావము.
ప్రాతిపదికము-స. ప్రత్యయము చేరకముందున్న
ప్రాథమికుఁడు-స. ప్రథముఁడు. [శబ్దరూపము.
ప్రాథేయపడు-స. బతిమాలు.
ప్రాదుర్భావము-స. పుట్టుక. క్రి. ప్రాదుర్భవించు.
ప్రాదుర్భూతము-స. పుట్టినది.
ప్రాదేశము-స. జుత్తిలి.
ప్రాధాన్యము-స. ప్రధానత్వము.

ప్రాపకుఁడు-స. ప్రాపించువాఁడు.
ప్రాపణము-స. పొందుట. క్రి. ప్రాపించు.
ప్రాపు-వి. (ప్రాపణము) ఆశ్రయము.
ప్రాప్తము-స. పొందఁబడినది. 2. కూడుకొన్నది.
ప్రాప్తి-స. 1. లాభము. 2. పొందు. 3. శుభోదయము. క్రి. ప్రాప్తించు-1. కలుగు. 2. లాభించు.
ప్రాప్యము-స. పొందఁదగినది.
ప్రాబల్యము-స. ప్రబలత్వము. బలిష్ఠత.
ప్రాభవము-స. ప్రభుత్వము.
ప్రాభృతము-స. కానుక.
ప్రామాణికుఁడు-స. 1. మేరమీఱనివాఁడు. 2. సత్యము తప్పనివాఁడు. 3. శాస్త్రము నెఱిఁగినవాఁడు.
ప్రామాణ్యము-స. 1. దృష్టాంతము. 2. సాక్ష్యము.
ప్రామిడి-తె. 1. క్రౌర్యము. 2. క్రూరుఁడు.
ప్రాము-తె. 1. రాచు. 2. పూయు. 3. మూయు. 4. తుడుచు. 5. పులుము. 6. పీడించు. 7.
ప్రాముడు-తె. పులుముడు, మార్జనము. [ఖండించు.
ప్రాయము-స. 1. వయస్సు. 2. చావు. 3. బాహుళ్యము. 4. (ఉత్తరపదమైనచో) సమానము. 5. మరణార్థము సర్వకర్మపరిత్యాగ పూర్వకమైన ఉపవాసము, ప్రాయోపవేశము. [ము.
ప్రాయశ్చిత్తము-స. పాపపరిహారముకై చేయుకర్మ
ప్రాయి-తె. 1. పౌరుషము. 2. భాగ్యము. 3. సుమంగలీత్వము. 4. బియ్యము. సమా. ప్రాయిఁడి - 1. పౌరుషహీనుఁడు. 2. భాగ్యహీనుఁడు.
ప్రాయికము-స. సామాన్యము, తఱచు.
ప్రారంభము-స. ప్రయత్నము. క్రి. ప్రారంభించు.
ప్రారబ్ధము-స. 1. జన్మముగలిగించు పూర్వకర్మము. 2. ఆరంభింపఁబడినది. [నము. క్రి. ప్రార్థించు.
ప్రార్థన-స. 1. అడుగుట. 2. వేఁడుట. రూ. ప్రార్థ
ప్రార్థనీయము-స. 1. అడుగఁదగినది. 2. వేఁడఁదగినది.
ప్రార్థితము-స. 1. అడుగఁబడినది. 2. వేఁడఁబడినది.
ప్రాలంబము-స. మెడనుండి తొమ్మునవ్రేలు పూసరము. మొ. [బ్రాలు.
ప్రాలు-తె. బ. 1. బియ్యము. (క. ప్రాలు) 2. తలఁ
ప్రాలుమాలు-తె. సోమరితనము పొందు. రూ. పాలుమాలు. కృ. ప్రాలుమాలిక, పాలుమాలిక.

ప్రాలేయము-స. మంచు.
ప్రావ-తె. 1. పద్ధతి. 2. యుక్తము. 4. దోషము.
ప్రావరణము-స. 1. ఉత్తరీయము. 2. ముసుఁగు.
ప్రావారము-స. 1. ఉత్తరీయము. 2. కంబళి.
ప్రావీణ్యము-స. నేర్పు.
ప్రావు-చూ. పరవు.
ప్రావృట్టు-స. వర్షఋతువు. రూ. ప్రావృష.
ప్రావృతము-స. కప్పుకొనఁబడినది.
ప్రాశనము-స. కుడుపు. క్రి. ప్రాశించు-1. భుజించు. [2. త్రాగు.
ప్రాశస్త్యము-స. ప్రశస్తత్వము.
ప్రాశితము-స. 1. భుజింపఁబడినది. 2. త్రాగఁబడినది.
ప్రాశ్నికుఁడు-స. 1. సభ్యుఁడు. 2. ప్రశ్న చేయువాఁ[డు.
ప్రాసంగము-స. కాఁడికిముందటి కాఁడి.
ప్రాసము-స. 1. పద్యపాదమున రెండవ యక్షరము. 2. ఈఁటె. సమా. ప్రాసికుఁడు-ఈఁటెకాఁడు.
ప్రాసాదము-స. 1. దేవాలయము. 2. నగరు.
ప్రాహ్ణము-స. ఉదయమునుండి పదిగడియల కాలము, లేఁబగలు.

## ప్రి

ప్రిదులు-వి. (భేదిల్లు) 1. విరియు. 2. సడలు. 3. తగ్గు. 4. ఊడు. 5. జాఱు. 6. తొలఁగు.
ప్రియ-స. ప్రియురాలు. [ప్రేంకణపుచెట్టు.
ప్రియంగువు-స. 1. కొఱ్ఱలు. 2. నల్లావలు. 3.
ప్రియము-స. 1. స్నేహము. 2. సంతోషము. 3. ఇష్టము. 4. హెచ్చువెల. సమా. ప్రియంవదుఁడు-ఇచ్చకమాడువాఁడు. ప్రియవాది.—పైఁ—క-1. వివాహాది ప్రయుక్తమంగళవాద్యము. 2. వాద్య ధ్వని.
ప్రియాళువు-స. మోరటిచెట్టు. రూ. ప్రియాలము.
ప్రియుఁడు-స. ప్రాణనాథుఁడు. (స్త్రీ. ప్రియ.)

## ప్రీ

ప్రీణనము-స. తృప్తిఁబుట్టించుట.
ప్రీతి-స. 1. సంతోషము. 2. స్నేహము. సమా. —దత్తము-అత్తమామలచేనియ్యఁబడినస్త్రీధనము.
ప్రీతుఁడు-స. ముదితుఁడు, ప్రీతిఁబొందినవాఁడు.

## ప్రు

ప్రుంగుడు-తె. తెల్లకుష్ఠము. [ప్రుప్పి.
ప్రుచ్చు-తె. పుప్పిపట్టు. రూ. పుచ్చు. కృ.
ప్రువ్వు-చూ. పురుగు.

## ప్రె

ప్రెక్కఁణము-చూ. పెక్కఁణము.
ప్రెగడ-తె. (పేరు+కడ) 1. మంత్రి. 2. ప్రధానపురుషుఁడు. 3. యువరాజు. రూ. పెగడ, ప్రెగ్గడ, ప్రెవడ.
ప్రెబ్బొత్తి-తె. (పేరు+బొత్తి) నిశ్చయముగా.

## ప్రే

ప్రేంకణము-వి. (ప్రియంగువు.) ప్రియాళువృక్షము. రూ. ప్రేంకణము, ప్రేంకనము.
ప్రేంఖ-స. 1. దోల. 2. పర్యటనము. 3. నృత్యము. 4. అశ్వగతి.
ప్రేంఖణము-స. 1. పర్యటనము. 2. ఊఁగుట. 3. ఒక పాత్రముగల రూపకము.
ప్రేంఖితము-స. ఊఁగింపఁబడినది.
ప్రేఁపుఁడు-స. అధికుఁడు. [చుట.
ప్రేక్ష-స. 1. బుద్ధి. 2. చూపు. 3. నృత్యముచూ
ప్రేక్షణము-స. 1. చూపు. 2. కన్ను. 3. నృత్యము చూచుట.
ప్రేక్షణికుఁడు-స. 1 ప్రేక్షకుఁడు. 2. చూచువాఁడు. రూ. ప్రేక్షణీకుఁడు.
ప్రేక్షణీయము-స. చూడఁదగినది.
ప్రేగు-చూ. పేగు.
ప్రేచు-చూ. ప్రేరేచు.
ప్రేతము-స. 1. నరకమందుండుప్రాణి. 2. ఒకతెగభూతము. 3. పీనుఁగు. రూ. పరేతము. సమా. ప్రేతపురము-యమపురము. —రాజు-యముఁడు. —వనము-శ్మశానము, ఒలికిమిట్ట.
ప్రేపు-తె. 1. వేకువ. 2. ఆధిక్యము.
ప్రేమ-స. 1. సంతోషము. 2. స్నేహము. రూ. ప్రేమము. క్రి. ప్రేమించు.
ప్రేము-తె. వేత్రము, బెత్తము. రూ. పేము.

ప్రేముడి-వి. (ప్రేమ) స్నేహము. క్రి. ప్రేముడించు. 1.ప్రియపడు.2.(ప్రియము+డించు) శోకించు. 3. బాధపడు.
ప్రేయసి-స. ప్రియురాలు. (పుం. ప్రేయసుఁడు.)
ప్రేరకుఁడు-స. ప్రేరణముచేయువాఁడు.
ప్రేరణము-స. తాఁజేయక యితరులఁ జేయుమని యుద్బోధించుట. రూ. ప్రేరణ. క్రి. ప్రేరించు.
ప్రేరణి-స. ఒకతెగ నృత్యము.
ప్రేరితము-స. ప్రేరింపఁబడినది.
ప్రేరేఁచు-తె. ప్రేరించు. రూ. పెరరేఁచు, పెరరేఁపు, ప్రేరేఁపించు, ప్రేరేఁపు.
ప్రేరేఁపణ-తె. ప్రేరణము.
ప్రేలలు-చూ. పేలలు. రూ. ప్రేలాలు.
ప్రేలిక-చూ. పేలిక.
ప్రేలు-తె. 1. వదరు. 2.వేఁగు. 3.వేగియుబుకు. కృ. ప్రేలాలు, ప్రేలుడు. సమా.ప్రేలరి-వదరుఁబోతు. [రూ. ప్రేలడము.
ప్రేలుడు-తె. 1. వదరుట. 2. వేఁగియుబుకుట.
ప్రేవు-చూ. పేగు.
ప్రేషకుఁడు-స. పంపువాఁడు.
ప్రేషణము-స. పంపుట.
ప్రేషితుఁడు-స. పంపఁబడినవాఁడు.
ప్రేష్ఠము-స. మిక్కిలి ప్రియమైనది.
ప్రేష్యుఁడు-స.1.భృత్యుఁడు.2.పంపఁదగినవాఁడు.
ప్రైషము-స. 1. ప్రేషణము. 2. మర్దనము. 3. క్లేశము. 4. ఉన్మాదము.

## ప్రొ

ప్రొద్దు-తె.1.సూర్యుఁడు.2.కాలము.3.దినము.3.పూఁట.5.వేకువ.6.బ. ప్రసవదినములు. సమా. —ఁగల్లు-సూర్యకాంతశిల. —ఁగొడుకు-1. యముఁడు. 2. శనైశ్చరుఁడు. 3.కర్ణుఁడు. 4. సుగ్రీవుఁడు. (ఇట్లు—పట్టి.—చూలి. మొ.) —రిక్క-ఉత్తరఫల్గుని. —నెల-ఫల్గునమాసము. ప్రొద్దులనెల-ప్రసవమాసము.
ప్రొయి, ప్రొయ్యి-చూ. పొయి.

## ప్రో

ప్రోఁగు-చూ. పోఁగు.
ప్రోఁజు-చూ. పోఁజు.
ప్రోక-తె. రాశి. రూ. ప్రోగు, పోగు, ప్రోవు.
ప్రోక్షణము-స. 1. నీళ్ల చిలుకరించుట. 2. (యజ్ఞమందు) పశువునువధించుట. క్రి. ప్రోక్షించు.
ప్రోగు-చూ. ప్రోక.
ప్రోచిళ్ల-చూ. పోచిళ్ల.
ప్రోచు-తె. అన్నపానాదులిడిపోషించు.కృ. ప్రోపు. సమా. ప్రోచికోలు-1. ఎత్తుపడినపశ్వాదుల కాఁపాడి యనుభవించుకొనుట.
ప్రోడ-వి. (ప్రౌఢుఁడు) 1. ప్రగల్భుఁడు, ప్రగల్భ. 2. నిపుణుఁడు. నిపుణురాలు. 3. వివేకి. రూ. ప్రోడఁడు.
ప్రోతము-స. 1. వస్త్రము. 2. కుట్టఁబడినది.
ప్రోథము-స. 1.గుఱ్ఱపుముక్కు.2.గర్భపిండము. 3. పిఱుఁదు. 4. ప్రసిద్ధికెక్కినది.
ప్రోది-తె. 1. పోషణము. 2.వైభవము.3.గోము. రూ. పోది.క్రి.ప్రోదిగొను,—చేయు-పోషించు.
ప్రోపు-తె. పోషణము. సమా. ప్రోపరి. 1. పోషకుఁడు, 2. రక్షకుఁడు. క్రి. ప్రోపడు. పోషింపఁబడు. [ఇల్లాలు.
ప్రోలు-తె. పట్టణము, పురము. సమా.ప్రోయాలు-
ప్రోవు-చూ. ప్రోక. క్రి. —కొను-రాశివడు.
ప్రోషము-స. కాల్చుట. రూ. ప్లోషము.
ప్రోషితుఁడు-స. దేశాంతరగతుఁడు. సమా. ప్రోషితభర్తృక-ప్రియుఁడు దేశాంతరగతుఁడుకాఁగా ఖేదము నొందియుండు నాయిక.
ప్రోహము-స. 1. కూర్పు. 2. నేర్పు.

## ప్రౌ

ప్రౌఢ-స. పదునెనిమిదికి పైఁబడిన వయస్సుగలిగి సంపూర్ణయౌవనము గలది.
ప్రౌఢి-స. నేర్పు. రూ. ప్రౌఢిమము.
ప్రౌఢుఁడు-స. 1. ప్రగల్భుఁడు. నిపుణుఁడు. (వి. ప్రోడ) [పద.
ప్రౌష్ఠపద-స. పూర్వాభాద్రానక్షత్రము. రూ. ప్రోష్ఠపద.

ప్రౌష్ఠపదము-స. భాద్రపదమాసము. రూ. ప్రోష్ఠపదము.

## ప్ల

ప్లక్షము-స. 1. జువ్విచెట్టు. 2. రావిచెట్టు. 3. ఒక ద్వీపము.
ప్లవ-స. ముప్పదియైదవ సంవత్సరము.
ప్లవము-స. 1. తెప్ప. 2. కప్ప. 3. కోఁతి.
ప్లవంగ-స. నలువదియొకటవ సంవత్సరము.
ప్లవంగము-స. 1. కోఁతి. 2. కప్ప. రూ. ప్లవము, ప్లవంగమము, ప్లవగము. (వ్యు. దాఁటుచుఁబోవునది.)

## ప్లి

ప్లీహము-స. హృదయమున ఎడమప్రక్కనుండు మాంసగోళము.
ప్లుతము-స. 1. వేగమున అంతమేరయు సమముగాఁబోవు అశ్వగతి, నిబ్బరము. 2. మూఁడు మాత్రల కాలముగల స్వరము.
ప్లుష్టము-స. కాల్పఁబడినది.
ప్లోషము-చూ. ప్రోషము.

## ఫ

ఫకీరు-హిం. మహమ్మదీయులలో బైరాగి.
ఫక్కి-స. రీతి.
ఫణ-స. పాముపడగ. రూ. ఫణము.
ఫణి-స. పాము, పడగదారి.
ఫణితము-స. 1. వాక్కు. 2. చెప్పఁబడినది.
ఫణితి-స. వాక్కు.
ఫర్వా-హిం. లక్ష్యము.
ఫలకము-స. 1. పలక. 2. కేడెము.
ఫలము-స. 1. పండు. 2. పంట. 3. ప్రయోజనము. 4. లాభము. క్రి. ఫలించు - 1. పండు. 2. నెఱవేఱు.
ఫలితము-స. 1. వృక్షము. 2. ఫలించినది.
ఫలినము-స. పండ్లుగలది. రూ. ఫలి, ఫలిని.
ఫల్గునుఁడు-స. అర్జునుఁడు. (వ్యు. ఫల్గునీ నక్షత్రమునఁ బుట్టినవాఁడు.)
ఫల్గువు-స. సారములేనిది.
ఫసలీ-హిం. పంటకు సంబంధించిన సంవత్సరము.
ఫాణితము-స. కండ చక్కెర. [పంట.
ఫాలము-స. 1. నెత్తి. 2. నాఁగటికఱ్ఱు. సమా. ఫాలనేత్రుఁడు-శివుఁడు. [కము.
ఫాల్గునము-స. పండ్రెండవ మాసము. రూ. ఫాల్గుని
ఫిర్కా-హిం. తాలుకాలో ఒక భాగము.
ఫిర్యాది-హిం. వాది.
ఫిర్యాదు-హిం. విన్నపము.
ఫుల్లము-స. వికసించినది.
ఫూత్కారము-స. పాము బుసకొట్టుట.
ఫేనము-స. సముద్రపు నురుగు.
ఫేనిలము-స. 1. కుంకుడుకాయ. 2. నురుగుగలది.
ఫేరవము-స. నక్క. రూ. ఫేరువు. (వ్యు. ఫేయవి
ఫేల-స. ఎంగిలి. [యఱచునది.)

## బ

బంక-తె. చెట్లయందుఁగలుగు జిగటవస్తువు. నిర్యాసము. సమా. —మన్ను - జిగటగలమట్టి. —ముచ్చు-లోభి. (స్త్రీ. బంకెత.)
బంకు-తె. 1. సందు. 2. శూరునివలెనటించువాఁడు. 3. కావలివాఁడు. [తరము.
బంకోలు-ఆం. శిక్షింపఁబడినవారిని పంపు ద్వీపాం
బంగనబయలు-తె. (బయలు+బయలు) మిక్కిలి బయలు. రూ. బట్టబయలు.
బంగరు-వి. (భృంగారము) పొన్ను. రూ. బంగరువు, బంగారము, బంగారు. సమా. —కొండ-1. హేమాద్రి. 2. మంచివాఁడు. రూ. బంగారుకొండ.
బంగారము-వి. 1. బంగరు. 2. దుర్లభము.
బంగీ-హిం. తపాలులోవచ్చు వస్తువులకట్ట.
బంజరు-హిం. బీడునేల. [కాలిబంటి. మొ)
బంటి-తె. లోఁతునుదెలుపు ప్రత్యయము. (మోఁ
బంటు-వి. (భటుఁడు) 1. సేవకుఁడు. 2. భక్తుఁడు. 3. శిష్యుఁడు. 4. శూరుఁడు. [3. ఆకతాయి.
బండ-తె. 1. వెడలుపుఱాయి. 2. పొట్టిరోఁకలి.
బండఁడు-తె. ఆకతాయి. రూ. బండ, బండగుఁడు.
బండగు-తె. బోను.
బండము-వి. (భాండము) వస్తువు. [రము, బండారు.
బండరువు-వి. (భండారము.) బొక్కసము. రూ. బండా

బండవలము-వి. (భండారము) 1. సంచి మొదలు. 2. సామర్థ్యము. రూ. బండాలము.
బండారి-వి. బొక్కసమున కధికారి.
బండారు-తె. 1. పసుపుపొడి. 2. వి. బండరువు.
బండి-తె. 1. శకటము. 2. రథము. సమా.—మొగ్గరము-శకటవ్యూహము. —రిక్క-రోహిణి.
బండిగిల్లు-తె. కడగండ్లుపడు. [ట. (బండుబూతు.)
బండు-తె. 1. ఆకతాయితనము. 2. ఆకతాయిమా
బంతి-తె. 1. చెండు. 2. వి. (పంక్తి.) వరుస. 3. పది. సమా. —కట్టు-ఎడ్లవపునకుఁగట్టుపలుపు.
బందన-తె. 1. జిగట. 2. బంక.
బంది-వి. నిర్బంధము. సమా.—కాఁడు-బందిపోటు దొంగ. —పోటు - నిర్బంధపఱచికొట్టిదోఁచుకొనుట. స. 1. చెఱ. 2. చెఱఁబడినది.
బందిగము-వి. (బంధకము) చెఱసాల.
బందు-తె. పోరువ. హిం. నిరోధము. సమా. —కట్టు-జాతికట్టుపాటు. [వుఁడు.
బందుగుఁడు-వి. (బంధువు) చుట్టము. రూ. బందు
బందె-వి. (బంధము) 1. పసులచెఱ. 2. పసుల కిచ్చుదండుగ. 3. నిర్బంధము. సమా. —కాఁడు-చెఱలోవేయువాఁడు. (స్త్రీ. బందెకత్తె.) క్రి. —గొను-చెఱఁబెట్టు.
బంధకము-స. 1. చెఱసాల. 2. మాఱువు. 3. కుదువ.
బంధకి-స. 1. ఱంకుటాలు. 2. ఆటకత్తె.
బంధనము-స. 1. కట్టు. 2. కుదువ. 3. చెఱ. 4. తొడిమ. సమా. బంధనాలయము-చెఱసాల.
బంధము-స. 1. కట్టు. 2. కుదువ. 3. చెఱ. 4. ఒకతెగ కవిత్వము. క్రి. బంధించు. కట్టివేయు.
బంధుత-స. బంధుసమూహము.
బంధుర-స. వేశ్య. [బ్బెత్తయినది. రూ. బంధూరము.
బంధురము-స. 1. ఒప్పిదమైనది. 2. వంగినది. 3. ఉ
బంధులుఁడు-స. ఱంకుటాలికొడుకు. [ధవుఁడు.
బంధువు-స. 1. చుట్టము. 2. జ్ఞాతి. రూ. బంధుఁడు, బాం
బంపు-తె. పండ్లపాఁచి.
బంబ-తె. స్థూలము. సమా. బంబోతు-బలిసినవాఁడు.
బంభరము-స. తుమ్మెద. (వ్యు. బమ్మనుశబ్దమును [భరించునది)
బకము-స. కొంగ. రూ. బకోటము.
బకదారి-తె. ఒకతెగ పావురము.
బక్క-తె. 1. శుష్కించినవాఁడు. 2. శుష్కము. రూ. బ్రిక్క. క్రి. బక్కటిల్లు. 1. శుష్కించు. 2. కృశించు. [బగ్గు.
బగబగ-తె. మండుటయందగుననుకరణము. రూ.
బగళము-తె. తొలఁగుడు.
బగి-తె. ప్రక్క
బగిసి-చూ. బవిసి.
బగ్గముపాడు-తె. (పాడు+పాడు) మిక్కిలినాశము.
బగ్గి-తె. బూడిద. రూ. బుగ్గి.
బగుండి-తె. ఎఱ్ఱనిచూర్ణము.
బచ్చు-తె. 1. కోమటి. 2. బొక్కసమునకధికారి. 3. రత్నకనకములు నాణెముచూచువాఁడు.
బచ్చెన-తె. 1. పూఁత. 2. వర్ణము.
బజంత్రి-హిం. మేళము.
బజీతు-హిం. భంగమునొందినది.
బజ్జి-తె. ఎనిచిపలుచఁగాఁజేసినకూర.
బజాఱము-వి. వ్యభిచారము. క్రి. బజాఱించు. (బజాఱి-వ్యభిచారిణి.)
బజాఱు-హిం. అంగడివీధి. రూ. బజాఱు.
బటాకబయలు-తె. బట్టబయలు. రూ. బటాబయలు.
బటాని-హిం. ఒక కాయధాన్యము.
బటారము-తె. గొప్ప. సమా. బటాబూరము. (బటారము+బూరము) పెద్దటీకము.
బటువు-తె. 1. గుండ్రని. 2. గుండ్రనియుంగరము. 3. బిల్లతలగడ. వి. (పటువు) దృఢము. సమా. —(గైదువు. చక్రాయుధము. (ఇట్లే బటువువాలు. మొ.) —బిల్ల-గుండ్రనితలగడ.
బట్ట-వి. (పటము) 1. వస్త్రము. [బిల్లతలగడ. తె. 1. పసులదేహముమీఁది చాఱ. 2. వెండ్రుకలూడినది. (తల) సమా. —గుత్తు-సిగ్గిఁడి. —తల-వెండ్రుకలు రాలినతల. [లు.
బట్టబయలు-చూ. బంగసబయలు. రూ. బటాకబయ
బట్టి-తె. వాగ్గోరణి. సమా. —కాఁడు-1. చిలుక. 2. గోరువంక.
బట్టీ-హిం. సారాయి. మొ. కాఁచు యంత్రము.
బట్టు-వి. (భట్టుఁడు) వంది.
బట్టె-తె. కాలువ.
బడ-హిం. పెద్ద.

బడప-తె. ఇడుమ.
బడబ-స. 1.ఆఁడుగుఱ్ఱము.2.బ్రాహ్మణస్త్రీ. సమా. బడబానలము-బాడబము.(ఇట్లుబడబాగ్ని.మొ.)
బడలిక-తె. శ్రమము, అలయిక. [బడలుపడు.
బడలు-తె. 1. శ్రమపడు. 2. కృ. శ్రమము. క్రి.
బడవా-హిం. 1. తార్పువాఁడు. 2. తార్పుఁగత్తె.
బడాయి-హిం. డంబము.
బడి-తె. 1. భావార్థక ప్రత్యయము. 2.పాఠశాల. 3. క్రమము. 4. వెంబడి. సమా. —కోలు-పోలిక. —పెద్ద-ఉపాధ్యాయునికి సాయపడు ముఖ్య విద్యార్థి. [కంఠస్థము.
బడిత-తె. ఇసుపకట్లగుదియ. సమా. —పాఠము-
బడిమి-తె. 1. బడియుట. 2. చక్రాకారముగా తిరుగుట. 3. భూతబలి.
బడియ-తె. చిన్నదుడ్డుగఱ్ఱ. రూ. బడె.
బడియు-తె.(దృష్టిదోషముపోవ) దిగఁదీయు.కృ. బడిమి. సమా. బడిసివాటు-దిగఁదుడుపు. క్రి.
బడిశము-స. గాలము. [బడిదిప్పు-దిగఁదుడుచు.
బడుగు-తె. 1. పీనుఁగు. 2. అశక్తుఁడు. 3. కృశము. రూ. బడుపు.
బడువ-తె. పల్లపునేల. రూ. బాడువ.
బతము-వి. వ్రతము. [మాలిక.
బతిమాలు-తె. దైన్యముతో వేఁడికొను. కృ. బతి
బత్తళిక-తె. అమ్ములపొది. రూ. బత్తళి,బత్తడిక.
బత్తి-వి. భక్తి. [పేరు.
బత్తుఁడు-వి. 1. భక్తుఁడు. 2. కంసాలెవారిపట్టపు
బత్తెము-తె.భోజనమునకైయిచ్చుసామగ్రి.[బదనిక.
బదనిక-తె.చెట్టుమీఁద మొలచు చెట్టు,వృక్షాదని. రూ.
బదర-తె. 1.పగులు. 2. తునుక. రూ.బ్రిద్దర.
బదరి-స. 1. రేఁగుచెట్టు. 2. ప్రత్తిచెట్టు.
బదరికము-తె. పెట్టె.
బదులు-హిం. 1. మాఱు. 2. అప్పు. 3. ప్రతి.
బద్ద-తె. 1. కాయయొక్కఖండము. 2. వెదురులోనగువానిఖండము. 3. చీలిక. రూ. బ్రిద్ద. సమా. —పరి-పేఁపకేడెము. రూ. బ్రిద్దపరి.
బద్దకము-తె. పాలుమాలిక. క్రి. బద్దకించు. [చు.
బద్దించు-తె. సరిచూచుటకుకొలిచినది మరలకొలు
బద్దు-తె. బొంకు. రూ. బద్దుర.

బద్దె-ని. (పస్తి) 1. వస్త్రము మొదలు. 2. అపరకర్మముచేయునపుడు జందెమువలె వేసికొను. [వస్త్రఖండము.
బద్రి-తె. పందెప్రిండు.
బద్రిము-తె. పదిలము.
బధిరుఁడు-స. చెవిటివాఁడు.
బద్ధము-స. కట్టఁబడినది. [ఆపద. క్రి. బన్నపడు.
బన్నము-వి. (భగ్నము) 1. అవమానము. 2.
బన్నసరము-తె. నానావిధములయినమణులుగ్రుచ్చిన హారము. రూ. బన్నసరి.
బభ్రువు-స.1.కపిలగోవు.2.వెంట్రువ.3.అగ్ని.4.పచ్చనిది.5.బట్టతలవాఁడు.
బమ్మ-వి. (బ్రహ్మ) నలువ. రూ. బొమ్మ.సమా. —రక్కసి-బ్రహ్మరక్షస్సు. [రిల్లు.
బమ్మరించు-వి. (భ్రమరించు) తిరుగు. రూ. బమ్మ
బమ్మెర-వి. (భ్రమము) భ్రాంతి.
బయలు-తె. 1. బహిఃప్రదేశము. 2. ఎడారి. 3. ఆకాశము. 4. శూన్యము. సమా. బయకాఁడు-గాయకుఁడు. (రాగము బయలుపఱచువాఁడు. —కారము-యౌవనమందు శృంగారచేష్ట, విలాసము. —కారి-విలాసవతి. బయలుదామర-మెట్టదామర. క్రి. —దేఱు,—వెడలు, నిర్గమించు. —పడు,—మెఱయు,—వోవు-ప్రకాశితమగు.
బయానా-హిం. సంచకరువు.
బయ్యంకలు-తె. వేపిళ్లు.
బరక-తె. 1. కఱకు. 2. నలుసు.
బరటు-తె. 1. గోఁకు. 2. సైఁగగాగోఁకు.
బరడు-తె. గఱుకైన చెట్టుపట్ట. [చుక్క అనియు).
బరణి-తె. కరాటము. వి. భరణీనక్షత్రము.(బరణి
బఱబఱ-తె. ఈడ్చుటయందగు ధ్వన్యనుకరణము.
బరమా-హిం. పిడిసాన.
బరవసము-తె. ధైర్యము.
బరాతము-హిం.లిఖితపూర్వకమైనఆజ్ఞ.[బరాబరిక.
బరాబరి-హిం. 1. హెచ్చరిక. 2. సరియైన. రూ.
బరి-తె. 1. పార్శ్వము. 2. గిఱి. 3.బరిగోల.4. దొంగ.5.శత్రువు. సమా. —కాఁడు-మావటివాఁడు. —కోల - 1. ఏనుఁగును పొడిచి బెదరింప అర్ధచంద్రాకారపుఉక్కు అలుఁగులువేసిన వేణుదండము. 2. బాణము.

బరికె-తె. గఱుకులుగల యెండిన తాటిమట్ట.
బరిగి-తె. శూన్యము. సమా. బరికట్టె. —గమ్మి, అలుఁగులేని యీఁటె. —జోగి-పాములవాఁడు. బరిగిరౌతు-జీను వేయనిగుఱ్ఱముపై నెక్కువాఁడు.
బరిస-తె. గాలముపంటి అలుఁగుగల యీఁటె.
బరుకు-తె. 1. తోలు లేచునట్లు గీఱు. 2. గీఱు.
బరుజు-తె. గజ్జె.
బరువడి-తె. మరల.
బరువు-వి. (భరము) భారము.
బరుసు-వి. (పరుషము) కఱకు.
బఱ్ఱె-తె. ఎనుము.
బర్హము-స. నెమలిపురి.
బర్హి-స. 1. నెమలి. 2. దర్భ. రూ. బర్హిణము.
బర్హిస్సు-స. అగ్ని. సమా. బర్హిర్ముఖుఁడు-వేలుపు. —శ్శుష్మ-అగ్ని.
బలఁగము-తె. పరిజనము. రూ. బల్గము.
బలకరము-తె. కావలి. రూ. బళకరము.
బలకరించు-తె. 1. అధికమగు. 2. వ్యాపించు.
బలకొట్టు-తె. పాటకుతోడుగా అఱచు.
బలపము-తె. 1.పలకపై వ్రాయు సాధనము, కఠిని. 2. దొంగపనిముట్టు.
బలము-తె. అధికము. స. 1. సత్తువ. 2.బలుపు. 3. సైన్యము. సమా. బలదేవుఁడు-1. బలరాముఁడు. 2. వాయువు. —భద్రుఁడు. —రాముఁడు-కృష్ణుని అన్న. —విన్యాసము-వ్యూహమమర్చుట. —సూదనుఁడు-ఇంద్రుఁడు. (ఇట్లే బలవైరి. బలారాతి. మొ.) క్రి.బలకొను-అతిశయించు. —పడు-అధికమగు.
బలయు-తె. పరివేష్టించు.
బలవంతము-వి. బలాత్కారము. స. బలముగలది.
బలా-హిం. ప్రశంసార్థకము. రూ. బళా, బళి, బళీ, బలారే, బలే.
బలాక-స. పెంటికొక్కెర. (పుం. బలాకము.)
బలాత్కారము-స. మిక్కిలి నిర్బంధించుట, బలవంతము.
బలాదూరు-హిం. దిగఁదుడుపు.
బలాహకము-స. మేఘము. రూ. వలాహకము.
బలి-తె. దేవతయెదుట మృగాదుల నఱకుట. క్రి. బలివెట్టు. స. 1. కప్పము. 2.కానుక. 3.బలముగలవాఁడు. 4.ఒక అసురరాజు. సమా. —ధ్వంసి-విష్ణువు. —పుష్టము. —భుక్కు-కాకి. —సద్మము-పాతాళము.
బలితము-వి. (బలిష్ఠము) 1. మిక్కిలి బలముగలది. 2. స్థూలము.
బలిమి-వి. (బలము) 1.దేహబలము. 2. బలాత్కారము. రూ. బల్మి.
బలియు-వి. 1. స్థూలించు. 2. అధికమగు. క్రి. బలుపు.
బలియుఁడు-వి. (బలీయుఁడు) బలవంతుఁడు.
బలిష్ఠము-స. అత్యంత బలముకలది.
బలీయము-స. మిక్కిలి బలముకలది.
బలీవర్దము-స. ఎద్దు.
బలు-తె. సమాసమందు బలుపుశబ్దమున కేర్పడు రూపము. సమా. —విడి - విధము. —హజ్జ మెకము-ఏనుఁగు.
బలుఁడు-స. 1.బలరాముఁడు. 2.బలముగలవాఁడు.
బలుపు-తె. 1. పుష్టి. 2. బలము. రూ. బల్పు.
బలువు-తె. అధికము. వి. బలము.
బలువుఁడు-వి. బలియుఁడు.
బలె-తె. వలె.
బలే-చూ. బలా.
బల్ల-తె. 1.కూర్చుండుటకై కాళ్లమర్చిన ఎత్తుపలక. 2.కడుపు దుర్మాంసపు బిళ్ల. 3.కుంచము. (రూ. బళ్ల) సమా. —కట్టు-అడుగు వెడల్పైనపడవ.
బల్లి-వి. (పల్లి) గౌళి.
బల్లిదుఁడు. స్త్రీ. బల్లిదురాలు.)
బల్లిదము-వి. (బలిష్ఠము) మిక్కిలిబలముగలది. పుం.
బల్లు-తె. తెల్లవాఱుటయందగు ననుకరణము.
బల్లెము-వి. (భల్లము) 1. జెముడాకువంటి అలుఁగుగల బాణము. 2. ఈఁటె. రూ. బల్లియము.
బవంతము-తె. మోసము.
బవంతి-తె. 1.నాలుగుప్రక్కలకలిపికట్టినకట్టడము గలతొట్టికట్టు. 2.చిత్రవర్ణము.
బవనిక-చూ. బదనిక.
బవరము-తె. యుద్ధము.
బవిరి-తె. గుండ్రము. రూ. బవ్రి.
బవిసనము-తె. వీణసొరకాయయొక్క బంధనము. రూ. బయిసణ, బైసణ.
బవిసి-వి. (భవిష్యము) 1.భాగ్యము. 2.గౌరవము. రూ. బయిసి, బైసి.
బస-వి. (వాసము) వాసస్థానము.

బసవఁడు-వి. 1. వృషభము. 2. ముద్రవైచి విడిచినకోడె. రూ. బసవన. [స్వైరిణి.

బసివి-వి. (బసవనవలె స్వేచ్ఛగాఁదిరుగునది)

బసుమము-వి. (భస్మము) బూడిద.

బస్తా-హిం. మూట.

బహదరు-హిం. గొప్పతనమును సూచించు బిరుదు.

బహిరంగము-స. (బహిః+అంగము) 1. వెలుపలి అవయవము. 2. బయలుపడినది.

బహిర్ద్వారము-స. తలవాకిలి.

బహిర్లాపి-స. ఉత్తరము వేఱుమాటలయం దడఁగియుండునట్లు అడుగు సమస్య.

బహివడు-స. వెలివేయఁబడు.

బహివెట్టు-స. వెలివేయు.

బహిష్కారము-స. వెలివేయుట. రూ. బహిష్కరణము. క్రి. బహిష్కరించు.

బహిష్కృతుఁడు-స. వెలివేయఁబడినవాఁడు.

బహుధాన్య-స. పండ్రెండవ సంవత్సరము.

బహువు-స. 1. అధికము. 2. పెక్కు. సమా. —ధా-అనేకవిధములచే. —పాదము - మఱ్ఱిచెట్టు. —ప్రదుఁడు - మిక్కిలి ఈవికాఁడు. —మతి, —మానము-సమ్మానము. —రూపము. ఊసరవెల్లి. —విధము-వివిధము. బహూకృతి, —కరణము-సమ్మానము. క్రి. బహూకరించు-సమ్మానించు. [3. అధికము.

బహుళము-స. 1. ఆకాశము. 2. కృష్ణపక్షము.

బళకరము-చూ. బలకరము.

బళా-చూ. బలా.

బళాయి-తె బలవంతుఁడు.

బళి, బళీ-చూ. బలా. రూ. బళిర, బళిరయ్య, బళీ, బళిరె.

## బా

బాండువ-వి. (భాండము) కుండ.

బాంధకినేయుఁడు-స. బంధకి కొడుకు.

బాంధవము-స. బంధుత్వము, చుట్టఱికము.

బాంధవుఁడు-చూ. బంధువు.

బాఁకు-హిం. కటారి.

బాఁతి-చూ. బ్రాఁతి.

బాఁదు-తె. కొట్టు, ప్రహరించు. [బాఁపత.)

బాఁపఁడు-వి. (బ్రాహ్మణుఁడు) పాఱుఁడు. (స్త్రీ.

బాఁపన-వి. బ్రాహ్మణకులము. సమా. బాఁపనక్క-పాఱుత. —నయ్య-పాఱుఁడు. —చీమ-చెట్లయందుండు గోరోజనవర్ణపు పెద్దచీమ, బ్రాహ్మి.

బాఁపనుఁడు-వి. (బ్రాహ్మణుఁడు) బాఁపఁడు.

బాఁపఱికము-వి. బ్రాహ్మణత్వము.

బాకా-హిం. కాహళము. రూ. బాంకా.

బాకి-తె. పెద్ద. సమా. —నోటిమెకము-సింగము, పంచాస్యము. హిం. అప్పు. రూ. బాకీ.

బాగములు-వి. (పూగములు) పోఁక చెక్కలు. రూ. బాగలు, బాగాలు.

బాగు-తె. 1. క్షేమము. 2. అందము. 3. విధము. సమా. బాగరి-సుందరుఁడు. అందగత్తె. బాగులాఁడి-అందగత్తె. క్రి. —చేయు-చక్కఁబఱచు.

బాగెము-వి. (భాగ్యము) సుకృతము.

బాజాఱు-చూ. బజాఱు. [సందిటఁగట్టుకొను నగ.

బాజు-తె. కాంతి. హిం. ప్రక్క. సమా. బాజుబందు-

బాట-హిం. విశాలమైన బండిత్రోవ. సమా. —సారి-తెరువరి. [బానలము.

బాడబము-స. 1. బడబా సమూహము. 2. బడ

బాడబుఁడు-స. బ్రాహ్మణుఁడు.

బాడాసువు-ఆం. గండ్రగొడ్డలి. (Broad-axe)

బాడిగ-వి. (భాటకము) ఇంటి అద్దె. రూ. బాడుగ.

బాడిత-తె. కొయ్యనుచెక్కు పనిముట్టు. రూ. బాడిస.

బాడు-తె. ముసుఁగు. హిం. లంజెకిచ్చిన రూకలు. సమా. బాడుదల-అవమానించుట.

బాడుగోరు-హిం. లంజె, జారిణి.

బాడె-తె. అడుసు.

బాధము-స. 1. ప్రతిజ్ఞ. 2. అధికము.

బాణము-స. అమ్ము. (మదనునిపంచబాణములు:—అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము. వీనిగుణములు మోహనము, ఉన్మాదనము, సంతాపనము, శోషణము, నిశ్చేష్టాకర

బాణలి-తె. పెనము. [ము) సమా. బాణాసనము-విల్లు.

బాణా-తె. దండాయుధము.

బాతళించు-తె. తత్తఱపడు.

బాతు-హిం. హంసవంటి జలపక్షి. రూ. బాతువు.

బాద-వి. బాధ.

బాదము-హిం. ఒక ఫలవృక్షము. రూ. బాదామి.
బాదరము-తె. కర్ణాటకపుతుపాకిచెవి. రూ. బాదరు.
బాదరాయణుఁడు-స. 1. వ్యాసుఁడు. (రూ. బాదరాయణి) (వ్యు. బదరీవనమందు సంచరించువాఁడు) 2. వెఱ్ఱివాఁడు.
బాదరించు-తె. సమానమగు.
బాధ-స. 1. దుఃఖము. 2. నొప్పి. క్రి. బాధించు.
బాధితము-స. బాధింపఁబడినది.
బాధిర్యము-స. చెవుడు.
బాధ్యత-స. బాధ్యత్వము. [దగినహక్కు.
బాధ్యము-స. 1. బాధింపఁదగినది. 2. బాధింపఁ
బాన-తె. 1. కడవ. 2. ఏతపుకడవ.
బానగిల్లు-తె. బలాత్కృతమగు.
బానసము-వి. (మహానసము) 1. వంట. 2. వంటసాల. సమా. బానసీఁడు-వంటవాఁడు.
బానిస-తె. 1. దాసి. 2. వెలకుఁగొన్నదాసి, దాసుఁడు. సమా. బానిసము-బానిసతనము. బానిసీఁడు-
బాపు-హిం. బళీ. రూ. బాపురే. [దాసుఁడు.
బాబతు-హిం. 1. విషయము. 2. పద్దు. [రుఁడు.
బాబా-వి. (బడబ) గుఱ్ఱము. సమా. —రౌతు-కుబే
బాబు-తె. 1. పూజ్యుఁడు. 2. తండ్రి. [3. దుఃఖము.
బాము-వి. (భవము) 1. పుట్టుక, జన్మము. 2. ఆపద.
బార-తె. అడ్డముగాచాఁచిన రెండుచేతులతోడి బొమ్మకొలత, వ్యామము. హిం. పండ్రెండు. సమా. —కాఁడి-కోడెలను మరపుటకు కట్టెడి
బారసాల-తె. నామకరణము. [కాఁడి.
బారసి-తె. ద్వాదశి.
బారాది-తె. 1. అధికము. 2. అనేకము.
బారి-తె. 1. హింస. 2. కపిలెయెద్దులు తిరుగుదారి. క్రి. బారిసమరు-హింసించు. వి. (పారి) ఏనుఁగుకాలికిఁగట్టెడుగొలుసు. (రూ. బారీ) 2. నిర్బం
బారిసము-తె. పాలకము. [ధము.
బారు-తె. 1. గుంపు. 2. వరుస.
బారువ-వి. (భారము) ఇరువది మణుఁగులు.
బాల-స. 1. ఆఁడుది. 2. పదునాఱేండ్లకు లోఁబడిన పడుచు. [రూ. బాలుఁడు.
బాలకుఁడు-స. పదునాఱేండ్లకు లోఁబడినవాఁడు.
బాలాజి-వేంకటేశ్వరునకు బైరాగులువాడుపేరు.
బాలిక-స. బాల.
బాలిశము-స. తలగడ. (వి. బాలీసు.)
బాలిశుఁడు-స. 1. మూర్ఖుఁడు. 2. బాలుఁడు.
బాలీసు-వి. (బాలిశము) ఒఱగుదిండు.
బాలుఁడు-చూ. బాలకుఁడు. [ాలు అనియు.)
బాలెంత-తె. బిడ్డనుగన్నది, ప్రసూత. (బాలెఁత
బాలేయము-స. 1. గాడిద. 2. బాలునికి హితమై
బాల్యము-స. చిన్నతనము. [నది. 3. మెత్తనిది.
బావ-వి. (భావుకుఁడు) 1. అక్కమగఁడు. 2. మగని అన్న. 3. తనకన్న పెద్దయైన మేనత్త మేనమామలకొడుకు.
బావి-వి. (వాపి) 1. దొడవు. 2. చెఱువు.
బావుకొను-తె. 1. చేతినిండఎత్తి నోట నిడుకొను. 2. అనుభవించు.
బావురు-తె. ఏడ్పుటలోనగువాని యందగు ధ్వని. సమా. —బిల్లి-బావురుమనియఱచు ఒక తెగ గండుఁబిల్లి. —గడ్డము-పిల్లిగడ్డము. —గాఁడు-బావురుఁబిల్లి.
బాష్పము-స. 1. కన్నీరు. 2. ఆవిరి.
బాస-వి. (భాష) 1. సంస్కృతాదిభాష. 2. ప్రతిజ్ఞ. 3. ప్రమాణము. 4. వ్రతము. 5. సంకేతము. సమా. —వాలు-1. వేలుపు. 2. ఋషి.
బాసట-తె. సహాయము. [క్రి. బాసాడు-మాటాడు.
బాసికము-తె. వివాహకాలమందు వధూవరుల నొసటఁగట్టునది, లలామకము. సమా. బాసికపందతలముందు ప్రకాసించిన పుష్పహారము. —పట్టు-పద్మాసనము.
బాహ-స. భుజము. రూ. బాహువు.
బాహాటము-వి. (బహిరటము) బహిరంగము.
బాహిరము-వి. (బహిరంగము) 1. బయలుపడినది. 2. వెలియైనది. క్రి. బాహిరపోవు-1. బయలుపడు. 2. మూర్ఛిల్లు.
బాహువు-స. భుజము. రూ. బాహ, బాహు. సమా. —జుఁడు-బుజముపుట్టువు. —ద-బాహుపురి. —పురి-కేయూరము. —మూలము - చంక —లము - బాహుత్రాణము. —లేయుఁడు -
బాహుళ్యము-స. బహుళభావము. [కుమారస్వామి.
బాహ్లికము-స. 1. ఇంగువ. 2. కుంకుమపువ్వు.

3. ఒక దేశము. 4. ఆదేశపుగుఱ్ఱము. రూ. బహ్లీకము.

బాహ్యము-స. వెలుపలిది.

బాశి-తె. కాంక్ష.

## బి

బింకము-తె. 1. బిగువు. 2. గర్వము.

బిందము-వి. (బృందము) సమూహము.

బిందియ-తె. గొంతుసన్నముగానుండు లోహపాత్రము. రూ. బిందె.

బిందువు-స. 1. నీటిబొట్టు 2. చుక్క. 3. సున్నము. సమా. బిందుతంత్రము-1. చదరంగము. 2. నెత్తపలక.

బింబము-స. 1. ప్రతిబింబము. 2. ప్రతిమ. 3. దొండపండు. 4. చంద్రసూర్య మండలము. సమా. బింబోష్ఠి. 1. దొండపండువంటి పెదవిగల ఆఁడుది. 2. ఆఁడుది.

బింబితము-స. ప్రతిబింబించినది.

బికారి-వి. (భిక్షుక, వికిరవాణ్) 1. భిక్షుకుఁడు. 2. ఏమియులేనివాఁడు. రూ. బికాసి.

బిక్క-తె. భిన్నము.

బికిరము-వి. (వికిరము) బిచ్చము. సమా. బికిరాలమారి. బిచ్చమెత్తు స్వభావముఁకలవాఁడు.

బిక్కరించు-తె. ఉక్కించు.

బిగి-తె. 1. బింకము. 2. వదులుకానిది. రూ. బిగువు.

బిగితము-తె. దృఢము.

బిగియు-తె. 1. వదులుకానిదగు. 2. బిగువుచేయు. ప్రే. బిగియించు, బిగించు, బిగుచు. కృ. బిగి, బిగువు, బిగుతు. క్రి. బిగఁబట్టు. బిగియఁబట్టు. రూ. బిగ్గఁబట్టు. (ఇట్లు బిగఁగొట్టు, మొ.)

బిగుతు-తె. వదులుకానిది.

బిగువు-చూ. బిగి.

బిగ్గ-తె. బిగువుగా. రూ. బిగ. చూ. బిగియు.

బిగ్గర-తె. 1. గట్టిగా. 2. దృఢముగా.

బిచ్చము-వి. (భిక్షము) తిరిపము. (పుం. బిచ్చగాఁడు. స్త్రీ. బిచ్చగత్తె.)

బిజుగు-తె. బొంకు.

బిటారము-తె. ఒయ్యారము, విలాసము. (స్త్రీ.) బిటారి.

బిట్టబిఱ్ఱ-తె. (బిఱ్ఱ+బిఱ్ఱ) మిక్కిలి బిగువు.

బిట్టు-తె. 1. శీఘ్రము. 2. గట్టిగా. (ఆమ్రే. బిట్టు బిట్టు-తటాలున.)

బిడ-తె. 1. బిడ్డ. 2. (అ ఈ ఏ పూర్వకమైనచో) ఆఁడుది.

బిడారము-తె. 1. వాసస్థానము. 2. విడిది. రూ. బిడారు.

బిడారు-తె. 1. వాసస్థానము. 2. చనుప.

బిడాలకము-స. పునుఁగుచట్టము.

బిడాలము-స. 1. పిల్లి. 2. కనుగ్రుడ్డు.

బిడియము-తె. సిగ్గు. రూ. బిడెము.

బిడుగు-తె. 1. అవకాశము. 2. బావిలోప్రక్కల వదలినగట్టు. రూ. బిడువు.

బిడౌజుఁడు-స. ఇంద్రుఁడు. (వ్యు. వ్యాపనశీలమైన తేజస్సుకలవాఁడు.)

బిడ్డ-తె. 1. శిశువు. 2. కొడుకు. 3. కూఁతురు. రూ. బిడ, బిడ్డె. సమా. —కుట్టు-ప్రసవవేదన. —తల్లి-1. బాలెంత. 2. గర్భిణి.

బిత్తరము-తె. 1. శృంగారచేష్ట. 2. ప్రకాశము. 3. చంచలము. 4. సరసము. సమా. బిత్తరి-1. శృంగారచేష్టగలది. 2. ఆఁడుది. క్రి. బిత్తరపోవు. 1. దిగ్భ్రమచెందు. 2. చలించు. బిత్తరములాడు-ప్రకాశించు. బిత్తరించు-1. సరసమాడు. 2. ప్రకాశించు. 3. చలించు. 4. ఊఁగాడు.

బిత్తల-తె. దిసమొల. (స్త్రీ. బిత్తలి.)

బిద్దము-వి. (భిన్నము) పగిలినది.

బిద్దు-తె. చచ్చు.

బిద్దె-తె. దుర్గతి.

బిబ్బరించు-తె. (పులి) రొప్పు. కృ. బిబ్బరింత.

బిబ్బి-తె. తోరణము. హిం. ముహమ్మదీయుల అంతఃపురస్త్రీ. రూ. బీబీ.

బిబ్బోకము-స. నాయికకు గర్వాతిశయముచే ఇష్టవస్తువునం దేనియుఁ గలుగు అనాదరము. రూ. బిబ్బోకము. సమా. బిబ్బోకవతి. బిబ్బోకముకలది.

బిభీషణము-స. 1. భయము. 2. భయంకరము.

బిభీషిక-స. భయపఱచునది.

బిమ్మటి-తె. 1. వివశత్వము. 2. సంకోచము. క్రి. —గొను, —వోవు-వివశత్వమొందు.

బియ్యము-తె. పొట్టూడదంచిన వరిధాన్యము, తండులము.

బిరడ-తె. 1. తంబుఱ మున్నగువాని తంతిచుట్టు తఱిమెునకొయ్య, చెవి. 2. సీసాలుమున్నగువానికి బిగువుగా వేయుమూఁత.

బిరబిర-తె. శీఘ్రముగా. రూ. బిరాన, బిఱబిఱ, బిఱాన, బిఱీన, బిఱీలున. [రూ. బిరుదము.
బిరుదము-స.సామర్థ్యచిహ్నము. 2.వందిస్తోత్రము.
బిరుదు-వి. (బిరుదము) 1. సామర్థ్యచిహ్నము. 2. ప్రతిజ్ఞ. 3. సమర్థుఁడు. 4. శూరుఁడు. సమా. బిరుదులాఁడు. ప్రతిజ్ఞావంతుఁడు.
బిరుసు-తె. 1. కాఠిన్యము. రూ. బిఱుసు.
బిట్టి-తె. బిగువు. రూ. బిఱ్ఱు. [4. ఉద్ధతి.
బిఱ్ఱు-తె. 1. బిరుసగు. 2. కృ.బిరుసు.3.బిగువు.
బిలము-స. 1. రంధ్రము. 2. గుహ. సమా. బిల బిలాక్షి-ఎలుక. బిలేశయము-1. ఉడుము. 2. పాము. 3. ఎలుక.
బిల్ల-తె. 1. పలుచనిగుండ్రనివస్తువు. 2. గుండ్ర నితలగడ. 3. ఖండము. 4. (సూర్యచంద్రుల) బింబము. సమా. —వాలు-చక్రాయుధము.
బిల్లిక-తె. (సూర్యచంద్రుల) బింబము. రూ. బిల్ల.
బిల్వము-స. మారేడుచెట్టు.
బిస-తె. 1. యంత్రపుకీలు. 2. యంత్రము.
బిసబిస-తె. వేగము.
బిసము-స. 1. తామరతూఁడు. 2. తామరతీఁగ. సమా. బిసరుహము. తామర. (ఇట్లబిసప్రసూనము. మొ.)
బిసిని-స. 1. తామరతీఁగ. 2. తామరకొలను.
బిసిబిసి-తె. లగువుబిగువుగలది.
బిస్త-తె. దుర్గతి, నరకము.

బీ

బీఁట-తె. పగులు. రూ. బీటిక. క్రి. బీఁటగిల్లు, బీఁటలువాఱు,—వోవు-పగుళ్లవాఱు.
బీగము-తె. తలుపు మున్నగువానికిఁ వేయుతాళము. సమా. —చెవి. తాళమును తగిలించుతీయుసాధనము. [4. రేతస్సు. 5. హేతువు.
బీజము-స. 1. విత్తనము.2.విత్తుట.3.ముష్కము.
బీడు-తె. 1. దున్ననిభూమి. 2. నికృష్టము.
బీతు-వి. (భీతి) భయము. క్రి. —కొను,—పడు. భయపడు.
బీద-తె. దరిద్రుఁడు, ధనములేనివాఁడు. రూ. పేద.
బీభత్సము-స. 1.అసహ్యకరమైనది.2.ఒకరసము.
బీభత్సుఁడు-స. 1. అర్జునుఁడు.(వి.విభ్వచ్చుఁడు) 2. వికారముగలవాఁడు.
బీఱ-తె. 1. ఒకఫలవృక్షము. 2. ఒకతీఁగ. 3. పెద్ద. సమా. బీఱెండ-ఎక్కువయెండ.
బీరము-వి. (వీరము) పరాక్రమము.
బీరాఁజు-అఱ. తుడిచికుప్పచేయు, వారుకొను.
బీరిజము-వి. (బీజము) అండకోశము,ముష్కము.
బీఱు-తె. వ్యర్థము. క్రి. —వడు. —వాఱు-వ్యర్థమగు. —వోవు-1. వ్యర్థ మగు. 2. బలహీనమగు.

బు

బుంగ-తె. చిన్నమూతిగలపాత్రము. సమా.—నామము-నడుమ ఎడము లేక తీర్చిన తిరుమణి.
బుక్క-తె. వస్త్రములకు వాసనకట్టు గంధవొడి,పటవాసకము. రూ. బుక్కా.
బుక్కనము-స. కుక్కమొఱుగు.
బుక్కాము-తె. పుప్పొడి. 2. బుక్క.
బుగులు-చూ. గుబులు. క్రి. —కొను-1. గుబులుకొను. 2. చిప్పిలు. 3. విజృంభించు. 4. వ్యాపించు. —వోవు-బయలుపడు.
బుగులుబుగులు-తె. క్రక్కుటయందగు ధ్వన్యనుకరణము. [ధారగా పైకుబికివచ్చు నీరు.
బుగ్గ-తె. 1. చెక్కిలి, 2. నీటిబుడగ. 3. సంతత
బుగ్గి-తె. బూడిద,
బుచ్చి-తె. చిన్న [—పుట్టువు-రాచవాఁడు
బుజ-తె. సున్న. వి. భుజము. రూ. బుజము.సమా
బుజ్జగము-తె. ఉపలాలనము. రూ. బుజ్జవము, క్రి బుజ్జగించు. కృ. బుజ్జగింత, బుజ్జగింపు.
బుటా-హిం. వస్త్రములమీఁదనేయు పువ్వు
బుటుకు-తె. మునుఁగుటయందగుననుకరణము.
బుట్ట-తె. బద్దలులోనగువానితో నల్లిన చిన్నపుటిక రూ. బుట్టి, బుట్టిక, పుటిక, పుట్టిక.
బుడబుడ-తె. నీళ్లనుండి వెడలుట, పొక్కుట, క్కుటలోనగువానియందగుననుకరణము.
బుడము-తె. మొదలు. రూ. బుటము.
బుడిగ-తె. 1. ఎద్దుమీఁది యొకవైపుసిద్దె.2.పిడః
బుడిగి-తె. పొట్టి. రూ. బుడుగు.

బుడిపి-తె. పోటుచేతలపైలేచు బొప్పి. 2.గనుపు. 3. మ్రానిముడి. రూ. బుడ్పి.
బుడిబుడి-తె. 1. తొట్రుపాటు. 2. అల్పము.
బుడివడు-తె. తొట్రుపడు.
బుడుక-తె. స్నానము. [బుడుతఁడు.)
బుడుత-తె. 1. బిడ్డ. 2. బాలుఁడు.3.పొట్టి.( రూ.
బుడుబుడుక్క-తె. డుబుడక్క.
బుడ్గ-తె. 1. అంశవృద్ధి. 2. నీటిబుగ్గ. క్రి. బుడ్గగించు. (పందిముట్టెతో) కోరాడు. 2. కోపముచే మోము గండుపాటించు. కృ. బుడ్గగింపు.
బుడ్డి-తె. కాచపాత్రము, సీసా. రూ. బుడ్డిగ.
బుత్తి-వి. (భుక్తి) భోగము.
బుద్ది-వి. (బుద్ధి) మతి.
బుద్బుదము-స. నీటిబుడగ.
బుధుఁడు-స. 1. ఒకగ్రహము. 2. విద్వాంసుఁడు. 3. వేలుపు. సమా. బుధవారము. వారములో నాలవదినము. [బుద్ధిగలవాఁడు. (స్త్రీ. బుద్ధిమతి.)
బుద్ధి-స. మతి. (వి. బుద్ది).సమా.బుద్ధిమంతుఁడు-
బుద్ధుఁడు-స. 1. బుద్ధదేవుఁడు. 2. విద్వాంసుఁడు. 3. తెలియఁబడినవాఁడు.
బుభుక్ష-స. భుజింపనిచ్ఛ, ఆఁకలి.
బుభుక్షితుఁడు-స. ఆఁకలిగొన్నవాఁడు.
బుభుత్స-స. బోధగొన నిచ్ఛ.
బుయ్యారము-తె. చెఱసాల.
బురద-తె. అడుసు.
బురుక-తె. 1. బిడ్డ. 2. పొట్టి. రూ. బురుకఁడు.
బురుజు-హిం. కోటగోడయందుండు దిబ్బ, గడి.
బురుడా-హిం. అసత్యవచనము.
బురుసా-తె. 1. ఎఱ్ఱపట్టు. 2. పట్టు.
బుఱ్ఱ-తె. 1. కొబ్బెరకాయ మొ. వాని చిప్ప. 2. ఎండిన సొరకాయ. 3. పాములవానినాగసరము. 4. క్రోవి. 5. పుఱ్ఱె. 6. పెద్ద. సమా. —కాయ-సొరకాయ కమండలువు. —టకొమ్ము-చిమ్మనఁగ్రోవి. రూ. బుఱటకొమ్ము. —బాడిస-తాళ్లచెక్కెడి బాడిస. —ముక్కు-పెద్దరంధ్రములుగల ముక్కు.
బుఱ్ఱి-తె. తలుపు.
బుఱ్ఱు-తె. పక్షియెగురుటయందగు ధ్వని. [ము
బులాకి-హిం. ముక్కుక్రింద నుంచుకొను ఆభరణము.
బులియు-తె. సుఖించు. కృ. బులుపు. [శనము.
బువ్వ-తె. అన్నము. సమా. —కుడుపు-అన్నప్రా
బువ్వము-తె. పెండ్లియందు బంధువులందఱు నాలవనాటిరాత్రి ఒకటిగాఁగూర్చుండి వేడుకగా భుజించుట. సమా. —బంతి-బువ్వము,హరిబువ్వము.
బుస-తె. 1. పాముపూత్కారము. 2. నిట్టూర్పు. క్రి. —కొట్టు. 1. బుస్సను. 2. నిట్టూర్చు.
బుసబుస-తె. నీరుపొంగుట మొ. వానియందగునసుకరణము. [రూ. బుషము.
బుసము-స. 1. పొల్లు. 2. పిఁగడతీసినపెరుఁగు.
బుసి-తె.నిగుఱు.క్రి. —పోవు-చెడు. [కరణము.
బుస్సు-తె. పాము బుసకొట్టుటయందగు ధ్వన్యను

## బూ

బూఁజు-తె, 1. తడివస్తువులపైఁగలుగు బుసి. 2. కటుదూపము. రూ. బూఁదు. క్రి. —పట్టు,—పాఱు-బూఁజుకలదియగు.
బూక-తె. బూటకము.
బూగర-తె. 1. రాగి మొ. ధాన్యములపైనుండుపొట్టు. 2. కటుదూపము.
బూచి-తె. భూతము.సమా.బూచులతేఁడు-శివుఁడు.
బూటకము-తె. 1. మాయ. 2. వంచన. సమా. బూటకీఁడు. 1. మాయావి. 2. వంచకుఁడు. రూ. బూటకుఁడు.
బూడిద-వి. (భూతి) 1. కట్టెలు మొ. కాలఁగామిగిలినది, బుగ్గి. 2. గోమయభస్మము. రూ. బూది, బూడ్డ.సమా. —గుమ్మడి-పెద్దగుమ్మడి; పెండ్లిగుమ్మడి. —పండు-విభూతియుండ —పన్ను-నుసనమున పీనుఁగులను కాల్చుటకైయిచ్చు పన్ను. [సమా. బూతపిల్లి-పునుఁగుపిల్లి.
బూతము-వి. (భూతము) 1. పిశాచము.2.ప్రాణి.
బూతి-వి. 1. (భుక్తి) తిండి. 2. (భూతి) బూది.
బూద-తె. పాలకుండ.
బూది-వి. (భూతి) బూడిద. రూ. బూతి.
బూదె-వి. (భూతము) చతుర్దశి.
బూమియ-వి. (భూమిక) 1.మాఱువేషము.2.మాయ. 3. వంచన. రూ. బూమె. సమా. బూమెకత్తియ-బూమెలుకలది.( పుం. బూమెకాఁడు.) బూమెలాఁడి. పై.—( పుం. బూమెలాఁడు.)

బూర-తె. నాగస్వరమునకు సుతియిచ్చు వాద్యము. రూ. బూరగ. సమా. బూరగొమ్ము. ఊఁదుఁగొమ్ము.
బూరఁడు-వి. (పూర్ణుఁడు) విజృంభించినవాఁడు.
బూరకాలు-తె. ఏనుఁగుకాలు.
బూరగ-చూ, బూర. [2. ఉబ్బు. ప్రే, బూరటించు.
బూరట-తె. ఉబ్బుట. క్రి. బూరటిల్లు. 1. నిండు.
బూరియ-వి. (పూరిక) బూరె.
బూరుగు-తె. శాల్మలివృక్షము. రూ. బూరువు. సమా. —దీవి. శాల్మలిద్వీపము.
బూల-తె. తాఁటిమ్రానిలోని మెత్తనిభాగము.
బూలి-తె. నిస్సారము.
బూసి-తె. ఇండ్లవాసములకు పట్టెడు సాలెపట్టు.

## బృ

బృంద-స. తులసి.
బృందము-స. సమూహము. (వి. బిందము)
బృందారకుఁడు-స. 1. వేలుపు. (వ్యు. బ. మంచి సమూహముగలవారు.) 2. మనోజ్ఞుఁడు. 3. శ్రేష్ఠుఁడు.
బృంహితము-స. ఏనుఁగుగీఁక.
బృహతి-స. 1. విశ్వావసునివీణ. 2. గొప్పయైనది.
బృహత్తు-స. గొప్పది. సమా. బృహత్కుక్షి-పెద్దకడుపువాఁడు. బృహద్బీజము-అండవృద్ధి. బృహద్భానువు-అగ్ని. రూ. బృహద్భానుఁడు. బృహన్మరీచము-మిరపకాయ.
బృహస్పతి-స. సురగురువు. సమా. —వారము. వారములో ఐదవదినము, గురువారము.

## బె

బెంగ-తె. 1. విరహవ్యథ. 2. కూఁత క్రి. —గొను-మనోవ్యథనొందు. బెక్కొట్టు. (బెంగ + కొట్టు)
బెండ-తె. ఒకతెగ కూరగాయ. [వాపోవు.
బెండగిల్లు-తె. 1. పెల్లగిలు. 2. సోలు.
బెండు-తె. 1. జీలుగుచెట్టు. 2. నిస్సారము. సమా. —మానిసి-బలహీనుఁడు. క్రి. —వడు-బలహీనతనొందు.
బెకబెకలాడు-తె. (కప్పలు) కూయు.
బెగడు-తె. 1. భయపడు. (రూ. బెగ్గడు) 2. కృ. భయము. క్రి. —వడు-భయపడు. బెగ్గడిల్లు—పై.—
బెగ్గలము-వి. (విహ్వలము) 1. భయాదులచే అవయవములు స్వాధీనత తప్పుట. 2. భయము. క్రి. బెగ్గలించు, బెగ్గిల్లు. రూ. బెగ్గలికము.
బెగ్గిల్లు-వి. 1. విహ్వలించు. 2. భయపడు. 3. చింతించు. 4 చలించు. 5. బెదరు. రూ. బెగ్గిలు.
బెగ్గురు-తె. సారసపక్షి.
బెజ్జము-తె. తూఁటు.
బెట్ట-తె. వేంద్రము. రూ. వెట్ట.
బెట్టించు-తె. (నిర్బంధమునుండి) మరలించు.
బెట్టిదము-తె. 1. ఉద్ధతి. 2. క్రౌర్యము. 3. కఠినము. 4. బ. నిష్ఠురవచనము.
బెట్టిదుఁడు-తె. 1. ఉద్ధతుఁడు. 2. క్రూరుఁడు. 3. కఠినుఁడు. (స్త్రీ. బెట్టిదురాలు)
బెట్టు-తె. 1. గౌరవము. 2. ఉద్ధతి. 3. అతిశయము. (రూ. బెత్తు) 4. అత్యంతము. 5. గట్టిగా. 6. దృఢముగా.
బెడఁకు-తె. 1. చలించు. 2. తొలఁగు. కృ. 3. చలనము. 4. తొలఁగుడు. రూ. బెణఁకు, బెళఁకు.
బెడఁగు-తె. 1. అందగించు. కృ. 2. అందము. 3. విలాసము. 4. అధికము. రూ. బెళఁగు. క్రి. బెడఁగారు-అందగించు.
బెడఁద-తె. 1. బాధ. 2. అపద.
బెడిదము-వి. (భీతిదము) 1. భయంకరత్వము. 2. కఠినత్వము. 3. అధికము. 4. బ. పరుషవచనము. రూ. బేడిదము. [బెడిదురాలు.)
బెడిదుఁడు-వి. (భీతిదుఁడు) భయంకరుఁడు. (స్త్రీ.
బెడియు-తె. 1. తప్పు. 2. వికలమగు.
బెణఁకు-చూ. బెడఁకు. [రూ. బెత్తిలి.
బెత్త-తె. తర్జని మొదలైననాలుగువ్రేళ్ల అడ్డకొలత.
బెత్తము-వి. (వేత్రము) పేము. రూ. బెత్తు.
బెత్తిక-తె. ఎండిలేచిన మట్టిపెళ్ల. రూ. బెత్తు.
బెత్తు-తె. 1. బెత్తిక. 2. గౌరవము. (రూ. బెట్టు). 3. వి. బెత్తము.
బెదరు-తె. 1. భయపడు. 2. కృ. భయము. ప్రే. బెదరించు. కృ. బెదరింపు. సమా. —పోతు-భయశీలుఁడు, —రాలు.

బెబ్బులి-తె. (పెద్ద+పులి) వ్యాఘ్రము.
బెరయు-తె. 1 కలుగు. 2.వ్యాపించు. 3.చేరు. 4. పొందు.
బెరసు-వి. (పరుషము) 1. క్రూరము. 2.ముతక.
బెరికి-తె. 1. కొఱత. 2. సంకరజాతి. [పిటికి.
బెరుకు-తె. 1. భేదము. 2. ప్రయోజనము. 3.
బెలము-వి. (బిలము) బొక్క, కలుగు.
బెలయు-తె. వ్యాపించు. రూ. బెరయు.
బెల్లము-తె. చెఱకుపాలుకాఁచఁగానగుముద్ద, గుడ [ము
బెల్లి-తె. వంచకము. రూ. బేలు. క్రి. బెల్లించు, బేలించు, కృ. బెల్లింపు, బేలింపు.
బెసుకు-తె. బెడియు.
బెస్త-తె. ఒకతెగబోయ. (చేఁపలుపట్టుట, పల్లకి మోయుట వారి వృత్తి)
బెహారము-వి. (వ్యవహారము) వాణిజ్యము. రూ. బేహరము, బేహారము. [హరి, బేహారి.
బెహారి-వి. వర్తకవ్యాపారముచేయువాఁడు. రూ. బే
బెళఁకు-తె. 1. చలించు. 2. ఒరయు. 3. కృ. చలనము. రూ. బెదఁకు.
బెళఁగు-చూ. బెదఁగు. [అనియు)
బెళవ-తె. పావురమువంటి ఒకపిట్ట. (బెళగువ్వ
బెళుకు-తె. 1. తళతళమని ప్రకాశించు. 2. కృ. తళతళమను ప్రకాశము.

## బే

బే-తె. ఆవుధ్వని, అంబే.
బేఁటు-తె. 1. ఎండిన ఆడుసుపెల్ల. 2. కొండలో నగువానియందలి చీలిక. రూ. పేఁటు.
బేగడ-తె. కాకిబంగారు.
బేగి-హిం. త్వరగా.
బేజారు-హిం. అలయిక. [పప్పు.
బేడ-తె. 1. పరకరూపాయ. 2. కాయధాన్యముల
బేడిగ-తె. పన్ను.
బేడిజము-తె. మాయ, టక్కు.
బేడిదము-చూ. బెడిదము.
బేడిస-తె. ఒకతెగ చేఁప.
బేడీలు-హిం. సంకెలలు. [శరీరము.
బేతాళము-స. 1. పిశాచము. 2. భూతావిష్టమృత
బేతాళుఁడు-స. యమకింకరుఁడు.
బేది-తె. విరేచనము.
బేరజము-తె. 1. కుత్సితపునడక. 2. పరుషవచనము. 3. కుత్సితుఁడు. 4. కుత్సితురాలు.
బేరము-వి. (వ్యాపారము) 1. వర్తకవ్యాపారము. 2. వెలకడుగుట. స. ప్రతిమ. [ఇ) వైష్యుఁడు.
బేరి-వి. 1. (భేరి) పెద్దనగారా. 2. (బేరము+
బేరీజు-హిం. పన్నుమొత్తము. [కుఁడు, గోల.
బేల-వి. (భేలుఁడు) 1. మూఢుఁడు. 2. అమాయి
బేలు-తె. మోసము, వంచన. రూ. బెల్లి. సమా. బేలరి. మోసకాఁడు, క్రి. —పడు-మోసపోవు. —పోవు.—పై— —పెట్టు-మోసపుచ్చు.
బేవారసు-హిం. దిక్కులేనిది. [పేసము.
బేసము-వి (పేశి)పండ్లలోపలనుండుగుజురు. రూ.
బేసరి-హిం. ముక్కుఱ.
బేసి-తె. సమముకానిది. (1,3,5,7,9 సంఖ్య గలది) సమా. —కంటి-శివుఁడు. —కైదువు జోదు-మన్మథుఁడు, అసమశరుఁడు.
బేహారము-చూ. బెహారము.
బేహారి-చూ. బెహారి.

## బై

బైజ-తె. అజ్ఞానము. రూ. బయిజ.
బైదాలము-తె. కోపము. రూ. బయిదాలము.
బైరవాసము-వి. (బహిర్వాసము) ఉత్తరీయము. రూ. బయిరవాసము. [బయిరాగి.
బైరాగి-వి. (విరాగి) విరక్తుఁడైన తీర్థవాసి. రూ.
బైలు-చూ. బయలు. [బయిసణ, బవిసనము.
బైసణ-తె. వీణసొరకాయయొక్క బంధనము. రూ.
బైసి-వి. (భవిష్యము) 1. భాగ్యము. 2. గౌరవము. రూ. బయిసి, బవిసి, బగిసి.
బైసుక-తె. ప్రతిజ్ఞ. రూ. బయిసుక.

## బొ

బొంకణము-తె. నిబూదినంచి. రూ. బొక్కణ, బొ [క్కణము
బొంకి-చూ. బోఁకి.
బొంకు-తె. 1. అసత్యమాడు. 2. కృ. అసత్యవచనము, 3.అసత్యము. సమా. బొంకరి-అసత్యవాది. బొంకులాఁడి-అసత్యమాడునది. (పుం. బొంకులాఁడు.) క్రి. బొంకించు-1. బొంకఁ

జేయు. 2. మోసపుచ్చు. [వు. రూ. బొమ్మరము.

బొంగరము-వి. (భ్రమరకము) బాలురయాటవస్తు

బొంగు-తె. ఎండినలావుబోలు వెదురు.

బొండ-తె. తప్పుచేసినవారి కాలు సేతులకుఁ దగిలించుదారుయంత్రము, ద్రుపదము. (బొంథకొయ్య, —ద్రమాను. అనియు)

బొండము-తె. తెంకాయమీఁదిబొసిక. రూ. బొండాము, బొండలము, బొండ్లము, బొండ్లాము.

బొండిగ-తె. తొపిమ.

బొండుగ.తె. కంఠనాళము. రూ. బొండువ.

బొండుమల్లె-తె. గుండుమల్లె. [డు తడిక.

బొందెము-తె. ముండ్లకంపతో అల్లి తెట్టునకమర్చె

బొంత-తె. 1. పెద్ద. 2. దట్టముగాఁగుట్టినగంత. సమా. —కాకి-మాలకాకి.—జెముడు-ఒకతెగజెముడు. —యరఁటి-ఒకతెగపెద్దకాయలుగల అరఁటి. —ఈాయి-ఒకతెగమోటుఈాయి. బొందడము-(బొంత+దడము) కవచము. రూ. బొందళము. బొందదీఁడు-బొందడము తొడిఁగినవాఁడు, కవచధారి.

బొంతు-తె. 1. జొన్నలులోనగువానియడుగునసుండుపొట్టు. 2. బొంతఈాయి.

బొంద-తె. 1. రంధ్రము. 2. లొక్కి. 3. తాటి మొదలగు చిన్నచెట్టు.

బొంది-తె. మేను.

బొందు-తె. 1 దారము. 2. సన్ననాడా. 3. పూసరము.

బొందె-తె. అరఁటియూఁచ.

బొక్క-వి. (భూకము) 1. రంధ్రము. 2. బిలము. 3. నోరు. 4. శవమునుపూడ్చుపల్లము. సమా. బొక్కలాఁడు. 1. పాము. 2. కన్నగాఁడు.

బొక్కరు-చూ. బొంకణము.

బొక్కనియ-1. గుజ్జమునకు ఉలవలుపెట్టు బొక్కెన. 2. నీళ్లచేఁదు బొక్కెన. రూ. బొక్కెన.

బొక్కసము-తె. 1. ధనపుమూట, ముల్లె. 2. ధనాగారము.

బొక్కి-తె. బొక్కపడినది. సమా.—నోరు-పండ్లులేనినోరు. —తొమ్మ-మాంసములేనితొమ్మ.

బొక్కిస-హిం. వస్త్రములమూట. రూ. బొక్కిసా.

బొక్కు-తె. 1. నోటనిండుగవేసికొని నమలు. 2. నిండిననోరు, బొక్క.క్రి. బొక్కులాడు, బొక్కు, బొక్కలాడు.

బొక్కెన-చూ. బొక్కనియ.

బొగడ-తె. 1. బుగడ. 2. చూచుకము. 3. గండపట్టెమీఁదిగుబ్బ. 4. చెఱువుకట్టలోపడినసన్నని రంధ్రము.

బొగ్గు-తె. మండిచల్లారిన కట్టెతునుక.

బొచ్చు-తె. రోమము.

బొచ్చె-తె. 1. కుండలోనగువానిపెంకు. 2. తలపుత్తె.

బొజుఁగు-వి. (భుజంగుఁడు) విటుఁడు.

బొజ్జ-తె. 1. కడుపు. 2. కడుపుపెద్దదగుట.

బొటనవ్రేలు-తె. అంగుష్ఠము. రూ. బొటమనవ్రేలు, బొటవ్రేలు, బొట్టనవ్రేలు, బొట్టవ్రేలు.

బొటిమ-తె. మొటిమ.

బొట్ట-తె. వెదురుబద్దలులోనగువానితో నల్లిన గాదె.

బొట్టము-తె. గోఁచి.

బొట్టియ-తె. 1. బాణపుములికి. 2. కొడుకు. 3. కూఁతురు. రూ. బొట్టె.

బొట్టియఁడు-తె. కొడుకు. రూ. బొట్టెఁడు.

బొట్టు-తె. 1. తిలకము. 2. సున్న. 3. (నీటి) చుక్క. 4. మంగళసూత్రమునఁ గ్రుచ్చుస్వర్ణాభరణము.

బొట్టుగు-తె. తిలకవృక్షము. రూ. బొట్టువు.

బొట్టె-చూ. బొట్టియ. సమా. —కోల-తామరమొగ్గవంటి ములికిగల బాణము.

బొదబొద-తె. కాఱుటయందగు ధ్వని.

బొడిగ-తె. బాకుఁడు.

బొడిప-తె. చెట్లయందలి బుడిపి.

బొడ్డ-తె. అత్తిచెట్టు.

బొడ్డనబావి-తె. నడుమపిల్లనూయిగలకోనేఱు.

బొడ్డు-తె. 1. నాభి. 2. నూతిచుట్టుపెట్టినగోడ. సమా. —ఁజవిక. చుట్టుకొల్లారపునడిమిచావడి. — పుడక-బండినొగకు దిండునకుచేర్చివేయుచీల, బొడ్డుచీల.

బొణిగ-తె. 1. సరకుతోనున్న చేతిసిద్దె. 2. బపొట్టువీడి బద్దలుకాని కాయధాన్యము. 3. బొం

తుపీడని జొన్న. మొ. *4.* పశువు మెడనుగట్టు బొడుకుగంట.
బొత్తాము-అం. గుండీ.రూ.బొత్తాను. **(Button)**
బొత్తిగ-వి. (పూర్తిగ) మొదలంట, ఆమూలము.
బొది-తె. ఓడలుచేసెడు చోటు.
బొద్దు-తె. గోడలులోనగువానియందేర్పఱచుఅంచు.
బొనము-తె. మెఱుగు.
బొప్పఁడు-తె. మూఢుఁడు.
బొప్పి-తె. బుడిపి.
బొబ్బ-తె. *1.* పొక్కు. *2.* సింహనాదము. *3.* పెద్ద అఱపు.సమా. —మెకము-సింగము. బొబ్బాటము-బొబ్బరింత. క్రి. బొబ్బరించు-బొబ్బ వేయు. కృ. బొబ్బరింత.
బొమ-తె. *1.* కనుబొమ. *2.* ప్రతిమ.రూ.బొమ్మ. సమా. —ముడి-కోపముచే కలిగెడు బొమల ముడి, భ్రుకుటి.
బొమిక-తె. ఎముక. రూ. బోఁకె.
బొమికము-తె. కిరీటము. రూ. బొమ్మికము, బొమిడిక, బొమిడికము, బొముడీకము, బొమ్మిడిక ము, బొమ్మిడీకము.
బొమ్మ-తె. *1.* కనుబొమ. *2.* ప్రతిమ. *3.* బిరుద చిహ్నము. *4.* అవమానచిహ్నము. *5.* వి. బ్రహ్మ. సమా. బొమ్మంచు - *1.* బొమ్మలుగల అంచు. *2.* ఎఱుపు. బొమ్మచారి-బ్రహ్మచారి. —చుక్క-అభిజిన్నక్షత్రము. —ముడి-బొమ ముడి. —రాకాసి-బ్రహ్మరక్షస్సు. బొమ్మరిల్లు-బాలికలాడుకొనుట కేర్పఱచిన చిన్నయిల్లు.
బొమ్మఁడు-వి. బ్రాహ్మణుఁడు.
బొమ్మరము-చూ. బొంగరము. క్రి. బొమ్మరవోవు-భ్రమించు.
బొమ్మిడికము-చూ. బొమికము.
బొరిగి-తె. గడ్డిపెల్లగించెడు గుద్దలి, తొల్లిక.
బొఱియ-తె. *1.* రంధ్రము. *2.* బిలము. *3.* గొయ్యి. *4.* ఎండినబొంద్లము. రూ. బొఱ్ఱియ, బొఱ్ఱె. సమా. —చూలి-వాల్మీకి.
బొరుగులు-తె. పేలాలు. రూ. బొరువులు.
బొరుగు-తె. *1.*కణితిమృగము. *2.* వేఁపుడుచట్టి.
బొట్టి-తె. బొజ్జకడుపు.
బొల్లఁడు-తె. బొల్లిగుఱ్ఱము.
బొల్లి-తె. *1.* తెల్లనిది, —వాఁడు. *2.* మోముతో మ్మ తెలుపు. సమా. —గద్ద-గరుత్మంతుఁడు. —మోర మెకము-ఎలుఁగుబంటి.
బొల్లు-తె. *1.* అసత్యమాడు. *2.* కృ. అసత్యము.
బొసిక-తె. టెంకాయ మొ. వాని పైతోలు.
బొసుక-తె. బలిసినది,—వాఁడు.
బొళుకుబొళుకు-తె.క్రక్కుటయందగుననుకరణము.

బో

బోఁకి-తె. *1.* పాత్రము (నిందయందు). *2.* జలగడుగు దోనె.
బోఁకె-చూ. బొమిక.
బోఁటి-తె. వంటి, వంటివాఁడు.
బోగము-వి. (భోగము) *1.* లంజెవెల. *2.* వెల. సమా. బోగమాట-వేశ్యానృత్యము. బోగముది-వేశ్య, వెలయాలు.
బోగి-వి. (భోగి) *1.* సంక్రాంతి పండుగకుముందు దినము. *2.* భోగము కలవాఁడు,—కలది.
బోగు-తె. పూనిక.
బోటి-తె. *1.* ఆఁడుది. *2.* చెలికత్తె. సమా. —కత్తె-చెలికత్తె.
బోటు-తె. *1.* మిక్కిలిపొడవు. *2.* బిస. *3.* సమర్థుఁడు. *4.* ధూర్తుఁడు.
బోడ-తె. *1.* సన్యాసి. *2.* మోడు. *3.* బోడిది. —వాఁడు.
బోడఁడు-తె. బోడివాఁడు.
బోడి-తె. *1.* నున్నగాఁ గొఱిగినతల. *2.* ముండితుఁడు. క్రి. బోడించు. కృ. బోడింపు.
బోడిక-తె. *1.* సేవకుఁడు. *2.* బాలకుఁడు.
బోడు-తె. బోడ, బోడియైనది.
బోణీ-తె. మొట్టమొదట అమ్మినసొమ్ము.
బోద-వి. (పోతము) పక్షిలోనగువానిపిల్ల.
బోదన-వి. (బోధనము) దుర్బోధనము.
బోదియ-తె. *1.* ప్రకాండము. *2.* స్తంభముమీఁది అవయవము. *3.*మిరప మొ. నాటుటకేర్పఱచిన చాళ్లు. [రూ. బోదె.
బోదు-తె. గోము.

బోధము-స. తెలివి. సమా. బోధకరుఁడు-వైతాళికుఁడు. బోధకుఁడు-ఉపాధ్యాయుఁడు. క్రి.బోధించు-కఱపు. బోధపడు-అకళింతకువచ్చు.
బోధనము-స. బోధించుట.
బోధ్యము-స. బోధింపఁదగినది.
బోనము-వి. (భోజనము) ఆహారము. సమా. బోనకత్తె.అన్నముచేసిపెట్టునది.పుం. (బోనకాఁడు.) బోనపుపెట్టె-తోలుకప్పిన గుఱ్ఱనిపెట్టె. క్రి. బోనేయు-భోజనముచేయు.
బోను-తె. 1.మృగాదులను బట్టు కపటయంత్రము. 2. పెంపుడుమృగములను నుంచుపెట్టె. సమా. —పొయ్యి. అటునిటు కొనిపోఁదగిన పొయ్యి.
బోము-తె. బలాత్కారము.
బోయ-తె. 1. కిరాతుఁడు. 2. కైవర్తుఁడు. రూ. బోయఁడు, (స్త్రీ). బోయత, బోయెత.)
బోయి-హిం. పల్లకిమోయువాఁడు. రూ. బోయీ, బోయీఁడు.
బోర-తె. బొమ్మి. క్రి. బోరగిలు-బొమ్మ భూమి నాను. ప్రే. బోరగించు. సమా. —ప్రాఁకుడు-పాము.
బోరన-తె. శీఘ్రముగా.
బోరు-తె. 1.వానకురియుటయందగు ననుకరణము. 2. పెద్ద. సమా. —తలుపులు-నగరులోనగు వాని వాకిటి పెద్ద తెక్కతలుపులు.క్రి.బోరుకలఁగు-మ్రోఁగు. —కొను. —పై—కాడించు.
బోరుకాఁడు-తె. బిడ్డలు స్నానముచేయు.ప్రే.బోరు
బోరువ-తె. (బోరు+వాయి) తెల్లని పెద్దగ్రద్ద.
బోలు-తె. లోపల ఏమియు లేనిది.
బోలెము-తె. వేగము.
బోసి-తె. పండ్లులేనిది (నోరు)
బోళా-తె. కపటములేని.

బౌ

బౌద్ధము-స. బుద్ధుఁడు స్థాపించిన మతము.
బౌద్ధులు-స. బౌద్ధమతస్థులు.

బ్ర

బ్రక్క-చూ. బక్క.
బ్రతుకు-తె. 1. జీవించు. కృ. 2. జీవనము. 3. జీవనోపాయము. రూ. బ్రదుకు. సమా. —ఁదెరువు-జీవనోపాయము.
బ్రదిమి-తె. జీవనము.
బ్రద్ద-తె. 1. తునుక. 2. చీలిక. (రూ.బద్ద.)3. వి. (వేత్రము) పేము. సమా. —పరి-పేఁపకేడెము. రూ. బద్దపరి.—లవారు-వేత్రధరులు.
బ్రద్దర-తె. (బ్రద్ద+అర) 1. తునుక. 2. చీలిక. [రూ. బదర.
బ్రధ్నము-స. వేరు.
బ్రధ్నుఁడు-స. 1. సూర్యుఁడు. (వ్యు. ఇతర తేజస్సులను లేక చీఁకటులను అడ్డగించువాఁడు) 2. శివుఁడు.
బ్రమ-వి. (భ్రమ) భ్రాంతి. రూ. బమ్మెర.
బ్రమయు-వి. భ్రమించు, బమ్మెరవోవు. క్రి. బ్రమరితిరుగు, —వాఱు-చుట్టివచ్చు.
బ్రహ్మ-స. నలువ. (నవబ్రహ్మలు: భృగువు,పులస్త్యుఁడు, పులహుఁడు, అంగిరసుఁడు, అత్రి,క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, మరీచి.) సమా. —చర్యము-మొదటి ఆశ్రమము. —చారి-బ్రహ్మచర్యవ్రతమనుష్ఠించువాఁడు. —బంధువు-1. గుఱింపఁబడువాఁడు. 2.నామమాత్రబ్రాహ్మణుఁడై దూఱఁబడువాఁడు. —బిందువు-వేదపఠనమప్పటినోటితుంపర. —భూయము-బ్రహ్మత్వము. —మేఖలము-బ్రహ్మచారులకు ముంజిగా ఉపయోగపడు తృణము. —యజ్ఞము-వేదపాఠము. —రంధ్రము-నడునెత్తి. —రథము-మృతినొందిన సన్న్యాసులను కొనిపోవు వాహనము. —వాది-వేదాంతి. —సువు-మదనుఁడు. —సూత్రము-యజ్ఞోపవీతము. బ్రహ్మాంజలి-వేదాధ్యయనకాలమందలిమ్రొక్కు. బ్రహ్మారణ్యము-వేదపాఠభూమి. —వర్తము-ఢిల్లీకివాయవ్యభాగముననుండు దేశము.
బ్రహ్మణ్యము-స. బ్రాహ్మణహితము. [తపము.
బ్రహ్మము-స. 1. పరమాత్మ. 2. వేదము. 3

బ్రా

బ్రాఁతి-తె. 1. ప్రేమ. 2. అధికము.3.దుర్లభము
బ్రాహ్మణము-స. 1. బ్రాహ్మణసమూహము. 2 వేదభాగము.
బ్రాహ్మణుఁడు-స. పాఱుఁడు. (వి. బాపనుఁడు)

(స్త్రీ. బ్రాహ్మణి) సమా. బ్రాహ్మణబ్రువుఁడు-
జాతిమాత్రోపజీవియైన బ్రాహ్మణుఁడు. బ్రాహ్మ
ణార్థము-పితృకార్యములందు భోజనమునకుఁ
బోవుట. [బ్రాహ్మణకర్మము.
బ్రాహ్మణ్యము-స. 1. బ్రాహ్మణసమూహము. 2.
బ్రాహ్మము-స. 1. బ్రహ్మసంబంధమైనది. 2. వి
ద్యయు నాచారముగల వరుని పిలిచి వధూవరుల
నలంకరించి కన్యాదానముచేయు వివాహము.
బ్రాహ్మి-స. 1. సరస్వతి. 2. బాఁపనచీమ.

## బ్రు

బ్రుంగు-తె. 1. పూఁడు. 2. మఱుఁగు. 3. ము
నుఁగు. క్రి. —వడు-మగ్నమగు.
బ్రుంగుడు-తె. 1. మఱిఁగినది, 2. మునిఁగినది.
క్రి. —వడు-మఱుఁగుపడు.
బ్రుంచు-తె. బ్రుంగఁజేయు.
బ్రుయ్యు-తె. నశించు.

## భ

భంగము-స. 1. చెఱుపు. 2. అల. 3. అవమాన
ము. క్రి. భంగపడు-అవమానపడు. కృ. భంగ
భంగి-స. విధము. [పాటు. భంగించు-భంగపఱచు.
భంగురము-స. 1. నశించుస్వభావము, 2. వంకరైనది.
భంజకము-స. విఱుచునది.
భంజనము-స. విఱుపు. క్రి. భంజించు-విఱుచు.
భంజళి-స. పామువలె వంకరగాపోవు అశ్వగతి.
రూ. భంజళిక. [భండించు-బండాటలాడు.
భండనము-స. 1. యుద్ధము. 2. దుశ్చేష్ట. క్రి.
భండారము-స. బొక్కసము.
భండుఁడు-స. దుశ్చేష్టుఁడు.
భంబు-స. 1. నక్షత్రము 2. ఆకాశము.
భక్తము-స. 1. అన్నము. 2. భాగింపఁబడినది.
భక్తి-స. 1. సేవ. 2. భయముతోఁగూడిన స్నేహ
భక్తుఁడు-స. భక్తిగలవాఁడు. [ము. 3. భాగము.
భక్షకుఁడు-స. తిండిపోతు.
భక్షణము-స. తిండి. క్రి. భక్షించు.
భక్ష్యము-స. భక్షణీయము, తినుబండము. (పంచ
భక్ష్యములు: భక్ష్యము, భోజ్యము, లేహ్యము,
చోష్యము, పానీయము.)
భగము-స. 1. ఆఁడుగుఱి. 2. సమగ్రమైన ఐశ్వ
ర్యము, జ్ఞానము, వైరాగ్యము, కీర్తి, మహత్త్వ
ము, వీర్యము అను ఆఱింటికూటమి. (ఇవి కలి
వాఁడు భగవంతుఁడు.) 3. సౌందర్యము.
భగవంతుఁడు-స. (చూ—పై—రూ. భగవానుఁ
డు.) 1. విష్ణువు. 2. శివుఁడు. 3. బుద్ధుఁడు.
4. పూజ్యుఁడు.
భగవతి-స. 1. సరస్వతి. 2. పార్వతి. 2. గంగ.
భగిని-స. సోదరి.
భగ్నము-స. భంగము నొందినది. [భజించు.
భజనము-స. 1. సేవించుట. 2. భాగించుట. క్రి.
భజమానము-స. 1. సేవించునది. 2. భాగించునది.
భజిష్యము-స. 1. సేవింపఁదగినది, 2. భాగింపఁ
భటుఁడు-స. 1. కాలిబంటు. 2. సేవకుఁడు. [దగినది.
భట్టారకుఁడు-స. 1. సూర్యుఁడు. 2. ముని. 3.
(నాట్య) రాజు. 4. సూత్రధారుఁడు.
భట్టిని-స. 1. (నాట్య.) రాజుభార్య. 2. బ్రాహ్మ
భట్టుఁడు-స. బట్టువాఁడు. [ణుని భార్య.
భద్రము-స. 1. శుభము. 2. బంగారు. 3. మేలి
జాతి ఏనుఁగు. సమా. —కుంభము-రాజద్వార
మున నుంచిన జలపూర్ణమైన స్వర్ణకలశము.—
శ్రీ-చందనము. భద్రాకరణము-క్షౌరము. —
భయము-స. వెఱపు. [సనము-రాజపీఠము.
భయానకము-స. 1. ఒక రసము. 2. పులి.
భరటుఁడు-స. 1. కూలివాఁడు. 2. కుమ్మరి.
భరణము-స. 1. భరించుట. 2. కూలి. 3. జీతము.
భరణి-స. రెండవ నక్షత్రము.
భరణ్యము-స. 1. కూలి. 2. జీతము.
భరద్వాజము-స. ఏట్రింత పక్షి.
భరము-స. 1. అతిశయము, 2. భారము. 3. బా
రువ. క్రి. భరించు-1. మోచు. 2. పోషించు.
భర్గుఁడు-స. శివుఁడు. (వ్యు. కామకాలాదులను
కాలపాకము పొందించినవాఁడు.) [వేఁచు.
భర్జనము-స. 1. వేఁచుట. 2. ధ్వంసము. క్రి. భర్జించు-
భర్త-స. 1. మగఁడు. 2. పోషించువాఁడు. సమా.
భర్తృదారకుఁడు-(నాట్య) యువరాజు. —
రిక-(నాట్య.) రాజుకూఁతురు.

భర్త్సనము-స. బెదరింపుమాట, గద్దింపు.
భర్మము-స. 1. బంగారు. 2. జీతము.
భల్లము-స. 1. బల్లెము. 2. ఎలుఁగుగొడ్డు.
భల్లాతకి-స. జీడిమామిను.
భల్లారే-హిం. బళిరే. [2. కోఁతి.
భల్లుకము-స. 1. ఎలుఁగుబంటి. రూ. భల్లూకము.
భవదీయము-స. నీది.
భవనము-స. ఇల్లు. [ప్తి. 4. శుభము. 5. సత్త.
భవము-స. 1. పుట్టుక. 2. సంసారము. 3. ప్రాప్తి
భవాదృశుఁడు-స. నీవంటివాఁడు.
భవాని-స. పార్వతి. (వ్యు. భవుని భార్య.)
భవికము-స. శుభము. [దగినది.
భవితవ్యము-స. 1. భాగ్యము. 2. శుభము. 3. కాఁ
భవిష్యత్తు-స. కాఁగలది. [గలది.
భవిష్యము-స. 1. భాగ్యము. 2. శుభము. 3. కాఁ
భవుఁడు-స. శివుఁడు. (స్త్రీ. భవాని) (వ్యు. అం
భవ్య-స. పార్వతి. [తయు తాన యగువాఁడు)
భవ్యము-స. 1. శుభము. 2. యోగ్యమైనది.
భషకము-స. కుక్క.
భషణము-స. కుక్క మొఱుగు.
భసలము-స. తుమ్మెద.
భస్త్ర-స. కొలిమితిత్తి. రూ. భస్త్రి. [చేయు.
భస్మము-స. బూడిద. క్రి. భస్మీకరించు-బూడిద

## భా

భా (స్)-స. సూర్యకిరణము. క్రి. భాసిల్లు-ప్రకా
శించు. సమా. భాసమానము-ప్రకాశించుచున్న
ది. భాస్కరుఁడు, భాస్వంతుఁడు, భాస్వరుఁడు-
సూర్యుఁడు.
భాండము-స, 1. తొడవు. 2. మట్టిపాత్రము. 3.
వస్తువు. 4. మొదలిసొమ్ము. సమా. భాండాగా
రము-బొక్కసము.
భాగధేయము-స. 1. భాగ్యము. 2. కప్పము. [పంచు.
భాగము-స. 1. పాలు. 2. భాగ్యము. క్రి. భాగించు-
భాగినేయుఁడు-స. భగినీపుత్త్రుఁడు, మేనల్లుఁడు.
భాగీరథి-స. గంగ. (వ్యు. భగీరథునిచే భూమికి తేఁ
బడినది.) [భాగింపఁదగినది.
భాగ్యము-స. 1. అదృష్టము. 2. సుకృతము. 3.
భాజనము-స. 1. పాత్రము. 2. యోగ్యము.
భాటకము-స. బాడుగ.
భాతి-స. 1. కాంతి. 2. విధము.
భాద్రపద-స. ఉత్తరభాద్రపదా నక్షత్రము.
భాద్రపదము-స. ఆఱవమాసము.
భానువు-స. 1. సూర్యకిరణము. 2. సూర్యుఁడు.
రూ. భానుఁడు. (వ్యు. తేజస్సుకలవాఁడు.)
సమా. భానుమంతుఁడు-సూర్యుఁడు.
భామ-స. ఆఁడుది.
భామము-స. 1. కోపము. 2. సూర్యకిరణము.
భాముఁడు-స. సూర్యుఁడు.
భామిని-స. ఆఁడుది.
భారకుఁడు-స. బరువుమోయు కూలివాఁడు.
భారతము-స. 1. భరతవంశరాజుల (పాండవుల) చరి
త్రము. 2. సేతుశీతాచల మధ్యదేశము, భరత
ఖండము. [చే భూమికి తేఁబడినది.) 2. వాక్కు.
భారతి-స. 1. సరస్వతి. (వ్యు. భరతుఁడను ముని
భారద్వాజము-స. ఏట్రింత.
భారము-స. 1. బరువు. 2. భారువ, సమా. భార
యష్టి-కావడిబద్ద. —వాహుఁడు-భారకుఁడు.
భార్గవి-స. 1. లక్ష్మి. 2. పార్వతి.
భార్గవుఁడు-స. 1. శుక్రుఁడు. 2. పరశురాముఁడు.
(వ్యు. భృగునివంశమువాఁడు.)
భార్య-స. పెండ్లాము. (వ్యు. భరింపఁదగినది.) సమా.
భార్యాటికుఁడు - భార్యమాట జవదాటనివాఁడు.
భావ-స. ఎనిమిదవ సంవత్సరము.
భావము-స. 1. సత్తు. 2. మనోవికారము. 3. అభి
ప్రాయము. 4. పుట్టుక. 5. ధాత్వర్థరూపక్రియ.
6. స్వభావము. సమా. భావజుఁడు-మన్మథుఁడు.
క్రి. భావించు-తలఁచు.
భావన-స. 1. తలఁపు. 2. వాసనకట్టుట.
భావి-స. కాఁగలది, భవిష్యత్తు.
భావితము-స. 1. పొందఁబడినది. 2. వాసనకట్టినది.
భావిని-స. ఆఁడుది.
భావుకము-స. శుభము. రూ. భవికము.
భావుకుఁడు-స. తోడఁబుట్టినదాని మగఁడు, బావ.
భావ్యము-స. అవశ్యము కాఁదగినది.
భాష-స. 1. వ్యవహారయోగ్యమైన వాక్యాది. 2.

పాట. 3. ప్రతిజ్ఞ. 4. ప్రమాణము. క్రి. భాషించు-మాటాడు. (వి. బాస.)
భాషణము-స. మాటాడుట.
భాషితము-స. 1. మాట. 2. మాటాడినది.
భాష్యము-స. సూత్ర వ్యాఖ్యాన గ్రంథము.
భాసురము-స. 1. పటికరాయి. 2. ప్రకాశించునది.
భాస్కరుఁడు-చూ. భా.

## భి

భిందిపాలము-స. విసరివేయు గుదియ. రూ. బిండిపాలము. [రూ. భిక్షము. క్రి. భిక్షించు.
భిక్ష-స. 1. బిచ్చము. 2. బిచ్చమెత్తిన వస్తువు.
భిక్షుకుఁడు-స. భిక్షమెత్తి జీవించు సన్న్యాసి.
భిక్షువు-స. 1. బ్రహ్మచారి. 2. సన్న్యాసి.
భిత్తము-స. తునుక.
భిత్తి-స. 1. భేదనము. 2. గోడ. 3. జుత్తిలి.
భిత్తిక-స. 1. పిడుగు. 2. గోడ.
భిద-స. 1. భేదము. 2. భేదనము.
భిదురము-స. వజ్రాయుధము. (వ్యు. శత్రుసైన్యమును భేదించునది.) [పడినది.
భిన్నము-స. 1. పగిలినది. 2. చీలినది. 3. వేఱు
భిల్లుఁడు-స. బోయవాఁడు.
భిషక్కు-స. వైద్యుఁడు.
భిస్స-స. అన్నము.
భిస్సట-స. మాఁడన్నము.

## భీ

భీ-స. భయము. సమా. భీకరము-భయంకరము.
భీతము-స. 1. వెఱపు. 2. వెఱచినది.
భీతి-స. 1. వెఱపు. 2. వడఁకు. క్రి. భీతిల్లు.
భీమము-స. భయానకరసము. [3. భయంకరుఁడు.
భీముఁడు-స. 1. ధర్మరాజుతమ్ముఁడు. 2. శివుఁడు.
భీరుకుఁడు-స. వెఱపరి. రూ. భీలుకుఁడు.
భీరువు-స. 1. వెఱపరియగు ఆఁడుది. 2. వెఱపరి.
భీషణము-స. భయానకరసము.
భీష్మము-స. —పై.— క్రి. భీష్మించు-1. పట్టుపట్టుకొనియుండు. 2. మోపించుకొనియుండు.
భీష్ముఁడు-స. 1. శంతనుపుత్త్రుఁడు. 2. శివుఁడు.
3. భయంకరుఁడు.

## భు

భుక్కు-స. భుజించునది.—వాఁడు. [బడినది.
భుక్తము-స. 1. అనుభవింపఁబడినది. 2. భుజింపఁ
భుక్తి-స. 1. భోజనము. 2. అనుభవము.
భుగ్నము-స. 1. వంగినది. 2. విఱిగినది.
భుజ, భుజము-స. చేయి. సమా. భుజకీర్తి-బాహుపురి, అంగదము. —శిరస్సు-మూఁపు. భుజాంతరము-ఱొమ్ము.
భుజంగమము-స. పాము. రూ. భుజంగము, భుజగము. (వ్యు. కుటిలముగాఁ బోవునది.)
భుజంగుఁడు-స. విటుఁడు.
భుజించు-స. 1. తిను. 2. అనుభవించు.
భుజిష్య-స. 1.పరిచారిక. 2.వేశ్య. [తంత్రుఁడు.
భుజిష్యుఁడు-స. 1. పరిచారకుఁడు. 2. స్వ
భువనము-స. 1. జగము. 2. ఉదకము. 3. ఆకాశము. సమా. భువనేశ్వరము-చుట్టుబవంతి.
భువి-స. 1. భూమి. 2. స్థానము.

## భూ

భూ-స. భూమి. సమా. —గృహము. నేలమాలె. —జము-చెట్టు. —జాని-1. విష్ణువు. 2. రాజు. —దారము-పంది. —దేవుఁడు - నేలవేలుపు. —ధరము-కొండ. —పతి-రాజు. రూ. భూపుఁడు. —భుజుఁడు-రాజు. —భృత్తు-1. రాజు. 2. కొండ. —వరుఁడు-రాజు. —సురుఁడు-నేలవేలుపు.
భూకము-స. బొక్క. 
భూతము-స. 1. పృథివ్యాది. (ఇవి అయిదు: పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము) 2. పిశాచాది. 3. ప్రాణి. 4. కృష్ణచతుర్దశి. 5. కడచినది. 6. (ఉత్తరపదమైనచో) సమానమైనది. సమా. భూతధాత్రి-భూమి. —యజ్ఞము-భూతబలి, ప్రాణులకాహారమిడుట. భూతాత్మము-దేహము. భూతేశుఁడు-శివుఁడు.
భూతి-స. 1. ఐశ్వర్యము. 2. సంపద. 3. భస్మము. (వి. బూది) 4. పుట్టుక.
భూమి-స. 1. నేల. 2. చోటు. సమా. —జ-సీత.

—జుఁడు-1. అంగారకుఁడు. 2. నరకాసురుఁడు.
భూమిక-స. 1. మాఱువేషము. 2. రచన. —స్పృశుఁడు-1. కోమటి. 2. మనుష్యుఁడు.
భూయస్సు-స. అధికము.
భూయిష్ఠము-స. మిక్కుటము.
భూరి-స. 1. బంగారు. 2. అధికము.
భూరిమాయువు-స. నక్క. రూ. భూరిమాయము.
భూష-స. తొడవు. [(వ్యు. పెక్కుమాయలుకలది.)
భూషణము-స. 1. అలంకరణము. 2. తొడవు.
భూషించు-స. స్తుతించు.
భూషితుఁడు-స. అలంకరింపఁబడినవాఁడు.

## భృ

భృంగము-స. తుమ్మెద. (వ్యు. నలుపును భరించునది.) సమా. భృంగరాజము-1. గండుతుమ్మెద. 2. గుంటగలిజేరు. [గిండి.
భృంగారము-స. 1. గుంటగలిజేరు. 2. బంగారు
భృంగి-స. ఒక శివభృత్యుఁడు. [డు. 4. శివుఁడు.
భృగువు-స. 1. కొండచఱియ. 2. ఒకఋషి. 3. శుక్రుఁ
భృతము-స. 1. భరింపఁబడినది. 2. నింపఁబడినది.
భృతి-స. 1. మోచుట. 2. కూలి. 3. వెల.
భృత్య-స. కూలి.
భృత్యుఁడు-స. పనివాఁడు.
భృశము-స. అధికము.
భృష్టము-స. వేఁచఁబడినది.
భృష్టి-స. 1. వేఁపుడు. 2. పాడడవి.

## భే

భేకము-స. 1. కప్ప. 2. మేఘము. (భేకి-ఆఁడు కప్ప.) (వ్యు. సర్పమువలన భయమునొందు
భేదకుఁడు-స. భేదించువాఁడు. [నది.)
భేదనము-స. భేదించుట. క్రి. భేదిల్లు-1. చీలు. 2. వేఱగు. ప్రే. భేదించు.
భేదము-స. 1. భేదనము. 2. వేఱిమి. 3. విశేషము.
భేద్యము-స. భేదింపఁదగినది.
భేరి-స. దుందుభి.
భేరుండము-స. ఒకానొక పక్షి. [చువాఁడు.
భేలుఁడు-స. 1. మూర్ఖుఁడు. 2. పిఱికి. 3. చలిం
భేషజము-స. మందు.

## భై

భైక్షము-స. భిక్షాసమూహము.
భైరవము-స. భయానకరసము.
భైరవి-స. పార్వతి.
భైరవుఁడు-స. శివుఁడు.
భైషజ్యము-స. మందు.

## భో

భోక్త-స. 1. భుజించువాఁడు. 2. అనుభవించువాఁడు.
భోక్తవ్యము-స. 1. భుజింపఁదగినది. 2. అనుభవింపఁదగినది.
భోగము-స. 1. సుఖము. 2. భోజనము. 3. పాముపడగ. 4. ధనము. 5. వేశ్యాదులకిచ్చువెల. (అష్టభోగములు). గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము.) క్రి. భోగించు. 1. సుఖించు. 2. అనుభవించు. సమా. భోగగృహము. పడకటిల్లు.
భోగవతి-స. పాతాళము. 2. పాతాళమునందలి యేఱు. 3. భోగముగలది. [సుకవాసి.
భోగి-స. 1. పాము. 2. రాజు. 3. మంగలి. 4.
భోగిని-స. 1. ఆఁడుపాము. 2. బోగముది. 3. పట్టాభిషిక్తురాలు కాని రాజుభార్య. [దగినది.
భోగ్యము-స. 1. ధనము. 2. ధాన్యము. 3. భోగింపఁ
భోజనము-స. ఆహారము.
భోజ్యము-స. భుజింపఁదగినది.
భోషాణము-తె. పెద్దపెట్టె.

## భౌ

భౌతికము-స. 1. ముత్తెము. 2. భూతసంబంధమైనది. [డు. (వ్యు. భూమికొడుకు.)
భౌముఁడు-స. 1. అంగారకుఁడు. 2. నరకాసురుఁ
భౌరికుఁడు-స. బంగారునాణెపుబండారమునకధికారి.

## భ్ర

భ్రంశము-స. 1. చలించుట. 2. జాఱుట.
భ్రకుంసుఁడు-స. స్త్రీవేషమువేసికొని ఆడెడు పురు

ఘుఁడు. రూ. భ్రుకుంసుఁడు.
భ్రకుటి-చూ. భ్రుకుటి.
భ్రక్షము-స. తనతప్పును మఱుఁగుపుచ్చుట.
భ్రమణము-స. 1. తిరుగుడు. 2. తుమ్మెద.
భ్రమము-స. 1. భ్రాంతి. 2. తిరుగుడు. 3. నీటి తూము. క్రి. భ్రమించు, భ్రమరించు-తిరుగు.
భ్రమరకము-స. 1. తుమ్మెద. 2. బొంగరము. 3. ముంగురులు. [కదలుచుండునది.)
భ్రమరము-స. 1.తుమ్మెద. 2.ముంగురులు.(వ్యు.
భ్రమి-స. తిరుగుడు.
భ్రష్టము-స. జాఱినది.
భ్రష్టుఁడు-స. వెలివేయఁబడినవాఁడు. రూ. భ్రష్టు.

## భ్రా

భ్రాంతము-స. భ్రాంతినొందినది.
భ్రాంతి-స. 1. మిథ్యామతి. (ఉన్నది లేనట్టు లేనిది ఉన్నట్టు తలఁచుట) 2. భ్రమణము.
భ్రాజితము-స. ప్రకాశము నొందినది.
భ్రాజిష్ణువు-స. ప్రకాశించువాఁడు.
భ్రాత-స. తోడఁబుట్టినవాఁడు. [భ్రాత్రీయుఁడు,
భ్రాతృవ్యుఁడు-స. తోడఁబుట్టినవాని కొడుకు. రూ.
భ్రామరము-స. భ్రమరములుకూర్చిన తేనె.
భ్రాష్ట్రము-స. వేఁపుడుచట్టి, మంగలము.

## భ్రు, భ్రూ

భ్రుకుంసుఁడు-చూ. భ్రకుంసుఁడు.రూ. భ్రూకుంసుఁ
భ్రుకుటి-స.బొమముడి.రూ.భ్రూకుటి, భ్రకుటి. [డు.
భ్రూణ-స. చూలాలు.
భ్రూణము-స. 1. గర్భము. 2. బిడ్డ. [ముడి.
భ్రూవు-స. కనుబొమ. సమా. భ్రూభంగము-బొమ

## మ

మంకు-తె. 1. మొండి. 2. మూర్ఖుఁడు.
మంకెన-తె. బంధూకవృక్షము. [—రూపు-కృత్తిక.
మంగల-తె. క్షౌరకజాతి. సమా. —కత్తి-క్షురము.
మంగలము-తె. వేఁపుడుచట్టి.
మంగలి-తె. మంగలవాఁడు. రూ. మంగి. సమా. —కోళ్లు-సన్నాయి. —పని-క్షౌరము.
మంగళ-స. పార్వతి.
మంగళము-స. 1. శుభము. 2. క్షేమము. సమా. మంగళసూత్రము-బొట్టుదారము. మంగళాశాసనము-దీవన. మంగళహారతి-వి. (మంగళారాత్రిక) మంగళకరమైన హారతి. రూ. మంగళారతి.
మంగళుఁడు-స. అంగారకుఁడు. సమా. మంగళవారము-వారములో మూఁడవదినము.
మంగు-తె. 1. మాలిన్యము. 2. మొగమునందు పుట్టు నల్లనిపొడ. రూ. మాఁగు, మంగుడు.
మంచము-స.1.మంచము.2.మంచె. [మాఁగుఁడు.
మంచము-వి. పర్యంకము.
మంచి-తె. 1. మేలు. 2. యోగ్యము. సమా. —గందము-శ్రీచందనము —నీళ్లు-పానయోగ్యమగుజలము. —నూనె-నూవులనూనె. —పాము-త్రాఁచు. —బెల్లము-చెఱకుబెల్లము. —ముత్తము-అకృత్రిమమైనముత్తెము. —వాఁడు-ఉత్తముఁడు.
మంచియ-వి.(మంచము)చేలలోకూర్చుండుట కెత్తుగా వేయు చప్పరమువంటి పందిరి. రూ.మంచె.
మంచు-తె. 1. మనుచు. 2.హిమము. సమా. —కొండ-హిమవంతము —తఱి-హేమంతము.
మంజన-వి. (మంజూష) పెట్టె. రూ. మందన, మందసము. [చెట్టు. 3.ముత్తెము. 4.పూగుత్తి.
మంజరి-స. 1. చిగిర్చినలేఁగొమ్మ. 2. తొట్టుగు
మంజిడి-వి. (మాంజిష్ఠము) 1. చిత్రవర్ణవస్త్రము. 2. నీలవస్త్రము.
మంజిమ-స. మనోజ్ఞము. రూ. మంజిమము.
మంజిష్ఠ-స. మిక్కిలిప్రకాశించు ఎఱుపు.రూ.మాంజిష్ఠము. సమా. మంజిష్ఠారాగము. లోను వెలిని వీడకుండు గాఢానురాగము. [మ్రోయునది.)
మంజీరము-స. అందె. (వ్యు. మనోహరముగా
మంజులము-స. 1. పాఁచి. 2. పొదరిల్లు. 3.ఒప్పి
మంజువు-స. మనోజ్ఞమైనది. [దమైనది.
మంజూష-స. పెట్టె. (వి. మంజన, మందసము)
మంట-తె. 1. జ్వాలి. 2. కోపము. 3. చుఱుకుమను నొప్పి. సమా. —మారి-1. జ్వలనశీలుఁ
మంటపము-వి. మండపము. [డు. 2.కోపశీలుఁడు.
మండ-తె. 1. శాఖ. 2. ఉపశాఖ. 3. చీలమండ.

మండనము-స. భూషణము.
మండపము-స. 1. చుట్టును నడుమను మఱుఁగు లేక స్తంభములు నిలిపికట్టిన కట్టడము, చవిక. [2. చావడి.
మండపి-స. చిన్న మండపము.
మండము-స. 1. గంజి. 2. భూషణము.
మండలము-స. 1. పరివేషము. 2. దేశము. 3. విలుకాఁడు రెండు కాళ్లతో మండలాకారముగా నిలుచుట. 4. సమూహము. 5. సూర్యచంద్రుల బింబము. సమా. మండలేశ్వరుఁడు-అధీశ్వర సార్వభౌములకంటె నితరుఁడైన రాజు.
మండలాగ్రము-స. కత్తి. (వ్యు. మండలాకారమైన కొనగలది.) [ర్యుఁడు.
మండలి-స. 1. సమూహము. 2. పాము. 3. సూ
మండాడు-తె. దైన్యముతో యాచించు. కృ. మండాటము.
మండి-తె. 1. ఒక కాలు నేల మోఁకరించుట. 2. సరకులు మొత్తముగా విక్రయించుచోటు. రూ.
మండితుఁడు-స. అలంకరింపఁబడినవాఁడు. [మండీ.
మండు-తె. 1. జ్వలించు. 2. కోపించు. 3. చుఱుకుమని నొచ్చు. 4. ఈర్ష్యాదులచే తపించు. కృ. మంట. సమా. —నెల-వసంతఋతువు.
మండువా-హిం. పాక.
మండూకము-స. కప్ప. రూ. మండుకము.
మండూరము-స. 1. ఇనుపచిట్టెము. 2. చిట్టెముతో చేసిన సిందూరము.
మండె-తె. పొగాకు. మొ. మ్రగ్గుటకై పైన కప్పియుంచిన ప్రోగు. రూ. మండియ.
మండెము-వి. (మండలము) మండలాధిపతుల భూమండలము. రూ. మాఁడెము.
మండ్రగబ్బ-తె. పెద్ద నల్లతేలు, షడ్బిందువు.
మండ్రాడు-తె. సంతాపించు. కృ. మండ్రాటము.
మంతనము-వి. (మంత్రణము) 1. ఆలోచన. 2. ఏకాంతము. 3. రహస్యము.
మంతరము-వి. (మంత్రము) 1. ప్రసవోపాయము. 2. జాలవిద్య. రూ. మంత్రము. సమా. మంతరసాని-సుఖముగా ప్రసవింప నుపాయముచేయు చికిత్సకురాలు. క్రి. మంతిరించు-మంత్రము వేయు. రూ. మంత్రించు.
మంతవ్యుఁడు-స. ఆలోచింపఁదగినవాఁడు.
మంతిరి-వి. మంత్రి.
మంతు-తె. ప్రసిద్ధి. వి. 1. మంత్రి. 2. చదరంగమందు మంత్రిగానుంచుకొన్న కాయ. 3. మంత్రము.
మంతువు-స. 1. తెలివి. 2. అపరాధము. 3. మనుజుఁడు. 4. రాజు.
మంత్రణము-స. రహస్యాలోచనము. రూ. మంత్రణ.
మంత్రము-వి. చూ. మంతరము. సమా. మంత్రకాఁడు-1. జాలవిద్య నెఱిఁగినవాఁడు. 2. మంత్రమువేయువాఁడు. స. 1. గాయత్రిలోనగునది. 2. రహస్యము. సమా. మంత్రవాది - మాంత్రికుఁడు. మంత్రాంగము-మంత్రిత్వము.
మంత్రి-స. 1. బుద్ధిసహాయుఁడు. 2. సహాయుఁడు.
మంథనము-స. 1. త్రచ్చుట. 2. కవ్వము.
మంథని-స. తరికడవ.
మంథము-స. 1. కవ్వము. 2. అంబలి. 3. వధము. సమా. మంథదండము-కవ్వము. —రజ్జువు-తరిత్రాడు. మంథాద్రి-కవ్వపుఁగొండ. (ఇట్లు మంథశైలము. మొ.)
మంథరము-స. 1. కవ్వము. 2. చొరవలేనిది. 3. మెల్లగాఁ బోవునది. 4. వంకరైనది.
మంథానము-స. కవ్వము.
మంద-తె. 1. ఊరివెలుపల పసులుండుచోటు. 2. పశుసమూహము. 3. గొల్లపల్లె. సమా. —ప్రోయాలు-గొల్లత. [దటిల్లు-అడఁగు.
మందట-తె. 1. సమీపము. 2. అడఁకువ. క్రి. మం
మందడి-తె. గొల్లవాఁడు. వి. (మందుర) గుఱ్ఱపుసాల. మందడీఁడు-గుఱ్ఱపువాఁడు.
మందము-తె. 1. దట్టము. 2. స్థూలము. స. 1. ఒకతెగయేనుఁగు. 2. చొరవలేనిది. 3. మెల్లనిది. సమా. మందగామి-మెల్లఁగానడచువాఁడు. —హాసము-చిఱునవ్వు. మందాక్షము-సిగ్గు. మందోష్ణము-ఇంచుకయుష్ణము. క్రి. మందగించు-1. మందమగు. 2. మెల్లనగు. మందీభవించు-మందమగు. [ము. 3. అలసము. 4. బహుళము.
మందరము-స. 1. కవ్వపుఁగొండ. 2. మందార
మందల-తె. 1. మేర, విధము. 2. మనుదల, జీవము. 3. సమీపము.

మందలించు-తె. 1. చెప్పు. 2. ఆజ్ఞాపించు, 3. మనవిచేయు. 4. హెచ్చరించు. 5. తలఁచు. కృ. మందలింపు. [రము.
మందలింపు-తె. 1. మందలించుట. 2. వ్యవహా
మందస-చూ. మంజస. రూ. మందసము.
మందాకిని-స. 1. గంగ. 2, అఱువదేండ్లఆఁడుది.
మందారము-స. 1. మేఘావరణము, 2.ఒక కల్ప వృక్షము. రూ. మందరము. [3. కాల్బలము.
మంది-తె. 1. జనసమూహము, 2. పరిజనము.
మందిరము-స.1.ఇల్లు.2.పట్టణము.3.సముద్రము.
మందు-స. 1. ఔషధము. 2. ఉపాయము. 3. దుర్లభము, సమా. —మల-ద్రోణపర్వతము.
మందుఁడు-స 1. శని. 2. చొరవలేనివాఁడు. 3. అల్పుఁడు. 4. నిర్భాగ్యుఁడు. 5. మూర్ఖుఁడు. సమా. మందవారము-శనివారము.
మందుర-స. 1. లాయము. 2. పడక.
మందురకుఁడు-స. గుఱ్ఱపువాఁడు. [హము.
మందెమేలము-తె. 1. ఉపేక్ష. 2. చనవు. 3.స్నే
మంద్రము-స. గంభీరమైనది. (స్వరము)
మంపు-తె. 1. మత్తు. 2. మైకము. క్రి. మంపిల్లు, మంపుగొను-మత్తిల్లు.
మంబరము-తె.దహనము.క్రి.—సేయు-దహించు.
మకరందము-స. పూఁదేనె.
మకరతము-చూ. మరకతము.
మకరము-స. 1. మొసలి. 2. ఒకనిధి. 3. ఒక రాశి. సమా. మకరకుండలము-మొసలి మొగమే ర్పడఁజేసిన పురుషుని కర్ణభూషణము. —తోర ణము-మొసలిరూపుగల తోరణము. —ధ్వజుఁ డు-మదనుఁడు. (ఇట్లుమకరాంకుఁడు, —కేత నుఁడు. మొ.) మకరాలయము-సముద్రము.
మకరిక-స. స్త్రీలకు చెక్కిళ్లపై లత్తుకతో వ్రాయు మకరరూపమగు రేఖ, మకరికాపత్రము.
మకాము-హిం. ప్రయాణమందు నిలుచు స్థలము.
మకిల-తె.1.మురికి. 2.నలుపు. రూ.మయిల,మైల.
మకుటము-స. కిరీటము. రూ. ముకుటము.
మకురము-స. 1. అద్దము. రూ. ముకురము. 2. కుమ్మరిసారె త్రిప్పు కఱ్ఱ.
మకురు-తె. 1. మూర్ఖుఁడు. 2. మొండి.
మక్కళించు-తె. 1. తిరుగుకొను. 2. సరిపడు.3. సరిపోలు. ప్రే. మక్కళించు.
మక్కి-తె. నిస్సారము.
మక్కు-తె. 1. కాంతిహీనము. 2. నవయు. 3. చచ్చు. 4. మాలిన్యము. 5.కత్తులు లోనగువాని పల్లము మెత్తుటకు వజ్రముతోచేర్చి మర్దించిన అంపపుపొడి. రూ. మ్రక్కు.
మక్కువ-తె. ప్రేమ.
మక్కెర-తె. ఎరువున్నగునవితోలుటకుబండిలో వేయు వెదురుబద్దలతో అల్లిన తడక.
మక్కెలు-తె. ఎముకలు.
మక్షిక-స. ఈఁగ.
మఖము-స. జన్నము. రూ. మఘము.
మగ-తె. పుంస్త్వము.
మగఁటిమి-తె. 1. పౌరుషము. 2. శౌర్యము.
మగఁడు-తె. 1. పురుషుఁడు. 2. పెనిమిటి. 3. రాజు. 4. శూరుఁడు. సమా. మగచెయ్వులు-సురతము. (ఇట్లుమగపోడుములు. మొ.) మగ నాలు-పతిపత్ని. —పోడి-1. శౌర్యము. 2. ఉపరతి. —మానికపువాలు-వజ్రాయుధము.— మానికము-వజ్రము. —తాయి.—పై.— — తాతివాలు-వజ్రాయుధము. —లాగు-ఉపరతి. —వాఁడు-1. పురుషుఁడు. 2. శూరుఁడు.
మగధుఁడు-స. వంశావళిచదువువాఁడు. రూ. మాగ
మగుడు-తె. మరలు. [ధుఁడు.
మగులు-తె.గోడమీఁదికప్పు.రూ.మదురు,మదులు.
మగువ-తె. ఆఁడుది.
మగ్గము-తె. గుడ్డలునేయు యంత్రము.
మగ్గరి-తె. (మగ్గము+అరి) సాలెవాఁడు.
మగ్గు-తె. ఉక్కచే చెమ్మగిల్లి చెడు. కృ.మగ్గుడు.
మగ్నము-స. మునిఁగినది.
మఘ-స. పదియవ నక్షత్రము.
మఘము-చూ. మఖము. [మఖవుఁడు.
మఘవంతుఁడు-స. ఇంద్రుఁడు. రూ. మఘవుఁడు,
మచర్చిక-స. ప్రశస్తవాచకము, మతల్లిక.
మచ్చ-తె. 1. పుట్టుకతో ఒడలియందుఁ గలిగిన చుక్క. 2. గాయపుగుఱుతు. క్రి. —మాయు-
మచ్చము-తె. గుఱుతు. [నశించు.

మచ్చరము-వి. (మాత్సర్యము) 1. చలము. 2. ద్వేషము. 3. పోటీ. రూ. మచ్చరికము. క్రి. మచ్చరించు, మచ్చరికించు. [రీఁడు.
మచ్చరి-వి. 1. చలపాది. 2. ద్వేషి. రూ. మచ్చ
మచ్చిక-తె. 1. మోహము. 2. ఆసక్తి. రూ. మచ్చిగ. క్రి. —పడు-1. మరగు. 2. మరులుకొను.
మచ్చు-తె. 1. మీఁదకట్టడములేని మిద్దెటిల్లు. 2. చొక్కపొడి. 3. ప్రలోభనము. 4. వన్నెనమ్మికకై యుంచుకొను బంగారు కమ్మి. సమా. —కత్తి-కొమ్మలు నఱకు మోటకత్తి.
మచ్చెము-వి. (మచ్ఛము) చేఁప. సమా. మచ్చెకంటి-1. చేఁపవంటి కన్నులుగల ఆఁడుది. 2.
మచ్ఛము-స. చేఁప. రూ. మత్స్యము. [ఆఁడుది.
మజ-హిం. ప్రశంసార్థకము. రూ. మజా, మజ్జ, మజ్జా, మజ్జరె, మజ్జారె.
మజ్జ-స. 1. చెట్టుచేవ. 2. ఎముకలలోని నేయి.
మజ్జనము-స. మునుక, స్నానము.
మజ్జిగ-వి. (మార్జిక) చల్ల.
మటమట-తె. మలమల.
మటిక-తె. గోరుచిక్కుడు. రూ. మట్టిక.
మటుమాయము-తె. (మాయము+మాయము) మిక్కిలిమాయము. సమా. మటుమాయలాఁడు-మిక్కిలి మాయలుగలవాఁడు. (స్త్రీ. మటుమాయలాఁడి.) [నగువాని తోఁక.
మట్ట-తె. 1. తాటి లోనగువాని కొమ్మ. 2. అవులో
మట్టమధ్యాహ్నము. (మిశ్ర.) పట్టపగలు.
మట్టము-తె. 1. కొంచెము. 2. పొట్టి. 3. సమము. సమా. మట్టపలక-మట్టముచూచుపలక. క్రి. మట్టగించు-1. తగ్గించు. 2. సమముచేయు.
మట్టసము-తె. 1. కుఱుచ. 2. పరిమితము.
మట్టని-తె. పొట్టివాఁడు,
మట్టి-తె. 1. మన్ను. 2. బట్టచాఱలు. సమా. —తైలము-కెరోసీను. (ఇట్లు మట్టినూనె. మొ.)
మట్టియ-తె. 1. కాలివ్రేలి నగ. 2. మన్ను. రూ. మట్టె, మెట్టె.
మట్టు-తె. 1. త్రొక్కు. 2. కృ. త్రొక్కుడు. 3. కుదురు. 4. ప్రదేశము. 5. నిలువు. 6. పర్యంతము. 7. తక్కువ. 8. మితము. క్రి. —కొను-కుదురుకొను. —చేయు-తగ్గించు. —పడు-1. కుదురుపడు. 2. అడఁగు. —పెట్టు-అడఁచు, చంపు. —మిగులు, —మీఱు-అతిక్రమించు.
మట్టె-చూ. మట్టియ.
మఠము-స. సన్న్యాసులులోనగువారుండుచోటు.
మడ-తె. ప్రవాహమార్గము.
మడఁక-తె. 1. మడుపు. 2. ఏరు. [ప్రే. మడఁచు.
మడఁగు-తె. 1. వంగు. 2. మరలు. రూ. మణఁగు.
మడఁతి-తె. ఆఁడుది. రూ. మడఁతుక. [మడుపు.
మడత-తె. 1. ఒడలిమీఁది ముడుత. 2. వస్త్రపు
మడమ-తె. గుదికాలు. [కాలువముఖము.
మడవ-తె. (మడ+వాయి) పాదులకు నీళ్లుపాఱు
మడవు-తె. 1. విముఖమగు. 2. నిష్ఫలమగు.
మడి-తె. 1. మడుఁగువస్త్రము. 2. వరిపొలము. 3. పరిశుద్ధము. 4. మడుఁగు. సమా. మడిచేఱు-వైష్ణవస్త్రీలుముందుండివెనుకకుచెక్కుకొనుకోకచేఱు. —సంచి-మడుఁగువస్త్రములుంచుకొను
మడికాసు-తె. వెండి. [సంచి. —సంది-చంక.
మడిమంచ-తె. బలహీనము.
మడియఁడు-తె. మూఢుఁడు.
మడియు-తె. 1. చచ్చు. 2. తునుఁగు.
మడుఁగు-తె. 1. అడఁగు. 2. వంగు. 3. గుణము. 4. హ్రదము. 5. కొలను. 6. పరిశుద్ధి. 7. పరిశుద్ధవస్త్రము. 8. అడఁకువ. 9. ఎనిమిదివీసెలు. 10. బ. ఆకుమడుపు, రూ. మడువు, మడ్గు, మణుఁగు, మణువు.
మడుఁచు-తె. మడుఁగఁజేయు. రూ. మణుఁచు.
మడుపు-తె. 1. మడత. 2. మడుఁగుబట్ట. 3. బ. ఆకుచుట్టలు. [డు. 3. అపరిశుద్ధుఁడు.
మడ్డి-తె. 1. నూనెలోనగువానిమురికి. 2. మూఢుఁ
మద్దు-తె. ఇనుపగుండు. సమా. —కత్తి-మచ్చుకత్తి.
మడ్డువు-స. తుడుము.
మణి-స. 1. రత్నము. 2. ముత్తెము. 3. మనికట్టు. సమా. —కారుఁడు-రత్నములు సానఁబట్టువాఁడు. [వము.
మణిగము-తె. అధికారము. రూ. మణియము, మణి
మణిగాసనము-తె. సన్న సున్నపుపూఁత.

మధుపర్కము — తేనెలో నూరఁబెట్టిన మాంసము పర్కము అతిథులకుఁబెట్టుటకు వస్త్రమును అక్షతలు తరువాత వచ్చినవి.



మణితము-స. 1. రతికాలమందలి గళరవము. 2. కోకిలధ్వని.
మణిప్రవాళము-స. రెండుభాషలుకలిసినకవిత్వము.
మణియము-చూ. మణిగము. [ఎట్టిమన్ను.
మణిసిల-వి. (మనశ్శిల) కొండలయందలిఒకతెగ
మణుఁగు-చూ. మడుఁగు.
మతంగజము-స. ఏనుఁగు.
మతంగుఁడు-స. 1. ఒకఋషి. 2. మాదిగవాఁడు.
మతకము-తె. మాయ.
మతకరి-తె. మాయావి.
మతము-స. 1. అభిప్రాయము. 2. సమ్మతి. 3. శాస్త్రము. (త్రిమతములు:—అద్వైతము, విశిష్టాద్వైతము, మాధ్వము. షణ్మతములు:—వైష్ణవము, శైవము, శాక్తము, గాణపతము, సౌరము, కాపాలికము.)
మతల్లిక-స. ప్రశస్తవాచకము. రూ. మత్తల్లిక.
మతా-వి. (మత్తము) మంపు. రూ. మత్తు.
మతి-స. 1. శాస్త్రచింతనాదులచేఁ గలుగు అర్థనిర్ణయజ్ఞానము. 2. ఇచ్ఛ. 3. తలఁపు.
మత్కుణము-స. 1. నల్లి. 2. కొమ్ములులేనియేనుఁగు.
మత్కుణుఁడు-స. గడ్డము మీసములు లేనివాఁడు, పేడె.
మత్తము-స. 1. మదపుటేనుఁగు. 2. మదముపట్టినది. సమా. మత్తకాశిని-1. మదముచేప్రకాశించు ఆఁడుది. 2. ఆఁడుది. —వారణము-1. ఒఱగుదిండు. 2. మదపుటేనుఁగు. 3. మేడలయందు కొణిగకాధారముగా గోడలోనాటిన కొయ్య.
మత్తి-వి. (మదము) కామము. సమా. —కాఁడు-కాముకుఁడు.
మత్తు-చూ. మతా. క్రి. మత్తిల్లు.
మత్తుఁడు-స. మదించినవాఁడు.
మత్సరము-స. 1. ఈర్ష్య. 2. క్రోధము.
మత్స్యండి-స. కండచక్కెర. రూ. మత్స్యండి. (వ్యు. కొంచెకొంచెముగా కరఁగునది.)
మత్స్యము-స. చేఁప. సమా. మత్స్యధాని-చేఁపలబుట్ట. —బంధనము-గాలము. మత్స్యాక్షి-పొన్నగంటికూరాకు.
మథనము-స. త్రచ్చుట. రూ. మంథనము. క్రి. మథించు-త్రచ్చు.
మథితము-స. 1. నీళ్లుకలియని మజ్జిగ. 2. త్రచ్చఁబడినది. 3. ఒరయఁబడినది.
మదట-వి. (మత్తుఁడు) మత్తుఁడు, మత్తురాలు.
మదనచేతులు-తె. దంతెలు.
మదనము-స. 1. ఆమని. 2. ఉమ్మెత్త. 3. మైనము.
మదనుఁడు-స. మన్మథుఁడు. (వ్యు. మదింపఁజేయువాఁడు.)
మదము-స. 1. క్రొవ్వు. 2. రేతస్సు. 3. కస్తూరి. 4. గర్వము. 5. సంతోషము. (త్రిమదములు:—విద్యాధనకులమదములు: అష్టమదములు:-అన్న, అర్థ, స్త్రీ, విద్యా, కుల, రూప, ఉద్యోగ, యౌవనమదములు.) క్రి. మదించు. సమా. మదకలము-1. మదపుటేనుఁగు. 2. మత్తుచేవ్యక్తముకాని మాటలుకలది. మదస్థానము-కల్లుత్రాగెడి యిల్లు.
మదహత్తి-వి. (మదహస్తి) మదపుటేనుఁగు.
మదావళము-స. ఏనుఁగు. (వ్యు. పెక్కుచోట్ల మదజలముకలది.)
మది-వి. (మతి) 1. బుద్ధి. 2. మనస్సు.
మదించు-తె. 1. వెలయూహించు. 2. వి. తలఁచు. 3. స. క్రొవ్వు. రూ. మదియించు. కృ. మదింపు.
మదింపు-తె. 1. వెలనిశ్చయించుట. 2. గౌరవము.
మదిమది-తె. నెమ్మది.
మదిర-స. కల్లు. సమా. మదిరాక్షి-1. మత్తెక్కిన కన్నులుగల ఆఁడుది. 2. ఆఁడుది.
మదీయము-స. నాది.
మదుగు-తె. అనుకు. రూ. మదువు, మదువు.
మదుపు-తె. ఆకుపచ్చ. [(చూ. మగులు.)
మదురు-తె. 1. కమియు. 2. గోడమీఁదికప్పు.
మదురువు-వి. (మధువు) 1. కల్లు. 2. మత్తు.
మద్దెల-వి. (మర్దళము) పాటకుతోడుగా వాయించు చర్మవాద్యము. సమా. —రూపురిక్క-ధనిష్ఠ. 2. నెమిలి.
మద్యము-స. కల్లు.
మధుకము-స. 1. ఇప్పచెట్టు. రూ. మధూకము.
మధురము-స. 1. విషము. 2. తియ్యనిది. 3. ఇంపైనది.
మధురిమ-స. తియ్యన. రూ. మధురిమము.
మధువు-స. 1. నీరు. 2. పాలు. 3. తేనె. 4. కల్లు. 5. చైత్రమాసము. 6. వసంతర్తువు. సమా.

మధుకరము-1. తుమ్మెద. 2. భిక్షాన్నము.—పము-తుమ్మెగ. —పర్కము-1. పెరుఁగుతో కలిసినతేనె. 2. పెండ్లిలో వధూవరులకిచ్చు వస్త్రము. —మేహము-మూత్రములో తీఁపి కలుగు రోగము. —రిపుఁడు-విష్ణువు. (వ్యు. మధువను రక్కసుని చంపినవాఁడు.) —లిహము-తుమ్మెద. —వ్రతము.—పై.— —సూదనుఁడు-మధురిపుఁడు. మధ్వాసవము-ఇప్పపూ [సారాయము.

మధూళి-స. 1. కల్లు. 2. పూఁదేనె.

మధ్య-స. పదుమూఁడేండ్లనుండిపదునెనిమిదివఱకు వయస్సుగల కన్యక.

మధ్యస్థుఁడు-తె. ఇరుతెగలకు నడుమనుండి న్యా [యము చెప్పువాఁడు.

మధ్యాహ్నము-స. పట్టపగలు.

మధ్యము-స. 1. నడుము. 2. నడిమిది. సమా. మధ్యరాత్రము-నడురేయి. —లోకము-భూలోకము.

మధ్యమ-స. 1. దుద్దు. 2. నడిమివ్రేలు. 3. క్రొ [త్తగ సమర్తాడినది.

మధ్యమము-స. 1. నడుము. 2. సప్తస్వరములలో [నాలుగవది. 3. నడిమిది.

మననము-స. చింతన.

మనము-తె. నీవును నేనును. స. 1. మానసము. 2. ఇష్టము. రూ. మనసు, మనస్సు. సమా. మనః ప్రభవుఁడు-మదనుఁడు. మనసిజుఁడు.—పై.— మనస్కారము-మనఃప్రయత్నము. క్రి. మనస్కరించు. మనోజవసుఁడు-తండ్రినిపోలినవాఁడు. రూ. మనోజవుఁడు. మనోజుఁడు-మదనుఁడు. —జ్ఞము-సుందరము. —భవుఁడు-మదనుఁడు. —రథము-కోరిక. —రమము-మనోజ్ఞము.— హతుఁడు-మనసుచెడినవాఁడు. —హరము-మ [నోరమము.

మనవి-తె. విజ్ఞాపనము.

మనశ్శిల-స. మణిసిల.

మనసరి-(మిశ్ర)(మనసు+అరి)బుద్ధిమంతుఁడు.

మనస్వి. స. మంచిమనస్సుకలవాఁడు.

మనికట్టు-తె. అఱచేతికీలు.

మనికి-తె. 1. జీవించుట. 2. వసించుట. 3. జీవనము. 4. వాసస్థానము. 5. స్థానము. రూ. మన్కి.

మనికితము-తె. దుఃఖము. క్రి. మనికితపడు. కృ. [మనికితపాటు.

మనీష-స. బుద్ధి.

మనీషి-స. 1. విద్వాంసుఁడు. 2. బుద్ధిమంతుఁడు.

మను-తె. 1. జీవించు. 2. వర్తించు. 3. మన్ను. 4. నేల. కృ. మనికి, మనుకువ, మనుగడ. సమా.—పీనుఁగు-జీవచ్ఛవము.—గుడుపు-మర [వలి. రూ. మనువు.

మనుఁగు-తె. చచ్చు.

మనుకువ-తె. వాసస్థానము.

మనుగడ-తె. 1. జీవనము. 2. జీవనోపాయము.

మనుచు-తె. మనఁజేయు, పోషించు. రూ. మనుపు.

మనుజుఁడు-స. మానిసి. సమా. మనుజాశనుఁడు-రక్కసుఁడు. మనుజేంద్రుఁడు-రాజు. (ఇట్లు మనుజేశుఁడు. మొ.)

మనుపరి-తె. రక్షకుఁడు.

మనుమఁడు-తె. పౌత్రుఁడు. రూ. మన్మఁడు. (స్త్రీ. [మనుమరాలు)

మనువు-తె. 1. మనుఁగు. 2. జీవనము. 3. వర్తనము. 4. మగనివరించుట. 5. మగఁడు. స. మొదటిప్రభువు. (వీరు పదునలుపురు: స్వాయంభువుఁడు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుఁడు, రౌబ్యుఁడు.) సమా. మన్వంతరము-1. డెబ్బదియొక్కదివ్యయుగములు. 2. మనుకాల మధ్యచరిత్రము.

మనుష్యుఁడు-స. మానిసి. సమా. మనుష్యధర్ముఁడు-కుబేరుఁడు. —యజ్ఞము-అతిథిపూజ.

మన్నన-తె. సమ్మానము. 2. గౌరవము. రూ. మన్నిక. క్రి. మన్నించు.

మన్ని-తె. 1. జీవము. 2. పెడతలయందలి నరము. వి. (మన్య) క్రి. —గొను-చంపు.

మన్నించు-తె. 1. సమ్మానించు. 2. గౌరవించు. 3. అపరాధమును క్షమించు. కృ. మన్నింపు.

మన్ను-తె. 1. ఋశ్యమృగము. 2. ఒకయుద్ధసాధనము. 3. మృత్తు. 4. నేల. సమా. మన్నీఁడు-(మన్ను+ఈఁడు) ప్రభువు. రూ. మన్నియఁడు, మన్నీయ. మన్నుతేఁడు-ప్రభువు.

మన్నెము-వి. (మాన్యము) సమ్మానించియిచ్చినకొంతభూభాగము. సమా. మన్నెకాఁడు-చిన్నరాజు.

మన్నెముల్లు-తె. పశ్వాదులకాళ్లలోనిమల్లె (పురుగు) లు తీయుముల్లు. రూ. మల్లెముల్లు.

మన్మథ-స. ఇరువదితొమ్మిదవసంవత్సరము.

మన్మథుఁడు-స. మారుఁడు, విష్ణువుకొడుకు.
మన్య-స. పెడతలయందలినరము. (వి. మన్ని.)
మన్యువు-స. 1. కోపము. 2. శోకము. 3. దైన్యము. 4. యజ్ఞము.
మప్పితము-తె. మితము.
మప్పు-తె. మరపు.
మబ్బు-తె. 1. మేఘము. 2. చీఁకటి. 3. అజ్ఞానము. రూ. మ్రబ్బు. సమా. —త్రోవ-ఆకాశము. —మేపరి-వాయువు. —రౌతు-ఇంద్రుఁడు. క్రి. —కొను-మంపుగొను.
మభ్యపెట్టుట-తె. మోసముచేయుట, ఉపాయముతో దాఁటవేయుట.
మమత-స. అభిమానము. రూ. మమత్వము, మమకారము.
మమ్మ-హిం. ప్రశంసార్థకము. రూ. మమ్మా, మమ్మరె, మమ్మారె.
మమ్మ-తె. సముద్రముపై ఓడలకు విఘాతముగా వీచు సుడిగాలి.
మయము-స. 1. ఒంటె. 2. కంచరగాడిద.
మయూఖము-స. 1. కిరణము. 2. కాంతి. 3. జ్వాల.
మయూరకము-స. మయిలుతుత్తము.
మయూరము-స. 1. నెమిలి. 2. నెమిలిజుట్టు. రూ. మయురము.
మర-తె. 1. కీలు. 2. తిరుగుడుచీల. సమా. —కాఁడు-నావికుఁడు. —గాలు-కృత్రిమపాదము. —చుట్టు-తిరుగుడుచీల. —మేకు. —పై. —
మఱ-తె. మఱక, కఱ.
మరకందము-స. పూఁదేనె. రూ. మకరందము.
మఱఁదలు-తె. 1. తమ్మునిభార్య. 2. భార్యచెల్లెలు. 3. తనకంటె చిన్నదగు మేనత్త మేనమామల కూఁతురు.
మఱఁది-తె. 1. చెల్లెలిమగఁడు. 2. భార్యతోఁబుట్టువు. 3. మేనమామకొడుకు. 4. మగని తమ్ముఁడు.
మఱక-తె. 1. కఱ. 2. మేఁకపద్ద.
మరకము-అఱతూము.
మరకతము-స. పచ్చరాయి, గారుత్మతము. రూ. మకరతము, మరతకము.
మఱకువ-తె. 1. మఱపు. 2. అజ్ఞానము.
మరగు-తె. 1. వంచితమగు. 2. ఆసపడు. 3. ఆశించు. ప్రే. మరపు.
మఱచు-తె. విస్మృతిచెందు. కృ. మఱపు.
మరణము-స. చావు. క్రి. మరణించు, మరించు.
మఱపు-స. 1. విస్మృతి. 2. అజ్ఞానము. 3. పారవశ్యము. 4. ప్రమాదము.
మరమ్మతు-హిం. బాగుచేయుట.
మరలు-తె. 1. తిరుగు, నివర్తిల్లు. 2. వెనుకకు తిరుగు. రూ. మఱలు, మళ్లు.
మరవలి-తె. పెండ్లియయినపిమ్మట అల్లుని అత్తగారింటికిపిలిచిపిండుపెట్టుట, అల్లెము, మనుగుడుపు.
మరాళము-స. నల్లనిముక్కును కాళ్లనుగలహంస.
మరి-తె. 1. తడవ. 2. మఱియు.
మఱి-తె. 1. వెండియు. 2. ఇంకను. 3. అనంతరము. ఆమ్రే. మఱిమఱి-అత్యంతము.
మరించు-స. మరణించు.
మఱిగ-తె. చిన్నబలపపుజాతిపాత్రము.
మరిచము-స. మిరియము. రూ. మరీచము.
మరిడి-తె. వాంతిభేది, కలరా.
మరియాద-వి. (మర్యాద) 1. క్రమము, మేర. 2. గౌరవము.
మరీచి-స. 1. కిరణము. 2. ఒకఋషి.
మరీచిక-స. ఎండమావులు, మృగతృష్ణ.
మరు-తె. వృత్తియందు మారుశబ్దమునకాదేశరూపము. (వేమరు. మొ.)
మఱు-తె. వృత్తియందు మఱుగుమఱున మాఱుశబ్దముల కాదేశరూపము. రూ. మల్లు. సమా. —గుజ్జు-గూనివాఁడు, గూనిది. —నాఁడు-మఱునటినాఁడు. రూ. మర్నాడు. —మాట-ప్రతివచనము. —మ్రోఁత-ప్రతిధ్వని. —సంజ-సాయంసంధ్య. రూ. మలుసంజ. క్రి. —పడు-మఱుఁగుపడు.
మఱుఁగు-తె. 1. చాటగు. 2. సంతాపించు. 3. కృ. చాటు. సమా. —దొడ్డి-పెరడు. విష్ఠావిసర్జనస్థానము. క్రి. —పడు-మఱుఁగగు.
మరుఁడు-వి. (స్మరుఁడు) మన్మథుఁడు. సమా. మరుతేజి-చిలుక.
మఱుకువ-తె. సంతాపము.
మరుత్తు-స. 1. గాలి. 2. వేలుపు.
మరుత్వంతుఁడు-స. ఇంద్రుఁడు.
మరులు-తె. 1. మోహము. 2. పిశాచము. సమా. —ఱేఁడు-పిశాచవల్లభుఁడు. క్రి. —కొను-మోహించు. మూఁగ. సమా. —కందు-అగస్త్యుఁడు.
మఱువ-తె. (మఱుఁగు + వాయి) 1. కుండ. 2.

మరువకము-స. మరువము.
మరువము-వి. వాసనగల మొక్క.
మరువు-స. 1. నిర్జలభూమి, ఎడారి. 2. పర్వతము.
మఱున-తె. ఆవలిది. సమా. —పుట్టువు. —మేను-రెండవజన్మము. [మర్కటకము.
మర్కటము-స. 1. కోఁతి. 2. సాలెపురుగు. రూ.
మర్త్యము-స. భూలోకము. [డు.)
మర్త్యుఁడు-స. మనుష్యుఁడు. (వ్యు. మృతికలవాఁ
మర్దనము-స. 1. పిసుకుట. 2. నూఱుట. క్రి. మ
మర్దితము-స. నూఱఁబడినది. [ర్దించు.
మర్మము-స. 1. జీవస్థానము. 2. కిటుకు.
మర్మరము-స. పెళపెళ, ఎండుటాకులు, వస్త్రము. మొ. వాని మ్రోఁత.
మర్యాద-స. 1. పొలిమేర. 2. తీరము. 4. కట్టుఁబాటు. 4. సమ్మానము. (వి. మరియాద.)
మర్రి-తె. వటవృక్షము.
మర్షము-స. ఓరుపు.
మల-తె. కొండ. సమా. —గొంగ-ఇంద్రుఁడు. —మనికి-కోఁతి. —యమ్మ-పార్వతి.
మలఁక-తె. 1. చిక్కు. 2. చుట్టు. 3. మెలిక. 4. వంకర. సమా. —తూము-పదికుంచములు. —పుట్టి-ఇన్నూఱుకుంచములు. —మెఱుపు-ధనురాకారమగు మెఱుపు. క్రి. మలఁగొను-మెలిగొను. [గు. ప్రే. మలఁచు, మలఁపు. కృ. మలఁక.
మలఁగు-తె. 1. తిరుగు. 2. మరలు. 3. వంకర
మలఁపుగొను-తె. నర్తించు.
మలక-తె. 1. తురక. 2. మూఁకుడు.
మలకడము-తె. పాదరక్ష.
మలచము-తె. 1. అధికము. 2. చౌక. 3. గొప్ప.
మలప-తె. దూడచచ్చియు పాలిచ్చునది. [ము.
మలపు-తె. 1. త్రిప్పు. 2. మరలించు. 3. ఆధిక్య
మలమల-తె. మాఁడుట, మఱుఁగుటయందగునను
మలమాసము-స. అధికమాసము. [కరణము.
మలము-స. 1. పిష్ఠ. (ద్వాదశమలములు: వస, శుక్లము రక్తము, మజ్జ, మూత్రము, విష్ఠ, పింజూషము, నఖము, శ్లేష్మము, అశ్రువు, దూషిక, స్వేదము.) 2. కిట్టము. 3. దోషము.
మలయము-స. 1. ఒకకొండ. 2. ఆరామము. సమా. మలయజము-1. చందనము. 2. చందనవృక్షము. (వ్యు: మలయపర్వతమునఁబుట్టినది.) మలయాళము-మలయపర్వత ప్రాంతదేశము.
మలయిక-తె. విహారము.
మలయు-తె. 1, తిరుగు. 2. పెనఁగు. 3. వ్యాపించు. 4. ఉద్యమించు. 5. ఉద్రేకించు.
మలాము-హిం. పూఁత. రూ. మొలాము.
మలారము-తె. 1. గాజులగుది. 2. వీథినూద్చువెడలుపైన పెద్దపొరక. రూ. మల్లారము.
మలికితము-తె. సందేహము.
మలిగండ్లు-తె. మలిచియెత్తఁదగినబాళ్లు.
మలినము-స. 1. మాసినది. 2. నల్లనిది.
మలిని-స. ముట్టుత.
మలిమ్లుచము-స. 1. దోమ. 2. మలమాసము.
మలిమ్లుచుఁడు-స. 1. దొంగ. 2. అగ్ని. 3. వాయువు. (వ్యు. మలినముగాచరించువాఁడు.)
మలీమసము-స. 1. ఇనుము. 2. మాసినది.
మలు-తె. మఱు. సమా. —కారు-1. రెండవకారు. 2. శీతకాలము. —సంజ-సాయంసంధ్య.
మలుఁగు-తె. పాఁపమీను.
మలుకు-తె. దారములుతగిల్చివైచినమండి.
మలుకువ-తె. ముడికి. [వు) 3. తుంటి.
మలుగు-తె. 1. అఱు. 2. నశించు. (ప్రే. మలు
మలుచు-తె. 1. ధాన్యములోని బాలుపోఁగ చెరుగు. 2. తఱిమెనఁబెట్టు. 3. బాతినితొలుచు. రూ. మల్చు. [మా. —సాల-భోజనశాల.
మల్ల-వి. (మల్లము) సానిక, మంటికంచము. స
మల్లకము-స. ప్రమిద.
మల్లకుఁడు-తె: కఠినుఁడు, గడుసరి.
మల్లమల్లము-తె. వాదులాట.
మల్లడి-తె. 1. పరితాపము. 2. పెనఁకువ. క్రి. మల్లడించు-1. పెనఁగొను. 2. అతిశయించు. మల్లడిగొను-1. పెనఁగొను. 2. పరితపించు.
మల్లము-స, 1. మల్ల. 2. త్రాగెడుపాత్రము. 3.
మల్లరము-తె. ఘదించినది, [శ్లేష్మము.
మల్లాడు-తె. పెనఁగాడు. కృ. మల్లాట, మల్లట.
మల్లామడి-తె: పీడితము, పీడితుఁడు.
మల్లారము-చూ. మలారము.

మల్లిక-స. మల్లెతీఁగ. సమా. మల్లికాక్షము-1. మల్లికము. 2. తెల్లకన్నులుగల గుఱ్ఱము.
మల్లికము-స. మూసిన ముక్కుకాళ్లుగల తెల్లహంస.
మల్లియ-వి. మల్లెతీఁగ.
మల్లు-తె. 1. కోఁతి. 2. మల్లుఁడు 3. జెట్టిపెనఁకువ. క్రి. —కట్టు-అడ్డగించు.
మల్లుఁడు-స. 1. జెట్టి. 2. శ్రేష్ఠుఁడు.
మల్లె-స. 1. మల్లికాలత. 2. బొబ్బలలోఁగలుగు పురుగు. సమా. —ముల్లు-మల్లెలుతీయుముల్లు. రూ. మన్నెముల్లు. —జేగురు-రాపులుఁగు.
మవ్వము-తె. కోమలము. [చతుష్కి.
మశకము-స. దోమ. సమా. మశకహరి-దోమతెర,
మశూచి-స. స్ఫోటకము. రూ. మశూచిక.
మషి-స. కాగితముపైవ్రాసెడుచాయ. (వి. మసి.) సమా. —మణి-మసిబుడ్డి.
మస-తె. విలాసము, తళుకు.
మసఁగు-తె. రేఁగు, విజృంభించు. [రూ. మసకన.
మసక-తె. 1. ఇంచుకనలుపు. 2. మునిచీఁకటి.
మసకము-తె. 1. సంభోగేచ్ఛ. 2. సంభోగము. క్రి. మసకొను-సంభోగేచ్ఛగొను. ప్రే. మస
మసటు-తె. ముఱికి. రూ. మసడు, మస్టు. [కొలుపు.
మసనము-వి. (శ్మశానము) ఒలికిమిట్ట.
మసర-తె. ధూసరవర్ణము.
మసరు-తె. ఆవేశము.
మసలిక-తె. మాంద్యము.
మసలు-తె. 1. తడయు. 2. సలసలకాఁగు. 3. విహరించు. 4. వెనుకకుతిరుగు.
మసారము-స. ఇంద్రనీలము.
మసాల-హిం. 1. సంభారము. 2. గుఱ్ఱమునకిచ్చు మందు.
మసి-వి. (మషి) 1. నలుపు. 2. బొగ్గు. 3. మైల. 4. కాగితముపైవ్రాయుచాయ. సమా. —కట్టు-బంగారులోనగువానిచిలుము. —కోఁతి-నల్లకోఁతి. —బుడ్డి-మషిమణి. [సూర.
మసుర-స. 1. వేశ్య. 2. చిఱుసెనగలు. రూ. మ
మసూరి-స. ఒకతెగగజ్జి. రూ. మసూరిక.
మసృణము-స. 1. నున్ననిది. 2. చిక్కనిది.
మసెల-తె. అటుక.
మస్కరము-స. వెదురు.
మస్కరి-స. సన్న్యాసి.
మస్తము-స. తల. రూ. మస్తకము.
మస్తరు-తె. లోఁకువ. క్రి. మస్తరించు-లోపఱచు.
మస్తిష్కము స. మెదడు.
మస్తీ-హిం. 1. మదపుటేనుఁగు.
మస్తు-తె. 1. సమృద్ధి. 2. హిం. మదము.
మస్తువు-స. పెరుఁగుమీఁది మీఁగడ.
మహంతు-తె. దేవాలయముల ధర్మకర్తృత్వము జరిగించు బైరాగి.
మహతి-స. 1. నూఱుతంతులుగల నారదునివీణ. 2. (వ్యాక) స్త్రీవాచకము. 3. గొప్పది.
మహత్తు-స. 1. దొరతనము. 2. (వ్యాక) పురుషవాచకము. 3. గొప్పది. సమా. మహాంగము-ఒంటె. మహాకాలుఁడు-శివుఁడు. —దేవుఁడు. —పై. — —నటుఁడు. —పై. — —పథము-1. ప్రాణాంతము. 2. రాజమార్గము. —ప్రళయము-లోకనాశనము, బ్రహ్మప్రళయము. —బలుఁడు-1. వాయువు. 2. మిగులబలముగలవాఁడు. —మాత్రుఁడు-1. కార్యసహాయుఁడు. 2. మావటిదొర. 3. సంపన్నుఁడు. —మృగము-ఏనుఁగు. —రంభ-పచ్చయరఁటి. —రజతము-బంగారు. —రథుఁడు-పదునొకండువేల విలుకాండ్రతో పోరెడి యోధుఁడు. —రాత్రము-అర్ధరాత్రము. —శంఖము-1. ఒకసంఖ్య. 2. నొసలు. 3. మనుజునియెముక. —(అ)శయుఁడు-1. సముద్రుఁడు. 2. గొప్పయభిప్రాయముగలవాఁడు. —శూద్రుఁడు-గొల్లఁడు. (స్త్రీ.—శూద్రి.) —సేనుఁడు-కుమారస్వామి. మహేంద్రుఁడు-ఇంద్రుఁడు. మహేంద్రి-బొంతరఁటి. మహేశ్వరుఁడు-1. శివుఁడు. 2. గొప్పరాజు. మహోత్పలము-తామర. మహోదయము-1. కన్యాకుబ్జము. 2. ఆధిపత్యము. 3. అభివృద్ధి. 4. మోక్షము. మహోదరము-కడుపుపెద్దదగు వ్యాధి. మహౌషధము-1. గొప్పయౌషధము. 2. [సొంటి.
మహనీయుఁడు-స. గొప్పవాఁడు.
మహము-స. 1. ఉత్సవము. 2. తేజము. రూ. మ
మహాలు-హిం. రాజమందిరము. [హస్సు.

మహాసూలు-హిం. పంట.
మహానసము-స. వంటయిల్లు. (వి. బానసము)
మహి-స. భూమి. సమా. మహీక్షితుఁడు-రాజు.—ధ్రము-కొండ.రూ. మహీధరము. —రుహము-చెట్టు. (ఇట్లు మహీజము. మొ.) —లత-ఎఱ్ఱ. —సుత-సీత. —సుతుఁడు-1. భౌముఁడు. 2. నరకుఁడు.
మహిక-స. మంచు.
మహితము-స. 1. శివునిశూలము. 2. గొప్పది.
మహిమ-స. గొప్పతనము. రూ. మహిమము.
మహిషము-స. ఎనుఁబోతు. సమా. మహిషవాహనుఁడు-యముఁడు.
మహిషి-స. 1. పట్టపురాణి. 2. ఎనుము.
మహిళ-స. ఆఁడుది.
మళయాళము-చూ. మలయాళము.
మళిగ-తె. సరకులు మొత్తముగా అమ్మెడుఅంగడి.
మళ్లు-చూ. మరలు.

## మా

మా-తె. 1. బళీ. 2. వలదు, మానుము. వి. (మహత్) మిక్కిలి. స. లక్ష్మి. సమా. మాపతి, —ధవుఁడు-శ్రీపతి, విష్ణువు. (ఇట్లు మానాయకుఁడు. మొ.)
మాంగల్యము-స. 1. మంగళత్వము.2.తాళిబొట్టు.
మాంజిష్ఠము-చూ. మంజిష్ఠ.
మాంత్రికుఁడు-స. మంత్రవిద్యతెలిసినవాఁడు.
మాంధాళి-తె. 1. కృత్రిమ మరకతము. 2. పచ్చపట్టుచీర.
మాంద్యము-స. 1. ఆలస్యము. 2. జాడ్యము.
మాంసము-స. నంజుడు.
మాంసలుఁడు-స. 1. బలిసినవాఁడు. 2. బలిమిగలవాఁడు.
మాంసికుఁడు-స. మాంసమువిక్రయించి జీవించువాఁడు, కసాయి.
మాఁకు-తె. వృక్షము. రూ. మ్రాను,మ్రాఁకు.మాను.
మాఁగాయ-తె. మామిడికాయ.
మాఁగు-తె. 1. కమియఁబండు. 2. మాలిన్యము. 3. మంగు.
మాఁగుడు-తె. 1. నలుపు, మాలిన్యము. 2. పండుట. క్రి. —వాఱు, మాగువడు, —వాఱు-మాయు.
మాఁటినంగ-తె. కాముకి.
మాఁటు-తె. 1. తగులముగొను. 2. కృ. తగులము. 3. మాఁతు. క్రి. —మణఁగు-జంజాటముడిగి నిశ్శబ్దమగు. రూ. —మణుఁగు, —మడఁగు, —మడుఁగు, —వడు-తగులువడు.
మాఁడు-తె. 1. దగ్ధమగు. 2. కృ. అడుగంటిమాఁడిన అన్నము. 3. ఇంటియొకభాగపుకప్పు.
మాఁడెము-చూ. మండెము.
మాఁతు-తె. చదరంగపుటాటలో బంటుతోఁగాక తక్కినవానితో రాజునుగట్టుట.
మాఁద-వి. (మాంద్యము) బిడ్డలకువచ్చురోగము.
మాకందము-స. మామిడిచెట్టు.
మాకరి-చూ. మాలకరి.
మాకొను-తె. కలుచు.
మాక్షికము-స. తైలవర్ణముగలతేనె.
మాగధుఁడు-చూ. మగధుఁడు.
మాగాణి-తె. వరిపంటపెట్టుపల్లపునేల. రూ.మాగిలి.
మాగాని-తె. దేశము.
మాఘము-స. పదునొకండవమాసము.
మాచకమ్మ-తె. మగబొమ్మయి బహిష్ఠకాని యాఁడుది.
మాట-తె. 1. వచనము. 2. పదము. 3. నింద. 4. వృత్తాంతము. సమా. —కాఁడు-వక్త. —కారి-యుక్తిగామాటాడువాఁడు, వాగ్మి. —ల మారి-వావదూకుఁడు. క్రి. మాటాడు-వచించు. మాటపడు-అపకీర్తిపొందు.
మాటికి-తె. అడుగడుగునకు. (ఆమ్రే. మాటిమాటికి, మాటికి మాటికి)
మాటు-తె. 1. మఱుఁగుపఱచు. 2. కృ.మఱుఁగు. 3. తడవ. 4. వేఁటకాఁడు. దాఁగెడిపల్లము, ఉపశయము. క్రి. —వడు-మఱుఁగుపడు.
మాడ-తె. అరవరా.
మాడపట్టు-తె. నడునెత్తి, బ్రహ్మరంధ్రము.
మాడికి-తె. విధము. రూ. మాడ్కి.
మాడు-తె. వెలయు. (కూడుక్రియతో చేరివచ్చునది.)
మాడుగు-వి. (మాలిక) మేడ. రూ. మాడువు,మాళిగ.
మాణవకము-స.ఇరువదిపేటలమణిహారము.
మాణవకుఁడు-స. బాలకుఁడు.
మాణిక్యము-స. కెంపు. (వి. మానికము)
మాత-స. 1. తల్లి. 2. లక్ష్మి. 3. పార్వతి. (పంచమాతలు: రాజుభార్య, గురుభార్య,అన్నభార్య,

భార్యాజనని, స్వజనని.) సమా. మాతరపితలు, మాతాపితలు, మాతామహుఁడు-1. తల్లితండ్రి. 2. బ. తల్లివంశమువారు.
మాతంగము-స. ఏనుఁగు.
మాతంగి-స. 1. పార్వతి. 2. వసిష్ఠునిభార్య, అరుంధతి.
మాతంగుఁడు-స.మాదిగవాఁడు. రూ.మతంగుఁడు.
మాతరిశ్వుఁడు-స. వాయువు.(వ్యు.అంతరిక్షమునఁదిరుగాడువాఁడు.)
మాతలి-స. ఇంద్రునిసారథి.
మాతుల-స. మేనమామభార్య. రూ. మాతులాని, మాతులి. (పుం. మాతులుఁడు.)
మాతులుంగము-స. మాదీఫలము.
మాతులేయుఁడు-స. మేనమామకొడుకు.
మాతృక-స. 1. తల్లి. 2. దాది. 3. పార్వతి. 4. అసలుగ్రంథము. 5. బ్రాహ్మ్యాది. (వీరు ఏడుగురు: బ్రాహ్మి,మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ.)
మాతృష్వసేయి-స. తల్లితోడఁబుట్టినదానికూఁతురు. రూ. మాతృష్వస్రేయ. (పుం. మాతృష్వస్రీయుఁడు.)
మాత్ర-తె. చిన్నమందుంట. స. 1. అక్షరావయవము. 2. కొంచెము. 3. కొలఁది. 4. త్రుటి.
మాత్రము-స. 1. అవధారణము. 2. కొలఁది.
మాత్సర్యము-స. చలము. రూ. మత్సరము. (వి. మచ్చరము.)
మాదళము-తె. 1. కపిలవర్ణము. 2. కపిలవర్ణపుచీర. రూ.మాదవళము,మాదావళము,మాదావళి.
మాదిగ-వి.(మాతంగ) చెప్పులుకుట్టి జీవించుజాతి. సమా. —కత్తి-భిండిపాలము.
మాదిఫలము-(మిశ్ర) మాతులుంగము, మాద్రి.
మాదిరి-హిం. 1. సామ్యము. 2. విధము. రూ. మాద్రి.
మాదృశుఁడు-స. నావంటివాఁడు.
మాధవము-స. 1. వైశాఖమాసము. 2. వసంతఋతువు.
మాధవి-స. 1. పూలగురివెంద. 2. కల్లు. 3. తేనె. 4. లక్ష్మి. 5. కుంటెనకత్తె.
మాధవుఁడు-చూ. మా.
మాధుకరము-స. మధుకరవృత్తి. (తుమ్మెదలు పూలయందు తేనెను గ్రహించునట్లు భిక్షకులు భిక్షగ్రహించి జీవించుట)
మాధురి-స. 1. మాధుర్యము. 2. కల్లు.
మాధుర్యము-స. 1. తీఁపు. 2. పక్షులనేమరించుబోయవాఁడు వేయు ఈల.
మాధ్యస్థ్యము-స. మధ్యస్థుఁడుచేయుతీర్పు.
మాధ్వి-స. 1. మద్యము. 2. మకరందము.
మాధ్వీకము-స. ఇప్పపూవుకల్లు. రూ.మాధవకము.
మాన-వి. నాలుగుసోలలు.
మానన-స. మన్నన.
మాననీయము-స. మన్నింపఁదగినది.
మానము-స. 1.కొలఁత. (ఇది త్రివిధము: అంగుళీమానము, తులామానము, ప్రస్థమానము) 2. కొలఁది. 3. మానిక. 4. చిత్తౌన్నత్యము. 5. గర్వము. సమా. మానవతి-మానముగల ఆఁడుది. (పుం. మానవంతుఁడు.)
మానవుఁడు-స. మనుష్యుఁడు.(వ్యు.మనువువలనఁబుట్టుకగొన్నవాఁడు.)
మానసము-స. 1. మనస్సు. 2. ఒకకొలను. క్రి. మానసించు-తలఁచు. సమా. మానసౌకము-హంస.
మాని-స.మానముగలవాఁడు.(స్త్రీ.మానిని)
మానిక-స. మాన, కుడపము.
మానికము-వి. (మాణిక్యము) 1. కెంపు. 2. రత్నము. సమా. మానికదారి-భోగముది.
మానితము-స. మన్నింపఁబడినది.
మానిని-స. 1. మానవతి. 2. ఆఁడుది.చూ.మాని.
మానిసి-వి. (మానుష్యుఁడు) 1. పురుషుఁడు. 2. ఆఁడుది. 3. భటుఁడు. సమా. —దిండి-రక్కసుఁడు. —రౌతు-కుబేరుఁడు.—ఱేఁడు-రాజు. —సింగము-నృసింహుఁడు.
మాను-తె. 1. విడుచు. 2. చెట్టు. 3. మనోజ్ఞము.
మానుషి-స. మనుష్యస్త్రీ.(పుం. మానుష్యుఁడు.)
మానోజ్ఞకము-స. మనోజ్ఞత.
మాన్యము-స. 1. పన్నులేక అనుభవించునట్లు సమ్మానించియ్యఁబడినభూమి. (వి. మన్నెము) 2. మన్నింపఁదగినది.
మాపు-తె. 1. పోఁగొట్టు. 2. సాయంకాలము. 3. రాత్రి. 4. మైల.
మాపుడు-తె. మైల.
మామ-వి. (మామకుఁడు) 1. మేనమామ. 2. శ్వశురుఁడు. సమా. మామమామ-విష్ణువు.

మామకీనము-స. నాయది.
మామకుఁడు-స. 1. మామ. 2. నావాఁడు.
మామా-తె. మానుము మానుము.
మామిడి-తె. ఆమ్రవృక్షము. రూ. మావి.
మామూలు-హిం. ఎప్పటి వాడుక.
మాయ-స. 1. అవిద్య. 2. ఇంద్రజాలాదివిద్య. 3. హరిద్వారము.
మాయము-తె. 1. మాయ. 2. అదృశ్యము.సమా. మాయకాఁడు-మాయావి. —దారి-—పై.— —పోతు-—పై— —లాఁడి - మాయాశీలురాలు. (పుం. మాయలాఁడు.) [కుఁడు.
మాయావి-స. మాయలుకలవాఁడు. రూ. మాయి
మాయి-తె. 1. మఱుఁగు. 2. నలుపు. స. మాయగలవాఁడు. [మాపు. కృ. మాపు, మాయి.
మాయు-తె. 1. మలినమగు. 2. నశించు. ప్రే.
మాయురె-తె. బళీ.
మాయువు-స. పైత్యము.
మాయూరము-స. 1. మయూర సమూహము. 2. మయూరసంబంధమైనది.
మాఱకము-తె. వినిమయము, వస్తువులమాఱుపు.
మారకుఁడు-స. చంపువాఁడు.
మాఱట-తె. ప్రతిరూపము. [విద్య.
మారణము-స. 1. చంపుట. 2. మరణింపఁజేయు
మాఱాకు-తె. ప్రాఁకుడుఁగొయ్య. ఉపఘ్నము.
మాఱాట-తె. కలహము. రూ. మారాటము, మాఱాటము.
మారాము-వి. (మర్మము) కీలు. [ఱాటము.
మారి-తె. తాచ్ఛీల్యమందువచ్చుప్రత్యయము. (కొట్లమారి, తంటాలమారి మొ.) స. 1. మారణము. 2. మసూరికారోగము. 3. పార్వతి.
మారిషుఁడు-స. (నాట్య) ఆర్యుఁడు.
మారు-తె. ప్రతి.
మాఱు-తె. 1. నశించు. 2. మాఱుపడు, వేఱురూపమగు. 3. ఎదురు. 4. తడవ. 5. రెండవసారిపెట్టు అన్నము. 6. ప్రతి. 7. అన్యము. సమా. —ఁదల్లి-సవతితల్లి. —తుఁడు-శత్రువు. రూ. మార్తుఁడు. —దల-మాఱుపాటు, మాఱువు. —మగఁడు-ఉపపతి, జారుఁడు. —మనువు-ద్వితీయవరణము. —మనువుది-దిధిషువు.— మాట-ప్రతివచనము. —మూల-ఎదురుమూల. —మొగము-పెడమొగము, పరాఙ్ముఖము — మ్రోఁత-ప్రతిధ్వని. క్రి.—కొను-1.ఎదిరించు. 2.భేదపడు. కృ. మాఱుపాటు. మాఱాడు-మాఱుపలుకు. కృ. మాఱాట. మాఱొడ్డు-ఎదిరించు. మాఱుచు-మాఱఁజేయు. రూ. మార్చు. కృ. మాఱుపు, మార్పు. [జంపువాఁడు.)
మారుఁడు-స. మన్మథుఁడు. (వ్యు. విరహిజనులఁ
మారుతము-స. గాలి.
మారుతి-స. 1. స్వాతి. 2. భీముఁడు. 3. హనుమంతుఁడు. (వ్యు. మరుత్తుకొడుకు.)
మాఱుపు-తె. ఒకటినిచ్చి మఱియొకటితీసికొనుట, వినిమయము.
మారేడు-తె. బిల్వవృక్షము. రూ. మారెడు.
మార్గణము-స. 1. వెదకుట. 2. యాచించుట. 3. బాణము. (వ్యు. గుఱివెదకుచుఁబోవునది.)
మార్గణుఁడు-స. యాచకుఁడు.
మార్గము-స. 1. త్రోవ. 2. అన్వేషణము.
మార్గశీర్షము-స. తొమ్మిదవనెల. రూ. మార్గశిరము.
మార్గ్యము-స. వెదకఁదగినది.
మార్చు-తె. 1. వర్ధించు. 2. మాఱఁజేయు.
మార్జనము-స. తుడుచుట. క్రి. మార్జించు.
మార్జని-స. చీఁపురుకట్ట.
మార్జాలము-స. పిల్లి. రూ. మార్జారము.
మార్జిక-స. కొన్నిసంబారువులుచేర్చి పక్వముచేసిన పెరుగు. (వి. మజ్జిగ.)
మార్తాండుఁడు-స. సూర్యుఁడు. రూ. మార్తండుఁడు. (వ్యు. మృతండునికొడుకు.)
మార్తుఁడు-చూ. మాఱుతుఁడు.
మార్దంగికుఁడు-స. మృదంగము వాయించువాఁడు.
మార్దవము-స. మృదుత్వము, మెత్తన.
మార్ద్వీకము-స. ద్రాక్షసారాయి.
మార్జి-స. మార్జనము. రూ. మార్ష్టి.
మాల-తె. ఒకతెగ. సమా. మాలఁడు, మాలవాఁడు, మాలది, మాలత, మాలెత.
స. పూదండ. సమా. మాలాకారుఁడు-పూలుకట్టు

వాఁడు. (వి. మాలకరి.)
మాలకరి-వి. (మాలాకారుఁడు) 1. పూలుకట్టు వాఁడు. 2. వనపాలకుఁడు. 3. తోఁటమాలి.
మాలతి-స. జాజితీఁగ.
మాలము-స. బర్బరజాతి.
మాలి-స. 1. మాలాకారుఁడు. 2. మాలగలవాఁడు.
మాలిక-స. 1. పూదండ. 2. మాడుగు.
మాలికుఁడు-స. మాలాకారుఁడు.
మాలిన్యము-స. మలినత్వము.
మాలిమి-తె. 1. వాత్సల్యము. 2. ఓడనడపుశాస్త్రము. 3. ఆశాస్త్రమునెఱిఁగినవాఁడు. సమా. —కాఁడు-మాలిమిశాస్త్రము నెఱిఁగినవాఁడు.
మాలు-తె. చెడు, నశించు. ప్రే. మాలుచు, మాల్చు.
మాలుగు-తె. 1. సోమరితనముపొందు. 2. కృ. సోమరితనము. 3. బెస్తలభుజముమీఁది తడిమడతపొత్తులు. సమా. —ఁబోతు-సోమరి.
మాలూరము-స. 1. మారేడుచెట్టు. 2. వెలఁగచెట్టు.
మాలె-వి. (మాలిక) 1. పూదండ. 2. మాడుగు. రూ. మాలియ.
మాల్యము-స. 1. పుష్పమాలిక. 2. పుష్పము.
మావంతుఁడు-తె. ఏనుఁగునడపువాఁడు, ఆథోరణుఁడు. రూ. మావటి, మావటీఁడు.
మావటము-తె. తమలపాకులకట్ట.
మావటి-చూ. మావంతుఁడు.
మావి-తె. 1. గర్భస్థపిండమునకుమీఁదఁగప్పికొనియుండు తోలుసంచి, జరాయువు. 2. మామిడిచెట్టు. రూ. మావిడి.
మావు-తె. అశ్వము. సమా. —మోమువాఁడు-కింపురుషుఁడు.
మాషము-స. 1. మినుములు. 2. అయిదుగురిగింజలయెత్తు.
మాసటి-తె. 1. శూరుఁడు. 2. శ్రేష్ఠుఁడు. రూ. మాసటీఁడు, మాస్టీఁడు.
మాసము-వి. (మాషము) రెండున్నరచిన్నమెత్తు. మాసము-స. నెల. (ఇవిపండ్రెండు: చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గునము.)
మాసరము-స. 1. గంజిమీఁదిమీఁగడ. 2. వ్యాప్తము.
మాసి-వి. 1. మసి. 2. మానిసి.
మాసిక-తె. అతుకు.
మాసికము-స. 1. అద్ధికమువఱకు నెలనెలకుచేసెడు శ్రాద్ధము. 2. ప్రతి అమావాస్యయందును చేయు శ్రాద్ధము. 3. మాససంబంధమైనది.
మాస్టీఁడు-చూ. మాసటి.
మాహ-స. ఆవు. రూ. మాహేయి.
మాహాత్మ్యము-స. మహాత్మత్వము, గొప్పతనము.
మాశిగ-చూ. మాడుగు.

## మి

మింగడ-చూ. మీఁగడ.
మించు-తె. 1. అతిశయించు. 2. అతిక్రమించు. 3. కాలిమట్టె. 4. మెఱపు. 5. ప్రకాశము. 6. ఆధిక్యము. సమా. —ఁగాలు-కుడికాలు. —ఁబోఁడి-1. మించువలె మనోజ్ఞురాలగు ఆఁడుది. 2. ఆఁడుది. రూ. మించుఁబోణి. —దల-1. అతిక్రమణము. 2. ఆధిక్యము.
మింతుఁడు-స. విటుఁడు.
మిండఁడు-వి. 1. మింతుఁడు. 2. అధికుఁడు. రూ. మిండగాఁడు, మిండగీఁడు. (స్త్రీ. మిండత.) సమా. మిండతపసి-విటతపస్వి. —తుమ్మెద-మగతుమ్మెద. —తికము-జారత్వము. —వడ్డి-ఎక్కువవడ్డి. మిండలకోరి-జారిణి.
మిక్కటము-తె. మిక్కిలి. రూ. మిక్కుటము.
మిక్కిలి-తె. 1. అధికము. 2. శ్రేష్ఠము. సమా. —కంటివేల్పు-శివుఁడు. —వాఁడు-అధికుఁడు.
మిక్కులు-తె. మీఱు. కృ. మిక్కిలి.
మిక్కుటము-చూ. మిక్కటము.
మిగత-తె. శేషము.
మిగులు-తె. 1. శేషించు. 2. అతిశయించు. 3. మట్టుమీఱు. 4. కృ. శేషము. రూ. మివులు. కృ. మిగత.
మిటాయి-హిం. తీయనిపిండివంట. రూ. మిఠాయి.
మిటారము-తె. 1. నిక్కు. 2. అతిశయము. క్రి. మిటారించు.
మిటారి-తె. మిటారముగల ఆఁడుది.
మిట్ట-తె. 1. ఉన్నతభూమి. 2. ఉన్నతము.
మిట్టమిఱ్ఱు-తె. (మిఱ్ఱు+మిఱ్ఱు) అత్యున్నతభూమి.
మిట్టు-తె. ఎగురు. క్రి. మిట్టాడు - సంచరించు. మిట్టించు-ఎగురు. మిట్టిపడు-ఎగిరిపడు.
మిడి-తె. 1. గర్వము. 2. ఉన్నతము. సమా.—

గ్రుడ్లు-ముందఱికుఱికిన కనుగ్రుడ్లు. —నా
గు-ఎగిరి యెగిరిపడు ఒకతెగచిన్నపాము. —
పండ్లు-మిట్టపండ్లు. —మేలము-మిడిసిపాటు.
క్రి. —వోవు-1. తక్కు. 2. తొలఁగు.

మిడియ-తె. వేదవాక్యము.

మిడియు-తె. 1. ఎగురు. 2. వెలికుఱుకు. క్రి. మిడిసిపడు-మిట్టిపడు. కృ. మిడిసిపాటు.

మిడుఁగుఱు-తె. 1. అగ్నికణము. 2. మినుకు మినుకుమనుపురుగు. రూ. మిడుఁగు, మిణుఁగు, మిణుఁగుఱు.

మిడుకు-తె. 1. బ్రదుకు. 2. త్రుళ్లు. 3. కదలు. 4. సంచరించు. 5. పరితపించు. 6. ఎండు.

మిడుగు-తె. కఠినశిల.

మిడుచు-తె. 1. పిండు. 2. నెటికవిఱుచు.

మిడుత-తె. శలభము.

మిణకరము-తె. ఏమియుతోఁచకుండుట. క్రి. మిణకరించు.

మితంపచుఁడు-స. లోభి. (వ్యు. మితముగా వండుకొనువాఁడు.)

మితము-స. కొలఁదియిడఁబడినది.

మితి-స. 1. కొలఁది. 2. గడువు.

మిత్త-వి. (మిత్రుఁడు) స్నేహితుఁడు.

మిత్తి-వి. (మృత్యువు.) 1. మృత్యుదేవత. 2. చావు. సమా. —గొంగ-మృత్యుంజయుఁడు. —చూలు-కేతుగ్రహము. —వేఁటకాఁడు-మిత్తిగొంగ. [వాని శత్రుదేశమున కావలిదేశపురాజు.

మిత్రము-స. 1. స్నేహితుఁడు. 2. దండెత్తిపోవు

మిత్రుఁడు-స. 1. మిత్రము. 2. సూర్యుఁడు.

మిథము-స. పరస్పరము.

మిథునము-స. ఆలుమగలజత. 2. ఒకరాశి.

మిథ్య-స. అసత్యము. సమా. మిథ్యాదృష్టి-నాస్తికత్వము. —మతి-భ్రాంతి. [2. తామరదుద్దు. రూ. మిద్దె.

మిద్దియ-తె. 1. చదునుగాగారవేసిన ఇంటికప్పు.

మినమిన-తె. తళతళ. [సిగవేల్పు-శివుఁడు.

మిను-చూ. మిన్ను. సమా. —చూలు-గాలి. —

మినుకు-తె. 1. మినుకుమినుకుమను. కృ. 2. మినుకుమినుకుమనుకాంతి. 3. తాళిబొట్టు. 4. చిన్నబంగరునాణెము. 5. బ. వేదము. 6. వాక్కు. రూ. మిన్కు. సమా. —ఁజేడియ-సరస్వతి. —లబరణి-సూర్యుఁడు. —యిక్క. —పై. —

మినుము-తె. 1. మినుపపైరు. 2. బ. మాషము.

మిన్న-తె. 1. రత్నము. 2. శ్రేష్ఠము. [ఉద్దులు.

మిన్నక-తె. ఊరక.

మిన్ను-తె. ఆకాశము. రూ. మిను. సమా. మింటితెరువరి-1. సూర్యుఁడు. 2. వేలుపు. మిన్నుకొలఁకు-ఆకాశగంగ. —మన్ను-రోదసి. —వాఁక-ఆకాశగంగ. రూ. మిన్వాఁక. —తాలుపు-గంగాధరుఁడు. మిన్నేఱు-మిన్నువాఁక.

మిమ్మటము-తె. మిక్కటము.

మిర-స. మేర.

మిరాసి-హిం. పారంపర్యముగావచ్చు హక్కు.

మిరియము-వి. (మరీచము) కారముగల ఒక సంబారువు. రూ. మిరెము.

మిఱు-తె. మిఱుమిట్లుగలది. [రువు. రూ. మిరెము.

మిఱుమిట్లు-తె. (మిట్లు + మిట్లు) కన్నులు మిక్కిలి మిట్టుటలు. క్రి. —గొను-(కన్నులు) మిక్కిలిచెదరు. [రీచము.

మిరెపకాయ-తె. (మిరెము + కాయ) బృహన్మరీచము.

మిట్టు-తె. మిట్ట.

మిలమిల-తె. 1. మినమిన. 2. మెదలుటమెలఁగుట యందగు ననుకరణము.

మివులు-చూ. మిగులు. [యందగు ననుకరణము.

మిశ్రము-స. కలిసినది. రూ. మిశ్రితము. క్రి. మిశ్రీకరించు-కలుపు.

మిష-స. నెపము. [శ్రీకరించు-కలుపు.

మిస-తె. కాంతి.

మిసమిస-తె. మెఱయుటయందగు ననుకరణము.

మిసిమి-తె. 1. క్రొత్తకాంతి. 2. నవనీతము.

మిసిమింతుఁడు-తె. అలసినవాఁడు. (స్త్రీ. మిసిమింతురాలు.)

మిసుకు-తె. కదలు. [తురాలు.)

మిహి-తె. శ్రేష్ఠము.

మిహిక-స. మంచు. [పంచమునుతడుపువాఁడు.)

మిహిరుఁడు-స. సూర్యుఁడు. (వ్యు. మేఘరూపిమై ప్ర

మిళిందము-స. తుమ్మెద.

మిళితము-స. కలిసినది, మిశ్రము.

మిళ్లి-తె. చిన్నగరిఁటె.

## మీ

మీఁదు-తె. 1. పరము. 2. పైభాగము. 3. దేవతకని కట్టిన ముడుపు. సమా. మీఁగండ్లమెకము-శరభము, ఊర్ధ్వలోచనము. మీఁగడ-(మీఁదు +

కడ) కాఁగినపాలమీఁదితెప్ప, మస్తువు. రూ. మీవడ. మీఁగాలు-పాదోపరిభాగము.మీఁజెయి-కరోపరిభాగము. మీఁదిసాక్షి-ఉత్తరసాక్షి. మీఁదుమిక్కిలి-కడుమిక్కిలి.[2. అదిమెడు మర.
మీట-తె. 1. ఏతపుమ్రానిలో త్రొక్కుడుభాగము.
మీటు-తె. 1.ఎగఁజిమ్ము. 2.పొడుచు. 3.(తీగలు)కుట్టు. 4. ఉద్రేకము. 5. పెంపు. 6. అధికము.
మీనము-స. 1. చేఁప. 2. ఒకరాశి. (వి. మీను) సమా. మీనకేతనుఁడు-మదనుఁడు. —వల్లిక-మీనువల్లంకి.
మీను-వి. మీనము. సమా. —రూపురిక్క-రేవతి. —వల్లంకి-నీటనుతికి చేఁపలఁబట్టితినుఒకపిట్ట, మీలమ్రుచ్చు.
మీమాంస-స. కర్మబ్రహ్మప్రతిపాదకశాస్త్రము.
మీమాంసకుఁడు-స. మీమాంసాశాస్త్రము నెలిసిన వాఁడు. [క్రమించు.
మీఱు-తె. 1. అతిశయించు. 2. కడచు. 3. అతి
మీలనము-స. కనుమూయుట.
మీలితము-స. మూయఁబడినది.
మీవడ-చూ. మీఁగడ.
మీసము-తె. మగవాని పైపెదవిమీఁది వెంట్రుకల
మీసరము-తె. శ్రేష్ఠము. [వచన, శ్మశ్రువు.

## ము

ముంగ-తె. 1. ఎన్నులమోపు. 2. వి. మూఁగ.
ముంగర-చూ. ముక్కర.
ముంగి-తె. నకులము. రూ. ముంగిస. సమా. ముంగిసమ్రాను-ముంగిసరూపుగల మునసచివర.
ముంచు-తె. 1. మునుకొను. 2. మునుఁగఁజేయు. 3. నాశముచేయు. క్రి. ముంచుకొను-ఆక్రమించుకొను. [జకేశుఁడు-విష్ణువు.
ముంజము-స. ముంజిగడ్డి, పౌనిక. సమా. ముం
ముంజి-వి. బ్రహ్మచారికట్టుకొను ముంజదర్భ మొలత్రాడు. సమా. —కాఁడు-బ్రహ్మచారి.
ముంజె-తె. లేఁతతాటికాయలోని గిజురు.
ముండ-తె. 1. విధవ. 2. వేశ్య. సమా. ముండరి, ముండలమారి-వేశ్యాసంగమశీలుఁడు. —మోపి-విధవ. క్రి. —మోయు-విధవయగు.
ముండము-స. తలము.
ముండనము-స. 1. క్షౌరము. 2. రక్షణము.
ముండి-స. మంగలి.
ముండితుఁడు-స. తలగొఱుగఁబడినవాఁడు.
ముండుఁడు-స. 1. రాహువు. 2. తెగినకాలుసేతులు మొ. కలవాఁడు. 3. బోడితలవాఁడు.
ముంత-తె. 1. చిన్నమట్టిపాత్రము. 2. మ్రానిపాత్రము. 3. మానిక. సమా. —పొగ-ముంతలోవేసిన మిరపకాయలపొగ. —మామిడి-ఒకఫలవృక్షము, అగ్రబీజము. [రూ. ముందఱ.
ముందర-తె. 1.మునుపు. 2.మొదలు. 3.ఎదురు.
ముందు-తె. 1. ఎదురు. 2. మునుపు. సమా. ముంగడ-(ముందు+కడ) 1. ఎదురు, ముందుచోటు. 2. ముందు. ముంగమురము-(ముందు+కయి+మురము) ముంజేతధరించు కటకము. రూ.ముంగమురాము, ముంగయిమురారి, ముంగై మురారి, ముంగామురము,ముంగామురారి, ముంగామురుగు. ముంగల-(ముందు+కలను) ముంగడ. ముంగలి-1. ముందునడచునది, —నడచువాఁడు. 2. మీఁదటి. ముంగాలు-ముందుకాలు,పాదాగ్రము. ముంగిలి-(ముంగల+ఇల్లు) 1. అంకణపు మధ్యప్రదేశము. 2. అంకణము. 3. మధ్యప్రదేశము. ముంగురులు-ముందుకురులు, అలకలు. ముంగేలు-ప్రకోష్ఠము. (ఇట్లు ముంజేయి, ముంగై, మొ.) ముంగొంగు - ముందుకొంగు, చెఱఁగుకొన. ముంగోపము-ముందుకోపము, తటాలునవచ్చుకోపము. రూ. ముక్కోపము. ముంగోలు-మొదటిది. ముంజూరు-ముందుచూరు, వాచూరు. క్రి. ముంగలు-ముందునడచు. ముందుపడు-మునుకొను, ముందగు. ముక్కొను-ముందుకొను.
ముంపు-తె. 1. ముంచుట. 2. గుంపు. క్రి. —గొను-గుంపుగూడు.
ముకు-చూ. ముక్కు. సమా. —ఁగ్రోళ్లు-నాసారంధ్రములు. —ఁజెఱమ-నాసారంధ్రము. రూ. ముంజెఱమ, ముక్కుఁజెఱమ. —ఁద్రాడు-ఎడ్లముక్కునకు గ్రుచ్చుదారము, నాధము. —దూలము-ముక్కునడిమియెముక. రూ. ముక్కు

దూలము.
ముకుందము-స. 1. ఎఱ్ఱతామర. 2. ఒకనిధి.
ముకుందుఁడు-స. విష్ణువు. (వ్యు. మోక్షమునిచ్చువాఁడు.) [స. కిరీటము. రూ. మకుటము.
ముకుటము-తె. నారమడిబట్ట. రూ. ముక్కుటము.
ముకురము-స. అద్దము. [కుళీభవించు-మొగుడు.
ముకుళము-స. అరవిరిమొగ్గ. క్రి. ముకుళించు,ము
ముకుళితము-స. ముకుళించినది.
ముక్క-తె. తునుక.
ముక్కంటి-తె. (మూఁడు+కన్ను+ఇ) త్రినేత్రుఁడు, శివుఁడు. సమా. —చెలి-కుబేరుఁడు. —చుక్క-ఉత్తరభద్రపద.
ముక్కఁడి-తె. (మూఁగు+కాఁడి) 1. దుక్కి చాలించినిలిపిన అరకలమొత్తము. 2. అనేకుల కొక్క పెట్టున తగిలెడువ్యాధి.
ముక్కన్ను-తె. మూఁడవకన్ను.
ముక్కరమాను-తె. పుల్లిరుసుతిరుగుపట్టము.
ముక్కలిపీఁట-తె. మూఁడుకాళ్లపీఁట. రూ. ము [క్కాలిపీఁట.
ముక్కాని-తె. మూఁడుకానులు.
ముక్కారు-తె. మూఁడుకారులు.
ముక్కాలు-తె. 1. మూఁడుకాళ్లు. 2. ముప్పాతిక.
ముక్కు-తె. 1. చెడు. 2. శ్వాసమును బిగఁబట్టి విడుచు. 3. పక్షిముక్కు. 4. (చను) మొన. 5. నాసిక. సమా. ముక్కద్దము-సులోచనము. ముక్కఱ-(ముక్కు+ఱా) నాసికాభరణము. రూ. ముక్కర. ముక్కిఁడి-(ముక్కు+ఇఁడి) ముక్కుపోయినవాఁడు, విగ్రుఁడు.
ముక్కులు-తె. చిన్ననూకలు.
ముక్కుస-తె. మూఁడుకుంచములు.
ముక్కూఁదు-తె. అజ్ఞానమును పొందు.
ముక్కొటిక-తె. (మూఁడు+కొటిక) త్రిపురములు.
ముక్కొమ్ము మెకము-తె. (మూఁడు+కొమ్ము+మెకము) మనుఁబోతు.
ముక్కోణము-(మిశ్ర) త్రికోణము.
ముక్కోపము-స. ముందుకోపము.
ముక్కోల-తె. త్రిదండము.
ముక్త-స. 1.వి. ముత్తెము. 2.ఱంకుటాలు. సమా. ముక్తావళి-ముత్యాలహారము.

ముక్తము-స. 1. ముక్తినొందినది. 2. విడువఁబడినది. [ముక్తాయింపు.
ముక్తాయించు-తె. (మద్దెలవరుస) ముగించు. కృ.
ముక్తి-స. 1. మోక్షము. 2. విడుపు. (వి.ముగితి)
ముఖము-స. 1. మొగము. 2. నోరు. 3. మాట. 4.ముందటిభాగము. సమా. ముఖవాసన-కర్పూరాదివాసన. —వీణ-చిన్ననాదస్వరము. (వి. మొగవీణె)—శాల-తలవాకిటిచావడి. (వి. మొగసాల)
ముఖరము-స. 1. మ్రోఁగునది. 2.అసంబద్ధవచన [ము లాడునది.
ముఖ్యము-స. ప్రధానము.
ముగించు-తె. పూర్తిచేయు. కృ. ముగింపు.
ముగితి-వి. (ముక్తి) మోక్షము. [ముగించు.
ముగియు-తె. పూర్తియగు. కృ. ముగియిక. ప్రే.
ముగుద-వి. (ముగ్ధ) 1.పండ్రెండేండ్ల వయసుగల పడుచు. 2. ఆఁడుది.
ముగురు-తె. (మూఁడు+గురు) మూఁడుమంది. రూ. ముగ్గురు, మువురు, మువ్వురు, మూగురు, [మూవురు.
ముగ్గు-చూ. మ్రుగ్గు.
ముగ్గొయ్య-తె. 1.ముందుకొయ్య. 2.అసాధ్యము.
ముగ్ధ-స. 1. ముగుద. 2. చక్కనిది. 3. తెలివిలేనిది. 4. క్రొత్తది.
ముచ్చ-తె. ముద్దిపూస, త్రికము.
ముచ్చట-తె. 1. సల్లాపము. 2. కోరిక. 3. ప్రేమము. క్రి. —పడు-కోరు. ముచ్చటించు-ము [చ్చటలాడు.
ముచ్చట్లు-తె. మూఁడుచోటులు.
ముచ్చముడుఁగు-తె. (ముడుఁగు+ముడుఁగు) మిక్కిలిముడుఁగు. [కిబంగారు.
ముచ్చి-తె. చిత్రకారుఁడు. సమా. —బంగారు-కా
ముచ్చిక-తె. (ముందు+సిక) టెంకాయ తాటికాయలోనగువాని తొడిమక్రిందిబిల్ల.
ముచ్చిచ్చు-తె. (మూఁడు+చిచ్చు) త్రేతాగ్నులు.
ముచ్చిరి-తె. శోకమునొందినవాఁడు.
ముచ్చిరు-తె. శోకించు. కృ. ముచ్చిరి.
ముచ్చిలి-తె. పెడతలయందలిగుంత, అవటువు. (ముచ్చిలిగుంట అనియు)
ముచ్చిలించు-తె. దొంగిలించు. రూ. మ్రుచ్చిలించు, ముచ్చిలు. [వ్రాసియిచ్చు ఒడంబడిక.
ముచ్చిలిక-హిం. వాదిప్రతివాదులు మధ్యస్థులకు

ముచ్చిలిపాటు-తె. కునికిపాటు.
ముచ్చు-చూ. ప్రుచ్చు.
ముచ్చె-వి. (మోచకము) మీఁగాలు గుదిగాలు కప్పుకొను చెప్పు, పార్ష్ణిత్ర. సమా. —వాఁడు-చర్మకారుఁడు.
ముజరా-హిం. ప్రోపుడు.
ముటము-తె. ముద్దపిడుక. రూ. మూటము.
ముట్టడము-తె. 1. నిర్బంధము. 2. ముట్టడించుట. రూ. ముట్టడి, ముట్టణము. క్రి. ముట్టడించు-కోటలోనగుదానిచుట్టుకొనినిర్బంధించు.[ముట్టె.
ముట్టియ-తె. 1. పందిముక్కు. 2. టెంక. రూ.
ముట్టు-తె. 1. తాఁకు. 2. శత్రువునుతాఁకు. 3. మర్మముతాఁకు. 4. ముట్టడించు. 5. కడముట్టు. 6. తాఁకుడు. 7. కొఱముట్టు. 8. రజస్వల. సమా. ముట్టికాళ్లవాఁడు-ముట్టుమోఁకాళ్లుకలవాఁడు, సంజ్ఞువు. —త-ముట్టుది, రజస్వల. —నీళ్లు-రజస్వలనాలవనాఁడుచేయుస్నానము. క్రి. ముట్టించు-1. ముట్టఁజేయు. 2. కాల్చు. 3. రగుల్చు. ముట్టఁబడు-డయ్యు. ముట్టుకొను-1. ముట్టడించు. 2. ఆక్రమించు. కృ. ముట్టుకోలు. —పడు-సంకటపడు. కృ. ముట్టుపాటు.
ముట్టె-చూ. ముట్టియ. సమా. —మెకము-పంది, పోత్రి. —మోపు-కార్య నిర్వాహకసమయము.
ముడి-తె. 1. దారములోనగువానిముడి, గ్రంథి. 2. వెంద్రుకలముడి. 3. చెట్టులోనగువాని బుడిపి. 4. ఎద్దుమూపురము. 5. కలహము. 6. సంధి. 7. ముడ్డి. 8. తునియనిది. 9. పొట్టు తవుడుపోనిది. (ధాన్యము). 10. వికసింపనిది. సమా. —కాఁడు-1. సంధిచేయువాఁడు. 2. కలహశీలుఁడు. —కాళ్లు-ముట్టికాళ్లు. —గిబ్బ-మూపురముగల కోడె. —పోఁక-ఖండముకాని వక్క. —బట్ట-అంచుకమ్ములు లేనివస్త్రము. —బొమ-ముడివడ్డబొమ, భ్రుకుటి. క్రి. —గొను-ముడుఁచు. —వడు-1. ముడిగలదియగు. 2. సంధించు. 3. పెనఁగొను. 4. అతిశయించు. 5. కలుగు. కృ. ముడివాటు. —వెట్టు-1. ముడివేయు. 2. కలహము గలిగించు.
ముడియ-తె. 1. మూట. 2. పందెము. సమా. —విడుపు-మూటవిప్పుదొంగ.
ముడుఁగు-తె. 1. ముకుళించు. 2. తగ్గు. 3. సంకోచించు. 4. చేష్టలుడుగు. ప్రే. ముడుఁచు. సమా. —ఁదామర-తాఁకఁగాముడుచుకొనుఒక మొక్క, నమస్కారి. రూ. ముణుఁగుఁదామర.
ముడుఁచు-తె. 1. ముడుఁగఁజేయు. 2. ముడివైచు.
ముడుచు-తె. ముడివేయు. కృ. ముడియ, ముడుపు.
ముడుత-తె. 1. వస్త్రపునెఱి. 2. కడుపుమీఁదివళి.
ముడుపు-తె. 1. ధనపుమూట, ముల్లె. 2. ధనము. 3. దేవత కని కట్టినమీఁదు.
ముడుము-తె. మోఁకాలు.
ముడుసు-తె. 1. ముడ్డిపూస. 2. ముడిఎముక.
ముడ్డి-తె. గుదము. రూ. మూడి. సమా. —పూస-ముచ్చు, త్రికము.
ముతుక-తె. లావు, మందము. రూ. ముదుక, ముదుగు.
ముత్త-తె. 1. వృద్ధ. 2. వృద్ధుఁడు. సమా. ముత్తవ్వ-1. వృద్ధపితామహి. 2. అవ్వతల్లి. ముత్తాత-1. వృద్ధపితామహుఁడు. 2. మూఁడవతాత. ముత్తైదువ-వృద్ధసువాసిని.
ముత్తి-వి. (ముక్తి) మోక్షము. రూ. ముగితి.
ముత్తిగ-తె. (మూఁడు+తిగ) తొమ్మిది.
ముత్తియము-వి. (ముక్త) సముద్రమునఁబుట్టు అనశ్మకమణి. రూ. ముత్తెము, ముత్యము. సమా. ముత్తెపుఁజిప్ప-శుక్తి. —ఁబంట-చెఱకు. —రిక్క-చిత్ర. —నెల-చైత్రమాసము. ముత్తెసరి-ముక్తాహారము.
ముత్తుము-తె. మూఁడుతూములు.
ముత్తో-తె. (ముత్త+తోయలి) ముత్తైదువ.
ముత్త్రోవద్రిమ్మరి-తె. గంగ; త్రిపథగ.
ముదము-స. సంతోషము. రూ. మోదము.
ముదముద-తె. కొతుకు, సంకోచము.
ముదల-తె. 1. ఆజ్ఞ. 2. లక్ష్యము. 3. గనిమచేరికనేల. క్రి. —కించు-మార్కొను. —వెట్టు-ఆజ్ఞాపించు. ముదలించు-1. అడుగు. 2. మార్కొను.
ముది-తె. ముసలితనము. రూ. ముదిమి.
ముదిగారము-తె. మౌర్ఖ్యము.
ముదిత-తె. ఆఁడుది. స. సంతోషమునొందినది. (పుం. ముదితుఁడు.)
ముదియ-తె. ఆఁడుది. రూ. ముద్దియ. [ముదిమి.
ముదియు-తె. ముసలితనముపొందు. కృ. ముది-
ముదుక-తె. 1. వృద్ధ, వృద్ధుఁడు. 2. ముతుక.

ముదుకఁడు-తె. వృద్ధుఁడు.
ముదుగు-తె. లావు. చూ. ముతక.
ముదురు-తె. 1. (కాయ) పరిణమించు. 2. వర్ధిల్లు. కృ. 3. వృద్ధము.
ముదుసలి-తె. ముదుకఁడు.
ముద్గము-స. పెసలు.
ముద్గరము-స. 1. ఇనుపగుదియ. 2. సమ్మెట.
ముద్ద-తె. 1. కబళము. 2. పిండము. 3. వి. ముగ్ధ. సమా. —రాలు-ముగ్ధస్త్రీ. —కమ్మర-తాయి కరఁగి యినుము చేయు కమ్మరజాతి. —కవ్వము-మ్రానిబిళ్లతగిలించినకవ్వము. —కొలిమి-ముద్దకమ్మరికొలిమి.
ముద్దియ-తె. మగువ. రూ. ముదియ.
ముద్దు-తె. 1. చుంబనము. 2. ఆదరము. 3. మనోజ్ఞత. 4.వి. ముద్ర. సమా. ముద్దయ్య-కుమారస్వామి. ముద్దుగుమ్మ-మనోజ్ఞురాలగు ఆఁడుది. క్రి. ముద్దాడు-1. చుంబించి లాలనము చేయు. 2. ఆదరించు. ముద్దిడు, ముద్దుపెట్టు-చుంబించు.—టుంగరము-అక్షరములుచెక్కిన ఉంగరము. రూ. ముదుటుంగరము.—రాలు-ముద్దుగుమ్మ.—లాఁడి—పై—(పుం.ముద్దులాఁడు.)
ముద్దుఁడు-వి. (ముగ్ధుఁడు) ఏమియు తెలియనివాఁడు, భేల.
ముద్ర-స. 1. సంజ్ఞాక్షరములుచెక్కినఉంగరము. మొ. 2. ఉంగరములోనగువానియందలి సంజ్ఞాక్షరములు. 3. అచ్చు. సమా. ముద్రాక్షరశాల-అచ్చుకూటము. క్రి. ముద్రించు-1. ముద్రవేయు. 2. అచ్చుకూర్చు.
ముద్రణము-స. ముద్రించుట.
ముద్రిక-స. ముద్దుటుంగరము.
ముద్రితము-స. ముద్రింపఁబడినది.
మునగ-వి. (మురంగి) శిగ్రువృక్షము.
మునస-తె. ఏతపుమ్రానిమీఁదినగభాగము. (త్రొక్కుడుభాగము మీట.)
మునసబు-హిం. న్యాయముతీర్చు అధికారి.
ముని-స. 1. ఋషి. 2. అవిసెచెట్టు. తె. సమాసమందు మును శబ్దమునకుఁ గలుగు రూపము. సమా. —కోల-1. ఎద్దులనదలించుకోల, ప్రాజనము. 2. కళ. —చీఁకటి-ప్రొద్దుగ్రుంకఁగానే కలుగు పలుచనిచీఁకటి. —మనుమఁడు-ప్రపౌత్రుఁడు. —మనుమరాలు-ప్రపౌత్రి. —మాపు-ప్రదోషము, సాయంకాలము. —ముంగలి-మొట్టమొదట. —ముచ్చు-పశ్యతోహరుఁడు. —యేఁడు-నిరుటికిముందుసంవత్సరము. —వ్రేలు-కొనవ్రేలు.
మును-తె. 1. ముందు. 2. మొదలు. 3. తొది. రూ. మున్ను. సమా. —గట్టు-తొలిగట్టు,పూర్వాద్రి. క్రి. —కొను, —పడు-ముందుకొను.
మునుఁగు-తె. 1. మునుకవేయు. 2. అడఁగు. 3. నశించు. 4. మఱుఁగుపడు. రూ. మున్గు. కృ. మునుక, మున్కు.
మునుక-తె. 1. మునుఁగుట. 2. స్నానము.
మునుకు-తె. 1. సంతాపించు. 2. మాఱుపలుకు. 3. పలుకు.
మునుకువ-తె. పూనిక.
మునుచు-తె. మునుకొను.
మునుపు-తె. ముందు. రూ. మున్పు.
మునుము-తె. 1. పైరు కోఁత కేర్పఱచుకొన్న మితి. 2. ఎదురు. 3. ఎదుటిచోటు. 4. సేనాముఖము. 5. తఱుఁచుఁదనము. రూ. మున్మ. క్రి. —కొను-వరుసపెట్టు.
మున్ను-తె. 1. ముందు. 2. మొదలు. రూ.మును. సమా. మున్నడి-(మున్ను+అడుగు) ముందుగా. రూ. మున్నాడి. మున్నరక-1. ముందుమడక. 2. ధైర్యము. మున్నీరు-(మున్ను+నీరు) సముద్రము. మున్నీటిచూలి-లక్ష్మి. మున్నెరిక-(మున్ను+ఎఱుక) 1. పూర్వపరిచయము. 2. పూర్వపరిచయముచేఁగలిగిన విరహతాపము.
ముప్పండ్రు-తె. (మూఁడు+పదుండ్రు) ముప్పదిమంది.
ముప్పటిలు-తె. చల్లారు.
ముప్పది-తె. (మూఁడు+పది) మూఁడుపదులు. సమా. —రెంటిగుంపు-రేవతీనక్షత్రము.
ముప్పాతిక-తె. మూఁడుపాతికలు.
ముప్పిడి-తె. (మూఁడు+పిడి) బాఁకు.
ముప్పిర-తె. మూఁడుపిరలు.
ముప్పిరి-తె. మూఁడుపిరులు. రూ.ముప్పురి.క్రి.—గొను-1. మూఁడుపిరులుగా పెనఁగొను. 2.

పెనఁగొను.
ముప్పు-తె. 1. వార్ధకము. 2. విపత్తు.
ముప్పూఁట-తె. మూఁడుపూఁటలు. (ఇట్లు ముప్పొ్రొద్దు మొ.) [ఉప్పొంగు.
ముప్పొంగు-తె. మూఁడు పొంగులు పొంగు,
ముప్పొత్తులు-తె. (మూఁడు+పొత్తులు) అశ్రద్ధ.
ముప్పోకలాఁడు-తె. (మూఁడు+పోకలు+ఆఁడు) త్రిగుణాత్మకుఁడు, భగవంతుఁడు.
ముబ్బడి-చూ. ముమ్మడి. క్రి. ముబ్బడించు.
ముబ్బె-తె. నితంబపార్శ్వము.
ముముక్షువు-స. విడువనిచ్ఛగలవాఁడు.
ముమూర్ష-స. చావనిచ్ఛ. (పుం. ముమూర్షువు.)
ముమ్మడి-తె. (మూఁడు+మడుఁగు) మూఁడంతలు, త్రిగుణము. రూ. ముబ్బడి, ముమ్మడుఁగు. క్రి. ముమ్మడించు, ముబ్బడించు.
ముమ్మనుమఁడు-తె. మునిమనుమఁడు. (స్త్రీ. ముమ్మనుమరాలు.)
ముమ్మరము-తె. అగ్గలము. క్రి. ముమ్మరించు.
ముమ్మూఁడు-తె. తొమ్మిది.
ముమ్మొనవాలు-తె. (మూఁడు+మొన+వాలు) త్రిశూలము. సమా.—తాలుపు-త్రిశూలి, శివుఁడు.
ముమ్మోటు-తె. (ముసు+మోటు) మూఢశిరోమణి.
ముయ్యంచు-తె. (మూడు+అంచు) మూఁడు మూలలు.
ముయ్యడ-తె. (మూఁడు+అడ్డ) ఆఱుమానికలు.
ముయ్యాఱు-తె. (మూఁడు+ఆఱు) పదునెనిమిది.
ముయ్యేలగుట్ట-తె. (మూఁడు+ఎల్ల+గుట్ట) మూఁడు ఎల్లలుకలియుచోటు. లేక దారులు.
ముయ్యేడు-తె. (మూఁడు+ఏడు) ఇరువదియొకటి.
ముయ్యేఱు-తె. (మూఁడు+ఏఱు) గంగ, త్రిపథగ.
మురంగి-స. నల్లమునగచెట్టు.
ముఱకటము-తె. త్రిప్పట. క్రి. ముఱకటించు.
ముఱకము-తె. నిక్కు, ఉద్ధతి.
మురజము-స. మద్దెల.
మురళి-స. 1. పిల్లనగ్రోవి. 2. ఒకఅశ్వగతి.
మురళించు-తె. తిరస్కరించు.
మురారి-స. (ముర+అరి. మురుఁడను రక్కసుని చంపినవాఁడు) కృష్ణుఁడు. (ఇట్లు మురవైరి, మురవిరోధి, మురద్విషుఁడు మొ.)
మురాళము-తె. దిగఁదుడుపు. క్రి. మురాళించు.
మురి-తె. గర్వము. రూ. మురిపము. మురిపెము. సమా. —కాఁడు-గర్విష్ఠుఁడు.
ముఱి-తె. 1. అల్పము. 2. కుత్సితము.
మురించు-తె. త్రిప్పు.
ముఱికి-తె. మాలిన్యము. [లికగొలుసు.
మురిడీగొలుసు-తె. ముంజేతధరించు బంగారుమె
మురిపము-చూ. మురి.
మురియ-తె. ఖండము. క్రి. మురికొను-ఖండించు.
మురియు-తె. 1. నడచునప్పుడుకులుకు. 2. గర్వించు. 3. తిరుగు. 4. తెగు. 5. విఱుగు. కృ. మురి, మురిపము, మురియ. క్రి. మురియఁబడు-అతిశయించు.
ముఱియు-తె. గర్వించు. రూ. మురియు.
మురుగు-తె. 1. పట్టెలుతీర కడ్డిగాఁగొట్టించి ముంజేతధరించు అభరణము. 2. అల్లికవేసినబంగారుకమ్మి. రూ. మురువు.
ముఱుగు-తె. 1. క్రుళ్లు. 2. చదియు. కృ. ముఱుగుడు. సమా. ముఱుగుత్రోవ-ముఱుగుడునీళ్లుపోవుత్రోవ.
మురువు-తె. 1 సౌందర్యము. 2. గర్వము. 3. మురుగు. రూ. ముర్వు.
ముర్మురము-స. 1. కుమ్ము. 2. సూర్యునిగుఱ్ఱము.
ముఱ్ఱు-తె. చూలైనయావు మొ. వాని చన్నులు పిదుకఁగావచ్చుజిగటవస్తువు. (ముఱ్ఱుఁబాలుఅనియు)
ములక-తె. నార్తాకి.
ములికి-తె. 1. బాణము. 2. బాణపుటలుఁగు. 3. బొంగరపుకొననుగ్రుచ్చియుండుఇనుపముక్క. రూ. ముల్కి.
ములు-తె. 1. కంటకము. 2. త్రాసుముల్లు. 3. వరిలోనగువానిముల్లు. రూ. ముల్లు. సమా. ములుకోల-ముల్లుగ్రుచ్చినకోల. క్రి.—మూపు-మీఱు.
ములుగు-తె. 1. మూలుగు. 2. బొక్కసము. [ముల్చు.
ములుచ-తె. 1. మూఢుఁడు. 2. తక్కువ. రూ.
ములుము-తె. బావినీరుపాఱించి పండించుపొలము.
ముల్లు-తె. చూ. ములు. సమా. ముండ్లపంది-ఒడలెల్ల ముండ్లుగల ఒకతెగపంది, శల్యము.

ముల్లె-తె. 1. ధనముమూట. 2. (నగల) మూట. [రూ. ముల్లియ.
ముపురు-చూ. ముగుడు.
ముప్వ-తె. (మూఁడు+వా) మూఁడుగీఱలవంటి సందులుగలపెద్దగజ్జె. [2.మూఁడుపంచలుగలది.
ముప్వంచ-తె. (మూఁడు+వంచ) 1. మూఁడు.
ముప్వంటు-తె. (మూఁడు+అంటు) నెలకులోపలి మూఁడుపుపడులు.
ముప్వన్నె-తె. మూఁడువన్నెలుకలది. సమా. —మెకము-పెద్దపులి. —విల్లు-ఇంద్రధనుస్సు.
ముప్వీసము-తె. మూఁడువీసములు.
ముప్వురు-చూ. ముగురు. [షితము.
ముషితము-స. (దొంగిలింపఁబడినది.) రూ. మూ
ముష్కము-స. 1. వృషణము. 2. మొత్తము.
ముష్కరుఁడు-స. కుటిలుఁడు.
ముష్టి-స. 1. కత్తిపిడి. 2. పిడికిలి. సమా. ముష్టింపచుఁడు-దరిద్రుఁడు. తె. 1. బిచ్చము. 2. ముసిఁడిచెట్టు.
ముసనాబు-హిం. అందలము ప్రక్కతెర.
ముసరు-తె. కమ్ము, కవియు.
ముసలము-స. రోఁకలి. రూ. ముషలము.
ముసలి-తె. వృద్ధుఁడు. స. బలరాముఁడు. (వ్యు. [ముసలముగలవాఁడు.)
ముసి-తె. బొంకు.
ముసించు-తె. చెడు.
ముసిఁడి-తె. ముష్టిచెట్టు.
ముసిముసినవ్వు-తె. చిఱునవ్వు. [ముద్గరము)
ముసుండి-స. కొయ్యగుదియ. (ఇనుప గుదియ
ముసుఁగు-స. కప్పడు.చూ.ముసుఁగుడు,ముసువు.
ముసురు-తె. విడువనివాన. క్రి. —కొను-, —కవియు-క్రమ్ము. సమా. —మూతి-కోపవికారము [గల మొగము.
ముస్త-స. తుంగ.
ముస్తీదు-హిం. సిద్ధము, రూ. ముస్తీబు, ముస్తాబు.
ముస్తె-వి. (ముస్త) 1. తుంగ. 2. తుంగగడ్డ. రూ. ముస్తియ.
ముహుః-స. మాటికి. (ఆమ్రే. ముహుర్ముహుః)
ముహూర్తము-స. 1.పంద్రెండు క్షణములకాలము. 2. రెండుగడియలకాలము. (వాడుకలో శుభలగ్నము) (వి. మూరుతము, మూర్తము)
ముళ్లయతి-(మిశ్ర)ముడులుపెట్టుయతి,నారదుఁడు.

## మూ

మూఁక-తె. 1.సమూహము.2. సేన. సమా.—విప్పు-చెదర్చునది.
మూఁకుడు-తె. (మూఁత+కుడుక) 1. కుండమీఁదమూసెడు తట్టవంటి మట్టిపాత్ర. 2. మట్టికంచము. 3. మూఁకు.
మూఁగ-తె. 1. దోమ. 2. వి. (మూకుఁడు) నోరులేనివాఁడు, మూఁగవాఁడు. రూ. మూత.
మూఁగు-తె. కవియు. కృ. మూఁక. సమా.మూఁగతీఁట-దట్టముగా పేలినఎక్కువదురదగలతీఁట.
మూఁడు-తె. 1. కలుగు. 2. ముగియు. 3.రెండునొకటి. రూ. మూడు.
మూఁత-తె. 1. మూయుట. 2. మూయఁదగినది.
మూఁపు-తె. భుజశిరస్సు, అంసము.
మూఁపురము-తె. ఎద్దుభుజశిఖరము, కకుదము.
మూకుఁడు-స. 1. మూఁగవాఁడు. రూ. మూకు. [2. ఒకఅసురుఁడు.
మూగురు-చూ. ముగురు.
మూగేలు-తె. చుంచు. [మూరుకొను.
మూచూచు-తె. (మూదు+చూచు) వాసనచూచు,
మూట-తె. ముడియ.
మూటము-చూ. ముటము.
మూడమంచు-తె. దట్టమైనమంచు, హిమాని.
మూడి-తె. గుదము. రూ. ముడ్డి.
మూడు-చూ. మూఁడు.
మూఢుఁడు-స. తెలివిలేనివాఁడు.
మూతము-స. 1. రాజులు చేతిక్రింద నుంచుకొను తలగడ.2.కట్టఁబడినది.[వి.(మూర్తి)రూపము.
మూతి-తె. 1. నోటిపైభాగము. 2. ముఖము. 3.
మూత్రము-స. కాలుపుడి. క్రి. మూత్రించు. సమా. మూత్రకృచ్ఛము-అధికముగామూత్రమువచ్చురో
మూత్రితుఁడు-స.మూత్రమువిడిచినవాఁడు. [గము.
మూదల-తె. (మూల+తల) నిరూపణము, తార్కాణ. క్రి. మూదలించు. కృ. మూదలిక.
మూదలించు-తె. 1. నిరూపించు. 2. ఎచ్చరించు.
మూన-తె. 1. వస్త్రగాలితముచేయఁగా రాలకనిలిచినది. 2. పొట్టుతోఁగూడిన పొల్లుగింజలు.
మూసు-తె. 1. వస్త్రగాలితముచేయు. 2. మూసపో

వఁజేయు. [మూఁత.
మూయు-తె. 1. మూఁతపెట్టు. 2. కప్పు. కృ.
మూర-తె. రెండు జేనలు. సమా. —కోక-బార చాఁపు. —కోల-గజముబద్ధ.
మూరిఁబోవు-తె. 1. అతిశయించు. 2. విజృంభించు. 3. వర్ధిల్లు. 4. సఫలమగు. 5. నశించు.
మూరుకొను-తె. ఆఘ్రాణించు. రూ. మూర్కొను.
మూరుతము-వి. ముహూర్తము. రూ. మూర్తము.
మూర్ఖుఁడు-స. తెలిసితెలియనివాఁడు. రూ. మూర్ఖు.
మూర్ఛ-స. స్మృతితప్పుట, సొమ్మ. క్రి. మూర్ఛిల్లు.
మూర్ఛన-స. సంగీతమందు క్రమముగా ఆరోహణావరోహణము.
మూర్ఛాలుఁడు-స. మూర్ఛారోగముకలవాఁడు.
మూర్ఛితుఁడు-స. 1. మూర్ఛిల్లినవాఁడు. 2. మూర్ఛాలుఁడు. [గలది.
మూర్తము-వి. చూ. మూరుతము. స. స్వరూపము
మూర్తి-స. 1. శరీరము. 2. ప్రతిమ. క్రి. మూర్తీభవించు-రూపొందు.
మూర్ధము-స. తల. సమా. మూర్ధాభిషిక్తుఁడు-రాజు.
మూల-తె. 1. విదిక్కు. 2. గొంది. సమా. —దుంప-మొదటికారణము. —మట్టము-కోణము సరిచూచు మూఁడుమూలలచట్టము. —ముట్టు-ఆమూలము. —ణాయి-వజ్రమణి. రూ. మూలణా. —ఱేఁడు-నిరృతి, కోణపుఁడు.
మూలగ-తె. నెనడు, మజ్జ.
మూలము-స. 1. వేరు. 2. ఊడ. 3. మొదలు.
మూలిక-స. మందాకు, మందువేరు.
మూలుగు-తె. 1. నొప్పిచే ఊమ్మనిధ్వనించు. 2. కూయు. 3. కృ. మూలుగుట.
మూల్యము-స. 1. వెల. 2. జీతము.
మూవ-తె. 1. మువ్వ. 2. వి. మూఁగ.
మూవురు-చూ. ముగురు.
మూష-స. మూస.
మూషకము-స. 1. ఎలుక. 2. పందికొక్కు.-రూ. మూషికము. (వ్యు. వస్తువుల దొంగిలించునది.) సమా. మూషకవాహనుఁడు-వినాయకుఁడు.
మూషితము-చూ. ముషితము. [కరువు.
మూస-వి. (మూష) బంగారులోనగువానినికరఁగు
మూసిక-తె. మంగళసూత్రమందు తాళిబొట్టున కీవలావల కూర్చికట్టుకొను నానుక్రోవి.

## మృ

మృగణ-స. వెదకుట. రూ. మార్గణము.
మృగము-స. 1. పశువు. 2. జింక. 3. అడవియందు తిరిగెడి ఏనుఁగు. సమా. మృగతృష్ణ-ఎండచే దూరమున నీటివలె నగపడునది, మరీచిక. —దంశకము-1. కుక్క. 2. ఎలుఁగుబంటి. —ధూర్తకము-నక్క. —నాభి-కస్తూరి. —మదము. —పై—. —రాజు-సింహము. (ఇట్లు మృగేంద్రుఁడు మొ.) —రిపువు-సింహము. —శిర-ఐదవనక్షత్రము. రూ. మృగశీర్షము. మృగాంకుఁడు-చంద్రుఁడు, జింకతాలుపరి. మృగాజీవనము, —దనము-సివంగి.
మృగయ-స. 1. వేఁట. 2. వెదకుట. [బ్రహ్మ.
మృగయుఁడు-స. 1. వేఁటకాఁడు. 2. బోయ. 3.
మృగవ్యము-స. వేఁట.
మృగ్యము-స. వెదకఁదగినది.
మృడాని-స. పార్వతి.
మృడుఁడు-స. శివుఁడు. (స్త్రీ. మృడాని)
మృణాలము-స. 1. వట్టివేరు. 2. తామరతూఁడు.
మృతము-స. 1. మృతి. 2. యాచితవృత్తి. 3.
మృతి-స. చావు. [మృతినొందినది.
మృత్తిక-స. 1. మన్ను. 2. తొగరిమన్ను. రూ. మృత్తు.
మృత్యువు-స. 1. మరణము. 2. మరణాధిదేవత. సమా. మృత్యుంజయుఁడు-శివుఁడు, మిత్తిగొంగ.
మృత్స్న-స. 1. మంచిమన్ను. 2. తొగరిమన్ను. రూ. మృత్స.
మృధము-స. యుద్ధము. రూ. మృధము.
మృదంగము-స. 1. మద్దెల. 2. తప్పెట. 3. సద్దు.
మృదులము-స. మెత్తనిది.
మృదువు-స. 1. మెత్తనిది. 2. సోమరి.
మృద్వీక-స. ద్రాక్ష. రూ. మృద్విక.
మృష-స. అసత్యము. సమా. మృషావాది-కల్లరి.
మృష్టము-స. కడుగుట మున్నగువానిచే గరగరికైనది.

## మె

మెంచ-వి. (మ్లేచ్ఛుఁడు) తురక.

మెండియము-తె. చూపుడు వ్రేలి ఉంగరము. రూ. మెండెము.

మెందీఁడు-తె. చూపుడువ్రేలు.

మెండు-తె. 1. ఆధిక్యము. 2. అతిశయము. 3. మిట్టు. క్రి. మెండుకొను-1. అతిశయించు. 2. విజృంభించు. 3. నిండుకొను. మెండొడ్డు-ఎదిరించు.

మెంతులు-వి. (మేంథి) ఒక సంబారుదినుసు.

మెకము-వి. (మృగము) 1. నాలుగుకాళ్లజంతువు. 2. జింక. రూ. మెగము. సమా. మెకపుటాము-మృగమదము, కస్తూరి. మెకములతిండి-సివంగి, మృగాదనము.—తేఁడు-సింహము, మృగరాజు.

మెకమెకపడు-తె. ఉద్ధతినొందు. కృ. మెకమెకపాటు.

మెక్కు-తె. తిను.

మెచ్చు-తె. 1. శ్లాఘించు. 2. లక్ష్యపెట్టు. కృ. 3. శ్లాఘన. 4. బహుమానము. 5. ప్రీతి. కృ. మెప్పు, మెచ్చు. సమా. —లచెట్టు-కల్పకము. —లాఁడి-మెచ్చుకొనఁదగిన ఆఁడుది. (పుం. మెచ్చులాఁడు.)

మెటిక-తె. సోపానము. రూ. మెట్టు, మెట్టిక.

మెట్ట-తె. 1. నీటియాధారములేనిచేను. 2. మెరకనేల. 3. పాదము. సమా. —వాలుపిట్ట-కోడి, చరణాయుధము.

మెట్టు-తె. 1. త్రొక్కు. 2. కృ. త్రొక్కుడు. 3. సోపానము. 4. కొండ. 5. సుంకముతీయు ఘట్టము. 6. పులిసినమజ్జిగ. 7. మొత్తము. బ. 8. చెప్పులు. 9. వీణసెరకట్లు. సమా. మెట్టినిల్లు. (ఆఁడుదాని) అత్తగారియిల్లు. మెట్టుఁబ్రాలు-తలఁబ్రాలు.

మెట్టె-చూ. మట్టె.

మెడ-తె. కంఠము. రూ. మెడకాయ. సమా. —మాల-బంగరుహారము,

మెడవాలు-తె. చాకలి, చాకలిది. రూ. మడివాలు, మడివేలు.

మెడిదము-తె. ధ్వని.

మెడుద-తె. పులిసినమజ్జిగ.

మెణకరి-తె. బ్రహ్మచారి.

మెణత-తె. మెల్లె.

మెతక-వి. మృదువైనది. రూ. మెతువు, మెదువు.

మెతుకు-తె. అన్నపుకణము. రూ. మెదుకు.

మెత్త-వి. (మృదువు) 1. పఱుపు. 2. మృదువైనది. క్రి. —ఁబడు, —ఁబాఱు, మెత్తగిల్లు-1. మృదువగు. 2. అణఁగు. కృ. మెత్తఁబాటు-1. మృదుత్వము. 2. ఆలస్యము.

మెత్తదము-తె. మెత్తుట.

మెత్తన-వి. (మృదుత్వము) 1. మార్దవము. 2. శాంతి. 3. తిన్నగా.

మెత్తు-తె. 1. మన్నులోనగువానిదళముగాపూయు. 2. అంటించు, అతికించు. 3. కృ. మెత్తినపూఁత.

మెదడు-వి. (మేదస్సు) తలయందుండుక్రొవ్వు, మస్తిష్కము.

మెదలు-తె. 1. కొంచెముచలించు. 2. సంచరించు. కృ. మెదలిక.

మెదించు-చూ. మెదుచు. రూ. మేదించు.

మెదుక-తె. పిసక. 2. మందము, మందుఁడు.

మెదుకు-చూ. మెతుకు.

మెదుగు-తె. 1. ధాన్యముపొట్టుపోవ నలఁగు. 2. నలఁగు. ప్రే. మెదించు, మెదుచు, మెదుపు.

మెదుగుడు-తె. 1. నలఁగుట. 2. ప్రాఁతవస్త్రము.

మెదుచు-తె. 1. మెదిగించు. 2. కలుపు. రూ. మెదించు, మేదించు.

మెదువు-చూ. మెతుక.

మెనుపు-తె. (కవ్వముతో) ఎనుపు.

మెప్పు-తె. 1. శ్లాఘన. 2. ప్రీతి. 3. వరము. రూ. మెచ్చు.

మెయి-తె. 1. కొన్నియెడల తృతీయా విభక్తియందువచ్చు ప్రత్యయము. 2. దేహము. 3. విధము. 4. పార్శ్వము. 5. వెంబడి. రూ. మయి, మై. సమా. —తాలుపు-ప్రాణి, దేహి. రూ. మయితాలుపు, మైతాలుపు. —పాలు-సగము. రూ. మయిపాలు, మైపాలు. —మఱపు-చూ. పారవశ్యము. రూ. మయిమఱపు, మైమఱపు. —మఱువు-కవచము. రూ. మయిమఱువు, మైమఱువు. —మెయి-అనాయాసము. రూ. మెయిమై, మయిమయి, మైమై. —వడి-చూ. మైవడి. క్రి. —కొను-1. నమ్మతించు. 2. కలుగు. 3. అనుకూలించు. 4. అంగీకరించు. రూ. మయికొను, మైకొను. కృ. మెయికోలు, మయికోలు, మైకోలు. —మఱచు-పారవశ్యమొందు. రూ. మయిమఱచు, మైమఱచు. కృ. మెయిమఱపు.

మెరక-తె. మిట్టనేల.
మెఱచు-తె. తళుక్కని ప్రకాశించు. కృ. మెఱపు.
మెఱపు-తె. 1. తటిత్తు, మించు. 2. ప్రకాశము. సమా. —తీఁగ-తీఁగవంటి మెఱపు.
మెఱము-తె. 1. నాటినముల్లు మొ. ఇటునటు కదల్చు. రూ. మెఱుము. 2. పల్లటీ. [మెచ్చు.
మెఱమెచ్చు-తె. (మెచ్చు+మెచ్చు) మిక్కిలి
మెరమెర-తె. 1. మనోవ్యథ. 2. భేదము. క్రి. —పడు-1. సంశయపడు. 2. వ్యథచెందు. —లాడు-బాధపడు.
మెఱయు-తె. 1. ప్రకాశించు. 2. బయలుపడు. 3. బయలుపఱచు. కృ. మెఱవడి.
మెఱవడి-తె. 1. అతిశయము. 2. ఉద్రేకము. 3. ధైర్యము. 4. నేర్పు. 5. గౌరవము. 6. ఊరే
మెటికలు-తె. పొట్టువీడియువీడనిధాన్యము. [గింపు.
మెటియ-తె. గుండ్రాయి.
మెటియఁడు-తె. చలింపనివాఁడు. (స్త్రీ. మెటియత)
మెఱుఁగు-తె. 1. తళతళమనుకాంతి. 2. తటిత్తు. 3. నేయిమొ. వాని జిడ్డు. సమా. —ఁబోడి-1. మెఱపువలె మనోజ్ఞురాలగు ఆఁడుది. 2. ఆఁడుది. —డుఁబురువు-మిడుఁగుఱుఁబురువు. —రిక్క-1. పగడము. 2. కాంతిగలనక్షత్రము.
మెఱుకు-తె. పెఱుకు, ఉత్పాటించు. [కృ. మెఱపు.
మెఱుము-తె. 1. మెఱచు. 2. మెఱముపొడుచు. 3.
మెలఁకువ-తె. 1. మేలుకొనుట. 2. వర్తనము. 3. జాగ్రత్త. 4. జీవనము. 5. సంచారము.
మెలఁగు-తె. 1. వర్తించు. 2. జాగరూకతతో వర్తించు. 3. సంచరించు. 4. జరగు. కృ. మెలఁకువ. ప్రే. మెలఁచు.
మెలఁత-తె. ఆఁడుది. రూ. మెలఁతుక, మెల్త, మెల్తుక.
మెలకు-తె. జ్వలించు.
మెలపు-తె. 1. మెలయఁజేయు. 2. జాగరూకత. 3. మెత్తఁబాటు. 4. భ్రమణము. రూ. మెల్పు.
మెలయు-తె. 1. వర్తించు. 2. జాగరూకతతో వర్తించు. 3. పెనఁగు.
మెలి-తె. పెన. రూ. మెలిక, మెలుసు. క్రి. —గొను-పెనఁగొను. —వడు. —పై—వెట్టు-పెనవేయు.
మెలియు-తె. పెనఁగు. రూ. మెలయు. కృ. మెలి.
మెలుసు-చూ. మెలి. [మెలిక, మెలుసు. ప్రే. మెలుచు.
మెల్ల-తె. 1. ఒఱగినది. (చూపు.) 2. తిన్నగా.
మెల్లె-తె. చివక.
మెసఁగు-తె. తిను. రూ. మెసవు.

## మే

మే-తె. చూ. మెయి. క్రి. మేకొను-1. సమ్మతించు. 2. పూను. 3. పొందు. రూ. మైకొను. కృ. మేకోలు, మైకోలు. సమా. మేతాలుపు-శరీరి. మే పుట్టువు-1. కూఁతురు. 2. కొడుకు. —మఱువు-చూ. మెయిమఱువు. —మెయి-అనాయాసము. చూ. మెయి
మేండము-స. పొట్టేలు. [మెయి.
మేండ్రించు-తె. భేదించు.
మేంథి-స. మెంతి.
మేఁక-వి. (మేకము) ఛాగము, ఛాగి. సమా. —తిండి-తోఁడేలు. —పోతు-ఛాగము. —రాసి-మేషరాశి. —సొరము-గాంధారస్వరము.
మేఁగు-తె. 1. పూయు. 2. ఆవరించు. 3. నాను. రూ. మ్రేఁగు, మేవు, మ్రేవు.
మేఁడి-తె. నాఁగటిదుంపకు వెనుక నిలువుగాచేర్చిన కొయ్య. సమా. —కోరు-సేద్యముచేయువానికిచ్చుభాగము, మేఁడిపాలు. —చీల-మేఁడి ఊఁడిరాకుండునట్లువేయుచీల. —తోఁక-దున్నెడువారు పట్టుకొనుటకమర్చిన మేఁడిపిడి. —పాలు-మేఁడికోరు. —సోగ-మేఁడితోఁక.
మేఁత-తె. పశ్వాదుల ఆహారము. సమా. మేఁతరి-1. కొందఱు శిల్పులలోముఖ్యుఁడు. క్రి. మేఁతాడు-మేఁతమేయు.
మేకము-స. మేఁక.
మేకు-హిం. చీల.
మేఖల-స. 1. స్త్రీల ఎనిమిదిపేటల మొలనూలు, 2. కొండనడుము. సమా. —కన్యక-నర్మదానది.
మేగలి-తె. పూనిక.
మేఘము-తె. మబ్బు. (వి. మొగులు.) సమా. మేఘద్వారము-ఆకాశము, మొగులుదారి. —నాదము-ఉఱుము, —పుష్పము-1. నీళ్లు. 2. తూర: —వాహనుఁడు-ఇంద్రుఁడు, మబ్బురౌతు.

మేచకము-స. 1. చీఁకటి. 2. నెమలిపురికన్ను.
మేజా-హిం. బల్ల. [3. నలుపు.
మేజోడు-తె. పాదరక్షలకులోపలవేయు వస్త్రకవ
మేట-తె. ఎక్కలి, [చము.
మేటి-తె. 1. అధిపుఁడు. 2. కసవువామి. 3. శ్రే
ష్ఠము. సమా. మేటరి-(మేటి+అరి) శ్రేష్ఠుఁ
మేడ-తె. సౌధము. [డు. క్రి. మేటిల్లు-అతిశయించు.
మేచము-తె. యుద్ధము. క్రి. —పొడుచు-యుద్ధ
ముచేయు. వి. (మేళనము) కూడిక.
మేడి-తె. అత్తిచెట్టు.
మేడుపడు-తె. అజ్ఞతనొందు. రూ. మేడ్పడు.
మేదకము-స. పెళ్లెము. [నివాఁడు.
మేదకుఁడు-తె. 1. కపటములేనివాఁడు. 2. మెత్త
మేదర-తె. వెదురుచాఁపలు మొ. అల్లిజీవించు ఒక
జాతి. (పుం. మేదరి. స్త్రీ. మేదరసాని.)
మేదస్సు-స. మెదడు.
మేదావి-తె. ఔపాసనాగ్ని మసి.
మేదించు-చూ. మెదించు.
మేదిని-స. భూమి. (వ్యు. బలముగలది.)
మేదురము-స. చక్కనై నునుపైనది.
మేధ-స. ధారణాశక్తిగలబుద్ధి.
మేధము-స. యజ్ఞము.
మేధావి-స. 1. చిలుక. 2. మేధగలవాఁడు.
మేధి-స. పసులఁగట్టు గుంజ.
మేధ్యము-స. పవిత్రము.
మేన-తె. మేనిసంబంధము. సమా. —కోడలు-తో
డఁబుట్టినదానికూఁతురు. —బావ-తనకంటె పె
ద్దవాఁడైన మేనత్తమేనమామలకొడుకు. —మ
ఱఁదలు-తనకంటె చిన్నదైన మేనత్త మేనమా
మలకూఁతురు. (పుం. మేనమఱఁది.) —మా
మ-తల్లితోడఁబుట్టినవాఁడు. —యత్త-తండ్రి
తోడఁబుట్టినది. రూ. మేనత్త. —ఱికము-తోఁ
బుట్టుమేనత్తమేనమామల దేహసంబంధభావము.
మేనల్లుఁడు-తోడఁబుట్టినదానికొడుకు. మేనవది
న-తనకంటెపెద్దదైన మేనత్త మేనమామలకూఁ
తురు. [భార్య. రూ. మేన.
మేనక-స. 1. ఒకదేవవేశ్య. 2. హిమవంతుని
మేని-తె. కాంతి.

మేను-తె. 1. శరీరము. 2. జన్మము. 3. పార్శ్వ
ము. రూ. మే, మెయి, మయి, మై. సమా. —
తాలుపు-శరీరి. రూ. మేతాలుపు, మైతాలుపు మొ.
మేపు-తె. 1. మేయఁజేయు. 2. పశుపక్ష్యాదుల
ఆహారము. సమా. మేపరి-తినువాఁడు.
మేయు-తె. పశ్వాదులు మేఁతగొను. కృ. మేఁత.
మేర-వి. (మిర) 1. ఎల్ల. 2. మర్యాద. 3. క్ర
మము. 4. ఏర్పాటు.
మేరువు-తె. 1. సారువ. 2. శిఖరమునందుంచు
మణి. 3, నాయకమణి. స. 1. హేమాద్రి. 2.
ఉత్తరదక్షిణములందలి భూమికొన.
మేలము-తె. పరిహాసము. క్రి. మేలమాడు.
మేలిమి-తె. 1. గౌరవము. 2. అపరంజి.
మేలు-తె. 1. శుభము. 2. ఉపకారము. 3. పు
ణ్యము. 4. సుకృతము. 5. లాభము. 6. విశే
షము. 7. వలపు. 8. శ్రేష్ఠము. 9. ఉపరి.
10. ప్రశంసార్థకము. సమా. మేలిల్లు-మేడ.
మేలుకట్టు-1. ఉల్లెడ. 2. మెట్టు. —చేయి-
1. హెచ్చు. 2. గెలుపుగలది. —బంతి-1.
ఒరవడివ్రాయ మాదిరికి మీఁదవ్రాసినవ్రాఁత. 2.
శ్రేష్ఠము. —మచ్చు-చంద్రశాల. —రాసి-తూ
ర్పెత్తినధాన్యపురాశి. —వాఁడు-1. వలపుకాఁ
డు. 2. ఉత్తముఁడు. క్రి. —కను-నిద్రఁదెలి
యు. రూ. మేల్కను, మేలుకొను. —కాంచు-
పై. — —కొను-1. నిద్రఁదెలియు. 2. మో
హించు. రూ. మేల్కొను. కృ. మేలుకోలు.
—కొలుపు-1. నిద్రలేపు. 2. బి. మేలుకొనఁ
జేయుపాట. 3. నమస్కృతి.
మేవడి-తె. 1. నమ్రత. 2. ఉపాయము. 3. తగి
నది, ఉచితము. [మేషి.)
మేషము-స. 1. గొఱ్ఱెపోతు. 2. ఒకరాశి. (స్త్రీ.
మేహనము-స. 1. మగగుఱి. 2. మూత్రము.
మేహము-స. సుఖరోగము.
మేళనము-స. కూడుట. రూ. మేళకము. క్రి. మేళ
గించు-1. జతగూడు. 2. కలియు. 3. జత
గూర్చు. 4. కలుపు. రూ. మేళవించు.
మేళము-తె. 1. నాదస్వరము మొదలగువాద్యముల
జత. 2. వేశ్యలయాట. స. 1. కూడిక. 2.

రాగానుగుణముగ స్వరస్థానముల మెట్లు కుదుర్చు ట. (ఇవి డెబ్బదిరెండు)

## మై

మై-తె. చూ. మెయి. సమా. —తాలుపు-మేతాలు పు. —పూఁత-అంగరాగము. రూ. మయిపూఁ త, మెయిపూఁత, మేపూఁత. —మై-చూ. మెయిమెయి. —మఱపు-మెయిమఱపు. —మఱువు-చూ. మెయిమఱువు. క్రి. —కొను-సమ్మతించు. కృ. మైకోలు, మయికోలు.
మైకము-తె. మత్తు. రూ. మయికము.
మైజాఱు-హిం. చెఱఁగు, రూ. మయిజాఱు.
మైత్రావరుణి-స. అగస్త్యుఁడు, (వ్యు. మిత్రావరుణులవలనఁగలిగినవాఁడు) [2. అనూరాధ,
మైత్రి-స. 1. మిత్రభావము, రూ. మైత్ర్యము.
మైథునము-స. మిథునకర్మము.
మైద-తె. 1. గోరంట, 2. మైకము. రూ. మయిద.
మైదానము-హిం. బయలుభూమి.
మైదు-తె. 1. మాయ. 2. మైకము. 3. చొక్కపొడి. 4. వశ్యౌషధము. రూ. మయిదు.
మైనము-తె. సిక్థకము. (తేనెతెట్టెనుండితీయువస్తువు) రూ. మయినము.
మైరేయము-స. చెఱకురసమునఁ జేసినకల్లు.
మైల-తె. 1. మాలిన్యము. 2. అశుచిత్వము. 3. మలినవస్త్రము. 4. చీఁకటి. రూ. మయిల. సమా. —క్రోవి-మురళి. మైలారు-ఒకక్షుద్రదేవత. మైలావు-పొగచాయగల ఆవు.
మైలుతుత్తము-వి. మయూరతుత్థము, ఒక నీలపు మందువస్తువు. రూ. మయిలుతుత్తము.
మైవడి-తె. 1. సమ్మతి. 2. అనుకూల్యము. 3. విధము. 4. సౌమ్యత. రూ. మయివడి.

## మొ

మొంచె-తె. బాలికలాడుకొను చిన్నచేట. రూ. మొరిఁచె.
మొండి-తె. 1. చేతులుకాళ్లు తెగినది,—వాఁడు. 2. మూర్ఖుఁడు, మూర్ఖురాలు. 3. మొక్కపోయినది. రూ. మొండు. సమా. మొండరి-మొండితనముగలవాఁడు. మొండికత్తె- —పై.— —పట్టు-మూర్ఖపుపట్టు.
మొండెము-వి. (ముండము) తలతెగిన శరీరము, కబంధము. రూ. మొండియము. సమా. మొండెపుగాము-రాహువు. —రక్కసుఁడు - కబంధుఁడు.
మొకమాలు-హిం. ఒకమేలుదినుసుపట్టు. [ధుఁడు.
మొకము-వి. ముఖము. రూ. మొగము, మోము. సమా. మొక్కట్టు. (మొకము+కట్టు) ముఖవైఖరి. [రూ. మొక్కరము.
మొకరము-తె. 1. స్తంభము. 2. గడెమ్రాను.
మొకరి-వి. (ముఖరము) 1. మ్రోఁగునది. 2. అసంబద్ధవచనములాడునది.
మొక్క-తె. 1. మొలక. రూ. మోక. 2. చిన్నచెట్టు. 3. న్యూనత. రూ. మొఱక. వి. (మోఘము.) 1. వ్యర్థము. 2. మొనమడఁగినది. సమా. —జొన్న-మక్కాదేశమునుండివచ్చిన ఒకతెగజొన్న, మక్కాజొన్న. మొక్కఁడు-బలిసినవాఁడు. —మామిడి - ముంతమామిడి. క్రి. —చెడు-అవమానపడు. —పోవు-1. మొనమడఁగు. 2. భంగపడు. [మొక్కడీఁడు.
మొక్కడి-తె. చిన్నకొమ్ములుగలయేనుఁగు. రూ.
మొకరము-చూ. మొక్కరము.
మొక్కలము-తె. 1. ముష్కరత్వము. 2. శౌర్యము. 3. ధైర్యము. 4. ఉత్సాహము. 5. బ. ముష్కరవచనము. 6. అప్రతిహతము. రూ. మొగ్గలము. క్రి. మొక్కలించు. కృ. మొక్కలింపు.
మొక్కలి-తె. (మొక్కలము+ఇ) 1. ముష్కరుఁడు. 2. శూరుఁడు. రూ. మొక్కలికాఁడు, మొక్కలీఁడు, మొక్కలుఁడు.
మొక్కు-తె. 1. దడంముపెట్టు. 2. ముడుఁగు. 3. కృ. దండము. రూ. మ్రొక్కు. సమా.—బడి-దేవతాప్రార్థన. రూ. మ్రొక్కుబడి.
మొగ-వి. (ముకుళము) 1. మొగ్గ. రూ. మొగడ, (ముఖము) అప్రాణివస్తుముఖము. 2. ద్వారము. 3. మొదలు. సమా. —చాటు-వెగటు, —దల-1. ఎదురు. 2. ముందటిభాగము. —పాళము-ఇల్లులోనగువాని ముందటిభాగము. రూ.

మొగవాళము. —పిఱికి-(మొగము + పిఱికి) తాఁబేలు. —పు (మొగ + పూస) హారాదుల ముఖభాగము. —డు-(మొగ + కూడు) ఇంటి నడికొప్పు. —వడము-ఏనుఁగుమీఁద కప్పెడు కంబళము. క్రి.—కట్టు-మ్రోగు.—కొను-అభిముఖమగు. —తప్పు-విముఖమగు.—తిరుగు. —పై— —పడు-చూచు. [గుడు-ముకుళించు.
మొగడ-వి. చూ. మొగ. క్రి. మొగడించు, ము
మొగము-చూ. మొకము. సమా. మొగముట్టు-అశ్వముఖాలంకారము. —వీణ-ముఖవీణ. —సరి.—పై—సాల-1. నగరితలవాకిటిచావడి. 2. పంచ. రూ. మొగసల, మోసల, మోసాల. (ప్ర. ముఖశాల.) క్రి. మొగమిచ్చు-సుముఖుఁడగు. మొగమోడు-1. దాక్షిణ్యపడు. 2. సంకోచించు. కృ. మొగమోట, మొగమోటము.
మొగరంబము-తె. తుమ్మెద.
మొగరము-తె. వ్యూహము. రూ. మొగ్గరము, మోహరము, క్రి. మొగరించు-1. వ్యూహముపన్ను. 2. ఆక్రమించు. రూ. మోహరించు.
మొగలి-తె. కేతకి. సమా. —పనస-అనాస. —రేకు-1. స్త్రీశిరోభూషణము. 2. కంఠనఖక్షతము. —వాకిలి-1. తలవాకిలి. 2. హజారము. మొగలేఱు-సువర్ణముఖి. [ము. 3. విధము.
మొగి-తె. 1. పూనిక. రూ. ఒగి. 2. మొత్త
మొగియు-తె. 1. పూను. 2. కవియు.
మొగుడు-వి. ముకుళించు. ముడుఁగు. రూ. మొవుడు. ప్రే. మొగుడుచు. మొగుచు. సమా.—దామర-ముడుఁగుదామర.
మొగులు-తె. మేఘము. రూ. మొగిలు, మొయిలు. సమా. —దారి-ఆకసము, మేఘమార్గము.
మొగ్గ-వి. (ముకుళము) 1. విరియనిపూవు. రూ. మొగ, మొగడ. 2. శిరముపాదములతోఁ జేర విల్లువలె వెలికిలవంగుట. క్రి. —వాలు-శిరముపాదముతోఁ జేర వెలికిలవంగు. రూ. మొగ్గవేయు. —విచ్చు-1. వికసించు. 2. యథాయథ
మొగ్గరము-చూ. మొగరము. [లగు.
మొగ్గలము-చూ. మొక్కలము.
మొగ్గు-చూ. మ్రొగ్గు.
మొటిక-తె. 1. మొలక. 2. తునుక. 3. మొట్టు. రూ. మొట్టిక, మోటిక. [గుల్ల.
మొటిమ-తె. ప్రాయమునందు మొగమునలేచుచిన్న
మొట్టికాయ-తె. తలపై పిడికిలివ్రేళ్లనడిమి కొనలతో కొట్టుట, మొట్టు.
మొట్టు-తె. 1. మొట్టికాయవైచు. 2. కృ. మొట్టికాయవైచుట. సమా. మొట్లమారి-మొట్లుతినువాఁడు, మొద్దు. [అంతకము, అంతు.
మొత్తము-తె. 1. సమూహము. 2. తఱచు. 3.
మొత్తు-తె. 1.కొట్టు. 2. నఱకు.3. కృ. దెబ్బ. క్రి. మొత్తులాడు-కొట్లాడు. మొత్తువడు-కొట్టువడు.
మొదలు-తె. 1. ఆది. 2. పూర్వము. 3. మూలము. 4. మూలధనము. సమా. మొదటివేల్పు. బ్రహ్మ. సురజ్యేష్ఠుఁడు. క్రి. మొదలుకొను. —వెట్టు-1. పూను. 2. ప్రారంభించు.
మొదవు-తె. పాఁడియావు.
మొదుక-తె. 1. కఱకు. 2. దట్టము.
మొద్దు-తె. 1. కొమ్మలునఱికినమ్రాను, మోడు. 2. మూఢుఁడు. రూ. మొద్దఁడు. 3. లావు. 4. వాఁడిలేమి. క్రి. —వోవు-వాఁడిలేనిదగు.
మొన-తె. 1. కొన. 2. ముందు. 3. వ్యూహము. 4. సైన్యము. సమా. —కట్టు-1. ఉత్సాహము. 2. ఉత్సహించు. —కాఁడు-1. సేనాపతి. 2. శూరుఁడు. 3. ముఖ్యుఁడు. —గాలు-అస్కంధితము. —కొను-మొనయు.—దప్పు-విముఖ
మొనపు-తె. 1. పూనఁజేయు. 2. పూనిక. [మగు.
మొనయు-తె. 1. పూను. 2. కలుగు. ప్రే. కృ.
మొనరు-తె. ఒప్పు. [మొనపు.
మొన్న-తె. (మొదలు + నాఁడు) కడచినదినమునకు ముందుదినము. [ములు.
మొప్పలు-తె. చేఁప మెడ కిరుప్రక్కలనుండుద్వార
మొప్పె-తె. 1. మూర్ఖుఁడు. 2. కఱకు. రూ. మొ
మొఱ-తె. ఆర్తధ్వని. రూ. మొఱ్ఱ. [ప్పియ.
మొఱఁగు-తె. 1. పొంచు. 2. వంచించు. కృ. 3. వంచన. 4. వంచకుఁడు.
మొఱక-తె. న్యూనత. రూ. మొక్క.
మొఱకదము-తె. దౌష్ట్యము.
మొఱకు-వి. (మూర్ఖ) మూర్ఖుఁడు. రూ. మొఱ

కుఁడు, మోఱకు, మోఱకుఁడు.

మొరటు-చూ. మోటు.

మొరడు-తె. స్థాణువు. రూ. మ్రోడు, మోడు.

మొరపము-తె. మ్రోఁత. రూ. మొరయిక.

మొరము-తె. సన్ననిగులకగలమన్ను. రూ. మొర్మ.

మొరయు-తె. శబ్దించు. రూ. మ్రోఁగు, మ్రోయు. కృ. మొరపము. మొరయిక.

మొఱవ-తె. మొక్క. మొనమడఁగినది.

మొఱసదము-తె. ఉడుపక్షుక్క.

మొరసు-తె. *1*. మొరము. *2*. మోటు.

మొఱి-తె. అంగన్యూనత, రూ. మొఱ్ఱి, మొఱికి.

మొరిఁటె-చూ. మొంటె.

మొఱుఁగు-తె. *1*. కుక్కకూయు. *2*. కూయు. కృ. *3*. కుక్కకూఁత. *4*. కూఁత. రూ. మొఱువు.

మొఱుఁగుడు-తె. కుక్కకూఁత.

మొఱ్ఱ-చూ. మొఱ.

మొఱ్ఱి-చూ. మొఱి.

మొల-తె. *1*. కటిప్రదేశము, నడుము. *2*. చీల. *3*. త్రాసుముల్లు. సమా. —కట్టు-*1*. మొలనూలు. *2*. కట్టుకోక. —కత్తి-బాఁకు. —త్రాడు-పురుషునికటిసూత్రము. —త్రాసు-మొలగల త్రాసు, ముల్లుత్రాసు. —నూలు-ఆఁడువారు అలంకారార్థము ధరించు కటిసూత్రము.

మొలక-తె. *1*. అంకురము. *2*. అంకురితబీజము. రూ. మోక. *3*. వ్రణమునందుపెరుఁగు దుర్మాంసము. *4*. లేఁత. రూ. మొల్క. సమా. —చందురుఁడు-లేనెల. —నవ్వు-లేనవ్వు. —బంగారు-పుట్టలలో పురుగులవలనకలుగు బంగారు. క్రి. —కట్టు-మొలకవచ్చునట్లు విత్తనముల తడిపి మూటకట్టు. మొలకెత్తు-మొలచు. మొల వేయు-నాటు.

మొలచు-తె. అంకురించు, మొలకెత్తు. రూ. మొలతెంచు. ( మొలచు + తెంచు ) కృ. మొలక, మొలవ.

మొలాము-హిం. *1*. బంగారులోనగువానిపూఁత. *2*. పుంటికిపూయుమందు. రూ. ములాము, మోలము, మోళము.

మొల్లమి-తె. సాంద్రము. రూ. మొల్లము.

మొల్లము-తె. *1*. తఱచు. *2*. అధికము. *3*. ధనము.

మొవు-తె. తాటిలోనగువానియందుపుట్టు ముదుత వీడని లేఁతఆకుమొలక. రూ. మొవ్వ. మోవు.

మొవుడు-చూ. మొగుడు.

మొసలి-తె. నక్రము, మకరము. సమా. —తోరణము-మకరతోరణము. —రాసి-మకరరాశి. —వాపోఁగులు-మకరకుండలములు. —వాయి-మొసలినోరుగల కత్తిపిడికొన. రూ. మొసలికాటు.

మొహదా-తె. అడ్డకత్తి.

మొహరీ-హిం. ముప్పదిచిన్నములయెత్తు బంగారు నాణెము.

మొహరు-హిం. ముద్ర.

## మో

మోఁకటించు-తె. మోఁకాళ్ల నేలకాన ముందఱి కొఱగు. రూ. మోఁకటిల్లఁబడు. మోఁకఱిల్లు. మోఁకారించు. కృ. మోఁకఱింత.

మోఁకాలు-తె. ( మోఁద + కాలు ) జానువు.

మోఁచేయి-తె. ( మోఁద + చేయి ) కూర్పరము. రూ. మోఁచెయి. సమా. మోఁచేతిమడుపుటిల్లు-రెండిండ్లుకలిపికట్టినకట్టడము.

మోఁత-తె. బరువు.

మోఁద-తె. మోఁదుచేకట్టిన నెత్తురుగడ్డ. క్రి. మోఁదకట్టు.

మోఁదు-తె. *1*. కొట్టు. *2*. కృ. దెబ్బ.

మోక-చూ. మొలక, మొక్క.

మోకు-తె. లావుత్రాడు. వరాటము.

మోక్షము-తె. *1*. కైవల్యము. *2*. విడుపు.

మోఘము-స. *1*. వ్యర్థము. *2*. దీనము.

మోఘీకృతము-స. వ్యర్థముగాచేయఁబడినది.

మోచ-స. *1*. అరఁటి. *2*. బూరుగు.

మోచక-స. ముచ్చె. రూ. మోచని.

మోచకము-స. *1*. అరఁటి. *2*. మునగ. *3*. విడుచునది. *4*. విసరునది.

మోచనము-స. విడుపు.

మోచితము-స. విడిపింపఁబడినది.

మోచు-తె. *1*. అను. *2*. వహించు. *3*. మొదలుకొను. కృ. మోపు.

మోజు-హిం. అభిలాష.

మోట-తె. *1*. కపిలె. *2*. మొద్దు. సమా. —కత్తి-మచ్చుకత్తి.

మోటబరి-తె. బరువుమోసెడియెద్దు.

మోటించు-తె. ఆనికగా నిలుపు.

మోటిక-చూ. మొటిక.

మోటు-తె. *1*. మోఁదు. *2*. తట్టువగుఱ్ఱము. *3*. పందికెదుట మనుష్యాకారముగా నిలిపిన కపట

లక్ష్యము. 4. మూర్ఖుఁడు, మొండి. సమా. —పట్టు-మొండిపట్టు.

మోట్టాయితము-స. ప్రియునికథాదులందు మనసు తగిలియుండుటను తెలియఁజేయు చెవిఁగోఁకికొనుట మొదలగు స్త్రీల శృంగారచేష్ట.

మోడము-తె. మేఘావరణము.

మోడి-తె. 1. గణికాదులు మొగ్గవాలి కాలికి సమీపమందుంచినవస్తువునెత్తుట. 2. మాంత్రికు లుంచినవస్తువు నట్టివారు ఎత్తువేడుక. 3. బింకము.

మోడు-తె. స్థాణువు. రూ. మొరడు. మ్రోడు. క్రి. —పడు-1. మోడగు. 2. మొక్కవోయగు. 3. ఖండితమగు. రూ. మోడ్పడు.

మోడుచు-తె. మొగుడుచు. రూ. మోడ్చు. కృ. మోడ్పు. మోడుపు.

మోద-తె. తమలపాకులకట్ట.

మోదకము-స. కుడుము.

మోదమానము-స. సంతోషించుచున్నది.

మోదము-స. సంతోషము. రూ. ముదము. క్రి. మోదించు, మోదిల్లు.

మోదుగు-తె. కింశుకవృక్షము. రూ. మోదువు.

మోపి-తె. విధవ.

మోపిక-తె. భారము.

మోపు-తె 1. మోయఁజేయు. 2. ఆనించు. 3. ఆరోపించు. 4. గడ్డిలోనగువాని పెద్దకట్ట. 5. భారము. 6. వింటినారి. 7. అధికము. సమా. మోపరి-మోయువాఁడు. మోపాది-అపాయము. మోపుకాఁడు-మోచువాఁడు. —దల-1. ఆరోపణము. 2. భారము. క్రి. మోపిడు, మోపెట్టు-విల్లెక్కిడు.

మోము-చూ. మొకము. సమా. —ముట్టు-మొగముట్టు. క్రి. మోమోడు-మొగమోడు. కృ. మోమోట, మోమోటము. మోపి.

మోయు-తె. (భారము) వహించు. కృ. మోఁత,

మోర-తె. 1. పశ్వాదులదీర్ఘముఖము. 2. (నిందయందు) మనుష్యముఖము. సమా. —త్రోపు-పరాఙ్ముఖత్వము. క్రి. మోరటిల్లు-మోముమీఁదికెత్తు.

మోరపాక-చూ. ఓరపాక.

మోరు-తె. 1. పర్వతశిఖరము. 2. మజ్జిగ.

మోఱకము-వి. మూర్ఖము.

మోఱకు, మోఱకుఁడు-చూ. మొఱకు.

మోలము-చూ. ములాము. మోళము.

మోవి-తె. పెదవి.

మోవు-చూ. మొవు.

మోష-స. దొంగతనము, చౌర్యము.

మోషకుఁడు-స. దొంగ.

మోస-వి. (మోష) 1. దొంగతనము. 2. ప్రమాదము. 3. వంచన. రూ. మోసము. సమా. —గాఁడు-వంచకుఁడు. క్రి. —పోవు-1. ప్రమాదపడు. 2. వంచింపఁబడు.

మోసల, మోసాల-చూ. మొగసాల.

మోసు-తె. 1. మోవు. 2. మొలక.

మోహనము-స. మూర్ఛ. క్రి. మోహించు.

మోహము-స. 1. అజ్ఞానము. 2. మూర్ఛ. 3. వలపు.

మోహరము-చూ. మొగరము. క్రి. మోహరించు-1. ఎదుర్కొను. 2. వ్యూహముపన్ను.

మోహితుఁడు-స. మోహమునొందినవాఁడు.

మోహిని-స. 1. ఒకస్త్రీదేవత. 2. ఒకపిశాచస్త్రీ.

## మౌ

మౌంజి-స. ముంజదర్భ, మొలత్రాడు, ముంజి.

మౌక్తికము-స. ముత్తెము. (ఇదిపుట్టుచోట్లు: ఏనుఁగు కుంభస్థలము, మేఘము, పందికోఱ, శంఖము, చేఁపతల, పాముపడగ, ముత్తెపుచిప్ప, చెఱకు, బోలువెదురు.)

మౌఖరి-స. ముఖరత్వము. రూ. మౌఖర్యము.

మౌఢ్యము-స. మూఢత్వము.

మౌనము-స. మాటాడకుండుట.

మౌని-స. మౌనముగలవాఁడు, ముని.

మౌరజికుఁడు-స. మురజమువాయించువాఁడు, మార్దంగికుఁడు.

మౌరి-తె. నాదస్వరము. రూ. మవురి.

మౌర్ఖ్యము-స. మూర్ఖత్వము.

మౌర్వి-స. అల్లెత్రాడు.

మౌలికము-స. మూలముగలది.

మౌల్యము-స. మూలబలము.

మౌష్కర్యము-స. ముష్కరత్వము.

మౌహూర్తికుఁడు-స. జోస్యుఁడు. రూ. మౌహూర్తుఁడు.

మౌళి-స. 1. సిగ. 2. కొప్పు. 3. కిరీటము. 4

(ఉత్తరపదమైనచో) శ్రేష్ఠుఁడు.

## ౖమ

ౖమంగు-తె. క్రుంగు, ౖవాలు. రూ. ౖమంగఁబడు.
ౖమందిలి-తె. నొచ్చినది. [4. పోలు.
ౖమందు-తె. 1. చచ్చు. 2. చదియు. 3. నొచ్చు.
ౖమక్కు-చూ. మక్కు. [లించు.
ౖమగ్గు-తె. 1. చచ్చు. 2. నష్టమగు. 3. విహ్వ
ౖమదిమము-స. మృదుత్వము, మెత్తన.
ౖమబ్బు-చూ. మబ్బు.
ౖమాఁకు-తె. వృక్షము. చూ. మాఁకు. [కన్ను.
ౖమాఁగు-తె. పోలు. సమా. ౖమాఁగన్ను-పోలిన
ౖమాను-చూ. మాఁకు. సమా. ౖమానిపోటుపులుఁగు, ౖమానుగోయిల-వ్రడంగిపిట్ట, దార్వాఘాటము. ౖమానుౖదిమ్మరి, ౖమానుమనికి-కోఁతి,శాఖామృగను. రూ. ౖమాన్దిౖిమ్మరి, ౖమాన్మనికి. క్రి. —పడు-స్తంభించు. రూ. ౖమాన్పడు. కృ. ౖమానుపాటు, ౖమాన్పాటు. —పిల్లు-స్తంభించు.
ౖమాలు-తె. పోలు. రూ. ౖమాలుదెంచు. ౖపే. ౖమాలుచు, ౖమాల్చు. [గుడువడు-కబళితమగు.
ౖమింగు-తె. కబళించు. కృ. ౖమింగుడు. క్రి. మిం
ౖముక్కు-తె. చెడిపోయినది (ధాన్యము)
ౖముక్కుడి-తె. అల్పము.
ౖముగ్గు-తె. ఇల్లలికినపిమ్మట లతాద్యాకారముగా చేయు అలంకరణము. రూ. ముగ్గు.
ౖముచ్చిమి-తె. దొంగతనము. రూ. ౖముచ్చిలి.క్రి. ౖముచ్చిలించు, ముచ్చిలించు. సమా. ౖముచ్చిలిపోటు - నిద్రించుచుండఁగా పైఁబడి చేయు యుద్ధము. [కృ. ౖముచ్చిమి, ౖముచ్చిలి.
ౖముచ్చిలు-తె. 1. దొంగిలించు. 2. వంచించు.
ౖముచ్చు-తె. 1. దొంగ. 2. అరఁటిపూవులోనుండు తెగనివస్తువు. రూ. ముచ్చు. సమా. —గోర-పెద్దదొంగ. —ౖపొద్దు-అర్ధరాత్రము.
ౖమేగు-తె. 1. పూయు. 2. ఆవరించు. రూ. మేగు, మేవు, ౖమేవు.
ౖమొక్కు-తె. 1. నమస్కరించు. 2. కృ. నమస్కారము. రూ. మొక్కు. సమా. ౖమొక్కుబడి-దేవతాప్రార్థన. రూ. మొక్కుబడి.
ౖమొక్కుడు-తె. నమస్కారము.
ౖమొగ్గు-తె. 1. మోఁకరిల్లు. 2. ఎక్కువ. రూ. మొగ్గు. క్రి. ౖమొగ్గఁబడు, ౖమొగ్గతిల్లఁబడు, ౖమొగ్గతిలఁబడు, ౖమొగ్గతిల్లు, ౖమొగ్గతిలు.
ౖమోఁగు-తె. శబ్దించు. రూ. ౖమోవు. కృ. ౖమోఁ
ౖమోఁత-తె. ధ్వని. [గుడు.
ౖమోఁడు-తె. 1. స్థాణువు. 2. మొక్క. రూ. మొరడు, మోడు. క్రి. —పడు-మొక్కపోవు.
ౖమోయు-తె. శబ్దించు, ౖమోఁగు. రూ. మొరయు.
ౖమోల-తె. ఎదురు. [కృ. ౖమోఁత.

## మ్ల

మ్లానము-స. వాడినది. [నది.
మ్లిష్టము-స. 1. స్పష్టముకానిది (మాట) 2.వాడి
మ్లేచ్ఛుఁడు-స. 1. ఆచారహీనుఁడు. 2. పాపరతుఁడు. 3. తురక. సమా. మ్లేచ్ఛముఖము-రాగి, తామ్రము.

## య

యంత-స. 1. సారథి. 2. మావటివాఁడు.
యంత్రణము-స. 1. బంధనము. 2. రక్షణము.3. నియమనము.క్రి. యంత్రించు.
యంత్రము-స. 1. కష్టముతగ్గుటకై ఏర్పఱచిన సాధనము. 2. బీజాక్షరచక్రము. 3. తిరుగలి.
యంత్రితము-స. బద్ధము.
యక్షిణి-స. 1. గతించినవృత్తాంతములను దెలుపు ఒకవిద్య. 2. యక్షునిభార్య. 3. కుబేరునిభార్య.
యక్షుఁడు-స. 1. దేవతలలో నొకతెగ. 2. కుబేరుఁడు. సమా. యక్షకర్దమము-సుగంధద్రవ్యములు చేర్చిచేసిన కలపము. —ధూపము-సర్జరసము. —రాట్టు-కుబేరుఁడు. (ఇట్లు యక్షేశుఁ
యక్ష్మము-స. క్షయరోగము. [డు. మొ.)
యజనము-స. యజించుట. క్రి. యజించు-1. యజ్ఞముచేయు. 2. అర్చించు. చూ. యజియించు.
యజమానుఁడు-స. 1. యజ్ఞకర్త.2.గృహస్థుఁడు.
యజుస్సు-స. ఒకవేదము.
యజ్ఞము-స. యాగము, వేలిమి. (వి. జన్నము) (పంచమహాయజ్ఞములు:బ్రహ్మయజ్ఞము,దేవయ

జ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్య యజ్ఞము) సమా. యజ్ఞసూత్రము-జందెము. యజ్ఞియము-యజ్ఞమునకుఁ దగినది. యజ్ఞోపవీతము-జందెము.
యజ్వ-స. విధ్యుక్తముగా యజ్ఞముచేసినవాఁడు.
యతనము-స. కడఁక. రూ. యత్నము. (వి. జతనము.)
యతి-స. 1. పద్యవిశ్రమస్థానము. 2. సన్న్యాసి.
యత్నము-స. కడఁక. క్రి. యత్నించు.
యథాక్రమము-స. క్రమము నతిక్రమింపక.
యథాజాతుఁడు-స. మూఢుఁడు.
యథాయథలు-స. చెల్లాచెదరు. [వేగులవాఁడు.
యథార్థము-స. సత్యము. సమా. యథార్థవర్ణుఁడు.
యథేచ్ఛము-స. ఇచ్చవచ్చినట్లు. (ఇట్లు యథేష్టము మొ.) [దబ్బాటుసాకిరి.
యదృచ్ఛ-స. —పై. —సమా. యదృచ్ఛాభిజ్ఞుఁడు.
యద్భవిష్యుఁడు-స. కాఁగలదికాకమానదని స్వప్రయత్నముచేయకుండువాఁడు.
యమకము-స. 1. రెంటికంటె నెక్కువయక్కరము లొక్కతీరునవచ్చు శబ్దాలంకారము. 2. యమళము.
యమము-స. 1. యమళము. 2. హింసాదులవలననుడుగుట. క్రి. యమించు-అణఁచు.
యమళము-స. జంట. (వి. అమడ, జమట, జంట)
యమళిక-స. ఒకచర్మవాద్యము. (వి. జమళిగ)
యమి-స. 1. ముని. 2. హంస.
యముఁడు-స. 1. కాలుఁడు. 2. శని. (వి. జముఁడు) సమా. యమకీటము-కుమ్మరపురుగు. —ధాటి-జముదాడి. —ధారము-ఇరుప్రక్కలవాదరగలకత్తి.
యమున-స. గంగలోచేరు ఒకనది. (వి. జమున) సమా. యమునాభ్రాత-యముఁడు.
యయువు-స. 1. అశ్వమేధయాగ దీక్షితునిచే విడువఁబడినగుఱ్ఱము. 2. గుఱ్ఱము.
యవనిక-స. 1. తెర. 2. తెరచీర. రూ. జవనిక.
యవలు-స. 'బార్లి' అనెడు ధాన్యము.
యవాగువు-స. గంజి. (వి. జావ)
యవీయసి-స. చెల్లెలు. (పుం. యవీయసుఁడు)
యశస్వి-స. కీర్తిగలవాఁడు.
యశస్సు-స. కీర్తి. రూ. యశము. (వి. అసము.) సమా. యశఃపటహము-ఢంక. యశఃకాముఁడు-కీర్తినిగోరువాఁడు. రూ. యశస్కాముఁడు. యశస్కరము-కీర్తినిగలిగించునది.
యష్ట-స. యజ్ఞకర్త. [పెక్కెపుకామ.
యష్టి-స. 1. హారమందలిపేట. 2. చేతికఱ్ఱ. 3.
యష్టిక-స. నూఱుపేటలహారము.

## యా, యి

యాగము-స. వేలిమి.
యాచకుఁడు-స. అడుగువాఁడు. రూ. యాచనకుఁడు.
యాచన-స. అడుగుట, రూ. యాచ్ఞ. క్రి. యాచించు.
యాచితము-స. ఎరవలి. [జ్ఞికుఁడు.
యాజకుఁడు-స. యజ్ఞమునడపువాఁడు. రూ. యా
యాజనము-స. యజింపఁజేయుట.
యాత-స. 1. తోడికోడలు. 2. పోవువాఁడు.
యాతన-స. తీవ్రవేదన, కాఱియ.
యాతము-స. పోయినది, గతము.
యాతుధానుఁడు-స. 1. నిరృతి. 2. రాక్షసుఁడు.
యాతువు-స. 1. రాక్షసుఁడు. 2. బాటసారి. 3. యముఁడు. 4. వాయువు. (వ్యు. వ్యథపెట్టువాఁడు.) [(వి. జాతర.)
యాత్ర-స. 1. పోవుట. 2. పుణ్యక్షేత్రములకేగుట.
యాదస్సు-స. 1. క్రూరజలజంతువు, నీటిదయ్యము. 2. నీరు. 3. నది. సమా. యాదఃపతి-1. సముద్రుఁడు. 2. వరుణుఁడు. రూ. యాదసాంపతి, యాదోనాథుఁడు.
యాదృచ్ఛికము-స. యదృచ్ఛగాఁ గలిగినది.
యాదృశము-స. ఎటువంటిది.
యానము-స. 1. పోవుట. 2. దండెత్తిపోవుట. 3. వాహనము, సమా. యానపాత్రము-పడవ.
యాపనము-స. కడపుట, కాలక్షేపము.
యాప్యము-స. 1. యాపనముచేయఁదగినది. 2. నికృష్టమైనది. సమా. యాప్యయానము-పల్లకి.
యామము-స. 1. (వి.) జాము. 2. యమము.
యామి-స. 1. కులస్త్రీ. 2. తోడఁబుట్టినది.
యామికుఁడు-స. తలారి.
యామిని-స. రాత్రి. రూ. యామవతి.

యామ్య-స. దక్షిణదిక్కు. [భావము కలవాఁడు.
యాయజూకుఁడు-స. పలుమాఱు యజ్ఞముచేయుస్వ
యాయావరము-స. 1. ధాన్యయాచన. (వి. ఆయవారము) 2. అశ్వమేధపుగుఱ్ఱము.
యాయి-స. పోవువాఁడు.
యావనాళము-స. జొన్న.
యాశోదేయుఁడు-స. యశోదకొడుకు.
యియక్షువు-స. యజింపనిచ్ఛగలవాఁడు.
యియాసువు-స. పోవనిచ్ఛగలవాఁడు.

## యు, యూ, యొ, యో, యౌ

యుక్తము-స. 1. బార. 2. కూడుకొన్నది. 3. తగినది.
యుక్తి-స. 1. కూడిక. 2. న్యాయము. 3. ఉపా
యుగపత్-స. ఒక్కుమ్మడి. [యము.
యుగము-స. 1. కృతాది. (ఇవి నాలుగు: కృత, త్రేత, ద్వాపర, కలి.) 2. జత. 3. బార. 4. కాఁడి.
సమా. యుగంధరము-నొగ. యుగాంతము-
యుగళము-స. జత. రూ. యుగళి. [ప్రళయము.
యుగ్మము-స. జత. [మోసెడియెద్దు.
యుగ్యము-స. 1. గజాదివాహనము. 2. కాఁడి
యుతము-స. 1. బార. 2. కూడుకొన్నది.
యుద్ధము-స. కయ్యము.
యువ-స. తొమ్మిదవసంవత్సరము.
యువతి-స. 1. పదియాఱునుండి ముప్పదియేండ్ల వఱకుఁగల వయస్సుగల ఆఁడుది. (పుం. యువుఁడు, యువకుఁడు.) 2. ఆఁడుది.
యువరాజు-స. 1. చిన్నరాజు. 2. రాజువెనుక
యూకము-స. పేను. [రాజ్యమునకురాఁదగినవాఁడు.
యూథము-స. 1. సజాతీయ పశుసమూహము. 2. పశుపక్షిసమూహము. సమా. యూథనాథము-పరికాఁడు. యూథపము—పై.—
యూపము-స. యజ్ఞమందుపశుబంధనార్థమునాటినపై
యూషము-స. పప్పుకట్టు. [పట్టలేని పాలకొయ్య.
యొక్క-తె. సంబంధషష్ఠియందువచ్చు ప్రత్యయ
యోక్త-స. యోగకర్త. [ము.
యోక్త్రము-స. పసులమెడపలుపు. రూ. యోత్రము.
యోగపట్టము-స. యోగులుజందెమువలె వేసికొను వస్త్రపు పట్టె. (వి. యోగపట్టె.)
యోగము-స. 1. అపూర్వవస్తుప్రాప్తి. 2. ధ్యానము. 3. విష్కంభాది. (ఇవి 27) 4. ఉపాయము. 5. కూడిక. 6. ప్రయత్నము. 7. ఔషధము.
యోగవాగలు-వి. (యోగిపాదుకలు) అంతరిక్షమున పోయెడు యోగసిద్ధులు ధరించుపావకోళ్లు.
రూ. యోగవాగములు. [(స్త్రీ. యోగిని.)
యోగి-స. యోగాభ్యాసముచేయువాఁడు. (వి. జోగి)
యోగ్యము-స. 1. తగినది. 2. నేర్పుగలది.
యోచన-స. ఆలోచన. క్రి. యోచించు.
యోజన-స. కూర్పు. క్రి. యోజించు.
యోజనము-స. 1. కూర్పు. 2. ఆమడ. [యోద్ధ.
యోధ-స. యుద్ధముచేయువాఁడు. రూ. యోధుఁడు,
యోని-స. 1. ఆఁడుగుఱి. 2. కారణము. [జోటి)
యోష-స ఆఁడుది. రూ. యోషిత, యోషిత్తు. (వి.
యౌకము-స. ఊపిరికుట్టు.
యౌవతము-స. యువతీసమూహము.
యౌవనము-స. పదియాఱుమొదలు ఏఁబదియేండ్ల వఱకుఁగలప్రాయము.
యౌవరాజ్యము-స. యువరాజు దొరతనము.

## ర

ఱంకు-తె. జారత్వము. క్రి. ఱంకాడు, ఱంకుపోవు. సమా. —ఁబోతు-జారుఁడు, జారిణి.—టాలు-జారిణి. —తెవులు-మేహరోగము. —మగఁడు-జారుఁడు, ఉపపతి. —లాఁడి-జారిణి. ఱంకెత—పై.—
రంకువు-స. తెల్లసిబెండ్రుకలు మెత్తనితోలుగలజింక.
ఱంకె-తె. 1. ఆఁబోతు ధ్వని. 2. ధ్వని.
రంగఁడు-వి. శ్రీరంగనాథుఁడు.
రంగము-తె. సోదె. స. 1. సత్తు. 2. యుద్ధభూమి. 3. నాట్యస్థానము. 4. రంగు. 5. శ్రీరంగము. సమా. రంగవల్లి-ముగ్గు. రంగాజీవుఁడు-1. చిత్తరువువ్రాయువాఁడు. 2. నట్టువుఁడు.
రంగరించు-తె. ద్రవవస్తువుతోచేర్చి వ్రేలికొనతో మర్దించు. రూ. రంగరించు.
రంగు-వి. (రంగము) 1. వర్ణము. 2. కాంతి. 3. సొంపు. సమా. రంగరి-రంగువేయువాఁడు.

రంజకము-తె. తుపాకిచెవిని పెట్టెడుమందు.
రంజకుఁడు-స. *1.* రంజించువాఁడు. *2.* రంగువేయు [వాఁడు.
రంజణ-తె.గాదెవంటికాఁగు.రూ.రంజణి.
రంజనము-స. *1.* ఇంగిలీకము. *2.* ఎఱ్ఱగందము,
*3.* రంజించునది. [రంజించు.
రంజిల్లు-స.*1.*ఎఱ్ఱనగు.*2* అనురాగముపొందు.ప్రే.
రండ-స. *1.* విధవ. *2.* (నిందయందు) జారిణి,
రండుఁడు-స. పుత్త్రుఁడులేకయే మృతినొందినవాఁ [డు.
రంత-స. క్రీడించువాఁడు.
రంతు-వి. (రతి) *1.* సురతము. *2.* క్రీడ. సమా.
—కాఁడు-క్రీడాపరుఁడు.
ఱంతు-తె. కలకలధ్వని. క్రి. ఱంతిల్లు.
రంధ్రము-స. *1.* బెజ్జము. *2.* సందు. *3.* దూఱు.
ఱంపము-తె. పలకలు మొ. కోయుసాధనము,క్రక
చము. సమా. ఱంపకాఁడు-ఱంపముతో కోయు
వాఁడు.
ఱంపిల్లు-తె. *1.* వ్యాపించు. *2.* వర్ధిల్లు. *3.*విజృం
భించు. *4.* అతిశయించు. రూ. ఱంపిలు.
ఱంపు-తె. *1.* కలకలము. *2.* ఉపద్రవము.
రంపె-తె. *1.* మాదిగవాని వెసుకవాదరగల కత్తి.
*2.* తాటాకులుచివ్వుకత్తి. రూ. రంపియ, ఱంపి
య, ఱంపె. సమా. రంపెలాఁడి-రాక్షసకృత్య
ములగల ఆఁడుది.
రంభ-తె. *1.* ఒకఅప్సరస. *2.* అరఁటిచెట్టు.
రంహస్సు-స. వడి. [దరము.
రకము-హిం. *1.* దినుసు. *2.* శ్రేష్ఠము. *3.* సుం
రక్కసి-వి. *1.*రాక్షసుఁడు. *2.*రాక్షసి.రూ. రాకాసి.
రక్కసీఁడు-వి. రాక్షసుఁడు.
రక్కసుఁడు-వి. *1.*రాక్షసుఁడు. *2.*నిర్ఋతి. సమా.
రక్కసులగొంగ-విష్ణువు, దైత్యారి.
ఱక్క-తె. *1.* గీఱు. *2.* కృ. గీఱ. [హ్యము.
రక్కెస-వి. *1.* రాక్షసి. *2.* అయుక్తము. *3.* అస
రక్కొను-తె. *1.* వర్ధిల్లు. *2.* తేరుకొను. *3.* క
లుగు. రూ. రెక్కొను.
రక్తము-స. *1.* నెత్తురు. *2.* కుంకుమ. *3.* రాగి.
*4.* ఎఱుపు. *5.* అనురాగముగలది. సమా. రక్త
పము-*1.*జలగ.*2.*డాకిని.—పుచ్ఛిక-నలికండ్ల
రక్తాక్షి-స.ఏఁబదియెనిమిదవసంవత్సరము.[పాము.
రక్తి-స. *1.* అనురాగము. *2.* ఇంపు.
రక్తిమ-స. రక్తవర్ణము. రూ. రక్తిమము.
రక్ష-స. *1.* రక్షణము. *2.* లక్క. క్రి. రక్షించు.
రక్షకుఁడు-స. రక్షించువాఁడు. రూ. రక్షి.
రక్షణము-స. కాపాడుట. రూ. రక్షము.
రక్షితము-స. రక్షింపఁబడినది.
రక్షితవ్యము-స. రక్షింపఁదగినది. రూ. రక్ష్యము.
రగులు-తె.మండు.రూ. రవులు, రొలు. ప్రే. రగు
లుచు, రవులుచు,రొలుచు.
రచన-స. నిర్మాణము. క్రి. రచించు, రచియించు.
రచయిత-స. రచించినవాఁడు.
రచితము-స. రచింపఁబడినది.
రచ్చ-తె. *1.* రాజమార్గము. *2.* మండపము. *3.*
సభ. *4.* గోష్ఠి. *5.* కలకలము. *6.* కలహము.
సమా. —కొట్టము-మండపము. —పట్టు-—
పై— —బండ-రచ్చపైకూర్చుండుటకువేయఁ
బడినబండ. —మ్రాను-రచ్చపై నీడకై పెట్టిన
రజకుఁడు-స. చాకలవాఁడు. [మ్రాను.
రజతము-స.*1.*వెండి.*2.*తెల్లనిది.సమా.రజతాద్రి-
రజన-తె.సంపాదనము. [వెండికొండ,కైలాసగిరి.
రజని-స. రాత్రి. సమా. రజనీకాంతుఁడు-చంద్రుఁ
డు. —చరుఁడు-*1.* చంద్రుఁడు. *2.* రక్క
సుఁడు. —ముఖము-మునిమాపు.
రజస్సు-స. *1.* ఒకగుణము. *2.* దుమ్ము. *3.* పు
ప్పొడి. *4.* ముట్టునెత్తురు. రూ. రజము.సమా.
రజా-హిం. సెలవు. [రజస్వల-ముట్టుది.
రజాయి-హిం. నడుమదూదిపెట్టికుట్టినదుప్పటి.
రజ్జన-తె. ఆత్మస్తుతి.
రజ్జు-తె. *1.* ప్రేలు. *2.* కృ. వ్యర్థభాషణము. *3.*
రజ్జన. సమా. రజ్జులాఁడి-*1.* వ్యర్థభాషణురా
లు.*2.*ఆత్మస్తుతిపరురాలు. (పుం.రజ్జులాఁడు.)
రజ్జువు-స. *1.* త్రాడు. *2.* ఆఁడుదానిజడ.
రటనము-స. మ్రోఁత.
రటితము-స. నిప్పుమంటమ్రోఁత.
రట్టడి-తె. నింద్యము.
రట్టు-తె. *1.* దూఱు, నింద. *2.* ఉపద్రవము.రూ.
రణనము-స. మ్రోఁత. [ఱట్టు.
రణము-స. *1.* యుద్ధము. *2.* మ్రోఁత.

రణితము-స. 1. మ్రోఁత. 2. మ్రోసినది.
రతనము-వి. (రత్నము) మణి. సమా. రతనపుగని-సముద్రము, రత్నాకరము.—పిల్లి-ఇంద్ర
రతము-స.1.సురతము.2. ఆసక్తము. [ధనుస్సు.
రతి-తె. 1. రతనాలతూనికయందొకయెత్తు. 2. మణుఁగునం దిరువదైదవభాగము. స. 1. సురతము. 2. మన్మథునిభార్య. 3. అనురాగము. సమా. రతిపతి-మన్మథుఁడు.
రత్నము-స.1.మణి,(నవరత్నములు: మౌక్తికము, పద్మరాగము,వజ్రము,ప్రవాళము, మరకతము, నీలము, గోమేధికము, పుష్యరాగము,వైడూర్యము. ఇవి అశ్మజాతి=రాతిసంబంధమైనది,అనశ్మజాతి=రాతిసంబంధములేనిది అని ద్వివిధము.)2. శ్రేష్ఠమైనది. సమా. రత్నగర్భ-భూమి. —గర్భుఁడు-1. సముద్రుఁడు. 2. కుబేరుఁడు. —సానువు-మేరుపర్వతము. రత్నాకరము-సముద్రము. [పిడిమూర అరత్ని)
రత్ని-స. పిడివెలితిమూర. (చిటికెనవ్రేలుచాఁచిన
రథము-స. 1. తేరు. 2. శరీరము. సమా. రథకారుఁడు-1. తేరుచేయువాఁడు. 2. వడ్రంగి. —గుప్తి-చక్రరంధ్రములఁజొప్పించునెమ్ములు. రథాంగము-1. చక్రము. 2. చక్రవాకము.
రథి-స. 1. రథమందుండి యుద్ధముచేయువాఁడు. రూ. రథికుఁడు, రథిరుఁడు 2. రథమునెక్కినవాఁడు. [3. మార్గము.
రథ్య-స. 1. రథసమూహము. 2. రాజమార్గము.
రథ్యము-స. రథమునీడ్చు గుఱ్ఱము.
రదనము-స. పల్లు. రూ. రదము. సమా. రదనచ్ఛదము-పెదవి, పలుకప్పు.
రద్ది-తె. 1. అల్లరి. 2. గొప్పధ్వని. రూ. రద్దు.
రద్దు-తె. రద్ది. హిం. కొట్టివేయుట.
రపణము-తె. గొప్ప.
రపము-తె. ఉపద్రవము.
ఱప్ప-తె. చిన్నఱాయి.
రప్పించు-తె. రాఁజేయు.
రభసము-స. 1. వేగము. 2. సంతోషము.
రమ-స. లక్ష్మి. సమా. రమానాథుఁడు-విష్ణువు, లక్ష్మీపతి.(ఇట్లు రమాపతి,రమాధవుఁడు మొ.)
రమణ-వి. (రమణము) 1. ఒప్పిదము. 2. ప్రీతి. 3. విధము. రూ. రవణ, రాణ. క్రి. రమణించు, రవణించు.
రమణి.స. క్రీడించునట్టి ఆఁడుది. 2. ఆఁడుది.
రమణీయము-స. ఒప్పిదమైనది.
రయము-స. వేగము.
రల్లకము-స. కంబళి.
రవ-వి. (లవము) 1. అణువు. 2. సన్నము. 3. ఖండము. తె. 1. వజ్రము. 2. రవణము.
రవగాలు-తె. ఆస్కందితము. రూ. రవాలు.
రవడి-తె. అప్పు, ఋణము.
రవణ-చూ. రమణ. క్రి. రవణించు.
రవణము-వి. భూషణము. స. మ్రోఁగునది.
రవము-స. 1. ధ్వని. 2. కంఠధ్వని. రూ.రావము.
రవరవ-తె.1.కాంతి.2.స్పర్థ.
ఱవఱవ-తె. కోపవికారమునందగు ననుకరణము.
రవళి-వి. (రవము) ధ్వని. రూ. రవాళి. క్రి. రవ
రవి-స. సూర్యుఁడు. [ళించు, రవాళించు.
ఱవిక-తె. కంచెల. రూ. ఱయిక, ఱైక.
ఱవ్వ-తె. నింద. క్రి. ఱవ్వాడు-నిందించు.
రశన-స. పదియాఱుపేటలుగలఆఁడుదానిమొలనూ
రశ్మి-స.1.వెలుఁగు.2.పగ్గము. [లు.రూ.రసన.
రస-స. 1. భూమి. 2. పాతాళము.
రసన-స. 1. నాలుక. 2. రశన.
రసము-స. 1. పాదరసము. 2. జలము. 3. రుచి. (ఇవి ఆఱు: ఒగరు, తీపు, ఉప్పు, కారము, చేఁదు, పులుపు.) 4. పసరు. 5. శృంగారాది. (ఇవి తొమ్మిది: శృంగారము, హాస్యము, కరుణ,వీరము,రౌద్రము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము.) సమా. రసజ్ఞ-నాలుక. —జ్ఞుఁడు-రసికుఁడు, పండితుఁడు.—వాదము-పాదరసమునుకట్టి బంగారుచేయువిద్య.
రసాతలము-స. పాతాళము.
రసాయనము-స. 1. తీయనిమందు. 2. మజ్జిగ.
రసాల-స. 1. చక్కెర. 2. నాలుక.
రసాలము-స. 1. చెఱకు. 2. మామిడి.
రసి-తె. పుంటిచీము. రూ. రసిక. [రసికురాలు.)
రసికుఁడు-స. రసమునెఱిఁగినవాఁడు. (స్త్రీ. రసిక,

రసితము-స. 1. ఉఱుము. 2. ధ్వని. 3. మెులా ముచేయఁబడినది. 4. ధ్వనించినది.
రసీదు-హిం. చెల్లుపత్రము.
రస్తు-హిం. వస్తుసంభారము.
రహటము-స. రాట్నము.
రహటు-తె. ఉపద్రవము. రూ. రట్టు, రాటు.
రహస్యము-స. 1. ఏకాంతము. 2. దాఁచఁదగినది.
రహస్సు-స. ఏకాంతము.
రహి-తె. 1. ఆనందము. 2. ఆసక్తి. 3. తెలివి. 4. బాగు. 5. రక్తి. 6. విధము.
రహించు-తె. 1. ఒప్పు. 2. వర్ధిల్లు. రూ. రహియించు.
రహితము-స. విడువఁబడినది.

## రా

రా-తె. 1. నీచమిత్రోద్దేశములందును ప్రశంసార్థమందును ఉపయోగింపఁబడునది. (ఏమిర, ఏమిరా, కానీరా మొ.) 2. రాచ శబ్దమునకు సమాసమునమీఁదివర్ణములోపింపఁగామిగిలినరూపము. సమా. రాకొమరుఁడు-రాజుకొడుకు. —పులుఁగు-కంకపక్షి, రాబందు. —కొమిరె-రాజుకూఁతురు. —ముని-రాచముని. —యంచ-రాజహంస. —రాజు-రాజరాజు.
ఱా-తె. ఱాయిశబ్దమునకు సమాసమందు మీఁదివర్ణములోపింపఁగామిగిలినరూపము. సమా. ఱాపువ్వు-అశ్మపుష్పము. రూ. రాపువ్వు. క్రి. ఱాపడు-1. నిశ్చేష్టనొందు. 2. జడుఁడగు. రూ. రాపడు.
రాంకవము-స. మృగరోమముతో నేయఁబడినది.
ఱాఁగ-తె. 1. జారిణి. 2. ఉద్ధతుఁడు. 3. ధూర్తుఁడు.
రాఁజు-తె. నిప్పంటుకొను. రూ. రంజుకొను.
రాఁబట్టు-తె. 1. ఇచ్చినదిమరలతీసికొను. 2. సేకరించు.
రాక-తె. వచ్చుట. ఆగమనము. రూ. రాకడ.
రాకాసి-చూ. రక్కసి.
రాకించు-తె. మోఁదు.
రాకిడి-తె. జడబిల్ల.
రాకొట్టు-తె. 1. రారా పోరా యను. 2. తిరస్కరించు.
రాక్షస-వి. నలువదితొమ్మిదవ సంవత్సరము.
రాక్షసి-స. రక్కసి. (పుం. రాక్షసుఁడు.) (వ్యు. రక్షించువాఁడు.)
రాగము-స. 1. పాటలోనగు సంగీతధ్వని. 2. అనురాగము. 3. రంగు. 4. ఎఱుపు. సమా. రాగసూత్రము-1. త్రాసుత్రాడు. 2. పట్టుపుత్రాడు. క్రి. రాగిల్లు-రంజిల్లు. ప్రే. రాగించు.
రాగి-తె. 1. తవిఁదపైరు. 2. అశ్వత్థవృక్షము. రూ. రావి. వి. (రక్తము) తామ్రము. రూ. రావి. స. 1. అనురాగముగలది. 2. ఎఱుపుగలది.
రాచ-వి. (రాజ) రాజసంబంధి. సమా. —పుండు-జల్లెడకుఱుపు. (ఇల్లు రాచకుఱుపు.) —పుట్టువు-క్షత్రియుఁడు. —వాఁడు- —పై- —. —వీడు-రాజధాని.
రాచు-తె. 1. ఒరసికొను. 2. ఒరయు. 3. చెఱచు. 4. రుద్దు.
ఱాచు-తె. 1. ఒరయు. 2. రుద్దు.
రాజన్యుఁడు-స. 1. రాజు. 2. క్షత్రియుఁడు.
రాజి-స. 1. పంక్తి. 2. రేఖ. రూ. రాజిక.
రాజసము-స. రజోగుణమువలనఁ గలిగినది.
రాజిల్లు-స. ప్రకాశించు.
రాజితము-స. ప్రకాశితము.
రాజీవము-స. తామర. (వ్యు. అకరువులపంక్తి గలిగినది.)
రాజు-స. 1. ఱేఁడు. 2. రాచవాఁడు. 3. ఇంద్రుఁడు. 4. చంద్రుఁడు. సమా. రాజకము-రాజుల సమూహము. —దంతము-ముందటిపల్లు. —ధాని-రాజువసించునగరము, రాచవీడు. —న్వంతము-మంచిరాజుగలది (దేశము). —భాయము-రాజత్వము. —మార్గము-రథములు మొ. పోఁదగిన పెద్దత్రోవ. —మాషము-అలసందలు. —యక్ష్మము-క్షయరోగము. —రాజు-1. చక్రవర్తి. 2. కుబేరుఁడు. 3. దుర్యోధనుఁడు. 4. చంద్రుఁడు. —వ్రణము-రాచపుండు. —సూయము-ఒకరాజు తక్కిన రాజులను జయించి చేయుయాగము. —హంస-1. ఎఱ్ఱని ముక్కుకాళ్లుగలహంస. 2. రాజశ్రేష్ఠుఁడు. రూ. రాజహంసుఁడు.
రాజ్ఞి-స. రాజుభార్య. (వి. రాణి)
రాటనము-వి. (రహటము) నూలువడికెడుయంత్రము. రూ. రాట్నము.
రాటు-చూ. రహటు. క్రి. రాటుపడు, రాట్పడు.
రాట్టు-స. రాజు.
రాడు-తె. గుంజ, స్తంభము. క్రి. రాపడు.
రాణ-చూ. రమణ. క్రి. రాణించు-ఒప్పు.

రాణి-వి. (రాజ్ఞి) రాజుభార్య. సమా. —వాసము-
1. అంతఃపురము. 2. అంతఃపురస్త్రీ. 3. భార్య.
రాణువ-తె. 1. సేన. 2. పరివారము.
రాతిరి-వి. (రాత్రి) మాపటివేళ. రూ. రెయి, రేయి.
రాత్రి-స. సూర్యాస్తమయమునుండి సూర్యోదయము
వఱకుఁగల కాలము, రాతిరి. సమా. రాత్రించ
రుఁడు-1. నిర్‌ృతి. 2. రాక్షసుఁడు. రూ. రాత్రి
రాద్ధాంతము-స. సిద్ధాంతము. [చరుఁడు.
రాపడు-తె. 1. స్తంభించు. 2. దృఢపడు. 3.
రాయియగు. [రాపు, రాపుడు.
రాపిడి-తె. 1. ఒరయిక. 2. ఉపద్రవము. రూ.
రాపు-తె. రాపిడి. రూ. ఱాపు. క్రి. రాపాడు-రాయు.
రాపుడు-తె. 1. రాచుట, ఒరయిక. 2. గొంతు
కమ్ముట. రూ. రాపిడి, రాపు. [గా రాలిన పొడి.
రాపొడి-తె. (రాచు+పొడి) అకుఱాయితో రాచఁ
రాబందు-వి. (రామబంధు) రాపులుగు, జటాయువు.
రాబడి-తె. వచ్చుబడి, ఆయము.
రామ-స. 1. రమించునట్టి ఆఁడుది. 2. ఆఁడుది.
రామఠము-స. ఇంగువ.
రామతమ్మ-తె. చిలుక.
రామబాణము-స. 1. పుస్తకములను గొఱుకుపురుగు.
2. ఒకతెగమల్లె. 3. అమోఘమైనది.
రామము-స. 1. దుప్పి. 2. ఒప్పిదమైనది. 3. నల్లనిది.
రామునిదాడి-(మిశ్ర) అసంఖ్యము.
రాయఁడు-వి. రాజు. రూ. రావు.
రాయబారము-వి. (రాజభారము) దౌత్యము.
రాయబారి-వి. దూత.
రాయసము-తె. కార్యదర్శిపని.
రాయి-తె. శిల. రూ. ఱాయి. సమా. ఱాతిగుండె-
కఠినహృదయము. —నార-ఒకఓషధి. —
యుప్పు-సముద్రపుటుప్పు, అక్షీబము. —యులి-
కాసెయులి. —వాలు-వజ్రాయుధము.
రాయిడి-తె. 1. ఒరయిక. 2. ఉపద్రవము. రూ.
రాపిడి. క్రి. రాయిడించు-అల్లరిచేయు. సమా.
—కాఁడు-ఉపద్రవము చేయువాఁడు, —గిడి
గిడి-డిండిమవాద్యము.
రాయు-తె. 1. (గొంతు) కమ్ము. 2. ఒరయు.
3. ఎదిరించు. 4. కలహించు. కృ. రాపు.

రాలు-తె. పడు, సమా. —గాయ-చుంట. ప్రే. రా
లుచు, రాల్చు.
రాలుపడు-తె. (ఎలుఁగు) కంపించు. రూ. రాల్ప
డు. కృ. రాలుపాటు, రాల్పాటు.
రాలుపు-తె. రాలుట, రాల్చుట.
రావడి-తె. ఉపద్రవము. రూ. రాయిడి.
రావము-స. ధ్వని. రూ. రవము.
రావి-తె. అశ్వత్థము. రూ. రాగి. సమా. రావిరేక-
బిడ్డలకు కొండెయందుఁగట్టు రావియాకువంటి
రావించు-తె. రప్పించు. [నగ. రూ. రావ్రేక.
రావు-చూ. రాయఁడు.
రావుతు-తె. గుఱ్ఱమునెక్కువాఁడు. రూ. రవుతు,
రావుత్తు, రాహుతు. రాహుత్తుఁడు, రౌతు.
రాశి-స. 1. కుప్ప. 2. మేషాది. (సూర్యుఁడొక
నెలకుదాఁటు పరిమితి. ఇవి పండ్రెండు:
మేషము, వృషభము, మిథునము, కటకము,
సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు,
మకరము, కుంభము, మీనము.) (వి. రాసి)
రాష్ట్రము-స. 1. దేశము. 2. ఉపద్రవము.
రాష్ట్రియుఁడు-స. (నాట్య.) రాజుభార్యతోడఁబుట్టిన
రాసభము-స. గాడిద. (వ్యు. కూయునది) [వాఁడు.
రాసము-స. 1. ఒకానొకక్రీడ. 2. పరిహాసము. 3.
రాసి-వి. రాశి. [సల్లాపము. 4. ధ్వని.
రాహిత్యము-స. రహితభావము, లేమి.
రాహువు-స. ఒకఛాయాగ్రహము, తలగాము.

## రి, రీ

రింఖ-స. 1. గుఱ్ఱపుగిట్ట. 2. ఒక అశ్వగతి. 3.
నృత్యము.
రింఖణము-స. జాఱుట, స్ఖలనము. రూ. రింగణము.
రింగు-తె. వస్త్రపుచ్చె.
రింఛోళి-స. సమూహము.
రింజ-తె. కాలుపట్టవచ్చినవానిని కాలుతప్పించి సం
రింబ-చూ. రిమ్మ. [దిటమెడఁబొదివిపట్టెడిపట్టు.
రికము-తె. భావార్థకప్రత్యయము. రూ. ఱికము. (పె
రిక్క-వి. (ఋక్షము) నక్షత్రము. [ద్దఱికము మొ.)
ఱిక్కించు-తె. నిక్కించు.
రిక్కు-తె. తోఁకఁద్రిప్పుటయందగు ననుకరణము.

రిక్తము-స. వట్టిది.
రిక్థము-స. ధనము.
రిక్షము-స. ఋక్షము. [కృ. ఱిచ్చవాటు.
ఱిచ్చ-తె. నిశ్చేష్టత. క్రి. —పడు-చేష్టలుడుక్కు.
రిత్త-వి. (రిక్తి) 1. వట్టి. 2. కల్ల. 3. ఊరక. సమా. —కత్తె-తేరకత్తె. (పుం. రిత్తకాఁడు)
రిపువు-స. శత్రువు. [క్రి. —పోవు-వ్యర్థమగు.
రిప్పు-తె. వెలితి.
ఱిప్పు-చూ. ఱివ్వు.
రిమ్మ-తె. ఉన్మాదము. రూ. రింబ.
ఱిమ్మ-తె. (చిమ్మనఁ(గోవితో) చిమ్ము.
రిరంస-స. రమింపనిచ్ఛ. (పుం. రిరంసువు.)
రిరక్ష-స. రక్షింపనిచ్ఛ. (పుం. రిరక్షువు.)
రివట-తె. ఉపశాఖ, రెమ్మ. రూ. రివ్వ.
రిష్టము-స. 1. క్షేమము. 2. అశుభము. 3. అభావము.
రిష్టి-స. 1. అశుభము. 2. ఖడ్గము. [4. ఖడ్గము.
రీఢ-స. తిరస్కారము, తెగడిక.
రీణము-స. కాఱినది.
రీతి-స. 1. తెఱఁగు. 2. మేర. 3. కావ్యశైలి పద్ధతి. (ఇవిమూఁడు: వైదర్భి, గౌడి, పాంచాలి.)

## రు

రుంజ-తె. ఒకచర్మవాద్యము.
రుండము-స. 1. తెగినతల. 2. మొండెము.
రుంద్రము-స. విరివియైనది.
రుక్కు-స. 1. సూర్యకిరణము. 2. కాంతి. 3. ఇచ్ఛ. రూ. రుచి. 4. రోగము. రూ. రుజ.
రుక్మము-స. 1. బంగారు. 2. లోహము. సమా. రుక్మకారకుఁడు-కమసలి.
రుగ్ణము-స. 1. విఱిగినది. 2. రోగమునొందినది.
రుచకము-స. 1. మాల్యము. 2. మంగళద్రవ్యము.
రుచి-స. 1. సూర్యకిరణము. 2. కాంతి. 3. ఇచ్ఛ. రూ. రుక్కు. 4. చవి. క్రి. రుచించు.
రుచిరము-స. ఒప్పిదమైనది. రూ. రుచ్యము.
రుజ-స. రోగము. రూ. రుక్కు.
రుటము-వి. 1. రూఢము. 2. దృఢము.
రుట్టు-స. కోపము. రూ. రుష.
రుతము-స. ధ్వని. రూ. రుతి.
రుత్త-తె. నాశము.
రుత్తు-తె. కొట్టు. [న్నది.
రుదితము-స. 1. ఏడ్పు, రోదనము, 2. ఏడ్చుచున్నది.
రుదురక్క-వి. రుద్రాక్షము. రూ. రుదురాక.
రుద్దు-తె. తోము. కృ. రుద్దుడు.
రుద్రుఁడు-స. శివుఁడు. (వ్యు. ప్రళయకాలమున జీవుల నేడిపించువాఁడు.) (ఏకాదశరుద్రులు: అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట, రుద్రుఁడు, హరుఁడు, శంభుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు.) (స్త్రీ. రుద్రాణి.) సమా. రుద్రభూమి-శ్మశానము. రుద్రాక్షము-రుద్రాక్షపూస. రుద్రాక్షి-సందెమల్లె.
రుధిరము-స. 1. నెత్తురు. 2. సింధూరము.
రుధిరుఁడు-స. అంగారకుఁడు.
రుధిరోద్గారి-స. ఏఁబదిఏడవసంవత్సరము.
రుద్ధము-స. 1. అడ్డగింపఁబడినది. 2. చుట్టఁబడినది.
రుబ్బు-తె. నానినబియ్యము మొ. వానిని ఱోటఁ బోసి రుబ్బుగుండుతో గుండ్రముగా త్రిప్పి మెదుపు. సమా. —గుండు-రుబ్బెడుగుండ్రాయి. —ఱోలు-రుబ్బెడుఱాతిరోలు. [రుమాలువు.
రుమాలు-హిం. 1. చేతిగుడ్డ. 2. తలగుడ్డ. రూ.
రురువు-స. నల్లచాఱలదుప్పి.
రువాణము-తె. కాంతి.
రువారము-తె. విలాసచేష్ట.
రువ్వ-తె. దమ్మిడి.
రువ్వము-తె. తడవ. [3. పల్లె. 4. తడవ.
రువ్వు-తె. 1. విసరివైచు. 2. కృ. విసరివైచుట.
ఱువ్వు-తె. 1. విసరివైచు. రూ. ఱుప్పు. 2. తెక్కలిగాలిచప్పుడు, ఱింగు. 3. కూలుటయందగుననుకరణము. రూ. ఱూవు. సమా. —ఁబుఱుఁ
రుష-స. కోపము. రూ. రుట్టు. [గు-కాటుకపిట్ట.
రుసి-వి. ఋషి.
రుసుము-హిం. వేతనము.
రుహము-స. మొలచునది.

## రూ

రూక-వి. (రుక్మము) 1. ధనము. 2. చిన్నమె

త్తు వెండినాణెము.
రూక్షము-స. 1. కఱకైనది. 2. ప్రేమలేనిది.
రూడి-వి. రూఢి.
రూఢము-స. 1. మొలకెత్తినది. 2. ప్రసిద్ధికెక్కినది. 3. నిశ్చయింపఁబడినది. [యము.
రూఢి-స. 1. మొలకెత్తుట. 2. ప్రసిద్ధి. 3. నిశ్చ
రూపకము-స. 1. నాటకము. 2. అఱక్షరములకాలముగల తాళము.
రూపము-స. 1. ఆకారము. 2. వర్ణము. 3. సౌందర్యము. 4. అగ్నిగుణము. 5. స్వభావము. సమా. రూపాజీవ-వేశ్య. క్రి. రూపించు-నిరూపించు.
రూపాయ-వి. (రూప్యము) ఒకవెండినాణెము.
రూపి-స. రూపముకలవాఁడు. (స్త్రీ. రూపిణి.)
రూపు-వి. (రూపము) 1. ఆకారము. 2. చక్కఁదనము. 3. విధము. సమా. రూపరి, రూపసి-సుందరుఁడు, సుందరి. రూపురూపున-సమ్ముఖమున. క్రి. రూపగు-వర్ధిల్లు, రూపడఁగు-చచ్చు. ప్రే. రూపడఁచు. రూపఱు-1. అంగహీనమగు. 2. నశించు. రూపుమాయు-1. నశించు. 2. చచ్చు. ప్రే. రూపుమాపు. —సెడు-నశించు.
రూప్యము-స. 1. రూపాయ. 2. వెండి. 3. సుందరము. రూ. రౌప్యము. [గుంఠితము.
రూషితము-స. ధూళిలోనగువానిచేఁ గప్పఁబడినది,

## రె, రే, రై

రె-తె. ప్రశంసార్థకముల కనుప్రయుక్తమగునది. రూ. రే. (బళిరె, బళిరే. మొ.)
రెంచ-తె. (జూదమందు) రెండు.
రెంట-తె. రెండగుట, ద్వైధము. సమా. —త్రాగుడుతిండి-సింగము. —త్రాగుడు మేకము-ఏనుఁ
రెంటము-తె. మడుపు. [గు, ద్విపము.
రెంటెము-తె. జంటనేఁతవస్త్రము. రూ. రేఁటెము.
రెండు-తె. 1. భేదము. 2. ద్వయము.
రెంబ-చూ. రెమ్మ.
రెక్క-తె. పక్షము. రూ. ఱెక్క.
రెక్కొను-తె. (రేకు+కొను) 1. వర్ధిల్లు. 2. తేఱుకొను. రూ. రక్కొను. కృ. రెక్కోలు.
రెచ్చెల-తె. జగడాలమారి.
రెచ్చు-తె. విజృంభించు.
రెట్ట-తె. 1. భుజము. 2. పక్షిమలము.
రెట్టి-తె. 1. ద్విగుణము. 2. మడుఁగు, గుణము.
రెట్టు-తె. ముతుకబట్ట. [క్రి. రెట్టించు-ద్విగుణించు.
రెడ్డిగము-తె. ముడుఁచుకొన్న ఎడమకాలితొడమీఁద మఱొకపాదముమోపి యాకాలినంగవస్త్రముతో వీఁపునకుఁ జేర్చికట్టుకొని కూర్చుండుట.
రెప్ప-తె. కనుఱెప్ప. చూ. ఱెప్ప, సమా. ఱెప్పపా
రెప్పము-తె. పూర్ణము. [టు-నిమిషము.
రెమ్మ-తె. ఉపశాఖ. రూ. రెంబ, రెబ్బ.
రెమ్ము-తె. 1. ఒడియు. 2. ఒదిసితిగుచు.
రెయి-తె. రాతిరి. రూ. రేయి.
రెల్ల-తె. ఎన్నులో ఒక ముక్క.
ఱెల్లు-తె. కాకివెదురు, శరము. సమా. —చూలి-కుమారస్వామి, శరజన్ముఁడు. —దీవి-కుశద్వీపము.
రే-తె. రె అనుదాని రూపాంతరము. వి. (రాత్రి) చూ. రాతిరి. రూ. రెయి, రేయి. సమా. రేకంటు-సూర్యుఁడు. —చీఁకటి-రాత్రికన్నులు తెలియమి, నిశాంధ్యము.—దొర-చంద్రుఁడు. నిశాపతి. (ఇట్లురేరాజు, రేఱేఁడు మొ.)—ద్రిమ్మరి-రాత్రించరుఁడు. రూ. రేద్రిమ్మరీఁడు. —యెండ-1. వెన్నెల. 2. లేయెండ. —వగలు-అహోరాత్రము. —వెలుఁగు-చంద్రుఁడు.
రేఁగు-తె. 1. ఎగయు. 2. విజృంభించు. 3. ఉద్రేకించు. ప్రే. రేఁచు, రేఁపు. 4. బదరీవృక్షము. రూ. రేను, రేవు.
ఱేఁచు-తె. అడవికుక్క. (ఇదితోదేలుకాదు)
రేఁచు-తె. రేఁగఁజేయు, రేగించు. రూ. రేఁపు.
రేఁటెము-చూ. రెంటెము. [కృ. రేఁపుడు.
ఱేఁడు-తె. 1. దొర. 2. మగఁడు. [3. (లేఖ) జాబు.
రేక-తె. తాటాకుదొప్ప. వి. 1. (రేఖ) గీఱ. 2. పంక్తి.
రేకు-తె. 1. పుష్పదళము. 2. తగడు. 3. ఈఁక. 4. అంచుకమ్ములులేనివస్త్రము. 5. దుప్పటిలోసగము. క్రి. రేకుమడఁచు-అణఁగఁద్రొక్కు. రూ. ఱేకుమడఁచు.
రేఖ-స. 1. మిక్కిలిచేరికయగు వృక్షాదులపంక్తి. 2. పాణిపాదతలములయందలిగీఱ. 3. గీఱ.

(వి. రేక)
రేగడ-తె. బంకమన్ను. రూ. రేగడి, రేవడ, రేవడి.
రేచకము-స. ఊపిరివిడుచుట. (పీల్చుటపూరకము.)
రేచితము-స. వంకరలేకవేగముగాఁబోవుఅశ్వగతి.
రేణము-తె. దూడపేఁడ.
రేణువు-స. దుమ్ము. [రేతము.
రేతస్సు-స. 1. వీర్యము. 2. పాదరసము. రూ.
రేను-తె. బదరీవృక్షము. రూ. రేఁగు.
రేపు-తె. 1. ప్రాతఃకాలము. 2. తరువాతిదినము.
రేఫము-స. రవర్ణము. [రూ. తేపు.
రేయి-వి. రాత్రి. చూ. రే. [2. ఖండించు.
రేయు-తె. 1. విజృంభించు. రూ. రేఁగు, తేయు.
ఱేయు-తె. 1. విజృంభించు. 2. అతిశయించు.
ఱేల-తె. ఆరగ్వధవృక్షము.
రేవ-స. నర్మదానది.
రేవంతుఁడు-తె. అశ్వశిక్షకుఁడు.
రేవడ-చూ. రేగడ.
రేవడు-తె. చాకలి. [రామునిభార్య.
రేవతి-స. 1. ఇరువదియేడవనక్షత్రము. 2. బల
రేవు-తె. 1. నద్యాదులందు దిగుట కనువుగా నేర్ప
ఱచినదారి. 2. ఓడలునిలుచుచోటు. 3. రేఁగుచెట్టు.
రై-స. ధనము. (వి. రో.)
ఱైక-చూ. ఱవిక.
రైతు-హిం. పంటకాఁపు.

## రొ, రో, రౌ

రొ-తె. స్త్రీ సంబోధనమం దనుప్రయుక్తమగునది.
రూ. రో. (అమ్మరొ, అమ్మరో మొ.)
రొంజుడు-తె ప్రలాపము. రూ. రొండుడు, రొద్దు
డు, రోఁజుడు.
రొండి-తె. నడుముపార్శ్వభాగము.
రొండు-తె. శ్వాసరోగము. రూ. రొద్దు.
రొంప-తె. 1. పీనసరోగము. 2. పడిసెము.
రొంపి-తె. అడుసు.
రొక్కము-వి. (రోకము) 1. చేతివెల. 2. ధన
ము. 3. సమూహము. క్రి. రొక్కించు. రొక్క
పఱచు. సమా. రొక్కారొక్కములు-బహు
విధములుగలది, ఉచ్చావచము.
ఱొచ్చు-తె. 1. తిరస్కారము. 2. బురద. 3. అప
వాదము. 4. సందడి. [అట్టు. రూ. రొచ్చె.
రొట్టియ-హిం. కొంచెము గట్టిగా దళముగాచేసిన
రొడ్డ-తె. ఎడమ. రూ. ఱొడ్డ.
ఱొద్దు-తె. అధికము. [రొదాళించు.
రొద-వి. (రుతము) ధ్వని. రూ. రొదాళము. క్రి.
రొప్పు-తె. 1. కూయు. 2. (పులి) కూయు. 3.
కోపించు. 4. తఱుము. రూ. ఱొప్పు.
రొమ్ము-వి. (ఉరము) వక్షము. రూ. ఱొమ్ము.
రొయి-తె. కట్టెనిప్పుమీఁదినిగుఱు. రూ. రొయ్యి.
రొయ్య-తె. పొడవుమీసములుగల ఒగతెగచేఁప.
రొల్లు-తె. ప్రలాపించు. కృ. రొల్లుడు, రొండుడు,
రొద్దుడు.
రో-వి. (రై) 1. వేశ్యకిచ్చుశుల్కము. 2. పందె
ము. 3. కుదువ. 4. ఎరవు, చేబదులు. 5.
చూ. రొ. రూ. రోయి. సమా. రోపడఁతి-వేశ్య.
(ఇట్లు రోయాలు, రోవెలఁది. మొ.)
రోఁకలి-తె. దంచుసాధనము, ముసలము. సమా.
గోఁకటిబండ-1. ఒకపురుగు, శతపది. 2.
పొన్నులేని చిన్నరోఁకలి, బండ.
రోఁజు-తె. 1. నిట్టూర్పు. 2. కృ. నిట్టూర్చు.
రోఁజుడు-చూ. రొంజుడు.
రోఁత-తె. 1. ఏవము. 2. తిట్టు. క్రి. రోఁతగించు.
రోకము-స. 1. ఓడ. 2. బెజ్జము. 3. కదలిక.
4. వెలుఁగు. 5. రొక్కము.
రోకు-తె. వికాసము.
రోగము-స. వ్యాధి.
రోగి-స. రోగముగలవాఁడు. [ఉత్తమస్త్రీ.
రోచన-స. 1. గోరోచనము. 2. ఎఱ్ఱగలువ. 3.
రోచనము-స. ప్రకాశించునది.
రోచిష్ణువు-స. ప్రకాశించువాఁడు.
రోచిస్సు-స. వెలుఁగు. రూ. రోచి.
రోజు-హిం. దినము.
రోటు-తె. ఈఁచ.
రోదనము-స. 1. ఏడ్పు. 2. కన్నీరు. క్రి. రోదించు.
రోదసి-స. 1. మన్ను. 2. మిన్ను. 3. మన్ను
మిన్ను. రూ. రోదస్సు. సమా. రోదసీకుహ
రము-మంటికిమింటికి మధ్యభాగము. రోదోంత

రాశము.—పై—
రోధస్సు-స. తీరము. [చు అనియు.)
రోధించు-స. అడ్డగించు. (అనురోధించు, నిరోధిం
రోపణము-స. మోపుట. రూ. ఆరోపణము, ఆరో
రోపము-స. 1. బాణము. 2. రోపణము. [పము.
రోమంథము-స. నెమరు.
రోమము-స. ముఖముశిరముతక్క తక్కినదేహ
మందలి వెంట్రుక. రూ.లోమము. సమా.రోమ
విక్రియ-రోమాంచము. —శము-1. పంది.2.
గొఱ్ఱె. 3. ఒడలిపై ఎక్కువవెంట్రుకలుగలది.
—హర్షణము, రోమాంచము-గగుర్పాటు. రో
మావళి-నూఁగారు. (రోమరాజి అనియు)
రోయి-చూ.రో.
రోయు-తె. 1. ఏవగించు. కృ. రోఁత. 2. వెద
కు. 3. నిందించు. 4. విడుచు.
రోలంబము-స. తుమ్మెద.
రోలు-తె. 1. బాధచే అఱచు. 2. దంచుట, రుబ్బు
ట కుపయోగించు సాధనము. సమా.—ద్రాను-
ఉత్తరాసి తిరిగెడు ఉతక.
రోషము-స. కోపము.(వి.రోసము) క్రి.రోషించు.
రోసము-వి. (రోషము) కినుక. క్రి. రోసించు.
రోహణము-స. ఎక్కుట. రూ.ఆరోహణము, ఆరో
రోహము-స. 1. ఎక్కుట. 2. మొలక. [హము.
రోహిణి-స. 1. నాలవనక్షత్రము. 2. తొమ్మిదేం
డ్లకన్యక. 3. బలరామునితల్లి.
రోహితము-స. 1. కొరడు. 2. కుంకుమపువ్వు.
3. నెత్తురు. 4. ఎఱుపు. 5. ఎఱ్ఱచేఁప. సమా.
రోహితాశ్వుఁడు-1. అగ్ని. 2. హరిశ్చంద్రుని
కొడుకు.
రోహిషము-స. 1. ఎఱ్ఱమీను. 2. కొండగొఱ్ఱె.
రూ. రౌహిషము.
రౌతు-చూ. రావుతు. రూ. రవుతు.
రౌద్రము-స. 1. నవరసములలో నొకటి. 2.ఎండ.
3. భయంకరము. 4. తీక్ష్ణము.
రౌద్రి-స. ఏఁబదినాలుగవ సంవత్సరము.
రౌప్యము-చూ. రూప్యము.
రౌరవము-స. 1. ఒకనరకము. 2. భయంకరము.
రౌలు-చూ. రగులు. రూ. రవులు.
రౌహిణేయుఁడు-స. 1.బుధుఁడు. 2.బలరాముఁడు.

## ల

ల-తె. ద్వితీయాది బహువచనప్రత్యయము.
లంక-తె. దీవి. స. 1. రావణునిపట్టణము. 2. ఱం
కుటాలు. [యుపవాసము.
లంకణము-వి. (లంఘనము) జ్వరాదులచేసుండెడి
లంకించు-వి. (లంగము) 1. తగులు. 2. పెన
వేయు. 3. అవమానించు.
లంకియ-వి. (లంగము) 1. సంగము. 2.తగులు
పాటు. 3. పెన. రూ. లంకె. [—గొను.
లంగ-వి. (లంఘ) 1. దాఁటు. 2. దూఁకుడు.క్రి.
లంగము-స. సంగము. [వేయు సాధనము.
లంగరు-హిం. ఓడలు నిలుచుటకై అడుగున దిగ
లంఘ-స.దాఁటు.(వి.లంగ.)క్రి. లంఘించు. [ము.
లంఘనము-స.1.దాఁటు. 2.దూఁకుడు.3. లంకణ
లంచము-వి. తనపని నెఱవేఱుటకై యొకనికి
రహస్యముగానిచ్చుధనము. సమా.లంచగొండి-
లంచముతీయుస్వభావముకలవాఁడు. [లంజె.)
లంజ-స. వేశ్య. రూ. లంజిక. (వి. లంజియ,
లంజియ-వి. 1. వేశ్య. 2. ఉంపుడుఁగత్తె. రూ.
లంజె,లంజెత.సమా.లంజెతికము-జారత్వము.
లండి-హిం. కుత్సితుఁడు,—రాలు. రూ. లండు,
లంద-తె. పొట్టివాఁడు. [లండుఁబోతు.
లంపట-తె. 1. శ్రమము. 2. ఆపద.
లంపటుఁడు-స. అత్యాసక్తిగలవాఁడు.
లంపతా-తె. దాసీపుత్త్రుఁడు.
లంపాకము-స. ఆసగలది. [మేఁతమేయునది.
లంపు-తె. దొంగమేఁత. సమా.—లమారి-దొంగ
లంబనము-స. 1. వ్రేలుడు. 2. మెడనువ్రేలు
లంబమానము-స. వ్రేలాడునది. [హారము మొ.
లంబము-స. 1. వ్రేలుడు. 2. దీర్ఘము. సమా.
లంబోదరుఁడు-వినాయకుఁడు.
లంబి-తె. కుటుంబము. రూ. లంబీ, లెంబి.
లంబిక-స. కొండనాలుక.
లంబితము-స. వ్రేలుడు. [తనము.
లంబు-వి. (లంబము) 1. స్థౌల్యము. 2. గొప్ప
లంభనము-స. 1. తిట్టుట. 2. దూషించుట. క్రి.

లంభించు.
లకుచము-స. గజనిమ్మ. రూ. లికుచము.
లకుముకి-తె. చేపలఁబట్టుపిట్ట, మీనువల్లంకి.
లకోరి-తె. 1. క్రూరబాణము. 2. ఒకతెగపావురము. రూ. లకోరీ.
లక్క-వి. (లాక్ష) ఒకచెట్టుబంక.
లక్కనము-వి. (లక్షణము) 1. శాస్త్రము. 2. గుఱుతు.
లక్కిమి-వి. లక్ష్మి.
లక్కుమనుఁడు-వి. లక్ష్మణుఁడు.
లక్ష-స. నూఱువేలు.
లక్షణ-స. సంబంధానుపపత్తి మూలభావనగల శబ్దవృత్తి, గౌణవృత్తి.
లక్షణము-స. 1. గుఱి. 2. గుఱుతు. 3. శాస్త్రము. క్రి. లక్షించు-1. గుఱిచేయు. 2. చూచు.
లక్ష్మము-స. 1. గుఱుతు, మచ్చ.
లక్ష్మి-స. 1. రమాదేవి. 2. సంపద. 3. వస్త్రభూషణాదులచేఁగలుగుశోభ.
లక్ష్యము-స. గుఱి.
లగనము-వి. లగ్నము. రూ. లగ్గము.
లగాము-హిం. కళ్లెము.
లగుడము-స. దండము, కఱ్ఱ.
లగువు-వి. (లఘువు) 1. చులుకన. 2. లాఘవము. 3. గంతు. (లంఘ)
లగ్గ-వి. (లంఘనము) కోటపైకిఁబ్రాఁకుట.
లగ్గు-తె. మేలు.
లగ్నకుఁడు-స. పూఁటకాఁపు.
లగ్నము-స. 1. రాశ్యుదయము. 2. తగులుకొన్నది.
లఘిమ-స. లఘుత్వము. రూ. లఘిమము.
లఘిష్ఠము-స. మిక్కిలి చులుకనైనది. 2. కుఱుచయైనది.
లచ్చనము-వి. 1. (లక్షణము) శాస్త్రము. 2. (లాంఛనము) గుఱుతు.
లచ్చి-వి. (లక్ష్మి.) 1. శ్రీదేవి. 2. సంపద. సమా. —మగఁడు-లక్ష్మీపతి, విష్ణువు. —వారము-గురువారము.
లజ్జ-స. సిగ్గు. క్రి. లజ్జించు. (వి. లజ్జ.)
లజ్జాళువు-స. సిగ్గరి.
లట్టు-తె. 1. పడియు. 2. గాఁడి.
లట్టువ-తె. చిటితాళము.
లడ్డిగ-వి. (లట్టము) కప్పెర.
లడ్డు-వి. (లడ్డువు) చక్కెరపాఁకముతోఁ జేసినభక్ష్యము. రూ. లడ్డువము, లడ్వము.
లత-స. 1. తీఁగ. 2. హారపుపేట. సమా. —కూనస. (మిశ్ర.) లేఁదీఁగవంటి ఆఁడుది. లతాంతము-పూవు.
లతిక-స. 1. తీఁగ. 2. నూఱుపేటలహారము, యష్టిక.
లత్తుక-వి. (అలక్తకము) లాక్షారసము.
లద్ది-తె. గుఱ్ఱము మొ. వాని పేఁడ. రూ. లద్దె. సమా. —పురుగు-పేఁడపురుగు.
లపనము-స. 1. ముఖము. 2. నోరు. 3. మాట.
లపితము-స. 1. మాట. 2. మాటాడఁబడినది.
లప్ప-తె. రాశి.
లప్పము-వి. (లేప్యము) కట్టులసందులకు మెత్తు వజ్రముతోఁజేర్చిన సుద్దముద్ద.
లబ్ధము-స. 1. భాగహారము చేయఁగా ఏర్పడుసంఖ్య. 2. పొందఁబడినది, సమా. లబ్ధవర్ణుఁడు-చదువరి, విద్వాంసుఁడు.
లబ్ధి-స. లాభము.
లభించు-స. ప్రాప్తించు.
లభ్యము-స. 1. లభింపఁదగినది. 2. యుక్తము.
లయ-తె. మోసము. సమా. లయకాఁడు-మోసగాఁడు. స. తాళము.
లయము-స. 1. నాశము. 2. ఆలింగనము. క్రి. లయించు-1. నశించు. 2. సక్తమగు.
లలంతిక-స. మెడనుఁ్వ్రేలాడు హారము మొ.
లలన-స. 1. విలసనశీలయైన ఆఁడుది. 2. ఆఁడుది.
లలాటము-స. నొసలు.
లలాటిక-స. పాపటబొట్టు.
లలామకము-స. బాసికము.
లలామము-స. 1. గుఱుతు. 2. పెక్కెము. 3. (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము.
లలి-తె. 1. క్రమము. 2. ప్రేమ. 3. వికాసము. 4. ఉత్సాహము.
లలితము-స. 1. సౌకుమార్యముచే నగు అంగవిన్యాసరూపమగు స్త్రీల శృంగారచేష్ట. 2. మనోజ్ఞము.
లవంగము-స. కరాంపువు.
లవణము-స. 1. ఉప్పు. 2. లావణ్యముగలది.
లవణి-తె. బిగువు.
లవనము-స. కోఁత. రూ. లావనము. క్రి. లవించు.

లవము-స. 1. భిన్నాంకమందు పైనుండుసంఖ్య. 2. లేశము. 3. కోఁత.
లవలవ-తె. భేదిల్లినది.
లవిటి-తె. తెక్కమొదలు, పక్షతి.
లవిత్రము-స. కొడవలి.
లశునము-స. వెల్లుల్లి.
లసుకు-తె. నాశముచేయు.
లస్తకము-స. ధనుర్మధ్యము, పిడికట్టు.
లహరి-స. పెద్ద అల.

## లా

లాంగలము-స. నాఁగలి. (వ్యు. భూమిలోఁజొచ్చునది.)
లాంగూలము-స. తోఁక.
లాంఛనము-స. 1. గుఱుతు. 2. పేరు.
లాఁక-తె. పక్షియీఁక. సమా. —కట్టు-పెదఱెక్కలు విఱిచికట్టినకట్టు.
లాఁగ-తె. బొటియ. సమా. —డాఁగుడు-పాము.
లాఁగరి-చెవి.
లాఁగు-వి. 1. లంఘనము. 2. చల్లదము. క్రి. లాఁగించు-లంఘించు.
లాఁచు-తె. 1. కవియు. 2. పొంచు. కృ. లాఁపు.
లాఁత-తె. లాయుట.
లాఁతి-తె. అన్యము, వేఱు.
లాఁతు-తె. అధికము.
లాఁపరా-తె. (లాఁపు + రాయి) జలద్వారముఖమున తృణాదికము చొరకుండవేయు గండ్లఱాయి.
లాకలు-తె. పడుగునం దక్కడక్కడ చొప్పించు కఱ్ఱలు.
లాక్ష-స. లక్క, జతువు. రూ. రాక్ష. సమా. లాక్షారసము-పారాణి.
లాగము-వి. లాఘవము.
లాగి-వి. లఘువు, సులభము.
లాగు-తె. 1. ఈడ్పు. 2. కృ. ఈడ్పు. 3. విధము. 4. సమ్మతి. క్రి. లాగించు-కొనిపోవు. లాగుకొను-అపహరించుకొను. లాగులాడు-పెనఁగు.
లాఘవము-స. 1. లఘుత్వము. 2. ఆరోగ్యము.
లాజ(లు)-స. పేలాలు.
లాజము-స. 1. వట్టివేరు. 2. నానబియ్యము.
లాటీ-హిం. దుడ్డుగఱ్ఱ.
లాడము-హిం. (నాల్) గుఱ్ఱము మొ. వాని గిట్టలకుఁగొట్టు ఇనుపబిళ్ల. రూ. లాలము. [బలి.
లాడి-తె. 1. లాడెవేయుటచేఁ గలుగుపుండు. 2. లాతాము.
లాడె-తె. ఎద్దుపైగంత. రూ. లాడియ.
లాతము-తె. సన్న్యాసులుచేతఁబట్టెడుదండము. రూ.
లాభము-స. 1. క్రయవిక్రయములందు వచ్చిన హెచ్చు ధనము. 2. వడ్డి. 3. ప్రాప్తి. క్రి. లాభించు, లభించు.
లామజ్జకము-స. నీటివట్టివేరు.
లాయము-తె. అశ్వశాల.
లాయు-తె. ఉద్రేకించు. కృ. లాఁత.
లాల-స. చొంగ.
లాలనము-స. బుజ్జగము. క్రి. లాలించు.
లాలసు-తె. ఉల్లారుక్రిందిజాలరు. సమా. లాలసరి-గుజ్జుపుజీనుమీఁది ఉల్లారుక్రింద వ్రేలుజల్లులదండ.
లాలసము-స. 1. అధికేచ్ఛ. 2. ఔత్సుక్యము.
లాలాటికుఁడు-స. 1. ప్రభునభిప్రాయము తెలిసికొనువాఁడు. 2. కార్యమందు నేర్పుచాలనివాఁడు.
లాలి-తె. 1. ఉయ్యెల. 2. ఉయ్యాలపాట.
లాలిత్యము-స. లలితభావము.
లాలు-హిం. ఎఱుపు.
లావకము-స. లావుకపిట్ట. [కలో వ్రాసికొనుట.
లావణము-తె. క్రొత్తగావచ్చినకౌలువుడుకానినిపట్టి
లావణి-తె. పుల్లరికైముందుగానిచ్చు ధనము.
లావణ్యము-స. 1. ముఖకాంతి. 2. ఉప్పన.
లావనము-చూ. లవనము. [4. లవిటి. 5. స్థూలము.
లావు-తె. 1. బలము. 2. సామర్థ్యము. 3. అతిశయము.
లావుక-వి. (లావకము) ఒకానొకచిన్నపిట్ట.
లాసకము-స. నెమలి. (వ్యు. ఆడునది.)
లాసకుఁడు-స. ఆటకాఁడు.
లాసము-స. ఆట. (స్త్రీలయాట.) రూ. లాస్యము.
లాసిక-స. ఆటకత్తె.
లాస్యము-స. 1. లాసము. 2. తౌర్యత్రికము.
లాహిరి-హిం. మైకము. రూ. లాహిరీ.

## లి, లీ

లింగఁడు-వి. లింగముధరించువాఁడు, జంగమయ్య.
లింగము-స. 1. పానవట్టముమీఁది శివమూర్తి. 2. మగగుఱి. సమా. లింగకాయ-(మిశ్ర.) మెడను గట్టుకొను లింగము. —దొండ-(మిశ్ర.) లింగమువంటి విత్తుగలదొండ. —పొట్ల-(మిశ్ర.)

లింగముచిత్తుగల పొట్ల. —బీజ-లింగపొట్ల, —వృత్తి-తాఁటదమ్మనివృత్తి.
లింగి-స. తాఁటదమ్మఁడు.
లికుచము-చూ. లకుచము.
లిక్కి-తె. చిన్నకొడవలి.
లిక్ష-స. ఈరుపేను, పేనిగ్రుడ్డు.
లిఖించు-స. వ్రాయు. [లేఖితము.
లిఖితము-స. 1. వ్రాఁత. 2. వ్రాయఁబడినది.రూ.
లిద్ది-తె. 1. లోఁతుపడినమ్రానితోటికిఁ గొబ్బెడు చిమ్మె. 2. పడిసెముచే ముక్కడఁచుకొనుట.
లిపి-స. వ్రాలు. రూ. లిఖి. సమా. —కరుఁడు-వ్రాయసకాఁడు, లేఖరి. రూ. లిపికారుఁడు,లిపీకరుఁడు.
లిప్తకము-స. విషముపూసినబాణము.
లిప్తము-స. పూయఁబడినది.
లిప్స-స. కోరిక.
లిబ్బి-తె. 1. ధనము. 2. రాశి. 3. నిధి. సమా. —పడఁతి-లక్ష్మి. —రాయఁడు-కుబేరుఁడు.
లిమ్మ-తె. ఈఁగలనుదోలుటకై ఉంచుకొనురెమ్మ.
లియ్యము-వి. (లీనము)లయించినది.రూ.లీయము.
లివ-తె. లాఘవము.
లీఢము-స. తినఁబడినది.
లీనము-స. 1, లయించినది. 2. కరఁగినది.
లీల-స. 1. క్రీడ. 2. శృంగారచేష్ట, 3. క్రియ, పని. 4. విధము.

## లు, లూ

లు-తె. ప్రథమాబహువచనప్రత్యయము.
లుంగము-స. పుల్లని మాదీఫలము.
లుంగి-హిం. తురకలమొలబట్ట.
లుంటాకుఁడు-స. దొంగ.
లుంఠనము-స. నేలపొరలిక. రూ. లుఠనము.
లుకలుకలాడు-తె. తడఁబడు.
లుడుగు-తె. పసులమెడనుగట్టు గంట.
లుఠితము-స. నేలపొరలినది. [నది.
లుప్తము-స. 1. దొంగిలించినసొత్తు. 2.లోపించి
లుబ్ధకుఁడు-స. 1. బోయవాఁడు. 2. పిసినిగొట్టు. రూ. లుబ్ధుఁడు.
లులాయము-స. ఎనుఁబోతు. (వ్యు. నీళ్లయందు మునుఁగునది.)
లులి-తె. తక్కువ.
లులితము-స. చలించినది.
లుల్లిగాఁడు-తె. అధముఁడు.
లూటి-హిం. కొల్ల. రూ. లూటీ. తె. 1. దౌడయందలివ్రణము. 2. వ్రణరంధ్రము.
లూత-స. సాలెపురుగు.
లూనము-స. కోయఁబడినది.
లూలామాలము-తె. మోసము.

## లె, లే

లెంక-తె. సేవకుఁడు. రూ. లేఁక.
లెంప-తె. చెంప. సమా. —కాయ-చెంపవ్రేఁటు.
లెక్క-వి. (లేఖ) 1. సంఖ్య. 2. లక్ష్యము. క్రి. —గొను-లక్ష్యపెట్టు.—పెట్టు-సేయు, లెక్కించు-1. లక్ష్యపెట్టు. 2. ఎన్నికచేయు.
లెప్ప-తె. గుటి. రూ. లెప్పము.
లెస్స-తె. 1.క్షేమము. 2.యోగ్యము. 3.శ్రేష్ఠము.
లే-తె. 1. నిశ్చయార్థకము. రూ.లెమ్మ.(కానీ లే మొ.) 2. సమాసమందు లేఁత శబ్దమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. సమా. లేఁగప్పు, లేఁగరువలి, లేఁగొను, లేజందురుఁడు, లేజాన, లేఁజిగురు, లేఁజీఁకటి, లేఁజెక్కు, లేఁదూఁడు, లేఁదెర, లేఁదేటి, లేఁబాయము, లేగాడ్పు, లేనగవు, లేనడుము, లేనెల, లేమావి, లేయెండ మొ.) లేఁబగలు-ప్రాహ్ణము. లేఁప్రొద్దు-అపరాహ్ణము.
లేఁక-చూ. లెంక.
లేఁగ-తె. (లేఁత + కానుపు) దూడ, వత్సము. సమా. లేఁగటియావు-లేదూడగల ఆవు.
లేఁత-తె. 1. తరుణము. 2. చులుకన. 3. సుకుమారము.
లేక-వి. (లేఖ) 1. జాబు. 2. మిక్కిలిచేరికయగు వృక్షాదులవరుస. 3. సమూహము.సమా. లేకరి-వ్రాయసకాఁడు, లేఖకుఁడు.
లేకి-తె. 1. రాలినధాన్యపుగింజలు. 2. అప్రయోజకుఁడు. సమా. —బ్రతుకు-లేకిగింజలేఱిబ్రదికెడుబ్రదుకు. —వాఁడు-లేకిగింజలేఱికొని బ్ర

తుకువాఁడు.
లేఖ-స. 1. మిక్కిలిచేరికయగు వృక్షాదులపంక్తి. రూ. రేఖ. 2. లిపి. 3. జాబు. (వి. లేక) సమా. —హారకుఁడు-జాబుగొనిపోవువాఁడు.
లేఖకుఁడు-స. వ్రాఁతకాఁడు, లేకరి.
లేఖనము-స. వ్రాఁత.
లేఖని-స. వ్రాసెడు కలము. రూ. లేఖిని.
లేఖనికుఁడు-స. 1. జాబుకొనిపోవువాఁడు. 2. తన గుఱుతిడి యొకనిచే వ్రాయించువాఁడు.
లేఖనీయము-స. వ్రాయఁదగినది. రూ. లేఖ్యము.
లేఖితము-చూ. లిఖితము.
లేఖుఁడు-స. వేలుపు. (వ్యు. మంచిరేఖలు కలవాఁడు.) సమా. లేఖర్షభుఁడు-ఇంద్రుఁడు.
లేచు-తె. 1. ఉత్థితమగు. 2.మేలుకొను.3. పొటమరించు. ప్రే. లేపు.
లేట-తె. కొమ్మ, శాఖ.
లేటమొగమువడు-తె. విముఖమగు.
లేటి,లేడి-తె. జింక. సమా. లేడికంటి-మృగాక్షి.
లేదు-తె. ఎలుఁగుబంటి.
లేదుబంతి-తె. బొంతు.
లేపకుఁడు-స. పూయువాఁడు. [నము.
లేపనము-స. 1. అలుకుట. 2. పూఁత. 3. భోజ
లేపము-స. 1. పూఁత. 2. భోజనము. 3. సున్నము మొ. [పఱపు. 3. జూలు.
లేపు-తె. 1. లేవఁజేయు. 2. పడకమీఁదపఱచు
లేప్యము-స. 1. పూఁత. 2. పూయఁదగినది.
లేబరము-తె.1.శూన్యము.2.కష్టము.(లేవభారము)
లేమ-తె. ఆఁడుది. (వ్యు. లేఁత+మగువ)
లేమి-తె. 1. కలుగమి. 2. ఉండమి. 3. దారి
లేమిడి-తె. దారిద్ర్యము. రూ. లేవడి. [ద్ర్యము.
లేలిహానము-స. పాము. రూ. లేలీహానము. (వ్యు. మాటిమాటికి నాలుకచాఁచునది)
లేవడి-చూ. లేమిడి.
లేశము-స. కొంచెము.
లేసు-వి. (లేశము) 1.చులుకన. 2. సులభము.
లేహనము-స. నాకుట.
లేహము-స. భోజనము.
లేహ్యము-స. 1. నాకిభుజింపఁదగినమందు. 2. అమృతము. 3. నాకఁదగినది.

## లొ

లొంక-తె. కోన. [లోఁగు.
లొంగు-తె. 1. లోఁకువగు. 2. వెనుదీయు. రూ.
లొగ్గడి-తె. కలగుండు. క్రి. లొగ్గడిల్లు.
లొచ్చు-తె. తక్కువ. రూ. లొజ్జు.
లొట-తె. అణఁగినది. రూ. లొట్ట, లొత్త.
లొటారము-తె. బొఱియ.
లొటిపిట-తె. ఒంటె. రూ. లొటిపిట్ట, రొట్టిపిట,లొట్టిపిట్ట, లొట్టియ, లొట్టె, లొట్టేనుఁగు.
లొట్ట-తె. 1. మగగుఱి. రూ. లొట్టకాయ. 2. పల్లము. 3.అణఁగినది. సమా.—కన్ను-అణఁగినకన్ను. క్రి. —వేయు-నాలుకతో ధ్వని పుట్టించు. —పోవు-అణఁగు.
లొట్టి-తె. కల్లుతీయుముంత. సమా. —ముచ్చు-దొంగిలి కల్లుత్రాగువాఁడు. [బెట్టు.
లొడపెట్టు-తె. ద్రవద్రవ్యమును చేతితో కలియఁ
లొడిత-తె. ప్రాదేశము, జుత్తిలి. రూ. లొడితిలి.
లొడుగు-తె. ఆవు మెడనుగట్టు లొడుగు లొడుగను [గంట.
లొత్త-చూ. లొట్ట.
లొద్ద-తె. ప్రోవు.
లొద్ది-తె. లోయ.
లొద్దుగు-వి. లోధ్రవృక్షము.
లొల్ల-తె. దున్నిననేలను చదునుచేయుబల్ల.
లొల్లి-తె. తఱచు.

## లో, లౌ

లో-తె. 1. షష్ఠీవిభక్తిప్రత్యయము. 2. వృత్తియందు లోపలశబ్దమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. సమా. లోఁబడు-అధీనమగు. లోగ్రుక్క-మణితము. లోచూపు-లోపలిచూపు, జ్ఞానదృష్టి. లోచెయి-1. అఱచేయి. 2. మర్మము. 3.మర్మము తెలుపువాఁడు. లోతక్కువ-శేషము. లోవైనము-కడచినది. క్రి. లోఁగొను-లోనడఁచుకొను. లోఁబడు-అధీనమగు. లోమాడు-పరదేశములనుండి దిగుమతియగువస్తువు. (వ్యు. వెలిమాడు.)

లోఁకువ-తె. 1. అధీనము. 2. తక్కువ.
లోఁగు-తె. 1. లోఁకువగు. 2. అడఁగు. 3. చొచ్చు. 4. వెనుదీయు. రూ. లోవు. ప్రే.లోఁచు.
లోఁడు-తె. కెల్లగించు. [తులేనిది, ఉత్తానము.
లోఁతు-తె. మిక్కిలిపల్లము. సమా. లోఁతిఁడి-లోఁ
లోకనము-స. చూపు.రూ.ఆలోకనము,విలోకనము.
లోకము-స.1.జనము,2.జగము.త్రిలోకములు:స్వర్గము, మర్త్యము, పాతాళము.పదునాలుగులోకములు: భూలోకము,భువర్లోకము,సువర్లోకము, మహాలోకము,జనలోకము, తపోలోకము,సత్యలోకము (ఇవి ఏడును ఊర్ధ్వలోకములు), అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము (ఇవి ఏడును అధోలోకములు.) సమా. లోకజిత్తు-బుద్ధదేవుఁడు. —బాంధవుఁడు-సూర్యుఁడు.—మాత-1.లక్ష్మి.2.గంగ.లోకాలోకము-(లోకము+అలోకము) భూమినిచుట్టియుండుకొండ,
లోచకుఁడు-స. క్షీరాహారవ్రతుఁడు.[చక్రవాళము.
లోచనము-స. కన్ను.
లోటు-తె. 1. నష్టి. 2.లోపము. [టిది) రూ.లోడీ.
లోడి-తె.సాముచేయువారిసాధనము.(ముసుండివం
లోడు-తె. ఒఱగుదిండు.
లోధ్రము-స. లొద్దుగుచెట్టు.
లోను-తె. 1. లోపల. 2. మొదలు. 3. లోఁకువ. సమా. లోఁగడ-1. అంతరాళము. 2. గతకాలము. లోఁగలి-1. గృహాంతర్భాగము. 2. గృహము. రూ. లోఁగిలి. [లోపించు.
లోపము-స. 1. మఱుఁగుపాటు. 2. తక్కువ.క్రి.
లోపల-తె. 1. లోభాగము. 2. షష్ఠీప్రత్యయము.
లోప్త్రము-స. దొంగిలించినసొమ్ము.రూ.లుప్తము.
లోభము-స. పిసినితనము. లోభి-పిసినివాఁడు.
లోమము-చూ. రోమము.
లోమశుఁడు-చూ. రోమశుఁడు.
లోయ-తె. కొండపగులు. రూ. లోవ.
లోల-స. 1. నాలుక. 2. లక్ష్మి. 3. మిక్కిలి యిచ్చగలది. 4. చలించునది. సమా.లోలాక్షి-1. చలించుకన్నులుగల ఆఁడుది. 2. ఆఁడుది.
లోలాయపడు-తె. శ్రమపడు.

లోలితము-స. ఊఁచఁబడినది.
లోలుపుఁడు-స. మిక్కిలి ఇచ్చగలవాఁడు. రూ. లోలుభుఁడు, లోలుఁడు. [అంచు. 3. చూరు.
లోవ-తె. 1. లోయ. 2.రథముపీఠముమీఁదిచట్టపు
లోవరి-తె. (లోవ+అరి) తొట్టికట్టు.
లోవి-తె. వంటకుండ, స్థాలి.
లోవు-చూ. లోఁగు.
లోష్టము-స. మట్టిపెల్ల. రూ. లోష్టువు.
లోహండి-తె. లోవి, వంటకుండ.
లోహము-స. 1. ఇనుము. 2. బంగారులోనగుఖనిజము. (పంచలోహములు: బంగారు, వెండి, రాగి, ఇత్తడి, ఇనుము, సీసము.) సమా.లోహకారకుఁడు-కమ్మరి. లోహాభిసారము-ఆయుధములు ధరించిన రాజులకు నివాళియిచ్చుట.
లోహలుఁడు-స. స్ఫుటముగాని మాటలుకలవాఁడు.
లోహిక-స. లోహపాత్రము.
లోహితకము-స. కెంపు, పద్మరాగము.
లోహితము-స.1.రక్తచందనము.2. పరిమళచందనము. 3. చెందిరము. 4. నెత్తురు. 5.ఎఱుపు.
లోహితాంగుఁడు, లోహితుఁడు-స. అంగారకుఁడు.
లౌకికము-స. లోకవ్యవహారసిద్ధమైనది. [లవుణి.
లౌడి-వి.(లగుడము)పరిఘము. రూ. లవుడి,లౌణి,
లౌల్యము-స. లోలత్వము.

## వ

వంక-తె. 1. దిక్కు. 2. పక్షము. 3. వాఁగు.4. వంకర. [నానావిధవక్రత్వము.
వంకర-తె. వంక, వక్రత్వము. సమా.—టింకర-
వంకాయ-వి. (వంగ+కాయ) వార్తాకము.
వంకి-తె. బాఁకు. రూ. వంకిణి.
వంకీ-తె. స్త్రీలు సందిటధరించునగ.
వంక్యము-స. ఒంకె.
వంక్షణము-స. గజ్జ.
వంగ-వి. (వంగము) వంకాయచెట్టు.
వంగడము-వి. వంశము. రూ. వంగసము.
వంగము-స. 1. వంగ. 2. తగరము. 3. సత్తు.
వంగు-తె. నమ్రమగు, ముందటికివ్రాలు. ప్రే. వంచు, వాంచు. కృ. వంక, వంకర, వంపు.

సందేశము-స. సమాచారము. సమా. సందేశహరుఁడు-దూత.
సందేహము-స. సంశయము. క్రి. సందేహించు.
సందోహము-స. గుమి.
సంద్రము-చూ. సంద్రము.
సంద్రావము-స. యుద్ధమువలనఁబాఱుట. రూ. సందావము.
సంద్రుఁడు-వి. సముద్రుఁడు.
సంధ-స. 1. ప్రతిజ్ఞ. 2. మేర. 3. సంధ్య.
సంధాత-స. కూర్చువాఁడు.
సంధానము-స. కూర్చుట. సమా. సంధానకరణి-చెడినఅవయవములను కూర్చుఓషధి. చూ. విశల్యకరణి.
సంధాయకుఁడు-స. సంధాత.
సంధి-స. 1. కూడిక. 2. శత్రువుతోడిపొందు. 3. సందు. 4. గౌరంగము. 5. రూపకములందొక యంగము. క్రి. సంధించు-1. కూడు. రూ. సంధిల్లు. 2. కూర్చు.
సంధితము-స. కూర్పఁబడినది.
సంధిత్స-స. సంధింపనిచ్ఛ. (పుం. సంధిత్సువు.)
సంధ్య-స. 1. ప్రొద్దుపుట్టుటకు ముందైదుగడియలవఱకును ప్రొద్దుక్రుంకినవెనుకమూఁడుగడియలవఱకును గల కాలము. 2. సంధి. 3. ప్రతిజ్ఞ.
సంపఁగియ-వి. చంపకము. రూ. సంపఁగి, సంపఁగె, సంపెఁగ.
సంపతిల్లు-వి. సమృద్ధమగు.
సంపత్తి-స. 1. సంపద. 2. సమృద్ధి.
సంపత్తు-స. ఐశ్వర్యము. రూ. సంపద.
సంపన్నము-స. 1. సంపదతోఁగూడినది. 2. సమృద్ధమైనది.
సంపర్కము-స. 1. కలయిక. 2. చేరిక.
సంపాదనము-స. గడించుట. క్రి. సంపాదించు. (పుం. సంపాదకుఁడు.)
సంపాదితము-స. సంపాదింపఁబడినది.
సంపాద్యము-స. గడింపఁదగినది.
సంపాసారి-వి. (సంప్రసారి) కోమటి.
సంపు-తె. రూ. చంపు.
సంపుటము-స. 1. బరణి. 2. ముకుళనము. క్రి. సంపుటించు-ముకుళించు.
సంపృక్తము-స. సంయుక్తము.
సంపెఁగ-చూ. సంపఁగియ.
సంపెట-తె. ఇనుమును సాఁగఁగొట్టు పెద్దసుత్తి. రూ. సమ్మెట. వి. (చర్మయష్టి) కశ, జాటీ.
సంప్రతి-తె. లెక్కసరిచూచు పెద్దకరణము. క్రి. సంప్రతించు-1. లెక్కసరిచూచు. 2. ఆలోచించు.
సంప్రదాయము-స. గురుపారంపర్యము.
సంప్రధారణ-స. (దేనినేని యిదియుక్తమని) సమర్థించుట.
సంప్రహారము-స. 1. యుద్ధము. 2. గమనము.
సంప్రోక్షణము-స. 1. చిలుకరించుట. 2. పరిశుద్ధి చేయుట. క్రి. సంప్రోక్షించు.
సంబంధము-స. 1. చుట్టఱికము. 2. కూడిక. క్రి. సంబంధించు.
సంబంధి-స. 1. చుట్టము. 2. సంబంధముకలవాఁడు.
సంబడము-వి. (సంబలము) 1. దారిబత్తెము. 2. బత్తెము. 3. జీతము. రూ. సంబళము. [సంబళించు.
సంబడించు-తె. 1. వల్లపడు. 2. తెప్పిఱు. రూ.
సంబరము-వి. (సంభ్రమము) 1. వేగిరపాటు. 2. సంతోషము. 3. పండుగ. రూ. సంబ్రము.
సంబరి-తె. తొలఁగుము. రూ. సంబళి.
సంబలము-చూ. శంబలము.
సంబవులు-వి. (సంభరువు) 1. పావకోళ్లు. 2. పాదరక్షలు.
సంబళము-చూ. సంబడము.
సంబళించు-చూ. సంబడించు.
సంబళిక-తె. వక్కాకుతిత్తి. రూ. సంబెళ.
సంబాగువు-తె. ఏఱుదాఁటుసాధనము.
సంబాధము-స. ఇఱుకు.
సంబారము-వి. (సంభారము) కూరలకువలయు వస్తువులు. రూ. సంబారు.
సంబావు-తె. ఒకతెగవరి.
సంబాళించు-తె. 1. ఆదరించు. 2. నెఱవేర్చు. 3. సరిపఱచు. రూ. సమాళించు.
సంబాళిగలు-వి. (సంభరువు) 1. పావకోళ్లు. 2. పాపోసులు.
సంబుద్ధి-స. సంబోధనము.
సంబెళ-చూ. సంబళిక.
సంబోధనము-స. పిలుపు, ఆహ్వానము.
సంభరువు-స. పావలు. రూ. సంభరుక. (వి. సంబాళిగలు.)
సంభళి-స. కుంటెనకత్తె. రూ. శంభళి.
సంభవము-స. 1. పుట్టుక. 2. హేతువు. 3. కూడిక. క్రి. సంభవించు, సంభవిల్లు.
సంభారము-స. 1. సమూహము. 2. పదార్థసంచయము. 3. సర్వ సంపూర్ణత్వము.
సంభావన-స. 1. తలఁపు. 2. సమ్మానము. 3.

ప్రసిద్ధి. క్రి. సంభావించు. [భావ్యము.
సంభావనీయము-స. సంభావింపఁదగినది. రూ. సం
సంభాషణము-స. చక్కఁగామాటాడుట. క్రి. సంభా
సంభూతము-స. పుట్టినది. [షించు.
సంభృతము-స. 1. చక్కఁగా భరింపఁబడినది. 2.
చక్కఁగా ధరింపఁబడినది.[క్రి. సంభోగించు.
సంభోగము-స. 1. మంచిసుఖము. 2. సురతము.
సంభ్రమము-స. 1. వేగిరపాటు. 2. భయము. 3.
ఆదరము. క్రి. సంభ్రమించు-వేగిరపడు.
సంయతము-స. కట్టఁబడినది.
సంయత్తు-స. యుద్ధము.
సంయమనము-స. 1. బంధనము. 2. వ్రతము.
సంయమని-స. యమునిపట్టణము. [సంయామము.
సంయమము-స.హింసాదులవలనవిరమించుట.రూ.
సంయమి-స. ముని.(వ్యు.సంయమముకలవాఁడు.)
సంయుక్తము-స. కూడుకొనినది.
సంయుగము-స. యుద్ధము.
సంయోగము-స. కూడిక. (వ్య. వియోగము)
సంయోజితము-స. మఱొకదానితోకూర్పఁబడినది.
సంరంభము-స. వేగిరపాటు, ఆటోపము. క్రి. సం
సంరబ్ధము-స. సంరంభమునొందినది.[రంభించు.
సంరావము-స. మ్రోఁత.
సంరూఢము-స. పెరిఁగినది.
సంలాపము-స. ప్రీతితోడి పరస్పర సంభాషణము.
సంవత్సరము-స. ఏఁడు. (ఇవి అఱువది: ప్రభవ
సంవర్తకము-స. బలరాముని నాఁగలి. [విభవాది)
సంవర్తము-స. ప్రళయము.
సంవసథము-స.ఊరు. [రూపమగు సంభాషణము.
సంవాదము-స. 1. సమాచారము. 2. ప్రశ్నోత్తర
సంవాహనము-స. 1. చక్కఁగామోయుట. 2. ఒ
డలు పిసుకుట. (పుం. సంవాహకుఁడు.)
సంవిత్తు-స. 1. జ్ఞానము. రూ. సంవిత్తి. 2.సం
కేతము. 3. ప్రతిజ్ఞ. 4. అంగీకారము. 5. ఆ
చారము. 6. యుద్ధము. 7. సంభాషణము.
సంవీతము-స. హారమువలెవేసికొన్నజందెము.
సంవృతము-స. చుట్టుకొనఁబడినది, ఆవృతము.
సంవేగము-స. సంభ్రమము, వేగిరపాటు.
సంవేశని-స. మొగసాల.
సంవ్యానము-స. 1. ఉత్తరీయము. 2. వస్త్రము.
సంశప్తకుఁడు-స.తిరుగననిఒట్టుపెట్టుకొనియుద్ధము
చేయువాఁడు.
సంశయము-స. సందేహము. క్రి. సంశయించు.
సంశయిత-స. సంశయించువాఁడు.
సంశ్రయము-స. ఆశ్రయము. క్రి. సంశ్రయించు.
సంశ్రవము-స. అంగీకారము.
సంశ్రితము-స. ఆశ్రయింపఁబడినది.
సంశ్రుతము-స. అంగీకరింపఁబడినది.
సంశ్లిష్టము-స. కౌఁగిలింపఁబడినది.
సంశ్లేషము-స. కౌఁగిలింత. క్రి. సంశ్లేషించు.
సంసక్తము-స. చేరినది.
సంసక్తి-స. చేరిక.
సంసత్తు-స. కొలువుకూటము.
సంసరణము-స. 1. సంసారము. 2. బాట. 3.
సంసరించు-స. పుట్టు. [యుద్ధప్రారంభము.
సంసర్గము-స. 1. సంబంధము. 2. చేరిక.
సంసారము-స. ఆలుబిడ్డలతోడియునికి.
సంసారి-స. సంసారముకలవాఁడు, గృహస్థు.
సంసృతి-స. సంసారము.
సంసృష్టము-స. సంసర్గమునొందినది.
సంసృష్టి-స. సంసర్గము.
సంస్కారము-స. 1. చక్కఁజేయుట. 2. (శవ
మును) దహించుట. 3.అనుభూతార్థస్మృతి.4.
పాకము. రూ.సంస్క్రియ. క్రి. సంస్కరించు.
సంస్కృతము-స.1.దేవభాష. 2.చక్కఁజేయఁబ
డినది.3.వ్యాకరణశిక్షితమైనది.4. పక్వము చే
సంస్క్రియ-చూ. సంస్కారము. [యఁబడినది.
సంస్తరము-స. 1. చిగుళ్లలోనగువానిచే నేర్పఱ
చినపడక. 2. యజ్ఞము.
సంస్తవము-స. 1. పరిచయము. 2. స్తుతి.
సంస్త్యాయము-స.1.ఇల్లు.2.విరివి.3.సమూహము.
సంస్థాత-స. చక్కఁగా నిలుచుండువాఁడు.
సంస్థానము-స. 1. సన్నివేశము. 2.చతుష్పథము.
3. చిన్నరాజ్యము. 4. మృత్యువు. [డినది.
సంస్థితము-స. 1. చచ్చినది. 2. చక్కఁగా ఉం
సంస్థితి-స. 1. చావు. 2. చక్కనియునికి.
సంస్ఫోటము-స. 1. యుద్ధము. 2. భేదించినది.

సంహతము-స. చక్కఁగా చేరినది.
సంహతి-స. సమూహము.
సంహననము-స. శరీరము. [తి. క్రి. సంహరించు.
సంహరణము-స. చంపుట. రూ. సంహారము, సంహృ
సంహర్త-స. సంహరించువాఁడు. రూ. సంహారకుఁడు.
సంహిత-స. 1. వర్ణసంయోగము. 2. సంధింపఁ
సంహృతము-స. సంహరింపఁబడినది. [బడినది.
సకలము-స. 1. సర్వము. 2. కలతోఁగూడినది.
సకలాతు-హిం. ఉన్నిబట్ట.
సకి-వి. (సఖి) 1. చెలి. 2. ఆఁడుది. రూ. సకియ.
సకిన-తె. 1. కృత్రిమపక్షి. 2. కీఁచుబిళ్ల. 3. బొ
మ్మ. రూ. సగిన. సమా. సకినలమంచము-చి
త్రపుపనిచేసినమంచము.
సకినము-వి. (శకునము) 1. శుభసూచకనిమిత్తము.
2. శుభాశుభసూచకవాక్కు. సమా. సకినపుఁ
బులుఁగు-పైఁడికంటి. [సకిలింత, సగిలింత.
సకిలించు-తె. గుఱ్ఱముకూయు. రూ. సగిలించు. కృ.
సకుఁడు-వి. (సఖుఁడు) చెలికాఁడు.
సకృత్తు-స. అరుదు.
సక్తము-స. ఒకటతగిలినది.
సక్తువు-స. పేలపిండి.
సక్థి-స. తొడ.
సఖి-స. 1. చెలికత్తె. 2. స్నేహితుఁడు. 3. సహాయుఁ
సఖ్యము-స. చెలిమి. [డు. రూ. సఖుఁడు. (వి. సకి.)
సగంధుఁడు-స. స్నేహితుఁడు.
సగటు-హిం. మొత్తము. వి. చదరంగమున శకటము.
సగితు-తె. గుబ్బపుపల్లమునకు రతనాలతో చేసిన
తీఁగమోడిపని.
సగము-వి. (సామి) అర్ధము. రూ. సాము, సవము.
సగోత్రుఁడు-స. దాయ.
సగ్గారి-వి. (సృగాలము) నక్క. రూ. సగ్గాలము.
సగ్గిసముగ్గిసలు-తె. ఉద్దుగుడువు.
సగ్గు-తె. 1. అడఁగు. 2. తగ్గు. రూ. స్రగ్గు.
సమా. —బియ్యము-సాగో (Sago) అను చె
ట్టుపాలనుండిచేయఁబడిన ఒకకృత్రిమధాన్యము.
సగ్గెడ-తె. చెంబు.
సగ్ధి-స. బంతిభోజనము. [సహాయుఁడు.
సచివుఁడు-స. 1. మంత్రి. 2. స్నేహితుఁడు. 3.

సచ్చము-తె. చిల్లరకొక్కుమప్పు.
సచ్చు-రూ. చచ్చు.
సచ్ఛూద్రుఁడు-స. మంచియాచారముగలశూద్రుఁడు.
సజగ్ధి-స. బంతికుడుపు, సగ్ధి.
సజ్జ-స. 1. కవచము. 2. అలంకారము.
సజ్జ-తె. 1. బుట్ట. 2. గంటెపైరు. 3. వి. (సజ్జక)
శిరోగృహము. 4. సూతికాగృహము. 5. ఆయి
తము. సమా. —కట్టు-ఆయితము. —సకోల-
సజ్జక-స. పడకిల్లు. [బెత్తము.
సజ్జకము-తె. మనోజ్ఞము. [మంచివాఁడు.
సజ్జనుఁడు-స. మంచికులమునఁబుట్టినవాఁడు. 2.
సజ్జరసము-వి. (సర్జరసము) ఒకధూపద్రవ్యము.
సజ్జాకారము-వి. (సర్జికాక్షారము) సర్జకవృక్షము
నుండి తీయు ఉప్పు. [చోటు.
సజ్జారము-వి. (సామజాగారము) ఏనుఁగు గట్టు
సజ్జితము-స. 1. కవచము తొడిగినది. 2. అలంక
రింపఁబడినది. [కృతుఁడు.
సజ్జుఁడు-స. 1. కవచముతొడిగినవాఁడు. 2. అలం
సటి-వి. (శఠ) మోసము. స. 1. సన్న్యాసులజడ.
సడపు-తె. అపహరించు. [2. జూలు.
సడలు-తె. 1. ఊడు. 2. జాఱు. 3. వదలు. కృ.
4. ఊడుట. 5. జాఱుట. 6. వదలుట. రూ. సళ్లు.
సడి-తె. 1. అపకీర్తి. 2. నింద. 3. జాడ.
సడించు-తె. దంచు. కృ. సడింపులు-ఎసటిపోఁత
గా దంచిన బియ్యము.
సడికియ-తె. కుక్కమెడత్రాడు. రూ. సడికె.
సడుగు-తె. 1. నడుముకీలు. 2. బ. వంకరమాటలు.
సడ్డ-వి. (శ్రద్ధ) 1. అక్కఱ. 2. లక్ష్యము.
సడ్డకుఁడు-వి. (షడ్డకుఁడు) తోడియల్లుఁడు.
సణుగు-తె. 1. గొణుగు. 2. బాధ.
సత-వి. (సప్త) ఏడు. రూ. సత్తా. సమా. —నాల్కల
జేజే-అగ్ని, సప్తజిహ్వుఁడు. [సంతతము.
సతతము-స. 1. ఎల్లప్పుడు. 2. ఎడతెగనిది. రూ.
సతము-వి. (సతతము) శాశ్వతము.
సతి-స. 1. పతివ్రత. 2. పార్వతి. 3. స్త్రీ.
సతీర్థ్యుఁడు-స. కూడచదువువాఁడు, సహపాఠి.
సత్కారము-స. సమ్మానము. రూ. సత్కృతి, స
త్క్రియ. క్రి. సత్కరించు.

సత్త-వి.(సత్త్వము) శక్తి. రూ. సత్తువ. స. 1. ఉనికి. 2. మంచితనము. 3. విషయము. [శ్రేష్ఠుఁడు.
సత్తముఁడు-స. 1. అందఱికంటె మంచివాఁడు. 2.
సత్తరువు-వి. (సత్రము) అన్నప్రదానగృహము.
సత్తా-చూ. సత.
సత్తి-వి. (శక్తి) 1. ఒకఆయుధము. 2. కాళి. 3. బలము. 4. వసిష్ఠునికొడుకు. సమా. —తాలుపు-కుమారస్వామి, శక్తిధరుఁడు.
సత్తు-తె. 1. సీసము-వి. 2. సత్త్వము. 3. సత్యము. 4. సారము. స. (త్) 1. ఉన్నది. 2. చదువరి. 3. శ్రేష్ఠము. 4. సత్యము. 5. సాధువు.
సత్తువ-వి. (సత్త్వము) 1. దేహబలము. 2. ఎరువు.
సత్పథము-స. 1. మంచిమార్గము. 2. నక్షత్రమార్గము.
సత్యము-స. 1. నిజము. 2. ఒట్టు. 3. కృతయుగము. 4. బ్రహ్మలోకము. సమా. సత్యంకారము-సంచకారము. రూ. సత్యాకృతి. సత్యాపనము.—పై—
సత్త్రము-స. 1. అన్నదానగృహము. 2. బాటసారులవిడిదియిల్లు. (వ్యు. మంచివారినికాపాడునది.)
సత్త్రి-స. ఎడతెగక దానముచేయువాఁడు.
సత్త్వము-స. 1. సత్త. 2. బలము. 3. స్వభావము. 4.
సత్వరము-స. త్వరితము. [ఒకగుణము. 5. జంతువు.
సదనము-స. ఇల్లు. [సేయు-1. నలఁచు. 2. చంపు.
సదమదము-తె. నలఁగినది. రూ. సదసద. క్రి.—
సదము-స. సభ. రూ. సదసు, సదస్సు.
సదస్యుఁడు-స. సభ్యుఁడు.
సదా-స. ఎల్లప్పుడు. సమా. —గతి-1. వాయువు. 2. మోక్షము. 3. సూర్యుఁడు. 4. సర్వేశుఁడు. —తనుఁడు-1. విష్ణువు. 2. శాశ్వతుఁడు. —వృత్తి-బైరాగులు మొ. వారికిచ్చువంటసామగ్రి.
సదాటు-తె. దృఢము. [—శివుఁడు-శివుఁడు.
సదృశము-స. 1. సమానము. 2. తగినది.
సదేశము-స. సమీపము.
సద్దు-వి. (శబ్దము) 1. చప్పుడు. 2. చప్పుడు
సద్మము-స. గృహము. [చేయుట.
సద్యము-స. (స్) అప్పుడు. [గూడినది.
సధర్మము-స. 1. సమానము. 2. ధర్మముతోఁ
సనాతనుఁడు-స. 1. బ్రహ్మ. 2. విష్ణువు. 3. శివుఁడు. 4. శాశ్వతుఁడు.
సనాథము-స. కూడుకొన్నది.
సనాభి-స. 1. జ్ఞాతి. 2. సమానుఁడు.
సని-వి. శని.
సనీడము-స. 1. సమీపము. 2. నీడముతోఁగూడినది.
సనె-తె. నూతెడుటాయి. రూ. సనెకల్లు, సన్నె, సన్నెకల్లు. [మీట.
సన్న-వి. (సంజ్ఞ) 1. సైఁగ. 2. బరువులేపుకఱ్ఱ,
సన్నము-తె. సూక్ష్మము. సమా. సన్నగాఁడు-అల్పుఁడు. రూ. సన్నపువాఁడు. —గాలి-మందమారుతము, పిల్లగాలి. —గాశె-తిరుచిన్నము. క్రి. —గిల్లు-1. సూక్ష్మమగు. 2. కృశించు. 3. తగ్గు. —వాఱు. —పై.—
సన్నహనము-స. 1. కవచము. 2. యత్నము.
సన్నాయి-హిం. నాదస్వరము. [రూ. సన్నాహము.
సన్నాసి-వి. సన్న్యాసి.
సన్నాహము-చూ. సన్నహనము.
సన్ని-తె. తుపాకికొనను చెక్కియుంచు బాఁకువంటి
సన్నికర్షము-స. సమీపము. [కత్తి. రూ. సన్నీ.
సన్నికృష్టము-స. 1. సమీపము. 2. సమీపించినది.
సన్నద్ధుఁడు-స. 1. కవచముతొడిఁగినవాఁడు. 2. ప్రయత్నపడినవాఁడు.
సన్నిధానము-స. 1. సమీపము. 2. ఆశ్రయము.
సన్నిధి-స. సమీపము.
సన్నిపాతము-స. 1. జన్ని. 2. కలయిక.
సన్నిభము-స. సమానము. [ర్చున్నవాఁడు.
సన్నివిష్టుఁడు-స. 1. సమీపించినవాఁడు. 2. కూ
సన్నిహితము-స. సమీపించినది.
సన్నుతము-స. చక్కఁగా స్తుతింపఁబడినది.
సన్నుతి-స. చక్కనిస్తుతి. క్రి. సన్నుతించు.
సన్నె-చూ. సనె.
సన్మానము-స. గౌరవము. రూ. సమ్మానము, క్రి. సన్మానించు, సమ్మానించు. [ర్పింపఁబడినది.
సన్న్యస్తము-స. 1. సన్న్యసింపఁబడినది. 2. సమ
సన్న్యసనము-స. 1. కామ్యకర్మములవిడుపు. 2. ఒక ఆశ్రమము. క్రి. సన్న్యసించు. (పుం. స
సపత్ని-స. సవతి. [న్న్యాసి. స్త్రీ. సన్న్యాసిని.)

సపత్నుఁడు-స. శత్రువు.
సపర్య-స. పూజ.
సపాట-తె. మట్టము. రూ. సపాటము.
సపిండీకరణము-స. చచ్చిన పంద్రెండవ దినము చేయు శ్రాద్ధము.
సపిండుఁడు-స. ఏడుతరములలోపలి జ్ఞాతి.
సపీతి-స. సహపానము.
సప్త-స. ఏడుతంతులుగలవీణ, పరివాదిని.
సప్తకము-స. 1.ఏడు. 2.ఏడవది. సమా.సప్తతంతువు-యజ్ఞము. —హస్తుఁడు-అగ్ని. సప్తార్చి-అగ్ని.సప్తాశ్వుఁడు-సూర్యుఁడు.
సప్తతి-స. డెబ్బది.
సప్తమము-స. ఏడవది.
సప్తమి-స. 1. పక్షమందు ఏడవతిథి. 2.ఏడవది.
సప్తి-స. గుఱ్ఱము.
సప్పము-వి. (సర్పము) పాము. సమా. సప్పపుఁజుక్క-ఆశ్లేష.
సఫలము-స. ఫలముతోఁగూడినది, సార్థకము.
సబము-వి. (శవము) పీనుఁగు.
సబళము-తె. ప్రాసాయుధము.
సబాము-వి. స్వభావము.
సబ్బండు-తె. అనేకవిధములుగలది, ఉచ్చావచము.
సబ్బు-హిం. జిడ్డును పోఁగొట్టు ఒకకారపువస్తువు.
సబ్రహ్మచారి-స. సహపాఠి.
సభ-స. 1.కొలువుకూటము. 2.సమూహము. 3.జూదము. సమా. సభాసదుఁడు, సభాస్తారుఁడు-సభయందుండుధర్మజ్ఞుఁడు.
సభర్తృక-స.మగనాలు.
సభాజనము-స. చుట్టములులోనగువారి నాలింగనాదులచే సంతోషపఱచుట.
సభికుఁడు-స. 1. సభాసదుఁడు. 2. జూదమాడించువాఁడు.
సభ్యుఁడు-స. 1. సభయందుండువాఁడు. 2. మంచివాఁడు.
సమ-స. సంవత్సరము.
సమంజసము-స. 1. న్యాయము. 2. ఒప్పిదము.
సమకట్టు-తె. 1. యత్నించు. 2. సేకరించు. 3. సిద్ధపఱచు. 4. ఏర్పఱచు. 5. చేయు. 6.కవచము.
సమకుఱు-తె. 1. లభించు. 2. సిద్ధించు. రూ.సమకూడు, సమకూరు.
సమకొను-తె. సమకుఱు. కృ. సమకోలు.
సమక్షము-స. నయనగోచరమైనది, ఎదురు.
సమగ్రము-స. సమస్తము, సంపూర్తి.
సమగ్రిమ-స. సమగ్రత. రూ. సమగ్రిమము.
సమజ్ఞ-స. కీర్తి. రూ. సమాజ్ఞ.
సమజ్య-స. 1. సభ. 2. కీర్తి.
సమధికము-స. మిక్కిలియధికము.
సమధిగమము-స. పొందుట.
సమన్వితము-స. కూడుకొన్నది.
సమపదము-స. విలుకాఁడు రెండుకాళ్లసమముగా పెట్టి నిలుచుట.
సమము-స. 1. సమానము. 2. సాధువు. సమా. సమదర్శి-సమముగాఁ జూచువాఁడు. —వర్తి-యముఁడు.
సమయము-స. 1. ఒట్టు. 2. ఆచారము. 3. కాలము. 4. ప్రతిజ్ఞ.
సమయు-తె. 1. చచ్చు. 2. నశించు.
సమరత-వి. (సమర్తు) ప్రథమఋతువు. రూ. సమర్త. క్రి. సమర్తాడు.
సమరము-స. యుద్ధము. (వ్యు. మరణముతోఁ(గూడినది.
సమర్థనము-స. పట్టినది తగినట్లు నెఱవేర్చుట. క్రి. సమర్థించు.
సమర్థము-స.1.అన్వయయోగ్యమైనయర్థముగలది. 2. హితమైనది.
సమర్థుఁడు-స. నేర్పరి.
సమర్యాదము-స. 1. సమీపము. 2. మర్యాదతోఁగూడినది.
సమవాయము-స. 1.సమూహము. 2.కూడినసంబంధము.
సమవేతము-స. సమవాయమునొందినది.
సమష్టి-స. మొత్తము.
సమసకము-వి. సమానకము.
సమసనము-స. సంక్షేపము. రూ. సమాసము. క్రి. సమసించు.
సమస్తము-స. సర్వము.
సమస్య-స. కైపదము, పద్యపూరణమునకైయిచ్చు పద్యభాగము.
సమాఖ్య-స. 1. కీర్తి. 2. బందుకట్టు.
సమాగతము-స. 1. చక్కఁగావచ్చినది. 2. పొందినది.
సమాగమము-స. 1. చక్కనిరాక. 2. పొందిక.
సమాఘాతము-స. 1. యుద్ధము. 2. వధము.
సమాచారము-స. 1. చక్కఁగా నడపుట. 2. వృత్తాంతము.
సమాజము-స. 1.మనుజసమూహము. 2.ఏనుఁగు.
సమాధానము-స.1.చక్కఁగాఉంచుట.2.అంగీకారము.
సమాధి-స. 1. మనోలయము. 2.నియమము.
సమానము-తె. సమ్మతి. స. నాభియందలివాయువు. 2. తుల్యము.

సమాపకము-స. 1. ముగించునది. 2. చంపునది.
సమాప్తము-స. 1. ముగిసినది. 2. చచ్చినది.
సమాప్తి-స. 1.ముగియుక. 2.చావు. క్రి.సమాప్తించు.
సమావేశము-స. 1. ఒకచోఁగూడుట. 2. ప్రవేశము.
సమాసకము-స. శుద్ధాంధ్రపదముల సమాసము.
సమాసము-స. 1. సమర్థములగు పదముల యేకీ
భావము. 2. సంక్షేపము.
సమాహారము-స. 1. చెదరినవి ప్రోగుచేయుట. 2.
సంక్షేపము. రూ. సమాహరణము.
సమాహితుఁడు-స. 1.చక్కఁగా ఉంచఁబడినవాఁడు.
2. అంగీకరింపఁబడినవాఁడు. 3. సమాధియం
దున్నవాఁడు. [3. యుద్ధము.
సమాహ్వాయము-స. 1.పేరు. 2. ప్రాణిద్యూతము.
సమితి-స. 1. సమూహము. 2. యుద్ధము. రూ. స
సమిధ-స. 1. చిదుగు. 2. వంటచెఱకు. [మిత్తు.
సమీకము-స. యుద్ధము. (వ్యు. పరస్పరము కది
సమీకరణము-స.ఒకటిగాఁజేయుట.[యించునది.)
సమీక్ష్యకారి-స. చక్కఁగా యోచించి పనిచేయు
వాఁడు.
సమీచీనము-స. 1. సత్యము. 2. పరిశుద్ధము. 3.
సమీపము-స. చేరువ. క్రి. సమీపించు. [తగినది.
సమీరణుఁడు-స. 1.వాయువు. (వ్యు.లెస్సగా చరించు
వాఁడు.) 2. బాటసారి. [వేయఁబడినది.
సమీరితము-స. 1. చక్కఁగాపోయినది. 2. పాఱ
సమీరుఁడు-స.వాయువు.(వ్యు.లెస్సగాసంచరించుస్వ
సమీహితము-స.కోరఁబడినది.[భావముకలవాఁడు.)
సముఖము-స. ఎదురు. [చేయుట.
సముచ్చయము-స. చెదరినవాని నొకటిగా ప్రోగు
సముచ్ఛ్రియము-స. 1. మిక్కిలి పొడుగు. 2. వి
రోధము. రూ. సముచ్ఛ్రాయము.
సముత్థానము-స. ప్రయత్నము.
సముదయము-స. 1. చక్కనియుదయము. 2. స
మూహము. 3. యుద్ధము.
సముదాయము-స. 1.సమూహము. 2. యుద్ధము.
సముదాయించు-హిం. ఓదార్చు.
సముద్గకము-స. బరణి.
సముద్ధతుఁడు-స. గురువుచే శిక్షింపఁబడనివాఁడు.
సముద్ధూళించు-స. (విబూది) పూసికొను.

సముద్రము-స. కడలి. (వ్యు.చంద్రోదయమువలన
వృద్ధినొందునది, ఈశ్వరాజ్ఞతోఁగూడుకొనినది.)
సమా. సముద్రనవనీతము-చంద్రుఁడు. (సప్త
సముద్రములు : లవణ, ఇక్షు, సురా, సర్పి,
దధి, క్షీర, జలార్ణవములు.)
సమున్నద్ధుఁడు-స. 1. గర్వి. 2. చదువని తన్ను
చదువరి అని యెంచుకొనువాఁడు.
సమూహము-స. గుంపు.
సమృద్ధి-స. మిక్కిలిసంపద, నిండు.
సమేతము-స. కూడుకొన్నది. (వ్య. అపేతము.)
సమేలము-వి. (సమ్మేళనము) 1. ఒద్దిక. 2.
సమ్మతము-స. సమ్మతియైనది. [చేరిక.
సమ్మతి-స. 1. అంగీకారము. 2. ఇచ్ఛ. క్రి.సమ్మ
సమ్మదము-స. సంతోషము. [తించు, సమ్మతిల్లు.
సమ్మర్దము-స. రాయిడి.
సమ్మానము-స. గౌరవము. క్రి. సమ్మానించు.
సమ్మార్జనము-స. 1. శోధనము. 2. అలుకుట. 3.
సమ్మార్జని-స. చీఁపురుకట్ట. [ఊడ్చుట.
సమ్మాళిగలు-చూ. సంబాళిగలు. [నము.
సమ్మితము-స. 1. సమానపరిమితికలది. 2. సమా
సమ్మియ-వి. (సమయము)కట్టుపాటు. రూ.సమ్మె.
సమ్ముదము-స. మిక్కిలిసంతసము.
సమ్మెట-తె. 1. పెద్దసుత్తె. 2.వి.కళ. రూ.సంపెట.
సమ్రాట్టు-స. రాజులను శిక్షించి రాజసూయముచేసిన
మండలేశ్వరుఁడు. రూ. సామ్రాట్టు.
సయ్యాట-తె. (సయి+ఆట) 1. సహక్రీడ. 2.
లీల. రూ. సయ్యాటము. క్రి. సయ్యాటించు-పరి
సయ్యొద్ద-తె. (సయి+ఒద్ద) చేరిక. [హసించు.
సరంగు-హిం. నావికుఁడు. [లక్ష్యము.
సరకు-తె. 1. అమ్మఁదగినవస్తువు. 2.వస్తువు. 3.
సరగు-తె. శీఘ్రము. [రినిహింసించునది.)
సరఘ-స.తేనెటీఁగ. (వ్యు. తన్నుగూర్చి వచ్చినవా
సరటము-స. తొండ. (వ్యు. చరించునది.)
సరడు-వి 1. (శరండము) స్త్రీలు మెడనుధరించు
బంగారల్లికతీఁగ. 2. నూలిదారము.
సరణి-స. 1. త్రోవ. 2. వరుస. 3. విధము.
సరదారు-హిం. 1. శూరుఁడు. 2. రౌతు.
సరదు-తె. సమముగాపంచు. రూ. సరసు.

సరబడి-తె. ద్వారము. [ఆఁడుకుక్క.
సరమ-వి. క్రమము. స. 1. విభీషణునిభార్య. 2.
సరము-వి. (స్వరము) 1. ముక్కుగాలి. 2. షడ్జాదిస్వరము. స. హారము.
సరవి-తె. 1. క్రమము. 2. అనుక్రమము. రూ. [ప్రావి.
సరస-తె. సమీపము.
సరసము-తె. చౌక. స. రసముతోఁగూడినది.
సరసర-తె. (సరగ+సరగ) మిక్కిలిశీఘ్రముగా.
సరసి-స. కొలను. రూ. సరసు, సరస్సు. సమా. —జము-తామర. రూ. సరసీజము. (ఇట్లు—జాతము, సరసీరుహము మొ.) —జనాభుఁడు-విష్ణువు. —జభవుఁడు-బ్రహ్మ.
సరసు-తె. సరదు. స. సరసి.
సరసుఁడు-స. రసికుఁడు.
సరస్వతి-స. 1. పలుకుఁజెలి. (వ్యు. అంతట వ్యాప్తి గలది.) 2. పలుకు. 3. ఒకనది.
సరస్సు-స. సరసి. సమా. సరోజము-తామర. సరోజిని, సరోరుహము-1 తామర. 2. తామరకొలను.
సరళము-స. 1. ఔదార్యముగలది. 2. వంకర కానిది. రూ. సరాళము.
సరాగము-తె. ఒద్దిక. స. రాగముతోఁగూడినది.
సరాతి-తె. గోడవలె గుడారముచుట్టువైచినతెర.
సరాసరి-తె. (సరసిన+సరి) సరసిచూడఁగానైన సమత్వము.
సరి-తె. 1. పగుళ్లవారినసందు, సరియ. 2. సమము. 3. యుక్తము. 4. సమాప్తము. 5. పూర్ణముగా. 6. అంగీకారార్థకము. 7. వి. (సరము) హారము. సమా. —ప్రొద్దు-అర్ధరాత్రము. క్రి. —కట్టు-సరిపడు. —కడచు-1. ముందుమించు. 2. మీఱు. —గొను-చంపు. —చేయు-1. చక్కఁజేయు. 2. నాశముచేయు. —చూచు-సంప్రతించు. —తూఁగు-సమానమగు. —దాఁకు-దృష్టాంతమగు. —పడు-1. అనుకూలమగు. 2. యుక్తమగు. 3. సమానమగు. —పెట్టు-1. సరిచేయు. 2. చంపు.—పోవు-1. సమానమగు. 2. సమాధానమగు. 3. అయిపోవు. 4. నశించు. —హద్దు-మేర. రూ. [సధుదు.
సరించు-స. పోవు.
సరిగ-వి. (సరము) హారము-తె. జలతారు.
సరిత్తు-స. నది. (వ్యు. ప్రవహించునది.) సమా. సరిత్పతి-సముద్రుఁడు.
సరియ-తె. 1. పగుళ్లవాఱినసందు. 2. సందు.
సరీసృపము-స. 1. పాము. (వ్యు. కుటిలముగాఁ బ్రాఁకునది.) 2. ప్రాఁకుడుజంతువు.
సరుగు-తె. పెరుఁగు, వర్ధిల్లు.
సరుగుడు-తె. చౌకుచెట్టు. రూ. సరువుడు.
సరుడు-తె. 1. బాణము. 2. గఱిలేనిబాణము.
సరుదు-తె. 1. ఎల్ల. 2. వఱద.
సరేసు-తె. జాజిచెట్టుబంక, వజ్రము.
సర్కారు-హిం. ప్రభుత్వమువారు.
సర్గము-స. 1. అధ్యాయము. 2. విసర్జనము. 3. నిశ్చయము. 4. స్వభావము. 5. సృష్టి.
సర్పము-స. పాము. వి సప్పము. (వ్యు. చరించునది.)
సర్పి-స. 1. నేయి. 2. జలము. (వ్యు. వ్యాపించునది.)
సర్వజిత్తు-స. ఇరువదియొకటవసంవత్సరము.
సర్వధారి-స. ఇరువదిరెండవసంవత్సరము.
సర్వము-స. సమస్తము, అంతయు. సమా. సర్వంసహ - భూమి. (వ్యు. అన్నిటిని సహించునది.) —జీవనము-అందఱకు హితమైనది. —జ్ఞుఁడు-1. బుద్ధుఁడు. 2. శివుఁడు. 3. అన్నియు నెఱిఁగినవాఁడు. —తోభద్రము-నాలుగుప్రక్కలవాకిండ్లుగలరాజగృహము. —తోముఖము-1. ఆకాశము. 2. జలము. —తోముఖుఁడు-1. ఆత్మ. 2. బ్రహ్మ. 3. శివుఁడు. —త్ర-అంతట. —థా-అన్నివిధముల. రూ. సర్వధా. —దా-ఎల్లప్పుడు. —భక్షకుఁడు-అగ్ని. —మంగళ-పార్వతి. సర్వాంగీణము-1. ఎల్లయవయవములసంబంధముతోఁ గూడినది. 2. ఎల్ల యవయవములందు వ్యాపించినది. సర్వార్థసిద్ధుఁడు-బుద్ధుఁడు. [చిల్లకోల. రూ. శర్వల.
సర్వల-స. (వ్యు. సర్వశత్రువులనుగ్రహించునది.)
సర్షపము-స. ఆవాలు. (వ్యు. దేహమును వ్యాపించు [నది.
సల-తె. నీళ్లకడ్డమునిలుపు జల్లితడక.
సలక-తె. చిన్నగోనె.
సలగ-తె. పాఱ. రూ. సలవ.
సలహా-హిం. ఆలోచన.

సలాక-వి. (శలాక) కమ్మి.
సలాపము-తె. సముద్రములోనుముత్తెపుచిప్పలేఱుట.
సలి-తె. చప్పుడు. రూ. సడి.
సలించు-వి. చలించు.
సలికము-తె. అల్పము.
సలిగ-తె. ప్రాపు.
సలితము-తె. కొలువుడుకానిని కొలువునుండి త్రోయుట. (చేర్చుకొనుట లావణము)
సలిలము-స. జలము. (వ్యు. పోవునది.)
సలుగ-తె. 1. ధాన్యముకొలుచునప్పుడు గుఱుతుకై యుంచు కుప్ప. 2. పెచ్చు. రూ. సలువ.
సలుగు-వి. (శల్కము) ఏదుపంది. రూ. సలువు.
సలుపు-తె. చేయు. రూ. చలుపు.
సల్లకి-స. అందుగుచెట్టు. [సము. క్రి. సల్లాపించు.
సల్లాపము-స. పరస్పరసంభాషణము. రూ. సల్లప
సవ-తె. జాడ.
సవడి-తె. (సవ+వడి). జాడ. రూ. సవ్వడి.
సవతి-వి. (సపత్ని) తోడిపెండ్లాము. (సవతాలు అనియు.) సమా. —తల్లి-మాఱుతల్లి, విమాత.
సవతు-వి. (సమత) సామ్యము.
సవదరించు-వి. (ధరించు) తాల్చు.
సవనము-స. యజ్ఞము.
సవము-చూ. సగము. [వయస్సుకలవాఁడు.
సవయస్కుఁడు-స. 1. స్నేహితుఁడు. 2, సమాన
సవర-తె. 1. చక్కనైనది. 2. చదునైనది. రూ. సవరన. క్రి. —చేయు.
సవరణ-తె. 1. వాహనాద్యలంకరణము. 2. పరికరము. 3. సేవ. 4. సౌమ్యము. రూ. సవరణము. క్రి. —చేయు, సవరణించు-వాహనాదుల నలంకరించు. సవరించు-1. అలంకరించు. 2. చక్కఁబఱచు. 3. కూర్చు. 4. తాల్చు. 5. చేయు. కృ. సవరింత, సవరింపు. సవరిల్లు-అందమగు. సవరుచు-సవరించు.
సవాయి-తె. 1. మేహరోగము. 2. పడవపెద్ద మోకు. [రూ. స్వారి.
సవారి-హిం. 1. పల్లకి. 2. గుఱ్ఱమునెక్కిపోవుట.
సవాలు-హిం. ప్రశ్న.
సవి-తె. అని, అనిచెప్పి.
సవిత-స. 1. సూర్యుఁడు. 2. తండ్రి. రూ. సవి
సవిత్రి-స. 1. తల్లి. 2. ఆవు. [తృఁడు.
సవిధము, సవేశము-స. సమీపము.
సవ్యము-స. 1. ఎడమ. 2. కుడి. 3. ప్రతికూలము.
సవ్వడి-చూ. సవడి. [వి. (సస్యము.) పైరు.
ససి-తె. 1. బాగు. 2. ఆరోగ్యము. 3. నిగ్గు. 4.
ససువు-తె. సాధువు. [సస్నేము.)
సస్యము-స. పైరు. రూ. శస్యము. (వి. ససి,
సహ-స. 1. భూమి. 2. తోడ. సమా. —కారి-సహాయుఁడు. —గమనము-1. కూడఁబోవుట. 2. భర్తతో భార్యచితిఁజొచ్చుట. —చరి-1. భార్య. 2. స్నేహితురాలు. 3. కూడఁదిరుగునది. —చరుఁడు-1. మిత్రుఁడు. 2. కూడఁదిరుగువాఁడు. —జ-తోడఁబుట్టినది. (పుం. సహజుఁడు.) —జము-1. స్వభావము. 2. కూడఁబుట్టినది. —ధర్మిణి-పెండ్లాడిన భార్య. —పాఠి-కూడఁజదువువాఁడు. —వాసము-1. కూడనుండుట. 2. స్నేహము. సహాధ్యాయుఁడు-సహపాఠి. సహోదరుఁడు-తోడఁబుట్టినవాఁడు.
సహకారము-స. తియ్యమామిడి. [(స్త్రీ. సహోదరి.)
సహనము-స. ఓర్పు. క్రి. సహించు.
సహస్రము-స. వేయి. సమా. సహస్రదంష్ట్రము-పాఠీనము, వేయికోఱలచేఁప. —పత్రము-కమలము, తామర. —పాదుఁడు-1. విష్ణువు. 2. సూర్యుఁడు. సహస్రాంశువు-సూర్యుఁడు. వేవెలుఁగు. సహస్రాక్షుఁడు-ఇంద్రుఁడు. వేగంటి.
సహాయము-స. తోడు. (వి. సాయము.) [తుఁడు.
సహాయుఁడు-స. 1. తోడగువాఁడు. 2. స్నేహి
సహితము-స. 1. కూడుకొన్నది. 2. కూడ.
సహృదయుఁడు-స. మంచిమనస్సుగలవాఁడు.
సహ్యము-స. 1. ఆరోగ్యము. 2. ఒకకొండ. 3.
సళించు-తె. దుఃఖించు. [సహింపఁదగినది.
సళువు-తె. 1. (వ్రణము మొ.) పోటెత్తు. 2. పోటు. క్రి. సళుపరించు. సళుపు. కృ. సళుపరింత.
సళ్లు-చూ. సడలు.

## సా

సా-వి. వృత్తియందుసాము శబ్దమునకు మీఁదివర్ణము

లోపింపఁగా మిగిలినరూపము. సమా. సాఁబా లు-నగముపాలు.సామేను-నగము మేను.
సాంకవము-స. సంకుమదము, జవాది.
సాంకాలిక-స. ప్రతిదినమునిచ్చువడ్డి.
సాంగత్యము-స. కూడిక.
సాంత్వనము-స. ఓదార్చుట, అనునయము.
సాంత్వము-స. 1.సామోపాయము. 2.దాక్షిణ్యము.
సాంద్రము-స. 1. చట్టమైనది. 2. మెత్తనైనది.
సాంపరాయము-స. 1. యుద్ధము. 2. ఆపద. 3. రాఁగలకాలము. రూ. సంపరాయము. [కము.
సాంపరాయికము-స. యుద్ధము. రూ. సంపరాయి
సాంప్రతము-స. 1. యుక్తము. 2. ఇప్పుడు.
సాంబ్రాణి-స. 1. సంబరేను చెట్టువలనఁ గలుగు ధూపద్రవ్యము. 2. ఉత్తమాశ్వము. రూ. సా [మ్రాణి.
సాంయాత్రికుఁడు-స. ఓడవర్తకుఁడు.
సాంయుగీనుఁడు-స. యుద్ధమందు నేర్పుగలవాఁడు.
సాంవత్సరికము-స. 1. ఆబ్దికము, 2. సంవత్స రాంతమున జరగునది.
సాఁతు-తె. 1. కాపాడు. 2. పెంచు.
సాఁగు-తె. 1. దీర్ఘమగు.2.దండాకారముగానేలపై ప్రాలు. రూ. చాఁగు.
సాకతము-తె. 1. ఊఁఱడింపు. 2.అనుగ్రహము.
సాకము-తె. 1. ఉత్సవము. 2. నెపము. రూ. [సాకు.
సాకల్యము-స. సకలత్వము.
సాకిరి-వి. సాక్షి.
సాకు-తె. నెపము. రూ. సాకము. [త్కరించు.
సాక్షాత్కారము-స. ఎదుటనగపడుట. క్రి. సాక్షా
సాక్షి-స. చూచువాఁడు.
సాక్ష్యము-స. సాక్షి, కని విని చెప్పినది.
సాగరము-తె. నేయి మొ. నింపిన సిద్దెలజోఁడు. స. 1. సముద్రము. (వ్యు. సగరపుత్రులచే త్రవ్వఁబడినది.) 2.ఏనుఁగుచెవియందలిమదము.
సాగు-తె. 1. పోవు. 2. ప్రవర్తిల్లు. 3. యత్నించు. 4. జరగు. రూ. చాగు. సమా. —పాటు-జరగుపాటు. —బడి-1. సేద్యము. 2. సాగుపాటు. క్రి. సాగనంపు-పయనించువారిని కొంతదూరము కొనిపోయివిడుచు.
సాచివ్యము-స. సచివత్వము.
సాజము-వి. సహజము.
సాజాత్యము-స. సజాతిత్వము.
సాట-తె. ఒకవస్తువునిచ్చి మఱొకటి మార్చుకొనుట, వినిమయము, పరివర్తనము. రూ. సాట్లా.
సాటి-తె. సమానము. రూ. సాటిక. [సాటాకోటి.
సాతు-వి. (సార్థము) 1. వర్తకజనసమూహము. 2. పథికజనసమూహము.
సాత్త్వికము-స. సత్వగుణమువలనఁగలిగినది.
సాదన-వి. (సాధనము) అభ్యాసము. సమా. —కాఁడు-మల్లుఁడు. —జోదు-—పై—.
సాదనము-స. ఇల్లు. రూ. సదనము.
సాదము-తె. అన్నము. [సారథి.
సాది-స. 1. గుఱ్ఱపురౌతు. 2. మావటీఁడు. 3.
సాదు-వి. (సాధువు) మంచివాఁడు, మంచిది.
సాదృశ్యము-స. పోలిక.
సాధకము-స. సాధించునది.
సాధనము-స. 1. సాధించుట. 2. ఉపకరణము. 3. ఉపాయము. క్రి. సాధించు-నెఱవేర్చు.
సాధనీయము-స. సాధింపఁదగినది.
సాధర్మ్యము-స. పోలిక.
సాధారణ-స. నలువదినాలుగవ సంవత్సరము.
సాధిష్ఠము-స. 1. మిక్కిలిపదిలము. 2.మిక్కిలి మంచిది.
సాధీయసుఁడు-స. 1.ఎక్కువదిటవరి. 2.ఎక్కువ మంచివాఁడు. 3. చక్కనివాఁడు, చక్కనిది.
సాధ్యము-స. సాధింపఁదగినది. రూ.సాధనీయము.
సాధ్వసము-స. భీతి.
సాధ్వి-స. పతివ్రత.
సాన-వి. (శాణము) 1.మణులమొక్కలుపోఁజేయుఱాయి. 2. కత్తులునూఱెడుఱాయి. 3. గంధము తీసెడు ఱాయి.
సాని-వి. (స్వామిని) 1. అధిపురాలు. 2. వేశ్య. 3. (ఉత్తరపదమగుచో) భార్య.
సానిక-తె. మట్టికంచము, మల్ల.
సానువు-స. 1. కొండనెత్తము. 2. కాన. 3. త్రోవ. సమా. సానుమంతము-కొండ.
సాన్నిధ్యము-స. సామీప్యము.
సాపడు-తె. భుజించు. కృ. సాపాటు.

సాపత్న్యము-స. సపత్నీత్వము.
సాప్తపదీనము-స. చెలిమి. (వ్యు. ఏడుమాటలలో లేక ఏడుఅడుగులలో కలుగునది.)
సాఫల్యము-స. సఫలత్వము.
సామంతుఁడు-స.ఒకదేశపుఎల్లకుచేరికనున్నరాజు.
సామగ్రి-స. 1. సమగ్రత. 2. ఉపకరణము. 3. వస్తు సంభారము. [బుట్టినది.)
సామజము-స. ఏనుఁగు. (వ్యు.సామవేదమువలనఁ
సామము-స. 1. ఒకవేదము. 2. మంచిమాట. 3. ఒకరి అనుకూలోపాయము.
సామరస్యము-స. సమరసత్వము.
సామర్థ్యము-స. 1. నేర్పు. 2. యోగ్యత.
సామాజికుఁడు-స. సమాజమందుండువాఁడు.
సామాను-హిం. వస్తువు, సామగ్రి.
సామాన్యము-స. 1. సామ్యము. 2. సాధారణము.
సామి-వి. (స్వామి) 1. రాజు. 2. పెనిమిటి.3. కుమారస్వామి. స. సగము.
సామీప్యము-స. సమీపత్వము.
సామీరి-స. 1. హనుమంతుఁడు. 2. భీముఁడు. (వ్యు. సమీరునికొడుకు.)
సాము-తె. 1. వ్యాయామము. 2. వి. (సామి) సగము. సమా. (చూ.సా.)సామరి-(సాము+అరి) సామునేర్చినవాఁడు. సాముకంటిచుక్క-పూర్వఫల్గునీనక్షత్రము.
సాముద్రికము-స.1.భాగ్యాదిసూచక దేహలక్షణములను దెలుపుశాస్త్రము. 2. సముద్రసంబంధమై
సామెత-తె. లోకోక్తి, నానుడి. [నది.
సామ్యము-స. సమత్వము, పోలిక.
సామ్రాజ్యము-స. 1. సమ్రాట్టుతనము. 2.సమ్రాట్టునకు లోఁబడినదేశము.
సామ్రాణి-చూ. సాంబ్రాణి.
సాయంకాలము-స. మునిమాపు.
సాయంతనము-స. సాయంకాల సంబంధమైనది.
సాయకము-స. 1. బాణము. 2. కత్తి.(వ్యు.శత్రువును నశింపఁజేయునది.) [లము. 2. బాణము.
సాయము-వి. సాహాయ్యము. స. 1. సాయంకా
సాయుజ్యము-స. సహయోగము, కూడనుండుట.
సారంగము-స. 1.జింక.2.ఏనుఁగు. 3.తుమ్మెద. 4. వానకోయిల. (వ్యు. సారమైన అంగము
సారంగి-తె. ఒకవాద్యము. [కలది.)
సారఘము-స. (వ్యు. సరఘలు కూర్చినది) నేయి
సారణము-స. ఒకతెగదేగ. [వంటి తేనె.
సారణి-స. 1. కాలువ. 2. షడ్జస్వరము పలికెడి
సారథి-స. తేరుకడపువాఁడు, నియంత. [తంతి.
సారము-స. 1. జలము. 2. ధనము. 3. న్యాయము. 4. బలిమి. 5. చేవ. 6. మూలగ. 7. శ్రేష్ఠము. [నది.)
సారమేయము-స. కుక్క. (వ్యు. సరమకుఁ బుట్టి
సారసము-స.1.తామర.2. బెగ్గురుపక్షి. (వ్యు.సర
సారస్యము-స.సరసత్వము. [స్సుసంబంధమైనది.)
సారస్వతము-స. సరస్వతీసంబంధమైనది.
సారాయి-వి. (సుర) మద్యము. రూ. సారాయము.
సారి-తె. తడవ.
సారించు-స. 1. చాఁచు. 2. విసరు. 3.సరిదీయు.
సారువ-తె. 1. ఎక్కుటకును బరువెక్కించుటకును వాటముగా వేయించు దిబ్బ. 2. కట్ట.
సారువా-తె. వానకాలమున నీటియాధారమునపండు
సారూప్యము-స. సమానరూపత్వము. [పల్లపుపంట.
సారె-తె. 1.కూఁతునత్తగారింటికిఁబంపునపుడిచ్చు వరుస. 2. కుమ్మరిచక్రము. 3. మాటికి. 4. బ.వీణెమెట్లు.వి.(శారి) 1. పగడసాలకాయ.2.
సారెకు-తె. మాటిమాటికి. [పాచిక. 3.గోరువంక.
సార్థకము-స. సఫలము.
సార్థము-స. 1. జంతుసమూహము. 2.వర్తకజనసమూహము. 3. అర్థముతోఁ గూడినది. సమా. సార్థవాహుఁడు- 1.వర్తకుఁడు. 2. ముఖ్యుఁడు.
సార్వభౌమము-స. ఉత్తరదిక్కునసుండు ఏనుఁగు.
సార్వభౌముఁడు-స. చక్రవర్తి.(వ్యు.సమస్తభూమి
సాల-వి. (శాల) 1.ఇల్లు.2.చావడి. [నేలువాఁడు.)
సాలగ్రామము-స. విష్ణుమూర్తి చిహ్నిత శిల.
సాలభంజిక-స. బొమ్మ, పుత్తళిక. [మద్దిచెట్టు.
సాలము-స. 1. వృక్షము. 2. ప్రాకారము. 3.
సాలావృకము-స. 1. కుక్క. 2. కోఁతి. 3. తోఁ
సాలీఁడు-చూ. సాలె. [డేలు. 4. నక్క.
సాలు-తె. 1. ఉన్నిబట్ట. 2. సన్నవివస్త్రము.రూ. సాలువు.

సాలె-వి. (శాలిక) నేఁతనేసి జీవించు ఒకజాతి. సమా. సాలీఁడు-1. సాలెవాఁడు. 2. సాలెపురుగు.సాలెపట్టు-సాలెపురుగు నేఁత.—పురుగు-బొడ్డునందు పుట్టిననూలు విడిచి వలనేయు పురుగు. —వాఁడు-తంతువాయుఁడు.
సాలోక్యము-స. సమానలోకత్వము. [2. ఒఱగు.
సాల్వడు-తె. (సాలు+పడు) 1. నిస్సారమగు.
సావలి-హిం. దుబుదక్కవాఁడు. రూ. సావలీఁడు.
సావాసము-వి. (సహవాసము) పొత్తు.
సావాసి-వి. 1. చెలికాఁడు. 2. అంతఃపురపు కావలివాఁడు.
సావి-తె. కాలము.
సావిత్రి-స. 1. సరస్వతి. 2. పార్వతి. 3. సత్యవంతునిభార్య.
సావు-తె. రూ. చావు.
సాసువులు-తె. ఆవాలు. [క్రి.సాహసించు.
సాహసము-స. 1. తెగువ. 2. దండోపాయము.
సాహాయ్యము-స. సహాయత్వము, తోడుపాటు.
సాహిణము-తె. గుఱ్ఱపుసాల.
సాహిణి-తె.గుఱ్ఱపువాఁడు. రూ.సాహిణీ.[త్యము.
సాహితి-స.1.అర్థజ్ఞానము. 2.కూడిక. రూ.సాహి
సాహేబు-హిం. ప్రభువు. రూ. సాయబు,సాయిబు.
సాహో-హిం. కటికవారుచేయు హెచ్చరిక.
సాళగము-స. తిలతండులన్యాయముననైన రాగమేళనము. క్రి. సాళగించు-మిళితమగు. కృ.సాళగింపు.
సాళవము-స. ఒకతెగడేగ.రూ. సాళ్వము.[గింపు.

## సి

సింగఁడు-వి. (సింహుఁడు) 1.నృసింహుఁడు.2. ఎఱుకువాఁడు.(స్త్రీ.సింగి.) 3.కోపించినవాఁడు.
సింగము-వి. సింహము. సమా. సింగపుఁబీట-సింహాసనము. [విల్లు. 2. విల్లు. రూ. సింగిణి.
సింగాణి-వి. (శార్ఙ్గము) 1. కొమ్ముతోఁ జేసిన
సింగారము-వి.(శృంగారము)అలంకారము.సమా. సింగారి-వి. శృంగారవతి.
సింగి-వి. ఎఱుకుది. సమా. —నాదము-పొడదుప్పికొమ్ముతోఁ జేసిన సుషిరవాద్యము. (వ్యర్థసంభాషణ కీ పదము వాడుదురు)
సింగిలీకము-తె. పెద్దనల్లకోఁతి.
సిందురము-వి. 1. (సిందూరము) కుంకుము. 2. వావిలిచెట్టు.
సిందువారము-స. వావిలిచెట్టు. [దిరము)
సిందూరము-స. కుంకుమ. (వి. సిందురము. చెంసింధురము-స. ఏనుఁగు. (వ్యు. కణఁతలనుండి మదము కాఱుచుండునది.)
సింధువు-స. 1. ఒకనది. 2. సముద్రము. 3. ఏనుఁగు. 4. నదము. 5. ఒకదేశము.
సింహము-స. 1. కేసరి. (వ్యు. హింసించునది.) (వి. సింగము.) 2. ఒకరాశి. 3. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము. సమా. సింహద్వారము-తలవాకిలి.—నాదము-వీరులుచేయు బొబ్బరింత.—సంహననుఁడు-సర్వాంగసుందరుఁడు. సింహావలోకనము-1. కడపటిపదము మొదటిపదముగా నుంచుము క్తపదగ్రస్తము,పోవుచుపోవుచుఅప్పుడప్పుడు వెనుదిరిగిచూచుట. 2. సింహాసనము-సింహముఖ మేర్పఱచిన స్వర్ణ,రత్నమయమైన ఉన్నతపీఠము.
సిక-వి. (శిఖ) జుట్టు.రూ. సిగ.[ఉన్నతపీఠము.
సికత-స. 1. ఇసుకనేల. 2. మొరపనేల.
సికాయుంగరము-తె. ముద్దుటుంగరము.
సిక్తము-స. తడిసినది.
సిక్థము-స. 1. మైనము. 2. మెతుకు.
సిగ-చూ. సిక.సమా.—బంతి,సిగదండ-శేఖరము.
సిగము-వి. (శివము) ఆవేశము. రూ. సివము.
సిగరి-వి. శిఖరిణి. రూ. సిగర.
సిగరము-వి. శిఖరము.
సిగ్గు-తె. స్తుత్యాదులచేఁ గలుగు మనస్సంకోచము, లజ్జ. సమా. సిగ్గరి-సిగ్గుకలది, కలవాఁడు. —కత్తియ-సిగ్గుగలది. సిగ్గిఁడి-సిగ్గులేనిది,—లేనివాఁడు. క్రి. సిగ్గఱు-సిగ్గుచెడు. సిగ్గుపడు-సిగ్గుచెందు. సిగ్గిలు —పై—
సిడము-తె. 1. ధ్వజము. 2. ధ్వజస్తంభము.
సిడి-తె. 1. ఏతపుమ్రాను. 2. జాతరకునాటిన స్తంభముమీఁది అడ్డుమ్రాను.
సితము-స. 1. తెల్లనిది. 2. కట్టఁబడినది. సమా. సితపక్షము-శుక్లపక్షము.సితాభ్రము-కర్పూరము. రూ. సితాభ్రము.
సితుఁడు-స. 1. శుక్రుఁడు. 2. తెల్లనివాఁడు.
సిద్ధాయము-వి. (సిద్ధాయము) వెచ్చపుపొమ్మవం

దుకూడఁబెట్టినధనము. [సిద్ధియ.
సిద్దె-తె. బుంగవలె తోలుతోకుట్టినపాత్రము రూ.
సిద్ధము-స. 1.అయత్తమైనది. 2.ఈడేఱినది. సమా.
సిద్ధాంతము-1.స్థిరమైనపక్షము. 2.నవవిధజ్యోతిషగ్రంథములు. సిద్ధాంతి-1. జ్యోతిషము తెలిసినవాఁడు. 2. తత్త్వవేత్త. క్రి. సిద్ధాంతీకరించు-
సిద్ధాయము-స. కప్పము. [సిద్ధాంతముచేయు.
సిద్ధార్థము-స. తెల్లావాలు.
సిద్ధార్థి-స. ఏఁబదిమూఁడవసంవత్సరము.
సిద్ధార్థుఁడు-స. బుద్ధుఁడు.
సిద్ధి-స. 1.ఈడేఱుట. 2 అణిమాది. (సిద్ధులెనిమిది: అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.) క్రి. సిద్ధించు.
సిద్ధుఁడు-స. అణిమాదిసిద్ధిపొందినవాఁడు.
సిధ్మము-స. సిబ్బెము. [2. పార్వతి.
సినీవాలి-స. 1. చంద్రకళకానవచ్చెడిఅమావాస్య.
సిబ్బి-తె. మూఁకుడు. [—కాఁడు.)
సిబ్బితి-తె. సిగ్గు.సమా. —కత్తె-సిగ్గుగలది.(పుం.
సిబ్బెము-వి. (సిధ్మము) దేహముపైఁగలుగుతెల్ల.
సిర-స. 1.నాడి.2.ఈనె.[పౌడ. రూ.సిబ్బియము.
సిరంగఁడు-వి. శ్రీరంగనాథుఁడు.
సిరంగము-వి. శ్రీరంగము.
సిరము-వి. (శిరము) తల.
సిరా-హిం. వ్రాయుటకుపయోగించు చాయ.
సిరి-వి. (శ్రీ) 1. లక్ష్మి. 2. సంపద. 3. శోభ. సమా. —గందము-శ్రీ చందనము. —గట్టు-శ్రీశైలము. —చూలి-మదనుఁడు. —మంతుఁ
సిలుగు-తె. చిక్కు. [డు-శ్రీమంతుఁడు.
సిలువ-తె.ఏసుక్రీస్తువును బంధించి వధించినకొయ్య.
సివఁగి-చూ. చివఁగి.
సివము-చూ. సిగము.
సిసువు-వి. (శిశువు) పసిబిడ్డ.
సిస్పృక్ష-స. సృజింపనిచ్చ. (పుం. సిసృక్షువు.)
సిస్తు-తె. 1. అందము. 2. పన్ను.
సిళ్లు-తె. బరిగోల. రూ. సిడులు.

## సీ

సీకాయ-తె. మానెఱిడ్డునుపోఁగొట్టు ఒకకాయ.
సీకారి-తె. పాటపాడువాఁడు.
సీత-స. 1. శ్రీరామునిభార్య. 2. నాఁగటిచాలు.
సీతబేది-తె. ఆమ (జిగట) విరేచనము. [పురుగు.
సీతాకోకచిలుక-తె.చిత్రవర్ణపుఱెక్కలుగలఒకసీతు
సీతాఫలము-తె.ఒకఫలవృక్షము,గానిపండు. [వు.
సీతు-వి. (శీతము) 1. చలి. 2. చలికాలము.రూ.
సీత్కారము-స. విసుఁగు,లేక బాధచేఁగలుగుధ్వని.
సీదరము-తె. 1. దారిద్ర్యము. 2.వి. (శ్రీధరము) పాము. 3. పాముకుబుసము. రూ. సీద్రము.
సీమ-తె. 1. దేశము. 2. ప్రదేశము. 3.రాజ్యము. 4. పరదేశము. స. 1. ఎల్ల. 2. పెడతల. సమా. సీమంతము-1. పాపట. 2.ఏడవనెలలో గర్భిణికిచేయుశుభకార్యము.సీమంతిని-ఆఁడుది.
సీమాటి-వి. (శ్రీమతి) భాగ్యశాలినియగు ఆఁడుది. (పుం. శ్రీమాఁజా.)
సీరము-స.నాఁగలి. సమా. సీరపాణి-బలరాముఁడు.
సీరి-స. సీరముకలవాఁడు, బలరాముఁడు.
సీల-తె. రూ. చీల.
సీలమంద-చూ. చీలమంద.
సీవనము-స. కుట్టుట. రూ. సేవనము.
సీవిరి-తె. 1. వింజామరము. 2. ఆలవట్టము.
సీసకము-తె. 1.కిరీటము. 2. ఒకరీతి కుస్తీపట్టు. స. సీసము. (వ్యు. పాదరసమునుబంధించునది.)
సీసము-స. సత్తు.
సీసా-హిం. బుడ్డి.

## సు

సు-స. మంచి, మిక్కిలి అను నర్థములిచ్చు ఉపసర్గము. (సుదినము, సునాయాసము మొ.)
సుంకము-వి. (శుల్కము) 1. అమ్మెడుసరకులకు దొరతనమువారికిచ్చుపన్ను. 2.తఱుగు. 3. ప్రతిబంధము. [రీఁడు, సుంకీఁడు.
సుంకరి-వి. సుంకములతీయువాఁడు. రూ. సుంక
సుంకు-తె. 1.కంకిమీఁదిపూఁత. 2. గుగ్గిళ్లపైతవుడు, 3. వి. ప్రతిబంధము. రూ. సుంకము.
సుంత-తె. ఇంచుక. రూ. ఇసుమంత.
సుందరి-స. చక్కని ఆఁడుది. (వ్యు. లెస్సగాఆదరింపఁబడునది.)
సుందరుఁడు-స. చక్కనివాఁడు. [రింపఁబడునది.)

సుకము-వి. (సుఖము) సౌఖ్యము. రూ. సుగము. సమా.సుకవాసి-కష్టపడకుండువాఁడు,సుఖవాసి.
సుకరము-స. సులభము.
సుకలుఁడు-స. దాతయు భోక్తయునైనవాఁడు.
సుకిని-వి. (సుఖిని) సుకముగల ఆఁడుది.
సుకుమారము-స. కోమలము. (పుం. సుకుమారుఁడు. స్త్రీ. సుకుమారి.)
సుకృతము-స. 1. పుణ్యము. 2. శుభము.
సుకృతి-స. 1. పుణ్యుఁడు. 2. భాగ్యవంతుఁడు.
సుక్కురుఁడు-వి. శుక్రుఁడు.
సుఖము-స. 1.సౌఖ్యము.2.స్వర్గము. క్రి.సుఖించు. సమా. సుఖవాసి-సుకవాసి.
సుఖి-స. సుఖముకలవాఁడు. (స్త్రీ. సుఖిని)
సుగము-చూ. సుకము.
సుగుడి-వి. (సుగుణి) సరసుఁడు.
సుగ్గడితము-వి. (సుఘటితము) తఱచైననేఁత.
సుడి-తె. 1. జలావర్తము. 2. రోమావర్తము. 3. అనిలావర్తము. సమా. —గట్టు-చక్రవాళము. —గాలి-వాత్య. —గొట్టు-గాలి. —గోరు-తంతిమీటుటకై వ్రేలికి వేసికొనులోహపుగోరు. —వాలు-చక్రాయుధము. క్రి. —ఁబడు-సుడివడు. —గొను-చుట్టుకొను. —వడు-1.చుట్టుకొను. 2. కలఁతపడు. 3. చలించు. —వోవు-వ్యర్థమగు. [2. తులువ.
సుడియ-తె. 1. తమలపాకులబరువులో సగము.
సుడియు-తె. 1. చుట్టిచుట్టివీచు. 2. చుట్టుకొను.
సుడుము-తె. నూఱుగొత్తెలగుంపు.
సుత-తె. మొదలుకొని. స. కూఁతురు. [సుతలాం.
సుతరాం-వ్యావహారికము,బొత్తిగా. రూ.సుతరాము,
సుతి-వి. (శ్రుతి) గాయకునకు సాయముగా తంతిమున్నగువానిచేఁగలిగించు షడ్జధ్వని. [చును.)
సుతుఁడు-స. కొడుకు. (వ్యు. తల్లివీనిని ప్రసవిం
సుత్తె-తె. లోహములను సాగఁగొట్టు సాధనము, తావఘ. రూ. సుత్తియ.
సుత్రాముఁడు-స. ఇంద్రుఁడు. (వ్యు. లోకములను లెస్సగా రక్షించువాఁడు) రూ. సూత్రాముఁడు.
సుద-తె. కొన. [గలది.)
సుదతి-స. ఆఁడుది. (వ్యు. చక్కని పలువరుస

సుదర్శనము-స. 1.విష్ణుచక్రము. (వ్యు.మంచిదర్శనముగలది.)2.మేరుపర్వతమందలినేరేడుచెట్టు.
సుదాయము-స. పెండ్లియందు అల్లునికిఆఁడుబిడ్డకు
సుదూరము-స. మిక్కిలిదూరము. [ఇచ్చుఅరణము.
సుద్ద-వి. (శుద్ధము) తెల్లమన్ను. [నరిపలుచు.
సుద్దము-వి. (శుద్ధము) నిర్దోషము. క్రి.సుద్దగించు-
సుద్ది-వి. (శుద్ధి) 1. వృత్తాంతము. 2. పరిశుద్ధి.
సుధ-స. 1. అమృతము. 2. పాలు. 3.సున్నము. 4. ఇటిక. సమా. సుధాంశువు-చంద్రుఁడు, అమృతకిరణుఁడు. సుధాకరుఁడు- —పై.—
సుధర్మ-స. 1. దేవసభ. 2. శ్రీకృష్ణునిసభ.
సుధి-స.విద్వాంసుఁడు.(వ్యు.మంచిబుద్ధికలవాఁడు.)
సునాయాసము-స. మిక్కిలి సులభము.
సునాసీరుఁడు-స. ఇంద్రుఁడు. రూ. శునాసీరుఁడు. (వ్యు. మంచిసేనాగ్రభాగముకలవాఁడు.)
సున్న-వి. (శూన్యము) అనుస్వారము. 2. అభావము. క్రి. సున్నగిల్లు-గుండ్రమగు.
సున్నము-వి. (చూర్ణము) తెల్లని కారపు మన్ను. సమా. సున్నపుటాయి-సున్నముగలతాయి.
సున్ని-తె. నలుఁగునకై పచ్చిపెసలు మొ. వానివిసరిచేసిన పిండి.
సున్నితము-వి.(సునిహితము)కచ్చితము,చక్కని.
సుపర్ణుఁడు-స.గరుత్మంతుఁడు.(వ్యు. మంచిఱెక్కలు కలవాఁడు.) [నిందించువాఁడు.)
సుపర్వుఁడు-స. వేలుపు. (వ్యు.లెస్సగాఅభీష్టములను
సుపాణి-తె. 1. ముత్తెమందలి శుభ్రమైననీరు. 2. శుభ్రమైన నీరుముత్తెము. రూ. సుప్పాణి.
సుప్తి-స. 1. నిద్ర. 2. తిమ్మిరి.
సుప్రతీకము-స. ఈశాన్యదిక్కునందలి యేనుఁగు.
సుబ్బు-తె. బయలుపడు. [డు.)
సుబ్రహ్మణ్యుఁడు-స. కుమారస్వామి. (వి.సుబ్బఁ
సుభగ-స. 1. మనోహరురాలు. 2. భాగ్యవతి.
సుభిక్షము-స. (సులభభిక్షముకలది) కఱవులేనిది.
సుమంగలి-స. ముత్తైదువ, సువాసిని.
సుమనస్సు-స. 1. పువ్వు. 2. వేలుపు. 3.విద్వాంసుఁడు. [తోఁగూడినది.
సుమము-స.పువ్వు. కుసుమము. (వ్యు. తుమ్మెదల

సుమారు-హిం. కొంచెమెచ్చుతగ్గు, ఇంచుమించు.
సుమాళము-తె. సంతోషాదులచేఁగలుగు పారవశ్యము. క్రి. సుమాళించు, సుమాళమునొందు.
సుముఖుఁడు-స. 1. విద్వాంసుఁడు. 2. ప్రసన్నుఁడు. (వ్య. విముఖుఁడు.)
సుమేరువు-స. మేరుపర్వతము. (వ్యు. శిఖరములచే నక్షత్రాదులను వహించునది.)
సుర-తె. 1. గాలిసుడి. 2. గాలి. 3. పెద్ద. సమా. సురటి-(సుర+అంటు+ఇ) వట్రువ విసనకఱ్ఱ. సురకాని-కానిలో నాలవభాగము. —గాలి-సుడిగాలి. —మాయి-మిక్కిలినల్లనిది.—మాలి-గాలినించిన తలగడ. స. 1. కల్లు. 2. బ. వేలుపులు. (వ్యు. సముద్రమందు పుట్టిన అమృతము కలవారు. సమా. —గవి-కామధేనువు. —జ్యేష్ఠుఁడు-బ్రహ్మ. —దీర్ఘిక-గంగ. —ద్విషుఁడు-అసురుఁడు. —నిమ్నగ - దేవగంగ. —పతి - ఇంద్రుఁడు. —లోకము - స్వర్గము. సురాచార్యుఁడు - బృహస్పతి. సురాలయము - మేరుగిరి. సురోదము-కల్లుసముద్రము.
సురంగము-స. సౌరంగము.
సురతము-స. స్త్రీపురుషులకలయిక, రతి.
సురతాణి-వి. (సురత్రాణ) 1. ఇంద్రుఁడు. 2. ఇంద్రాణి.
సురపున్నాగము-స. ఒకతెగ పొన్న. (వి. సురపొన్న.)
సురభి-స. 1. కామధేనువు. 2. ఆవు. 3. వాసనకలువ. 4. సంపెఁగ. 5. మంచివాసనగలది. 6. మనోజ్ఞమైనది. క్రి. సురభీకరించు-మంచి వాసనకలదిగాఁజేయు.
సురభిళము-స. మంచివాసనకలది.
సురాళము-తె. 1. భూతావేశముచే తలత్రిప్పుట. 2. కోపావేశము.
సురాళించు-తె. దిగఁదుడుచు.
సురిగ-తె. చిన్నకొమ్మ.
సురియ-వి. చూ. చురియ. సమా. సురియాళు, సురేయాళు-(సురియ+ఆళు) మాలవాఁడు.
సురుఁగు-తె. 1. అదృశ్యమగు. 2. పాఱు. 3. జాడగాఁబోవు. 4. చలించు.
సురుడు-తె. దివ్వటికి మాఱుగా కాల్చిపట్టుకొను వెలుతురుకఱ్ఱెలకట్ట. రూ. సుడుదు.

సులభము-స. సుఖముగా లభించునది. (వ్య. దుర్లభము.)
సులువు-వి. చులకనైనది. రూ. సుళువు.
సులోచనము-స. ముక్కద్దము.
సువర్ణము-స. 1. బంగారు. 2. మాడ. 3. మంచివర్ణముగలది.
సువారము-తె. వంట.
సువాసిని-స. పేరంటాలు, ముత్తైదువ.
సుషమ-స. మిక్కిలిశోభ.
సుషమము-స. 1. మనోజ్ఞమైనది. 2. సమానమైనది.
సుషి-స. బెజ్జము.
సుషిరము-స. 1. బెజ్జము. 2. బెజ్జములుగల పిల్లనఁగ్రోవి మొదలగు వాద్యము.
సుషుప్తి-స. ఒడలెఱుఁగని నిద్ర.
సుషుమ్న-స. ఒకనాడి.
సుష్ఠువు-స. 1. చక్కన. 2. బాగు. 3. ఆరోగ్యము.
సుస్తి-హిం. స్వాస్థ్యరహితము.
సుహృదుఁడు-స. మిత్రుఁడు. (వ్యు. మంచిమనస్సు కలవాఁడు.)
సుళువు-చూ. సులువు.
సుళ్లమారి-తె. 1. సుడులుగలవాఁడు. 2. చుట్లఁబెట్టువాఁడు.

## సూ

సూకరము-స. పంది. రూ. శూకరము. (వ్యు. ఎక్కువపిల్లలనీనునది.)
సూక్ష్మము-స. 1. అణువు. 2. సన్నము.
సూచకము-స. 1. సూది. 2. నక్క. 3. కుక్క. 4. కాకి. 5. పిల్లి.
సూచకుఁడు-స. 1. కొండెగాఁడు. 2. బోధచేయువాఁడు.
సూచన-స. 1. జాడ. 2. గ్రుచ్చుట. 3. తెలుపుట. 4. చూపు. క్రి. సూచించు. జాడగాఁదెలియఁజేయు.
సూచి-స. సూది.
సూచిక-స. 1. సూది. 2. తెలియఁజేయునది.
సూటి-తె. 1. గుఱి. 2. విధము. 3. ఆవులు మొ. గర్భముధరించుట. సమా.—కాఁడు-1. గుఱికాఁడు. 2. అందగాఁడు. క్రి. —పడు-సరితాఁకు.
సూడిగములు-తె. 1. గాజులు. 2. చేతికడియములు.
సూడిద-తె. కానుక.
సూడు-తె. 1. పగ. 2. పగవాఁడు. సమా. —కాఁడు-శత్రువు. క్రి. సూడించు-పగగొను. రూ. సూడుకొను, —పట్టు.

సూతకము-స. 1.జాతాశౌచము. 2.మృతాశౌచము.
సూతి-స. 1. కుట్టు. 2. ప్రసవము.
సూతిక-స. బాలెంతరాలు.
సూతుఁడు-స. 1.సారథి.2.బట్టువాఁడు.3.వడ్రంగి.
సూత్రము-స. 1. నూలిపోఁగు. 2. జన్నిదము.3. ఏర్పాటు. 4. శాస్త్రాదిసూచనాగ్రంథము.సమా. సూత్రధారుఁడు-1. ఆటాడించువాఁడు. 2. నడపువాఁడు. 3.వడ్రంగి. క్రి.సూత్రపడు-జతపడు.సూత్రించు-సూత్రముచేయు.
సూదనము-స.1.చంపుట. 2.చంపునది.
సూదము-స. వండినపప్పు.
సూది-వి. (సూచి) గుడ్డలుకుట్టుసాధనము. సమా. సూదంటుఱాయి-సూదిఱాయి,అయస్కాంతము.
సూదుఁడు-స. వంటవాఁడు.
సూన-స. 1. కూఁతురు. (వ్యు. పుట్టినది.) రూ. ప్రసూన. 2. కొండనాలుక. 3. వధస్థానము. సమా. —గాఁడు-చంపువాఁడు. సూనరి-1. చంపువాఁడు. 2. పూలమ్మువాఁడు.
సూనము-స. 1.ప్రసవము. 2.పూవు.3.శూన్యము.
సూనుఁడు-స.1.కొడుకు.2.తమ్ముఁడు.3.సూర్యుఁడు.(వ్యు. పుట్టువాఁడు.) రూ. ప్రసూనుడు.
సూనువు-స. కూఁతురు.
సూనృతము-స. 1. శుభము.2. ప్రియము,సత్యము నైనది.(మాట) [వంటవాఁడు. రూ. సూపుఁడు.
సూపము-స. వండినపప్పు. సమా. సూపకారుఁడు-
సూయాణము-వి. (సుయానము) శత్రు భయంకర
సూరణము-స. కందగడ్డ. [మైన దండయాత్ర.
సూరి-స. 1. సూర్యుఁడు. 2. పండితుఁడు.
సూరెపుటము-వి. సూర్యపటము.
సూరెలు-తె. పార్శ్వములు. సమా. సూరెపాను-ఆలవట్టము. క్రి. సూరెగిల్లు-ప్రక్కకొదుగు.
సూర్యుఁడు-స. వెలుఁగుఱేఁడు.(వ్యు.వ్యాపారములందు ప్రేరేఁచువాఁడు.)సమా.సూర్యకాంతము-సూర్యరశ్మి సోఁకుటచే ప్రజ్వరిల్లు ఒకఱాయి.—తనయ-యమున. —తనయుఁడు-1. యముఁడు. 2. శని. 3. కర్ణుఁడు. —పటము-ఒకరకము మేలు మొకమలు. సూర్యానువర్తిని-ప్రొద్దుతిరుగుడుచెట్టు.
సూల-వి. శూలరోగము.
సూసకము-తె. స్త్రీలు తలనుధరించు తిరుగుడుబిళ్ల.
సూసరి-తె. సున్నముపూయువాఁడు.

## సృ

సృక్వము-స. పెదవిమూల, వెలవి. రూ. సృక్కి.
సృగము-స. భిండివాలము, సాఁగు.
సృగాలము-స.నక్క.రూ.శృగాలము. (వ్యు. మాం
సృజన-స. సృష్టి. క్రి.సృజించు. [సము దినునది.)
సృణి-స. అంకుశము.
సృణిక-స. చొంగ. రూ. సృణీక.
సృతి-స. 1. త్రోవ. 2. పోక.
సృష్టి-స. 1. సృజించుట. 2. స్వభావము.

## సె

సెక-వి. (శిఖ) 1, జ్వాల. 2. వేఁడిమి. రూ. సెగ, సెవ. సమా. —కంటి-శివుఁడు. —వెలుఁగు-సూర్యుఁడు. —ఱేఁడు-అగ్ని.
సెగ్గము-తె. రోఁత. రూ. సెగ్గు. క్రి. సెగ్గించు-రో
సెజ్జ-వి. (శయ్య) పడక. [యు. కృ. సెగ్గింపు.
సెట్టి-వి. (శ్రేష్ఠి) 1. కోమటులలోనగువారి పట్టపు
సెపియించు-వి.శపియించు. [పేరు. 2.వర్తకుఁడు.
సెబాసు-హిం. బళీ. రూ. సేబాసు.
సెబ్బర-తె. చెడుగు. రూ. సెబ్బ.
సెమ్మె-వి. (శమ్య) దీపస్తంభము.
సెర-తె. కంటియందలిరేఖ.
సెరగు-తె. ఆపద.
సెల-వి. (శిల) 1. సెలయేఱు. 2.బాణపుములికి. 3. (శల్యము) ఏదుపందిముల్లు. 4. మునికోలయందలి ఇనుపముల్లు. 5. బాణము. 6. వ్రణమునుండి చీము వ్యాపించు రంధ్రము. సమా.—కట్టె-బాణము. —గోల-పసులమేపువాని కోల. కల్లుగీఁచువానికత్తి. —పంది - ముండ్లపంది. —పుండు-నారికుఱుపు. —యాట-కొండయూట. —యేఱు-నిర్ఝరము. క్రి. —వడు. —వాఱు, సెలవేయు-(పుండు) చీముకాఱు.
సెలగ-తె. రెమ్మ.సమా. సెలగొమ్మ-ఉపశాఖ. [గత్తి.
సెలగు-తె. ఖండించు.రూ.చెలగు,సెలవు.సమా.సెల

సెలయు-తె. 1. విజృంభించు. 2. చిమ్ము. రూ.
సెలవి-తె. పెదవిమూల. సృక్వి. [చెలయు.
సెలవు-తె. 1. సెలగు. 2.ఆజ్ఞ. 3.ఉపయోగము.
క్రి. సెలవిచ్చు-ఆజ్ఞాపించు.
సెలసు-తె.ఒకానొకచెట్టు. సమా. —విల్లు-సెలసు బద్దలతోఁ జేసినవిల్లు. రూ. సెలవిల్లు.
సెల్లా-తె. సన్ననివస్త్రము.
సెల్లఁడు-వి. శల్యుఁడు.

## సే, సై

సేకము-వి. సెగ. స. 1. తడుపుట. 2. చల్లుట.
సేకరము-వి. సంగ్రహము. క్రి. సేకరించు.
సేకరించు-తె. 1.తెప్పిఱిల్లు. 2.వి.సంగ్రహించు.
సేగి-తె. 1. నష్టి. 2. కీడు.
సేచనము-స. 1. చల్లుట. 2. తడుపుట.
సేతువు-స. నీటికట్టు.
సేద-వి. (స్వేదము)బడలిక.[డు-కృషీవలుఁడు.
సేద్యము-వి. (సేవ్యము) కృషి. సమా. సేద్యకాఁ
సేన-తె. అధికము. స. దండు. సమా. సేనాముఖము-1.(3 రథములు, 3 ఏనుఁగులు, 9 గుఱ్ఱములు, 15 కాల్బురుగల) సేన.2.సేనకుముం
సేనము-తె. చిన్నయులి, ఛీరణము. [దుభాగము.
సేనాని-స.1.కుమారస్వామి.(వ్యు.దేవసేననునడపు
సేపు-తె. కాలము. [వాఁడు.) 2. సేనాధిపతి.
సేమంతిక-స. చేమంతి. [2. శుభము.
సేమము-వి. (క్షేమము) 1. ఉన్నది చెడకుండుట.
సేరు-తె. 1. ఎనిమిదిపలములు. 2. పెద్దపడి.
సేలి-వి. (చేల) వస్త్రము.
సేవ-స. 1. శుశ్రూష. 2. కొలువు.
సేవకుఁడు-స. కొలువుడుకాఁడు. [కొలుచు.
సేవనము-స. 1. కొలువు. 2. కుట్టు.క్రి. సేవించు-
సేవ్యము-స. సేవింపఁదగినది.
సేస-వి. (శేష) 1. అక్షత. 2. సేసఁబ్రాలు. 3. పాపట. సమా. —ఁబ్రాలు-తలఁబ్రాలు. —కొప్పు-కొండెసిగ., [తోఁబుట్టువు.
సై-వి. (సహ) తోడ. రూ. సయి.సమా.సైదోడు-
సైంధవము-స. గుఱ్ఱము. (వ్యు. సింధుదేశమునఁ బుట్టినది.)
సైఁచు-వి. (సహించు) 1. ఓర్చు. 2. రుచించు. రూ. సయిఁచు. కృ. సైఁపు,సయిఁపు,సైఁపుడు,
సైఁదము-తె. గోదుమపిండి. [సయిఁపుడు.
సైకతము-స. 1. ఇసుకదిబ్బ. 2. ఇసుకనేల.
సైకము-స. సూక్ష్మము. రూ. సయికము.
సైగ-వి. (సంజ్ఞ) హస్తాదులసంజ్ఞ. రూ. సయిగ.
సైతము-వి. (సహితము) కూడ. రూ. సయితము.
సైనికుఁడు-స. 1. సేనాపతి. 2. సేనలోనివాఁడు.
సైన్యము-స. సేన. [వలికత్తె. 3. సంకరజాతిస్త్రీ.
సైరంధ్రి-స. 1. గట్టువాలు. 2. అంతఃపురపు కా
సైరణ-వి. (సహనము) ఓర్పు. రూ. సయిరణ.
క్రి. సైరించు, సయిరించు.
సైరికుఁడు-స.దున్నెడువాఁడు.[మైనది)2.స్వర్గము.
సైరిభము-స.1.దున్న.(వ్యు.సీరిభ(కర్షక)సంబంధ

## సొ, సో

సొంటి-వి. (శుంఠి) ఎండిన అల్లము.
సొంబు-తె. తప్పు, దోషము.
సొంతము-వి. (స్వతంత్రము) స్వకీయము.
సొంపు-తె. 1. సమృద్ధి. 2. సంతోషము. 3. ప్రసన్నత. 4. సుఖము. 5. సౌందర్యము. క్రి. సొంపిల్లు-సొంపగు. రూ. సొంపిలు.
సొగటాలు-తె. (సొగపు+ఆటలు) పగడసాలాట.
సొగటు-తె. వాడు.
సొగపు-తె. చొక్కు, పారవశ్యము.
సొగయు-తె. 1. చొక్కు, పరవశత్వమొందు. 2. మూర్ఛిల్లు. కృ. సొగపు, సొగయిక.
సొగసు-తె. అందము. (వ్యు. సొగయించునది) సమా. —కత్తె-విటకత్తె. (పుం. —కాడు.)
సొగియించు-వి. సుఖించు.
సొగియు-తె. ఇంపగు.
సొచ్చెము-తె. 1. అధికము. 2. వి. స్వచ్ఛము.
సొటసొట-తె. కార్శ్యము.క్రి. —వోవు-కృశించు.
సొట్ట-చూ. చొట్ట.
సొత్తు-వి. (స్వత్వము) సొమ్ము.
సొద-వి. చితి, పీనుఁగును కాల్చుటకు చేర్చినకట్టెలు లోనగువానిప్రోగు. [నూఁగు.3.ఊటకాలువ.
సొన-తె.1.గ్రుడ్డులోనిజెన.2.ఆకుల.కాయలమీఁది

సొన్నము-వి. (స్వర్ణము) బంగారు. సమా. సొ
న్నారి-అగసాలెవాఁడు.
సొబగు-వి. (సుభగ) చక్కఁదనము. [2. విటుఁడు.
సొబగుఁడు-వి. (సుభగుఁడు) 1. చక్కనివాఁడు.
సొమ్మ-తె. మూర్ఛ. క్రి. —గొను, —వోవు, —
సిల్లు-మూర్ఛిల్లు. [ణము. 3. గోధనము.
సొమ్ము-వి. (స్వమ్ము) 1. ధనము. 2. ఆభర
సొఱ-తె. తుంబితీఁగ. రూ. సొఱ్ఱ.
సొరంగము-వి. (సురంగము) గుహవలెతొలిచిన
సొరగు-తె. లీనమగు. [రంధ్రము.
సొరదోఁకి-తె. దురాచారుఁడు.
సొరపు-తె. కృశము.
సొరము-వి. స్వరము.
సొరిది-తె. 1. క్రమము. 2. వరుస.
సొరుగు-తె. మూర్ఛిల్లు.
సొలపు-తె. 1. పారవశ్యము. 2. విముఖత్వము.
సొలయు-తె. 1. మూర్ఛిల్లు. 2. వెనుదీయు. 3.
వైముఖ్యమొందు. 4. వైరస్యమొందు. కృ. సొల
సొవ-తె. జాడ. రూ. సవ. [యిక, సొలపు, సొలిమిడి.
సొసాయించు-తె. మందలించు.
సోఁకు-తె. 1. తగులు. 2. గ్రహమావేశించు. కృ. 3.
స్పర్శము. 4. రాక్షసుఁడు. సమా. —ఁజుక్క-మూ
లానక్షత్రము. —టొజ్జ-శుక్రుఁడు. —దయ్య
ము-వాయువు. —ఱేఁడు-నైరృతి.
సోఁకుడు-తె. 1. స్పర్శము. 2. గ్రహావేశము. 3.
పిశాచము. 4. రాక్షసుఁడు.
సోగ-తె. 1. దీర్ఘము. 2. కోమలము.
సోడు-తె. బ్రహ్మరంధ్రము, మాడపట్టు.
సోఢ-స. 1. ఓపువాఁడు. 2. ఓర్చువాఁడు.
సోణము-తె. నాసామూలము.
సోద-తె. గచ్చు, గార.
సోదన-వి. 1. శోధనము. 2. శకునార్థము రామా
యణాది గ్రంథములందు దారమువేసి శోధించు
ట. క్రి. సోదించు. [దర్యుఁడు.)
సోదరి-స. తోడఁబుట్టినది. (పుం. సోదరుఁడు, సో
సోదె-వి. (చోద్యము) రాఁగల మేలుకీడులనుగూ
ర్చి చేయుప్రశ్నము. రూ. సోదియ. సమా. —
కత్తె-సోదెచెప్పునది.

సోదెము-వి. (చోద్యము) ఆశ్చర్యము. రూ. సోద్దెము,
సోన-తె. 1. సన్ననివాన. 2. వాన. [చోద్దెము.
సోపనము-వి. (సోపానము) మెట్టు.
సోపప్లవుఁడు-స. రాహువుచే పట్టఁబడినవాఁడు.
సోపానము-స. మెట్టు. రూ. సౌపానము.
సోబ-వి. శోభ.
సోబనము-వి. శోభనము.
సోబె-వి. సిబ్బెము. [సోమము.
సోమ-వి. 1. శ్రమము. 2. పరాక్రమము. రూ.
సోమము-వి. పరాక్రమము. స. 1. తిప్పతీఁగ. 2. జల
ము. సమా. సోమధార-ఆకాశగంగ. —పీథి-
సోమపానముచేయువాఁడు. —యాజి-యజ్ఞము
చేసినవాఁడు. (వి. సోమాసి) —లత-తిప్పతీఁగ.
—సూత్రము-పానవట్టమునుండి నీళ్లుపోవుదారి.
సోమాసి-వి. సోమయాజి.
సోమించు-తె. 1. సరిపోలు. 2. పరాక్రమించు. 3.
విజృంభించు. 4. వ్యాపించు. [నియు.)
సోమిదమ్మ-వి. సోమయాజిభార్య. (సోమిసాని అ
సోము-వి. 1. సుఖము. 2. ఆసక్తము. సమా. సో
మరి-అలసుఁడు, మందుఁడు.
సోముఁడు-స. 1. చంద్రుఁడు. (వ్యు. అమృత
మునఁ బుట్టినవాఁడు.) 2. శివుఁడు. 3. కుబే
రుఁడు. 4. వాయువు. సమా. సోమవారము-
వారములో రెండవదినము. సోమోద్భవ-నర్మదా
సోయగము-తె. చక్కఁదనము. [నది.
సోరణము-తె. గవాక్షము. రూ. సోరణగండ్లు.
సోల-తె. నికుంచము.
సోలము-తె. 1. మత్తు. 2. చొక్కు.
సోలు-తె. వివశత్వమొందిప్రాలు. కృ. సోలింత.

## సౌ

సౌందర్యము-స. చక్కఁదనము.
సౌకర్యము-స. 1. అనాయాసము. 2. సూకరభావము.
సౌకుమార్యము-స. సుకుమారత్వము.
సౌఖశాయనికుఁడు-స. 1. రాజులను నిద్రమేలుకొ
లుపువాఁడు. 2. సుఖనిద్రయా యని ప్రశ్నించు
సౌఖ్యము-స. సుఖము. [వాఁడు.
సౌగంధికము-స. చెంగలువ.

సౌగంధ్యము-స. వాసన.
సౌచికుఁడు-స. కుట్టుపనివాఁడు.
సౌజన్యము-స. సుజనత్వము.
సౌదామని-స. మెఱపు. రూ. సౌదామిని. (వ్యు.దండవలె దీర్ఘాకారముగలది)
సౌదాయికము-స. స్త్రీకిచ్చిన ధనము. [గలది.]
సౌధము-స.రాజగృహము.[వ్యు.సుధ (సున్నము)
సౌనికుఁడు-స. మృగ,పక్షులఁజంపి విక్రయించి జీవించువాఁడు. [శత్రువులపైఁబడి చంపుట.
సౌప్తికము-స. నిద్రించుటలోనగుసమయములందు
సౌభాగినేయి-స. భాగ్యవతికూఁతురు. (పుం. సౌభా
సౌభాగ్యము-స. సుభగత్వము. [గినేయుఁడు.)
సౌభ్రాత్రము-స. మంచితోడఁబుట్టుదనము.
సౌమనస్యము-స. సుమనోభావము.
సౌమ్య-స. నలువదిమూఁడవ సంవత్సరము.
సౌమ్యగంధి-స. గులాబిపూవు.
సౌమ్యుఁడు-స. 1. బుధుఁడు. (వ్యు. సోమునికొడుకు.) 2. తిన్ననివాఁడు. 3. ఒప్పినవాఁడు.
సౌరభము-స. 1. వాసన. 2. ఎద్దు.
సౌరభేయము-స. ఎద్దు. (స్త్రీ. సౌరభేయి.)
సౌరభ్యము-స. 1.వాసన. 2.ఒప్పిదము, 3. గుణగౌరవము. [కొడుకు.)
సౌరి-స. 1. శని. 2. యముఁడు. (వ్యు.సూర్యుని
సౌరికుఁడు-స. కల్లమ్మువాఁడు.
సౌరు-తె. 1. అందము. 2. విధము. రూ.సవురు.
సౌవర్ణకరణి-స. మంచివన్నెను కలిగించు ఓషధి.
సౌవిదల్లుఁడు-స. అంతఃపురపుకావలివాఁడు. రూ. సౌవిదుఁడు. (వ్యు. స్త్రీలనుగాచియుండువాఁడు.)
సౌశీల్యము-స. సుశీలత్వము.
సౌష్ఠవము-స. సుష్ఠుభావము.
సౌహార్దము-స. సుహృద్భావము, స్నేహము. రూ. సౌహృదము, సౌహృద్యము.

## స్క, స్ఖ, స్త

స్కందుఁడు-స. కుమారస్వామి. (వ్యు.శత్రువులను శోషింపఁజేయువాఁడు.)
స్కంధము-స.1.మూఁపు. 2.చెట్టుబోదె. 3.యుద్ధము.4.సమూహము. 5.శరీరము.సమా.స్కంధపట్టిక-గందపట్టె.—శాఖ-మ్రాని మొదటికొమ్మ.
స్కంధావారము-స.1.దండువిడిసినచోటు.2.దండు.
స్కన్నము-స. జాఱినది. [క్రి. స్ఖలించు.
స్ఖలనము-స. 1. జాఱుపాటు. 2. తొట్రుపాటు.
స్ఖలితము-స.1.జాఱినది.2.తొట్రుపడినది.3.కొట్టు
స్ఖాలిత్యము-స.స్ఖలితభావము, పొరపాటు.[వడినది.
స్తంబము-స. 1. వరిలోనగువానిగంట. 2. బోదెలేని చిన్న చెట్టు. [క్రీడించునది.)
స్తంబేరమము-స. ఏనుఁగు. (వ్యు. పొదలయందు
స్తంభనము-స. 1. మ్రానుపడఁజేయుట.2.మంత్రశక్తిచే అగ్నిలోనగువానిశక్తి నడఁగఁజేయుట. క్రి. స్తంభించు-మ్రానుపడు.
స్తంభము-స. 1. కంబము. 2. మ్రానుపాటు.
స్తంభయిత-స. స్తంభించువాఁడు.
స్తనము-స. కుచము. (వి. చన్ను) సమా. స్తనంధయ-పాలుత్రాగు ఆఁడుబిడ్డ. (పుం. స్తనంధయుఁడు.) [మ్రోయునది.)
స్తనయిత్నువు-స. 1. మబ్బు. 2. ఉఱుము. (వ్యు.
స్తనితము-స. ఉఱుము.
స్తన్యము-స. చనుఁబాలు.
స్తబకము-స. పూగుత్తి. [స్తబ్ధరోమను-పంది.
స్తబ్ధము-స. 1.అడఁగినది.2.ముడిఁగినది. సమా.
స్తవము-స. స్తోత్రము.
స్తిమితము-స. 1. కదలనిది. 2. తడిసినది.
స్తుతము-స. స్తోత్రముచేయఁబడినది.
స్తుతి-స. స్తోత్రము. క్రి. స్తుతించు. సమా. —పాఠ
స్తుత్యము-స. స్తుతింపఁదగినది.[కుఁడు-బట్టువాఁడు.
స్తూపము-స. మట్టి మొదలగువాని దిబ్బ.
స్తేనుఁడు-స. దొంగ.
స్తేమము-స. తడియుట.
స్తేయము-స. దొంగతనము.
స్తేయి-స. దొంగ.
స్తైన్యము-స. దొంగతనము. [అల్పము.
స్తోకము-స. 1. నీటిబొట్టు. 2. వానకోయిల. 3.
స్తోత్రము-స. పొగడిక. [యజ్ఞము.
స్తోమము-స. 1. సమూహము. 2. స్తోత్రము. 3.
స్త్రీ-స. ఆఁడుది. (స్త్రీ జాతులు నాలుగు: పద్మినీ.

చిత్రిణి, హస్తిని, శంఖిని) సమా.—ఘోషము-వేకువ. —ధనము-పెండ్లిమున్నగు సమయములలో స్త్రీ కిచ్చిన ధనము. —ధర్మిణి-ఋతుమతి, ముట్టుది.

## స్థ

స్థండిలము-స. వ్రతి పండుకొనుటకు దర్భాదులు పఱచినభూమి.
స్థగనము-స. కప్పు.
స్థగితము-స. కప్పఁబడినది.
స్థపతి-స. 1. శిల్పి. 2. అంతఃపురపుకావలివాఁడు.
స్థలము-స. మెట్టనేల. రూ. స్థలి.
స్థవిరుఁడు-స. ముసలివాఁడు. (స్త్రీ. స్థవిర.)
స్థవిష్ఠము-స. మిక్కిలిస్థూలము.
స్థవీయము-స. రెంటికంటె మిక్కిలిస్థూలము.
స్థాండిలుఁడు-స. స్థండిలభూమియందు శయనించినవాఁడు, రూ. స్థండిలశాయి.
స్థాణువు-స. 1. మేకు. 2. శివుఁడు. 3. కొమ్మలులేనిమోడు. 4. స్థిరమైనది.
స్థాత-స. ఉండువాఁడు.
స్థాతవ్యము-స. ఉండఁదగినది.
స్థానము-స. 1. చోటు. 2. ఉనికి. 3. విలుకాని యుద్ధమప్పటి నిలుకడ. (ఇది పంచవిధము: ఆలీఢము, ప్రత్యాలీఢము, సమపదము, విశాఖము, మండలము)
స్థానాపతి-స. మధ్యవర్తి.
స్థాని-స. స్థానముకలది.
స్థానికుఁడు-స. 1. స్థానాధిపతి. 2. గుడిపారుపత్తెకాఁడు.
స్థానీయము-స. పట్టణము.
స్థాపత్యుఁడు-స. హెగ్గడి.
స్థాపనము-స. 1. నిలుపుట. 2. సమాధిచేయుట. క్రి. స్థాపించు. (పుం. స్థాపకుఁడు.)
స్థాపితము-స. 1. నిలుపఁబడినది. 2. నిశ్చయింపఁబడినది.
స్థాయి-స. ఉండునది.
స్థాలము-స. కంచము.
స్థాలి-స. వంటకుండ. సమా. స్థాలీపులాకన్యాయము-కుండెఁడు అన్నములోఒకమెతుకును పట్టి చూచుటవలెఒకటింబట్టిపూర్ణవిషయ మెఱుఁగుట.
స్థావరము-స. 1. వింటినారి. 2. కొండ. 3. కదలినది. (వ్య. జంగమము.)
స్థావిరము-స. వృద్ధత్వము.
స్థాసకము-స. 1. చేతనిడినకుంకుమ మొ. 2. నీరులోనగువాని బుగ్గ.
స్థితము-స. 1. ఉన్నది. 2. నిలుచున్నది. 3. నిశ్చయింపఁబడినది. 4. ప్రతిజ్ఞచేయఁబడినది.
స్థితి-స. 1. ఉనికి. 2. కూర్చుండుట. 3. నిలుకడ. 4. మేర.
స్థిర-స. భూమి.
స్థిరము-స. 1. కొండ. 2. చెట్టు. 3. మోక్షము. 4. నిలుకడైనది.
స్థిరుఁడు-స. శని. సమా. స్థిరవారము-శనివారము.
స్థూణ-స. 1. స్తంభము. 2. ఇనుపప్రతిమ.
స్థూలము-స. 1. గుడారము. 2. బలిసినది. సమా. స్థూలనాసకము-పంది. —బుద్ధి-పైచూపు. —లక్షుఁడు-1. మిక్కిలియీవికాఁడు. 2. మిక్కిలివెచ్చకాఁడు. స్థూలోచ్చయము-1. పెద్దతాయి. 2. ఔటిమ.
స్థేమము-స. శరీరబలము.
స్థేయుఁడు-స. 1. తీర్పరి. 2. పురోహితుఁడు. 3. మిక్కిలిస్థిరుఁడు.
స్థైర్యము-స. స్థిరత్వము.
స్థౌల్యము-స. స్థూలభావము.

## స్న

స్నపనము-స. స్నానము.
స్నపితము-స. స్నానముచేసినది.
స్నవము-స. కాఱుట.
స్నస-స. సన్నసరము.
స్నాతకుఁడు-స. 1. స్నానశీలవ్రతుఁడు. 2. బ్రహ్మచర్యముపూర్తికావించిగృహస్థధర్మమునకువచ్చువాఁడు.
స్నాతుఁడు-స. స్నానముచేసినవాఁడు.
స్నానము-స. మునుక.
స్నానీయము-స. నలుఁగుపిండి.
స్నాయువు-స. సన్నసరము.
స్నిగ్ధము-స. 1. స్నేహము. 2. నునుపు. 3. చిక్కనది.
స్నిగ్ధుఁడు-స. స్నేహితుఁడు. [(వి. నిద్దము.)
స్నుతము-స. కాఱినది. [కు నీళ్లుచల్లునది.)
స్నుష-స. కోడలు. (వ్యు. గృహవ్యాపారముకొఱ
స్నేహము-స. 1. చెలిమి. 2. చమురు. క్రి. స్నేహించు-చెలిమిచేయు.
స్నేహితుఁడు-స. చెలికాఁడు.

## స్ప, స్ఫ

స్పందము-స. ఇంచుకకంపము.

